

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ ఆఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణము

## శ్రీకృష్ణజన్మఖండము

### పూర్వార్ధము

"కాయేన మనసా వాచా పరంభక్త్యా దివానిశమ్
భజ సత్యం పరంబ్రహ్మ, రాధేశం త్రిగుణాత్పరమ్ ॥"

రచయిత :
"పౌరాణిక రత్న"
"మహాపురాణాంధ్రీకరణచణ"
**శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త**

మూల్యము రూ : **150-00**

ద్వితీయ ముద్రణము
యువ ఆషాఢ పూర్ణమి
గురుపూర్ణమి 12-6-95

# SREE MADANDHRA BRAHMAVYVARTHA MAHAPURANAM

## SREE KRISHNA JANMA KHANDAMU PURVARTHAMU

By
'Pouranika Ratna'
'Mahapuranandhrikaranachana'
**Sri Mattupalli Siva Subbaraya Gupta**

పుస్తకములు లభించు ప్రదేశములు :

1. శివా ఇంజనీరింగ్ కంపెనీ
   స్టేషన్‌రోడ్, గుంటూరు-522 001
   ఫోన్ : 220827

2. శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త,
   మట్టుపల్లివారివీధి కొత్తపేట,
   గుంటూరు-522 001.
   ఫోన్ : 223327

# శ్రీరాధామాధవ దివ్యతత్త్వము

కృష్ణాయ పూర్ణపురుషాయ పరాత్పరాయ
యజ్ఞేశ్వరాయ పరకారణకారణాయ
రాధావరాయ పరిపూర్ణతమాయ సాక్షాత్
గోలోకధామధిషణాయ నమః పరస్మై ॥

శ్రీకృష్ణభగవానుడు సచ్చిదానందస్వరూపుడు. సత్తు, చిత్తు, ఆనందము—అను నీమూడుశక్తులు నిత్యము పూర్ణరూపమున ఆయనస్వరూపగతములై యున్నవి. శక్తిలోను శక్తిమంతునిలోను ఎట్టిభేదము లేదు. పరాత్పరుడగునీభగవానుడుతప్ప మఱియేమియు లేదు. కాని యీయుభయశక్తులు అప్రకటరూపమున నున్నచోట లీల ప్రకటము కాదు. మూర్తరూపమున నున్నచోట అవి నిత్యము అభిన్నమయ్యును భిన్నరూపమున నుండి నిత్యము లీల యొనరించుచుండును. ఏస్వరూపమున లీల ప్రకటము కాదో అది భగవానుని నిర్విశేషబ్రహ్మరూపము, లీల ప్రకటమగుచోట ఆయన నగుణనిరాకార పరమాత్మ, సగుణసాకారలీలాపురుషోత్తము డగుభగవానుడు నై యున్నాడు. భగవదభిన్నస్వరూపశక్తియొక్క లీలకు అనంతభేదములున్నవి, కాని వానిలో చిచ్ఛక్తి, మాయాశక్తి, జీవశక్తి యనుమూడును ప్రధానములు. చిచ్ఛక్తి అంతరంగశక్తి, మాయాశక్తి బహిరంగశక్తి, జీవశక్తి తటస్థశక్తి. ఈమాయాశక్తిజీవశక్తులే గీతలో జెప్పబడిన పరాపరప్రకృతులు.

సత్తు, చిత్తు, ఆనందము ననునీమూడుశక్తులు భగవదభిన్నములు, ఒకేశక్తియొక్క మూడురూపములు. వీనిలో ఆనందము చిత్స్వరూపశక్తియొక్క ప్రత్యక్షరూపము. ఆనందము హ్లాదిని, సత్ సంధిని, చిత్ సంవిచ్ఛక్తి. అంతరంగచిచ్ఛక్తి యగుఆనందమే హ్లాదిని యగురాధాదేవి. ఈరాధిక శ్రీకృష్ణునకు అభిన్న మగునిత్యస్వరూపశక్తి. మూర్తిమతి యగుహ్లాదినీశక్తి నిత్యానందకరుడు, ఆనందయోని, ఆనందస్వరూపుడు నగుశ్రీకృష్ణునకు అనిర్వచనీయము మధురము దివ్యము నగుఆనందమును గలిగించును, ఆయన ఆనందముచే తానుగూడ అచింత్యదివ్యసుఖము నాస్వాదించును.

శ్రీకృష్ణుడు రాధకంటె నిత్య మభిన్నుడు, ఎల్లప్పుడు యొక్కడే యయ్యును ఆనందబ్రహ్మమునకు ప్రతిష్ఠాస్వరూపుడు (బ్రహ్మణో ప్రతిష్ఠాహమ్.) పరిపూర్ణతముడు, రసరాజు లేదా అచింత్య రసబ్రహ్మతత్త్వము నై యున్నాడు. ఈ రాధాకృష్ణుల రూపములందే వాస్తవముగ విశుద్ధము అనన్యము నగురసము, ప్రేమ యున్నవి. ఇవి యీ భౌతిక జగత్తుకంటె పూర్తిగ నతీతము లై యున్నవి. శ్రీకృష్ణుడు సర్వైశ్వర్య రూపుడు, స్వయంభగవానుడు. ఆయనయందు దివ్యము అనంతము నగు ఐశ్వర్యప్రకాశ మున్నట్లు ఆయనయంతరంగస్వరూపశక్తియు, హ్లాదిని యనగు శ్రీరాధాదేవిలోగూడ నున్నది. శ్రీకృష్ణభగవానునిసర్వశ్రేష్ఠమాధుర్యము అనంతైశ్వర్యముచే సమావృతమైనట్లు శ్రీకృష్ణుని యాకర్షించు శ్రీరాధాదేవి పరమమధురస్వరూపముమీదగూడ దివ్యమైన ఐశ్వర్యావరణమున్నది. కాని ఆవృత మగులీలయున్నచోట భగవానుడు స్వకర్షకత్వాది-స్వరూపభూత గుణసంపన్నుడు, మధురతముడు, అప్రాకృతవిచిత్రలీలావిహారపరాయణుడు నై యున్నాడు. ఈయంతరంగరసరాజస్వరూపమే రసతత్త్వము, ఈరసతత్త్వము నిత్యనూతనరూపమున ఆనందము నొసంగు అప్రాకృతపరమాహ్లాద స్వరూపిణి యగుశ్రీరాధయే ప్రేమతత్త్వము. ఈమెయే రెండురూపములలో నిత్యము లీల నొనరించుచుండును, పరస్పర మాకృష్టమైయున్నవి. శ్రీకృష్ణుడు ప్రేమ కాకృష్టుడు. శ్రీరాధ రసమున కాకృష్ట. వీరి యీప్రేమ రసమయము, అంతరంగస్వరూపభూతము నగులీలయే శ్రీరాధామాధవులనిత్యవిలాసవిహారము. దీనియందు ఎల్లపుడు, అంతట పవిత్రతమము, ప్రాకృతజగత్తుకంటె నతీతము నగుమాధుర్యమున్నది.

శ్రీకృష్ణున కాత్మ శ్రీరాధాదేవి. రాధాదేవికి ఆత్మ శ్రీకృష్ణుడు. ఇరువురిలో లేశమాత్రముగూడ తేడాలేదు. శ్రీకృష్ణభగవానుడంతర్ధానమైనపిమ్మట వియోగదుఃఖకాతర లగురాణులు యమునాతీరమునకు వచ్చి ఆనదియొక్క అధిష్ఠాత్రీదేవి రూపుదాల్చియుండుటను, ప్రఫుల్లమైయుండుటను చూచి "మావలె నీవుగూడ శ్రీకృష్ణునకు ధర్మపత్నివి! మేము విరహాగ్నిచే దగ్ధలమగుచున్నాము, కాని నీవు సంతోషముగనున్నావు. కల్యాణీ! దీనికి కారణమును జెప్పు" మనియడిగిరి. రాణులు పలికిన మాటలను విని యమునాదేవి నవ్వి వారు తనప్రియతమునకు పత్నులగుటచే వారిని తనచెల్లెండ్రగా భావించి వారిదుఃఖముచే ద్రవించి యిట్లు పలికెను.

ఆత్మారామస్య కృష్ణస్య ధ్రువమాత్మాస్తి రాధికా
తస్యా దాస్యప్రభావేణ విరహోఽస్మాన్ న సంస్పృశేత్ ॥
తస్యా ఏవాంశవిస్తారాః సర్వాః శ్రీకృష్ణనాయికాః ।
నిత్యసంయోగ ఏవాస్తి తస్యాః సాయుజ్యయోగతః ॥
స ఏవ సా స సైవాస్తి వంశీ తత్ప్రేమరూపికా ।

(స్కాంద, భా. మా. 2. 11-13)

ఆత్మయందే రమించుటవలన శ్రీకృష్ణభగవానుడు ఆత్మారాముడు, ఆయనఆత్మ శ్రీరాధాదేవి యైయున్నది. ఆసేవాప్రభావముచే భగవద్విరహము నన్ను స్పృశించుటలేదు. భగవానునిరాణు లందఱు శ్రీరాధాదేవి అంశవిస్తారములే. శ్రీకృష్ణుడు, రాధ ఇరువురు ఒకరిమొదుట నొకరున్నారు. వారికి పరస్పరము నిత్యసంయోగమున్నది. అందువలన రాధాస్వరూపమునందు అంశలగానున్న శ్రీకృష్ణుని ఇతరరాణులకుకూడ భగవత్సంయోగము లభించినది (ఈవిషయమును వారెఱుంగరు). శ్రీకృష్ణుడే రాధ, రాధయే శ్రీకృష్ణుడు. వారిరువురిప్రేమయే వేణువు".

ఆత్మా తు రాధికా తస్య తయైవ రమణాదసౌ ।
ఆత్మారామ ఇతిప్రోక్త ఋషిభిర్గూఢవేదిభిః ॥

(స్కాందపురాణము)

శ్రీరాధాదేవి శ్రీకృష్ణభగవానుని ఆత్మ. ఆమెయందు నిత్యము రమించుచుండుటచేతనే రహస్యరసమర్మజ్ఞుడు, జ్ఞానియు నగుశ్రీకృష్ణుని ఆత్మారాము డందురు.

ఇట్లే శ్రీకృష్ణభగవానుడు "నేను రాధాదేవిహృదయమున ఆత్మారామరూపముతో నున్నా" నని చెప్పెను-

"అహం రాధయా హృదయే ఆత్మరూపేణ సంస్థితః" ॥

## శ్రీరాధాతత్త్వము, మహత్త్వము, స్వరూపము, మున్నగునవి.

శ్రీరాధాదేవితత్త్వము, మహత్త్వము, స్వరూపము, మహాభావము, ప్రేమ, లీల మున్నగువానికి సంబంధించినవాక్యము లనేకములుగ నున్నవి. ఇచట కేవలము భగవత్స్వరూపు లగుబ్రహ్మవిష్ణుమహేశ్వరుల వాక్యములు

శ్రీకృష్ణభగవానుని వాక్యాలు ఉదహరింపబడుచున్నవి. ఈవాక్యాలవలన శ్రీరాధాదేవిస్వరూపమహత్త్వవిషయము తెలియగలము.

మహేశ్వరు డిట్లు పలికెను :

> యథా బ్రహ్మస్వరూపశ్చ శ్రీకృష్ణః ప్రకృతేః పరః ।
> తథా బ్రహ్మస్వరూపా చ నిర్లిప్తా ప్రకృతేః పరా ॥
> ఆవిర్భావ స్తిరోభావ స్తస్యాః కాలేన నారద ।
> న కృత్రిమా చ సా నిత్యా సత్యరూపా యథా హరిః ॥

(నారదపంచరాత్రము. ద్వి. రాత్రి. తృ. అ. 61–64)

బ్రహ్మస్వరూపుడగు శ్రీకృష్ణుడు ప్రకృతికంటె పరుడైనట్లు శ్రీరాధాదేవిగూడ బ్రహ్మస్వరూపిణి, నిర్లిప్త, ప్రకృతికంటె పరయైనది. నారదా! సమయము ననుసరించి యామె యావిర్భవించును, అదృశ్యయగును. హరివలె నామెగూడ అకృత్రిమ, నిత్య, సత్యరూప".

> రాధా రాసేశ్వరీ రమ్యా రామా చ పరమాత్మనః ॥
> రాసోద్భవా కృష్ణకాన్తా కృష్ణవక్షఃస్థలస్థితా– ।
> కృష్ణప్రాణాధిదేవీ చ మహావిష్ణోః ప్రసూరపి ॥
> సర్వాద్యా విష్ణుమాయా చ సత్యా నిత్యా సనాతనీ ।
> బ్రహ్మస్వరూపా పరమా నిర్లిప్తా నిర్గుణా పరా ॥

(నారదపంచరాత్రము. ద్వి. రాత్రి. 4అ. 48–50)

పరాత్మయొక్క పరాశక్తి యగురాధ రాసేశ్వరి, రమ్య, రామ, కృష్ణకామిని, రాసోద్భవ, కృష్ణకాంత, కృష్ణవక్షస్స్థలస్థిత, కృష్ణప్రాణాధిదేవి, మహావిష్ణువునకుగూడ తల్లి, ఆమె బ్రహ్మస్వరూపిణి, పరమ, నిర్లిప్త (సంసారాసక్తిలేనిది.) నిర్గుణ (ప్రాకృతగుణాతీత, స్వరూపభూతసౌందర్యమాధుర్యాదిగుణములతో గూడినది), పర (ప్రపంచాతీతమైనస్వరూపమునం దుండునది.).

నారదమహర్షితో మహేశ్వరు డిట్లుపలికెను–

> అంతరంగై స్తథా నిత్యవిభూతై స్తైశ్చిదాదిభిః ।
> గోపనాదుచ్యతే గోపీ రాధికా కృష్ణవల్లభా ॥
> దేవీ కృష్ణమయీ ప్రోక్తా రాధికా పరదేవతా ।
> సర్వలక్ష్మీస్వరూపా సా కృష్ణాహ్లాదస్వరూపిణీ ॥

తతః సా ప్రోచ్యతే విప్ర హ్లాదినీతి మనీషిభిః ।
తత్కాలకోటికోట్యంశా దుర్గాద్యాస్త్రిగుణాత్మికాః ॥

సా తు సాక్షాన్మహాలక్ష్మీః కృష్ణో నారాయణః ప్రభుః ।
నైతయోర్విద్యతే భేదః స్వల్పోఽపి మునిసత్తమ ॥

ఇయం దుర్గా హరీ రుద్రం కృష్ణః శక్ర ఇయం శచీ ।
సావిత్రీయం హరిర్బ్రహ్మా ధూమోర్ణాసౌ యమో హరిః ॥

బహునా కిం మునిశ్రేష్ఠ వినా తాభ్యాం న కించన ।
చిదచిల్లక్షణం సర్వం రాధాకృష్ణమయం జగత్ ॥

ఇత్థం సర్వం తయోరేవ విభూతిం విద్ధి నారద ।
న శక్యతే మయా వక్తుం వర్షకోటిశతైరపి ॥

(పద్మ. పాతాల. ౮౧అ. ౫౨-౫౮)

"నారదా! శ్రీకృష్ణప్రియ యగు రాధ తన చైతన్యాదులైన అంతరంగ విభూతులతో నీ ప్రపంచమును గోపనము అనగా సంరక్షించుటచే ఆమె గోపి యని చెప్పబడును. శ్రీకృష్ణారాధనమునం దత్పరయ యగుటచే ఆమె రాధిక యని చెప్పబడును. ఆమె పూర్తిగ లక్ష్మీస్వరూపిణి. శ్రీకృష్ణుని ఆహ్లాదము యొక్క మూర్తీభవించిన స్వరూప మగుటచే మనీషు లామెను హ్లాదినీశక్తి యని పిలుచుచున్నారు. దుర్గాది త్రిగుణాత్మకశక్తులు ఆమెకళలోని కోట్యంశము యొక్క కోట్యంశములై యున్నారు. శ్రీరాధ సాక్షాత్తుగ మహాలక్ష్మి, శ్రీకృష్ణభగవానుడు సాక్షాత్తుగ నారాయణుడునై యున్నారు. మునిశ్రేష్ఠా! వీరిలో నేమాత్రమును భేదములేదు. శ్రీరాధ దుర్గ, శ్రీకృష్ణుడు రుద్రుడు. శ్రీకృష్ణు డింద్రుడు, రాధాదేవి శచీదేవి. ఆమె సావిత్రి, ఆయన సాక్షాత్తుగ బ్రహ్మ. శ్రీకృష్ణుడు యముడు, ఆమె ఆయనభార్యయైన ధూమోర్ణ. ఇక ఎక్కువగ జెప్పనేల, వారిరువురు లేనిదే యేవస్తువునకు ఉనికిలేదు. జడ చేతనమయ మగు ప్రపంచమంతయు శ్రీరాధాకృష్ణుల స్వరూపమే. నారదా! ఇట్లు సమస్తము వారిరువురి విభూతియే యని భావింపుము. నేను నా ముఖములను దీసుకొని లెక్క పెట్టసాగినచో కోట్లకొలది వర్షములలో గూడ ఆవిభూతిని వర్ణింపజాలను."

శ్రీ నారాయణు డిట్లు పలికెను :

ప్రాణాధికప్రియతమా సర్వాభ్యః సున్దరీ పరా ।
సర్వయుక్తా చ సౌభాగ్యభాగినీ గౌరవాన్వితా ॥
వామాంగార్ధస్వరూపా చ గుణేన తేజసా సమా ।
పరావరా సారభూతా పరమాద్యా సనాతనీ ॥
పరమానందరూపా చ ధన్యా మాన్యా చ పూజితా ।
రాసక్రీడాధిదేవీ శ్రీకృష్ణస్య పరమాత్మనః ॥
రాసమండలసంభూతా రాసమండలమండితా ।
రాసేశ్వరీ సురసికా రాసావాసనివాసినీ ॥
గోలోకవాసినీ దేవీ గోపీవేషవిధాయికా ।
పరమాహ్లాదరూపా చ సంతోషహర్షరూపిణీ ॥
నిర్గుణా చ నిరహంకారా నిర్లిప్తాఽఽత్మస్వరూపిణీ ॥
నిరీహా నిరహంకారా భక్తానుగ్రహవిగ్రహా ॥
వేదానుసారీధ్యానేన విజ్ఞాతా సా విచక్షణా ।
దృష్టిదృష్టా న సా చేశైః సురేన్ద్రైర్మునిపుంగవైః ॥
వహ్నిశుద్ధాంశుకధరా నానాలంకారభూషితా ।
కోటిచన్ద్రప్రభా పుష్టసర్వశ్రీయుక్తవిగ్రహా ।
శ్రీకృష్ణభక్తిదాస్యైకకరీ చ సర్వసంపదామ్ ।
అవతారే చ వారాహే వృషభానుసుతా చ యా ॥
యత్పాదపద్మసంస్పర్శాత్ పవిత్రా చ వసుంధరా ।
బ్రహ్మాదిభిరదృష్టా యా సర్వైర్దృష్టా చ భారతే ।
స్త్రీరత్నసారసంభూతా కృష్ణవక్షస్థలే స్థితా ।
యథామ్బరే నవఘనే లీలా సౌదామనీ మునే ॥
షష్టివర్షసహస్రాణి ప్రతప్తం బ్రహ్మణా పురా ।
యత్పాదపద్మనఖరదృష్టయే చాత్మశుద్ధయే ॥
న చ దృష్టం చ స్వప్నేపి ప్రత్యక్షస్య తు కా కథా ।
తేనైవ తపసా దృష్టా భువి బృన్దావనే వనే ॥

(దేవీభాగవతము 9. 1. 44-57)

ఈ పరాదేవి శ్రీకృష్ణుని ప్రాణములకంటెను ఎక్కువ ప్రియమైనది. సర్వదేవతాస్త్రీలకంటెను ఈమెయందు సౌందర్యమధికముగనున్నది. ఈమెయందు సర్వసద్గుణములున్నవి. ఈమె పరమసౌభాగ్యవతి, ఈమెకు సాటిలేని గౌరవములభించినది. ఈమె పరబ్రహ్మమువలె గుణతేజస్సులతో గూడినది. ఈమెను పరావర, సారభూత, పరమాద్య, సనాతని, పరమానందరూప, ధన్య, మాన్య, పూజ్య యని చెప్పబడుచున్నది. ఈమె నిత్యనికుంజేశ్వరి రాసక్రీడ కధిష్ఠాత్రీదేవి. పరమాత్మ యగు శ్రీకృష్ణుని రాసమండలమున ఈమె యావిర్భవించినది. ఈమె యునికిచే రాసమండలమునకు విచిత్రశోభ కలుగును. గోలోకధామమున నందునీమె రాసేశ్వరి, సురసిక యనునామములతో ప్రసిద్ధివహించినది. రాసమండలములోనికి వచ్చుట ఈమెకు చాలయిష్టము. ఈమె గోపీవేషమున విరాజిలుచుండును. ఈమె పరమాహ్లాదస్వరూపిణి, ఈమె విగ్రహము సంతోషహర్షములచే పరిపూర్ణము. ఈమె నిర్గుణ (ప్రాకృతికము లైన త్రిగుణములు లేనిది, స్వరూపభూతదివ్యగుణములుగలది). నిరాకార (పాంచభౌతికశరీరము లేనిదివ్యచిన్మయస్వరూపిణి), నిర్లిప్త. (లౌకికవిషయరాగము లేనిది), ఆత్మస్వరూపిణి (శ్రీకృష్ణునిఆత్మ), యనునామములచే విఖ్యాతి చెందినది. ఇచ్ఛాహంకారములు లేనిది. భక్తులపై కృపచూపుటకే యీమె యవతరించినది. వేదోక్తవిధి ననుసరించి ధ్యానించుటచే విద్వాంసు లీమెరహస్యమును దెలిసికొందురు. సురేంద్రుడు, మునీంద్రులు, ఈశ్వరకోటిలోని దేవతలుగూడ తమచర్మచక్షువులతో నీమెను చూడజాలరు. ఈమె నీలవర్ణముగలవస్త్రములను ధరించును. అనేకవిధములగుదివ్యాభరణములచే నీమె శోభిల్లుచుండును. ఈమె కోట్లకొలదిచంద్రులవలె ప్రకాశించుచుండును సర్వాంగసంపన్నమగునీమె శ్రీవిగ్రహము సర్వైశ్వర్యములచే సంపన్నమైయున్నది. ఈమె శ్రీకృష్ణభగవానునియందు భక్తిని దాస్యమును, సర్వసంపదలను నొసంగును. శ్వేతవరాహకల్పమున వృషభానుగృహమున పుత్రికారూపమున నీమె జన్మించినది. ఈమెచరణకమలముల స్పర్శను బొంది పృథివి పరమపవిత్రమైనది. మహాముని! బ్రహ్మాదిదేవతలకు గూడ నలవికాని యీమె భారతవర్షమున నందఱకు దర్శనమిచ్చినది. ఈమె స్త్రీరత్నములసారముచే ప్రకటమైనది. శ్రీకృష్ణభగవానుని వక్షస్థలమున ఆకాశమునందున్న నూతననీలమేఘములలో ప్రకాశించు మెఱుపువలె విరాజిల్లుచున్నది. ఈమెను దర్శింపదలచి బ్రహ్మ అఱువదివేలసంవత్సరములు

తపస్సుచేసెను. ఈమెచరణకమలనఖదర్శనము సులభ మగునవియు, దాని వలన తాను పరమపవిత్రుడనగుదుననియు బ్రహ్మ తపస్సుచేయుటలో గల యుద్దేశ్యము. కాని స్వప్నములోగూడ ఆయన యీదేవిని దర్శించలేక పోయెను. ఇక ప్రత్యక్షవిషయము చెప్పనేల! ఆతపఃప్రభావముచే నీదేవి బృందావన మనువనమున బ్రహ్మకు దర్శనమిచ్చినది. అదియే ఆమె భూమండలముమీదకు అవతరించుట.

బ్రహ్మ రాధతో నిట్లు పలికెను :

> త్వం కృష్ణాంగార్ధ సంభూతా తుల్యా కృష్ణేన సర్వతః ।
> శ్రీకృష్ణ స్త్వమయం రాధా త్వం రాధా వా హరిః స్వయమ్॥
> న హి వేదేషు మే దృష్ట ఇతి కేన నిరూపితమే ।
> పురుషాశ్చ హరేరంశా స్త్వదంశా నిఖిలాః స్త్రియః ॥
> ఆత్మనా దేహరూపా త్వమస్యాధార స్త్వమేవ హి ।
> అస్యాస్తు ప్రాణై స్త్వం మాత స్త్వత్ప్రాణై రయమీశ్వరః ॥
> కిమహో నిర్మితః కేన హేతునా శిల్పకారిణా ।
> నిత్యోఽయం చ తథా కృష్ణ స్త్వం చ నిత్యా తవాంబికే ॥
> అస్యాంశా త్వం త్వదంశో వాప్యయం కేన నిరూపిః ।
> (బ్రహ్మవైవర్తము. శ్రీకృష్ణజన్మఖండము 14 అ)

నీవు శ్రీకృష్ణునిఅర్ధాంగమునుండి ప్రకటమైతివి. అందువలన అన్ని విధముల శ్రీకృష్ణునితో సమానమైనదానవు. నీవు స్వయముగ శ్రీకృష్ణుడవు, ఈశ్రీకృష్ణుడు స్వయముగ రాధ యైయున్నాడు, లేదా నీవు రాధవు, ఈయన స్వయముగ శ్రీకృష్ణుడు. ఈవిషయము నెవ్వడైన నిరూపించినట్లు నేను వేదములలో జూడలేదు.

సమస్త బ్రహ్మాండమునందు జీవధారు లందఱు శ్రీకృష్ణుని యంశాంశము లైయున్నట్లు వానియన్నింటిలోను నీవే శక్తిరూపిణివై విరాజిల్లుచున్నావు. పురుషులందఱు శ్రీకృష్ణాంశలు, స్త్రీలందఱు నీయంశభూతలు, పరమాత్మ యగుశ్రీకృష్ణునకు నీవు దేహరూపిణివి, అందువలన నీవే ఆయనకు ఆధార భూతవు. తల్లీ! ఈయనప్రాణములచే నీవు ప్రాణవతివి, నీప్రాణములచే పరమేశ్వరు డగుశ్రీహరి ప్రాణవంతుడైనాడు. అహా! ఏశిల్పియైన ఏకారణ

ముచేసైన ఈయనను నిర్మించినారా ? కాదు, అంబికా ! ఈ శ్రీకృష్ణుడు నిత్యుడు, నీవు నిత్యవు నీవు ఈయనయొక్క అంశస్వరూపిణివి లేదా ఈయనయే నీయంశ. ఈవిషయము నెవరు నిరూపించినారు ?

బ్రహ్మ శ్రీకృష్ణుని యిట్లు స్తుతించినాడు :

అనాదిమాద్యం పురుషోత్తమోత్తమం
శ్రీకృష్ణచన్ద్రం నిజభక్తవత్సలమ్ ।
స్వయం త్వసంఖ్యాండపతిం పరాత్పరం
రాధాపతిం త్వాం శరణం వ్రజామ్యహమ్ ॥

గోలోకనాథస్త్వమతీవ లీలో
లీలావతీయం నిజలోకలీలా ।
వైకుంఠనాథోఽసి యదా త్వమేవ
లక్ష్మీస్తదేయం వృషభానుజా హి ॥

త్వం రామచన్ద్రో జనకాత్మజేయం
భూమౌ హరిస్త్వం కమలాలయేయమ్ ।
యజ్ఞావతారోఽసి యదా తదేయం
శ్రీదక్షిణా స్త్రీపతిపత్నిముఖ్యా ॥

త్వం నారసింహోఽసి రమా హృదీయం
నారాయణస్త్వం చ నరేణ యుక్తః ।
తదా త్వియం శాంతిరతీవ సాక్షా
చ్ఛాయేవ యాతా చ తవానురూపా ॥

త్వం బ్రహ్మ చేయం ప్రకృతిస్తటస్థా
కాలో యదేమాం చ విదుః ప్రధానమ్ ।
మహాన్ యదా త్వం జగదంకురోఽసి
రాధా తదేయం సగుణా చ మాయా ॥

యదాన్తరాత్మా విదితశ్చతుర్భి
స్తదా త్వియం లక్షణరూపవృత్తిః ।
యదా విరాడ్దేహధరస్త్వమేవ
తదాఖిలం వా భువి ధారణేయమ్ ॥

సదా పఠేద్యో యుగలస్తవం పరం
గోలోకధామా ప్రవరం ప్రయాతి సః ॥

(గర్గ. శా గోలోక. 16. 22-28)

నీ వనాదికాలమునుండి యున్నవాడవు, అందరికి ఉత్పత్తిస్థానమై యున్నావు. పురుషోత్తము అనబడి నీవి కుదగు. నీవు నీభక్తజనులపై దయజూపువాడవు, శ్రీకృష్ణనామమునతో విఖ్యాతుడవు. సర్వబ్రహ్మాండములకు నీవు స్వామివి నీకంటె శ్రేష్ఠుడెవ్వరును లేరు. నీవు రాధాదేవికి ప్రాణనాథుడవు నేను నిన్ను శరణుజొచ్చితిని. నీవు గోలోకమునకు నాయకుడవు నీలీలలు బహువిధముగ నున్నవి, నీధామమున లీలలను జూపునట్టి యీరాధగూడ లీలావతియే నీ వెచట వైకుంఠమునకు అధిరాజువైయున్నావో అచట వృషభానుకు పిమ్మపుత్రిక గునీమెయే లక్ష్మీదేవి. భూమండలమున నీవు శ్రీరామచంద్రుడవుగాగా నీమె విదేహకుమారి యగు సీతయైయున్నది. నీవు విష్ణుభగవానుడవైన ఈమె కమలాలయ. నీవు యజ్ఞావతారమును ధరించినచో ఈమె భార్యలలో శిరోమణియగుదక్షిణారూపిణి యగును. నీవు నృసింహభగవానుడవైన నీహృదయమున నున్న యీామె నామము రమ. నీవు నరనారాయణరూపమును ధరించినచో నీమె శాంతి యనిచెప్పబడును. నీతో నీమెకు ఎక్కువ సాదృశ్యమున్నది. ఛాయవలె నీమె నిరంతరము నిన్ను అనుసరించును. నీవు బ్రహ్మము ఐన ఈమె తటస్థప్రకృతి (జీవుడు) అగును. నీవు కాలమైనచోట నీమె ప్రధానరూపిణి యగును. నీవు సంసారమునకు బీజభూత మైనమహద్రూపమును ధరించుచో నీమె సగుణమాయారూపమున ప్రకటయగును. నీవు మనస్సు, బుద్ధి, చిత్తము అహంకారము అనునాలుగింటితో గూడిన అంతరాత్మవైనచో నీమె లక్షణ చేదా వృత్తిరూపమున నవతరించును. నీవు విరాడ్రూపుడ వైనచో నీమె సర్వచరాచరమును ధరించుధర యనునామమున ప్రసిద్ధమగును పురుషోత్తమా! ఈమె ధరించుశ్యామగౌరరూపములు నీతేజస్సులే. నీవు గోలోకధామమున ప్రభుడవు. మహాపురుషుడుగూడ నీయధీనమున నుండును. నీవు పరముకంటెను పరమైయున్నావు. అవగా సర్వశ్రేష్ఠుడవు. నేను నిన్ను శరణుజొచ్చుచున్నాను. ఈయుగళస్తవమును స్తుతించువాడు ఉత్తమమగుగోలోకధామమును బొందును.

స్వయముగ శ్రీకృష్ణుడిట్లు పలికినాడు :

త్వం మే ప్రాణాధికా రాధే ప్రేయసీ చ వరాననే ।
యథా త్వం చ తథాహం చ భేదో హి నావయోర్ధ్రువమ్ ॥

యథా క్షీరే చ ధావల్యం యథాగ్నౌ దాహికా సతీ ॥
యథా పృథివ్యాం గన్ధశ్చ తథాహం త్వయి సంతతమ్ ।
వినా మృదా ఘటం కర్తుం వినా స్వర్ణేన కుండలమ్ ॥

కులాలః స్వర్ణకారశ్చ న హి శక్తః కదా చన ।
తథా త్వయా వినా సృష్టిమహం కర్తుం న చ క్షమః ॥
సృష్టేరాధారభూతా త్వం బీజరూపోఽహమచ్యుతః ।

త్వం మే శోభా స్వరూపాసి దేహస్య భూషణం యథా ।
కృష్ణం వదన్తి మాం లోకాస్త్వయైవ రహితం యదా ॥

శ్రీకృష్ణం చ తదా తేపి త్వయైవ సహితం పరమ్ ।
త్వం చ శ్రీస్త్వం చ సంపత్తిస్త్వమాధారస్వరూపిణీ ।
సర్వశక్తిస్వరూపాసి సర్వరూపోఽహమక్షరః
యదా తేజస్స్వరూపోఽహం తేజోరూపాసి త్వం తదా ॥

న శరీరీ యదాహం చ తదా త్వమశరీరిణీ ।
సర్వబీజస్వరూపోఽహం సదా యోగేన సున్దరి ॥
త్వం చ శక్తిస్వరూపా చ సర్వస్త్రీరూపధారిణీ ॥
మమాంగాంశస్వరూపా త్వం మూలప్రకృతిరీశ్వరీ ॥

శక్త్యా బుద్ధ్యా చ జ్ఞానేన మయా తుల్యా వరాననే ।
ఆవయోర్భేదబుద్ధిం చ యః కరోతి నరాధమః ॥

తస్య వాసః కాలసూత్రే యావచ్చన్ద్రదివాకరౌ ।
పూర్వాన్ సప్త పరాన్ సప్త పురుషాన్ పాతయత్యధః ॥
కోటిజన్మార్జితం పుణ్యం తస్య నశ్యతి నిశ్చితమ్ ।
అజ్ఞానాదావయోర్నిన్దాం యే కుర్వన్తి నరాధమాః ॥
పచ్యన్తే నరకే ఘోరే యావచ్చన్ద్రదివాకరౌ ।
(బ్రహ్మవైవర్త పురాణము, శ్రీకృష్ణజన్మఖండము 15. 57-70)

మగుచున్నది. ఇంతేకాక భోగత్యాగములు, భజనకీర్తనములు సంయమ తపస్సులు, యోగజ్ఞానాదులు మున్నగుసాధనములుగూడ ఆత్మసుఖ వాంఛామూలకమే యగుచున్నవి. మోక్షప్రాప్తికి లేదా దివ్యభగవల్లోక ప్రాప్తికి సంబంధించినవాంఛగూడ వాంఛయే యగును.

కాని యీసమర్పణమయప్రేమలో నెచ్చటగూడ ఆత్మసుఖవాంఛా గంధము లేశమాత్రముగూడ నుండదు. భక్తులు దీనిని ప్రజరసమందురు. దీనికి నాలుగుభేదములు గలవు. 1. దాస్యము, 2 సఖ్యము, 3 వాత్స ల్యము, 4. మధురము. దీనికి ముందొకశాంత మనురస మున్నది. దానిలో ఇంద్రియమనస్సులమీద నియంత్రణముండును. భక్తులు దాస్యరసములోనికి జేరుదురు. ఈనాలుగింటిలో అన్నిటికంటె అన్నివిధముల శ్రేష్ఠమైనది మధురరసము. ఈమధురరసము గోపీప్రేమ లేదా శ్రీరాధాప్రేమ యని చెప్పబడును. గోపాంగనలు శ్రీరాధాదేవికాయవ్యూహరూపిణులు అందు వలన గోపీప్రేమ లేదా రాధాప్రేమ ఒకేవస్తువు. అయినను ప్రేమకు సంబం ధించినప్రేమ, స్నేహము, మానము, ప్రణయము, రాగము, అనురాగము, భావము, మహాభావము అనునీయాటింటిలో సర్వోత్కృష్ట మగుమహాభావము శ్రీరాధాదేవియందే యున్నది. హ్లాదినిసారము ప్రేమ, ప్రేమసారము మహాభావము. అందువలన శ్రీరాధాదేవి మహాభావరూప.

గోపికలయొక్క శ్రీరాధాదేవియొక్క సమర్పణమయప్రేమచే జగత్తు లోనిజనులకు లభించుత్యాగసంబంధబోధ మరియెచ్చటను లభించదు. త్యాగము పెరిగినకొలది విశుద్ధప్రేమపెరుగును. ప్రేమ పెరిగినకొలది త్యాగ మధికమగును. త్యాగప్రేమలయందు పరస్పరము పోటీయుండును. దీని వలన మానవునిత్యాగమయప్రేమజీవనము అంతట సహజముగనే విశుద్ధానంద మును, సుఖశాంతులను విస్తరింపజేయును. ప్రేమ ఇచ్చుటయే యెరుగును గాని తీసికొనుట ఎరుగదు. నేడు జగత్తులోని తమసుఖమును మరచి తమ స్వార్థమును విడచి, తమ హితమును వాంఛింపక ఇతరుల స్వార్థమును తమస్వార్థముగ భావించినచో అందరు అందరకు సుఖమును గలుగజేయు వారు. అందరకు హితమును జేకూర్చువారు నగుదురు.

ఈత్యాగమే పారమార్థికక్షేత్రమున ప్రవేశించినచో అది పరమపవిత్ర ప్రేమయై భగవంతునితో తననిత్యాభేదస్థితిని గలిగించును. ఇక బంధమోక్ష

ములుగాని, జననమరణములుగాని యుండవు. ప్రేమికుడైన భక్తుడు భగవంతునికొఱకు పిచ్చివాడగునట్లు భగవంతుడుగూడ భక్తునికొఱకు పిచ్చివాడగును

పవిత్రభగవద్భక్తియే జీవితపరమలక్ష్యమని భావించి తన జీవితమును సరిదిద్దుకొనువాడే నిజమైనమానవుడని చెప్పబడుటకు యోగ్యుడగును. భోగాసక్తుడు, అశాంతుడు, పాపజీవనుడు నగుమానవునికంటె కర్మకనధికారియైన పశ్వాదులుగూడ శ్రేష్ఠములే. అందువలన ఈలక్ష్యమును ఎదుటనుంచుకొని దీనికై దృఢసంకల్పముచేసి మానవుడు సతతప్రయత్నపరుడు కావలెను. ఈక్రిందికొన్నిసాధనములు మానవునకు సహాయకములు, లాభప్రదములు నగును.

1. భగవద్భక్తియనే జీవితమున కేకైకమగుపరమోద్దేశ్యమని భావించి అన్ని పరిస్థితులలోను దానినే లక్ష్యమునం దుంచుకొని పనిచేయవలెను.
2. వీలున్నంతవఱకు భోగాసక్తిని విడువవలెను. జగత్తులోని యేపదార్థమునందును రాగమును కలిగియుండరాదు.
3. అభిమానము, మదము, గర్వము మున్నగువానికి యేమాత్రమును ఆశ్రయ మీయరాదు. ఎల్లప్పుడు తన్ను అకించనునిగను, భగవానుని యెదుట దీనాతిదీనునిగను తలంపవలెను.
4. శ్రీకృష్ణభగవానునిచరణములయందే మమకారములను కలిగియుండవలెను.
5. జగత్కార్యము లన్నింటిని భగవానునిచరణసేవాభావముచేతనే చేయవలెను.
6. ఏప్రాణియందును ద్వేషబుద్ధి కలిగియుండరాదు. అందఱియందును రాధామాధవదృష్టి కలిగియుండవలెను. వినయము కలిగియుండవలెను. అందఱిని గౌరవింపవలెను. కాని తాను ఇతరులనుండి సమ్మానమును గోరరాదు.
7. ప్రతిదినము నియమితసంఖ్యలో వీలున్నంతవఱకు భగవన్నామమును జపించవలెను.

# నీ రా జ న ము

శ్రీరాధాకృష్ణులపరిపూర్ణానుగ్రహము లభింపవలెనన్న, జీవితములో పరమశాంతిని సౌఖ్యములను పొందవలెనన్న, జననమరణములు లేకుండగ నుండవలెనన్న శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమును హృదయంగమము చేసికొని మననము చేసికొనవలెను. ఈమహాపురాణము మానవుని సకలసంశయములను నివారించినది. "వాసుదేవస్సర్వమితి" యని యీపురాణము గర్జించినది

ప్రస్తుతఖండమైనశ్రీకృష్ణజన్మఖండ పూర్వార్థమందు శ్రీకృష్ణావిర్భావము మొదలు బాలకృష్ణుని మధురాగమనమువఱకు గలదివ్యలీలలు వర్ణింపబడినవి. శ్రీకృష్ణపరమాత్మ అయోనిసంభవుడనియు, అజుడనియు, అనాశరహితము దివ్యమునైనగోలోకపరంధామమునుండి భక్తానుగ్రహార్థము, దుష్టశిక్షణార్థము నీవసుంధరపై నవతరించినాడనియు ఈపురాణము వివరించినది. ఇందు శ్రీరాధాకృష్ణులదివ్యవివాహవర్ణనము గలదు. అనేకదేవతలగర్వభంగప్రసంగములు గలవు. దివ్యములైనస్తోత్రకవచములు గలవు. అనేకములైనసూక్తులు ఉపదేశములు గలవు. ఈగ్రంథరాజమును పఠించి సజ్జనులు బ్రహ్మానందానుభూతిని పొందగలరనినాదృఢవిశ్వాసము.

ఈమహాపురాణమును మీ కందించినట్లు మేము మాభవిష్యత్కార్యక్రమములో భగవంతునిదివ్యలీలలను వర్ణించినఅష్టాదశమహాపురాణములలోని యితరపురాణములనుగూడ సులభవచనమున ఆంధ్రీకరించి తెలుగుప్రపంచమునకు సమర్పించి జన్మను తరింపజేసికొనవలయునని మాప్రగాఢవాంఛ.

ప్రస్తుతము మేము భారతీయవిజ్ఞానసర్వస్వముగా భావింపబడు అగ్నిపురాణమును సిద్ధముచేయుచున్నాము. ముద్రణమునకుఎంతయోవ్యయము కాగలదు. ఉదారహృదయు లెవ్వరైనను ఈమహాపురాణప్రచారోద్యమమునకు ఆర్థికసహాయమునందీయవలసినదిగా కోరుచున్నాము.

అష్టాదశమహాపురాణములలో పదియవది భగవంతునిపరిపూర్ణబ్రహ్మస్వరూపమును ప్రతిపాదించునది, శ్రీకృష్ణద్వైపాయనవ్యాసమహర్షిచే పదునెనిమిదివేలశ్లోకములలో ప్రవచింపబడినదియు నైనశ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణమును నేను సంపూర్ణముగ అనువదించితిని దానిలో ఈదిగువన ఉదహరింపబడుఖండములు ప్రచురించుటమైనది,

1. శ్రీమద్బ్రహ్మవైవర్తమహాపురాణసారసంగ్రహము :

ఆవిష్కర్తలు : శ్రీశ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి శంకరపీఠాధీశ్వరులు, పరమహంసపరివ్రాజకాచార్యులు సద్గురుశ్రీమదభినవోద్దండ విద్యానృసింహభారతీస్వామిపాదులు.

ప్రదేశము : శ్రీశ్రీశ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవస్థానము గుంటూరు.

సమయము : కాళయుక్తి వైశాఖబహుళ దశమి (శ్రీహనుమజ్జయంతి) ది. 31-5-78

2. బ్రహ్మఖండము :

ఆవిష్కర్తలు : త్రిదండిస్వామి శ్రీభక్తివిజయవిష్ణుమహారాజ్ శ్రీ గౌడీయమఠము గుంటూరు

ప్రదేశము : శ్రీశ్రీశ్రీ వాసవికన్యకాపరమేశ్వరి దేవస్థానము

సమయము : కాళయుక్తి శ్రావణకృష్ణాష్టమి (శ్రీకృష్ణజయంతి) ది. 26-8-78

3. ప్రకృతిఖండము :

ఆవిష్కర్తలు : గ్రంథకర్త జననీజనకులైన శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మ, శ్రీజగన్నాథముగార్లు.

ప్రదేశము : శ్రీశ్రీశ్రీ వాసవికన్యకాపరమేశ్వరి దేవస్థానము

సమయము : సిద్ధార్థ చైత్రశుద్ధపాడ్యమి (ఉగాదిపర్వదినము) ది 29-3-79

4. గణపతిఖండము :

ఆవిష్కర్తలు , శ్రీశ్రీశ్రీ శుద్ధచైతన్యస్వామివారు

ప్రదేశము : శ్రీశ్రీశ్రీ వాసవికన్యకాపమేశ్వరి దేవస్థానము

సమయము : సిద్ధార్థి వైశాఖశుద్ధ దశమి శ్రీవాసవి కన్యకాపరమేశ్వరి జయంతి ది. 6-5-1979

త్వరలోనే శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణమందలి చతుర్థ ఖండమైనశ్రీకృష్ణజన్మఖండములో ఉత్తరార్థమును ముద్రించి మీకుసమర్పింప గలము.

ఈ శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణమును భాషాంతరీకరించుటయన్న, ముద్రించుటయన్న సామాన్యవిషయము కాదు. ఈవిషయమున నావంటి సామాన్యవ్యక్తి నిగూర్చి ఇక చెప్పునదేమి ! ఈగ్రంథానువాదము భగవద నుగ్రహము చేతనే సమకూడినది. ఇచట నావిషయము కొంతప్రస్తా వించుట సముచిత మనిభావించుచున్నాను.

1976 జనవరి 22వ తేదీనాటి తెల్లవారుజామున స్వప్నములో సచ్చిదా నందస్వరూపుడు. అష్టభుజుడు నగు శ్రీకృష్ణభగవానుడు దర్శన మొసంగి తనకు తననామమునకు, రూపమునకు, ధామమునకు, చరితమునకు భేదము లేదనియు, శ్రీమద్బ్రహ్మవైవర్తమే తానని, దాని నాంధ్రీకరించి ప్రచార మొనరింప వలసినదనియు నన్నాదేశించెను, అంతేగాక మద్గతచిత్తుడవు, మద్భక్తుడవు, నన్నే పూజించువాడవు, మత్పరాయణుడవు కావలిసినదని మేఘ గంభీరస్వరముతో బలికి యంతర్ధానముచెందెను. సామాన్యుడనగు నే నెక్కడ ! భగవదభిన్నస్వరూప మైనశ్రీమద్బ్రహ్మవైవర్తమహాపురాణ మెక్కడ యనివిస్మితుడనైతిని. ఈస్వప్నము వచ్చిన సరిగ నెలరోజులతరువాత అనగా ఫిబ్రవరి 22వ తేదీనాడు నాకు స్కూటరు ప్రమాదము సంభవించి కుడిచేయి విరిగిపోయినది. చికిత్సాలయమున 'ఆపరేషను' నిమిత్తమై చేర్చ బడితిని 24వ తేదీన ఆపరేషను థియేటరులో నాపరిస్థితి విషమించినది. ఉదయము 6గంటలనుండి మధ్యాహ్నము2గంటలవరకు ప్రముఖులైన పలువురు డాక్టర్లు నాప్రాణములను రక్షించుటకు మిగుల ప్రయత్నించి నాయం దాశలు వదలిరి. అట్టిసమయమున నష్టభుజయుక్తు డైనశ్రీకృష్ణపరమాత్మ మరల సాక్షాత్కరించి వెనుకటి తన యాదేశమును జ్ఞాపకముచేసి, వెంటనే శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణము నాంధ్రీకరింపవలసినదిగా నాదేశించి యంతర్హితుడయ్యెను భగవన్నామస్మరణ మొనరించుచు లేచి కూర్చుంటిని. మరణాసన్నుడ నైననేను పునర్జీవితుడ నగుటకాంచి వైద్యులతోగూడ బంధుమిత్రు లందరు హర్షామోదములనందిరి.

పిమ్మట మూలసంస్కృతగ్రంథమును పూనానుండి తెప్పించి అను వాదము చేయసాగితిని. భగవత్కృపవలన నాలుగుమాసములలో తదేకదీక్షతో గ్రంథానువాదమును పరిసమాప్త మొనరించితిని. అనంతరము భగ్నమైన నాదక్షిణకరము యథాస్థితి నొందినది.

'మాతృదేవో భవ, పితృదేవో భవ' అనుసూక్తుల ననుసరించి భగవత్సేవా కెంతయైనను నాకీజన్మము నిచ్చిన నాతల్లిదండ్రు లగు శ్రీమతి వేంకట మహాలక్ష్మమ్మ శ్రీజగన్నాథముగార్ల కాజన్మాంతము నేను ఋణపడియున్నాను. దానశీలురు, జ్ఞానవైరాగ్యసంపన్నులు, పుణ్యమూర్తులు భగవద్భక్తియుతులు నగువారియనుగ్రహవిశేషముచే నాకీమహత్కార్య మొనరించు నదృష్టము లభించిన దని చెప్పికొనుట కెంతయో గర్వపడుచున్నాను.

ఆధ్యాత్మికచింతనలోను, గ్రంథానువాదములోను నెట్టియాటంకములు కలుగకుండగ నత్యంతాదరముతో నానేకవిధముల సహకరించిన నా శ్రీమతి శ్యామసుందరికి, కుమారులగు యదువీరరంగధామ్, శ్రీనివాసశరణ్, నాగమల్లికార్జునులకు శ్రీకృష్ణభగవాను డాయురారోగ్యైశ్వర్యాదులను ప్రసాదించుగాక!

పుత్రసంతానరహితుడ నగునా యనేకజన్మలసుకృతవశమున నేటికాలమున శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణకన్య మాయింట జన్మించినది. ఇట్టి పుత్రికను శేషాచలవాసుడు, విమలరవికోటిసంకాశుడు, సర్వజగన్నివాసుడు కలితలక్ష్మీశుడు నగుశ్రీవేంకటేశ్వరవిభునకు సమర్పించుకొనుచున్నాను. ఇట్టి దేవాదిదేవుడు నాకల్లుడుగ లభించి నన్ను, నావంశమును చరితార్థ మొనరించినాడు.

శ్రీసిద్ధార్థిసంవత్సరఫాల్గుణబహుళసప్తమీ ఆదివారము (ది.9-3-1980) శుభదినమున శ్రీశ్రీశ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీదేవస్థానప్రాంగణములో భక్తుల సమక్షమున వధువైనయీ శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణకన్యను వరశ్రేష్ఠుడు అఖిలాండకోటిబ్రహ్మాండనాయకుడైన శ్రీవేంకటేశ్వరస్వామి కర్పించి కల్యాణమహోత్సవము నొనరించితిని, ఇది యపూర్వవివాహము. బ్రహ్మకడిగిన నా దేవాదిదేవుని దివ్యచరణారవిందములను గడిగి కన్యాదాన మొనరించిన నా సౌభాగ్యము నేమని చెప్పికొనగలను!

శ్రీశంకరాచార్యులు, నృసింహపురాణము, శైవధర్మము, శ్రీమద్భాగవతము, శ్రీకృష్ణోద్ధవసంవాదము మున్నగుబహుగ్రంథకర్త లగు శ్రీజన్నాభట్ల వాసుదేవశాస్త్రిగారు ఈగ్రంథముద్రణమునందును, భాషావిషయమునందును, ననేకవిధము లగుసలహాల నిచ్చుచు నెంతగనో తోడ్పడిరి. వారికి నాహృదయపూర్వకధన్యవాదములు.

ప్రకాండ సంస్కృతవిద్వాంసులు, దర్శనాచార్యులు, లాక్షణికశిరోమణులు, అభినవభారతిమున్నగు ననంఖ్యబిరుదాంచితులగు శ్రీశ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు 'శ్రీకృష్ణభూతి'యను అమూల్యసందేశమును, 'శివమస్తు భద్రం భవతు' అను ఆశీస్సులను నాయభ్యర్థనమును మన్నించి ప్రసాదించిరి వారికి నామనఃపూర్వకనమస్సులు.

ఆర్షకవిశిరోమణి, శతాధికగ్రంథకర్త, ఏ. యస్. గవర్నమెంట్ కమెన్స్ కాలేజి(కాకినాడ)లో ఆంగ్లభాషోపన్యాసకులు నగువిద్వాన్ శ్రీబులుసు వేంకటేశ్వర్లు యం. ఏ. ఏ. ఇ. యస్. గారు నేనుపరిశీలనార్థము గ్రంథము నను పంపకపోయినను ఎవరికడనో నాగ్రంథమును జూచి పరిశీలించి పరమానంద భరితులై నాపైగలయవ్యాజమైన కరుణతో ఆశీఃపూర్వకలేఖను వ్రాసిరి. వారికి నేను సవినయముగ కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

సాహిత్యచక్రవర్తి, ఉపన్యాసకేసరి, రామాయణార్థరత్నాకర ఇత్యాదిబిరుదాంచితులు, డా. కె వి. కె సంస్కృతకళాశాల (గుంటూరు)లో సంస్కృతోపన్యాసకులు, నగు శ్రీమాన్ కోగంటి సీతారామాచార్యులుగారు ది 9-8-80 ఆదివారం శ్రీ శ్రీ శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరిమహాసంస్థానమునందు నాకుజరిగిన సన్మానసభకు అధ్యక్షతవహించి నన్నభినందించుచు సంస్కృత శ్లోకరూపమున నవరత్నమాలనొసంగిరి. సభాముఖముగ వారు "పౌరాణికరత్న" యనుబిరుదమును ప్రకటించిరి. అంతేకాక ఆశంసారూపమున తమయమూల్యాభిప్రాయమునుగూడ నొసంగిరి. వారికి నామనఃపూర్వకములైనమస్సుల నర్పించుచున్నాను,

అయాచితముగనే గ్రంథముద్రణమున కార్థికసాహాయ్య మొనరించిన సహృదయుల కందఱకు నామనఃపూర్వకధన్యవాదములు. వారికి శ్రీకృష్ణభగవాను డాయురారోగ్యైశ్వర్యాదులను బ్రసాదించుగాక !

ఈమహాగ్రంథమును సకాలములో ముద్రించి యిచ్చిన 'రఘు ప్రింటింగు వర్క్సు' అధిపతులకు నాహృదయపూర్వకధన్యవాదములు

ది 12-11-77 నుండి 8-8-80 వఱకు అవిచ్ఛిన్నముగ ప్రతిదినము సాయంసమయమున ఏడుగంటలనుండి తొమ్మిదిగంటలవరకు శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణమును ప్రవచనమొనరించుటకు నా కవకాశ

యొసంగిన శ్రీశ్రీశ్రీ వాసవీకన్యకాపరమేశ్వరి దేవస్థానము గుంటూరు ధర్మకర్తలసంఘమునకు, ధర్మకర్తలసంఘాధ్యక్షులైన శ్రీచంద్రపాటి వెంకటేశ్వర్లు బి. ఏ, గారికి దేవాలయసేవకవర్గమునకు నాహృదయపూర్వకధన్యవాదములు తెలుపుచున్నాను. వీరియొక్క అపూర్వసహకారముచే ప్రతిదినము అసంఖ్యాకులైనభక్తజనులు శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణామృతమును గ్రోలగల్గినారు. వీరందరిని ఆపరమాత్మ ఆయురారోగ్యైశ్వర్యాదులను, భక్తిజ్ఞానవైరాగ్యములనొసంగి సదా రక్షించుగాక.

ఇట్లు
సుజన విధేయుడు
భక్తజన దాసానుదాసుడు
మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త

ఆంధ్ర బ్రహ్మవైవర్తపురాణ కర్త

# శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయ గుప్తగారికి

# మందారదామం

తేజోనిధీ !

"తేజోనిధికి వయసు కారణమగునే" అన్న మహాకవిసూక్తి మీపట్ల అర్థవంతమైనది. అష్టాదశమహాపురాణములలోను సుప్రసిద్ధమైన బ్రహ్మవైవర్త పురాణమునాంధ్రీకరించుట-మీ ప్రజ్ఞాపాటవమునకు అపారశేముషీవైభవమునకు నిదర్శనము. చిన్నవయస్కులై కూడ-అనితరసాధ్యమైనమహాపురాణము నాంధ్రీకరించవలెననే-మీమహాసంకల్పము-విజయవంతముగా-శ్లాఘాపాత్రముగా సిద్ధించుట-ఆంధ్రమహాజనులకు-ముఖ్యముగా-ఆర్యవైశ్యులకు గర్వకారణము.

మృదుమధురమై-సుబోధకమై-ఆధ్యాత్మికప్రబోధమునకు మూలకందమైన-మీ బ్రహ్మవైవర్తపురాణం తెలుగు సారస్వతంలో మణికిరీటంగాభాసించగలదని మీ ఖ్యాతి ఆచంద్రతారార్కంగా నవనవోన్మేషంగా విలసిల్లగలదని ఆశిస్తున్నాము.

సిద్ధసంకల్పా !

ఆంధ్రదేశంలో ఎందరో ఋషితుల్యులు దిగ్దంతులైన కవితాల్లజులు-మహాపీఠాధిపతులు ఉపేక్షించి యీ మహాపురాణమాంధ్రీకరించగల మహద్భాగ్యం మీకు కలుగజేశారు. ఇది మీ పూర్వజన్మసుకృతం, మీతపఃఫలితం. ఆంధ్రదేశంలో ఆర్షధర్మం జీవించునంతకాలం-మీకీర్తిపతాక రెపరెపలాడుతు మీసత్సంకల్పమునకు దివ్యనీరాజనాలనందించగలదని మీలేఖినినుండి అసంఖ్యాకంగా ఆధ్యాత్మికప్రబోధాత్మకమైన పవిత్రగ్రంథాలు వెలువడగలవని-ఆశిస్తూ మీకివే-మాహృదయపూర్వకమైన అభినందనలనందించున్నాము.

తణుకు
26-6-1979

భవదీయులు,

ప॥ గో॥ జిల్లా ఆర్యవైశ్యసంఘం మరియు
ప॥ గో॥ జిల్లా ప్రథమ ఆర్యవైశ్య మహాసభల
ఆహ్వాన సంఘం

# రచయిత పరిచయము

1. పేరు : మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త.

2. జననము : విక్రమనామసంవత్సర ఆశ్వయుజ శుద్ధఅష్టమి దీ. 8-10-1940 అనగా దుర్గాష్టమీదినము.

3. జననీజనకులు : శ్రీమతి వేంకటమహాలక్ష్మమ్మ, శ్రీ జగన్నాథంగారలు.

4. జన్మస్థలము : గుంటూరు (ఆంధ్రప్రదేశ్)

5. గోత్రము : పారాశర్య

6. విద్యాభ్యాసము : 1. గుంటూరు హిందూకళాశాల ఉన్నతపాఠశాల
   2 హిందూకళాశాలలో బి. కాం. వరకు

7. బిరుదములు : 'పౌరాణిక రత్న' 'మహాపురాణాంధ్రీకరణచణ'

8. వృత్తి : శివా ఇంజనీరింగ్ కంపెని గుంటూరు, నరసరావుపేట. యమ్. జగన్నాథం అండ్ జె. యస్. ప్రసాద్. హిందూస్తాన్ పెట్రోలియం డీలర్స్ చిలకలూరిపేట.

9. అభిరుచులు : గ్రంథరచన, పురాణప్రవచనము. హోమియోపతి ఉచిత వైద్యము.

10. ఆశయము అష్టాదశమహాపురాణములను ఆంధ్రీకరించుట.

11. ఇతరభాషాపరిచయము: సంస్కృతము, హిందీ, ఇంగ్లీషు

12. ఇతరవిశేషములు : 1. అనేకసభలలో ఆధ్యాత్మిక విషయములనుగూర్చి ప్రసంగించిరి.
    2. రెండున్నర సంవత్సరములకాలము శ్రీశ్రీశ్రీవాసవీ కన్యకాపరమేశ్వరీ దేవస్థానప్రాంగణములో శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమును ప్రవచనము చేసిరి.
    3. విశ్వహిందూపరిషత్ గుంటూరు పట్టణశాఖ అధ్యక్షులు.

13. ముద్రితరచనలు: 1. శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణసారసంగ్రహము
శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్తమహాపురాణములో
2. బ్రహ్మఖండము
3. ప్రకృతిఖండము
4. గణపతిఖండము
5. శ్రీకృష్ణజన్మఖండము (పూర్వార్థము)

14. రాబోవురచనలు : 6. శ్రీకృష్ణజన్మఖండము (ఉత్తరార్థము)
7. శ్రీమద్రాఘవేంద్రగురుచరితము
8. శ్రీ అగ్నిపురాణము
9. ఉపనిషత్సుధాసాగరము
10. శ్రీహనుమద్భాగవతము

15. చిరునామా : 1. శ్రీమట్టుపల్లి శివసుబ్బరాయగుప్త
మహాపురాణ ప్రచారసంఘము.
మట్టుపల్లివారివీధి కొత్తపేట, గుంటూరు.
ఫోన్. 28827

2. శివా ఇంజనీరింగ్ కంపెని
స్టేషన్ రోడ్ గుంటూరు-1
ఫోన్ : 20827

# శ్రీ కృష్ణ భూతి

జమ్ములమడక మాధవరామశర్మ.
అభినవభారతి : గుంటూరు

శ్రీమహావిష్ణువు, సచ్చిదానందలక్షణుడు, సర్వాంగసుందరుడు నయిన రామచంద్రుని జూచి వనవాసి మునులు విస్మితులై "ఆలింగామో భవంత" అనిరి. కృష్ణావతారమున మీరు గోపికలై "మాం ఆలింగథ" అని రాముడనెను. అందరు మోదయుక్తులవారయినారు. ఇది కృష్ణోపనిషద్వచనము. పరమానందము నందుడు. యశోదముక్తి గేహిని. దేవకీ బ్రహ్మపుత్రి. వేదార్థము వసుదేవుడు, బృందావనవనమునందు గోపగోపీజనులతో క్రీడించుచు పరమాత్మ మహీతలమున అవతరించెను. ఋక్కులు గోవులయినవి, గోపికలుగా నయ్యెను. రుద్రుడు వంశము. ఇంద్రుడు శృంగము, గోకులము వన వైకుంఠము, తాపసులు వృక్షములు, మాయావిగ్రహధారియై సాక్షాత్ హరి గోపరూపుడయ్యెను. శేషనాగుడు బలరాముడు, "కృష్ణో బ్రహ్మైవ శాశ్వతం" ద్వేషము చాణూరమల్లుడు. మత్సరము ముష్టికమల్లుడు. దర్పము కువలయాపీడగజము, మహావ్యాధి అఘాసురుడు. ఇట్లే యితరములు కలిగినవి. దధిగ్రహించుటలో భాండము భగ్నమొనరించి దుగ్ధోదధి నాతడు నిర్మించెను.

సంహారార్థం చ శత్రూణాం
రక్షణాయ చ సంస్థితః ॥
భూమాపుత్త్రారితం సర్వం
వైకుంఠం స్వర్గవాసినామ్

ఈవిధముగా ఉపనిషత్తు కృష్ణుని గోచరింపజేయుచున్నది. ఉపనిషత్పర బ్రహ్మము శ్రీకృష్ణుడు, కృష్ణకథాగతమంతయు నిట్లు భావనీయము కాదగునని కృష్ణోపనిషత్తాత్పర్యము.

అథర్వణవేదీయ శ్రీకృష్ణోపనిషత్తులో నిరూపితార్థము నిరూపితమయినది శ్రీకృష్ణపరివారరూపముగా దేవీదేవులవతరించిరి. వారలకు కృష్ణునితో నేకరూపతయున్నది. ఇట్లవతరించుటలో శ్రీరాధికయున్నది. ఉపాసనా స్వరూపలక్ష్యములను తెలిసికొనుటకు బ్రహ్మవిదులు విచారణమారంభింపగా వైదికజ్ఞానము వారిలో సంక్రమించినది. రాధ సంపూర్ణ దేవతాశక్తి. రాధి

కాళశక్తియన్నిటికి స్పందమిచ్చును విశుద్ధహృదయముతో రాధనుపాసింప వలెను. సర్వదేవతాపాలిక శ్రీరాధ. కృష్ణుడు రాధనారాధించును. రాసమండలమున రాధారాసక్రీడచూచియు దరి స్వరూపము విస్మరించిరి. రాధాంకమునన్న కృష్ణుడు గోలోకమునగూడ స్మరింపడు. రాధిక కృష్ణుడు వస్తుతః ఏకశరీరులు. ఇట్టిది అధర్వణవేదమునందలి శ్రీరాధికోపనిషద్భావము.

ఋగ్వేదీయ శ్రీరాధోపనిషత్తీవిధముగా నున్నది. రాధాస్వరూప మిందుకలదు. సనకాదులు సర్వప్రధానదేవతాశక్తి నడుగ బ్రహ్మ యిట్లు చెప్పెను. శ్రీకృష్ణుడు పరమదేవుడు, గోపీగోపసేవ్యుడు. బృందావనాధీశ్వరుడు, నారాయణుడు, బ్రహ్మాండాధీశ్వరుడు. కృష్ణుని హ్లాదినిశక్తి యున్నది. ఆదిసర్వశక్తిప్రధానమయిన శ్రీరాధ కృష్ణుడు రాధనారాధించును. రాధ కృష్ణునారాధించును, రాధను గాంధర్వియనియు నందురు. రాధానామము లిట్లు నిరూపితములు.

> రాధా రాసేశ్వరీ రమ్యా కృష్ణమంత్రాధిదేవతా
> సర్వాద్యా సర్వవంద్యా చ బృందావనవిహారిణీ
> బృందారాధ్యా రమాశేషగోపీమండలపూజితా
> సత్యా సత్యపరా సత్యభామా శ్రీకృష్ణవల్లభా
> వృషభానుసుతా గోపీమూలప్రకృతిరీశ్వరీ
> గాంధర్వా రాధికాఽఽరమ్యా రుక్మిణీ పరమేశ్వరీ
> పరాత్పరతరా పూర్ణా పూర్ణా చంద్రనిభాననా
> భుక్తిముక్తిప్రదా నిత్యం భవవ్యాధివినాశినీ

గోపాలతాపిని ఉపనిషత్తులో నిట్లుకలదు. మునులడిగిరి, పరమదేవు డెవరు? 'మృత్యువు' ఎవనివలన భయపడును? దేనివిజ్ఞానమున సర్వము విజ్ఞాతమగును? ఈ విశ్వమెవనిచే ప్రసరించుచున్నది? ఈ ప్రశ్నలకు ఉత్తర మిట్లున్నది.

కృష్ణో వై పరమం దైవతం గోవిందాన్మృత్యుర్బిభేతి. గోపీజనవల్లభ విజ్ఞానేన తద్విజ్ఞానం భవతి. స్వాహా ఇదం విశ్వం సంసరతి

ఇందు "కృష్ణ గోవింద గోపీజన వల్లభ స్వాహా" అను పంచపదముల వివరణము కృష్ణవిభూతి. ఈవిజ్ఞానము బ్రహ్మసంపత్తి. కృష్ణవిభూతి ధ్యాన రసన భజనములు అమృతత్వసంపాదకములు. పంచపదజపము, కృష్ణధ్యానము సర్వతారకము. "కృష్ణ ఏవ పరో దేవః తం ధ్యాయేత్ తం రసయేత్, తం యజేత్ తం భజేత్" ఇట్టిచటుల విజ్ఞాన నివృత్తి పంచపదమనువు=మంత్రము ఫలము సాధనము నిర్దిష్టము లయినవి. ఇది రెండవవిధమగు విభూతి.

గోపాలతాపిని యిట్లనిట్లు నిర్దేశించినది. ఒకప్పుడు వ్రజవనితలు సన్నాత్తై కృష్ణునడుగగా కృష్ణుడిట్లనెను. "దుర్వాస బ్రాహ్మణునకు భైక్ష మీవలయును." యమునాజలము తరించి యెట్లు పోగలము! కృష్ణుడు బ్రహ్మచారియనుడు, మార్గముగలుగును. నన్ను స్మరించిన అగాధము గాధ మగును. అపూతుడు పూతుడగును. అవ్రతి వ్రతియగును. సకాముడు నిష్కాముడగును, అశ్రోత్రియుడు శ్రోత్రియుడగును. వ్రజవనితలు కృష్ణుని స్మరించి నదిదాటి, మునిని దర్శించి, నమస్కరించి క్షీరయుక్తమగు ఘృతమయమగు ఇష్టతమము మృష్టము నర్పించిరి. ముని సంతసించి యమునాతీరమునకు వచ్చి ఈనదినెట్లుదాటుదుము! నన్ను దుర్వాసుని స్మరింపుడు. మార్గము కలుగును. అప్పుడావనితలలో శ్రేష్ఠతమ గాంధర్వి "కథం కృష్ణో బ్రహ్మచారీ! కథం దుర్వాసనో మునిః" అని ప్రశ్నించెను. అప్పుడు ముని తత్త్వము తెలిపెను! "యో హ వై కామేన కామాన్ కామయతే స కామీ భవతి యో హ వై త్వకామేన కామాన్ కామయతే సోఽకామీ భవతి" అనియును "యోసౌ సూర్యే తిష్ఠతి, యోసౌ గోషు తిష్ఠతి, యోసౌ గోపాన్ పాలయతి, యోసౌ సర్వేషు దేవేషు తిష్ఠతి, యోసౌ సర్వైర్వేదైర్గీయతే, యోసౌ సర్వేషు భూతేష్వావిశ్య భూతాని విదధాతి, స వో హి స్వామీ భవతి"

కలిసంతరణములో నీవిశేషమున్నది. నారదుడు బ్రహ్మను "కథం కలిం సంతరేయం" అనియడిగెను. "సాధుపృష్టోస్మి" సర్వశ్రుతిరహస్యము గోప్యము కలిసంతరణ మీనామము.

హరే రామ హరే రామ రామ రామ హరే హరే

హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే

కలికల్మషనాశనము. "నాతః పరతరోపాయః" షోడశకలావృతు డయిన జీవునకీనామ షోడశకమావరణ వినాశనము. ఆవరణము పోగా "పరంబ్రహ్మ ప్రకాశతే"

ఇందు హరి రామకృష్ణ పదములున్నవి. హరిపదమాధ్యాత్మికతత్త్వ సూచకము. రామపదము లౌకికతత్త్వసూచకము. కృష్ణపదముభయ సూచకము. ఈవిధముగా వేదాంతములలో కృష్ణవిభూతియున్నది. ఇది జీవజీవనమున సంజీవనమిచ్చును. మనలోకృతాదులున్నవి, కలియున్నది. కలికల్మషమిచ్చును. ఆకల్మషమును కృష్ణవాసుదేవుడు హరించును. కృష్ణ నామ మహాయమృతము ఉపేయమిచ్చును.

సకామలు కృష్ణస్మృతి కలవారయిన నుపదేశము కలవారు కావలెను. దానికై యోకతరణమావశ్యకము. అప్పుడు మునిగురువై పూజారాధనము నిర్దేశించును. మేము రాగిల్లితిమి. కృష్ణుడు బ్రహ్మచారియగుటయెట్లు! అప్పటి గురుకథనములో కృష్ణతత్త్వము విశదమగును. తత్త్వగ్రహణము నకు సంప్రదాయపరిజ్ఞానమునావశ్యకము నారాయణ బ్రహ్మ కుమారనారద సంప్రదాయానుగతముగావచ్చిన కృష్ణతత్త్వము దూర్వాసుడు గుర్తించి చెప్పుటలో సర్వాంతర్యామి శ్రీకృష్ణబ్రహ్మచారిత స్పష్టమయినది. గీతత్త్వ జ్ఞానమువలన దూర్వాసుడు మునియగుట గమ్యమయినది. కాపునగ్రశ్రో త్రియములలో గురుశిష్యమర్యాద స్పష్టమయినది. వ్రజవనితలు కృష్ణవ్యాపిత గుర్తించిరి. సన్నిధికేగలేదు. మనిస్మరణమున తరణముగలిగినది. తత్త్వ జ్ఞానము లేరతోపాయముకాగా సకామలకకామత కలిగినది ఇట్టిదియేపని మద కృష్ణతత్త్వమాత్రము.

భాగవతము కృష్ణునిమూర్త్యంతరము. భారతార్థము శాంతపరము. కృష్ణ నాటకముకాగా హరివంశము విష్ణుపురాణము భాగవతము కృష్ణపారమ్యము నిర్దేశించినవి. భాగవతమునందు 42 స్తవవిశేషములు 448 శ్లోకములలో నిరూపితములయినవి. అవికృష్ణతత్త్వప్రతిపాదకములు. యోగాశ్రయుడు కృష్ణుడు. ఫలాశ్రయుడు కృష్ణుడు. సర్వాశ్రయుడు కృష్ణుడు ఇట్లీతత్త్వ మీస్తవములలోనున్నది. భారతీయ దర్శనవిమల కందరకు కృష్ణుడభిగమ్యు డయినాడు. కృష్ణభావవిశుద్ధికై సర్వపురాణములు వివక్షితము నిరూపించినవి.

శ్రీరాధాకృష్ణతత్త్వాసక్తులయిన మధురభావభక్తులకు, వైష్ణవసంప్రదాయానుయాయులకందరకు బ్రహ్మవైవర్తపురాణమాదరపాత్రము. ఆరంభోపక్రాంతము మధ్యఖండప్రతిపాదితము కృష్ణఖండములో నుపసంహృతమయినది. గౌడీయచైతన్యసంప్రదాయమున వైవర్తము ప్రమాణగ్రంథమయినది.

అవతరించిన వారలకందరకు సాక్షాత్ భగవాన్ అవతారి శ్రీకృష్ణుడు మూలము. దేవకీవసుదేవకుమారుడుగా కృష్ణుడు అవతారిభగవాన్. యశోదానందనుడయిన కృష్ణుడునరాకృతి. అయినను దివ్యాకృతి. ఈ వైవర్తములో కృష్ణస్తవపరములయిన శ్లోకములు భాగవతములోవలె ననేకములున్నవి. వానినివేరుగా ముద్రించి గుప్తనిరూపితతాత్పర్యముతో గుర్తించిన సర్వకృష్ణతత్త్వము భాసించును. అనుకూలవ్యక్తులు ప్రతికూలవ్యక్తులుకృష్ణుని తత్త్వరూపమున సేవించి ధన్యులగుట యిందుగలదు.

కృష్ణశబ్దనిర్వచనము 89, 145 పుటలలో నింకనితరస్థలములందును ఈ వైవర్తములో కృష్ణభక్తుడు శివగుప్తుడు సాదరముగ నిర్దేశించెను. గర్గసంహితలో కృష్ణతత్త్వమున్నది. అదియునింకుగలదు. రాధాదేవిగోలోకస్థానిని. భూలోకరాసమండలవిధాత్రి. భాగవతమునకానరాని రాధాకృష్ణుల వివాహము మావైవర్తములోగలదు అదిభావనీయము. భాగవతమున గోచరింపని సంప్రదాయార్థములకు వైవర్తముపపత్తిసాధకము. వైవర్తార్థము కలుపుకొని భాగవతార్థమును భావించుట యుక్తము. హరిభక్తిరసామృతసింధు గ్రంథములలో నుభయసామాన్యమున సముద్భాసించు తత్త్వము లక్షితమయినది. కృష్ణకర్ణామృతస్తుతి గ్రంథము కర్ణములలో కృష్ణామృతమును నింపుటభక్తులకు దెలియును. శ్రీకృష్ణలీలాతరంగిణీరచయిత, అద్వైతానందుడయిన శ్రీనారాయణానందతీర్థుడు కృష్ణునద్వైతపరబ్రహ్మాగా భావించెను, అందరు కృష్ణుని తమవాడని భావించిరి, కృష్ణునుపార్థమనేకులకు సంభావ్యముగునట్లు శ్రీశివసుబ్బరాయగుప్త దీనినిబంధించెను.

మాధవరామశర్మ.

# శివగుప్త భద్రం భవతు

ఈపురాణ ప్రకృతిఖండమున భావనివర్తమ వ్రాయుటలో "బ్రహ్మ వైవర్త పరిమితిని గుర్తించి. విశేషతను గుర్తించి దీనితరువాతి భాగములో వార తలు భావింపగలరు." అని వ్రాసితిని. తరువాతిఖండము గణపతిఖండమయి నను శ్రీకృష్ణఖండమునకు వ్రాయవలయునది వ్రాయుదునని భావించితిని. పురాణములలోని శ్లోకములు (400000) నాలుగులక్షలు కలవు. ఈ బ్రహ్మవైవ ర్తము (18000) పదునెనిమిది వేలశ్లోకముల పరిమితికలదియని ప్రసిద్ధి. అన్నియు లభించుటలేదు లభించినవానిని గ్రంథములలో ముద్రించిరి వానిభావార్థ మును సమగ్రముగా హృదయగుప్త బ్రహ్మవైవర్తము శ్రీశివసుబ్బరాయ గుప్త నామధేయుడు నిరూపించెను. లోకవ్యాపారనిరతుడయినను అలోక వ్యాపారనిరతతపస్వియై నిరూపించెను. ఇంతటి యాచార్యదీక్షకు తగిన మంచిబావేశముకలదు కావున నిట్లుచేసెను. ఈపురాణనిర్దిష్టులందరు కృష్ణ భక్తిభరితహృదయులు. ఈమిత్రగుప్తుడు సకలపురాణనిర్దిష్ట, కృష్ణభక్త భక్తిభరిత హృదయుడై ఈపురాణసాధను నిర్మించెను నిర్మించినది విన్పించెను. విన్పించినది కన్పించెను. ఇట్టి వానికిది ధర్మము, ఈభక్త ధర్మిని నేనును సూతుడనై భావసూతుడనై "భద్రంభవతు" అని యాశీర్వ దింతును. ఇట్టి యాశీస్సులెప్పుడు పస్థానప్రస్మృతులు కావు శ్రీకృష్ణ ప్రసా దము నేనునందుకొని ఈ గుప్తసుహృత్తునకు వలయు భాగమీయదలచితిని. అస్తు

మాధవరామశర్మ.

# శ్రీ శ్రీ శ్రీ మట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారికి

ది. 9-3-90 ఆదివారం శ్రీ శ్రీ శ్రీ వాసవీకన్యకాపరమేశ్వరీ మహాసంస్థానము నందు జరిగిన సన్మానసభలో సత్కరించిన పౌరాణికరత్న బిరుదు సమర్పణ సందర్భమున సభాధ్యక్షులు శ్రీమదిత్యాది శ్రీమన్ కోగంటి సీతారామాచార్యులుగారు చదివిన పౌరాణికరత్న ప్రశంసాపద్య నవరత్నమాలిక.

పౌరాణికో వ్యాసః పురాణవిఖ్యాన విభవ పరితృప్తః
పౌరాణికత్వ_స్త్వమపి ప్రస్ఫుటతత్త్వార్థ దర్శనోత్కంఠః

శ్రీబ్రహ్మవైవర్త మహాపురాణ
మాంధ్ర్యామనూద్య ప్రవిభాసి లోకే
ప్రసంగవైశిష్ట్యమనంత మహో
ప్రాప్తోసి శ్రీకృష్ణకృపాకటాక్షాత్

లక్ష్మీర్జగన్నాథసుతోఽసి, శ్యామా
సౌందర్యనేత్రద్వయమహో హి లబ్ధమ్
తద్బ్రహ్మవైవర్తమయీ చ సృష్టిః
కృతా, కృతార్థశ్శివసుబ్బరాయ !

నవ నవనీత మృదుత్వం రచనాయామస్తి తే సుహృద్రత్న !
హృదయమపి శుద్ధమాసీత్ శ్రీరాధామాధవస్య సత్కృపయా

వర్షద్వయప్రవచనాత్త్వయా హి కీర్తిర్ధృతా చ నిరవద్యా
దేశేదేశే ప్యేవం ప్రకటయ తత్తత్పురాణసౌభాగ్యమ్.

'పౌరాణికరత్న' మితి నామాంతరమస్తు తే సుకవిపరిషత్సు
శ్రీకన్యకామహేశీ సంస్థానాదరణలబ్ధసంస్కార !

అష్టాదశపురాణానాం తత్త్వం బోధయ సర్వథా
స్వదేశభాషావిజ్ఞాన వికాసిత హృదంతరః

మాతృదేవః పితృదేవో గురుదేవో నిరంతరమ్
శ్రీకృష్ణదేవ శ్రేయాంసి భూయాంసి త్వం లభస్వ చ

శ్రీమట్టుపల్లి వేంకట
శివగుప్తసుబ్బరాయగుప్తశ్చ
జీయాచ్ఛతంశతాయుః
పురాణవిజ్ఞానసకలవిభవాఢ్య

కోగంటి సీతారామాచార్యః

# శ్రీః ఆశంసనము

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్-

వేదగతములైన మహార్థములను పురాణరూపమున శిష్యుల కుపదేశించినాడు వ్యాసభగవానుడు. ఆ వేదార్థములు సర్వజనులకును సుబోధములగుటయే ఆమహర్షి తాత్పర్యము. ఆపురాణభారతీ మహాప్రవాహములతో భారతదేశము భారతీయసంస్కారమును పవిత్రమైనవి. అగుచున్నవి. కాగలవు.

పూర్వము అన్నిగ్రామములందును పురాణప్రవచనము నిరంతరము నిరంతరాయముగా సాగుచుండెడిదట. నా చిన్నతనమునందుకూడ శ్రావణము మొదలుకొని సంక్రాంతిపండుగవరకును పురాణప్రవీణులైనవారిచేత పల్లెసీమల ప్రజలు భారత భాగవత రామాయణములను శ్రీవిష్ణుపురాణ దేవీభాగవతాదులను చెప్పించి వినోదరూపమున వారిభక్తిని ప్రకటించుకొనెడివారు. ఈమధ్యకాలమున కొన్నిప్రాంతములలో ఆపురాణధార విచ్ఛిన్నమైనట్లు తోచును. పెద్దలు మరల పురాణప్రవాహములను దేశభాషలలో ప్రవహింపచేసి సర్వజనాహ్లాదమును కలిగింప పూనుకొనినారు

'పౌరాణికరత్న' శ్రీమట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారు అట్టివారు. వీరిప్రవచనము వీరిపద్ధతి అతివిలక్షణముగానుండును. వీరుమహాకృష్ణభక్తులు. వీరికిశ్రీకృష్ణసాక్షాత్కారము కలిగినదని వారును వారివారును పలుమారులు ముచ్చటింతురు. అదితప్పక నమ్మదగినది. ఆవాసుదేవానుగ్రహముతోనే ఈ బ్రహ్మవైవర్తమును తెలిగించుట ప్రవచించుటయును. వీరుఎన్నిరోజులైనను బ్రహ్మవైవర్తమును ప్రవచింపగలరు. తన్మయులుకాగలరు. శ్రోతలను తన్మయులనుచేయగలరు. అట్టివాక్ఛక్తిని వాక్సిద్ధిని వారు వాసుదేవనిర్హేతుకజాయమాన కటాక్షముచేత సంపాదించుకొన్నారు. కావుననే పౌరాణికరత్న' బిరుదు వారినిస్వయముగావరించినది

వాసుదేవతత్త్వమును మహాభారతోత్తరకృతియగు హరివంశము, పారమహంస్యమై మహాపురాణమగు శ్రీమద్భాగవతము బహు

ముఖములుగా కీర్తించుచున్నవి. అవిగాక శ్రీకృష్ణతత్త్వమును చక్కగా అనుభవించిన గర్గాచార్యులు కృపచేసిన గర్గసంహితకలదు.

సాధారణముగా పురాణములయందు శ్రీకృష్ణతత్త్వము గోచరించుచునే యుండును. కాని బ్రహ్మవైవర్తమునందలి వాసుదేవతత్త్వము ఈగుప్తగారి హృదయమును వాకర్షించినది. ఈపురాణమునందు ఎందరో దేవతలు ఎన్నియో మంత్రములు, ఎన్నియో కవచములు, ఎన్నియో స్తోత్రములు, ఎన్నియో ఉపాసనాభేదములు ఎన్నెన్నియో కలవు. ఈ నానావిధమంత్రకవచస్తోత్రోపాసనా భేదములు, దేవతాభేదములు, అన్నియు బ్రహ్మయొక్క వివర్తస్వరూపములు. 'సర్వంఖల్విదం బ్రహ్మ'కు బ్రహ్మవైవర్తము విపులమైన సుబోధమైన సులలితమైన భాష్యమువంటిది. ఇది బహుకాలసాహిత్యశాస్త్రాధ్యయనాదులచేత గుప్తగారికి దక్కినదికాదు. కేవలవాసుదేవప్రసాదలబ్ధము. కావున గుప్తగారిహృదయగుప్తమైనతత్త్వము బ్రహ్మవైవర్తముగా ఆంధ్రులకు దక్కినది. ఇకముందుకూడ దక్కనున్నది

వీరు శ్రోతలనుండి ద్రవ్యమపేక్షింపరు. అనపేక్షితముగా సత్తములైనవారు సమర్పించిన ద్రవ్యమును పురాణముద్రణమునకే వెచ్చింతురు. అర్థనిరపేక్షముగ ప్రవచించువారు మహాభాగవతులేకదా!

చిత్రమేమనగా వీరిలౌకికప్రవృత్తి వ్యాపారము. ఆంతరవ్యాపారము వాసుదేవతత్త్వవ్యాఖ్యానము. ఇట్లుపరస్పరభిన్నములైన రెండుప్రవాహములను మనము వీరియందు గ్రహింపవచ్చును. ఇట్టి నిష్కామయోగులైన గుప్తగారు ఇట్లే పదునెన్మిది పురాణములను తెనిగించి ప్రవచించి తెలుగుదేశమునకు ధన్యత చేకూర్తురుగాకయని ఆశంసింతును.

వీరి అనువాదము యథామూలమనుటకుగాని కాదనుటకుగాని వీలులేనిది. బ్రహ్మవైవర్తము ప్రతిశ్లోకానువాదవిస్తృతముగాక ఒకవిధమైన క్లిప్తరూపము. వీరు అనాస్వాదిత సంస్కృతభాషులయ్యు ఆస్వాదితపూర్వులవలె పలుకుట ఆశ్చర్యకరము వీరికి పరోపకారతత్పరతయుమెండు. ఇట్టి వీరు ఈ ఆంధ్రబ్రహ్మవైవర్తమును శ్రీనివాసునకు సమర్పించి కృతార్థులైనారు. పురాణకన్యయు శ్రీనివాసుని దక్క మరెవ్వరిని వరించును!

ఈవిధముగా నర్వము భగవదంకితముగా భాగవతహృదాయాహ్లాదకము గావించు వీరు శతాయుష్మంతులై సమానుల నుత్తమ శ్లోకులై పురాణోప పురాణములను బహుధా ప్రచారముచేసి తాము తరించి లోకమును తరింప జేయగలరని నమ్ముచున్నాను.

ఇట్లు

కోగంటి సీతారామాచార్యులు.

ఆర్ష కవిశిరోమణి, విద్వాన్

## శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు, M. A. ట్రిబుల్

శతాధిక గ్రంథకర్త, కాకినాడ.

### గుప్తగారికి - ఆశీస్సులు

మొన్న ఒకాయన దగ్గర మీ శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణము ప్రకృతిఖండము చూడ తటస్థించినది. అందలి ఉపోద్ఘాతమును జదివి చాల సంతసించితిని. మీరెంత ధన్యులో యనిచాలా ఆనందించితిని.

ఆ ఆనందముతో మిమ్ము అభినందింపకుండ నుండలేక యీ లేఖ వ్రాయుచున్నాను. మీరు చాలా గొప్పపని చేయుచున్నారు. మీ జన్మ ధన్యము. ఎందఱనో ధన్యుల జేయుచున్నారు.

నేను బ్రహ్మవైవర్తమును పద్యములలో నాంధ్రీకరింపవలెనని మూలము (నాగరలిపిలో) తెప్పించి యుంచితిని ఇక నేను మరల వ్రాయవలసిన అవసరములేనట్లు మీరు చక్కగ వ్రాసితిరి. మీకు నా హృదయపూర్వక అభినందనలు, ఆశీస్సులు. నావయస్సు అరువది మూడు (౬౩) కనుక ఆశీర్వదించు అర్హత కలదనుకొందును. మీ మహాపురాణము త్వరలోనే యగుగాక!

భవదీయుడు

బులుసు వేంకటేశ్వర్లు, యమ్. ఎ. (ట్రిబుల్)

# ఆంధ్రీకృత బ్రహ్మవైవర్తపురాణ ప్రస్తుతి

శ్రీయుత మట్టుపల్లి శివసుబ్బరాయగుప్తగారు మంచి ప్రాచీన చైతన్య సంస్కారదీక్షితమైన భావప్రకాశముకల మహామనీషి ! వారు పూర్వజన్మ సుకృతపరిపాకముగ బ్రహ్మవైవర్తపురాణమును సులభశైలిలో వచనకావ్యముగ ఆంధ్రీకరించి ఆంధ్రజాతికర్పించినారు !

వారిచే బహూకరింపబడిన ఈమహాపురాణమును ఎంతో శ్రద్ధతో, తీవ్రాసక్తితో, అత్యంతాదరముతో సాంగోపాంగముగా నేను చదివి, మిక్కిలి సంతృప్తినిగాంచినాను.

అష్టాదశమహాపురాణములలో బ్రహ్మవైవర్తమున కొకవిశిష్టతకలదు. గోలోకవాసియైన శ్రీకృష్ణపరమాత్మయొక్క సృష్టి కభిముఖమైన పవిత్రసంకల్ప మహనీయతా కమనీయమే బ్రహ్మవైవర్తపురాణాంతర్గతవస్తువిశేషము.

ప్రస్తుతలోకమునందలి రచనాపద్ధతికి సంపూర్ణవ్యతిరేకమైన పురాణ రచనాపద్ధతిని, కావలెనని స్వీకరించి తదనుగుణమైన సరళపద్ధతిలో ఈమహా పురాణమును ఆంధ్రమహాప్రజలకు రుచిపుట్టించుచు రచించిన ఖ్యాతి వారిదే.

అనుభవజ్ఞానార్జనాసముద్దండ పండితులై శ్రీశివగుప్తగారు ఈబ్రహ్మవైవర్త పురాణాంధ్రీకరణమున ప్రస్తావింపబడిన అసంఖ్యాకములైన గణేశ్వర శ్రీదుర్గా శ్రీశివ శ్రీకృష్ణ శ్రీరాధా శ్రీమహాలక్ష్మి శ్రీసరస్వతీత్యాది మహామంత్రములను యథామూలముగా నొసంగుట వీరిరచనయందొక మహత్తరవిశేషము.

అంతేకాక గోలోకకృష్ణలీలావర్ణనము. శ్రీకృష్ణరూపమహత్త్వగుణ నిరూపణము, శ్రీరాధాధ్యానము మున్నగుఘట్టములలో శ్రీశివగుప్తగారి లేఖిని పురాణసుధాస్రవంతిగా ప్రవహించి రచయితను, పఠితలను ధన్యుల నొనర్చినదనిన అతిశయోక్తి కాదు.

ప్రకృతిఖండమందలి నలుబదియేడవ అధ్యాయమునందలి ఆదిగోమాత యగు సురభియుపాఖ్యానము, గణేశఖండమునందలి నలుబదిమూడవ యధ్యాయము నందలి గణపతి,పరశురామసంవాదము, గణపతి పరశురాముని తనతుండముతో బట్టి గోలోకమునకు గొంపోయి శ్రీకృష్ణదర్శనము చేయించుట మున్నగు

నుపాఖ్యానముల రచనమును పరిశీలించినపుడు శ్రీశివగుప్తగారి రచనా ప్రావీణ్యము సంతోషపారవశ్యము కల్గించును.

వారిపుడు మఱల అగ్నిపురాణమును అనువదించుచున్నారు. జనులను తమరచనములచే ఉద్రేకపఱచి అపమార్గమును పట్టించురచనలకు ప్రాధాన్యము నిచ్చు ఈసమకాలమున శ్రీశివసుబ్బరాయగుప్తగారు కలిమలప్రక్షాళనా రూపమైన పురాణానువాద రచనను చేపట్టి దీక్షతో కొనసాగించుట మిక్కిలి ప్రశంసనీయమగు శుభకార్యము,

పురాణరచన మొనరించుటేకాక పురాణ ప్రవచనముకూడా శ్రోతలకు భక్తితన్మయత్వములకల్గించునట్లు చేయగల్గుట శ్రీశివగుప్తగారిలోని విశిష్ట గుణము.

పవిత్రమూర్తియై, పవిత్రకార్యాచరణ సేవాపరాయణుడైన నిష్కళంక జీవనవ్రతుడైన శ్రీశివసుబ్బరాయగుప్తగారి ఈపావనరచనోద్యోగమును చిర కాలము సుస్థిరమగు నాశిషములొసంగి జగన్మాత, పరాశక్తి శ్రీకన్యకాపర మేశ్వరి మనుచునుగావుత.

కళాప్రపూర్ణ

ఆంధ్రసరస్వతి

**డా॥ ఊ. లక్ష్మీకాంతమ్మ**

కోరినంతనే తమ అమూల్యాభిప్రాయమును బంపిన సోదరీమణులు, కళాప్రపూర్ణ, ఆంధ్రసరస్వతి మొదలగు బిరుదాంచితులు నగుశ్రీమతి డా. ఊ. లక్ష్మీకాంతమ్మగారికి సహృదయపూర్వక నమస్సులు.

శివసుబ్బరాయగుప్త.

శ్రీ ర స్తు                    శుభ మస్తు

శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మ ఖండమున పూర్వార్థమును ముద్రించుటకుగాను శ్రీతిరుమల తిరుపతి దేవస్థానములవారు కడుఉదారతతో అయిదువేల **(5000)** రూపాయల భూరివిరాళము నొసంగి తోడ్పడిరి. ఈ యుపకృతికి కృతజ్ఞుడను.

'పౌరాణికరత్న'

మట్టుపల్లి శివసుబ్బరాయగుప్త.

# విషయసూచిక

# మంత్ర స్తోత్ర కవచ సూచిక

# చిత్రసూచిక

## : వర్ణ చిత్రములు :

శ్రీ ర స్తు ఓం నమః శు భ మ స్తు

శ్రీ గణేశ్వరాయ నమః

# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము

## శ్రీకృష్ణ జన్మఖండము

### మొదటి అధ్యాయము

### శ్రీనారాయణఋషి శ్రీనారదమహర్షికి విష్ణువైష్ణవమాహాత్మ్యమును వివరించుట.

మంగళాచరణము

ఓం నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్ ॥

పరమపురుషుడు, అంతర్యామియు నగునారాయణునకు, నరశ్రేష్ఠుడైన నరునకు, వీరిర్వురి దివ్యలీలలను సదా ప్రకటించు సరస్వతీదేవికి, ఆ దివ్యలీలలను గాన మొనరించు వ్యాసదేవునకు నమస్కరించెదను. పిమ్మట జయమును బలుకవలెను.

నారదుడు పలికెను :

శ్రీమన్నారాయణ ఋషీంద్రా! నేను ప్రథమమున బరమపూజ్యుడు, నాకు పితృదేవుడు నగు బ్రహ్మదేవుని ముఖారవిందమునుండి బ్రహ్మఖండ

మను దివ్యసంహితను శ్రవణ మొనరించితిని. తదనంతరము నాజనకుని యనుజ్ఞ గైకొని మీ పవిత్రాశ్రమమున కేతెంచి మీ యనన్యకృపవలన నమృతము కంటె మధురాతిమధుర మైనప్రకృతిఖండము నాకర్ణించితిని. పిమ్మట నేను జన్మములను సహితము ఖండ మొనరింపగల గణపతిఖండమును మీ దివ్య ముఖారవిందమునుండి యవధరించితిని. కానియెందులకో నామనస్సుతృప్తినొంద లేదు. ఈ ప్రసంగములకంటె నత్యంతవిశిష్ట దివ్యచరితము నాకర్ణింపవలెనని నే నభిలషించుచున్నాను. అందువలన మనుష్యుల జననమరణాదులను ఖండింప గల శ్రీకృష్ణ జన్మఖండమును విస్తారపూర్వకముగ వర్ణించి నన్ను ధన్యునిగా జేయుడని ప్రార్థించుచున్నాను. దేవా! ఆ శ్రీకృష్ణ దివ్యచరితము సమస్త తత్త్వప్రకాశకము, కర్మబంధనాశకము, హరిభక్తిప్రదాయకము, తత్కాల వైరాగ్యజనకము. సాంసారికవిషయాసక్తినివారకము, ముక్తిబీజమునకు కార ణము, భవసాగరమును దరింపజేయు నేకైకసాధనము. హరికథాశ్రవణము కర్మభోగరూపము లైనరోగములను నశింపజేయుగల రసాయనము, శ్రీకృష్ణ చరణారవిందములను బొందుటకిది సోపానమువంటిది. హరినామసంకీర్తనమే వైష్ణవభక్తులకు జీవనము. శ్రీకృష్ణదివ్యరూపగుణవర్ణనము మూడులోకము లను బవిత్ర మొనరింపగలదు. జితేంద్రియా! నేను నీచరణముల నాశ్రయించిన శరణాగతభక్తుడను, నీశిష్యుడను. అందువలన గృపాపూర్వకముగ నాకు శ్రీకృష్ణజన్మఖండమును సాంగోపాంగముగ వినిపింపవలసినదిగ బ్రార్థించు చున్నాను.

ఎవరిప్రార్థనల నాలకించి పరిపూర్ణుడు, పరమేశ్వరుడు నగుశ్రీకృష్ణ పరమాత్మ తనసంపూర్ణాంశలతో బవిత్రభారతవర్షమం దావిర్భవించెను! శ్రీకృష్ణునకే తండ్రి యగుసౌభాగ్యమును బొందినవసుదేవు డెవ్వరు! జగము లకే జనకు డైనయాపరంధామునిమాతృదేవత యైనదేవకి యెవ్వరు! ఏవంశమం దాసచ్చిదానందవిగ్రహు డాత్మమాయద్వారమున నవతరించెను! శ్రీహరి యేదివ్యరూపముతో నాపుణ్యభూమిపై ననేకము లైన యద్భుతలీలల నొనరించెను! భయమునకే భయము గొల్పువాడు, కాలమునకే జనకుడును నగునా దేవాదిదేవుడు కేవలము కీటకమువంటికంసునకు భయపడి గోకులమునకు వెడలుటయందు గలరహస్య మేమి! శ్రీకృష్ణపరమాత్మ గోపవేషధారియై గోకులమం దే యద్భుతలీలలను బ్రదర్శించెను? యోగేశ్వరేశ్వరు డైన జగదీశ్వరుడు గోపాంగనలతో విహరించుటయందు గలరహస్య మేమి!

శ్రీకృష్ణునిదివ్యసచ్చిదానందవిగ్రహమును ప్రాకృతికచక్షువులతో వ్రజభూమి యందు దర్శించి, సేవించి ధన్యులైనగోపకుమారులు గోపికలు నెవ్వరు? జగదానందకరుడు, విశ్వముల నుదరమందు ధరించినవాడు నగునా దేవాదిదేవుని పాలించి పెంచిన యశోద యెవ్వరు? పరమాత్మకు దండ్రియై తరించిన నందు డెవ్వరు! ఈరహస్యముల నన్నింటిని విపులీకరింపవలసినదిగ ప్రార్థించుచు న్నాను. శ్రీకృష్ణునే కుమారునిగ బడసి, యాపరబ్రహ్మ మొనరించుదివ్యబాల్య క్రీడలను స్వయముగ గాంచిన యశోదానందు లేతపము లొనరించిరి? శ్రీకృష్ణ ప్రాణాధికయు, పుణ్యవతియు నగురాధ యేకారణమువలన వ్రజమందు గోప కన్యకయై యావిర్భవించెను! గోపికలే యారాధనచే దురారాధ్యు డైనపరమేశ్వరుని బొందిరి? జగన్నాథు డనన్యభక్తులైనవ్రజవాసులను వీడి మధుర కేలవెడలిపోయెను? మహాభాగా! పృథ్వీభారమును దొలగించి శ్రీకృష్ణు డెట్లు గోలోకపరంధామమునకు వెడలిపోయెను? అఖండ పుణ్య ప్రదములు, సర్వపాపములనెడి యింధనములకు అగ్నికీలలు, దివ్య గోలోకపరంధామగమనమునకు సోపానములు నగు నాలీలాకథాప్రసంగములను నా కుపదేశించి నన్ను జననమరణచక్రమునుండి ముక్తుని గావింపుడు. శ్రీహరి కథాశ్రవణ మత్యంతదుర్లభము, భవసాగరమును దరించుటకు నౌకాసదృశము, ప్రారబ్ధ మనెడు మహావృక్షమూలములను ఛేదింప గలకుఠారము, స్వయంకృత పాప మనెడు ఇంధనరాశిని దహించు ప్రజ్వలితాగ్నిశిఖాసదృశము. ధర్మ నందనా! మీ రుపదేశించు హరికథాశ్రవణ మనేకజన్మసముపార్జిత పాపపుంజ ములను నశింపజేయగలదు. భగవంతుని దివ్యకథ శోకసాగరమును దరింప జేయగల యేకైకశక్తి. హరినామసంకీర్తనము శ్రవణ మొనరించు గర్ణముల కమృతోపమానమై యుండును. సకలజపములు, తపములు, దానములు, తీర్థ స్నానములు, దైవారాధనలు, వేదపాఠములు, అనశనవ్రతాదులు, దైవ దర్శనములు, సర్వయజ్ఞదీక్షాగ్రహణము మొదలగు సత్కర్మాచరణములవలన మనుష్యునకు లభించు ఫలము లన్నియు హరిభక్తిజ్ఞానదానఫలములందు బదునారవయంశకుగూడ సరిరావు. కావున శ్రీమన్నారాయణ యతీంద్రా! నిన్నాశ్రయించిన నాకు శ్రీహరిదివ్యచరితము నుపదేశించి నా జన్మమును సఫలమొనరింపుము. అమృతసముద్రమును దరిజేరినవా రెవ్వ రైన నితరవస్తువుల నాస్వాదింపనెంచెదరా!

శ్రీ నారాయణ ఋషి పలికెను :

బ్రహ్మకులోద్భవా! పరమపవిత్రచరిత్రా! నారదమహర్షీ! నీ జీవనము ధన్యము. త్రిలోకములను పునీతమొనరించుటకే పరమవైష్ణవుడవైన నీవు చతుర్దశభువనములయందు హరినామసంకీర్తన ప్రచార మొనరించుచు చరించుచున్నావు. దేహధారిపలుకుల ననుసరించి తత్కాలమందే వాని హృదయమును గ్రహింపవచ్చును. గదాధరున కనన్యభక్తుడవైన నీవు శ్రీహరి కథాస్రవంతియందు స్నానమాడి పవిత్రుడవై జీవన్ముక్తుడవు కాగలవు. హరిభక్తుడవైన నీ చరణరజమువలన పృథ్వి నిశ్చయముగ పవిత్రము కాగలదు. శ్రీకృష్ణ దివ్యలీలాపరిసంగములు పరమానందదాయకములు, పరమమంగళకరములు: శ్రీకృష్ణకథాప్రసంగములు, హరినామ సంకీర్తనములు ప్రతిధ్వనించు నా పవిత్ర స్థలమున సకలదేవతలు, పుణ్యతీర్థములు నుండును. శ్రీకృష్ణుడు రాధా సహితుడై నివసించును. అసంఖ్యాక జన్మలయం దనేక పుణ్యకర్మల నొనరించి పవిత్రుడైనజీవుడే యీ పవిత్రభారతవర్షమందు జన్మింపగలడు. అనేకజన్మ సముపార్జిత పుణ్యఫలప్రభావమువలన నా దేహధారి శ్రీకృష్ణసంకీర్తన మొనరించుచు దివ్యహరికథాశ్రవణ మొనరించి జన్మరహితుడు కాగలడు.

అర్చనం వన్దనం మన్త్రజపం సేవనమేవ చ ।
స్మరణం కీర్తనం శశ్వ ద్గుణశ్రవణమీప్సితమ్ ॥
నివేదనం స్వస్య దాస్యం నవధాభక్తిలక్షణమ్ । 33-34

భగవంతుని బూజించుట, వందనముల నర్పించుట, దివ్యమన్త్రమును జపించుట, సేవించుట, స్మరించుట, కీర్తించుట, ఆత్మనివేదనము చేయుట, దాస్యభావముతో సేవ లొనరించుట — ఇవియే భక్తికిగల తొమ్మిది లక్షణములు.

నారదమహర్షీ! ఈ భక్తిలక్షణములను క్రమముగ ననుష్ఠాన మొనరించిన మనుష్యునకు నిశ్చయముగ జన్మరాహిత్యము కలుగును. ఆ భక్తునకు మార్గమున నెట్టివిఘ్నములు సంభవింపవు. ఆతడు గోలోకపరంధామవాసియై చిరంజీవి కాగలడు. గరుత్మంతుని సమ్ముఖమునకు సర్పములు రాజాలనట్లు, శ్రీహరిభక్తుని యెదుటకు కాలము రాజాలదు. అట్టి యనన్యభక్తుని సామీప్యమును శ్రీహరి యొక్కక్షణ మైనను వీడలేదు. అణిమాద్యష్టసిద్ధు లాభాగవతోత్తముని సేవలయం దుపస్థితములు కాగలవు. శ్రీకృష్ణుని యాజ్ఞచే నట్టి

భక్తుని రక్షించుటకు సుదర్శనచక్ర మహర్నిశములు వానివెన్నంటి భ్రమించు చుండును. ఎంతటివారైనను భగవద్భక్తు నేమిచేయగలరు ! ప్రజ్వలితాగ్నిని గాంచి శలభములు పారిపోవునట్లు భగవద్భక్తుని గాంచి యమదూతలైనను వినీతులై తొలగిపోయెదరు. హరిభక్తునిజూచి నిశ్చయముగ మహర్షులు, మహావిద్యులు, సిద్ధులు, సకలదేవతలు సంతుష్టులయ్యెదరు. సర్వధర్మములను బరిత్యజించి శ్రీకృష్ణునే శరణువేడినభక్తు డాభక్తవత్సలుని యనుగ్రహమునకు బాత్రుడై సర్వత్ర సుఖియై నిశ్శంకుడై నివసింపగలడు. నారదా ! శ్రీకృష్ణకథాశ్రవణమందు నీ కత్యంతానురాగము కలదు. ఎందుల కుండదు ! తండ్రి స్వభావ మవశ్యముగ బుత్రునందు బ్రకటితమగును. విప్రశ్రేష్ఠా ! బ్రహ్మసంభవుడ వైననిన్ను నే నేమని ప్రశంసింపగలను ! ఎవ రెట్టివంశమందు జన్మించెదరో వారిబుద్ధి యావంశానుసారముగనే యుండును. నీజనకుడు శ్రీకృష్ణచరణారవిందములను సేవించియే విధాతపదమందు బ్రతిష్ఠితుడైనాడు. బ్రహ్మదేవుడు నిరంతరము తొమ్మిదివిధములైనభక్తియోగములచే శ్రీకృష్ణారాధనయందు నిమగ్నుడై యుండును.

శ్రీకృష్ణకథాసంకీర్తనమందనురాగయుక్తుడై హరినామశ్రవణ మాత్రముననే యానందబాష్పనయనములతో బులకితగాత్రుడై హరినామము నుచ్చరించువానినే విద్వాంసులు నిజమైనభక్తు డందురు. మనోవాక్కాయకర్మలచే సర్వమును శ్రీహరిమయముగ గ్రహించువానినే విద్వాంసులు భక్తు డందురు. సమస్తజగత్తును శ్రీకృష్ణమయముగ నెంచి హరినామసంకీర్తనమందు సంలగ్నుడై యుండు భక్తిజ్ఞానసంపన్నునే బుధజనులు వైష్ణవభక్తు డనికీర్తింతురు. నిర్జనస్థలములందుగాని, తీర్థములందుగాని, యాసక్తిశూన్యుడై పరమానందభరితుడై శ్రీహరి చరణారవిందములను సదా చింతించు నాతడే వైష్ణవుడు. భగవంతుని దివ్యనామగుణకీర్తనములను గాన మొనరించువారు, హరిమంత్రమును జపించువారు, హరికథలను శ్రవణ మొనరించువారు, శ్రీకృష్ణ చరితములను బ్రచార మొనరించువారు పరమవైష్ణవశిఖామణులు. మధురాతి మధురపదార్థములను సేకరించి శ్రీహరి ప్రసన్నతాపూర్వకముగ నివేదించిన నెవనిమన స్సత్యంతహర్షమగ్న మగునో అట్టి మనుష్యుడే జ్ఞానులందు శ్రేష్ఠుడైన పరమభక్తుడు. మనస్సును శ్రీహరిచరణారవిందములందు సంలగ్నమొనరించి జీవించుచు కేవలము బాహ్యశరీరముచే పూర్వజన్మకర్మఫలములను

అనుభవించువారే వైష్ణవులు. పుణ్యతీర్థములే పరమభక్తులదర్శన స్పర్శముల నభిలషించును. ఎందువలెననగ, తీర్థములకు పాపులస్పర్శచేత సంభవించిన పాతకములు భక్తజనులదర్శన స్పర్శనాదులచే నశింపగలవు. గోక్షీరదోహన సమయమువఱకే ప్రదేశమున శ్రీహరిభక్తుడు వసించునో ఆప్రదేశమందు సకల తీర్థములు నివసింపగలవు. తులసీవనమందు, గోశాలయందు, శ్రీకృష్ణమందిర మందు, బృందావనమందు, హరిద్వారమందు, పవిత్రగంగయందు, మరణించిన మనుష్యునకు పరంధామము లభించునట్లు పరమవైష్ణవుడు వసించిన స్థలమున మరణించిన దేహధారికి బరంధామము లభింపగలదు.

హృషీకేశభగవానునిగాని, ఆయన భక్తులనుగాని నిందించు వారికి నూరుజన్మల సముపార్జిత పుణ్యమంతయు నిశ్చయముగ నశింపగలదు. వైష్ణవ భక్తుని స్పర్శమాత్రముననే పాతకి యైనమనుష్యు డాపాతకమునుండి విముక్తుడు కాగలడు. పాపాత్ములస్పర్శమువలన భక్తుల కేపాతకములు సంక్రమించునో వారిహృదయములందు విరాజమానుడై యున్న మధుసూదను డాపాపపుంజముల నవశ్యముగ నశింపజేయును. బ్రాహ్మణోత్తమా! శ్రీహరి దివ్యజన్మప్రసంగమును వర్ణించెదను. సావధానచిత్తుడవై యవధరింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్తమహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున విష్ణువైష్ణవమాహాత్మ్యకథన
మను మొదటి అధ్యాయము
సంపూర్ణము.

# రెండవ అధ్యాయము

## విరజాదేవి నదీరూపమును ధరించుట.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

బ్రహ్మకులసంభవా! నారదా! భూభారమును దొలగించుటకు, దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుటకు శ్రీకృష్ణభగవాను డెవరి ప్రార్థనలను మన్నించి యీ యవనికి దిగివచ్చెనో, ధరాతలములో నాజగన్నాథు డేయేదివ్యలీల లొనరించి యే యేమహత్కార్యముల నొనరించి తననిలయమునకు ప్రస్థాన మొనరించెనో వానిని సవిస్తరముగ వర్ణించెదను, సావధానచిత్తుడవై యవధరింపుము. శ్రీహరి గోపవేషధారియై గోకులములో నవతరించెను. శ్రీరాధ గోపికగా ధరాతలముపై నవతరించినవిధమును ప్రవచించెదను. పూర్వము శంఖచూడునివధాప్రసంగమును సంక్షేపముగ నవధరించితివి. ఇపుడు నే నాశంఖచూడవధకు గలకారణమును సవిస్తరముగ వర్ణించెదను. పూర్వము గోలోకములో శ్రీదామునకు శ్రీరాధకు కలహము సంభవింపగా రాధాశాపమునకు గురియైన శ్రీదాముడు శంఖచూడునిగ జన్మించెను. అవనిపై వ్రజములో వ్రజాంగనవై మానవస్త్రీవలె సంచరింపు మని శ్రీరాధకు శ్రీదాముడు ప్రతిశాపము నొసంగెను. శ్రీదామునిశాపమునకు భీతిల్లి శ్రీరాధ శ్రీకృష్ణుని సమీపించి యిట్లుపల్కెను. "భవభయభంజనా! శ్రీదామునిశాపమువలన నాకు గోపీరూపము సంప్రాప్తించును. నిన్ను వీడి నే నెట్లుజీవింపగలను ? నీవు లేనినా కొకక్షణము నూఱుయుగములతో సమము. కనురెప్పపాటుకాలమైనను నీతో నాకు విరహము సంభవించిన నామనస్సు దగ్ధముకాగలదు. నాథా! శరత్కాలములో బూర్ణిమనాటి చంద్రునిబోలిన నీపూర్ణముఖముయొక్క సుధను నాచక్షుశ్చకోరములద్వా రమున నహర్నిశము పాన మొనరింపవలె ననినాయభిలాష. శ్రీకృష్ణా! నీవే నాయాత్మవు, నామనస్సు, నాప్రాణము. నేను కేవలము దేహమునుమాత్రము వహించుచున్నాను. నీవే నాదృష్టిశక్తివి, నీవే నానయనములు, నాజీవనము, పరమధనము. జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందు సదా నామనస్సు నీయందే సంలగ్నమై యుండును. నేను నీపదపంకజములనే యెల్లప్పుడు స్మరించుచుండె దను. ప్రభూ! నీదాస్యసౌభాగ్యములేనిదే నేనొకక్షణకాలమైనను జీవింపలేను".

శ్రీరాధదేవి పల్కినవచనముల నాలకించి శ్రీకృష్ణు డామెను వక్షఃస్థలమునకు హత్తుకొని సమాధానపఱచి అభయము నొసంగి యిట్లు పల్కెను. "ప్రాణాధికప్రియా! భీతిల్లకుము. వరాననా! నీతో నేనుకూడ వరాహకల్పములో నవనిపై నవతరింపగలను. వ్రజమున కేతెంచి నేను నీతో వనములలో విహరింపగలను. ప్రేయసీ! నే నుండగా నీ కేలభయము?"

నారదా! జగన్నాథుడు నందగోకులమున కఱుదెంచుటకు గారణ మిదియె. (అనగా కంసుని భయమువలన కాదని భావము). నారదా! భయాంతకుడైన ఆయనకు కంసునివలన భయ మేమియుండును! ఆ ప్రభువు భయ మనెడు మిషతో మధురానగరమునుండి రాధాదేవి ననుగ్రహించుటకు గోకులము జేరెను. శ్రీభగవానుడు గోపవేషధారియై శ్రీరాధతో దనయనన్య భక్తులైనగోపగోపాంగనలతో విహరించి తనప్రతిజ్ఞను బాలన మొనరించెను. నారదా! బ్రహ్మదేవుని ప్రార్థనలవలన శ్రీకృష్ణభగవానుడు స్వయముగ మహీతలము పైకినేగుదెంచి భూభారమును దొలగించి తననిలయమునకు మఱలిపోయెను.

నా ర దు డు ప లి కె ను :

దేవా! శ్రీదామునకు, శ్రీరాధకు సంభవించిన కలహమును సంక్షేపముగ బ్రవచించితివి. ఇపు డాప్రసంగమును విస్తారపూర్వకముగ వర్ణింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! ఒకానొక సమయమున శ్రీహరి శ్రీరాధనుగూడి గోలోక ములో నిర్జనరాసమండలములో దివ్యలీలావిహారముల నొనరించెను. భగవంతుని మాధుర్యప్రేమలో శ్రీరాధ వివశురాలయ్యెను. ఆ గోలోకములోనే శ్రీరాధాసమురాలైనవిరజాదేవి యనుసౌభాగ్యవతి గలదు. ఆమె శతకోటి గోపసుందరీమణులకు నాయకురాలు, శ్రీకృష్ణప్రాణాధికప్రియురాలు. స్త్రీలలో ధన్యురాలు. మాన్యురాలు. దనపై బ్రగాఢానురాగముగల్గి తన్నే వీక్షించుచున్న విరజాదేవిని యనుగ్రహించుటకొఱకై శరచ్చంద్రనిభాననుడైన శ్రీకృష్ణభగవానుడు శ్రీరాధను వీడి విరజాదేవితో విహరింప నారంభించెను.

శ్రీకృష్ణప్రేమలో బరవశురాలైన శ్రీరాధ మేల్కాంచి తనచెంత కోటి కందర్పసుందరాకారు డైన ప్రాణవల్లభుని గానక దుఃఖితురాలయ్యెను. జగన్నాథుడు విరజాదేవితో విహరించుచున్నా డని రాధచెలు లామెకు విన్నవించిరి. అపుడు శ్రీరాధ యాగ్రహించి యొకదివ్యరథము నధిరోహించి విరజాశ్రీకృష్ణులు విహరించుచున్న దివ్యహార్మ్య ప్రాంగణమును జేరెను.

ఆ దివ్యరథము డిగ్గి శ్రీరాధ తనచెలులతో నంతఃపురమును బ్రవేశించుటకు యత్నింపగా ద్వారపాలకు డైన శ్రీదాము డనుగోపకుమారు డామె నడ్డగించెను. అపుడు గోపికలు లోపలకు బ్రవేశించుట కత్యంతకోలాహలముతో బ్రియత్నించిరి. ఈ కోలాహలము నాలకించి శ్రీకృష్ణుడు రాధ కోపముతో యేతెంచె ననిగ్రహించి యంతర్ధాన మయ్యెను. శ్రీకృష్ణు డంతర్ధాన మగుట గాంచి భయము నొంది విరజాదేవి యోగముద్వారమున శరీరత్యాగ మొనరించెను. ఆమె శరీరము సరిద్రూపమున బ్రవహించి గోలోకవరంధామమును జుట్టివేసెను. నానావిధ రత్నములకు నిలయమైన యావిరజానది కోటియోజన విస్తీర్ణమును దానికంటె నూఱురెట్లు పొడవునుగల్గి ప్రవహించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండమున నారదనారాయణ
సంవాదమున విరజానదిప్రస్తావవర్ణన
మను రెండవఅధ్యాయము
సంపూర్ణము.

## మూడవ అధ్యాయము

### శ్రీరాధా శ్రీదాములు పరస్పరము శపించుకొనుట.

**శ్రీ నారాయణ ఋషి పలికెను :**

పిమ్మట శ్రీరాధ అంతఃపురమును బ్రవేశించి శ్రీకృష్ణుని గానక నదీరూపమున బ్రవహించువిరజాదేవిని దర్శించి స్వగృహామునకు మఱలిపోయెను.

అపుడు శ్రీకృష్ణుడు విరజానదీతీరమున సాక్షాత్కరించి సరిద్రూప మైన తన ప్రియతమ సతిని గాంచి యిట్లుబల్కెను. "ప్రేయసీ! నీవు లేనిదే నే నెట్లు జీవింపగలను! సుందరీ! నా చెంతకు రమ్ము. నా యాశీర్వాదమువలన నదుల కధిష్ఠాత్రివికమ్ము. పూర్వరూపముకంటే నత్యంత సౌభాగ్య మైనసుందర రూపమును ధరింపుము".

శ్రీకృష్ణుని యాదేశానుసారముగ విరజాదేవి యత్యంతసౌందర్యరూపమును ధరించి శ్రీకృష్ణుని సమీపించెను. ఆవిభు డామెతో ననేక దివ్యక్రీడల నొనరించెను. భగవంతుని తేజస్సు విరజాదేవిలో బ్రవేశింపగా నామె కత్యంతమనోహరు లైనపుత్రు లేడుగు రుదయించిరి. వారే విధివశమున జననిశాపమునకు గుఱియై సప్తసముద్రములుగనైరి. ఇట్లు విరజాదేవితో శ్రీకృష్ణుడు యథేచ్ఛగా విహరించుట గాంచి రాధాదేవిచెలు లామెకు విన్నవించిరి.

చెలులు పల్కినపల్కుల నాలకించి శ్రీరాధ కోపముతో కోపమందిరమును బ్రవేశించెను. నారదా! రాధయలుకను దీర్చుటకు శ్రీకృష్ణుడు శ్రీదాముని దోడ్కొని యామెయంతఃపురమును జేరెను. శ్రీకృష్ణుని గాంచి కోపించి రాసేశ్వరి యైనరాధ యిట్లుబల్కెను. "కృష్ణా! నాకంటె ననేకు లగు కాంతామణులు నీకుగలరు. నావలన నీకే మిప్రయోజనము. నాకు భయపడి నీప్రేయసి యగువిరజాదేవి సరిద్రూపమును ధరించినది. నీ వానదీతీరముననే మందిరమును నిర్మించుకొని నివసింపుము. ఆమె నదియయ్యెను, గావున నీవు నద మగుట మిక్కిలి యుక్తము. నదీనదసంగమము యుక్తియుక్తముగ నుండగలదు. స్వజాతీయులు శయనభోజనాదులందు సుఖముగ నుండగలరు గదా!"

ఇట్లు నిష్ఠురవచనములను బల్కి శ్రీరాధ రోషయుక్తయై లక్షమంది గోపికలతో భూమిపై శయనించెను. అపుడు గోపిక లనేకవిధముల యామెను బరివేష్టించి యామెకు సపర్యల జేయదొడంగిరి. మందిరద్వారమున కోట్ల సంఖ్యలో దండముల ధరించి గోపికలు కావలికాయుచుండిరి. వారు శ్రీకృష్ణు డంతఃపురములో బ్రవేశించుటకు మార్గము నొసంగరైరి. ద్వారముకడ వేచి యున్న దనప్రాణేశ్వరు డైనశ్రీకృష్ణుని గాంచి శ్రీరాధ యత్యంతకర్కశముగ నిట్లుపలికెను. "కృష్ణా! విరజాకాంతా! నాసమక్షమునుండి మఱలి పొమ్ము.

శీఘ్రముగ పద్మావతిచెంతకు జేరుము. మనోహారిణి యైనరత్నమాల గృహ మునకుగాని, అసమానసౌందర్యవతి యైనవనమాలచెంతకుగాని పొమ్ము. నదీకాంతా! దేవేశా! దేవతలయాచార్యులకే ఆచార్యుడ వైనవాడా! నేడు నీ విషయ మంతయు నాకు విదితమైనది. తక్షణమే నాగృహ మును వీడిపొమ్ము. కృష్ణా ! దేవాదిదేవుడ వైనసీవు మానవునివలె బ్రవర్తించి తివి, కావున మనుష్యలోకములో గల వ్రజభూమిపై నవతరింపుము. సుశీలా! శశికళా! పద్మావతీ! మాధవీ! ఈధూర్తునివలన నేమిప్రయోజనము, వీనిని తక్షణమే పంపివేయుడు". రాధాదేవియాదేశముల నాలకించి గోపికలు శ్రీకృష్ణునితో నిట్లుపల్కిరి. "కృష్ణా! ఇపు డీస్థలమును వీడి పొమ్ము. రాధ శాంతించిన పిమ్మట మే మందఱము నీచెంత కఱుదెంచగలము. మఱికొందఱు గోపికలు'కృష్ణా ! నీవే రాధను ప్రేమించిన వాడవు. ఆమె నిన్ను వీడజాలదు, కాని యీక్షణ మీప్రదేశమునుండి మఱలిపొ"మ్మనిపల్కిరి. మునీశ్వరా ! మఱికొందఱు గోపికలు "కృష్ణా ! కోపించినరాధతో నీ కేమి ప్రయోజనము ! బృందావనమునకు జని శ్రీరాధాదేవికోపము సమసిపోవువఱ కచటనే యుండు"మని పల్కిరి. మఱికొందఱు "శ్రీరాధను శాంతింపజేయుట కేదైనను పాయ మాలోచించు" మనిరి. కొందఱు 'రాధను దర్శించుట కెవరుసమర్థు' లనికఠినముగ బల్కిరి. ప్రగల్భ లైనగోపికలు, "కృష్ణా ! ని న్నంతఃపురమున బ్రవేశింపనీయము. నీవికమఱలి పొ"మ్మనిరి. కొందఱు ప్రమదోత్తమ లైనగోపికలు శ్రీకృష్ణు నడ్డగించిరి. గోపిక లెన్ని నిష్ఠురవచనములను బల్కినను నాసర్వేశ్వరేశ్వరు డాగ్ర హింపక చిఱునవ్వులుచిందించెను. ఆ జగత్కారణకారణుడు గోపికలచే నిరోధింపబడి మఱలిపోగా శ్రీదాముడు కోపించి పరమేశ్వరి యైనరాధతో నిట్లు పల్కెను. "మాతా! విచారింపక నా యీశ్వరు నేల కటువచనములతో నొప్పించెదవు ! శ్రీకృష్ణు డెవరనుకొంటివి ! బ్రహ్మానంతశివాదుల కీశుడు, జగత్కారణ కారణుడు, నిర్గుణుడు, మాయకు, వాణికి, శ్రీమహాలక్ష్మికి, ఆద్యప్రకృతికి నీశ్వరుడు, స్వాత్మారాముడు నగునాపూర్ణకాము నేల నీవు పరుషోక్తులాడెదవు ! దేవీ ! ఆలోచించకయే యేల వ్యర్థముగ బెదరించెదవు ! ఎవనిని సేవించినందువలన నీవు సర్వదేవతలలో శ్రేష్ఠురాలవైతివో, యెవని పాదారవిందముల నర్చించినకారణమున నీవు సర్వులకు బరమేశ్వరివైతివో,

పరాశక్తివైతివో, కళ్యాణీ! ఆయనను దెలియక బల్కుచున్నావు. భ్రుకుటి విలాసమాత్రముననే శ్రీకృష్ణభగవానుడు నినుబోంట్లను కోట్లకొలది సంఖ్యలో సృష్టింపగల శక్తిసమన్వితుడు. ఆ నిర్గుణుని, దివ్యగుణ సమన్వితుని, సచ్చిదానందవిగ్రహుని దెలిసికొనలేకున్నావు. వైకుంఠపరంధామములో నా శ్రీహరి చరణారవిందములను శ్రీమహాలక్ష్మి దనసుదీర్ఘ కేశములతో నిరంతరము మార్జన మొనరించుచు భక్తిపూర్వకముగ సేవించుచుండును. సకలవిద్యాధిదేవత యగుసరస్వతీదేవి భక్తిసమన్వితయై అమృతోపమానము లైనసుందరస్తోత్రములతో నెల్లపు డెవనిని స్తుతించుచుండునో, మానవతీ! నీ వాయనను దెలియలేకున్నావు. సర్వబీజస్వరూపిణి యైనప్రకృతిమాత భీతయై అనన్యభక్తితో నే పురుషోత్తముని ప్రార్థించునో, ఓ భామినీ! నీ వాభగవంతుని దెలియలేకున్నావు. భామినీ! ఎవని మహిమలలో కేవలము షోడశకళనుమాత్రమే సకలవేదశాస్త్రములు ప్రస్తుతింపగల్గుచున్నవో, అవి యెవనిని బరిపూర్ణముగ వర్ణింపలేకున్నవో, అట్టి శ్రీకృష్ణపరమాత్మను నీవు తెలియలేకున్నావు. వేదములకుజనకుడు జగద్విధాత, విభుడు, చతుర్ముఖుడు నగుబ్రహ్మ అనన్యభక్తితో నెవనిచరణాంభోజములను సేవించుచు స్తుతించుచుండునో, బరమయోగులకు గురువు, బంచవక్త్రసమన్వితుడు నగుశంకరుడు బులకితగాత్రుడై సాశ్రుపూర్ణనయనములతో నెవనిచరణారవిందములను భక్తితో స్తుతించుచు సదా సేవించుచుండునో, సహస్రవదను డైనఆదిశేషు డేసర్వేశ్వరేశ్వరునిచరణకమలములను సదా భక్తితో స్తుతించుచు సేవించుచుండునో; సర్వపాలకుడు, సర్వసాక్షియు, సర్వజగత్పతియు నగుధర్మదేవత యేదేవాదిదేవునిపాదారవిందములను ముదముతో, భక్తితో సదా సేవించుచుండునో; స్వయముగ విభుడు, సర్వరక్షకుడు, శ్వేతద్వీపవాసియు నగుశ్రీవిష్ణుభగవాను డెవనియంశసంభవుడో, ఏదేవు డోంకార మనెడిదివ్యనామమును ధరించెనో; సురాసురమునీంద్రులు, మనువులు, మానవులు, బుధజనులు సదా సేవించినను నెవనిపాదారవిందములను స్వప్న మందైనను దర్శింపజాలరో, ఆపరంధాము డైనశ్రీకృష్ణునిదివ్యపాదారవిందములను రోషమును బరిత్యజించి భజించి శరణువేడుము. నాప్రభు వైనశ్రీకృష్ణభగవానుడు భ్రుకుటివిలాసమాత్రముననే సకలసృష్టిని నిర్మించి రక్షించి హరింపగలడు. బ్రహ్మదేవుని యొక్క దినములో నిరువది యెనమండు

గురు ఇంద్రులు పతనమయ్యెదరు, అట్టి దినములతో బరిపూర్ణము లైన నూటయెనిమిదిసంవత్సరములా బ్రహ్మదేవునిపరిపూర్ణాయుర్దాయము. ఆజగద్విధాత యగుబ్రహ్మకూడ శ్రీకృష్ణుని నిమేషకాలములోనే పతనమగు నని గ్రహింపుము. మాతా! రాధా! సర్వేశ్వరు డైననాప్రభువును నీవుగాని, ఇతరులుగాని తెలిసికొనజాలరు."

కఠినములు, ఉజ్జ్వలములు నగుశ్రీదామునివచనముల నాలకించి రాసేశ్వరి రక్తాంభోరుహలోచనయు స్ఫురితాధరయు, ముక్తకేశియునై కోపముతో నిట్లుపల్కెను. "దుష్టుడా! మహామూఢుడా! నే జెప్పబోవుదాని నాలకింపుము. నీకు సర్వమును దెలియును గాని నీప్రభువునుగూర్చి దెలియదు. వ్రజాధమా! శ్రీకృష్ణుడు నీకు బ్రభువైన మాకుమాత్రము కాడా? శ్రీదామా! నీవు జనకుని స్తుతించుచు నీయస్తిత్వమునకు గారణస్వరూపిణి యైనజననిని నిందించితివి. దుర్మార్గులు, అసురులు నగువారు నిందించునట్లు నీవు నన్ను నిందించితివి, కావున నీ వసురుడవై యవనికి బొమ్ము. గోపకుమారా! ఈ దివ్యలోకమునకు దూరమై యవనిపై నసురుడవై జన్మింపుము. నా శాపమునుండి నిన్నెవరు రక్షింపగలరు?" నారదమునీంద్రా! రాధాదేవి శ్రీదాము నిట్లుశపించెను. దివ్యచిన్మయరత్నములచే నిర్మింపబడిన పిడులుగల వింజామరలతో గోపికారమణులు శ్రీరాధాదేవిని సేవింపనారంభించిరి, శ్రీరాధాదేవివచనముల నాలకించి శ్రీదాము డాగ్రహముచెంది స్ఫురితాధరములతో నిట్లుబల్కెను. "జననీ! నీవుకూడ మానవాంగనవలె నవనిపై నవతరింపుము. అంబికా! మానవులవలె క్రోధము నభినయించితివి, కావున నీవు ధరణిపై నొకమానవస్త్రీవలె నవతరింపుము. మాతా! నా శాపమును నీవనుభవింపక తప్పదు. పరాశక్తికే కళంక మాపాదించినట్లు జగతీతలములోని జ్ఞానహీనులైనమానవులు నీఛాయారూపమును గాంచి (నీవే యనిభ్రమించి) నిన్ను రాయణపత్ని యనియందురు. అవనిపై బృందావనములో జన్మింపనున్న రాయణుడు శ్రీహరియంశసంభూతుడు, మహాయోగి, వైశ్య శ్రేష్ఠుడు. తల్లీ! నీవు గోకులములో శ్రీకృష్ణునిబొంది వివిధవనములలో నాపరమేశ్వరునితో విహరింపగలవు. నీకు శ్రీహరితో నూఱుసంవత్సరములు వియోగము సంభవించును. వియోగానంతర మాజగన్నాథుని మఱల నీవు పొందగలవు."

ఇట్లు శ్రీరాధకు బ్రతిశాప మొసంగి శ్రీదాముడు శ్రీహరిపురమునకు

జని శ్రీకృష్ణునకు బ్రణమిల్లి జరిగిన శాపవృత్తాంతము నంతటిని నివేదించి తనప్రభువును వీడి చనలేక పరిపరివిధముల దుఃఖింప నారంభించెను. అత్యంత దుఃఖముతో దనచరణారవిందముల పైబడి నమస్కరించుచున్న శ్రీదాముని యాదరించి జగన్నాటకసూత్రధారి యైనశ్రీకృష్ణపరమాత్మ యిట్లుబల్కెను. "వత్సా! ఇతరులచే జయింపబడని యసురేంద్రుడవై యవనిపై జన్మింపుము. కాల మాసన్నమైనంతనె శివునిత్రిశూలాఘాతమునకు గురియై యశాశ్వత మానవదేహమును బరిత్యజించి దివ్యదేహధారివై మఱల నన్ను జేరగలవు. ఏబదియుగములు ధరాతలమును బరిపాలించి నాయాశీర్వాదబలమువలన నీవు నన్ను జేరగలవు".

శ్రీకృష్ణునివచనముల నాలకించి శ్రీదాముడు దుఃఖించుచు దేవాది దేవా! నన్ను నీభక్తిరహితునిగ నొనరింపకుము. అసురజన్మలోగూడ నాకు నీపాదారవిందములపై ననన్యభక్తిని బ్రసాదింపు మనిప్రార్థించి పరమాత్మ పాదముల పైబడి ప్రణమిల్లి తన నిలయమునకు వెడలిపోయెను. గోలోక ధామమును వీడి చనుచున్న శ్రీదాముని గాంచి మాతృప్రేమతో శ్రీరాధ "కుమారా! నన్ను వీడిపోకు మనియు, నీ వెచ్చటకుజనుచున్నా" వనియు ననేక విధముల విలపించెను. శ్రీదాముడుకూడ తనతల్లిని వీడిచనలేక యనేక విధముల దుఃఖించెను. నారదా! ఆశ్రీదాముడే శంఖచూడునిగ ధరణి పైజన్మించి తులసికి భర్తయయ్యెను.

పుత్రవియోగశోకముతో దుఃఖించుచున్న శ్రీరాధతో శ్రీదాముడు మఱల గోలోకమును జేరగల డనిపల్కి శ్రీకృష్ణు డామె నూరడించెను. బ్రహ్మకులసంభవా! శంఖచూడునిగ జన్మించినశ్రీదాముడు కాలానుసారముగ మఱల గోలోకపరంధామమును జేరెను. నారదమునీంద్రా! శ్రీకృష్ణునితో గూడ శ్రీరాధ వరాహకల్పములో ధరణీతలముపై నవతరించి యనేకదివ్య లీలల నొనరించి సకలచరాచరజీవులను దరింపజేసెను. గోకులములో గలవృష భానుని గృహములో నాజగన్మాత వైశ్యకులమును బవిత్ర మొనరించుటకు బసిపాపగ సాక్షాత్కరించెను. దేవర్షీ! సర్వులకు వాంఛితము, సకలసారతత్త్వ స్వరూపము, బరమమంగళప్రదాయకము నగుశ్రీకృష్ణునిదివ్యచరితము నే నిట్లు వర్ణించితిని. శ్రీహరిదివ్యచరితశ్రవణము భవబంధములను ద్రెంచగలదు

జననమరణజరావ్యాధులను ఖండింపగలదు. కర్మనిర్మూలన మొనరింప గలదు. శ్రీకృష్ణభక్తిని, అలభ్యదాస్యసౌభాగ్యమును బ్రసాదింపగలదు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున శ్రీరాధాశ్రీదామశాపోద్భవ
మను మూడవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

## నాలుగవ అధ్యాయము

**వృథ్వీదేవతలతోగూడి బ్రహ్మలోకమునకు వెడలి తనకష్టములను దెలుపుట : బ్రహ్మ వా రందరితోగూడి కైలాసమునకు వెడలుట : అచటి నుండిబ్రహ్మశివధర్మదేవతలు వైకుంఠమునకు వెడలి, శ్రీహరి యాజ్ఞచే గోలోకమునకు వెడలుట : గోలోకవర్ణనము.**

నారదుడు పలికెను :

సకలవేదజ్ఞానసంపన్నా ! నారాయణఋషీంద్రా ! ఎవరిప్రార్థనల నాలకించి యేదివ్యకర్మ లొనరించుటకు శ్రీకృష్ణపరమాత్మ యవనిపై నవతరించెను ?

శ్రీ నారాయణ ఋషి పలికెను :

ప్రాచీనకాలమందు వరాహకల్పములో వసుంధర భరింపలేని యసుర భారముతో నాక్రాంతమయ్యెను. దుర్మార్గులు, దయారహితులు, హరిద్వేషులు విజృంభించి విధాత నిర్మించిన యత్యంతరమణీయసృష్టిని చీకాకు పఱచిరి. రాక్షసులభారముతో నత్యంతపీడితయై పృథ్వీ దేవతలతోగూడి బ్రహ్మలోకము జేరి బ్రహ్మను శరణువేడెను. ఆసమయమున ప్రకాశమాను

డగు బ్రహ్మదేవుడు కృష్ణ యను రెండక్షరములు గలదివ్యమంత్రమును ధ్యానించుచుండెను. జగత్స్రష్టను గాంచి పృథ్వీసహితముగ దేవతలు సాష్టాంగ దండప్రణామము లర్పించి దైత్యులదుష్కృత్యములను విన్నవించిరి. "ప్రభూ! సురల మైనమే మసురులదుష్కృత్యములకు గుఱియగుచున్నాము. వసుంధర యాపాపులభారమును భరింపలేకున్నది. నీవు జగత్స్రష్టవు. సర్వశక్తి సమన్వితుడవు, నిగ్రహానుగ్రహుడవు, మమ్ము, వసుంధరను నీసంకటమునుండి యుద్ధరింపుము." వారిప్రార్థనల నాలకించి ప్రసన్నుడై బ్రహ్మదేవుడు పృథ్వితో నిట్లుపలికెను. "పద్మలోచనీ! నీవెట్టివారిభారమును భరింప లేకున్నావో విశదీకరింపుము. నేను నీకష్టములను నివారించుటకు ప్రయత్నించె దను." వసుంధర తనదుఃఖమునకు గారణ మెవ్వరో బ్రహ్మకు దెలుప దొడంగెను.

పృథ్వి పలికెను :

జగత్పతీ! విశ్వాసపాత్రు లగుబంధువులకుదప్ప స్త్రీ తనక్లేశముల నెవ్వరికి విన్నవింపగలదు! జగత్పితా! నీవు నాకు జన్మమును బ్రసాదించిన తండ్రివి. నాకష్టములను నీకు విన్నవించెద నన్ను రక్షింపుము.

కృష్ణభక్తివిహీనా యే యే చ తద్భక్తనిన్దకాః ।
తేషాం మహాపాతకినామశక్తా భారవాహనే ॥

స్వధర్మాచారహీనా యే నిత్యకృత్యవివర్జితాః ।
శ్రద్ధాహీనాశ్చ వేదేషు తేషాం భారేణ పీడితా ॥

పితృమాతృగురుస్త్రీణాం పోషణం పుత్రపోష్యయోః ।
యే న కుర్వన్తి తేషాం చ న శక్తా భారవాహనే ॥

యే మిథ్యావాదినస్తాత దయాసత్యవిహీనకాః ।
నిన్దకాగురుదేవానాం తేషాం భారేణ పీడితా ॥

మిత్రద్రోహీ కృతఘ్నశ్చ మిథ్యాసాక్ష్యప్రదాయకః ।
విశ్వాసఘ్నః స్థాప్యహారీ తేషాం భారేణ పీడితా ॥

కళ్యాణయుక్తసామాని హరేర్నామైకమఙ్గలమ్ ।
కుర్వన్తి విక్రయం యే వై తేషాం భారేణ పీడితా ॥

జీవఘాతీ గురుద్రోహీ గ్రామయాజీ చ లుబ్ధకః ।
శవదాహీ శూద్రభోజీ తేషాం భారేణ పీడితా ॥

పూజాయజ్ఞోపవాసాం వ్రతానాం నియమస్య చ ।
యే యే మూఢా నిహన్తార స్తేషాం భారేణ పీడితా ॥

సదా ద్విషన్తి యే పాపా గోవిప్రసురవైష్ణవాన్ ।
హరిం హరికథాభక్తిం తేషాం భారేణ పీడితా॥   20-23

శ్రీకృష్ణభక్తివిహీనులు, శ్రీకృష్ణభక్తనిందకులు నగుమహాపాతకులభారమును వహించుటకు నే నసమర్థురాలను స్వధర్మాచారరహితులు, నిత్యకర్మహీనులు, వేదములందు శ్రద్ధలేనివారు నగువారిభారము వలన నేను పీడింపబడుచున్నాను. తలిదండ్రులను, గురువును, దారాపుత్రులను, ఆశ్రితవర్గమును బాలించి పోషింపని వారిభారమును వహించుటలో నే నసమర్థనై యున్నాను. పితృదేవా! అసత్యవాదులు, దయారహితులు, సత్యాచరణవిహీనులు, గురుదైవములను నిందించువారు నగుపాపులభారమును నేను వహింపలేకున్నాను. మిత్రద్రోహులు, కృతఘ్నులు, అసత్యసాక్షులు, విశ్వాసఘాతులు, ఇతరుల జీవనాధారములను హరించువారు నగుమానవుల భారమువలన నేను పీడింపబడుచున్నాను. కళ్యాణసూక్తులను, సామమంత్రములను, హరినామమును విక్రయించుపాపులభారమువలన నేను పీడింపబడుచున్నాను. జీవహింస నొనరించువారు, గురుద్రోహులు, గ్రామయాజకులు, లోభులు, శవములను గాల్చి జీవించువారు, శూద్రాన్నభోజులు నగుమానవుల భారమువలన నేను పీడింపబడుచున్నాను. గోవులను, బ్రాహ్మణులను, దేవతలను, వైష్ణవులను, శ్రీహరిని, శ్రీహరికథాసంకీర్తనమును, హరిభక్తిని ద్వేషించువారిభారముచే నేను పీడింపబడుచున్నాను. జగత్స్రష్టా! నాకష్టములను దొలగించు నుపాయము నుపదేశింపుడు.

పృథ్వీదేవతల ప్రార్థనల నాలకించి, యసురు లప్రతిహత మైనవరబలముచే నజేయు లని గ్రహించి, సకలదేవతలను, పృథ్విని తోడ్కొని బ్రహ్మమహేశ్వరు నాశ్రయించెను. హరుడు వీరందఱిని వెంటనిడుకొని శ్రీహరిని యాశ్రయించుటకు వైకుంఠపరంధామమును జేరెను. వైకుంఠము జన్మజరామృత్యురహితము. బ్రహ్మాండముల కూర్ధ్వభాగమున నప్రాకృతవ్యోమమం దున్నది. అసనాతనపరంధామముయొక్క యునికి బ్రహ్మలోకముపైన నూఱుకోట్ల యోజనములదూరములో నున్నది. దివ్యచిన్మయరత్ననిర్మితవైకుంఠధామ వర్ణనము కవీంద్రులకుకూడ నసంభవమే.

తే మనోయాయినః సర్వే సమ్ప్రాపుస్తం మనోహరమ్।
హరేరన్తఃపురం గత్వా తదృశుః శ్రీహరిం పురం ॥

రత్నసింహాసనస్థం చ రత్నాలంకారభూషితమ్ ।
రత్నకేయూరవలయరత్ననూపురశోభితమ్ ॥

రత్నకుణ్డలయుగ్మేన గణ్డస్థలవిరాజితమ్ ।
పీతవస్త్రపరీధానం వనమాలావిభూషితమ్ ॥

శాన్తం సరస్వతీకాన్తం లక్ష్మీధృతపదామ్బుజమ్ ।
కోటికన్దర్పలీలాభం స్మితవక్త్రం చతుర్భుజమ్॥

సునన్దనన్దకుముదైః పార్షదైరుపసేవితమ్ ।
చన్దనోక్షితసర్వాఙ్గం సరత్నముకుటోజ్జ్వలమ్ ॥

పరమానన్దరూపం చ భక్తానుగ్రహకాతరమ్ ।
తం ప్రణేముః సురేన్ద్రాశ్చ భక్త్యా బ్రహ్మాదయో మునే ॥

తుష్టువుః పరయా భక్త్యా భక్తినమ్రాత్మకన్ధరాః ।
పరమానన్దభారార్తాః పులకాఙ్కితవిగ్రహాః ॥ 55-61

మనోవేగసంపన్నులైన బ్రహ్మశివధర్మాదులు తీవ్రవేగముతో మనోహరవైకుంఠపరంధామమును జేరి శ్రీహరియంతఃపురమందు ప్రవేశించి యాకళ్యాణస్వరూపుని దర్శించిరి. శ్రీహరి దివ్యరత్నమయాలంకారములచే విభూషితుడై రత్నసింహాసనాధీశుడై దర్శన మొసంగెను. కరములందు భుజకీర్తులు, హస్తములందు కంకణములు, పాదములందు నూపురములు, కర్ణములందు రత్నకుండలములు ప్రకాశించుచున్నవి. ఆయన పీతాంబరములను ధరించి, గళమం దాజానులంబియైనవనమాలతో విభూషితుడై యుండెను. సరస్వతీప్రాణవల్లభుడైనశ్రీహరి శాంతభావముతో విరాజిల్లుచుండెను. లక్ష్మి భగవంతునిచరణారవిందములసేవయందు సంలగ్నయై యుండెను. శ్రీహరి కోట్లకొలదిమన్మధులలావణ్యముతో బ్రకాశించుచుండెను. ఆయన చతుర్భుజధారి, చిరునవ్వులు చిందులాడునెమ్మోము కలవాడు. సునందనందకుముదాదిపార్షదులు శ్రీహరిసేవలయందు సంలగ్నులై యుండిరి. ఆయన సర్వాంగములయందు చందనాక్షితలను ధరించి, శిరమున రత్నమయమకుటము నలంకరించుకొనియుండెను. ఆపరమానంద స్వరూపుడైనభగవంతుడు భక్తుల ననుగ్రహించుటకు వ్యాకులుడై కన్పడు

చుండెను. మునీశ్వరా! బ్రహ్మాదిదేవతలు భక్తిభావముతో భగవంతుని చరణములకు బ్రణమిల్లిరి. వారు శ్రద్ధాపూర్వకముగ శిరములను వంచి భక్తిభావముతో శ్రీమన్నారాయణుని స్తుతింపదొడంగిరి. ఆసమయమున వారందఱు పరమానందభారార్తులు, పులకితగాత్రులు నై భగవంతుని ప్రస్తుతింపదొడంగిరి.

బ్రహ్మ పలికెను:

నమామి కమలాకాన్తం శాన్తం సర్వేశమచ్యుతమ్ ।
వయం యస్య కలాభేదాః కలాంశకలయా సురాః ॥

మనవశ్చ మునీన్ద్రాశ్చ మానుషాశ్చ చరాచరాః ।
కలాకలాంశకలయా భూతా స్త్వత్తో నిరంజన ॥ 62-63

మేము ముగ్గుర మెవనివిభిన్నకళలమో, సమస్తదేవత లెవ్వనికళా కళాంశలనుండి యుద్భవించిరో అట్టిశాంతుడు, సర్వేశ్వరుడు, కమలా కాంతుడు నగునచ్యుతునకు నమస్కరించుచున్నాను. నిరంజనా! మనువులు, మునీంద్రులు, మానవులు, చరాచరప్రాణులు నీనుండియే నీకళాకళాంశలద్వార మున బ్రకటులైరి.

శంకరుడు పలికెను:

త్వామక్షయమక్షరం వా రామమవ్యక్తమీశ్వరమ్ ।
అనాదిమాదిమానన్దరూపిణం సర్వరూపిణమ్ ॥

అణిమాదికసిద్ధీనాం కారణం సర్వకారణమ్ ।
సిద్ధిజ్ఞం సిద్ధిదం సిద్ధిరూపం కః స్తోతుమీశ్వరః ॥ 64-65

దేవా! అవినాశివి, వికారరహితుడవు, ఆత్మారాములైనయోగిజనులు నీధ్యానమందే సంలగ్నులైయుందురు. నీ వవ్యక్తుడ వైనయీశ్వరుడవు. నీకు ఆది యనునది లేదు. కాని నీవు సర్వమునకు ఆదివి. నీస్వరూపము ఆనందమయము. నీవు సర్వస్వరూపుడవు. నీవు అణిమాదిసకలసిద్ధులకు గారణుడవు, సర్వులకు గారణుడవు, సకలసిద్ధిజ్ఞాతవు, దాతవు, సిద్ధిస్వరూపుడవు, అట్టినిన్ను స్తుతించుట కెవరుసమర్థులు.

ధర్ముడు పలికెను :

వేదే నిరూపితం వస్తు వర్ణనీయం విచక్షణైః ।
వేదేఽనిర్వచనీయం యత్తన్నిర్వక్తుం చ కః క్షమః ॥
యస్య సమ్భవనీయం యద్గుణరూపం నిరంజనమ్ ।
తదతిరిక్తం స్తవనం కిమహం స్తౌమి నిర్గుణమ్ ॥
బ్రహ్మాదీనామిదం స్తోత్రం షట్శ్లోకోక్తం మహామునే ।
పఠిత్వా ముచ్యతే దుర్గాద్ వాంఛితం చ లభేన్నరః ॥ 66-68

వేదములందు నిరూపింపబడినవస్తువునె విద్వాంసులు వర్ణింపగలరు. కాని వేదము లనిర్వచనీయ మనికీర్తించిన దానిస్వరూపము నెవరు వర్ణింపగలరు!

దేని కేవస్తువు సంభవనీయమో అది యావస్తువుగుణరూప మగును, అదియే దాని స్తుతి.

నిరంజనుడు (నిర్మలుడు), గుణరహితుడు, నిర్గుణుడు నగునాపరమాత్మను నే నేమని స్తుతింపగలను!

మహామునీ! బ్రహ్మాదులు స్తుతించినయీస్తోత్ర మారుశ్లోకములందు వర్ణితమైనది. ఈస్తోత్రమును బఠించువారు దుర్గమసంకటములనుండి ముక్తులై మనోవాంఛితఫలమును బొందగలరు.

దేవతలస్తుతుల నాలకించి శ్రీహరి వారితో నిట్లుపల్కెను. "దేవతలారా! మీరు మీకష్టములు తొలగుటకై గోలోకదివ్యపరంధామమును జేరి పరబ్రహ్మమైనశ్రీకృష్ణుని దర్శించి ప్రార్థింపుడు. మీవెంట లక్ష్మీసహితుడనై నేను వేంచేసెదను. శ్వేతద్వీపనివాసులైననరనారాయణులు, సరస్వతీదేవి మొదలగువారుకూడ గోలోకమున కరుదెంచెదరు. వీరివెనుక అనంతుడు, మాయ, కార్తికేయుడు, గణేశ్వరుడు, వేదమాతయగుసావిత్రి మొదలగువారు గోలోకమును జేరెదరు. గోలోకపరంధామమం దామూలప్రకృతిస్వరూపుడైనశ్రీకృష్ణపరమాత్మ గోపికలతో బరివేష్టితుడై రాధతో నివసించును. నారాయణుడు, శ్రీకృష్ణుడు, శ్వేతద్వీపవాసియగువిష్ణువు, ఈమూడురూపములు నేనే. బ్రహ్మాదిదేవత లందఱు నాకళలే. దేవాసుర

మనుష్యాదిజీవు లందఱునాకళాకళాంశలే. గోలోకమందు మాయభీష్టము సిద్ధింపగలదు."

తదనంతరము సకలదేవతలు పృథ్వీసహితముగ శ్రీమన్నారాయణునకు ననేకప్రణామము లర్పించి గోలోకయాత్రకై బయలుదేరిరి. ఆయుత్కృష్ట గోలోకము జన్మమృత్యుజరావ్యాధిరహితము. ఆయగమ్యలోకము వైకుంఠమున కూర్ధ్వభాగమున నేబదికోట్లయోజనములపై శ్రీకృష్ణునిసంకల్పముచే నావిర్భవించెను. ఆలోకము చిన్మయము, దివ్యము, అక్షరము. గోలోకమున కాధారము శ్రీకృష్ణ భగవానుడే. సకలదేవతలు శ్రీమన్నారాయణుని వరప్రభావమువలన గోలోకమును జేరిరి. గోలోకమందు ప్రవహించుచున్న పవిత్రవిరజానదీతీరమును దాటి శతశృంగపర్వతమధ్యమునం దున్నగోలోకరాసమండలమును దర్శించిరి. గోలోకమును, రాసమండలమును వర్ణించుట యత్యంతకఠినము. చిన్మయరత్నహర్మ్యములతో, కల్పవృక్షవనములతో, బృందాకాననములతో, మణిరత్నజటితవేదికలతో, సువర్ణమంటపములతో, సుగంధయుక్తజలసరోవరములతో, గోగోపగోపికాపార్షదులతో నలరారుచున్నది యాదివ్యగోలోకపరంధామము. శ్రీరాధాకృష్ణసదృశులైన యేబదికోట్లగోపకుమారులు, అసంఖ్యగోపికలు, రాసమండలమందు నివసించుచుండిరి. గోలోకము మండలాకారమున నుండెను. దానివిస్తారము కోటియోజనములు. సర్వకాలసర్వావస్థలయందు రాధాకృష్ణులదివ్యనామములను స్మరించి కర్మబంధములను నశింపజేసికొని భవసాగరమును దరించుభక్తులు గోలోకపరంధామమును నివాసస్థానముగ బొందెదరు.

దేవతలు దివ్యగోలోకమందలి చిత్రవిచిత్రములను దర్శించుచు, నాశ్చర్యాంతరంగులై యక్షయవటమును దాటి రాధాదేవిదివ్యధామమును జేరిరి. రాధాదేవి తనయంతఃపురమందు సఖులైనసుశీల, శశికళ, యమున, మాధవి, రతి, కదంబమాల, కుంతి, జాహ్నవి, స్వయంప్రభ, చంద్రముఖి, పద్మముఖి, సుధాముఖి, సావిత్రి, శుభ, పద్మ, పారిజాత, సర్వమంగళ, కాళిక, కమల, దుర్గ, భారతి, సరస్వతి, గంగ, అంబిక, మధుమతి, చంపకవతి, అపర్ణ, సుందరి, కృష్ణప్రియ, సతి, నందిని, నందన, మొదలగువారిచే బరివేష్టించియుండెను. నారదమహర్షీ ! గోలోకపరంధామముపైన మతి

రేయొకలోకము లేదు. ఊర్ధ్వభాగమంతయు గోలోకమే వ్యాపించియుండెను. ఆచిన్మయవ్యోమమున కథోభాగమున ప్రాకృతాకాశమందు సర్వజగములు నున్నవి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున గోలోకవర్ణనము
నాలుగవ అధ్యాయము
సంపూర్ణము

....o....

# ఐదవ అధ్యాయము

## శ్రీరాధాదేవి విశాలభవనవర్ణనము : బ్రహ్మాదిదేవతలు దివ్యతేజఃపుంజమును దర్శించి, తేజోమయు డగు వాపరమేశ్వరుని స్తుతించుట

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దివ్యగోలోకమును దర్శించి యాశ్చర్యచకితులై త్రిమూర్తులు రాధాదేవి దివ్యమందిరమును జేరిరి. మందిరమున నున్నద్వాదశద్వారములను దాటి త్రిమూర్తులు పార్షదులయాజ్ఞ గైకొని జగజ్జనని యగురాధాదేవియంతః పురమును బ్రవేశించిరి. నారదమహర్షీ! ఆప్రదేశమున వారత్యంతాద్భుత తేజఃపుంజమును దర్శించిరి. ఆదివ్యతేజము కోట్లకొలదిసూర్యులతో సమాన ముగ బ్రకాశించుచు సర్వత్ర వ్యాపించియుండెను. ఆపరబ్రహ్మతేజము సర్వ బీజము, ప్రాకృతికచక్షువుల కగోచరము. ఆ తేజస్స్వరూపమును దర్శించి త్రిమూర్తులు భక్తిభావముతో దలలువంచి యత్యంతశ్రద్ధతో ప్రణామము లర్పించిరి. ఆసమయమున పరమానందముచే వారినేత్రములనుండి యానందా శ్రువులు బ్రవహింపదొడంగెను. వారిసర్వాంగములు పులకించెను.

ఆ తేజస్స్వరూపు డైనపరమేశ్వరునకు నమస్కరించి ఆ దేవేశ్వరులు నిలుచుండి భగవంతుని ధ్యానించుచు ఆ తేజస్సమ్ముఖమునకు నేతెంచిరి. నారదా! బ్రహ్మారెండుహస్తములను ముకుళించి దక్షిణపార్శ్వమందు శివుని, వామపార్శ్వమందు ధర్మదేవతనునిడుకొని భక్తిసమన్వితుడై పరాత్పరుడు, గుణాతీతుడు, పరమాత్మయు, జగదీశ్వరుడు నగువాకృష్ణుని స్తుతించెను.

బ్రహ్మోవాచ:

వరం వరేణ్యం వరదం వరదానాం చ కారణమ్ ।
కారణం సర్వభూతానాం తేజోరూపం నమామ్యహమ్ ॥

మఙ్గలం మఙ్గలానాం చ మఙ్గలం మఙ్గలప్రదమ్ ।
సమస్తమఙ్గలాధారం తేజోరూపం నమామ్యహమ్ ॥

స్థితం సర్వత్ర నిర్లిప్తమాత్మరూపం పరాత్పరమ్ ।
నిరీహమవితర్క్యం చ తేజోరూపం నమామ్యహమ్ ॥

సగుణం నిర్గుణం బ్రహ్మ జ్యోతిరూపం సనాతనమ్ ।
సాకారం చ నిరాకారం తేజోరూపం నమామ్యహమ్ ॥

తమనిర్వచనీయం చ వ్యక్తమవ్యక్తమేకకమ్ ।
స్వేచ్ఛామయం సర్వరూపం తేజోరూపం నమామ్యహమ్

గుణత్రయవిభాగాయ రూపత్రియధరం పరమ్ ॥
కలయా తే సురాః సర్వే కిం జానన్తి శ్రుతేః పరమ్ ॥

సర్వాధారం సర్వరూపం సర్వబీజమబీజకమ్ ।
సర్వాన్తకమనన్తం చ తేజోరూపం నమామ్యహమ్ ॥

లక్ష్యం షడ్గుణరూపం చ వర్ణనీయం విచక్షణైః ।
కిం వర్ణయామ్యలక్ష్యం తే తేజోరూపం నమామ్యహమ్ ॥

అశరీరం విగ్రహవదిన్ద్రియం యదతీన్ద్రియమ్ ।
యదసాక్షీ సర్వసాక్షీ తేజోరూపం నమామ్యహమ్ ॥

గమనార్హమపాదం యదచక్షుః సర్వదర్శనమ్ ।
హస్తాస్యహీనం యద్భోక్తృ తేజోరూపం నమామ్యహమ్ ॥

వేదే నిరూతపిం వస్తు సన్తః శక్తాశ్చ వర్ణితుమ్ ।
వేదేఽనిరూపితం యత్తత్తేజోరూపం నమామ్యహమ్ ॥

సర్వేశం యదనీశం యత్ సర్వాది యదనాది యత్ ।
సర్వాత్మకమనాత్మం యత్తేజోరూపం నమామ్యహమ్ ॥

అహం విధాతా జగతాం వేదానాం జనకః స్వయమ్ ।
పాతా ధర్మో హరో హర్తా స్తోతుం శక్తా న కోఽపి యత్ ॥

సేవయా తవ ధర్మోఽయం రక్షితారం చ రక్షతి ।
తవాజ్ఞయా చ సంహర్తా త్వయా కాలే నిరూపితే ॥

నిషేకలిపికర్తాహం త్వత్పాదామ్భోజసేవయా ।
కర్మిణాం ఫలదాతా చ త్వం భక్తానాం చ నః ప్రభుః ॥

బ్రహ్మాణ్డే బిమ్బసదృశే భూత్వా విషయిణో వయమ్ ।
ఏవం కతివిధాః సన్తి తేష్వనన్తేషు సేవకాః ॥

యథా న సంఖ్యా రేణూనాం తథా తేషామణీయసామ్ ।
సర్వేషాం జనకశ్చేశో యస్తం స్తోతుం కః క్షమః ॥

ఏకైకలోమవివరే బ్రహ్మాణ్డమేకమేకకమ్ ।
యస్యైవ మహతో విష్ణోః షోడశాంశస్తవైవ సః ॥

ధ్యాయన్తి యోగినః సర్వే తవైతద్రూపమీప్సితమ్ ।
త్వద్భక్తా దాస్యనిరతాః సేవన్తే చరణామ్బుజమ్ ॥

కిశోరం సున్దరతరం యద్రూపం కమనీయకమ్ ।
మన్త్రధ్యానానురూపం చ దర్శయాస్మాకమీశ్వరమ్ ॥

నవీనజలదశ్యామం పీతామ్బరధరం పరమ్ ।
ద్విభుజం మురలీహస్తం సస్మితం సుమనోహరమ్

మయూరపిచ్ఛచూడం చ మాలతీజాలమణ్డితమ్ ।
చన్దనాగరుకస్తూరీకుఙ్కుమద్రవచర్చితమ్ ॥

అమూల్యరత్నసారాణాం భూషణైశ్చ విభూషితమ్ ।
అమూల్యరత్నరచితకిరీటముకుటోజ్జ్వలమ్ ॥

శరత్ప్రఫుల్లకమలప్రభామోష్యాస్య చన్ద్రికమ్ ।
పక్వబిమ్బసమానేన హ్యధరోష్ఠేన రాజితమ్ ॥

పక్వదాడిమబీజాభదన్తపంక్తిమనోహరమ్ ।
కేలీకదమ్బమూలే చ స్థితం రాసరసోత్సుకమ్ ॥

గోపీవక్త్రాణి పశ్యన్తం రాధావక్షఃస్థలస్థితమ్ ।
ఏవం వాంఛాస్తి రూపం తే ద్రష్టుం కేలిరసోత్సుకమ్ ॥

ఇత్యేవముక్త్వా విశ్వసృట్ ప్రణనామ పునః పునః ।
ఏవం స్తోత్రేణ తుష్టావ ధర్మోఽపి శంకరః స్వయమ్ ॥

ననామ భూయో భూయశ్చ సాశ్రుపూర్ణవిలోచనాః ॥

తిష్ఠన్తోఽపి పునః స్తోత్రం ప్రచక్రుస్త్రిదశేశ్వరాః ।
వ్యాప్తాస్తత్రామరాః సర్వే శ్రీకృష్ణతేజసా మునే ॥

స్తవరాజమిమం నిత్యం ధర్మేశబ్రహ్మభిః కృతమ్ ।
పూజాకాలే హరేరేవ భక్తియుక్తశ్చ యః పఠేత్ ॥

సుదుర్లభాం దృఢాం భక్తిం నిశ్చలాం లభతే హరేః ॥

సురాసురమునీన్ద్రాణాం దుర్లభం దాస్యమేవ చ ।
అణిమాదికసిద్ధిం చ సాలోక్యాదిచతుష్టయమ్ ॥

ఇహైవ విష్ణుతుల్యశ్చ విఖ్యాతః పూజితో ధ్రువమ్ ।
వాక్సిద్ధిర్మన్త్రసిద్ధిశ్చ భవేత్తస్య వినిశ్చితమ్ ॥

సర్వసౌభాగ్యమారోగ్యం యశసా పూరితం జగత్ ।
పుత్రశ్చ విద్యా కవితా నిశ్చలా కమలా తథా ॥

పత్నీ పతివ్రతా సాధ్వీ సుశీలా సుస్థిరాః ప్రజాః ।
కీర్తిశ్చ చిరకాలీనాప్యన్తే కృష్ణాన్తికే స్థితిః ॥ 94-126

వరుడు, వరేణ్యుడు, వరదుడు, వరప్రదాతలకుగారణుడు, సర్వప్రాణు, లకుగారణుడు, మంగళప్రదాతయు, మంగళములకును మంగళమైనవాడు, మంగళప్రదుడు, సమస్తమంగళములకాధారస్వరూపుడు, సర్వత్రవిద్యామానుడు, నిర్లిప్తుడు, ఆత్మస్వరూపుడు, పరాత్పరుడు, నిరీహుడు, అవితర్క్యుడు, సగుణుడు నిర్గుణుడు, సనాతనుడు, బ్రహ్మ, జ్యోతిస్స్వరూపుడు, సాకారుడు, నిరాకారుడు, అనిర్వచనీయుడు, వ్యక్తావ్యక్తుడు, అద్వితీయుడు, స్వేచ్ఛామయుడు, సర్వరూపుడునగునా తేజస్స్వరూపునకు నమస్కరించుచున్నాను. నీవు త్రిగుణాతీతుడవు. ఆత్రిగుణములను విభాగించుటకొఱకై నీవు రూపత్రయమును ధరించితివి. సమస్త దేవతలు నీకళలనుండియే యావిర్భవించిరి. శ్రుతులకే అగోచరుడవైన నిన్ను దేవతలెట్లు తెలిసికొనగలరు ? నీవు సర్వాధారుడవు, సర్వస్వరూపుడవు, సర్వలోకాదికారణుడవు, స్వయముగ కారణరహితుడవు, సకలసంహారకర్తవు, అంతములేనివాడవు, తేజస్స్వరూపుడవు, పరమాత్మవగు నీకు నమస్కరించుచున్నాను. సగుణరూపమునే లక్ష్యమొనరించుకొని విద్వాంసులైన

పురుషు లాస్వరూపమును వర్ణింపగలరు. కాని నీరూప మలత్యము, దివ్యము, అందువలన నేను నీస్వరూపము నెట్లువర్ణింపగలను ! తేజస్స్వరూపపరమాత్మ వగునీకు నమస్కరించుచున్నాను. నీవు నిరాకారుడ వైనను దివ్య మగు నాకారమును ధరించుచున్నావు. ఇంద్రియాతీతుడవైనను ఇంద్రియయుక్తుడ వైనావు. నీవు సర్వసాక్షివి, కాని నీకు సాక్షులెవ్వరు లేరు. తేజోమయ పరమేశ్వరుడ వగునీకు నానమస్కారము. దేవాదిదేవా ! నీకు పాదములు లేకున్నను గమన మొనరింపగలవు. నేత్రములు లేకున్నను వీక్షింపగలవు, కరములు, ముఖము లేకున్నను భక్తు లర్పించిననైవేద్యములను స్వీకరింపగలవు. తేజోమయపరమాత్మ వగునీకు నమస్కరించుచున్నాను. వేదములందు నిరూపింపబడినవస్తువునె, విద్వాంసు లైనపురుషులు వర్ణింపగలరు ఎవనిని వేదములే నిరూపణ మొనరింపలేకపోయినవో అట్టినీ తేజోమయస్వరూపమునకు నేను నమస్కరించుచున్నాను.

సర్వేశ్వరుడవు, ఈశ్వరుడులేనివాడవు, సర్వమున కాదివైయైనను, స్వయముగ నాదిరహితుడవు, సర్వాత్మకుడవైనను స్వయముగ ననాత్మకుడవు, అట్టి నీ తేజోమయస్వరూపమునకు నేను నమస్కరించెదను. నేను స్వయముగ జగత్తునకు స్రష్టను, వేదములను ప్రకటించినవాడను; ధర్మదేవత జగత్పాలకుడు, మహాదేవుడు సంహారకారి. మామువ్వురిలో నెవ్వరును నీయఖండ తేజోమయ స్వరూపమును స్తుతించుటకు సమర్థులము కాము. నీసేవాప్రభావమువలననే ధర్మదేవుడు తన్ను రక్షించినవారిని రక్షింపగల్గుచున్నాడు. నీయాజ్ఞానువర్తియై నీవునిశ్చయించినసమయముననే మహాదేవుడు జగత్తును సంహరించును. నీచరణారవిందముల సేవలవలన సమర్థుడనై నేను ప్రాణులప్రారబ్ధమును లేదా అదృష్టలేఖకుడనై కర్మ లొనరించువారికి ఫలప్రదాతనైతిని. ప్రభూ ! త్రిమూర్తులమైనమేము నీభక్తులము. నీవు మాకు స్వామివి. బ్రహ్మాండమందు బింబసదృశులమై మేము విషయుల మగుచున్నాము. బ్రహ్మాండములనంతములు, ఆబ్రహ్మాండములందు మాబోటిసేవకు లెందఱో కలరు. రేణువులను, పరమాణువులను గణింపలేనట్లు బ్రహ్మాండములను, ఆబ్రహ్మాండములలో నివసించుబ్రహ్మాదిదేవతలను గణన మొనరించుట యసంభవము. సర్వమునకు జనకుడవైననిన్ను స్తుతించుట కెవరు సమర్థులు ? ఒక్కొక్కరోమకూపమం దొక్కొక్క బ్రహ్మాండము కలదు. విష్ణువుకూడ

నీవదునా అవయవాంశమే. సర్వయోగులు నీ యొక్క మనోవాంఛిత మగు జ్యోతిర్మయస్వరూపమునే ధ్యానింతురు. కాని నీభక్తులైనవారు నీదాస్య సేవయం దనురక్తులై యెల్లప్పుడు నీదివ్యచరణకమలములనే సేవించెదరు. దేవాదిదేవా ! నీపరమసుందరకమనీయకిశోరరూపమును, మంత్రోక్తధ్యానాను రూపసచ్చిదానందవిగ్రహమును మాకు దర్శింపజేయుము.

నూతనజలధరమువలె శ్యామలవర్ణయుక్త మగునంగకాంతిగలవాడు, పీతాంబరములను ధరించి పరమసుందరముగ గోచరించువాడు, ద్విభుజములు గలవాడు, కరములందు వేణువు, ముఖమున చిరునవ్వులు విరాజిల్లువాడు, మిగుల మనోహరముగ నుండువాడు, శిరముపై మయూరపింఛమకుటము మును ధరించినవాడు, మాలతీపుష్పములతో సింగారింపబడినవాడు, చందనాగరు కస్తూరీకేసరాదులచే చర్చితములైనదివ్యాంగములుగలవాడు, అమూల్యరత్న సారతత్వనిర్మిత ములైననాభూషణములతో విభూషితమైనవాడు, బహు మూల్యరత్ననిర్మితకిరీటమకుటము శిరమునందు ప్రకాశించుచున్నవాడు, శరత్కాలప్రఫుల్లకమలశోభను హరించుముఖారవిందముగలవాడు, పండిన బింబఫలమువలె శోభించు నధరములుగలవాడు, పరిపక్వమైనదానిమ్మగింజలవలె మెఱయుదంతములుగలవాడు, రాసరసము కొఱకు ఉత్సుకుడై కేలికదంబవృక్షము క్రింద నిలువబడియున్నవాడు, గోపికలముఖములను వీక్షించుచున్నవాడు, శ్రీరాధాదేవివక్షస్థలమందు విరాజిల్లుచున్నవాడు నగునీయా కేలీరసోత్సుక స్వరూపమును దర్శింపవలెనని మే మభిలషించుచున్నాము. ఇట్లుప్రార్థించి విశ్వవిధాత యగుబ్రహ్మ భగవానున కనేకప్రణామము లర్పించెను. ధర్మ దేవత శంకరుడుగూడ బ్రహ్మకృత స్తోత్రముచేతనే ఆయనను స్తుతించి అశ్రు పూరితనేత్రములతో ఆయనకు మాటిమాటికి నమస్కరించిరి.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను:

నారదమహర్షి ! ఆత్రిమూర్తులు తనివితీరక సురలమరల భగవంతుని స్తుతించిరి. శ్రీకృష్ణునిదివ్యతేజముతో వారందఱు ఆచ్ఛాదితులైరి. త్రిమూర్తులచే నొనరింపబడిన నీ స్తవరాజమును ప్రతిదినము శ్రీహరిపూజా కాలమందు భక్తిపూర్వకముగ బఠించువారికి శ్రీహరియం దత్యంతదుర్లభము, దృఢము నగుభక్తి గలుగును. దేవతలకైనను, అసురులకైనను, మహర్షులకైనను

శ్రీహరిదాస్యసౌభాగ్య మత్యంతదుర్లభముకానియీస్తోత్రము నేకాగ్రచిత్తులై పఠించినవా రాసౌభాగ్యమును బొందగలరు. వారణిమాదిసిద్ధులను సాలోక్యాది చతుర్విధమోక్షములనుగూడ బొందగలరు. వా రిహలోకమందు విష్ణువుతో సమానముగ బూజింపబడుదురు. ఇందు సంశయములేదు. నిశ్చయముగ నాభక్తులకు వాక్శుద్ధి, మంత్రసిద్ధి సులభములు కాగలవు. వారు సౌభాగ్యవంతులై యారోగ్యమును బొందగలరు. వారియశముతో సమస్తజగత్తు పూర్ణముకాగలదు. వా రిహలోకమందు పుత్రులను, విద్యలను, కవిత్వమును, స్థిరలక్ష్మిని, సుశీలయు, పతివ్రతయు నగుపత్నిని, సుస్థిరసంతానమును, చిరకీర్తిని బొంది యంత్యకాలమున శ్రీకృష్ణపరంధామమును జేరగలరు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండమున నారదనారాయణ సంవాదమున
గోలోకవర్ణనము, శ్రీకృష్ణ స్తోత్రరాజపఠనము
అను ఐదవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

## ఆఱవ అధ్యాయము

### శ్రీకృష్ణుని యాజ్ఞ ననుసరించి రాధ గోలోకమునుండి గోకులమునకు వెడలుట ! విష్ణువు మధురకు వెడలుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

మునీశ్వరా ! దేవత లాయఖండతేజఃపుంజమును ధ్యాన మొనరించి, స్తుతించి, దానియెదుట నిలబడియుండిరి. వా రా తేజోరాశిమధ్యభాగమున నొక కమనీయ స్వరూపమును దర్శించిరి.

సజలామ్భోదవర్ణాభం సస్మితం సుమనోహరమ్ ।
పరమాహ్లాదకం రూపం త్రైలోక్యచిత్తమోహనమ్ ॥

గణ్డస్థలకపోలాభ్యాం జ్వలన్మకరకుణ్డలమ్ ।
సద్రత్ననూపురాభ్యాం చ చరణామ్భోజరాజితమ్ ॥

వహ్నిశుద్ధహరిద్రాభవస్త్రామూల్యవిరాజితమ్ ।
మణిరత్నేన్ద్రసారాణాం స్వేచ్ఛాకౌతుకనిర్మితమ్ ॥

వినోదమురలీయుక్తబిమ్బాధరమనోహరమ్ ।
శుభక్షణేన పశ్యన్తం భక్తానుగ్రహకాతరమ్ ॥

సద్రత్నగుటికాయుక్తకవాటోరః స్థలోజ్జ్వలమ్ ।
కౌస్తుభాసక్తసద్రత్నప్రదీప్తతేజసోజ్జ్వలమ్ ॥

అత్ర తేజసి చర్వాఙ్గీం దదృశుః రాధికాభిధామ్ ।
పశ్యన్తం సస్మితం కాన్తం పశ్యన్తీం వక్రచక్షుషా ॥

ముక్తాపంక్తివినిన్ద్యైకదన్తపంక్తివిరాజితామ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం శరత్పఙ్కజలోచనామ్ ॥

శరత్పార్వణచన్ద్రాభావినిన్ద్యాస్య మనోహరమ్ ।
బన్ధుజీవప్రభామోష్యాధరౌష్ఠరుచిరామ్బరామ్ ॥

రణన్మంజీరయుగ్మేన పాదామ్బుజవిరాజితామ్ ।
మణీన్ద్రాణాం ప్రభామోషినఖరాజీవిరాజితామ్

కుఙ్కుమాభాసమాచ్ఛాద్య పాదాధో రాగభూషితామ్ ।
అమూల్యరత్నసారాణాం పాశకశ్రేణిశోభితామ్ ॥

హుతాశనవిశుద్ధాంశుకామూల్యజ్వలితోజ్జ్వలామ్ ।
మహామణీన్ద్రసారాణాం కిఙ్కిణీమధ్యసంయుతామ్ ॥

సద్రత్నహారకేయూరకంకణభూషితామ్ ।
రత్నేన్ద్రరచితోత్కృష్టకపోలోజ్జ్వలకుణ్డలామ్ ॥

కర్ణోపరి మణీన్ద్రాణాం కర్ణభూషణభూషితామ్ ॥

ఖగేన్ద్రచంచునాసాగ్రే గజేన్ద్రమౌక్తికాన్వితామ్ ।
మాలతీమాలయా వక్రాం బిభ్రతీం కబరీం తథా ॥

మణీనాం కౌస్తుభేన్ద్రాణాం వక్షఃస్థలసుశోభితామ్ ।
పారిజాతప్రసూనానాం మాలాజాలోజ్జ్వలామ్ వరామ్ ॥

రత్నాంగులీయనికరైః కరాంగులివిభూషితామ్ ॥
దివ్యశంఖవికారైశ్చ చిత్రరాగవిభూషితైః ।
సూక్ష్మసూత్రకృతై రమ్యైర్భూషితాం శంఖభూషణైః ॥
సద్రత్నసారగుటికారక్తసూత్రాక్తశోభితామ్ ।
ప్రతప్తస్వర్ణవర్ణాభామచ్ఛాద్య చారువిగ్రహామ్ ॥
నితమ్బశ్రోణిలలితాం స్తనపీనోన్నతాం తథా ।
భూషితాం భూషణైః సర్వైస్తత్సౌందర్యేణ భూషితైః ॥
విస్మితాస్త్రిదశాః సర్వే దృష్ట్వేశమీశ్వరీం వరామ్ ।
తుష్టువుస్తే సురాః సర్వే పూర్ణసర్వమనోరథాః ॥ 2-20

ఆ దివ్యస్వరూపము సజలజలధరసమానశ్యామలకాంతియుక్తము, పరమ మనోహరము. భగవంతునిముఖారవిందమందు చిరునవ్వులు చిందులాడు చున్నవి. ఆయనరూపము పరమానందజనకము, త్రైలోక్యచిత్తమోహకము. ఆయనరెండుకపోలములపై మకరకుండలములు మెఱయుచున్నవి. ఉత్తమ రత్నములతో నిర్మితము లైననూపురము లాయనదివ్యచరణారవిందములయం దలంకరింపబడి శోభిల్లుచున్నవి. అగ్నిశుద్ధదివ్యపీతాంబరము ధరించిన యాదివ్యవిగ్రహ మపూర్వశోభతో ప్రకాశించుచుండెను. నుతూహలము తోను స్వేచ్ఛగను. శ్రేష్ఠమణులయొక్క, రత్నములయొక్క సారతత్త్వము తోను రచింపబడినట్లు ఆ శ్రీవిగ్రహము దర్శన మొసంగెను. మనోరంజన మగుమురళితో సంలగ్నము లైనబింబఫలసదృశము లగునరుణాధరములవలన ఆయనముఖచంద్రునిమనోహరత్వము వృద్ధిచెందుచుండెను. భగవంతుడు శుభదృష్టితో వీక్షించుచు భక్తుల ననుగ్రహించుటకొఱకు గాతరుడుగా దర్శన మొసంగెను. ఉత్తమరత్నగుటికాయుక్త మైనద్వారబంధములవలె ఆయనవిశాలవక్షఃస్థలము ప్రకాశితమగుచుండెను. కౌస్తుభమణివలన వృద్ధి పొందిన తేజస్సుతో అది దేదీప్యమానముగ గోచరించుచుండెను.

ఆ తేజఃపుంజమున దేవతలు మనోహరములగు శ్రీఅంగములతో గూడినశ్రీరాధనుగూడ దర్శించిరి. ఆమెచిరునవ్వులతో దనవైపు జూచు చున్నప్రియుని (శ్రీకృష్ణుని) కీగంటితో దర్శించుచుండెను. ముత్యములనే తిరస్కరింపగలదంతపంక్తి రాధముఖశోభను వృద్ధిచేయుచుండెను. ఆమె ప్రసన్నముఖారవిందముపై మందహాసములు శోభించుచుండును. విశాలనేత్ర

ములు శరత్కాలప్రఫుల్లకమలములనే తిరస్కరించుచున్నవి. శరత్పూర్ణిమా చంద్రునిప్రకాశమునే తిరస్కరింపగలముఖమువలన నామె పరమమనోహారిణిగ గన్పడుచుండెను. సూర్యకాంతపుష్పములశోభనే తిరస్కరించు నామె యెఱ్ఱనియధర మత్యంతమనోహరము రాధాదేవి సుందరవస్త్రములను ధరించియుండెను. ఆమెచరణారవిందములందు మ్రోగుచు మంజీరములు శోభిల్లుచుండెను. నఖములపంక్తి శ్రేష్ఠమణిరత్నములశోభను దిరస్కరించుచుండెను. కుంకుమశోభనే తిరస్కరింపగల ఆమెచరణతలములు స్వాభావిక రాగముతో సుశోభితములై యుండెను. అమూల్యరత్నసారతత్వముతో నిర్మింపబడినపాశక (కుంతలముల) శ్రేణి ఆమె సలంకరించుచుండెను. అగ్ని శుద్ధదివ్యవస్త్రములను ధరించి రాధాదేవి ప్రకాశించుచుండెను. శ్రేష్ఠమణులతో నిర్మింపబడినవడ్డాణముతో నామెమధ్యభాగ మలంకరింపబడియుండెను. ఉత్తమరత్నహారములతో, భుజకీర్తులతో, కంకణములతో నామెవిభూషితయైయుండెను. ఉత్తమరత్నములచే నిర్మింపబడిన కుండలములామెకపోలముల నుద్దీప్త మొనరించుచుండెను. కర్ణములందు శ్రేష్ఠమణినిర్మితకర్ణభూషణములు శోభించుచుండెను. పక్షిరాజైనగరుత్మంతుని నాసికనుబోలు రాధనాసికయందు గజముక్తికనిర్మిత మగుబులాకి శోభిల్లుచుండెను. వంపులు దిరిగినకేశములుగల ఆమెవేణియందు మాలతీమాలలు అలంకరింపబడియుండెను. వక్షఃస్థలమందు కౌస్తుభమణిహారము ప్రకాశించుచుండెను. పారిజాతపుష్పముల మాలను ధరించినందువలన ఆమెరూపరాశి పరమోజ్జ్వలముగ గన్పడుచుండెను. ఆమెహస్తమునందుగల యంగుళులు రత్నాంగుళీయకములతో విభూషితములై యుండెను. దివ్యశంఖములతో నిర్మింపబడినవిచిత్రరాగవిభూషితరమణీయ భూషణములు ఆమెనలంకరించుచుండెను. ఆశంఖభూషణములు పట్టుదారముతో గ్రుచ్చబడియుండెను. ఉత్తమరత్నసారతత్వనిర్మితగుటికను ఎఱ్ఱనిదారమందు గ్రుచ్చి అలంకరించుకొనియుండెను. తప్తసువర్ణసమానమగునంగకాంతిని సుందరవస్త్రముల నాచ్ఛాదితముచేసికొని యామె మిగుల ప్రకాశించుచుండెను. నితంబప్రదేశముయొక్క శోణిభాగముయొక్క సౌందర్యముచే నామె యింకను నెక్కువ సౌందర్యవతిగ గన్పడుచుండెను. ఆమె సర్వాభూషణములతో విభూషితయైయుండెను. సమస్తాభూషణము లామెసౌందర్యముచే విభూషితములైయుండెను. పరమేశ్వరుని పరమేశ్వరిని దర్శించి దేవత

లాశ్చర్యచకితులైరి. ఆదివ్యదర్శనమాత్రముననే వారిసకలమనోరథములు పరిపూర్ణమయ్యెను. అందువలన నాదేవతలందఱు మరల భగవంతుని స్తుతింపదొడంగిరి.

బ్రహ్మోవాచ :

తవ చరణసరోజే మన్మనశ్చంచరీకో
భ్రమతు సతతమీశ ప్రేమభక్త్యా సరోజే ।
భవనమరణరోగాత్ పాహి శాన్త్యౌషధేన
సుధృఢసుపరిపక్వాం దేహి భక్తిం చ దాస్యమ్ ॥ 21

పరమేశ్వరా ! నాచిత్తమనుచంచరీకము (భ్రమరము) నీచరణారవిందములందు నిరంతరము ప్రేమతో భక్తిపూర్వకముగ భ్రమించుగాక ! శాంతి యనుఔషధము నొసంగి నన్ను జననమరణరోగములనుండి రక్షింపుము. దేవా ! నాకు సుదృఢము, అత్యంతపరిపక్వము నగుభక్తిని దాస్యభావమును ప్రసాదింపుము.

శంకర ఉవాచ :

భవజలనిధిమగ్నశ్చిత్తమీనో మదీయో ।
భ్రమతి సతతమస్మిన్ ఘోరసంసారకూపే ।
విషయమతివినిన్ద్యం సృష్టిసంహారరూప
మపనయ తవ భక్తిం దేహి పాదారవిన్దే ॥ 22

ప్రభూ ! భవసాగరమందు మునిగియున్ననాచిత్తమనుమత్స్య మెల్లపుడీఘోరసంసారకూపమందు భ్రమించుచున్నది. సృష్టిసంహారములచే యీజీవున కత్యంతనిందనీయవిషయములు. దేవాదిదేవా ! నన్నీవిషయములనుండి దూర మొనరించి నాకు నీచరణారవిందములందు భక్తిని ప్రసాదింపుము.

ధర్మ ఉవాచ :

తవ నిజజనసార్ధం సంగమో మే మదీశ ।
భవతు విషయబన్ధచ్ఛేదనే తీక్ష్ణఖడ్గః ।
తవ చరణసరోజే స్థానదానైకహేతు
ర్జనుషి జనుషి భక్తిం దేహి పాదారవిన్దే ॥ 23

ఈశ్వరా ! విషయబంధనములను ఖండింప గలతీక్ష్ణకరవాలముపలె బని జేయునదియు, నీచరణారవిందములందు స్థానమును ప్రసాదించుట కైకైక హేతు వైనదియు నగునీభక్త సమాగమము సదా నాకు కలుగుగాక ! దేవా ! ప్రతిజన్మమునందు నాకు నీచరణారవిందములందు సుదృఢ మగుభక్తిని ప్రసాదింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా ! ఇట్లు భగవంతుని స్తుతించి పూర్ణ మనోరథు లైన యాముప్పురు దేవతాశ్రేష్ఠులు అభీష్టసిద్ధిప్రదాత యైనశ్రీ రాధావల్లభుని సమక్షమున హస్తములం ముకుళించి నిలువబడిరి. దేవత లొనరించిన యాస్తుతిని యాలకించి ప్రసన్నముఖారవిందుడై శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పల్కెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

సకలదేవతలారా ! ఈసమయమున మీ రందఱు నాధామమునకు దయ చేసినారు. మీకు సుస్వాగతము. (శివాశ్రయాణాం కుశలం ప్రష్టుం యుక్త మసాంప్రతమ్) శివునియాశ్రయమున నివసించువారిని కుశలప్రశ్న వేయుట యుచితముకాదు. ఎందువలెననగ, శివు నాశ్రయించిన వా రెల్లపుడు భయరహితులై యుందురు. మీ రందఱు మద్ధామమున కేతెంచినారు. నిశ్చింతులై యుండుడు. నే నుండగ మీ కేల భయము !

స్థితోఽహం సర్వజీవేషు ప్రత్యక్షోఽహం స్తవేన వై । 27

"నేను సమస్తజీవులందు విరాజమానుడనై యుండెదను. కానిస్తుతించిన ప్రత్యక్ష మయ్యెదను." మీ యభీష్టము లన్నియు నాకు నిశ్చితరూపముగ నవగతములే. దేవతలారా ! శుభాశుభకర్మములన్నియు సమయ మాసన్న మై నపుడే సంభవించును. చిన్నవైనను, పెద్దవైనను అన్ని కార్యములు కాలము వలనే సంపన్నములుకాగలవు. వృక్షములు ఆయాసమయములందే పుష్పించి ఫలించును. సమయ మాసన్నమైనపుడే యాఫలములు పండగలవు. సమయ మాసన్నముగాని దే యవి పండవు.

సుఖం దుఃఖం విపత్సంప చ్ఛోకచింతా శుభాశుభమ్ ।
స్వకర్మఫలనిష్ఠం చ సర్వకాలేఽప్యుపస్థితమ్ ॥
న హి కస్య ప్రియః కో వా విప్రియో వా జగత్త్రయే ।
కాలే కార్యవశాత్ సర్వే భవన్త్యే వా ప్రియాః ప్రియాః ॥ ౩౫–౩౬

సుఖదుఃఖములు, సంపద్విపత్తులు, చింతాశోకములు, శుభాశుభములు మొదలగునవియన్నియు జీవులస్వకర్మఫలములు. ఇవియన్నియు సమయమాసన్నమైనపుడు క్రమముగ నుపస్థితములగును. మూడులోకములయందు దండఱు ఒకరికొకరు ప్రియులునుగారు, అప్రియులునుగారు సమయ మాసన్నమైనపుడు కార్యవశమున వారు ప్రియులు లేదా అప్రియులు నయ్యెదరు.

పృథ్వియం దెందఱో రాజులు మనువులు నుద్భవించుట, వారందఱు తమతమ కర్మఫలపరిపాకముచే కాలమున కధీనులై గతించుట మీరు చూచియేయున్నారు. గోలోకమందు మీ రొక్కక్షణము గడిపినారు. ఈసమయమందే పృథ్విలో సప్తమన్వంతరములు గతించినవి. ఏడుగురు ఇంద్రులు నశించినారు. ఈసమయమున నెనిమిదవ యింద్రుడు పరిపాలించుచున్నాడు. (కాలచక్రం భ్రమన్త్యేవ మదీయాంచ దివానిశం॥) ఇట్లు నా కాలచక్రము అహర్నిశలు భ్రమించుచునే యుండును. ఇంద్రులు, మనువులు, నరేశ్వరులు కాలమునకు వశులై గతించెదరు. వారివారికీర్తి, పుణ్యము పాపాచరణము, అపకీర్తి కథామాత్రిముగ పృథ్విపై శేషించును. ఈ సమయమందుగూడ పృథ్విపై నెందఱో నరేశ్వరులు దుష్టులై, భగవన్నిందకులై భ్రమించుచున్నారు. వారిబలపరాక్రమము లజేయములు, కాని కాలానుసారముగ వారందఱు కాలాంతకు దైనయమునివాత బడెదరు.

ఉపస్థితోఽపి కాలోఽయం వాతో వాతి నిరన్తరమ్ ।
వహ్నిర్దహతి సూర్యశ్చ తపత్యేవ మమాఽఽజ్ఞయా ॥
వ్యాధయః సన్తి దేహేషు మృత్యుశ్చరతి జన్తుషు ।
వర్షన్త్యేతే జలాధరాః సర్వే దేవా మమాఽఽజ్ఞయా ॥
బ్రహ్మణ్యనిష్ఠా విప్రాశ్చ తపోనిష్ఠాస్తపోధనాః ।
బ్రహ్మర్షయో బ్రహ్మనిష్ఠా యోగనిష్ఠాశ్చ యోగినః ॥
తేసర్వే మద్భయాద్భీతాః స్వకర్మధర్మతత్పరాః ।
మద్భక్తాశ్చైవ నిఃశంకాః కర్మనిర్మూలకారకాః ॥

## శ్రీకృష్ణజన్మఖండము - 6వ అధ్యాయము

దేవాః కాలస్య కాలోఽహం విధాతా ధాతురేవ చ ।
సంహారకర్తుః సంహర్తా పాతుః పాతా పరాత్పరః ॥

మమాఽఽజ్ఞయాఽయం సంహర్తా నామ్నా తేన హరః స్మృతః ।
త్వం విశ్వసృట్ సృష్టిహేతోః పాతా ధర్మస్య రక్షణాత్ ॥

బ్రహ్మాదితృణపర్యన్తం సర్వేషామహమీశ్వరః ।
స్వకర్మఫలదాతాఽహం కర్మనిర్మూలకారకః ॥

అహం యాన్ సంహరిష్యామి కస్తేషామపి రక్షితా ।
యానహం పాలయిష్యామి తేషాం హన్తా న కోఽపి వా ॥

సర్వేషామపి సంహర్తా స్రష్టా పాతాఽహమేవ చ ।
నాహం శక్తశ్చ భక్తానాం సంహారే నిత్యదేహినామ్ ॥

భక్తా మమానుగా నిత్యం మత్పాదార్చనతత్పరాః ।
అహం భక్తాన్తికే శశ్వత్తేషాం రక్షణహేతవే ॥

సర్వే నశ్యన్తి బ్రహ్మాణ్డే ప్రభవన్తి పునః పునః ।
న మే భక్తాః ప్రణశ్యన్తి నిశ్శంకాశ్చ నిరాపదః ॥

అతో విపశ్చితః సర్వే దాస్యం వాంఛన్తి నో వరమ్।
యే మాం దాస్యం ప్రయాచన్తే ధన్యాస్తేఽన్యే చ వంచితాః॥

జన్మమృత్యుజరావ్యాధిభయం చ యమతాడనా ।
అన్యేషాం కర్మిణామస్తి న భక్తానాం చ కర్మిణామ్ ॥

భక్తా న లిప్తాః పాపేషు పుణ్యేషు సర్వకర్మణః ।
అహం ధునోమి తేషాం చ కర్మభోగాంశ్చ నిశ్చితమ్ ॥

అహం ప్రాణాశ్చ భక్తానాం భక్తాః ప్రాణా మమాపి చ ।
ధ్యాయన్తే యే చ మాం నిత్యం తాన్ స్మరామి దివానిశమ్ ॥

చక్రం సుదర్శనం నామ షోడశారం సుతీక్ష్ణమ్ ।
యత్తేజః షోడశాఽంశోపి నాస్తి సర్వేషు జీవిషు ॥

భక్తాన్తికే తు తచ్చక్రం దత్త్వా రక్షార్థమీప్సితమ్ ।
న స్వాస్థ్యం న చ ప్రీతిర్మే యామి తేషాం చ సన్నిధిమ్ ॥

న మే స్వాస్థ్యం చ వైకుణ్ఠే గోలోకే రాధికాన్తికే ।
యత్ర తిష్ఠన్తి భక్తాస్తే తత్ర తిష్ఠామ్యహర్నిశమ్ ॥

ప్రాణేశ్వరః ప్రేయసీ రాధా స్థితోరసి దివానిశమ్ ।
యూయం ప్రాణాధికా లక్ష్మీర్న మే భక్తాత్ పరాః స్మృతాః ॥

భక్తదత్తం చ యద్ద్రవ్యం భక్త్యాఽశ్నామి సురేశ్వరాః ।
అభక్తదత్తం నాశ్నామి ధ్రువం భుంక్తే బలిః స్వయమ్ ॥

స్త్రీపుత్రస్వజనాం త్యక్త్వా ధ్యాయన్తే మామహర్నిశమ్ ।
యుష్మాన్ విహాయ తాన్నిత్యం స్మరామ్యహమహర్నిశమ్ ॥

ద్వేష్టా యదా మే భక్తానాం బ్రాహ్మణానాం గవామపి ।
క్రతూనాం దేవతానాం చ హింసాం కుర్వన్తి నిశ్చితమ్ ॥

తదాఽచిరం తే నశ్యన్తి యథా వహ్నౌ తృణాని చ ।
న కోఽపి రక్షితా తేషాం మయి హన్తర్యుపస్థితే ॥ 38-60

"ఈ కాలము నాయాజ్ఞ వలననే చరించును. వాయువు నా యనుజ్ఞను పొంది నిరంతరము వీచుచుండును, అగ్ని జ్వలించును, సూర్యుడు తాపమును కలిగించును. నా యనుజ్ఞ వలననే సర్వదేహములకు రోగములు కలుగును, సమస్తప్రాణులయందు మృత్యువు సంచరించును, సమస్తజలధరములు వర్షించును; నాశాసనానుసారముగనే బ్రహ్మ బ్రాహ్మణత్వమందు, తపోధనులు తపమునందు, మహర్షులు బ్రహ్మమందు, యోగులు యోగమందు తత్పరులై యుందురు. వీరందరు నాభయముచే భీతులై స్వధర్మపాలనమందు సదా తత్పరులైయుందురు. కాని కర్మనే నిర్మూలన మొనరించుటలో సమర్థులైన నాభక్తులు శంకారహితులైయుందురు.

దేవతలారా! నేను కాలమునకు కాలమును, విధాతలకు విధాతను, సంహారకునకు సంహారకుడను, పాలకునకు పాలకుడను, పరాత్పరుడను, పరమేశ్వరుడను. నాయాజ్ఞానువర్తియై శివుడు సంహరించును. అందువలన ఆయన నామము హరుడయ్యెను. నీవు నాయాదేశానుసారముగ సృష్టియందుద్యుక్తుడవై యుండెదవు, అందువలన నీవు విశ్వస్రష్టవు, రక్షించుటవలన ధర్మదేవుడు పాలకు డనబడును. బ్రహ్మమొదలుకొని తృణపర్యంతము గలసకలచరాచర జగములకు నేనే యీశ్వరుడను, కర్మఫలప్రదాతను, కర్మనిర్మూలన మొనరించువాడను. నే నెవనిని సంహరింపవలె ననినిశ్చయించెదనో వాని నెవరు రక్షింపగలరు ? నే నెవనిని రక్షింపదలంతునో వారినెవరైనను సంహరింపలేరు. నేనే సర్వమును సృజించి, పాలించి సంహరింతును. కాని

నాభక్తులు నిత్యదేహులు. నేనైనను వారిని సంహరించుట కసమర్థుడను. నాయనన్యభక్తు లెల్లప్పుడు నన్ననుసరించుచు నాచరణకమలారాధనయందు దత్పరులై యుందురు. అందువలన నేనుకూడ భక్తులచెంతనే యుండి వారిని రక్షించుటకు ప్రయత్నించుచుందును. బ్రహ్మాండములలోని వా రందఱు నశించుచు మరలజన్మించెదరు, కాని నాభక్తులు నశింపరు, వా రెల్లప్పుడు శంకారహితులు, విపద్రహితులు నై జీవింతురు. అందువలననే విద్వాంసు లైనపురుషులు నాదాస్యభక్తినే యభిలషింతురు. మఱియేయితరపరమును వారు వాంఛింపరు. నానుండి దాస్యభక్తిని యాచించువారు ధన్యులు. విషయ సుఖములను గోరువా రందఱు వంచితులే. జనన, మరణ, జరా, వ్యాధులు మున్నగుకష్టములు కర్మపరాయణు లైనవితరులకు మాత్రమే లభించును; అవి నాభక్తులనంటవు. నాయనన్యభక్తుడు పాపములందుగాని, పుణ్యములందు గాని మఱియేయితరకర్మములందుగానిలిప్తుడుకాడు. నేనునాభక్తుల కర్మభోగము లను నిశ్చయముగ నాశన మొనరింతును. నేనే భక్తులకు ప్రాణమును, నాభక్తులు నాకు ప్రాణసమానులు. నిత్యము నాధ్యానమందు సంలగ్నులై యున్నవారిని నే నహర్నిశములు స్మరింతును. షోడశకోణములతో యుక్తమై యత్యంత ప్రచండ మైనసుదర్శన మనుచక్రాయుధము పరమతేజోయుక్తము, అప్రతి హతము. సంపూర్ణజీవధారులయం దేతేజము కలదో ఆతేజమంతయు నీసుదర్శనచక్రతేజమందు బదునాఱవయంశకైనను సరిరాదు. అట్టియభీష్ట ఫలప్రద మైనచక్రమును నా యనన్యభక్తులరక్షణార్థమై వినియోగించినను, తృప్తిచెందక నేను స్వయముగ వారిచెంతనే వసింతును. మీరుగాని, దేవతలుగాని, ప్రాణాధిక యగులక్ష్మిగాని నాకునాభక్తునివలె ప్రియపాత్రులు కారు. దేవేశ్వరులారా! భక్తిపూర్వకముగ భక్తులు నాకు ప్రసాదించిన నేద్రవ్యముల నైనను నే నత్యంతప్రేమతో గ్రహింతును, కాని యభక్తు లర్పించినవస్తువులను నేను స్వీకరింపను. వా రర్పించిన వస్తువులను నిశ్చయముగ బలిచక్రవర్తి యనుభవించును. దారాపుత్రాదులను, స్వజను లను త్యజించి యహర్నిశములు నన్నే స్మరించుభక్తునివలె నేనుకూడ మిమ్ముల నందఱిని త్యజించి వానినే యహర్నిశములు స్మరింతును. భక్తులను గోబ్రాహ్మణులను ద్వేషించువారు, యజ్ఞములందు దేవతలతృప్తికొఱకు హింసాకాండ (బలులు) జరిపించువారు ప్రజ్వలితాగ్నియందు నశించు

పురుగులవలె శీఘ్రముగనే నశించెదరు. ఆసమయమున నెవ్వరైన నట్టివారిని రక్షింపలేరు." దేవతలారా! నేను పృథ్విపై ధర్మసంస్థాపన మొనరించుటకు, సజ్జనులను రక్షించుటకు, దుర్జనులను శిక్షించుటకు నవతరించెదను. కావున మీరు నిశ్చింతులై స్వధామములకు వెడలి మీమీ యంశరూపములతో వసుంధరపై నావిర్భవింపుడు.

ఇట్లు దేవతల నాదేశించి జగదీశ్వరు డైన శ్రీకృష్ణుడు గోలోకవాసు లైనగోపగోపికల నుద్దేశించి యిట్లుపలికెను. "గోపగోపికలారా! మీరందఱు నందునియుత్కృష్టరాజ్య మైనవ్రజమం దవతరింపుడు. ప్రాణప్రియ వగురాధా! నీవు తత్క్షణమే వైశ్యశ్రేష్ఠు డగువృషభానునిగృహమందావిర్భవింపుము. వృషభానునియర్ధాంగి కలావతి గొప్పసాధ్వి. ఆమె శ్రీమహాలక్ష్మియంశచే సుబలు డనురాజునకు పుత్రికగా జన్మించెను. వాస్తవముగ నామె పితృలోకమందున్న మానసీకన్య, సకలనారీమణులలో ధన్యురాలు, మాన్యురాలు. ప్రాచీనకాలమందు దుర్వాసమహర్షి శాపవశమున మానసీకన్యయే వ్రజమండలమందు గోపకుమారునియింట ప్రాదుర్భవించినది. నీ వాకలావతికి పుత్రికగా నవతరింపుము. కమలనయనా! నేను శిశురూపమున వ్రజమున కేతెంచి నిన్ననుగ్రహించెదను.

త్వం మే ప్రాణాధికా రాధే తవ ప్రాణాధికోఽప్యహమ్ ।
న కించిదావయోర్భిన్న మేకాంగం సర్వదైవ హి॥ 67

రాధా! నీవు నాకు ప్రాణములకంటెను నధికప్రియురాలవు. నేను నీకు ప్రాణములకంటె నధికప్రియుడను. మనయిర్వురియం దేభేదము లేదు. మనము భిన్నులము కాము. ఎల్లపు డేకరూపులమే.

ఆసమయమున నద్భుత తేజోయుక్తము, శ్రేష్ఠరత్ననిర్మిత సహస్రకలశయుక్తము, పారిజాతపుష్పహారములతో నలంకృతము, సుందర సువర్ణనిర్మితము నగుదివ్యవిమానము గోలోకమున కేతెంచెను. ఆదివ్యవిమానమందు పార్షదపరివేష్టితుడు, అత్యంతతేజస్స్వరూపుడు, కోటిసూర్యసమప్రభాయుక్తుడు నగుపురుషోత్తముడు విరాజిల్లుచు గోలోకవాసులకు దర్శన మొసంగెను. ఆశ్యామసుందరుడు, శంఖచక్రగదాపద్మధారి, చతుర్భుజుడు, పీతాంబరధారి, రత్నకిరీటకుండలయుక్తుడు, వనమాలాధారి,

చందనచర్చితుడు. దివ్యరత్నమయభూషణవిభూషితుడు నగు శ్రీమన్నారా
రాయణుడు తన వామభాగమందు సరస్వతిని, దక్షిణభాగమందు శ్రీలక్ష్మీదేవిని
నిడుకొని విమానమునుండి దిగ్గి గోపగోపికాసముదాయముచే నిండియున్న
శ్రీకృష్ణసభను బ్రవేశించెను. శ్రీమన్నారాయణునిగాంచి యాసభయం
దుపస్థితులై యున్న మహర్షులు దేవతలు సానందముగ నిలువబడి
భక్తితో స్తుతించిరి. శ్రీమన్నారాయణు డాక్షణమునందే శ్రీకృష్ణ
విగ్రహమునందు విలీనుడయ్యెను. ఈయద్భుతదృశ్యమును గాంచి యాసభయం
దుపస్థితులై యున్నవా రందఱు పరమాశ్చర్యచకితులైరి.

ఆసమయమందే కోటిసూర్యసమప్రభాయుక్తుడు, త్రిలోకనాథుడు నగు
శ్రీమహావిష్ణువు గోలోకమునకేతెంచి శ్రీరాధావల్లభుడైన శ్రీకృష్ణుని
దివ్యశరీరమున లీనమయ్యెను. తదనంతరము స్ఫటికమణివలె బ్రకాశించు
నగుణవర్ణయుక్తుడైనయనంతుడు సహస్రమస్తకములతో సహస్రసూర్య
ప్రకాశముతో దేదీప్యమానముగ బ్రకాశించుచు శ్రీకృష్ణసభను బ్రవేశించి
భగవంతు ననేకవిధముల స్తుతించి తనశిరములను వంచి ప్రణామము లర్పించి
యాశ్రీకృష్ణదివ్యచరణారవిందములందు లీనమయ్యెను. పిమ్మట ధర్మ
పుత్రులైన నరనారాయణులుగూడ గోలోకమున కేతెంచిరి. నారాయణ
ఋషి పరమాత్మ చరణారవిందములందు లీనమయ్యెను. కాని నరుడు మాత్ర
మర్జునుని రూపమున దర్శన మొసంగెను. ఆసమయమున దివ్యరథారూఢయై
సహస్రభుజములం దనేకము లగునాయుధములను ధరించి తనయిరువురుపుత్రు
లతో సింహముపై నధిష్ఠించి దుర్గాదేవి గోలోకవాసులకు దర్శన మొసంగెను.
దుర్గాదేవి గణేశ్వర కార్తికేయసహితయై రత్నసింహాసన మలంకరించెను.
మందస్మితముఖారవిందుడై శ్రీకృష్ణపరమాత్మ శ్రీమహాలక్ష్మితో నిట్లు
పల్కెను. "సనాతనీ! దేవీ! నీవు భీష్మకచక్రవర్తికి అసంగపుత్రికగా
నావిర్భవింపుము. సాధ్వీ! నేను స్వయముగ 'కుండిన' పురమున కేతెంచి
నిన్ను బ్రాణిగ్రహణము చేసికొందును. తదనంతరము శ్రీకృష్ణుడు పార్వతీదేవి
నుద్దేశించి యిట్లుపల్కెను. "కల్యాణీ! నీవు స్వాంశతో నందవ్రజమున యశోదకు
కుమార్తెగా నవతరింపుము. దేవీ! నీవు పల్లెగ్రామములలోను, పురములలోను
నధిష్ఠాత్రిదేవివై మానవులచేత బూజింపబడెదవు. దేవీ! నీ వావిర్భవింపగనే
నాజనకుడైన వసుదేవుడు నన్నుదీసికొనియశోదాగృహమున బ్రవేశించి నీస్థా

నమందు నన్నుంచి నిన్ను తోడ్కొని మధురానగరమునకు వెడలిపోవును. కంసునకు సాక్షాత్కరించినపిమ్మట నీవు మరల శివునికడకు జేరగలవు. నేను కూడ భూభారమును నశింపజేసి మరల నాపరంధామమును జేరెదను.

శ్రీకృష్ణుడు షణ్ముఖుని జాంబవతికుమారునిగ నావిర్భవింపు మని యాదేశించెను. తదనంతరము దేవత లందఱిని తమతమయంశలతో భూమిపై నవతరింపవలసినదిగ నాజ్ఞాపించెను. ఆసమయమున బ్రహ్మ నిలుచుండి భక్తిభావముతో శ్రీకృష్ణు నిట్లుప్రశ్నించెను. "ప్రభూ ! ఏయే దేవత లేయేరూపముల నవతరింపవలెనో నాజ్ఞాపింపుము." బ్రహ్మదేవుని ప్రార్థన నాలకించి శ్రీకృష్ణపరమాత్మ యిట్లుప్రత్యుత్తర మొసంగెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

బ్రహ్మదేవా ! ఎవ రెట్లవతరింపవలెనో వివరించుచున్నాను, సావధానుడవై యవధరింపుము. మన్మథుడు రుక్మిణీపుత్రుడు కాగలడు. శంబరాసురునిగృహమందు ఛాయారూపముతో మాయవతీనామమున నివసించుచున్నరతీదేవి మన్మథున కర్ధాంగి కాగలదు. నీవు రుక్మిణీనందను డైన ప్రద్యుమ్నున కనిరుద్ధు డనునామమున నవతరింపుము. భారతి శోణపురమున బాణాసురునికుమార్తెగ నవతరించి నీకు భార్య కాగలదు. జగదీశ్వరు డైన యనంతుడు దేవకీదేవిసప్తమగర్భమునుండి యాకృష్టుడై రోహిణీగర్భమందు జన్మింపగలడు. మాయద్వారమునాగర్భము సంకర్షణ మొనరింపబడుటచే వానినామధేయము సంకర్షణుడగును. సూర్యునిపుత్రిక యైనయమున గంగాదేవియంశతో భూతలముపై గాళింది యనునామమున నావిర్భవింపగలదు. తులసీదేవి తనయర్థాంశతో రాజకన్య యగులక్ష్మణయనునామ రూపమున నవతరించును. వేదమాతయగుసావిత్రి నగ్నజితుని కుమార్తెయై సత్య యనునామమున ప్రసిద్ధి గాంచగలదు. వసుంధర సత్యభామ, సరస్వతి శైబ్య యగుదురు. రోహిణి రాజకన్య యగుమిత్రవింద కాగలదు. సూర్యపత్ని యగుసంజ్ఞ తనకళతో జగద్గురువుపత్ని యగురత్నమాల కాగలదు. స్వాహా యొకయంశచే సుశీలరూపమున నవతీర్ణ యగును. వీరు రుక్మిణి మున్నగు యెనమండుగురు రాణులైరి. ఇంతేకాక పార్వతీదేవి తనయర్థాంశతో జాంబవతి రూపమున నవతరింపగలదు. ఈపదిమందియు పట్టపురాణులుగ జెప్పబడిరి.

సకలదేవతాంశలు పృథ్విపై జన్మించుగాక! వీరు రాజకుమారులై యుద్ధమందు నాతో సహకరింపగలరు. శ్రీమహాలక్ష్మీకళలనుండి పదునారు వేలరాజకన్యలు ప్రాదుర్భవించి నాకు రాణులుకాగలరు. ధర్మదేవుడు స్వాంశచే పాండుపుత్రుడై నయుధిష్ఠిరుడు కాగలడు. వాయువు భీమసేనుడై యవతరింపగలడు. ఇంద్రునియంశచే సాక్షాత్తుగ నర్జునుడు ప్రాదుర్భవింపగలడు. అశ్వనీకుమారులయంశలచే నకులసహదేవు లవతరింపగలరు. సూర్యాంశచే మహావీరుడై నకర్ణుడు, యమునియంశచే విదురుడు, కలియంశచే దుర్యోధనుడు, సాగరునియంశచే శంతనుడు, శంకరునియంశచే నశ్వత్థామ, అగ్నియంశచే ద్రోణుడు, చంద్రునియంశచే నభిమన్యుకుమారుడు, వసువుయంశచే భీష్ముడు, కశ్యపప్రజాపతియంశచే వసుదేవుడు, దేవమాత యగుఅదితి యంశచే దేవకి, వసువుఅంశచే నందుడు జన్మింపగలడు. వసుపత్ని యశోద కాగలదు. లక్ష్మీయంశచే ద్రౌపది యజ్ఞకుండమునుండి యావిర్భవింపగలదు, అగ్నియంశచే మహాబలవంతు డగుధృష్టద్యుమ్ను డవతరించును. శత రూపాంశచే సుభద్ర దేవకీగర్భమునుండి యావిర్భవించును. అట్లే దేవ పత్నులుకూడ వసుంధరపై జన్మించి రాజపుత్రులై నదేవతల కర్ధాంగినులు కాగలరు.

శ్రీకృష్ణునివక్షఃస్థలము నలంకరించి యున్నరాధాదేవి పరమాత్మ నిట్లుప్రార్థించెను.

రాధ పలికెను :

నాథా! ఈదాసిప్రార్థనల నాలకింపుము. నిన్నుగానని యొక్కక్షణ మైనను నేను జీవింపలేను. ప్రాణనాథా! నిన్ను వీడి భూమిపై నే నెట్లవత రింపగలను. నీవిరహమందు నా కొక్కొక్కక్షణ మొక్కొక్కయుగముగ పరిణమించును. నీవు లేనినేను భూమిపై నెట్లునివసింపగలను. న న్నెవరు రక్షింపగలరు? మాయాపతీ! నా కీవరముల ననుగ్రహింపుము. మధు సూదనా! నామనస్సనెడుమధుపము నీదివ్యచరణారవిందములందే నిరంతరము భ్రమించుచుండుగాక. నే నేప్రదేశమం దవతరించినను నాకు నీదివ్య స్మరణము, దాస్యభక్తి ప్రసాదింపుము. నేను భూతలముపై నున్నపుడు నీవు నాప్రియతముడవని, నేను నీప్రేయసినని, మనయిర్వురిప్రేమ శాశ్వత

మునిగుర్తుండవలయును. ప్రభూ ! శరీరముతో ఛాయ యున్నట్లు, ప్రాణము శరీరముతో నున్నట్లు మనమిర్వురము ప్రత్యవతారమందును నభిన్నులమై యుండవలెను. దేవా ! భూతలమందు మనకు క్షణమైనను వియోగము సంభవింపరాదు. ఈవరములను నాకనుగ్రహింపుము. నాప్రాణములతో నీదివ్యవిగ్రహము నిర్మింపబడెను. నాప్రాణము నీశ్రీఅంగములకంటె భిన్నముకాదు, నాదివ్యాంగములతో నీమురళి, నామనముతో నీచరణములు నిర్మింపబడినవి. తాత్పర్యమేమనగ నీముగళిని నాశరీరముగ భావించుచున్నాను. నామనము నీచరణకమలములను వీడి యన్యములందాసక్తిగొనదు. మన మిర్వురియందు భేదములేదు. అందువలన నామనస్సు నిరంతరము నీయందే లగ్నమై యుండును. నాయాత్మ, నామనస్సు, నాప్రాణములు నీయందు స్థాపితములై యున్నట్లు నీమనస్సు, ప్రాణము, ఆత్మకూడ నాయందే స్థాపితములై యున్నవి, అందువలన వియోగ మనుశబ్దము నాలకింపగనే మనయిర్వురియాత్మలు, మనస్సు, ప్రాణములు క్షోభించును.

శ్రీకృష్ణుడు పలికెను :

దేవీ ! ఉత్తమ మగునాధ్యాత్మికయోగమును బ్రవచించెద నవధరింపుము. ఈయోగము శోకమును ఖండింపగలదు. ఇది యోగీంద్రులకైననుదుర్లభమే. సుందరీ ! సకలబ్రహ్మాండములు ఆధారాధేయరూపములతో విభక్తము లై యున్నవి. వీనిలో ఆధారములేనిదే ఆధేయ మసంభవము. ఫలమునకాధారము పుష్పము, పుష్పమునకాధారము పల్లవములు, పల్లవములకాధారము కొమ్మ, కొమ్మకాధారము వృక్షము, వృక్షమునకాధారము అంకురము, ఈయంకురమునకాధారము బీజము, బీజమునకాధారము పృథ్వి, పృథ్వికాధార మనంతుడు, అనంతునకాధారము కూర్మము కూర్మమునకాధారము వాయువు, వాయువునకాధారము నేనే. నాకాధారముగనీవే ఎందువలెననగ, ఎల్లపుడు నేను నీయందే యుండెదను. నీవు సకలశక్తులసమూహమైనమూలప్రకృతి వగునీశ్వరివి. నీవే సకలశరీరరూపిణివి. త్రిగుణాధారస్వరూపిణివి. నీయాత్మనైననేను నిరీహుడను. నీసంయోగమువలననె నేను చైతన్యుడనైతిని. శరీరము లేనిదే ఆత్మ యెక్కడ ! ఆత్మ లేనిదే శరీర మెక్కడ ! దేవీ ! శరీరము

నకు, నాత్మకు సమాన మైనప్రాధాన్య మున్నది. ఈరెండు లేనిచో సృష్టి సంభవింపదు. దేవీ! మనమిరువురిలో భేదము లేదు. ఆత్మయున్నచోట శరీర ముండును. ఈరెండును పరస్పరము భిన్నములుకావు.

యథా క్షీరే చ ధావల్యం దాహికా చ హుతాశనే ।
భూమౌ గన్ధో జలే శైత్యం తథా త్వయి మమ స్థితిః ॥

ధావల్యదుగ్ధయోరైక్యం దాహికానలయోర్యథా ।
భూగన్ధజలశైత్యానాం నాస్తి భేదస్తథాఽఽవయోః ॥

మయా వినా త్వం నిర్జీవా చాదృశ్యోఽహం త్వయా వినా।
త్వయా వినా భవం కర్తుం నాలం సున్దరి నిశ్చితమ్ ॥

వినా మృదా ఘటం కర్తుం యథా నాలం కులాలకః ।
వినా స్వర్ణం స్వర్ణకారోఽలఙ్కారం కర్తుమక్షమః ॥

స్వయమాత్మా యథా నిత్యస్తథా త్వం ప్రకృతిః స్వయమ్ ।
సర్వశక్తిసమాయుక్తా సర్వాధారా సనాతనీ ॥

మమ ప్రాణసమా లక్ష్మీర్వాణీ చ సర్వమఙ్గలా ।
బ్రహ్మేశానన్తధర్మాశ్చ త్వం మే ప్రాణాధికా ప్రియా ॥

సమీపస్థా ఇమే సర్వే సురాదేవ్యశ్చ రాధికే।
ఏతేభ్యోఽప్యధికా నోచేత్కథం వక్షఃస్థలస్థితా ॥

త్యజాశ్రుమోక్షణం రాధే భ్రాన్తిం చ నిష్ఫలాం సతి ।
విహాయ శంకా నిశ్శంకం వృషభానుగృహం వ్రజ ॥

కలావత్యాశ్చ జఠరే మాసానాం నవ సున్దరీ ।
వాయునా పూరయిత్వా చ గర్భం రోధయ మాయయా ॥

దశమే సమనుప్రాప్తే త్వమావిర్భవ భూతలే ।
స్వాత్మరూపం పరిత్యజ్య శిశురూపం విధాయ చ ॥

వాయునిస్సరణే కాలే కలావత్యాః సమీపతః ।
భూమౌ వివసనీభూయ పతిత్వా రోదిషి ధ్రువమ్ ॥

అయోనిసమ్భవా త్వం చ భవితా గోకులే సతీ ।
అయోనిసమ్భవోఽహం చ నాఽఽయోర్గర్భసంస్థితిః ॥

భూమిసంస్పృష్టమాత్రం గోకులే ప్రాపయిష్యతి ।
తవ హేతోర్గమిష్యామి కృత్వా కంసభయంఛలమ్ ॥

యశోదామన్దిరే మాం చ సానన్దం నన్దనన్దనమ్ ।
నిత్యం ద్రక్ష్యసి కళ్యాణి సమాశ్లేషణపూర్వకమ్ ॥
స్మృతిస్తే భవితా కాలే వరేణ మమ రాధికే ।
స్వచ్ఛన్దం విహరిష్యామి నిత్యం బృన్దావనే వనే ॥ 214-228

"క్షీరములందు ధావళ్యతము, అగ్నియందు దాహకశక్తి, పృథ్వియందు గంధము, జలములందు శీతలత్వము నుండునట్లు నీయందు నే నుండెదను. ధావళ్యక్షీరములందు, దాహకాగ్నులయందు, పృథ్వీగంధములయందు, జల శీతలత్వములయందు భేదభావము లేనట్లే మన యిర్వురియందు భేదము లేదు. నాయనుగ్రహము లేకున్న నీవు నిర్జీవము కాగలవు. నీవు లేనిదే నే నదృశ్యుడను కాగలను. సుందరీ! నీవు లేనిదే నేను ప్రపంచమును సృష్టింపలేను, ఇది నిశ్చయము. మట్టి లేనిదే కుమ్మరి కుండలను, సువర్ణములేనిదే స్వర్ణకారు డాభూషణములను నిర్మింప లేనట్లు నీవు లేనిదే నేను సృష్టింపలేను. స్వయముగ పరమాత్మ నైననేను నిత్యమైనట్లు సాక్షాత్తుగ ప్రకృతిస్వరూపిణి వైననీవును నిత్యమైనదానివే. నీవుసర్వశక్తిసమాయుక్తవు, సర్వాధారవు, సనాతనివి లక్ష్మి, సరస్వతి, పార్వతి, బ్రహ్మ, శంకరుడు, ఆదిశేషుడు, ధర్మము మొదలగువారందఱు నాప్రాణసమానులు. కాని నీవు నాకు ప్రాణములకంటె నధికప్రియురాలవు. ఈసకలదేవతలు నాసమక్షముననే యున్నారు. నీవు వీరందఱికంటె నధికురాలవు. కావున నావక్షఃస్థలమందు విరాజిల్లుచున్నావు. సుశీలా! రాధా! దుఃఖమును వీడుము. శంకను వీడి భయము లేనిదానివై వృషభానుగృహమున నవతరింపుము. సుందరీ! నవ మాసములు కలావతియుదరమం దున్నగర్భమును మాయద్వారా వాయువుచే నింపి యుంచుము. పదియవమాస మాసన్నమైనపుడు నీవు భూతలముపై నవతరించి నీదివ్యరూపమును బరిత్యజించి బాలికారూపమును ధరింపుము. గర్భమునుండి వాయువు బయల్వెడలుసమయము రాగా కలావతి సమీపమున నన్నశిశురూపమున నవతరించి సామాన్యబాలికవలె రోదించుము. సాధ్వీ! నీవు గోకులమున నయోనిజరూపమున ప్రాదుర్భవించెదవుగాక. నేనుగూడ అయోనిజుడనై స్వయముగ నవతరించెదను. ఎందువలెననగ, మనమిర్వురము గర్భముననుండుట యసంభవము. నేను భూమిపై నవతరింపగనే నాతండ్రి నన్ను గోకులమునకు జేర్చును. కేవలము కంసునిభయ మనునెపమున నేను

నీకొఱకు గోకులమున కేతెంచెదను. కల్యాణీ ! నీవు గోకులమందు యశోదా మందిరములో నందనందనుడ నైననన్ను ప్రతిదిన మానందపూర్వకముగ వీక్షించుచు ఆలింగన మొనరించుకొనెదవు. రాధికా ! నావరప్రభావము వలన నీకు నాస్మృతి కలుగును నేను దివ్యబృందావనమందు నిత్యము స్వచ్ఛందముగ నీతో విహరించెదను."

సుశీల మున్నగుముప్పదిముగ్గురుసఖులతోను, అనేకగోపికలతోను నీవు గోకులమునకు దయచేయుము రాధికా ! నేనుగూడ అసంఖ్యగోపకుమారులతో గోకులమందు దివ్యలీలల నొనరించి వసుదేవునకు నివాసస్థాన మైన మథురాపురము జేరెదను.

నారాదా! కృష్ణుడిట్లుచెప్పి మిన్నకుండెను. దేవతలు, దేవేరులు, గోపగోపికలు. గోలోకమందే యుండిరి. బ్రహ్మ, శంకరుడు, ధర్మదేవుడు, ఆదిశేషుడు, పార్వతి, లక్ష్మి, సరస్వతి యత్యంతప్రసన్నులై పరాత్పరు డైన శ్రీకృష్ణుని స్తుతించిరి. విరహజ్వరముచే బీడింపబడు చున్నరాధకూడ తనహృదయవల్లభు డైనశ్రీకృష్ణుని భక్తిభావముతో స్తుతించెను. ఆసమయమున నామె యత్యంతదీనయై, భయముచే వ్యాకులయై, నేత్రములందశ్రుధారలు ప్రవహించుచుండగ భగవంతుని స్తుతించెను. రాధ నావిరహావస్థయందు గాంచి శ్రీకృష్ణు డిట్లూరడించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

ప్రాణాధికా ! మహాదేవీ ! భయమును త్యజించి సుస్థిరవు గమ్ము. నే నుండగ నీ కేలచింత ? శ్రీదామునిశాపము ఫలింపజేయుటకొఱకు గొంతకాలము బాహ్యరూపమున నాతో నీకు వియోగము సంభవింపగలదు. ఆసమయమున నేను మథురకు జని నాతలిదండ్రులను బంధవిముక్తులుగ నొనరించి, దుష్టులను సంహరించి, భూభారమునుహరించెదను. నాదివ్యలీలలను వర్ణించెదను, వినుము. మాలిని, కుబ్జను, వస్త్రకారుని కరుణించుట, కాలయవనుని సంహరించిముచుకుందునకు మోక్షమును బ్రసాదించుట, ద్వారకను నిర్మించుట రాజసూయయజ్ఞమును దర్శించుట, పదునాఱువేలనూటపదుగురురాజకన్యలను వివాహమాడుట, శతృసంహార మొనరించుట, మితృల నుద్ధరించుట, వారణాసీపురిని దహించుట, జృంభణాస్త్రముచే మహాదేవుని బంధించుట, బాణాసురుని భుజములను ఖండించుట, పారిజాతా

పహరణ మొనరించుట, ప్రభాసతీర్థయాత్ర గావించుట, వ్రజములోనిబంధు జనులతో పునఃసమాగమ మొనరించుట, మొదలగు నసంఖ్యాదివ్యలీలల నొనరించి నాతండ్రిచేయుయజ్ఞ సమయమం దొకశుభముహూర్తమున మరల నిన్ను జేరెదను. నీకాధ్యాత్మికజ్ఞానము నుపదేశించి నీతో నిత్యజీవన సౌభాగ్యమును బొందెదను. అప్పటినుండియు నొక్కక్షణ మైనను నీతో నాకువియోగము సంభవింపదు. ప్రాణవల్లభా! వియోగసమయమునందు స్వప్నములో మనసమాగమము సంభవించును. తదనంతరము గోపగోపీ సమన్వితుడనై భూభారమును తొలగించి మరల గోలోకపరంధామమును జేరెదను. శ్రీమన్నారాయణుడు, లక్ష్మి మున్నగుసకలదేవతలు తమతమ ధామములకు నేగెదరు. మరల దివ్యగోలోకపరంధామమం దవిచ్ఛిన్నముగ నాతో నీనివాసము సంభవించును. నేను నిర్ణయించిన నీదివ్యలీలలను నివారింప నెవరితరము!

తదనంతరము దేవతలందఱు రాధాకృష్ణులకు ప్రణామము లర్పించి భగవంతునియాజ్ఞను పరిపాలింప వసుంధరపై నవతరించుటకు బయలుదేరిరి. రాధాదేవి సకలగోపికలతోగూడి శ్రీకృష్ణపరబ్రహ్మమునకు ప్రణామము లర్పించి వ్రజమునం దవతరింప బయలుదేరెను. వారందఱు శ్రీకృష్ణు డాదేశించినట్లు ఆయా గృహములయం దవతరించిరి. రాధను వీడి మనలేక పరంధాముడు వసుధపై నవతరించుట కుద్యుక్తుడయ్యెను. మొదట దేవకీ వసుదేవులకు జన్మించిన ఆర్గురుపుత్రులను ప్రాణభయముచే గంసుడు సంహరించెను. దేవకిసప్తమగర్భము అనంతునియంశ. ఆగర్భమును యోగమాయ సంకర్షణ మొనరించి వ్రజమునం దున్నరోహిణిగర్భమందు స్థాపించెను. రోహిణిగర్భమునుండి యావిర్భవించిన ఆదిశేషునే భక్తులు సంకర్షణు డని కీర్తించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున రాధాదేవి గోలోకమునుండి
గోకులమున యావిర్భవించుట
**యను ఆఱవఅధ్యాయము**
సంపూర్ణము.

# ఏడవ అధ్యాయము

## శ్రీకృష్ణావిర్భావము

నా ర దు డు ప లి కె ను :

మహాభాగా ! శ్రీకృష్ణుని జన్మవృత్తాంత మఖండపుణ్యప్రదము, అత్యుత్తమము. హరికథాశ్రవణము జన్మమృత్యుజరాహరము. కావున దేవా! శ్రీకృష్ణకథను సవిస్తరముగ నా కుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. పరమాత్మునకు జనకు డైనవసుదేవు డెవరికుమారుడు ? భగవంతునకే జనని యైనదేవకి యెవరి కుమార్తె ? దేవకీవసుదేవులు పూర్వజన్మమం దెవ్వరు ? అత్యంతక్రూరు డైనకంసభూపాలుడు తనసహోదరియగు దేవకియార్గురు పుత్రుల నేలవధించెను ? జగన్నాథుని యావిర్భావ మేశుభ ముహూర్తమున సంభవించెను ? ధర్మనందనా ! దయతో నా యీసందేహములను నివారింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షీ ! కశ్యపప్రజాపతియే వసుదేవునిగను, దేవమాత యైన యదితియే దేవకిగను నావిర్భవించిరి. పూర్వజన్మములం దొనరించినయఖండ పుణ్యఫలస్వరూపముగనే వారు శ్రీకృష్ణుని కుమారునిగ బడసి చరితార్థులైరి. దేవమీఢునివలన మారిషకు మహాపురుషు డైనవసుదేవుడు జన్మించెను. వసుదేవునిజన్మసమయమందు ఆనందపులకితులై దేవతలు, ఆనకములను, దుందుభులను ప్రయోగించిరి. అందువలన హరిజనకు డైనవసుదేవునకు ప్రాచీనులైనమహాత్ములు ఆనకదుందుభి యనినామకరణ మొనరించిరి. యదు కులమందు ఆహుకునకు దేవకు డనుపుత్రు డుదయించెను. దేవకు డపార జ్ఞానసాగరుడు. ఆయనగారాలపట్టియే శ్రీకృష్ణునకు జనని యైనదేవకి. యదుకులాచార్యు డైనగర్గమహర్షి దేవకీవసుదేవులకు విధిపూర్వకముగ పాణిగ్రహణ మొనరించెను. సమ్రాట్టగుదేవకుడు తనకుమార్తెవివాహ సందర్భమున ననేకములగు నుపహారములను, వేలకొలదిగ నశ్వములను, స్వర్ణ పాత్రలను, వస్త్రాద్యాభూషణములచే విభూషితలు సుందరాంగులు నగుదాసీ

జనములను, అసంఖ్యవజ్రమణిరత్నములను కానుకగ వసుదేవునకు సమర్పించెను. శ్రేష్ఠరత్నమయాభూషణములతో నలంకరించి త్రిభువనమోహినియు, సుగుణవతియు నగు దేవకిని రథముపై నధిష్ఠింపజేసి వసుదేవుడు బయలుదేరగ, దేవకిసహోదరుడైనకంసనృపాలు డత్యంతసంతుష్టాంతరంగుడై వారితో బయలుదేరెను. మార్గమధ్యమున కంసుని సంబోధించి యాకాశవాణి యిట్లు పలికెను "రాజేంద్రా! ఏలఆనందోత్సాహభరితుడ వగుచున్నావు? దేవకీదేవియష్టమగర్భము నీచావునకు గారణము కాగలదు. ఇది సత్యము."

ఇదివిని కంసు డత్యంత భీతుడై తనప్రాణములను రక్షించుకొనుటకు ఖడ్గము దాల్చి నిర్దాక్షిణ్యముగ సహోదరిని సంహరింప నుద్యుక్తుడయ్యెను. మహాశాస్త్రవిజ్ఞానసంపన్నుడు, నీతిశాస్త్రపారంగతుడు నగువసుదేవుడు క్రోధాగ్నిచే జ్వలించుచున్నకంసుని గాంచి యిట్లుపల్కెను. "రాజా! చూడగ నీకు రాజనీతిజ్ఞానము లేదని తెలియుచున్నది. నాహితకరవచనముల నాలకింపుము. భూపాలా! దేవకిఅష్టమగర్భముకదా నీమృత్యువునకు గారణము. అయినచో నీయబల నేలవధించి యపఖ్యాతిపాలయ్యెదవు. స్త్రీని వధించిన జీవునకు బ్రహ్మహత్యాపాతకము సంభవించును. సహోదరినివధించిన నూఱు బ్రహ్మహత్య లొనరించినపాపము సంభవించును. కావునయదుకులశ్రేష్ఠా! నీసహోదరిని వధింపకుము. దేవకియందు నాకు గల్గినసంతానమును నీ కర్పించెదను. వారు నీకంటె నాకు ప్రేమపాత్రులు కారు. సహోదరి కుమార్తెతో సమానము, కావున నీమెను వధింపక విడుము."

వసుదేవునిధర్మసమ్మత మైనహితవచనముల నాలకించి కంసనృపాలుడు సోదరిని వధింపక వసుదేవునిపైగల యపారవిశ్వాసముచే దనధామమునకు మరలి పోయెను. వసుదేవుడు తనప్రియపత్నితో గలసి రాజధాని జేరెను. నారదా! దేవకిగర్భమున క్రమముగ నార్గురుమహాతేజసంపన్నులైనకుమారు లుదయించిరి. సత్యవాక్పరిపాలకుడైనవసుదేవుడు తనయార్గురుపుత్రులను క్రమముగ కంసున కర్పించెను. అసురుడైనకంసుడు దయారహితుడై నిరపరాధులైన యాపసికూనలను సంహరించెను. దేవకీదేవికి సప్తమగర్భము సంభవించిన దని తెలిసికొని కంసనృపాలు డత్యంతము భీతిచెంది తన్నుదాను రక్షించుకొనుటకు కట్టుదిట్ట మైనయేర్పాటుల నొనరించెను. కాని యోగ

మాయ యాసప్తమగర్భమును దేవకినుండి సంకర్షణ మొనరించి రోహిణీ దేవియందు స్థాపించెను. రక్షకులు దేవకీసప్తమగర్భము నశించిన దనికంసునకు వర్తమానమంపిరి. ఆరోహిణిగర్భమునుండియె అనంతుడు ప్రాదుర్భవించి సంకర్షణు డనునామమున ప్రసిద్ధిగాంచెను.

తస్య ఏవాష్టమో గర్భో వాయుపూర్ణో బభూవ హ ॥
గతే చ నవమే మాసి దశమే సముపస్థితే ।
దృష్టిం దదౌ చ గర్భే చ భగవాన్ సర్వదర్శనః ॥
స్వయం రూపవతీ దేవీ సర్వాసాం యోషితాం వరా ।
బభూవ దర్శనాత్ సద్యః సున్దరీ సా చతుర్గుణా ॥
దదర్శ దేవకీం కంసః ప్రఫుల్లవదనేక్షణామ్ ।
తేజసా ప్రజ్వలతీం చ మాయామివ దిశో దశ ॥
జ్యోతిషాం సహితాం చైవ యథా మూర్తిమతీమివ ।
దృష్ట్వా తామసురేన్ద్రశ్చ విస్మయ పరమం యయౌ ॥
అస్మాద్గర్భాదపత్యం చ మృత్యుబీజం మమైవ చ ।
ఇత్యేవ ముక్త్వా కంసశ్చ చకేర్ రక్షాం ప్రయత్నతః ॥
దేవకీం వసుదేవం చ సప్తద్వారే రరక్ష చ ॥
పూర్ణే చ దశమే మాసి గర్భః పూర్ణో బభూవ హ ।
బభూవ సా చలస్పన్దా జడరూపా చ నారద। ॥
గర్భే చ వాయునా పూర్ణో నిర్లిప్తో భగవాన్ స్వయమ్ ।
హృత్పద్మకోశే దేవక్యా అధిష్ఠానం చకార హ ॥
సా విశ్వమ్భరగర్భా చ మన్దిరాభ్యన్తరే సతీ ।
ఉవాస జడరూపా చ క్లేశయుక్తా బభూవ హ ॥
ఉవాస చ క్షణం దేవీ క్షణముత్థాయ తిష్ఠతి ।
క్షణం వ్రజతి పాదైకం క్షణం స్వపితి తత్ర వై ॥
దృష్ట్వా చ దేవకీం శీఘ్రం వసుదేవో మహామనాః ।
ప్రసూతిసమయం దృష్ట్వా సస్మార హరిమీశ్వరమ్ ॥ 34-47

తదనంతరము వాయువుచే పూరింపబడిన దేవకియష్టమగర్భము ప్రకట మయ్యెను. నవమాసములు నిండి పదియవమాస మాసన్నముకాగా సమదర్శి యగుశ్రీకృష్ణభగవానుడు దేవకీదేవిగర్భమును వీక్షించెను. సమస్తనారీమణు

లందు శ్రేష్ఠురాలైన దేవకి స్వయముగ రూపవతి, భగవంతునికరుణాకటాక్ష ప్రసారమువలన నామెసౌందర్య మతులితమయ్యెను. దేవకీదేవిముఖము నేత్రములు ప్రసన్నములై వికసించియుండుట కంసుడు గాంచెను. ఆమె యఖండ తేజముతో బ్రజ్వరిల్లుచు యోగమాయవలె దశదిశలను ప్రకాశిత మొనరించుచుండెను. మూర్తీభవించిన యఖండతేజఃపుంజమువలె దేవకిచూపరులకు గన్పడుచుండెను. దేవకీదేవిని వీక్షింపగనే కంసు డాశ్చర్య చకితుడై భీతుడై యామె గర్భమునుండి యుదయించుసంతానము వలన తనకుమృత్యువు తప్పదని నిశ్చయించుకొనెను. తత్క్షణమే దేవకీవసుదేవులను నేడుద్వారములుగల నొకదివ్యభవనమున బంధించి కట్టుదిట్టమైన రక్షణల నేర్పాటుచేసెను. పదియవమాసము నిండగా దేవకిగర్భము వాయుపూరితమై దేహధారులకు నిజమైనగర్భముగ గోచరించెను. ఆసమయమున నిర్లిప్తుడైన శ్రీకృష్ణపరమాత్మ దేవకీహృదయకమలమందు నివసించెను. మహామనస్వి యైనవసుదేవుడు జాజ్వల్యమానముగ బ్రకాశించు దేవకిని గాంచి ప్రసవసమయ మాసన్నమైనదని గ్రహించి శ్రీహరిని స్మరింప దొడంగెను.

వసుదేవు డాసమయమున నొకకత్తిని లోహమును, అగ్నిని, జలమును దెప్పించి యాభవనమున నుంచెను. మంత్రజ్ఞులను, బంధువులను, విద్వాంసులను రావించెను. ఇంతలో నర్ధరాత్రి రెండుజాములు గడవగా ఆకాశముమేఘములతో నిండెను, మెఱపులు మెరయుచుండెను, అనుకూల వాయువులు వీచుచుండెను. కంసుడు నియమించిన భవనరక్షకులు ఆసుందర వాతావరణమున మరణించి యచేతనులైనట్లు నిద్రావశులైరి. ఆసమయమున బ్రహ్మశివాదిదేవేశ్వరులు ఆప్రదేశమున కేతెంచి యదృశ్యులై, దేవకీహృదయము నధిష్ఠించి యున్నపరమేశ్వరుని స్తుతింపదొడంగిరి.

దేవా ఊచుః

జగద్యోనిరయోనిస్త్వమనన్తోఽవ్యయ ఏవ చ ।
జ్యోతిఃస్వరూపో హ్యనఘః సగుణో నిర్గుణో మహాన్ ॥
భక్తానురోధాత్ సాకారో నిరాకారో నిరంకుశః ।
స్వేచ్ఛామయశ్చ సర్వేశః సర్వః సర్వగుణాశ్రయః ॥
సుఖదో దుఃఖదో దుర్గో దుర్జనాన్తక ఏవ చ ।
నిర్వ్యూహో నిఖిలాధారో నిఃశ్శంకో నిరుపద్రవః ॥

విరుపాధిశ్చ నిర్లిప్తో నిరీహో విధనాన్తకః ।
స్వాత్మారామః పూర్ణకామో నిర్దోషో నిత్యయేవ చ ॥
శుభగో దుర్భగో వాగ్మీ దురారాధ్యో దురత్యయః ।
వేదహేతుశ్చ వేదాశ్చ వేదాంగో వేదవిద్విభుః ॥
ఇత్యేవముక్త్వా దేవాశ్చ ప్రణేముశ్చ ముహుర్ముహుః ।
హర్షాశ్రులోచనాః సర్వే వవర్షుః కుసుమాని చ ॥
ద్విచత్వారింశన్నామాని ప్రాతరుత్థాయ యః పఠేత్ ।
దృఢాం భక్తిం హర్దేరాస్యం లభతే వాంఛితం ఫలమ్॥ 53-59

దేవా! నీవు సమస్తజగత్తున కుత్పత్తిస్థానమై యున్నావు, కాని నీ కుత్పత్తిస్థాన మెవగును లేరు నీ వనంతుడవు అవినాశివి, నిష్పాపుడవు, సగుణుడవు, నిర్గుణుడవు, మహాజ్యోతిస్స్వరూపుడవు. నీవు నిరాకారుడవైనను భక్తులప్రార్థనల నాలకించి సాకారుడవైనావు. నీపై నెవరికిని నియంత్రణము లేదు. నీవు సర్వదా స్వేచ్ఛుడవు, సర్వేశ్వరుడవు, సర్వరూపుడవు, సమస్త గుణములకు నాశ్రయుడవు, భక్తులకుసుఖప్రదాతవు, దుష్టులకు దుఃఖప్రదాతవు దుర్గమస్వరూపుడవు, దుర్జనవినాశకుడవు, తర్కమున కందనివాడవు, నీవు సర్వమున కాధారుడవు, శంకోపదవములచే శూన్యుడవు, ఉపాధి శూన్యుడవు, నిర్లిప్తుడవు, నిరీహుడవు. నీవు మృత్యువునకు మృత్యువవు. ఆత్మయందే రమించుపూర్ణకాముడవు. నిర్దోషుడవు, నిత్యుడవు, నీవుపరమ సౌభాగ్యశాలివి, దుర్భాగ్యహేతుడవు, ప్రవచనకుశలుండవు, నిన్ను తెలిసి కొనుట యత్యంతకఠినము, అసంభవము. నీనిశ్వాసములనుండే సకలవేదశాస్త్రములు ప్రాదుర్భవించెను. అందువలన నీవు సకలవేదశాస్త్రములకు హేతుభూతుడవు, సర్వ వేదములు నీ స్వరూపమే. ఛందాదివేదాంగము లన్నియు నీకంటె భిన్నములుకావు. నీవు వేదవేత్తవు, సర్వవ్యాపివి యని ప్రార్థించి దేవత లనేకపర్యాయములు ప్రణామము లర్పించిరి. వారందఱు ఆనందబాష్పపూరితనయనములతో పుష్పవృష్టి గురిపించిరి. ప్రాతఃకాలమున నీశ్లోకములందు వర్ణింపబడిన నలుబదిరెండు దివ్యనామములను బఠించినవానికి శ్రీహరియందు సుదృఢభక్తి, దాస్యసౌభాగ్యము, మనోవాంఛితఫలములు లభించును.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లుస్తుతించి దేవతలుతమతమధామములకరిగిరి. అయ్యర్ధరాత్రసమయ

మున వర్షము కురియుదొడంగెను. మధురానగరమంతయు నిశ్చేష్టమై నిద్రా మగ్నమై యుండెను. ఆకాశమునందు ఘోరమగునంధకారము వ్యాపించి యుండెను. యేడుముహూర్తములుదాటి యెనిమిదవముహూర్త మాసన్నము కాగా అర్ధరాత్రిసమయమున సర్వోత్కృష్టమగు శుభలగ్నము సంభవించెను. ఈశుభలగ్నము వేదములకుతక్క నితరులకుదుర్జ్ఞేయము. ఆలగ్నముపై కేవలము శుభగ్రహములదృష్టి కేంద్రీకరింపబడియుండెను. రోహిణీ నక్షత్రసమయమున నష్టమీతిథి సంయోగముచే జయంతి యనుదివ్యయోగము సంపన్నమయ్యెను. మునీశ్వరా ! అర్ధచంద్రోదయము కాగా శుభలగ్నమును వీక్షించి భీతులై సూర్యాదిసర్వగ్రహములు తమగతులను దాటి మీనలగ్నమందు చేరినవి. విధాత యాజ్ఞచే నొకముహూర్తకాలమువఱకు సర్వగ్రహములు ప్రసన్నతాపూర్వకముగ పండ్రెడవస్థానమందు సానందముగ నుండెను. మేఘములు వర్షింపదొడంగెను, చల్లనిపిల్లగాలులు వీచుచుండెను. వసుంధర యత్యంతప్రసన్నముగ నుండెను. దశదిశలు స్వచ్ఛములయ్యెను. మహర్షులు, మనువులు, యక్షులు, గంధర్వులు, కిన్నరలు, సకలదేవతలు ప్రసన్నులై యుండిరి, అప్సరాంగనలానందాతిరేకముచే నృత్యము చేయదొడంగిరి. గంధర్వులు విద్యాధరులు మధురగీతము లాలపింప దొడంగిరి. సరిత్తులు సుఖముగ బ్రవహించుచుండెను. అగ్నిహోత్రునియగ్నిశిఖలు ప్రసన్నతాపూర్వకముగ ప్రజ్వరిల్లుచుండెను. స్వర్గము ఆనకదుందుభుల మనోహరధ్వనులతో ప్రతిధ్వనించెను. పారిజాత కుసుమములు వర్షింపదొడగెను. స్వయముగ పృథ్వి దివ్యనారీరూపమును ధరించి దేవకీసూతికా గృహమును బ్రవేశించెను. జయజయధ్వనులతో శంఖనాదములతో, హరిసంకీర్తనముతో సూతికాగృహము ప్రతిధ్వనించుచుండెను.

ఏతస్మిన్నన్తరే తత్ర పపాత దేవకీ సతీ
నిస్ససార చ వాయుశ్చ దేవకీ జఠరాత్తతః ॥

తత్రైవ భగవాన్ కృష్ణో దివ్యరూపం విధాయ చ ।
హృత్పద్మకోశా ద్దేవక్యా హరిరావిర్బభూవ హ ॥

అతీవకమనీయం చ శరీరం సుమనోహరమ్ ।
ద్విభుజం మురలీహస్తం స్ఫురన్మకరకుణ్డలమ్ ॥
ఈషద్ధాస్యప్రసన్నాస్యం భక్తానుగ్రహకాతరమ్ ।
మణిరత్నేన్ద్రసారాణాం భూషణైశ్చ విభూషితమ్ ॥

నవీననీరదశ్యామం శోభితం పీతవాససా ।
చన్దనాగరుకస్తూరీకుఙ్కుమద్రవచర్చితమ్ ॥
శరత్పార్వణచన్ద్రాస్యం బిమ్బాధరమనోహరమ్ ।
మయూరపుచ్ఛచూడం చ సద్రత్నముకుటోజ్జ్వలమ్ ॥
త్రిభఙ్గవక్రమధ్యం చ వనమాలావిభూషితమ్ ।
శ్రీవత్సవక్షసం చారు కౌస్తుభేన విరాజితమ్ ।
కిశోరవయసం శాన్తం కాన్తం బ్రహ్మేశయోః పరమ్ ॥
దదర్శ వసుదేవశ్చ దేవకీపురతో మునే ।
తుష్టావ పరయా భక్త్యా విస్మయం పరమం యయౌ ॥
పుటాంజలియుతో భూత్వా భక్తినమ్రాస్యకన్ధరః ।
అశ్రుపూర్ణః సపులకో దేవక్యా చ ప్రియయా సహ ॥ 71-76

ప్రసవసమయము మాసన్నము కాగా దేవకీదేవి యచ్చటపడిపోయెను. ఆమె యుదరమునుండి వాయువు బహిర్గతమయ్యెను. అచ్చట దేవకీదేవి హృదయకమలమునుండి శ్రీకృష్ణపరమాత్మ దివ్యసచ్చిదానందవిగ్రహుండై పృథ్విపై నవతరించెను. ఆయన శరీర మత్యంత మనోహరము, కమనీయము. హస్తములందు మురళి శోభిల్లుచుండెను, కర్ణములందు మకరకుండలములు మెరయుచుండెను. ముఖారవిందమందు మందహాసము లంకురింపగ భక్తుల ననుగ్రహించుటకు గాతరుడై యుండెను. శ్రేష్ఠమణిరత్నముల సారతత్త్వములచే నిర్మితములైన దివ్యాభరణము లాయనదివ్యాంగములం దలంకరింపబడి శోభిల్లుచుండెను. పీతాంబరములను ధరించి ప్రకాశించు శ్రీవిగ్రహకాంతి నూతన జలధరమువలె శ్యామలముగానుండెను. శరీరము చందనాగరుకస్తూరీ కుంకుమద్రవ చర్చితమైయుండెను. ఆయన ముఖచంద్రుడు శరత్పూర్ణిమనాటి చంద్రుని శుభ్రజ్యోత్స్నను తిరస్కృత మొనరించుచుండెను. బింబఫల సదృశము లైనఅరుణాధరములు శ్రీకృష్ణునకు శోభను సమకూర్చుచుండెను. శిరముపై నలంకరింపబడి యున్న మయూర పింఛసమన్వితమైనరత్నమయ కిరీటము దివ్యజ్యోతివలె జాజ్వల్యమానముగ ప్రకాశించుచుండెను. త్రిభంగమైన నడుము, వనమాలా శృంగారము, వక్షస్థలమందు శ్రీవత్సము, దానిపై మనోహరకౌస్తుభమణి పరమాత్మ కద్భుతశోభను సమకూర్చుచుండెను. జగన్మోహనుడు కిశోరవయస్కుడు, శాంతిస్వరూపుడు నగు శ్రీహరి బ్రహ్మశివాదులకు పరమ కాంతుడు (ప్రాణవల్లభుడు). మునీశ్వరా! దేవకీవసుదేవులు తమసమక్ష

మున సాక్షాత్కరించిన సచ్చిదానంద విగ్రహుని గాంచి పులకిత శరీరులై యశ్రుపూర్ణ నయనములతో మస్తకములను వంచి భక్తిభావముతో హస్తములను ముకుళించి స్తుతింపదొడంగిరి.

వసుదేవ ఉవాచ:

శ్రీమన్తమిన్ద్రియాతీతమక్షరం నిర్గుణం విభుమ్ ।
ధ్యానాసాధ్యం చ సర్వేషాం పరమాత్మానమీశ్వరమ్ ॥
స్వేచ్ఛామయం సర్వరూపం స్వేచ్ఛారూపధరం పరమ్ ।
నిర్లిప్తపరమం బ్రహ్మ బీజరూపం సనాతనమ్ ॥
స్థూలాత్ స్థూలతరం వ్యాప్తమతిసూక్ష్మమదర్శనమ్ ।
స్థితం సర్వశరీరేషు సాక్షిరూపమదృశ్యకమ్ ॥
శరీరవన్తం సగుణమశరీరం గుణోత్కరమ్ ।
ప్రకృతిం ప్రకృతీశం చ ప్రాకృతం ప్రకృతేః పరమ్ ॥
సర్వేశం సర్వరూపం చ సర్వాన్తకరమవ్యయమ్ ।
సర్వాధారం నిరాధారం నిర్వ్యూహం స్తౌమి కిం విభో ॥
అనన్తః స్తవనేఽశక్తోఽశక్తా దేవీ సరస్వతీ ।
యం స్తోతుమసమర్థశ్చ పంచవక్త్రః షడాననః ।
చతుర్భుజో వేదకర్తా యం స్తోతుమక్షమః సదా ।
గణేశో న సమర్థశ్చ యోగీన్ద్రాణాం గురోర్గురుః ॥
ఋషయో దేవతాశ్చైవ మునీన్ద్రమనుమానవాః ॥
స్వప్నే తేషామదృశ్యం చ త్వామేవం కిం స్తువన్తి తే ।
శ్రుతయః స్తవనేఽశక్తాః కిం స్తువన్తి విపశ్చితః ।
విహాయైవం శరీరం చ బాలో భవితుమర్హసి ॥
వసుదేవకృతం స్తోత్రం త్రిసన్ధ్యం యః పఠేన్నరః ।
భక్తిదాస్యమవాప్నోతి శ్రీకృష్ణచరణామ్బుజే ॥
విశిష్టపుత్రం లభతే హరిదాసం గుణాన్వితమ్ ।
సంకటం నిస్తరేత్ తూర్ణం శత్రుభీత్యాః ప్రముచ్యతే ॥

దేవా ! నీవు శ్రీమంతుడవు (సహజ శోభాసంపన్నుడవు), ఇంద్రియాతీతుడవు, అవినాశివి, నిర్గుణుడవు, సర్వవ్యాపివి, ధ్యానముచే నసాధ్యుడవు, సర్వేశ్వరుడవు, పరమాత్మవు. స్వేచ్ఛామయుడవు, సర్వరూపుడవు, స్వచ్ఛం

తపఃఫలప్రసాదముగా నే నీసమయమున నీ కుమారునిగా నవతరించితిని. మీకు కళ్యాణమగుగాక. నీమనోభీష్టముల నర్థింపుము, అనుగ్రహించెదను. పూర్వకాలమందు నీవు తాపసులలో శ్రేష్ఠుడవైన కశ్యపప్రజాపతివి. ఈ దేవకి యాజన్మలో నీయర్థాంగి యగుచున్నది. మీరిర్వురఖండతపముద్వారా నన్నారాధించిరి. సాక్షాత్కరించిననన్ను దర్శించి నావంటి కుమారునే ప్రసాదింపవలసినదిగా మీరు నన్నర్థించితిరి. మీకు వరము ప్రసాదించి పిమ్మట నే నిట్లాలోచించితిని నాతో సమానుడు సర్వజగత్తులలోను లేడు. అందువలన నేనే స్వయముగా నీకు ప్రసాదించిన వరమును సంపూర్ణము నొనరించుటకు మీపుత్రుడనై యావిర్భవించితిని. పూర్వజన్మమందుగూడ నాయంశతో నేను వామనుడనై మీ కుమారునిగా నవతరించితిని. కాని యీజన్మమున పరిపూర్ణ పరమాత్మనగు నేను సకలకళా సమన్వితుడనై మీయఖండతపః ప్రభావమున బుత్రుడనై యవతరించితిని. మహానుభావా! వసుదేవా! నీవు నన్ను పరబ్రహ్మభావముతో, పుత్రభావముతో గుమారునిగా బొందితివి. అందువలన మీరిర్వురు జీవన్ముక్తులు కాగలరు. తండ్రీ! తత్క్షణమే నన్ను తోడ్కొని గోకులమునకు జనుము. గోకులమందు నన్ను యశోదాగృహమునుంచి, యశోదకు కుమార్తెగా నవతరించిన యోగమాయను దీసికొని మధురకు మరలిరమ్ము.

ఇట్లు వసుదేవు నాదేశించి శ్రీకృష్ణుడు దివ్యశిశురూపమును ధరించెను. పరమాత్ముని యాజ్ఞను శిరోధార్యముగా నెంచి వసుదేవుడు శ్రీకృష్ణుని యంకమున జేర్చికొని నందగోకులము జేరెను. నందగోకులమంతయు మాయాప్రభావమువలన గాఢనిద్రకు వశమై యుండెను. వసుదేవుడు నందభవనమున బ్రవేశించి యశోదవద్ద పరుండి యఖండకాంతితో ప్రకాశించుచున్న శిశురూపధారిణి యైన యోగమాయను సందర్శించెను. తత్క్షణమే యతడు పరబ్రహ్మమును యశోదాపర్యంకమందుంచి యోగమాయను దనయొడిలోనికిదీసికొని మధురకు దిరిగివచ్చెను. భవనమున బ్రవేశింపగనే యోగమాయ యుచ్చైస్స్వరముతో రోదించెను. ఆశబ్దమువలన మేల్కాంచిన రాక్షసరక్షకులు శిశుజనన వృత్తాంతమును గంసనృపాలునకు నివేదించిరి. వెంటనే కంసుడు కరవాలమును ధరించి యాబాలికను వధింప యత్నింపగా దేవకీవసుదేవులు వలదని యనేకవిధముల బ్రార్థించి యిట్లుపల్కిరి. నృపశ్రేష్ఠా! కంసభూపాలా! నీవు నీతిశాస్త్రకోవిదుడవు. అయినను నిర్దయుడవై మాయార్గురు పుత్రులను

కము, సంకటమోచనము, సుఖదాయకము, పుణ్యప్రదాయకము. (శ్రీమద్భాగవతమందు వర్ణించిన వర్ణన మీావర్ణనలు భేదించును. భాగవతమందు చతుర్భుజరూపుడైన శ్రీమన్నారాయణుడు పృథ్విపై నవతరించును. కన్యను కంసుడు సంహరింపబోగా నామె యాకాశమార్గమున కెగిరి యారాక్షసుని హెచ్చరించెను. కల్పభేదము ననుసరించి యీరెండు మహాపురాణములలోను వర్ణింపబడిన వర్ణనములు నిస్సంకోచముగ సత్యములే)

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండమున నారదనారాయణ
సంవాదమున శ్రీకృష్ణుడు మధురయం
దావిర్భవించుట యను ఏడవ
అధ్యాయము సంపూర్ణము

# ఎనిదవ అధ్యాయము

## శ్రీకృష్ణజన్మాష్టమీవ్రతవిధానము
## పూజోపవాసాదులనిరూపణము

నారదుడు పలికెను :

శ్రీకృష్ణజన్మాష్టమీవ్రతము సర్వవ్రతములందుత్తమవ్రతమని మహాత్ములు ప్రవచించిరి. కావున మీరా దివ్యవ్రతమును నాకుపదేశింపుడు. ఏ జన్మాష్టమీ వ్రతమున జయంతి యనుయోగము ప్రాప్తించునో యావ్రతఫలమెట్లుండును ? జయంతి యోగము సంభవింపని సామాన్యజన్మాష్టమీవ్రతానుష్ఠాన ఫల మెట్లుండును ? వ్రతమాచరింపని యెడల లేదా వ్రతదినమున భుజించినయెడల యేయేదోషములు సంభవించునో వివరింపుడు. జయంతీయోగ సమ్మిళిత వ్రతదినమున లేదా సామాన్యవ్రతదినమున నుపవసించిన నేయే యభీష్టఫలములులభించునో వర్ణింపుడు. ప్రభూ ! వ్రతపూజా విధానముల నుపదేశింపుడు. వ్రతసమయమందే యేనియమములను పాటింపవలెను ?

ఉపవాస సమయమందు, వ్రత పారణాసమయమందు, పూజాసమయమందు నుండు నియమముల నుపదేశింపుడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

మునీశ్వరా ! సప్తమీతిథినాడు, పారాయణ మొనరించు దినమున వ్రతి హవిష్యాన్నమునే భుజించి నిగ్రహముతో నుండవలెను. సప్తమినాటిరాత్రి గడచినపిదప ప్రాతఃకాలముననే నిద్రమేల్కాంచి, ప్రాతఃకాల కృత్యములను నెఱవేర్చి సంకల్పింపవలెను. ఆసంకల్పమందు వ్రతి నేనీ దినమున శ్రీకృష్ణ ప్రీత్యర్థము వ్రత మొనరించి యుపవసించెద ననిప్రతిజ్ఞ బూనవలెను. మన్వాది తిథిదినము వ్రత మాచరించి యుపవసించిన నేఫలము లభించునో, అంతకన్నమిన్నగ భాద్రపదమాసము దష్టమీదినమున స్నానమాడి వ్రత పూజ లొనరించిన కలుగును. ఆదినమున పితరులకుజలమునైన తర్పణము చేసిన అదియే యవిచ్ఛిన్నముగ నూఱువర్షములవఱకు పితరులకు గయా శ్రాద్ధ మంతటిఫలము నిచ్చును, ఇందు సంశయము లేదు.

ప్రతదినమున స్నానాదినిత్యకర్మల నొనరించి సూతికాగృహనిర్మాణ మొనరింపవలెను. ఆగృహమున లోహఖడ్గమును, ప్రజ్వలితాగ్నిని, రక్షకులను నుంచవలెను. పూజార్థము షోడశోపచారపూజాసామగ్రిని, ఎనిమిదివిధము లైనఫలములను, తీపిపదార్థములను, నైవేద్యములను సమకూర్చుకొనవలెను. నారదా ! ఆసనము, వస్త్రము, పాద్యము, మధుపర్కము, అర్ఘ్యము, ఆచమ నీయము, స్నానము, శయ్య, గంధము, పుష్పము, నైవేద్యము, తాంబూ లము, అనులేపనము, ధూపము, దీపము, ఆభూషణములు ఇవియే షోడశోప చారములు.

ప్రాతఃకాలముననే స్నాన మాచరించి, సంకల్పించి పాదములను ప్రక్షాళన మొనరించుకొని యాసనముపై గూర్చుండి యాచమన మొనరించి, స్వస్తివచనపూర్వకముగ కలశస్థాపన మొనరింపవలెను. కలశసమీపమున పంచదేవతల నారాధింపవలెను. (పంచదేవత లనగ గణేశ్వరుడు, శ్రీమహా విష్ణువు, శంకరుడు, పార్వతి, సూర్యభగవానుడు). కలశముపై బరమేశ్వరు డైన శ్రీకృష్ణుని యావాహన మొనరించి తదనంతరము దేవకీవసుదేవులను, యశోదానందులను, రోహిణీబలరాములను, షష్ఠిదేవిని, వసుంధరను, బ్రహ్మ

సంహరించితివి. అయినను నీకు మాపై దయలేదు, మాకు అష్టమ గర్భమున
నబలయైన యీ బాలిక యుదయించినది. ఈపసికందును సంహరించి నీవేమై
శ్వర్యమును బొందగలవు ? ఈ యబల నిన్ను సంహరింపగలదా ! కావున
కృపామయుడవై నీ మేనకోడలిని సంహరింపకుమని," పలికి దేవకీవసుదేవులు
దుఃఖింపదొడంగిరి. వారికరుణాపూర్ణ వచనములను విని కంసు డిట్లుపల్కెను.
"సహోదరీ ! విధాత తృణముచే బర్వతమునైనను బెకలింపగలసమ
ర్థుడు. ఒక్క కీటకముద్వారా సింహమును వధింపజేయగలడు, ఒక్కరోమముచే
మత్తగజమునైనను సంహరింప గలసమర్థుడు. శిశువుచే బహాబలసంపన్నుని
మడియింపగలడు. ఇట్లువిధాతజన్యునిద్వారా జనకుని, భక్ష్యముద్వారమున భక్ష
కుని, అగ్నిద్వారమున జలములను. ఎండుగడ్డిచే వహ్నిని మడియింపజేయుటలో
సమర్థుడు. అందువలన త్రిలోకములలోను విధాతగతిని యర్థముచేసికొనుట
యత్యంతకఠినము. జహ్నువనుద్విజు డొక్కడే విధిబలమువలన మహా
శక్తిసంపన్నుడై సప్తసముద్రములను నాపోశనము పట్టలేదా" !

యిట్లు ప్రత్యుత్తర మొసంగి కంసుడు బాలికను వధించుట కుద్యుక్తుడు
కాగా, అశరీరవాణి యిట్లుపల్కెను "మూఢా ! కంసభూపాలా ! విధాత
గతిని గమనింపక నీవీశిశువు నేలవధించుచున్నావు ? నిన్ను వధించు పరమాత్మ
బాలకరూపమున నావిర్భవించి సురక్షితముగ నున్నాడు, సమయ మాసన్న
మైనపుడు నీయెదుట సాక్షాత్కరించి నిన్ను సంహరింప గలడు" అశరీరవాణి
నాలకించి కంసుడా బాలికను వధింపక వసుదేవునకు దిరిగి యప్పగించెను.
దేవకీవసుదేవులు సకలసౌందర్యరాశి యైన యాబాలికను బొంది యత్యంత
ప్రసన్నులైరి. మరణించిన పుత్రిక మరల జీవించినట్లు వారానందించిరి.
వసుదేవు డత్యంత ప్రసన్నుడై యసంఖ్యాక బ్రాహ్మణుల కనేకానేక ధనకనక
వస్తువాహనములను దాన మొసగించెను. విప్రవరా ! ఆ కన్యారత్నమే పర
మాత్మ యగు శ్రీకృష్ణునకు పెద్దఅక్కయైనది. ఆమె పార్వతిదేవియంశముతో
నావిర్భవించెను. లోకములో 'ఏకానాంశ' యనునామమున నాకన్య విఖ్యాతి
గాంచెను. ద్వారకయందు రుక్మిణీ వివాహ సందర్భమున వసుదేవుడా కన్యకా
మణిని శంకరునియంశ సంభూతుడైన దుర్వాసమహర్షికి నర్ధాంగిగ భక్తితో
సమర్పించెను. మునీశ్వరా ! ఇట్లు శ్రీకృష్ణదివ్యావిర్భావవృత్తాంతమును
వర్ణించితిని, ఈ హరికథాశ్రవణ కీర్తనము జన్మమృత్యుజరావ్యాధి నిర్మూల

నక్షత్ర మైనరోహిణిని, అష్టమీతిథి కధిష్ఠాత్రీదేవిని, స్థానదేవతను, అశ్వత్థామను, బలిచక్రవర్తిని, హనుమంతుని, విభీషణుని, కృపాచార్యుని, పరశురాముని, వ్యాసదేవుని, మార్కండేయమహర్షిని యాహ్వానించి తదనంతరము పుష్పములతో పూజించి పరమాత్మ యగుశ్రీకృష్ణుని ధ్యానింపవలెను. నారదా ! ప్రథమమున బ్రహ్మ సనత్కుమారున కుపదేశించిన సామవేదోక్త శ్రీకృష్ణుధ్యానము నుపదేశించెదను అవధరింపుము.

> బాలం నీలామ్బుదాభమతిశయరుచిరం స్మేరవక్త్రామ్బుజాభం ।
> బ్రహ్మేశానన్తధర్మైః కతి కతి దివసైః స్తూయమానం పరంయత్ ॥
> ధ్యానాసాధ్యమృషీన్ద్రైర్మునిమనుజవరైః సిద్ధసంఘైరసాధ్యం ।
> యోగీన్ద్రాణామచిన్త్యమతిశయమతులం సాక్షిరూపం భజేఽహమ్ ॥

నల్లనిమేఘమువలె మిగులసుందర మైనవాడు; చిరునవ్వుతో గూడిన ముఖపద్మముగలవాడు, బ్రహ్మ, ఈశానుడు, అనంతుడు, ధర్ముడు మొదలగు దేవతలచే బహుదినములనుండి సేవింపబడుచున్నవాడు, ఋషిశ్రేష్ఠులధ్యానమున కసాధ్యమైనవాడు, మునులు, మానవశ్రేష్ఠులు, సిద్ధులు మున్నగువారికిని నసాధ్యమైనవాడు, యోగీంద్రుల కచింత్యుడు, సర్వవిషయములలోను శ్రేష్ఠుడు, సాటిలేనివాడు, సాక్షిరూపుడు నగుబాలముకుందుని సేవించుచున్నాను.

ఇట్లుధ్యాన మొనరించి మంత్రోచ్చారణపూర్వకముగ సహస్రనామములతో పూజించి క్రమముగ సమస్తోపచారములను సమర్పించి వ్రతి వ్రత మొనరింపవలెను. ప్రత్యేకోపచారసమర్పణమం దుచ్చరించుమంత్రముల నుపదేశించెదను శ్రవణమొనరింపుము.

### ఆసన సమర్పణము

> ఆసనం సర్వశోభాఢ్యం సద్రత్నమణినిర్మితమ్ ।
> విచిత్రితం చ చిత్రేణ గృహ్యతాం శోభనం హరే॥ 22

హరే ! ఉత్తమరత్నములతోను, మణులతోను నిర్మింపబడినది, సంపూర్ణశోభాసంపన్నమైనది, చిత్రవిచిత్రములుగ చిత్రితమైనది యగునీసుందరాసనమును గృపతో గ్రహింపుము.

### వ స్త్ర స మ ర్ప ణ ము

వసనం వహ్నిశుద్ధం చ నిర్మితం విశ్వకర్మణా ।
ప్రతప్తస్వర్ణఖచితం వసనం గృహ్యతాం హరే ॥ 23

హరే ! అగ్నిశుద్ధమైనది, ప్రతప్త మగుసువర్ణముతో గూర్పబడినది, విశ్వకర్మచే నిర్మింపబడినది యగునీదివ్యవస్త్రమును స్వీకరింపుము.

### పా ద్య స మ ర్ప ణ ము

పాదప్రక్షాలనార్థం చ స్వర్ణపాత్రస్థితం జలమ్ ।
పవిత్రం నిర్మలం చారు పుష్పం పాద్యం చ గృహ్యతామ్ ॥

గోవిందా ! మీ చరణములు ప్రక్షాళన మొనరించుకొనుటకొఱకు స్వర్ణపాత్రమం దుంచబడెన యీపరమపవిత్రజలము లత్యంతనిర్మలములు. సుందరపుష్పములతో సమ్మిళితములై యున్న నీపాద్యజలములను స్వీకరింపుము.

### మ ధు ప ర్క ము లే దా ప ం చా మృ త స మ ర్ప ణ ము

మధు సర్పిర్దధిక్షీరం శర్కరాసంయుతం పరమ్ ।
స్వర్ణపాత్రస్థితం దేయం స్నానార్థం గృహ్యతాం హరే ॥

దేవా! హరే ! మధువు (తేనె), ఘృతము, దధి, క్షీరములు, చక్కెర-అనునైదుపదార్థములతో గూడిన మధుపర్కము లేదాపంచామృతమును సువర్ణపాత్రమం దుంచి నీకు నివేదింపబడినది. దేవా ! స్నానముకొఱ కీమధుపర్కమును స్వీకరింపుము.

### అ ర్ఘ్య స మ ర్ప ణ ము

దూర్వాక్షతం శుక్లపుష్పం స్వచ్ఛతోయసమన్వితమ్ ।
చన్దనాగరుకస్తూరీసహితం గృహ్యతాం హరే ॥ 26

హరే ! దూర్వాక్షతలతోను, శ్వేతపుష్పములతోను, చందనాగరుకస్తూరీసుగంధద్రవ్యములతోనుసమ్మిళితమైన యీయర్ఘ్యము మీసేవయందు సమర్పితమైనది. కృపతో గ్రహింపుము.

### ఆ చ మ నీ య స మ ర్ప ణ ము

సుస్వాదు స్వచ్ఛతోయం చ వాసితం గన్ధవస్తునా ।
శుద్ధమాచమనార్హం చ గృహ్యతాం పరమేశ్వర ॥ 27

పరమేశ్వరా ! సుగంధపదార్థములతో వాసితమై యున్న యీశుద్ధస్వాదు జలము లాచమనమునకు యోగ్యములైనవి. కృపతో నీయాచమనమును గ్రహింపుము.

## స్నానీయ సమర్పణము

గన్ధద్రవ్యసమాయుక్తం విష్ణుతైలం సువాసితమ్ ।
ఆమలక్యాద్రవం చైవ స్నానీయం గృహ్యతాం హరే ॥ 28

హరే ! సుగంధద్రవ్యయుక్తసువాసితవిష్ణుతైలము, ఆమలకచూర్ణము మున్నగుస్నానోపయోగద్రవ్యములు నీకు సమర్పితములు, కృపతో స్వీకరింపుము.

## శయ్యా సమర్పణము

సద్రత్నమణిసారేణ రచితాం సుమనోహరామ్ ।
ఛాదితాం సూక్ష్మవస్త్రేణ శయ్యాం చ గృహ్యతాం హరే ॥

శ్రీహరీ ! ఉత్తమరత్నమణులసారముతో నిర్మింపబడినయత్యంత మనోహరసూక్ష్మవస్త్రముచే నాచ్ఛాదితమైయున్న యీదివ్యశయ్య నీసేవ యందు సమర్పితమైనది, కృపతో గ్రహింపుము.

## గంధ సమర్పణము

చూర్ణం చ వృక్షభేదానాం మూలానాం ద్రవసంయుతమ్ ।
కస్తూరీరససంయుక్తో గన్ధోఽయం గృహ్యతాం హరే ॥ 90

శ్రీహరీ ! వివిన్నవృక్షములచూర్ణములచేయుక్తమైన నానావిధవృక్ష ద్రవములచే పూర్ణమైన, కస్తూరీరసముచే మిశ్రితమైనమీగంధము మీసేవయం దర్పితము, కరుణతో స్వీకరింపుము.

## పుష్ప సమర్పణము

పుష్పం సుగన్ధసంయుక్తం వనస్పతిసముద్భవమ్ ।
సుప్రియం సర్వదేవానాం గృహ్యతాం పరమేశ్వర ॥ 31

పరమేశ్వరా ! సర్వదేవతల కత్యంతప్రియమైనవి, నానావృక్షముల నుండి పుట్టినవి, సుగంధముతో గూడినవియు నగుపుష్పములు సమర్పితములు దయతో స్వీకరింపుము.

నై వే ద్య స మ ర్ప ణ ము

శర్కరాస్వస్తికాక్తం చ మిష్టద్రవ్యసమన్వితమ్ ।
సుపక్వఫలసంయుక్తం నైవేద్యం గృహ్యతాం హరే
శీతలం శర్కరాయుక్తం క్షీరం స్వాదు సుపక్వకమ్ ।
లడ్డుకం మోదకం చైవ సర్పిః క్షీరం గుడం మధు
నవోద్భూతం దధి తక్రం నైవేద్యం గృహ్యతాం హరే ॥ 33

గోవిన్దా ! శర్కర, స్వస్తిక నామాంకితము లైనమధురపదార్థములు, నానానైవేద్యములు, పరిపక్వము లైనమధురఫలములు నీనైవేద్యమందు సమర్పితములు, దయతో స్వీకరింపుము. హరీ ! చక్కెరకలిపిన స్వాదిష్ట మైన శీతలక్షీరములను, సుందరపక్వాన్నములను, లడ్డులను, మోదకములను, ఘృతమిశ్రిత మగుపరమాన్నమును, గుడము (బెల్లము)ను, మధువు (తేనె)ను, దధిని, తక్రము (మజ్జిగ)ను నీకు నైవేద్యరూపమున సమర్పించుచున్నాను, కృపతో నీనైవేద్యముల నారగింపుము.

తాం బూ ల స మ ర్ప ణ ము

తామ్బూలం భోగసారం చ కర్పూరాదిసమన్వితమ్।
మయా నివేదితం భక్త్యా గృహ్యతాం పరమేశ్వర ॥ 34

పరమేశ్వరా ! భోగములసారభూత మైనమీతాంబూలము కర్పూరాది సుగంధద్రవ్యయుక్తము, దీనిని భక్తిభావముతో నీకు సమర్పించుచున్నాను, కృపాపూర్వకముగ గ్రహింపుము.

అ ను లే ప న స మ ర్ప ణ ము

చన్దనాగరుకస్తూరీకుఙ్కుమద్రవసంయుతమ్।
ఆవీరచూర్ణం రుచిరం గృహ్యతాం పరమేశ్వర ॥ 35

పరమేశ్వరా ! చందనాగరుకస్తూరీకుంకుమద్రవములచే సంయుక్త యున్న మీసుందరావీరచూర్ణము ననులేపనరూపమున సమర్పించుచున్నాను కృపతో గ్రహింపుము.

ధూ ప స మ ర్ప ణ ము

తరుభేదరసోత్కృష్టో గన్ధయుక్తాగ్నినా సహ ।
సుప్రియః సర్వదేవానాం ధూపోఽయం గృహ్యతాం హరే ॥ 36

హరీ! విభిన్నవృక్షరసోత్కర్ష మైనదియు, సుగంధపదార్థసంయోగముచే నిర్మింపబడినదియు నగునీధూప మగ్నిసాహచర్యమును పొంది సర్వదేవతల కత్యంతప్రియము కాగలదు; ఈసుగంధధూపము నీసేవయందు సమర్పిత మైనది కృపతో స్వీకరింపుము.

దీ ప స మ ర్ప ణ ము

ఘోరాన్ధకారనాశైకహేతురేవ శుభావహః ।
సుప్రదీపో దీప్తికరో దీపోఽయం గృహ్యతాం హరే ॥ 37

గోవిందా! హరీ! అత్యంతప్రకాశమాన మైనఉత్తమప్రభాప్రసార మొనరించు నీసుందరదీపము ఘోరాంధకారమును నశింపజేయుట కేకమాత్ర హేతువైనది కృపతో నీదీపమును స్వీకరింపుము.

జ ల స మ ర్ప ణ ము

పవిత్రం నిర్మలం తోయం కర్పూరాదిసువాసితమ్ ।
జీవనం సర్వజీవానాం పానార్థం గృహ్యతాం హరే ॥ 38

హరీ! కర్పూరాదిసుగంధద్రవ్యములచే సువాసితము, సర్వజీవులకు పానార్థమైనది, పవిత్రము, నిర్మలము నగునీజలములను స్వీకరింపుము.

ఆ భూ ష ణ స మ ర్ప ణ ము

నానాపుష్పసమాయుక్తం గ్రథితం సూక్ష్మతన్తునా ।
శరీరభూషణవరం మాల్యం చ ప్రతిగృహ్యతామ్ ॥ 39

గోవిందా నానావిధదివ్యపుష్పములను సూక్ష్మము లగుదారములచే కూర్చబడినది, శరీరము నలంకరించుకొనుటకు సుందరమైనది యగునీమాలలను కృపతో స్వీకరింపుము.

పూజోపయోగద్రవ్యములను దానముచేసి వ్రతస్థానమం దుంచినద్రవ్యములను శ్రీహరికి సమర్పింపవలెను. పరమేశ్వరా! వృక్షములకు బీజస్వరూపము లైన ఈసుందరస్వాదిష్టఫలములు వంశవృద్ధికారకములు, ఈఫలములను స్వీకరింపు మని శ్రీకృష్ణుని ప్రార్థింపవలెను. ఆవాహన మొనరించిన సకలదేవతలను ప్రతి క్రమముగ బూజింపవలెను. తదనంతరము వారికి క్రమ

పముగ ముమ్మారు పుష్పాంజలుల నర్పింపవలెను. సునందుని, నందుని, కుముదాదిగోపులను, గోపికలను, రాధాదేవిని, గణేశ్వరుని, కార్తికేయుని, బ్రహ్మను శివుని, పార్వతిని, లక్ష్మిని, సరస్వతిని, దిక్పాలకులను, గ్రహములను, ఆదిశేషుని, సుదర్శనచక్రమును, పార్షదశ్రేష్ఠులను, బూజించి సకలదేవతలకు సాష్టాంగదండప్రణామము లర్పింపవలెను. పిమ్మట పురోహితు లైన బ్రాహ్మణులకు నైవేద్యము లర్పించి దక్షిణ నొసంగి జన్మాధ్యాయమందు వర్ణింపబడిన శ్రీకృష్ణదివ్యావతారప్రసంగమును భక్తిభావముతో శ్రవణ మొనరింపవలెను. ఆదినమున నుపవాస ముండి శ్రీకృష్ణమహామంత్రజప మొనరించుచు రాత్రియంతయు కుశాసనము పైగూర్చుండి జాగరణ మొనరింపవలెను. ప్రాతఃకాలముననే నిత్యకర్మలను సంపన్న మొనరించుకొని శ్రీహరిని సానందముగ నారాధించి బ్రాహ్మణులకు నాహూతు లైనయతిథులకు, భగవద్భక్తులకు సంతర్పణము గావించి భగవన్నామసంకీర్తన మొనరింపవలెను.

నారదుడు పలికెను:

వేదవేత్తలలో శ్రేష్ఠుడవైనమహర్షీ ! నారాయణ యతీంద్రా ! వ్రతకాలమందు సర్వసమ్మత మైనవేదోక్తవ్యవస్థ యెట్లుండును ? వేదార్థములను ప్రాచీనసంహితలను బరిశోధించి మీ వ్రతము నాచరించుటవలన, ఉపవాస జాగరణాదులవలన లభించునఖండఫలమును గృపతో వర్ణింపుము. జన్మాష్టమీ దినమున భుజించిన నేయేపాపములు సంభవించునో తెలియజెప్పుము.

శ్రీనారాయణఋషి పలికెను:

అర్ధరాత్రసమయమున నష్టమీతిథినాల్గవభాగము శేషించినను ఆసమయము వ్రతమునకు ముఖ్యకాలమే యగును. అప్పుడే శ్రీహరి యవతరించెను, కావున నాసమయమున చేసినజప మఖండపుణ్యమును బ్రసాదించును. ఆముహూర్తమునే జయంతియందురు. జయంతిసమయమున విద్వాంసు లైనవారు వ్రతోపవాసజాగరణముల నొనరింపవలెను. ఈసమయము పవిత్ర మని, సర్వసమ్మతమని వేదవేత్తలకథనము. శ్రీకృష్ణజన్మాష్టమీదినమున నుపవాస ముండి, జాగరణముచేసి వ్రతమొనరించువారు కోట్లకొలదిజన్మలచే సముపార్జితము లైనపాపములనుండి విముక్తులు కాగల రనిబ్రహ్మవచనము.

తత్రి జాగరణం కృత్వా యశ్చోపోష్య వ్రతం చరేత్ ।
కోటిజన్మార్జి తాత్ పాపాన్ముచ్యతే నాత్ర సంశయః ॥ 53

సప్తమితో గూడియున్నయష్టమీదినమున వ్రత మొనరింపరాదు. రోహిణీనక్షత్రయోగ మున్నను సప్తమితో గూడియున్నయష్టమినాడు వ్రత మాచరింపరాదు. ఎందువలెననగా, దేవకీనందను డవిద్ధతిథినక్షత్రములయం దవతరించెను. ఈవిశిష్టమంగళమయక్షణము వేదవేదాంగములకుగూడ గుప్తమే. రోహిణీనక్షత్రము గడచినపిమ్మట వ్రతి పారణ మొనరింపవలెను. తిథ్యంతమందు శ్రీహరిని స్మరించి దేవతలను బూజించి చేసినపారణమే పవిత్రము. ఆపారణము మనుష్యులసర్వపాపములను నశింపజేయగలదు. ఉపవాసవ్రతములన్నింటిలోను పగటియందే పారణ మొనరింపవలె ననువిధానము కలదు. పారణ మొనరింపనియెడల వ్రతమునకు లోటువచ్చును. రోహిణీవ్రత మందుదక్క నన్యవ్రతములందు రాత్రివేళ పారణ మొనరింపరాదు. మహారాత్రిని వీడి రెండవరాత్రియందు పారణ మొనరింపవచ్చును. బ్రాహ్మణులను, దేవతలను బూజించి పూర్వాహ్ణకాలమున పారణ మొనరించుట యత్యుత్తమ మనితలంపబడినది.

రోహిణీవ్రతము సర్వసమ్మతము. ఆవ్రతానుష్ఠాన మవశ్య మొనరింపవలెను. బుధవారమునాడుగాని, సోమవారమునాడుగాని, జయంతి సంభవించినదినమున వ్రత మొనరించినవ్రతి మరల గర్భవాసము పొందడు. ఉదయకాలమందు కించిన్మాత్రమే యష్టమి యుండి పగలు రాత్రియంతయు నవమియున్న ఆదినము సోమవారమైనను, బుధవారమైనను రోహిణీనక్షత్రయుక్తమైనను అన్నిటికంటె నుత్తమవ్రతసమయ మని గ్రహింపవలెను. వందలాది సంవత్సరములకు గూడ నట్టియోగము దుర్లభము. అట్టియుత్తమవ్రతము ననుష్ఠాన మొనరించినవ్రతి తనతరములవారి నందఱిని యుద్ధరింపగలడు. సంపద్రహితు డైవభక్తు డీవ్రతోత్సవ మొనరింపపనిలేదు అతడు కేవల ముపవాసజాగరణముల నొనరించిన మాధవుడు ప్రసన్నుడగును. అనేకవిధములగునుపచారములను సమర్పించి జాగరణ మొనరించి, యనుష్ఠించినచో దైత్యశత్రు వగుశ్రీహరియొక్కజయంతీవ్రత మఖండఫలములను ప్రసాదింపగలదు. అష్టమీవ్రతోత్సవసమయమందు కృపణుడై వర్తించువానికి వ్రతఫలము లభింపదు. విద్వాంసు లైనపురుషు లష్టమినందుగాని, రోహిణీనక్షత్ర

సమయమందుగాని పారణ మొనరింపరాదు. అట్లొనరించిన పూర్వకృతపుణ్య ములు, ఉపవాసవ్రతఫలములు నశింపగలవు. అందువలన బ్రియత్నపూర్వక ముగ తిథినక్షత్రాంతమందే పారణ మొనరింపవలెను. అనివార్యకారణముల వలన తిథినక్షత్రకాలము సంపూర్ణముగ గడచిపోయినచో వ్రతి యాదినమును వీడి మూడవదినమున పారణ మొనరింపవలెను. ఆద్యంతములయందు నాలుగసిదండములను వీడి మధ్యశేషించిన మూడుఘడియల రాత్రిని 'త్రియమా రజని'యందురు. ఆరజనికి ఆదియందు, అంతమందు రెండుసంధ్య లుండును. వానిలో నొకటి ప్రాతఃసంధ్య, రెండవది సాయంసంధ్య.

శుద్ధజన్మాష్టమీతిథినాడు జాగరణముచేసి ప్రాతానుష్ఠాన మొన రించుమనుష్యుడు తా నొనరించిన వందలకొలదిజన్మల ఘోరపాపములనుండి విముక్తుడు కాగలడు. శుద్ధజన్మాష్టమినాడు కేవల ముపవాస మొనరించి వ్రతోత్సవము, జాగరణముచేయనివానికి అశ్వమేధయజ్ఞఫలము మాత్రమే లభింపగలదు.

> శ్రీకృష్ణజన్మదివసే యశ్చ భుంక్తే నరాధమః ।
> స భవేన్మాతృగామీ చ బ్రహ్మహత్యాశతం లభేత్ ॥
>
> కోటిజన్మార్జితం పుణ్యం తస్య నశ్యతి నిశ్చితమ్ ।
> అనర్హశ్చ శుచిః శశ్వత్ దైవే పిత్రే చ కర్మణి ॥ 76-77

శ్రీకృష్ణజన్మాష్టమీదినమున నుపవాస ముండక భుజించునరాధముడు బ్రహ్మహత్యాదిపాతకములకు గురికాగలడు. అత డొనరించినకోటిజన్మార్జిత పుణ్యములు నశింపగలవు. ఇదినిశ్చయము. అతడు శుచికి, శాశ్వతముగ దేవపితృకర్మలకు ననర్హుడు కాగలడు.

> ఉపవాసాసమర్థశ్చేదేకం విప్రం చ భోజయేత్ ।
> తావద్దానాని వా దద్యాద్ యద్భుక్తం ద్విగుణం భవేత్ ।
> సహస్రసమ్మితాం దేవీం జపేద్వా ప్రాణసంయమమ్।
> కుర్యాద్ద్వాదశసంఖ్యాకాన్ వ్రతార్థం తద్వ్రతే నరః ॥ 85

ఉపవాసముచేయుటయం దసమర్థుడైనచో నొకబ్రాహ్మణునకు భోజనము పెట్టవలెను. లేనిచో నతడు రెండుపర్యాయములకు భుజించుటకు దగినధనము నీయవలెను. అదికూడ లేనిచో ప్రాణాయామపూర్వకముగ నొకసహస్ర గాయత్రిని జపింపవలెను.

మానవు డీవ్రతసమయమున బంగ్రేడదువేల పర్యాయములు శ్రీకృష్ణ మహామంత్రమును జపించిన నుత్తమఫలమును బొందగలడు. నారదా! నేను నాపితృదేవు లైనధర్మదేవునిముఖారవిందమునుండి శ్రవణ మొనరించిన యీ శ్రీకృష్ణజన్మాష్టమీవ్రతవిధానమును, తత్ఫలమును వివరించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున శ్రీకృష్ణజన్మాష్టమీవ్రత
పూజోపవాస నిరూపణమను
ఎనిదవయధ్యాయము
సంపూర్ణము.

—o—

# తొమ్మిదవ అధ్యాయము

## ధరాద్రోణుల తపము, అదితి కద్రువలు పరస్పరము శపించుకొని దేవకీ రోహిణులుగ భూమిపై జన్మించుట; శ్రీకృష్ణ బలరాముల జన్మోత్సవము

నారదుడు పలికెను:

దేవా! గోకులములో యశోదానందులభవనమున వసుదేవుడు శ్రీకృష్ణునియశోదపర్యంకమం దుంచి శిశురూపిణి యైనమహామాయను దీసి కొని మథురకు వెడలినా డనినీవు ప్రవచించితివి. జగన్నాథునే కుమారునిగ జనసినపరమభాగ్యశాలి యగునందగోపు డెట్లుపుత్రోత్సవ మొనరించెను? ఆభగవానుడు గోకులమందే యేదివ్యలీల లొనరించెను? శ్రీకృష్ణపరమాత్మ యెన్నివర్షములవఱకు గోకులమున క్రీడించి గోపగోపికలను ధన్యులుగ నొనరించెను! ప్రభూ! పరమాత్మయొక్కబాలక్రీడలను క్రమముగ వర్ణించి నన్ను

గృతార్థునిగ జేయుడు. పూర్వకాలమున గోలోకపరంధామములో రాధ
కిచ్చినమాటను భగవంతు డెట్లు గోకులమున నెఱవేర్చెను. ఆసమయమున
భూతలముపై బృందావనస్వరూప మెట్లుండెను ? ఆబృందావనాంతర్గత
రాసమండలమును, దివ్యరాసక్రీడను, జలక్రీడాద్యద్భుతలీలలను విస్తారముగ
వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

వస స్తపః కిం చకార యశోదా చాథ రోహిణీ ।
హరేః పూర్వం చ హలినః కుత్ర జన్మ బభూవ హ ॥

పీయూషఖణ్డమాఖ్యానమపూర్వం శ్రీహరేః స్మృతమ్ ।
విశేషతః కవిముఖే కావ్యం నూత్నం పదే పదే ॥

స్వరాసమణ్డలక్రీడాం వర్ణయస్వ త్వమేవ చ ।
పరోక్షవర్ణనం కావ్యం ప్రశస్తం దృశ్యవర్ణనమ్ ॥
శ్రీకృష్ణో భగవాన్ సాక్షాద్ యోగీన్ద్రాణాం గురోర్గురుః
యో యస్యాంశః స తు జన స్తస్యైవ సుఖతః సుఖీ ॥
త్వయైవ వర్ణితౌ పాదౌ విలీనౌ తు యువాం హరే ।
సాక్షాద్ గోలోకనాథాంశ స్త్వమేవ తత్సమో మహాన్ ॥

"జగన్నాథునే ప్రియకుమారునిగ బడసి భగవంతునిదివ్యలీలలను దర్శించు
టకు, బరమాత్మని పాలించి పోషించుటకు నందయశోదలు, రోహిణి యే యే
తపములనొనరించిరి ? శ్రీహరికంటె ప్రథమమున హలధరుని ప్రాదుర్భావ
మేప్రదేశమున సంభవించెను ? శ్రీమన్నారాయణఋషీంద్రా ! శ్రీహరి
యపూర్వదివ్యాఖ్యాన మమృతఖండముతో సమానము. విశేషముగ కవీశ్వ
రునిముఖారవిందమునుండి శ్రీహరిచరితమును శ్రవణ మొనరించినవానినది
యడుగడుగన నిత్యనూతన మైనఆనందాంబ్ధిలో నోలాడింపగలదు. ప్రభూ !
నీకు శ్రీహరికి భేదము లేదు. కావున మీరాసమండలదివ్యక్రీడను స్వయ
ముగ వర్ణింపవలసినదిగ బ్రార్థించుచున్నాను. కావ్యములలో పరోక్షవస్తు
వర్ణన ముండును. కాని ప్రత్యక్షముగ వీక్షించి వర్ణించినచరిత మత్యుత్త
మము. సాక్షాత్తుగ శ్రీకృష్ణపరమాత్మ యోగేశ్వరేశ్వరుడు. ఎవ రెవరి
యంశో యైయున్నారో, ఆయంశయొక్క సుఖముతో సుఖులుకాగలరు. ప్రభూ!
నరనారాయణు లైనమీరు శ్రీకృష్ణావతారసమయమున ఆయనచరణములందు లీన
మైనా రనిమీరే ప్రవచించియున్నారు. నరనారాయణులలో మీరే

సాక్షాత్తుగ శ్రీకృష్ణాంశులు. అందువలన మీరు పరమాత్మతో సములు మహాత్ములు."

బ్రహ్మేశశేషవిఘ్నేశాః కూర్మో ధర్మోఽయమేవ చ ।
నరశ్చ కార్తికేయశ్చ శ్రీకృష్ణాంశా వయం నవ ॥
అహో గోలోకనాథస్య మహిమా కేన వర్ణ్యతే ।
యం స్వయం నో విజానీమో న వేదాః కిం విపశ్చితః ॥
సూకరో వామనః కల్కీ బౌద్ధః కపిలమీనకౌ ।
ఏతే చాంశాః కలాశ్చాన్యే సన్త్యేవ కతిధా మునే ॥
పూర్ణో నృసింహో రామశ్చ శ్వేతద్వీపవిరాట్విభుః ।
పరిపూర్ణతమః కృష్ణో వైకుణ్ఠే గోకులే స్వయమ్ ॥
వైకుణ్ఠే కమలాకాన్తో రూపభేదాచ్చతుర్భుజః ।
గోలోకే గోకులే రాధా కాన్తోఽయం ద్విభుజః స్వయమ్ ॥
అస్యైవ తేజో నిత్యం చ చిత్తే కుర్వన్తి యోగినః ।
భక్తాః పాదామ్బుజం తేజః కుతస్తేజస్వినం వినా ॥ 10-15

"నారదమహర్షీ! బ్రహ్మ, శివుడు, ఆదిశేషుడు, గణేశ్వరుడు, కూర్మము, ధర్మము, నేను (నారాయణఋషి), నరఋషి, కార్తికేయుడు-ఈతొమ్మండుగురు శ్రీకృష్ణునిదివ్యాంశస్వరూపులము. ఎవనిని స్వయముగ మేముగాని వేదములుగాని తెలిసికొనజాలమో, ఆగోలోకనాథునిమహిమల నెవరు వర్ణింపగలరు! వరాహ, వామన, కల్కి, బుద్ధ, కపిల, మత్స్యావతారములు శ్రీకృష్ణాంశలు. అన్యావతారములన్నియు ఆయనకళామాత్రములే. నృసింహుడు, రాముడు, శ్వేతదీపవాసియు, మహావిరాట్రూపుడు నగువిష్ణుభగవానుడు శ్రీకృష్ణునిపూర్ణాంశసంభూతులు. శ్రీకృష్ణుడే పరిపూర్ణుడైనపరబ్రహ్మ పరమాత్మ. ఆభగవంతుడే స్వయముగ వైకుంఠమున చతుర్భుజుడు, కమలాకాంతుడు నై రూపభేదమున వసించును. గోలోకమందు గోకులమందు ద్విభుజశ్రీకృష్ణుడు రాధాకాంతు డనికీర్తింపబడును. పరమయోగు లగుపురుషులీపురుషోత్తమునియఖండతేజముచే పరబ్రహ్మతేజముగ భావించి హృదయకమలమున దర్శించి చిత్తమున నిల్పుకొందురు. భక్తజను లీసచ్చిదానందవిగ్రహునిచరణారవిందములనే యెల్లపుడుచింతించుచుందురు తేజస్వి లేనిదే తేజ మెట్లుండును!"

నారదమునీంద్రా! అఖండతపఃకారణమున యశోదానందరోహిణులు శ్రీహరిని బుత్రునిగ బడసినారు. ఆచరితమును వర్ణించెద నవధరింపుము. వసువులలో శ్రేష్ఠుడు తపోధనుడు ద్రోణుడే నందనామమున ఈధరాతలముపై నవతరించెను. ద్రోణపత్నియు, మహాతపస్వినియు నగుధరయశోదయై యావిర్భవించెను. నాగమాత యగుకద్రువయే రోహిణిగ నావిర్భవించెను. వీరిదివ్య చరితములను వర్ణించెదను, వినుము.

శ్రీకృష్ణునిదివ్యసందర్శన మభిలషించి యొకానొకసమయమున ధరాద్రోణులు పుణ్యమయభారతవర్షమున గౌతమాశ్రమసమీపమున గంధమాధన పర్వతముపై ఘోరతపము నారంభించిరి. సుప్రభానదీతటముపై పదివేల సంవత్సరము లావసుదంపతులు ఘోరతప మాచరించినను వారికి శ్రీహరి దర్శనము కలుగలేదు. వారు విరక్తిచెంది యగ్నికుండమును నిర్మించి యందు ప్రవేశింప నుద్యుక్తు లగుచుండగ నశరీరవాణి వారి నిట్లువారించెను. "వసుశ్రేష్ఠా! మీదంపతు లిద్దరు మఱుజన్మలో గోకులమం దవతరించి పరమాత్మ యగు శ్రీహరిని కుమారునిరూపమున దర్శింపగలరు. పరమయోగుల కైనను భగవంతుని దర్శనమత్యంత కఠినము. ఎంతవిద్వాంసులైనను ధ్యానముద్వారా పరమాత్మునిగాంచుట యసంభవము. బ్రహ్మాది సకలదేవతలకు వందనీయు డైనయాసచ్చిదానందవిగ్రహుడు కేవల మనన్యభక్తులకే సాధ్యుడు." అశరీరవాణియీవాక్కుల నాలకించి ధరాద్రోణులు తపమును విరమించి తమలోకమునకు వెడలి శ్రీకృష్ణసంకీర్తనము నందు శేషకాలమును గడిపిరి. తదనంతరము వారిద్దరు పవిత్రభారతవర్షమం దావిర్భవించి శ్రీహరిముఖారవిందదర్శనమును బొంది భవబంధ విముక్తులైరి. దేవతలకైనను పరమగోపనీయ మైనరోహిణిపూర్వజన్మ వృత్తాంతమును వివరించెద నవధరింపుము.

ఒకసమయమున దేవమాతయగు నదితి ఋతుమతియై యుత్తమపుత్రుని యాశించి శృంగారసమన్వితయై తనపతి దేవు డైనకశ్యపప్రజాపతిని సమీపించెను ఆసమయమున కశ్యపుడు తనరెండవపత్ని యైనసర్పమాత యగుకద్రువ నను గ్రహించుచు విలంబనమొనర్చెను. అందులకు కినుక వహించి యదితి స్వర్గ లోకమును వీడి మానవలోకమున జన్మింపుమనికద్రువను శపించెను. ఆశాపము నాలకించి కద్రువ కోపముతో నీవుగూడ ధరాతలమున జన్మింపు మనియదితికి ప్రతిశాప మొసంగెను. కశ్యపప్రజాపతి "నీవు మర్త్యలోకమున నవతరించి

శ్రీహరినిదర్శింపగల"వనికద్రువను సమాధానపఱచెను. తదనంతరము ప్రజాపతి యదితిగృహమున కేతెంచి యామె ననుగ్రహించి ఋతుకాలము గడవకపూర్వమే దేవేశ్వరు డైనమహేంద్రుని కుమారునిగ ప్రసాదించెను. మఱుసటిజన్మలో నదితి దేవకీరూపమున, కద్రువ రోహిణీరూపమున కశ్యప ప్రజాపతి శ్రీకృష్ణునకు పితృదేవు డైనవసుదేవురూపమున జన్మించిరి.

అనంతుడు, అప్రమేయుడు, సహస్రముఖసంపన్నుడు నగుబలరాముని జన్మవృత్తాంతమును వర్ణించెదను, వినుము. రోహిణి వసుదేవుని ప్రియభార్య. మునీశ్వరా ! ఆమె వసుదేవుని యాజ్ఞానువర్తినియై సంకర్షణుని రక్షించుకొనుటకు గోకులము చేరెను. యోగమాయ శ్రీకృష్ణునియాజ్ఞానువర్తినియై దేవకీదేవిసప్తమగర్భమును గోకులమం దున్నరోహిణీయుదరమందు స్థాపించెను. కొన్నిదినములతరువాత నందభవనమున రోహిణి శ్రీకృష్ణాంశస్వరూపు డైన దివ్యపుత్రునకు జననియయ్యెను. ఆదివ్యకుమారునియంగకాంతి తప్తసువర్ణ కాంతిసదృశము. ఆశిశువు సాక్షాత్తుగ నీశ్వరుడే. వానిముఖారవింద మత్యంత మనోహరము, పరమప్రసన్నము. ఆదివ్యావతారుని యావిర్భావమాత్రముననే సకలదేవత లానందాబ్ధిలో నోలలాడిరి. దేవలోకములో ఆనకదుందుభులు మ్రోగినవి, శంఖధ్వనులు, జయజయారవములు, హరినామసంకీర్తనము ప్రతిధ్వనించెను. దివ్యతేజస్సంపన్ను డైనరోహిణీనందనుని దర్శించి యశోదానందులు మహానందభరితులైరి. యశోదానందులు సంతుష్టాంతరంగులై యసంఖ్యాదానము లొనరించి బలరామజన్మోత్సవమును సంపన్న మొనరించిరి.

నారదమహర్షి ! అత్యంతసుఖదాయకము, మోక్షప్రదాయకము, జన్మమృత్యుజరావ్యాధినివారకము, వైష్ణవభక్తులకు పరమజీవనము, అఖండశుభప్రదము, అశుభవినాశకము నగు శ్రీహరియనన్య భక్తి దాస్యములను ప్రసాదింపగల నందపుత్రోత్సవప్రసంగమును వర్ణించెదను శ్రవణ మొనరింపుము.

వసుదేవుడు భగవంతుని నందభవనమునందు వీడి మధురకు వెడలిపోయెను. ఆసమయము జయంతితిథి యగునష్టమితో గూడియుండెను. విజయపూర్ణము మంగళమయము నగునామూహూర్త మాసన్నమయ్యెను. యోగమాయకువశులై గాఢనిద్రయం దున్నయశోదానందులు మేల్కాంచి సూతికాగృహమున పరమమనోహరుడు, దివ్యసుందరుడు సచ్చిదానందుడు నగుఅచ్యు

తునిశిశురూపమును దర్శించి యాశ్చర్యచకితులైరి. బాలరూపు డైనభగవంతుని శ్రీఅంగములకాంతి నవీనజలధరమువలె తేజఃపుంజమయి మగుశ్యామలవర్ణముగ నుండెను. ఆ నగ్న బాలకునిసుందరముఖారవింద మసంఖ్యాశరత్పూర్ణిమాచంద్రులశోభను సహితము తిరస్కరించి ప్రకాశించుచుండెను. ఆయన నేత్రములు ప్రఫుల్లితకమలములవలె సువిశాలములు. సౌందర్య మతులనీయము, అప్రమేయము. ఆయనచరణారవిందము లఖండప్రేమపుంజసదృశములు. దివ్యబాలకు డైననాశ్రీహరిని దర్శించి యశోదానందు లఖండానందభరితులైరి. వారిసంతోషమునకు మేరలేదు. గోకులమం దున్న సర్వగోపగోపికలు, బ్రాహ్మణులు, బ్రాహ్మణముత్తైదువలు సూతికాగ్రహమున కేతెంచి ఆ తేజస్స్వరూపుని దర్శించి మనఃపూర్వకముగ నాశీర్వదించిరి. త్రిలోకములం దున్న సర్వప్రాణులు యశోదానందులయఖండసౌభాగ్యమును వేనోళ్ళబొగడిరి.

నందుడు పవిత్రజలములలో స్నాన మొనరించి పరిశుద్ధుడై కులపురోహితులను, బ్రాహ్మణులను, మహర్షులను నాహ్వానించి ప్రియకుమారునిజాతకకర్మలను క్రమముగ సంపన్న మొనరించెను. భూరిసంతర్పణలం గావించెను. అనేకానేకధనకనకవస్తువాహనములను దానముచేసెను. నందగోకులమును, గోలోకపరంధామమువలె నలంకరించి యఖండహరినామసంకీర్త మొనరించుచు వ్రజవాసులందఱు శ్రీకృష్ణజన్మదినోత్సవమును సంపన్న మొనరించుకొనిరి. మహావిద్వాంసులైనజ్యోతిష్కులు పరమాత్మయొక్కభవిష్యత్తును ప్రకాశమొనరించిరి. నందభవనమందు బలరామశ్రీకృష్ణులు మాతృమూర్తులస్తన్యములను సామాన్యశిశువులవలె నాస్వాదించుచు శుక్లపక్షచంద్రుల వలె దినదిన ప్రవర్ధమాను లగుచుండెరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండమున నారదనారాయణ
సంవాదమున నందపుత్రోత్సవ వర్ణన
మను తొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము

—0—

# పదియవ అధ్యాయము

## పూతనా మోక్ష వర్ణనము

**శ్రీ నారాయణ ఋషి పలికెను:**

నారదా ! ఒకదినమున కంసనృపాలుడు సింహాసనము నధిష్ఠించి కొలువు దీరియుండగా హెచ్చరికచేయుచు అశరీరవాణి మధురవచనములతో నిట్లుపలికెను. "మూఢభూపాలా ! ఏలనిశ్చింతుడవై యున్నావు ? నీప్రాణములను రక్షించుకొనుట కుపాయముల నాలోచింపుము. నీమృత్యు వీధరపై నవతరించినది. వసుదేవుడు మాయతో నీశత్రువైన బాలకుని గోకులమునకు జేర్చి నందకుమారి యైనమాయాకన్యను నీ కప్పగించెను. వసుదేవుని పుత్రరూపమున సాక్షాత్తుగ శ్రీహరియే నిన్ను సంహరించుట కవతరించినాడు. దేవకిసప్తమగర్భము నశింపలేదు. ఆగర్భము రోహిణియుదరమందు స్థాపింపబడి ఆదిశేషుడే బలరామునిగ నవతరించుటకు గారణమయ్యెను. శ్రీకృష్ణ బలరాములు గోకులములో నందభవనమందు దినదినప్రవర్ధమానులగు చున్నారు. వారేనీమృత్యు వని గ్రహింపుము." అశరీరవాణి పలుకుల నాలకించిన కంసుని శిరము లజ్జావశమై వ్రాలిపోయెను. కంసునిమన మత్యంత చింతాక్రాంత మయ్యెను. భీతుడైనకంసనృపాలుడు నిద్రాహారములను సైతము వర్జించి తనప్రాణరక్షణోపాయముల నాలోచింపదొడంగెను.

కంసుడు తనసహోదరి యైనపూతనను రావించి మాయోపాయముచే బలరామకృష్ణులను మడియింపు మనియాదేశించెను. కంసుని యాదేశానుసారముగ స్వేచ్ఛాచారిణి యైనపూతన సర్వాలంకారసమన్వితయై సుందర గోపికావేషమును ధరించి మందస్మితముఖారవిందముతో గోకులమును బ్రవేశించి నందభవనము జేరెను. గోకులవాసు లామెను గాంచి, యీామె రమయో, దుర్గయో శ్రీకృష్ణుని దర్శింపవచ్చిన దనిభావించి యుచితాసన మొసంగి గౌరవించిరి. దేవీ ! నీ వెవ్వర వనిగోకులవాసులు ప్రశ్నింపగ తాను బ్రాహ్మణస్త్రీననియు, శ్రీకృష్ణుని దర్శించి యాశీర్వదించుటకు మధుర నుండి యేతెంచితిననియు, బాలముకుందుని దర్శింపజేసిన వానిని యాశీర్వదించి మరలిపోగలననియు, పూతన సమాధానమిచ్చెను.

బ్రాహ్మణివచనముల నాలకించి యశోదహృదయము హర్షభరిత మయ్యెను. ఆమె శ్రీకృష్ణుని దెచ్చి బ్రాహ్మణి యంకమునం దుంచెను. బాలగోవిందుని యంకమున జేర్చుకొని పుణ్యవతీ యగుపూతన యనేకపర్యాయము లాదివ్యబాలునిముఖారవిందమును ముద్దులాడెను. శ్రీకృష్ణునిసౌందర్య రూపగుణనామములను మనఃపూర్వకముగ బ్రశంసించెను. భగవంతునికొఱకే మాతృస్థానమును పొందినరక్కసి యగుపూతనజీవనమే ధన్యము. శ్రీకృష్ణుని సంహరించుట కేతెంచిన పూతన తన విషపూరిత స్తన్యములను జనార్దనుని ముఖమందుంచెను.

తస్యాః ప్రాణైః సహ పపౌ విషక్షీరం సుధామివ । 31

శిశురూపి యైనపరమాత్మ యావిషమిశ్రితక్షీరముల నమృతమువలె భావించి ద్రావుచు పూతనప్రాణములనే హరించెను.

ప్రాణశూన్య యైనయారక్కసి శవమై భయంకరాకారము దాల్చి పృథ్విపై నొరిగిపోయెను.

స్థూలదేహం పరిత్యజ్య సూక్ష్మదేహం వివేశ సా ।
ఆరురోహ రథం శీఘ్రం రత్నసారవినిర్మితమ్ ॥

పార్షదప్రవరైర్దివ్యైర్వేష్టితం సుమనోహరైః ।
శ్వేతచామరలక్షేణ వేష్టితం లక్షదర్పణైః ॥

వహ్నిశౌచేన వస్త్రేణ సూక్ష్మేణ శోభితం వరమ్ ।
నానాచిత్రవిచిత్రైశ్చ సద్రత్నకలశైర్యుతమ్ ॥

సున్దరం శతచక్రం చ జ్వలితం రత్నతేజసా ।
పార్షదాస్తాం రథే కృత్వా జగ్ముర్గోలోకముత్తమమ్॥ 33.36

పూతన తనస్థూలదేహమును బరిత్యజించి సూక్ష్మశరీరమున బ్రవేశించి రత్ననిర్మితదివ్యరథ మధిరోహించెను. ఆదివ్యరథమున అనేకపార్షదులు పూతనను బరివేష్టించి యాసీనులైరి. వారు హస్తములలో లక్షలాదివింజామరలను, దర్పణములను ధరించియున్నారు. అగ్నిశుద్ధ మగుసూక్ష్మవస్త్రము తోను, నానావిధచిత్రవిచిత్రమనోహరకలశములతోను నలంకరింపబడి యారథము శోభించుచుండెను. నూఱుచక్రములుగల్గిన ఆదివ్యరథము రత్నతేజములో ప్రకాశమాన మైయుండెను. శ్రీకృష్ణపార్షదులు ధన్యురాలైనపూతన నాదివ్యరథముపై నధిష్ఠింపజేసి గోలోకమునకు దీసికొనివెడలిరి.

ఈయద్భుతదృశ్యమును గాంచి గోపగోపిక లాశ్చర్యచకితులైరి. మునీశ్వరా! కంసనృపాలుడుకూడ నీసంఘటనను విని యచ్చెరువందెను. పూతనమరణానంతరము యశోద భీతయై యేమితెలియనటుల నటించుచున్న బాలపుండరీకాక్షుని యంకమున జేర్చి స్తన్యములను ద్రావించెను. తద నంతరము బ్రాహ్మణులను రావించి మంగళాచరణ మొనరించెను. నందుడు పూతనశరీరమునకు దహనసంస్కార మొనరింపగ నామెచితినుండి చందనాగరు కస్తూరీసువాసనలు బయల్వెడలి సర్వత్ర వ్యాపించెను.

నా ర దు డు ప లి కె ను :

శ్రీహరికే స్తన్యముల నొసంగినదియు, రక్కసిరూపమందున్నదియు నగు నాపూతన యెంతటిపుణ్యాత్మురాలు! ఏయఖండపుణ్యతపమువలన నామె భగవంతుని దర్శించి భవబంధవిముక్తురాలై గోలోకధామము జేరినది?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ! బలిచక్రవర్తి యొనరించుమహాయజ్ఞముకడకు వచ్చిన వామ నావతారునిమనోహరరూపమును దర్శించి బలిపుత్రిక యగురత్నమాల భగ వంతునిపై పుత్రస్నేహమును ప్రకటించెను. "వామనునివంటి కుమారుడు నాకు కల్గి తనివిదీర వానికి స్తన్యమును త్రావింతునుగదా" యనిరత్నమాల యాశించెను. ఆమెమనోరథము భగవంతుని యెదుటదాగలేదు. భక్తురాలి మనోభీష్టమును గ్రహించినహరి మాయావతారమం దామె స్తన్యమును పాన మొనరించి యామెకుగోలోకమును బ్రసాదించెను.

దత్వా విషస్తనం కృష్ణం పూతనా రాక్షసీ మునే ।
భక్త్యా మాతృగతిం ప్రాప కం భజామి వినా హరిమ్ 44

మునీశ్వరా రాక్షసి యగుపూతన శ్రీకృష్ణునకు విషపూరితము లగు స్తన్యముల నిచ్చి ద్వేష మనుభక్తియోగముద్వారా మాతృసమానగతిని పొందెను. ద్వేషించువారినే కరుణించు పరమదయాళు వైన శ్రీకృష్ణుని వీడి నేను అన్యుల నెట్లుభజింపగలను? అడుగడుననత్యంతమధుర మైన శ్రీకృష్ణ

గుణములను నీసమ్ముఖమున వర్ణించితిని. అసంఖ్యాకము లైన శ్రీకృష్ణ మధురలీలలను వర్ణించెద నాకర్ణింపుము

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున పూతనామోక్షమను
పదియవ అధ్యాయము
సంపూర్ణము

—0—

# పదునొకండవ అధ్యాయము

## తృణావర్తోద్ధారము, వాని పూర్వజన్మ పరిచయము

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా ! ఒకనాడు గోకులములో యశోద బాలకృష్ణుని యెత్తుకొని గృహకార్యములయందు సంలగ్నయై యుండెను. ఆసమయమున పెనుగాలి రూపమును ధరించి తృణావర్తు డనునసురుడు శ్రీకృష్ణుని యెత్తుకొనిపోవుటకు గోకులమున బ్రవేశించెను. సర్వాంతర్యామి యైనశ్రీకృష్ణు డసురుని యాగమనమును గ్రహించి తనభారమును వృద్ధిజేసెను. కృష్ణుని మోయలేక యశోద హంసతూలికాతల్పమం దుంచి యమునకు వెడలపోయెను. అపుడు పెనుగాలిరూపమును ధరించి యయ్యసురుడు బాలశ్రీకృష్ణుని దీసికొని నూఱు యోజనముల పైకి గగనమునకు జనెను. అభీషణవాయువునకు గోకుల మంతయు ధూళితో నిండి యంధకారబంధుర మయ్యెను. మాయామానుష రూపధారి యైనశ్రీహరిభారమును భరింపలేక ఆక్రాంతుడై యయ్యసురుడు మరణించి పృథ్విపై బడెను. శ్రీహరిదివ్యస్పర్శవలన నారాక్షసుడు స్థూలశరీర మును త్యజించి దివ్యదేహధారియై విమానము నధిరోహించి గోలోకము చేరెను. నారదా ! ఆతృణావర్తుడు పూర్వజన్మమందు పాండ్యదేశమును

పాలించినచక్రవర్తి, దూర్వాసమహర్షి శాపమున నసురుడై శ్రీకృష్ణచరణకమల స్పర్శచే బవిత్రుడై గోలోకవాసుడయ్యెను.

పెనుగాలి యంతరింపగ యశోదాసహిత లగుగోపగోపికలు తల్పముపై బాలకృష్ణుని గానక వ్యాకులముతో భీతులై రోదించుచు గోకుల మంతయు గాలించిరి. ఒకపూపొదలో శ్రీకృష్ణుని గాంచి నందుడు వాని నెత్తుకొని సానందముగ గృహముజేరెను. యశోద కుమారుని గాఢాలింగన మొనరించు కొని స్తన్యమునిచ్చెను. నందుడు పురోహితులను రావించి మంగళాచరణముల నొనరించెను.

నారదుడు పలికెను :

దేవా ! పాండ్యనరేశ్వరునకు దుర్వాసమహర్షి శాప మెట్లుకలిగినది ! అప్రాచీనేతిహాసమును వర్ణింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీనారాయణఋషి పలికెను :

ఒకసమయమున పాండ్యదేశాధిపతి యగుసహస్రాక్షుడు పత్నులతో గంధమాదనపర్వతమునగలనదీతీరమున జలక్రీడ లొనరించుచుండెను. ఆసమ యమున వారివస్త్రము లస్తవ్యస్తము లైయుండెను. అత్రోవనే దుర్వాస మహర్షి శిష్యసమేతముగ బయనించుచుండెను. మహర్షిని గాంచినను మదోన్మత్తుడైనపాండ్యరాజు జలములను వీడి రాలేదు, ప్రణామము లర్పింప లేదు. వాని నిర్లజ్జావ్యవహారమును, ఉద్దండతను గాంచి మహర్షి శపించెను. మదాంధకార మంతరింపగ పశ్చాత్తప్తహృదయుడై పాండ్యుడు అనుగ్రహింపు డనిమహర్షి చరణముల నాశ్రయించెను. దూర్వాసుడు కరుణించి అసురజన్మ మున శ్రీకృష్ణునిచేతిలో మరణించి గోలోకము జేరెద వనివాని నను గ్రహించెను. ఆక్షణమే పాండ్యుడు అగ్నికుండమును నిర్మించి శ్రీహరిని స్మరించుచు పత్నీసహితుడై దానిలో ప్రవేశించెను.

ఇట్లు పాండ్యరాజు మహర్షి శాపమువలన తృణావర్తు డనురక్కసుడై జన్మించి శ్రీహరి స్పర్శను బొంది పత్నీసహితుడై గోలోకపరంధామము జేరెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున తృణావర్తవధ యను
పదునొకండవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

# పండ్రెండవ అధ్యాయము

## శకట భంజనము; యోగనిద్రోక్త మగుకవచమును శ్రీకృష్ణునిచే ధరింపజేయుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

గోకులములో నొకదినమున నందరాజు అభ్యుదయకరమైన నొకవ్రత మును సకల్పించి యాకార్యక్రమమున నిమగ్నుడై యుండెను. గృహములో నందపత్ని యగుయశోద ఆకలిగొనియున్న బాలకృష్ణుని యొడిలో నిడుకొని స్తన్యము నొసంగుచుండెను. ఆసమయముననే వారిగృహమునకు కొందఱు గోపికలు, ముత్తైదువులు అరుదెంచిరి. వారందఱిని సత్కరించుటకు యశోద కృష్ణుని హంసతూలికాతల్పముపై నుంచి వెడలిపోయెను. పాలు పూర్తిగ త్రాగకపోవుటచే కృష్ణుని యాకలి తీరలేదు. ఆహా ! అఖిలాండకోటిబ్రహ్మాండ ముల క్షుద్బాధను దొలగించుపరమాత్మ తానుఆకలితీరని బాలకునివలె వ్యాకులు డయ్యెను. బాలకృష్ణుడు పరుండినశయ్యకు కొంతదూరములో పాలు, పెరుగు ఘృతములతో నిండినపాత్ర లమర్చియున్నదృఢ మైనబండియొకటికలదు. ఆపదార్థములను గాంచి బాలగోపాలుడు నడయాడుచు బండిని జేరి యాశకట మును దనపాదతలముతో తన్నెను. పరమాత్మపాదాఘాతమున నాశకటము

తునాతునకలయ్యెను. పాలు పెరుగులతో నిండియున్న గడవ లన్నియు గ్రింద పడగ దధిఘృతక్షీరములు భూమిపై వ్యాపించెను. తునాతునక లైనబండి మధ్య గోపాలుడు చిక్కుబడెను. ఈసంఘటనను ఆటలాడుచున్న గోపకుమారులు వీక్షించుచుండిరి. శకటభంజనశబ్దమును విని యశోద తదితరగోపిక లందఱు ఆప్రదేశమున కేతెంచి బాలకృష్ణుని శకటావశేషములమధ్యనుండి తీసి యెత్తుకొనిరి. యశోద తనప్రియకుమారుని అంకమున జేర్చి పాలొసంగెను. యోగమాయకృపచే బాలగోవిందునిశరీరముపై చిన్నగాయమైనను తగులలేదు. ధృఢమైనశకట మెట్లునాతునక లైన దనియశోదాగోపిక లచ్చెరు వొందుచుండగ నీసంఘటనను ప్రత్యక్షముగ గాంచిన గోపకుమారులు కృష్ణునిపదాఘాతముచే శకటము ప్రక్కలైనదని తెల్పిరి. పసిబాలు డెక్కడ, ఆమహాశకట మెక్కడ! ఎక్కడైనను శిశుపదాఘాతముచే శకటము ప్రక్కలగునా యనితలంచి గోపకులవచనముల నెవ్వరు నమ్మరైరి. ఆపుణ్యవతుల కఖిలజగములను కుక్షియం దుంచుకొనినపరమాత్మ కేవల మొకయమాయక శిశువుమాత్రమే. ఆహా! మాతృవాత్సల్యభక్తితో జగదానందకరుని యారాధించిన యాగోపికాస్త్రీలభాగ్యమే భాగ్యము.

తక్షణమే యశోద యోగీంద్రులను, బ్రాహ్మణోత్తములను రావించి బాలకృష్ణునకు స్వస్తి వాచనముల గావించెను.

> హస్తం దత్వా శిశోర్గాత్రే పపాఠ కవచం ద్విజః ।
> వదామి తత్తే విప్రేన్ద్ర కవచం సర్వలక్షణమ్ ॥
> యద్దత్తం మాయయా పూర్వం బ్రహ్మణే నాభిపఙ్కజే ॥
> నిద్రితే జగతీ నాథే జలే చ జలశాయిని ।
> భీతాయ స్తుతికర్త్రే చ మధుకైటభయోర్భయాత్ ॥ 14—16

ఒకద్విజుడు బాలకృష్ణునిశరీరముపై హస్తము నుంచి రక్షణార్థమైన దివ్యకవచమును బఠింప దొడంగెను. పూర్వకాలమందు శ్రీమహావిష్ణు నాభికమలోద్భవుడైనబ్రహ్మదేవునకు యోగమాయ యాకవచమును ప్రసాదించెను. శ్రీమహావిష్ణువు యోగనిద్రావశుడై యుండగ మధుకైటభులను నసురులభయముచే బ్రహ్మ యోగనిద్రను స్తుతించెను. ఆయోగనిద్ర స్రష్టకీకవచము నుపదేశించెను. ఆకవచమునే నీకు ప్రసాదించెద నవధరింపుము.

## యోగనిద్రోవాచ

దూరీభూతం కురు భయం భయం కిం తే హరౌ స్థితే ।
స్థితా యాం మయి చ బ్రహ్మన్ సుఖం తిష్ఠ జగత్పతే ॥

శ్రీహరిః పాతు తే వక్త్రం మస్తకం మధుసూదనః ।
శ్రీకృష్ణశ్చక్షుషీ పాతు నాసికాం రాధికాపతిః ॥

కర్ణయుగ్మం చ కణ్ఠం చ కపాలం పాతు మాధవః ।
కపోలం పాతు గోవిన్దః కేశాంశ్చ కేశవః స్వయమ్ ॥

అధరౌష్ఠం హృషీకేశో దన్తపంక్తిం గదాగ్రజః ।
రాసేశ్వరశ్చ రసనాం తాలుకం వామనో విభుః ॥

వక్షః పాతు ముకున్దస్తే జఠరం పాతు దైత్యహా ।
జనార్దనః పాతు నాభిం పాతు విష్ణుశ్చ తే హనుమ్ ॥

నితమ్బయుగ్మం గుహ్యం చ పాతు తే పురుషోత్తమః ।
జానుయుగ్మం జానకీశః పాతు తే సర్వదా విభుః ॥

హస్తయుగ్మం నృసింహశ్చ పాతు సర్వత్ర సంకటే ।
పాదయుగ్మం వరాహశ్చ పాతు తే కమలోద్భవః ॥

ఊర్ధ్వం నారాయణః పాతు హ్యధస్తాత్ కమలాపతిః ।
పూర్వస్యాం పాతు గోపాలః పాతు వహ్నౌ దశాస్యహా ॥

వనమాలీ పాతు యామ్యాం వైకుణ్ఠః పాతు నైరృతౌ ।
వారుణ్యాం వాసుదేవశ్చ సతో రక్షాకరః స్వయమ్ ॥

పాతు తే సన్తతమజో వాయవ్యాం విష్టరశ్రవాః ।
ఉత్తరే చ సదా పాతు తేజసా జలజాసనః ॥

ఐశాన్యామీశ్వరః పాతు పాతు సర్వత్ర శత్రుజిత్ ।
జలే స్థలే చాన్తరిక్షే నిద్రాయాం పాతు రాఘవః ॥

ఇత్యేవం కథితం బ్రహ్మన్ కవచం పరమాద్భుతమ్ ।
కృష్ణేన కృపయా దత్తం స్మృతేనైవ పురా మయా ॥

శుమ్భేన సహ సంగ్రామే నిర్లక్ష్యే ఘోరదారుణే ।
గగనే స్థితయా సద్యః ప్రాప్తిమాత్రేణ సో జితః ॥

కవచస్య ప్రభావేణ ధరణ్యాం పతితో మృతః ।
పూర్వం వర్షశతం ఖే చ కృత్వా యుద్ధం భయావహమ్ ॥

మృతే శమ్భౌ చ గోవిన్దః కృపాలుర్గగనస్థితః ।
మాల్యం చ కవచం దత్త్వా గోలోకం స జగామ హ ॥

కల్పాన్తరస్య వృత్తాన్తం కృపయా కథితం మునే ।
అభ్యన్తరభయం నాస్తి కవచస్య ప్రభావతః ॥

కోటిశః కోటిశో నష్టా మయా దృష్టాశ్చ వేధసః ।
అహం చ హరిణా సార్ధం కల్పే కల్పే స్థిరా సదా ॥

ఇత్యుక్త్వా కవచం దత్త్వాసాన్తర్ధానం చకారహ ।
నిఃశంకో నాభికమలే తస్థౌ స కమలోద్భవః ॥

సువర్ణగుటికాయాన్తు కృత్వేదం కవచం పరమ్ ।
కణ్ఠే వా దక్షిణే బాహౌ బధ్నీయాద్ యః సుధీః సదా ॥

విషాగ్నిసర్పశత్రుభ్యో భయం తస్య న విద్యతే ।
జలే స్థలే చాన్తరిక్షే నిద్రాయాం రక్షతీశ్వరః ॥

సంగ్రామే వజ్రపాతే చ విపత్తౌ ప్రాణసంకటే ।
కవచస్మరణాదేవ సద్యో నిఃశ్శంకతాం వ్రజేత్ ॥

యద్ధృత్వేదం కవచం కణ్ఠే శంకరస్త్రిపురం పురా ।
జఘాన లీలామాత్రేణ దురన్తమసురేశ్వరమ్ ॥

యద్ధృత్వేదం కవచం కాలీ రక్తబీజం చఖాద సా ।
సహస్రశీర్షా ధృత్వేదం విశ్వం ధత్తే తిలం యథా ॥
ఆవాం సనత్కుమారశ్చ ధర్మసాక్షీ చ కర్మణామ్ ।
కవచస్య ప్రభావేన సర్వత్ర జయినో వయమ్ ॥
తస్య నన్దశిశోః కణ్ఠే చకార కవచం ద్విజః ।
ఆత్మనః కవచం కణ్ఠే దధార చ స్వయం హరిః ॥
ప్రభావః కథితః సర్వః కవచస్య హరేస్తథా ।
అనన్తస్యాచ్యుతస్యైవ ప్రభావమతులం మునే ॥ 17-42

తా॥ గని ద్ర ప ల్కె ను :

బ్రహ్మదేవా! భయమును వీడుము. జగత్పతీ! శ్రీహరి విరాజమానుడై యున్నచోట నే నుండెదను. మే మిద్దర మున్న ప్రదేశమున నీకు భయ మేల? నీ విచట సుఖముగ నుండుము. శ్రీహరి నీ ముఖమును రక్షించుగాక, మధుసూధనుడు మస్తకమును, శ్రీకృష్ణుడు రెండు నేత్రములను, రాధికాపతి నాసికను రక్షించుగాక. మాధవుడు రెండుకర్ణము

లను, కంఠమును, కపాలమును రక్షించుగాక, కపోలములను గోవిందుడు, కేశము లను స్వయముగ కేశవుడు రక్షించుగాక. హృషీకేశు డధరోష్ఠములను, గదాగ్రజుడు దంతపంక్తిని, రాసేశ్వరుడు నాలుకను, వామనుడు తాలుకము లను, ముకుందుడు నీవక్షఃస్థలమును రక్షించుగాక. దైత్యసూదను డుదరమును, జనార్దనుడు నాభిని, విష్ణుమూర్తి నీహనువులను, పురుషోత్తముడు నీరెండునితమ్బములను, గుహ్యప్రదేశములను, జానకీశ్వరుడు నీరెండుజానువు లను,నృసింహుడు సర్వత్రసంకటములందు నీరెండుహస్తములను, కమలోద్భవు డగువరాహమూర్తి నీరెండుచరణములను, ఊర్ధ్వభాగమందు నారా యణుడు, అధో భాగమందు కమలాపతి నిన్ను రక్షించుగాక. పూర్వ దిశయందు గోపాలుడు, అగ్నికోణమందు దశముఖాంతకు డైనశ్రీరాముడు నిన్ను రక్షించెదరుగాక. దక్షిణదిశయందు వనమాలి, నైరృత్యకోణమందు వైకుంఠుడు, పశ్చిమదిశయందు సత్పురుషులను రక్షించువాసుదేవుడు నిన్ను పాలించెదరుగాక. వాయవ్యకోణమందు అజన్ముడు, విష్టరశ్రవుడు నగు శ్రీహరి సదా నిన్ను రక్షించుగాక. ఉత్తరదిశయందు కమలాసను డగుబ్రహ్మ తనతేజస్సుతో సదా నిన్నురక్షించుగాక. ఈశానకోణమందు ఈశ్వరుడు రక్షించుగాక. శత్రుజంయందు అంతట నిన్ను రక్షించుగాక. జలములందు, స్థలమందు, ఆకాశమందు, నిద్రావస్థయందు, శ్రీరఘునాథుడు రక్షించుగాక.

బ్రహ్మదేవా ! ఇట్లు పరమాద్భుత మగునీకవచమును నీ కుపదేశించితిని, పూర్వకాలమందు నేను ప్రార్థింపగ శ్రీకృష్ణుడు దయతో నా కాకవచము నుపదేశించెను. శుంభునితో నాకు ఘోరదారుణసంగ్రామము జరుగు చుండెను, ఆకాశమందు నిలచియున్న నాకీకవచము లభించినంతనే నాయసురుని పరాజితునిగ జేసితిని. ఈకవచప్రభావముచే శుమ్భుడు బహుకాలము యుద్ధము చేసి మరణించెను. ఆసమయమున కృపామయు డైనగోవిందు డాకాశమందు నిలచి యీపరమాద్భుతకవచమును, పుష్పమాలను నాకు ప్రసాదించి గోలోకము నకు వెడలిపోయెను.

మునీశ్వరా ! ఇట్లుకల్పాంతమందు సంభవించినవృత్తాంతమును నీకు వివరించితిని. ఈకవచప్రభావమువలన మనస్సు భయము కలుగదు. నేను ప్రతికల్పమందును శ్రీహరితో నివసించుచు కోట్లకొలదిగ బ్రహ్మలు నశించుట వీక్షించితిని. ఇట్లు కవచమును బ్రహ్మకు ప్రసాదించి యోగనిద్ర యంతర్థా

వయ్యెను. కమలోద్భవు డైన బ్రహ్మ యీకవచ ప్రభావమువలన సందేహ రహితుడై భయమును వీడి నాభికమలమున నివసించెను. ఈయుత్తమ కవచమును సువర్ణగుటికయందుంచి కంఠమునందుగాని, దక్షిణభుజమునందు గాని ధరించువారిబుద్ధి సదా పరిశుద్ధముగ నుండును. వానిని విషాగ్ని సర్ప శత్రుభయములు పీడింపవు. జలములలోను, స్థలమందును, అంతరిక్షమందును, నిద్రావస్థయందును భగవంతుడు సదా వారిని రక్షించును. సంగ్రామమందు గాని, వజ్రపాతసమయమందుగాని, విపత్తులందుగాని, ప్రాణసంకటములందుగాని మీాకవచమును స్మరించినవారు భగవంతునిచే రక్షితులై నిస్సందేహముగ జీవింతురు. ఈకవచమును కంఠమందు ధరించియే శంకరుడు త్రిపురాసురులను సంహరించెను. ఈకవచమును ధరించియే భద్రకాళి రక్తబీజుని సంహరించెను. ఈకవచమును ధరించి సహస్రశీర్షుడైనయనంతుడు విశ్వము ననాయాసముగ ధరించెను. ఈకవచ ప్రభావమువలన సనత్కుమారుడు ధర్మకర్మలకు సాక్షియైనాడు. ఈకవచ ప్రసాదమువలన సర్వత్ర విజయములు కలుగును. ఈకవచమును ధరించి ద్విజులు దానితో నందశిశుకంఠము నలంకరించిరి. ఇట్లు లోకశిక్షార్థమై సాక్షాత్తుగ శ్రీహరియే తనకవచమును తనకంఠమందు ధరించెను. మునీశ్వరా! శ్రీహరియొక్క, ఈకవచముయొక్క సంపూర్ణ ప్రభావమిట్లు ప్రవచింపబడెను. భగవంతుడనంతుడు. ఆయనమహిమనుండె ప్పుడుచ్యుతుడుకాడు. ఆయనప్రభావమతులనీయము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున శకటభంజనము, యోగ
నిద్రోక్తకవచన్యాస మను
పన్నెండవ అధ్యాయము
సంపూర్ణము

—0—

# పదుమూడవ అధ్యాయము

## గర్గమహర్షి నందయశోదలకు శ్రీరాధాకృష్ణ నామమాహాత్మ్యమును వివరించుట, అన్నప్రాశన నామకరణ విషయమును ప్రస్తావించుట

**శ్రీ నారాయణ ఋషి పలికెను :**

నారదమహర్షీ ! విఘ్నవినాశకములు, సకలపాపహరములు మహాపుణ్య ప్రదాయకములు, పరమోత్తమములు నగుశ్రీకృష్ణమాహాత్మ్యములను వర్ణించెద నవధరింపుము. ఒకదినమున రత్నసింహాసనము నధిష్ఠించి నందపత్ని యగు యశోద యొకలిగొనియున్న శ్రీకృష్ణబాలుని యొడియందిడుకొని స్తన్యములను ద్రావించుచుండెను. ఆసమయమున మహాతేజస్వియైన నొకబ్రాహ్మణుడు దండకమండలుఛత్రజపమాలాధారియై యసంఖ్యశిష్యబృందము పరివేష్టించి యుండగ నందునిభవనమును ప్రవేశించెను. అహర్నిశములు శ్రీకృష్ణచర ణారవిందములను స్మరించు నామహాతపస్వి జీవన్ముక్తుడు, సకలసిద్ధేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వదర్శి. ఆయనయే యదుకులమున కాచార్యుడైనగర్గ మహర్షి.

బ్రహ్మతేజస్సంపన్ను డైనమహర్షిని గాంచి యశోద సింహాసనమును వీడి శిరము వంచి, భక్తిభావముతో ప్రణామము లర్పించి, యాసనాదిషోడ శోపచారము లొనరించెను. మందస్మితముఖారవిందయై నందునిరాణి శ్రీకృష్ణునిచే నాబ్రాహ్మణోత్తమునకు ప్రణామము లర్పింపజేసెను. రాధా ప్రాణవల్లభుని దర్శించి మహర్షి మనస్సులో నసంఖ్యప్రణామము లర్పించి ప్రసన్నతాపూర్వకముగ వేదమంత్రములతో బాలగోవిందు నాశీర్వదించెను. రత్నసింహాసము నలంకరించినబ్రాహ్మణోత్తముని గాంచి యశోద యిట్లు ప్రశ్నించెను. "మునీశ్వరా ! మీరు స్వాత్మారాము లైనమహర్షులు, మీయంతటివారిని కుశలప్రశ్న వేయుట యుచితముకాదు. ఐన నీసమయమున నేను మిమ్ములను కుశలప్రశ్న వేయుచున్నాను. కావున మీరు నాదోషమును క్షమింపుడు.

మూఢస్య సతతం దోషంక్షమాం కుర్వన్తి సాధవః ।

(సాధుపురుషులు సదా మూఢు లొనరించినదోషములను క్షమించెదరు.)

దేవా ! మీరు అంగిరస, అత్రి, మరీచి, గౌతమాదిమహర్షుల యందెవ్వరు ? కృపతో మీపరిచయసౌభాగ్యమును నాకు గల్గించి మమ్ముద్ధరింపజేయుడు. మీవంటిమహాత్ములు ప్రసన్నమనస్సుతో శిశువు నాశీర్వదించుట యత్యంతశుభకరము. నిశ్చయముగ భాగవతోత్తము లైన బ్రాహ్మణులశుభాశీర్వాదము తత్కాలమందే సర్వశుభములను ప్రసాదించును.

ఇట్లు ప్రశ్నించి వినమ్రభావముతో ముకుళితహస్తయై యున్నయశోదను గాంచి పరమభక్తశిఖామణి యైనగర్గమహర్షి యిట్లుపల్కెను. "దేవీ ! నీసమయోచితవచనము లమృతమధురములు. ఎవరేకులమందు జన్మింతురో వారిస్వభావముగూడ నట్లేయుండును. సమస్తగోపస్వరూపకమలవనములను వికసింపజేయుటకుగోపరాజు గిరిభానుడగు సూర్యసమానుడు. ఆయనభార్య పేరు పద్మావతి ఆమె సాక్షాత్తుగ లక్ష్మీసమానురాలు. వారివంశమును వృద్ధిజేయు యశోద వైననీవు వారికుమార్తెవు ఈదివ్యబాలకు డేకారణమున నవనియందవతరించెనో నే నెఱుగుదును. ఈరహస్యముల నేకాంతమున మీదంపతులకు నేనెఱిగింపగలను. యదుకులపురోహితుడ నైననన్ను గర్గమహర్షి యందురు. ఇతరు లొనరింపలేనియొకమహాకార్యము కొఱకు వసుదేవుడు నన్ను గోకులమునకు బంపెను."

గర్గమహర్షి యాగమనమును విని, నందు డాప్రదేశమునకు వచ్చిమహర్షికి సాష్టాంగదండప్రణామము లర్పించెను. పిమ్మట గర్గుడు నందయశోదలను వెంటనిడుకొని అంతఃపురమునకు వెడలెను. అత్యంతనిగూఢ మైనవిషయము నిట్లుబహిర్గత మొనరించెను, "నందరాజా ! వసుదేవు డేప్రయోజనము నాశించి నన్ను నీకడకు బంపెనో వచించెద నవధరింపుము. మీగృహమును ప్రవేశించి తనకుమారుని యశోదాతల్పముపై నుంచి మీపుత్రికను మధురకు దీసికొనివెడలెను. కంసునిబారినుండి కుమారుని రక్షించుటకొఱకు వసుదేవు డట్లొనరించెను. ఈశిశువు రోహిణీకుమారుడు ఇద్దరు వసుదేవునిపుత్రులే. ఈబాలకులకు అన్నప్రాసన, నామకరణాదిశుభకార్యములను సంపన్న మొనరించుటకు వసుదేవుడు నన్ను రహస్యముగ గోకులమునకు బంపెను. నీ యీకుమారుడు సామాన్యబాలకుడు కాడు. పూర్ణబ్రహ్మస్వరూపు డైనయితడు బ్రహ్మప్రార్థనల నాలకించి భూభారమును దొలగించుటకు శిశురూపమున నవనిపై

నవతరించెను. మీగృహమున బాలకునిగ నడయాడు నీయద్భుతశిశువు సాక్షాత్తుగ రాధికావల్లభుడు, గోలోకనాథు డైనశ్రీకృష్ణుడు. కమలాకాంతు డైనశ్రీమన్నారాయణునకు, శ్వేతదీపవాసి యైనవిష్ణుమూర్తి శ్రీకృష్ణునియం దంతర్భూతులే. నరనారాయణఋషులు, కపిలమహర్షి మొదలగునవతార పురుషులీభగవంతునికంటె భిన్నులుకారు. అఖండతేజోరాశియె మూర్తి మంతమై దుష్టులను శిక్షించుటకు, భక్తులను రక్షించుటకు వసుధపై స్వయ ముగ నవతరించెను. మొదట శ్రీకృష్ణపరమాత్మ వసుదేవునకు తనదివ్య రూపమును జూపి పిమ్మట శిశువుగ మారి సూతికాగృహమునుండి నీగృహము జేరి గోకులవాసులను ధన్యులజేసెను. భగవంతుడు యోనిసంభవుడు కాడు, అయోనిజుడై భూమిపై నవతరించెను. శ్రీహరిమాయచే తనతల్లిగర్భమును వాయువుచే నింపియుంచెను. పిమ్మట తాను బయల్వెడలి తనదివ్యరూప మును వసుదేవునకు జూపి శిశువుగ మారి యుచటకు వచ్చెను.

యుగే యుగే వర్ణభేదో నామభేదోఽస్య వల్లవ ।
శుక్లపీత స్తథా రక్త ఇదానీం కృష్ణతాం గతః ॥
శుక్లవర్ణః సత్యయుగే సుతీవ్రస్తేజసాఽఽవృతః ।
త్రేతాయాం రక్తవర్ణోఽయం పీతోఽయం ద్వాపరే విభుః ॥
కృష్ణవర్ణః కలౌ శ్రీమాన్ స్తేజసాం రాశిరేవ చ ।
పరిపూర్ణతమం బ్రహ్మ తేన కృష్ణ ఇతి స్మృతః ॥
బ్రహ్మణో వాచకః కోఽయమృకారోఽన స్తవాచకః ।
శివస్య వాచకః షశ్చ ణకారో ధర్మవాచకః ॥
అకారో విష్ణోర్వచనః శ్వేతద్వీపనివాసినః ।
నరనారాయణార్థస్య విసర్గో వాచకః స్మృతః ॥
సర్వేషాం తేజసాం రాశిః సర్వమూర్తిస్వరూపకః ।
సర్వాధారః సర్వబీజస్తేన కృష్ణ ఇతి స్మృతః ॥
కృషిర్నిర్వాణవచనో ణకారో మోక్ష ఏవ చ ।
అకారో దాతృవచనస్తేన కృష్ణ ఇతి స్మృతః ॥
కృషిర్నిశ్చేష్టవచనో ణకారో భక్తివాచకః ।
అకారో దాతృవచనస్తేన కృష్ణ ఇతి స్మృతః ॥
కర్మనిర్మూలవచనః కృషిర్ణా దాస్యవాచకః ।
అకారో ప్రాప్తివచనస్తేన కృష్ణ ఇతి స్మృతః ॥

నామ్నాం భగవతో వన్ద కోటీనాం స్మరణే న యత్ ।
తత్ఫలం లభతే నూనం కృష్ణేతి స్మరణే నరః ॥
యద్విధం స్మరణే పుణ్యం వచనాచ్ఛ్రవణా త్తథా ।
కోటిజన్మాంహసో నాశో భవేద్ యత్స్మరణాదికాత్ ॥
విష్ణోర్నామ్నాం చ సర్వేషాం సరాత్సారం పరాత్పరమ్ ।
కృష్ణేతిమఙ్గలం నామ సున్దరం భక్తిదాయకమ్ ॥
కకారోచ్చారణాద్భక్తః కైవల్యం జన్మమృత్యుహమ్ ।
ఋకారాత్ దాస్యమతులం షకారాత్ భక్తిమీప్సితమ్ ॥
ణకారాత్ సహవాసం చ తత్సమం కాలమేవ చ ।
తత్సారూప్యం విసర్గాచ్చ లభతేనాత్ర సంశయః ॥
కకారోచ్చారణాదేవ వెపన్తే యమకిఙ్కరాః ।
ఋకారోక్తే న తిష్ఠన్తి షకారాత్పాతకాని చ ॥
ణకారోచ్చారణాద్రోగా అకారాన్మృత్యురేవ చ ।
ధృవం సర్వే పలాయన్తే నామోచ్చారణభీరవః ॥
స్మృత్యుక్తిశ్రవణోద్యోగాత్ కృష్ణనామ్నో వ్రజేశ్వర ।
రథం గృహీత్వా ధావన్తి గోలోకాత్ కృష్ణకిఙ్కరాః ॥
పృధివ్యా రజసః సంఖ్యాం కర్తుం శక్తా విపశ్చితః ।
నామ్నః ప్రభావసంఖ్యానాం సన్తో వక్తుం న చ క్షమాః ॥
పురాశంకరవక్త్రేణ నామ్నోఽస్య మహహిమా శ్రుతః ।
గుణనామప్రభావం చ కించిజ్జానాతిమద్గురుః ॥
బ్రహ్మాఽనన్తశ్చ ధర్మశ్చ సురర్షిర్మునిమానవాః ।
వేదాః సన్తో న జానన్తి మహిమ్నః షోడశీం కలామ్ ॥

గోపరాజా ! ఈపరబ్రహ్మమునకు యుగయుగములందు భిన్నభిన్న వర్ణములు నామములు గలవు ఈయన మొదట శ్వేతవర్ణముతోను రక్తవర్ణముతోను, పీతవర్ణముతోను, ప్రకటుడయ్యెను. ఈసమయము కృష్ణవర్ణముతో నవతరించెను. సత్యయుగము శ్వేతవర్ణయుక్తుడై నభగవంతుడఖండ తేజముచే నావృతుడై యుండుటచే నత్యంతప్రసన్నముగ గనబడెను. త్రేతాయుగమందు ఈయన వర్ణము అరుణవర్ణము. ద్వాపరమున పీతవర్ణము కలియుగారంభమున కృష్ణవర్ణమునయ్యెను. ఈయన శ్రీమంతుడు, అఖండతేజోరాశి, పరిపూర్ణ పరబ్రహ్మము. అందువలననే ఈయనను కృష్ణు డనిరి.

'కృష్ణః' - యనుపదమం దున్న క కారము బ్రహ్మవాచకము ఋ కారము అనంత (ఆదిశేష) వాచకము. మూర్ధన్య ష కారము శివవాచకము, ణ కారము ధర్మబోధకము, అంతమందున్న 'అ' కారము శ్వేతద్వీపవాసి యగు విష్ణువాచకము, విసర్గము నరనారాయణార్థకము. ఈ శ్రీహరి సమస్త దేవతల తేజోరాశి, సర్వస్వరూపుడు, సర్వాధారుడు, సర్వబీజుడు. అందువలన భగవంతుని కృష్ణుడందురు. 'కృష్' శబ్దము నిర్వాణవాచకము, 'ణ' కారము మోక్షబోధకము, 'అ' కారము దాతృవాచకము, నిర్వాణమోక్షములను ప్రసాదించు దైవము కావున శ్రీహరిని కృష్ణు డనిరి. 'కృష్' అనగ నిశ్చేష్టత్వము, 'ణ' యనగ భక్తి, 'అ' కారము దాతృవాచకము. భగవంతుడు నిష్కర్మ భక్తిప్రదాత. అందువలనే ఆయనదివ్యనామము కృష్ణు డయ్యెను. 'కృష్' అనగ కర్మనిర్మూలనము, 'ణ' అనగ దాస్యభావము. 'అ' కారము ప్రాప్తి బోధకము. ఆయన కర్మలను సమూలముగ నాశ మొనరించి యనన్యదాస్య భక్తిని గలుగజేయును. కావున భగవంతుని కృష్ణు డనిరి. నందా! భగవంతుని యసంఖ్యనామసర్మ్మణమువలన లభించు నఖండఫలము కేవలము శ్రీకృష్ణదివ్యనామమును స్మరించినంతమాత్రముననే మనుష్యున కవశ్యముగ లభించును. కృష్ణనామస్మరణావలన లభించుపుణ్య మాయనసంకీర్తనమువలన, ఆయనదివ్యచరిత్రశ్రవణమువలన లభింపగలదు. శ్రీకృష్ణనామస్మరణ కీర్తన శ్రవణాదులచే మనుష్యుడు కోట్లకొలదిజన్మలయం దాచరించినపాపములనుండి విముక్తుడు కాగలడు. భగవంతునిసర్వనామములోను కృష్ణనామ మత్యంత శ్రేష్ఠము, పరాత్పరతత్త్వము, శ్రీకృష్ణదివ్యనామ మత్యంతమంగళమయము, సుందరము, భక్తిప్రదాయకము.

కకారోచ్చారణమాత్రముననే భక్తుడు జన్మమృత్యుజరావ్యాధులను
నశింపజేయగలకైవల్యమును బొందగలడు. ఋకారోచ్చారణమున భగ
వంతునియెడల అనన్యదాస్యభావమును బొందగలడు. షకారోచ్చారణమాత్ర
మున మనోవాంఛిత మగుసద్భక్తి సులభము కాగలదు. ణకారోచ్చారణముచే
నప్పుడే భగవంతునితో నివసించుసౌభాగ్యము లభింపగలదు. విసర్గోచ్చారణ
మాత్రముననే భక్తునకు భగవంతునితో సారూప్యములభింప
దలదు. ఇం దేంతమాత్రము సంశయము లేదు. కకారము
నుచ్చరించిన యమదూతలు కంపించెదరు. ఋకారము నుచ్చ

రించిన వారు చైతన్యరహితులై జీవుని సమీపింపలేరు. షకారము నుచ్చరించిన పాతకములు, ణకారము నుచ్చరించిన రోగములు, అకారము నుచ్చరించిన మృత్యువు నిశ్చయముగ పలాయనము చిత్తగింప గలవు. ఎందువలెననగ, శ్రీకృష్ణనామోచ్చారణమువలన జన్మమృత్యు జరావ్యాధులు నశించును. వ్రజేశ్వరా ! శ్రీకృష్ణదివ్యనామస్మరణకీర్తన శ్రవణముల నొనరించు వారిని శ్రీకృష్ణపార్షదులు దివ్యవిమానమం దిడుకొని గోలోకమునకు జేర్చెదరు. విద్వాంసులు భూమియం దున్నధూళికణములను లెక్కింపగలరేమోకాని శ్రీకృష్ణదివ్యనామప్రభావములనుగణించుటమహాత్ములకైనను నసంభవమే యగును. పూర్వకాలమందు మద్గురువరేణ్యుడైన శంకరభగవానునిముఖారవిందమునుండి నేను శ్రీకృష్ణగుణనామప్రభావములను గొలదిగ శ్రవణ మొనరించితిని. కేవలము సదాశివుడే శ్రీకృష్ణదివ్యనామ గుణములప్రభావమును గొంతమాత్రమైనను దెలిసినవాడు. బ్రహ్మ, అనంతుడు, ధర్మము, దేవతలు, ఋషులు, మనువులు, వేదములు, సత్పురుషులు, మానవులు మొదలగువారు శ్రీకృష్ణనామహిమయందు బదునారవ కళనైనను తెలిసికొన లేకపోయిరి.

నందమహారాజా ! ఇట్లు నేను నాబుద్ధిజ్ఞానానుసారముగ నీకుమారుని దివ్యనామమహిమలను వర్ణించితిని. ఈనిగూఢమాహాత్మ్యములను నాగురుదేవునిముఖారవిందమునుండి శ్రవణ మొనరించితిని.

కృష్ణ పీతామ్బరః కంసధ్వంసీ చ విష్టరశ్రవాః ।
దేవకీనన్దనః శ్రీశో యశోదానన్దనో హరిః ॥

సనాతనోఽచ్యుతో విష్ణుః సర్వేశః సర్వరూపధృక్ ।
సర్వాధారః సర్వగతిః సర్వకారణ కారణః॥

రాధాబన్ధూ రాధికాత్మా రాధికాజీవనః స్వయమ్ ।
రాధికాసహచారీ చ రాధామానసపూరకః ॥

రాధాధనో రాధికాంగో రాధికాసక్తమానసః ।
రాధాప్రాణో రాధికేశో రాధికారమణః స్వయమ్ ॥

రాధికాచిత్తచోరశ్చ రాధాప్రాణాధికః ప్రభుః ।
పరిపూర్ణతమం బ్రహ్మ గోవిన్దో గరుడధ్వజః ॥

నామాన్యేతాని కృష్ణస్య శ్రుతాని సాంప్రతం వ్రజ ।
జన్మమృత్యుహరాణ్యేవ రక్ష నన్ద శుభక్షణే ॥

కృతం నిరూపితం నామ్నాం కనిష్ఠస్య యథాశ్రుతమ్ ।
జ్యేష్ఠస్య హలినో నామ్నః సంకేతం శ్రుణు మే ముఖాత్ ॥
గర్భసంకర్షణాదేవ నామ్నా సఙ్కర్షణః స్మృతః ॥
నాస్త్యన్తోఽస్యైవ వేదేషు తేనానన్త ఇతి స్మృతః ।
బలదేవో బలోద్రేకాద్ధలీ చ హలధారణాత్ ॥

శితివాసా నీలవాసాన్ముసలీ ముసలాయుధాత్ ।
రేవత్యా సహ సమ్భోగాద్రేవతీరమణః స్వయమ్ ।
రోహిణీ గర్భవాసాచ్చ రౌహిణేయో మహామతిః ॥ 75-84

కృష్ణుడు, పీతాంబరుడు, కంసధ్వంసి, విష్టరశ్రవుడు, దేవకీనందనుడు, శ్రీశుడు, యశోదానందనుడు, హరి, సనాతనుడు, అచ్యుతుడు, విష్ణువు, సర్వేశుడు, సర్వరూపధారుడు, సర్వగతి, సర్వకారణకారణుడు, రాధాబంధువు, రాధికాత్ముడు, రాధికాజీవనానుడు, రాధికాసహచరుడు, రాధామానసపూరకుడు, రాధాధనుడు, రాధికాంగుడు, రాధికాసక్తమానసుడు, రాధాప్రాణాధికుడు, ప్రభువు, పరిపూర్ణతమబ్రహ్మము, గోవిన్దుడు, గరుడధ్వజుడు అనినే నుపదేశించిన శ్రీకృష్ణుని యాదివ్యనామములను హృదయమున ధారణ మొనరింపవుము. శుభేక్షణా ! ఈదివ్యనామములు జననమరణకష్టహరములు, నీకనిష్ఠపుత్రుని దివ్యనామమహాత్మ్యములను శ్రవణ మొనరించినట్లు నీకుపదేశించితిని. నీజ్యేష్ఠపుత్రు డైనహలధరుని నామవ్యుత్పత్తులను వివరించెద నవధరింపుము. ఈయన దేవకీగర్భమం దున్నపుడు గర్భసంకర్షణము జరిగెను, అందువలన కృష్ణాగ్రజునినామము సంకర్షణు డయ్యెను. వేదములం దాయనకెపుడును నంతము సంభవింప దనిప్రవచింపబడెను. అందువలన సంకర్షణునినామమునంతుడయ్యెను. మహాబలవంతుడుగావున బలదేవుడయ్యెను. హలాయుధమును ధరించినకారణమున అనంతునినామము 'హలి' యయ్యెను. నీలిరంగువస్త్రములను ధరించుకారణమున వానినామధేయము 'శితివాసుడు (నీలాంబరుడు) అయ్యెను. ముసలాయుధమును ధరించినకారణమున వానిని 'ముసలి' యనిరి. రేవతితో వివాహమైనకారణమున రేవతీరమణు డనిరి. రోహిణీగర్భమున వసించిన కారణమున రౌహిణేయు డనిరి.

నందమహారాజా ! నీకుమారుల దివ్యనామధేయములను వినినవిధమున నీ కుపదేశించితిని. ఇక నేను పోయివచ్చెదను సుఖముగ నుండుము."

బ్రహ్మణోత్తమునిగూఢోపదేశముల నాలకించి దేవకీవసుదేవు లాశ్చర్య చకితులై నిశ్చేష్టులైరి. బాలకృష్ణుడు మాత్రమేమియు దెలియనివానివలె మందహాసములను చిందించుచుండెను. తదనంతరము నందుడు నతమస్తకుడై గర్గమహర్షి కనేకవందనముల నర్పించి హస్తములను ముకుళించి వినయపూర్వకముగ నిట్లుప్రార్థించెను. "బ్రాహ్మణోత్తమా ! మీరు మమ్ము వీడి యాసమయమున వెడలిపోయిన నామకరణము, అన్నప్రాశనాదిశుభకార్యములను నే మహాత్ము లొనరింపగలరు ? కావున తమరే కరుణతో నీబాలకులకు నామకరణము, అన్నప్రాశనసంస్కారముల నొసరింపుడు. మహర్షి ! మీరుపదేశించిననామములందు రాధానామము పెక్కుపర్యాయములు ధ్వనించినది. ఈరాధ యెవ్వరు ? ఏధన్యునిపుత్రిక ? కృపతో నాసందేహములను నివారింప వలసినదిగ బ్రార్థించుచున్నాను."

నందుని యభ్యర్థనను మన్నించి మందస్మితముఖారవిందుడై గర్గమహర్షి పరమరహస్యము లగువిషయములను నిట్లుబహిర్గత మొనర్చెను.

## శ్రీ గర్గ మహర్షి పలికెను :

నందరాజా ! అత్యంతప్రాచీనేతిహాసమును వర్ణించెద నవధరింపుము. ఈసంఘటనము గోలోకమందు సంభవించెను. భగవాను డగుశంకరునిముఖారవిందమునుండి శ్రవణ మొనరించిన యీవిచిత్రదివ్యవృత్తాంతమునువర్ణించెదను వినుము. భగవంతునిలీలాప్రేరితమై గోలోకమున రాధాశ్రీదాములకు కలహము సంభవించెను. ఆకలహకారణమున శ్రీదామునిశాపవశమున రాధగోకులమం దవతరించెను. వృషభానుడే యామెతండ్రి, కళావతి యామెజనని; శ్రీకృష్ణునియర్థాంగమునుండి ప్రాదుర్భవించినరాధ తనస్వామివలె పరమసౌందర్యవతి. మూలపకృతియు, నీశ్వరియు, గోలోకవాసినియు నగురాధ శ్రీకృష్ణునియాజ్ఞానుసారముగ నయోనిసంభవయై యవతరించెను. ఈరాధ మాయతో కళావతిగర్భమును వాయువుతో నింపెను. ప్రసవసమయమందావాయువు బహిర్గతముకాగా ఆమె యయోనిసంభవయై శిశురూపమును ధరించెను. ఈమె సాక్షాత్తుగ కృష్ణమాయ, కేవలము భగవంతునియాజ్ఞచే

పృథ్విపై నవతరించెను. ఒకేదివ్యమూర్తి రెండురూపములుగ విభక్త మయ్యెను. జనని యగురాధయే స్త్రీ, భగవంతుడే పురుషుడు. గుణ తేజస్సులలో వీరిర్వురు సమానులే. గోలోకమునుండి ప్రథమముననే రాధ యవనిపై నవతరించెను. కావున వయస్సులో రాధ శ్రీకృష్ణునికంటె నధికు రాలు. శ్రీకృష్ణుడు సదా రాధను ధ్యానించును. రాధ సదా తనప్రియతము డైనశ్రీకృష్ణుని స్మరించును. రాధ శ్రీకృష్ణునిప్రాణములచే నిర్మింపబడెను, కృష్ణుడు రాధాప్రాణములచే మూర్తిమంతుడైనాడు. కేవలము రాధననుసరించు టకే భగవంతుడు కంసునిభయ మనునెపముతో గోకులముజేరెను. భయ మునకే స్వామి యైనవాని కేమిభయముండును. సామవేదమందు రాధాశబ్ద వ్యుత్పత్తి ప్రవచింపబడెను. మొదట శ్రీమన్నారాయణుడు తన నాభికమ లోద్భవుడైనబ్రహ్మకీవ్యుత్పత్తుల నుపదేశించెను. బ్రహ్మ యీవ్యుత్పత్తు లను బ్రహ్మలోకమందు శంకరున కుపదేశించెను. శంకరునియనుగ్రహమువలన కైలాసశిఖరముపై నేను శ్రవణ మొనరించితిని. దేవతలకు దుర్లభము లైన యీనామార్థములను వర్ణించెద నవధరింపుము.

సురాసురమునీన్ద్రాణాం వాంఛితాం ముక్తిదాం పరామ్ ।
రేఫో హి కోటిజన్మాఘం కర్మభోగం శుభాశుభమ్ ॥

ఆకారా గర్భవాసం చ మృత్యుం చ రోగముత్సృజేత్ ।
ధకార ఆయుషో హానిమాకారో భవబన్ధనమ్ ॥

శ్రవణస్మరణోక్తిభ్యః ప్రణశ్యతి న సంశయః ।
రేఫో హి నిశ్చలాం భక్తిం దాస్యం కృష్ణపదామ్బుజే ॥

సర్వేప్సితం సదానన్దం సర్వసిద్ధౌఘమీశ్వరమ్ ।
ధకారః సహవాసం చ తత్తుల్యకాలమేవ చ ॥

దదాతి సార్ష్టిసారూప్యం తత్త్వజ్ఞానం హరేః సమమ్ ।
ఆకారస్తేజసాం రాశిం దానశక్తిం హరౌ యథా ॥
యోగశక్తిం యోగమతిం సర్వకాలం హరిస్మృతమ్ ।
ప్రత్యుక్తిస్మరణాద్యోగాన్మోహజాలం చ కిల్బిషమ్ ॥
రోగశోకమృత్యుయమా వేపన్తే నాత్ర సంశయః ।
రాధామాధవయోః కించిద్వ్యాఖ్యానం చ యతః శ్రుతమ్ ॥

రాధాశబ్దవ్యుత్పత్తి దేవతలకు, నసురులకు, మునీంద్రులకుగూడ

నభీష్టమే: రాధాశబ్దార్థ మన్నింటికంటె నుత్కృష్టము మోక్షప్రదము. రాధాశబ్దమందలి 'రేఫ' కోట్లకొలదిజన్మలలో సముపార్జితములైన పాపముల నుండి, శుభాశుభకర్మభోగములనుండి జీవుని విముక్తునిగ నొనరించును. ఆకారము గర్భవాసమును, మృత్యువును. రోగములను దూర మొనరించును. ధకారమాయువానిని, ఆకారము భవబంధనములను నివారించును. రాధానామ శ్రవణస్మరణకీర్తనములచే సమస్తదోషములు నశించును, ఇందు సంశయము లేదు. రాధానామమం దున్న రేఫ శ్రీకృష్ణునిచరణారవిందములయందు నిశ్చలభక్తిని, దాస్యభావమును ప్రసాదించును. ఆకారము సర్వవాంఛితము అను సదానందస్వరూపమును, సంపూర్ణసిద్ధసముదాయములను, ఈశ్వరప్రాప్తిని ప్రసాదించును. దకారము శ్రీహరితో ఆయనవలె ననంతకాలము సహవాస సుఖమును,సమానైశ్వర్యమును, సారూప్యమును,తత్త్వజ్ఞానమును బ్రసాదించును. ఆకారము శ్రీహరివలె తేజోరాశిని, దానశక్తిని, యోగశక్తిని, యోగమతిని, సర్వదా శ్రీహరిస్మృతిని బ్రసాదించును. శ్రీరాధానామశ్రవణస్మరణకీర్తనను యోగములభించిన మోహజాలము, పాపరోగశోకములు నశింపగలవు. రాధా నామజపముచేసివానిని గాంచిన యముడైనను గంపించును, ఇందు సంశయము లేదు. రాధామాధవుల దివ్యనామములనుగుఱించి నేను గురువునుండి విన్నంత వఱకుయథాశక్తితో కించిన్మాత్రమే వ్యాఖ్యానించితిని జగములకు జననీజనకు లైనవారిదివ్యనామములను సంపూర్ణముగ వ్యాఖ్యానించుటకు నే నసమర్థుడను.

నందరాజా ! భవిష్యత్తులో గోకులబృందావనమందు రాధామాధవుల వివాహము దేదీప్యమానముగ జరుగును. సాక్షాత్తుగ జగత్స్రష్టయగు బ్రహ్మ పురోహితుడై అగ్నిదేవుని సాక్షిగ నొనరించి, ప్రసన్నతాపూర్వకముగ నీదివ్య వైవాహికకార్యమును సంపన్న మొనరింపగలడు. శ్రీకృష్ణుడు చేయుదివ్య లీలలను సంక్షేపముగ వర్ణించెదను శ్రవణ మొనరింపుము. కుబేరపుత్రుల నుద్ధరించుట, గోపికలగృహములనుండి నవనీతదధిక్షీరములను దొంగిలించి గోపకుమారులతో కలసి భక్షించుట, తాటివనమందు తాటిపండ్లను భుజించి ధేనుకాసురుని వధించుట, బకాసురుని, కేశిరాక్షసుని, ప్రలంబాసురుని ఆట లాడుచు సంహరించుట, ద్విజపత్నుల ననుగ్రహించి వారు సమర్పించినమిష్టాన్న ములను భుజించుట, ఇంద్రుని యారాధించుపరంపరను ఖడించుట, గోవర్ధనగిరిని ధరించి యింద్రునికోపమునుండి గోకులమును రక్షించుట, గోపికలవస్త్రములను

హరించి వారికి భక్తిజ్ఞానవైరాగ్యములను ప్రబోధించుట, గోపికలవ్రతమును సంపన్న మొనరించుట, గోపికలకు మనోవాంఛితవరములను ప్రసాదించుట, తన దివ్యలీలలచే గోపికలచిత్తములను హరించుట, దివ్యరాసలీల నొనరించుట, వసంతఋతువునందు శరత్పూర్ణిమాదినమున రాసమండలమధ్యమున గోపికలకు అనన్యప్రేమను గలుగజేసి వారిమనోరథములను పూర్ణ మొనరించుట, గోపికలతో జలక్రీడ లొనరించుట, తదనంతరము శ్రీదామునిశాపమున నూఱు సంవత్సరములు శ్రీరాధాదేవితో వియోగము ననుభవించుట. ఆవియోగ కాలమున మధురకు వెడలి దుష్టశిక్షణ మొనరించి భక్తులను రక్షించి భూభార మునుహరించుట. మధురకు బోవుమార్గమున జలములయం దక్రూరునకు దనదివ్యసందర్శన మొసంగి జ్ఞానమును ప్రసాదించుట, మధురలో సంచరించుచు మాలిని, వస్త్రకారుని, కుబ్జను, భవబంధనములనుండి రక్షించుట, శంకరుని ధనువును భగ్న మొనరించి, కువలయపీడమును సంహరించి చాణూరముష్టికు లను వధించి తదనంతరము కంసుని మడియించుట, తలిదండ్రులను బంధ విముక్తులుగ నొనరించుట, తదుపరి బలరామునితోగూడి యుపనయనసంస్కార మొనరించుకొని గురువువద్ద విద్య నభ్యసించుట, మరణించినగురుపుత్రుని గురుదక్షిణగ గురువున కర్పించుట, జరాసంధుని కాలయవనుని వధించి, ముచు కుందునకు మోక్షమును ప్రసాదించుట, ద్వారకాపురిని నిర్మించి యాదవులతో గలసి నగరప్రవేశ మొనరించుట, పదునాఱువేలరాచకన్నెలను వివాహమాడి వారితోవిహారము లొనరించుట, పుత్రపౌత్రసౌభాగ్యవర్ధన మొనరించుట, శ్యమంతకమణివలన గల్గినకళంకమును నివారించుట, పాండవులకు సహాయ మొనరించుట, భూభారమును హరించుట, యుధిష్ఠిరునిరాజసూయయజ్ఞమును సంపన్న మొనరించుట, పారిజాతాపహరణము, ఇంద్రునిగర్వభంగము, సత్య భామాపుణ్యకవ్రతమును పూర్తి చేయుట, బాణాసురునిభుజములను ఖండించుట. శివసైన్యమును మర్దించుట, జృంభణాస్త్రముచే మహాదేవుని బంధించుట, బాణపుత్రిక యగునుష నపహరించుట, బ్రాహ్మణుని దారిద్ర్యమును హరించుట, మరణించిన బ్రాహ్మణునిపుత్రులకు జీవన మొసంగుట, దుష్టులను సంహరించుట, తీర్థయాత్రానెపమున మరల వ్రజవాసులను జేరి రాధ నను గ్రహించుట, తదుపరి తనయంశ మైననారాయణుని ద్వారకకుబంపి స్వయముగ రాధతో విహరించుట, తదనంతర మాయనసమస్తభక్తులతోను గోపికలతోను

గూడి గోలోకపరంధామమును జేరుట మున్నగునవి ఆయన లీలలు, నంద రాజా ! ఇట్లు భవిష్యత్తులో సంభవింపగల శ్రీకృష్ణదివ్యలీలలను వర్ణించితిని. మాఘశుక్ల చతుర్దశీశుభలగ్నమం దీబాలకులకు సంస్కారము లొనరింపుము. ఆదినము గురువారము, రేవతినక్షత్రము చంద్రుడు తారలు శుద్ధులు. మీనమునందు చంద్రుడు ప్రవేశించును. ఆసమయ మత్యంతమనోహరము శుభప్రదము." మహర్షి వచనముల నాలకించి నందుడు శ్రీకృష్ణనామకర ణోత్సవమునకు బృహత్ప్రణాళికలతో నేర్పాట్లొనరించెను సకలబంధువు లను, మహర్షులను, నాహ్వానించి యఖండసంతర్పణముల నొనరించెను. ఆ మహోత్సవసందర్భమున కుబేరుడు శ్రీకృష్ణునిప్రసన్నతకొఱకు మూడు ముహూర్తములకాలము స్వర్ణవృష్టిని గురిపించి గోకులమును సువర్ణములచే నింపివేసెను.

యశోదానందులు స్నాన మాచరించి దివ్యవస్త్రధారులై గర్గమహర్షి యనుజ్ఞను బొంది శ్రీకృష్ణుని అంకమునం దుంచుకొని స్వర్ణపీఠికల నలంకరించిరి. నందుడు శ్రీమహావిష్ణువును స్మరించి యాచమన మొనరించెను బాలగోవిందు నకు 'శ్రీకృష్ణ' యనినామకరణ మొనరించి యన్నప్రాశనము గావించిరి. బ్రాహ్మణులు స్వస్తివచనములను బలుకుచు వేదోక్తరీతిని ఆనామకరణ మహోత్సవమును సంపన్న మొనరించిరి. యశోదానందు లత్యంతసంతోషాంత రంగులై ధనకనకవస్తువాహనములను విరివిగ దాన మొనరించిరి. బ్రాహ్మణు లకు, బంధువులకు విష్టాన్నముల నిడిరి. నారదా ! ఆసమయమున గర్గ మహర్షి శ్రీకృష్ణుని తనహృదయమునకు హత్తుకొని యేకాంతప్రదేశమునకు దీసికొని వెడలెను. పరమాత్మను సింహాసనాధీశునిగ నొనరించి భక్తిభావముతో ప్రణామము లర్పించుచు స్తుతింపదొడంగెను. భక్తిపారవశ్యముచే మహర్షి యంగములు పులకించెను. నేత్రము లశ్రుపూరితములయ్యెను. తలవంచి హస్తములను ముకుళించి శ్రీకృష్ణపరబ్రహ్మము నిట్లుస్తుతించెను.

## గర్గకృతం శ్రీకృష్ణస్తోత్రమ్

గర్గమహర్షి ఉవాచ :

హే కృష్ణ జగతాం నాథ భక్తానాం భయభంజన ।
ప్రసన్నో భవ మామీశ దేహి దాస్యం పదామ్బుజే ॥

త్వత్పిత్రా మే ధనం దత్తం తేన మే కిం ప్రయోజనమ్ ।
దేహి మే నిశ్చలాం భక్తిం భక్తానామభయప్రద ॥

అణిమాదికసిద్ధిషు యోగేషు ముక్తిషు ప్రభో ।
జ్ఞానతత్త్వేఽమరత్వేవా కించిన్నాస్తి స్పృహా మమ ॥

ఇన్ద్రత్వే వా మనుత్వే వా స్వర్గలోకఫలే చిరమ్ ।
నాస్తి మే మనసో వాంఛా త్వత్పాదసేవనం వినా ॥

సాలోక్యం సార్ష్టిసారూప్యే సామీప్యైకత్వమీప్సితమ్ ।
నాహం గృహ్ణామి తే బ్రహ్మం స్త్వత్పాదసేవనం వినా ॥

గోలోకే వాపి పాతాలే వాసే నాస్తి మనోరథః ।
కిం తు తే చరణామ్భోజే సంతతం స్మృతిరస్తు మే ॥

త్వన్మన్త్రం శంకరాత్ ప్రాప్య కతిజన్మఫలోదయాత్ ।
సర్వజ్ఞోఽహం సర్వదర్శి సర్వత్ర గతిరస్తు మే ॥

కృపాం కురు కృపాసిన్ధో దీనబన్ధో పదామ్బుజే ।
రక్ష మామభయం దత్త్వా మృత్యుర్మే కిం కరిష్యతి ॥

సర్వేషామీశ్వరః సర్వ స్త్వత్పాదామ్భోజసేవయా ।
మృత్యుంజయోఽన్తకారశ్చ బభూవ యోగినాం గురుః ॥

బ్రహ్మ విధాతా జగతాం త్వత్పాదామ్భోజసేవయా ।
యస్యైకదివసే బ్రహ్మన్ పతన్తీన్ద్రాశ్చతుర్దశ ॥

త్వత్పాదసేవయా ధర్మః సాక్షీ చ సర్వకర్మణామ్ ।
పాతా చ ఫలదాతా చ జిత్వా కాలం సుదుర్జయమ్ ॥

సహస్రవదనః శేషో యత్పాదామ్బుజసేవయా ।
ధత్తే సిద్ధార్థవద్విశ్వం శివః కణ్ఠే విషం యథా ॥

సర్వసమ్పద్విధాత్రీ యా దేవీనాం చ వరాత్పరా ।
కరోతి సతతం లక్ష్మీః కేశై స్త్వత్పాదమార్జనమ్ ॥

ప్రకృతిర్బీజరూపా సా సర్వేషాం శక్తిరూపిణీ ।
స్మారం స్మారం త్వత్పదాబ్జం బభూవ తత్పరా వరా ॥

పార్వతీ సర్వరూపా సా సర్వేషాం బుద్ధిరూపిణీ ।
త్వత్పాదసేవయా కాన్తం లలాభ శివమీశ్వరమ్ ॥

విద్యాధిష్ఠాత్రి దేవీ యా జ్ఞానమాతా సరస్వతీ ।
పూజ్యా బభూవ సర్వేషాం సమ్పూజ్య త్వత్పదామ్బుజమ్ ॥

సావిత్రీ వేదజననీ పునాతి భువనత్రయమ్ ।
బ్రహ్మణో బ్రాహ్మణానాం చ మతిస్త్వత్పాదసేవయా ॥

క్షమా జగద్విభ రుం చ రత్నగర్భా వసున్ధరా ।
ప్రసూతిః సర్వసస్యానాం త్వత్పాద పద్మ సేవయా ॥

రాధా సమాంశసమ్భూతా తవ తుల్యా చ తేజసా ।
స్థిత్వా వక్షసి తే పాదం సేవతేఽన్యస్య కా కథా ॥

యథా శర్వాదయో దేవా దేవ్యః పద్మాదయో యథా ।
సనాథం కురు మామీశ ఈశ్వరస్య సమా కృపా ॥

న యాస్యామి గృహం నాథ న గృహ్ణామి ధనం తవ ।
కృత్వా మాం రక్ష పాదాబ్జసేవాయాం సేవకం రతమ్ ॥
ఇతి స్తుత్వా సాశ్రునేత్రః పపాత చరణే హరేః ।
రురోద చ భృశం భక్త్యా పులకాంకితవిగ్రహః ॥
గర్గస్య వచనం శ్రుత్వా జహాస భక్తవత్సలః ।
ఉవాచ తం స్వయం కృష్ణో మయి తే భక్తిరస్త్వితి ॥
ఇదం గర్గకృతం స్తోత్రం త్రిసన్ధ్యం యః పఠేన్నరః ।
దృఢాం భక్తిం హరేర్దాస్యం స్మృతిం చ లభతే ధ్రువమ్ ॥
జన్మమృత్యుజరారోగశోకమోహాదిసఙ్కటాత్ ।
తీర్ణో భవతి శ్రీకృష్ణదాససేవనతత్పరః ॥
కృష్ణస్య సహ కాలం చ కృష్ణసార్ధం చ మోదతే ।
కదా చిన్న భవేత్తస్య విచ్ఛేదో హరిణా సహ ॥ 193-218

శ్రీకృష్ణా ! జగన్నాథా ! భక్తభయభంజనా నాకు ప్రసన్నుడవుకమ్ము పరమేశ్వరా ! నాకు నీచరణకమలములందు దాస్యభక్తిని బ్రసాదింపుము. భక్తుల కభయమును బ్రసాదించుగోవిందా ! నీతండ్రి నాకెంతో ధనము నొసంగెను, కాని యాధనమువలన నా కేమిప్రయోజనము ? నీవు నాకు నీయందవిచలభక్తిని గలుగజేయుము. ప్రభూ ! నా కణిమాదిసిద్ధులందు గాని, జ్ఞానతత్త్వములందుగాని, అమరత్వమునందుగాని లేశమైనను నభిలాష లేదు. ఇంద్రపదముకొఱకైనను, మనుపదముకొఱకైనను, స్వర్గలోకఫలముల కైన నామనసమునం దిచ్ఛ లేదు. మీచరణములుతక్క నే నన్యములను వాంఛింపను. సాలోక్య, సార్ష్టి, సారూప్య, సామీప్యైకత్వము లనునీవైదు

విధము లైనముక్తులను నంద అభిలషించెదరు. కాని పరమాత్మా ! నేను నీచరణారవిందముల సేవను వీడి వీనిలో దేనినిగూడ గ్రహించుట కిచ్చగింపను. గోలోకమందుగాని, లేదా పాతాళమందుగాని నివసింపవలె నని నాకు కోరిక లేదు. కాని నిరంతరము నాకు నీచరణారవిందములస్మృతి యుండవలె నని నాయభిలాష. ఎన్నియోజన్మల పుణ్యఫలస్వరూపమున శంకరునిముఖారవిందమునుండి మీదివ్యమంత్రోపదేశమును బొందితిని నీమహామంత్రమును జపించి నేను సర్వజ్ఞుడను సమదర్శియు నైతిని. ఏ ప్రదేశమునకైనను నేను వెడలగలను. కృపాసింధూ ! దీనబంధూ ! నాపై దయజూపుము. నా కభయమును ప్రసాదించి నీచరణకమలములయందు శరణము నొసంగుము. నిన్నాశ్రయించినవారిని మృత్యువేమి చేయగలదు ! నీచరణారవిందములను సేవించి శంకరభగవానుడు సర్వేశ్వరుడు, మృత్యుంజయుడు, జగదంతకుడు, యోగేశ్వరేశ్వరుడు నై విరాజిల్లుచున్నాడు. పరమాత్మా ! జగద్విధాత యగుబ్రహ్మ నీచరణకమలములను సేవించియే విధాతపదమున ప్రతిష్ఠితుడైనాడు. మీచరణములను సేవించియే ధర్మదేవుడు దుర్జయుడై కాలమును సహితము జయించి, ఫలదాతయు, పాలకుడు, సర్వకర్మసాక్షియు నయ్యెను. మీచరణారవిందసేవాప్రభావమువలనే సహస్రముఖయుక్తుడైనఆదిశేషుడు సమస్తవిశ్వమును, ధాన్యపుగింజవలె శిరమునందు లీలగా ధరించియున్నాడు. అట్లే శంకరుడు నీసేవామహాత్మ్యమువలన కంఠమున విషమును ధరింపగల్గెను. సంపదలను ప్రసాదింపగలదియు, సకలదేవతాస్త్రీలలో బరాత్పరయు, నగు శ్రీమహాలక్ష్మి తనకేశకలాపములతో నీచరణముల నెల్లపుడు మార్జన మొనరించును. సర్వబీజస్వరూపిణియు, శక్తిరూపిణియు నగుప్రకృతి నీచరణకమలములను చింతన మొనరించుచు సదా నీధ్యానమందే సంలగ్నయై యుండును. సర్వులయందు బుద్ధిస్వరూపిణియు సర్వరూపిణియు నగుపార్వతినీచరణముల నాశ్రయించియే మహేశ్వరుడైనశివుని ప్రాణవల్లభునిగ బొందగల్గెను. సకలవిద్యలకు నధిష్ఠాత్రియు, జ్ఞానమాతయు నగుసరస్వతి నిచరణారవిందముల నారాధించి సర్వపూజనీయురాలయ్యెను. బ్రహ్మకు, బ్రాహ్మణులకు గతి యైనవేదమాత యగుసావిత్రి నీచరణకమలముల నారాధించి త్రిలోకములందు బవిత్రురాలయ్యెను. వసుంధర నీపాదసేవా ప్రభావముననే జగత్తును ధరించుటయందు సమర్థురాలును, రత్నగర్భయు

సర్వసస్యప్రదాయనియునై విరాజిల్లినది. నీయంశసంభూతము, నీతో సమానమై తేజస్సుగలదియు నగురాధనీవక్షస్థలమందు స్థానము సంపాదించుకొని సదా నీచరణకమలసేవలందే సంలగ్నురాలై యుండును. ఈశ్వరా ! శివాది దేవతలు, లక్ష్మ్యాది దేవాంగనలు నీకృపవలన సనాథులైనారు, అట్లే నన్ను కూడ సనాథునిగ నొనరింపుము. ఎందువలెననగ, ఈశ్వరుడందరిని సమానముగ గరుణించును. నాథా ! నేను గృహమునకు పోజాలను, నీవు ప్రసాదించిన యపారధనములను గ్రహింపను. నీయందమరక్తుడనైన నీసేవకుని నీచరణకమలసేవలందు వినియోగింపుము.

ఇట్లు ప్రశుభరితనేత్రములతో బులకితగాత్రుడై గర్గమహర్షి శ్రీకృష్ణుని స్తుతించి యాయనదివ్యచరణకమలముల నాశ్రయించెను. తనపాదములపై బడి రోదించుచున్న యాశ్రితుని గాంచి శ్రీకృష్ణపరమాత్మ ఆయనకనన్యభక్తిసౌభాగ్యమును బ్రసాదించెను. గర్గమహర్షిచే స్తుతింపబడిన స్తోత్రమును ప్రతిసంధ్యలయందు బఠించువారికి శ్రీహరియందు సుదృఢభక్తి, దాస్యభాగ్యము, ఆయనస్మృతిసౌభాగ్యము తప్పకలభింపగలవు. అంతియేకాదు వారు శ్రీకృష్ణభక్తులసేవలయందు తత్పరులై జన్మమృత్యుజరారోగశోకమోహాదిసంకటముల నధిగమింపగలరు. వారు శ్రీకృష్ణునితో నివసించుచు మహదానందము ననుభవింపగలరు. ఆభక్తులకు శ్రీహరితో వియోగము సంభవింపదు.

నారదా! శ్రీహరి నిట్లుస్తుతించి గర్గమహర్షి మనోవాంఛితవరములనుబొంది శ్రీకృష్ణుని మరల నందున కర్పించెను తదనంతరము యశోదానందులనుండి యనుజ్ఞగైకొని గర్గమహర్షి మధురకు జేరెను. హర్షాంతరంగులై యశోదానందులు బాలకృష్ణునితో దమదివ్యభవనమందు నివసింపదొడంగిరి. బలరామకృష్ణులు శుక్లచంద్రునివలె దినదినప్రవర్థమానులై గోవులవాలములను బట్టుకొని నిలువబడుచు తప్పటడుగులను వేయదొడంగిరి. చిలుకపలుకులవలె మధురవచనములను బలుకనారంభించిరి. గృహాంగణమందు దివ్యతేజస్సంపన్నులై నడయాడుప్రియబాలకులను గాంచి తలిదండ్రులమనస్సఖండానందభరితమయ్యెను. వారడుగులలో నడుగులనిడుచు నందరాజుగృహమున నడయాడుచుండిరి. సంకర్షణుడు బాలకృష్ణుని కంటె నొకసంవత్స

రము పెద్దవాడు. ఆత్మమాయతో శిశురూపములను ధరించిన యాయిర్వురు బాలురు గోకులమందు బాగుగ విహరించుటలోను, పలుకులను స్ఫుటముగ బలుకుటలోను సమర్థులైరి. మథురానగరమును జేరిన గర్గమహర్షి ద్వారా దేవకీవసుదేవులు తమ ప్రియపుత్రుల నామకరణమహోత్సవవిశేషముల నాలకించి యత్యంతానందభరితులైరి.

నారదా ! ఏకల్పమం దీసంఘటన సంభవించెనో ఆసమయమున నీవు గంధర్వరా జైనయుపబర్హణు డనునామమున ప్రసిద్ధిగాంచితివి. తదనంతరము బ్రహ్మ శాపవశమున ద్విజదాసిపుత్రుడవైతివి. పిమ్మట వైష్ణవులప్రసాదము నాజగించి యిప్పుడు బ్రహ్మకుమారుడవైతివి. శ్రీకృష్ణనామకరణాన్న ప్రాసనదివ్యచరిత్రశ్రవణము జన్మమృత్యుజరావ్యాధినాశకము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున శ్రీకృష్ణాన్నప్రాశన
నామకరణ ప్రస్తావన మను
పదుమూడవ అధ్యాయము
సంపూర్ణము

—0—

# పదునాల్గవ అధ్యాయము

## కుబేరపుత్రోద్ధరణము

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదమహర్షీ ! ఒకదినమున యశోదాదేవి బాలకృష్ణుని గృహమున వీడి కార్యార్థియై యమునాతీరమునకు జనెను. మనోహరములైన నవనీత దధిఘృతక్షీరములతో నిండియున్న కుండలను మధుసూదనుడు గాంచెను. ప్రసన్నుడై శ్రీహరి దధినవనీతఘృతక్షీరాదులను తనివిదీర నారగించి ముఖమును వస్త్రముతో దుడుచుకొనుచుండెను. ఇంతలో యశోద యమునాతీరమునుండి గృహమునకు దిరిగి వచ్చెను. ఇంటిలో నున్న పాలు పెరుగుకుండలన్నియు శూన్యములై బగులగొట్టబడియుండుటజూచి యెవరీయల్లరిపనులొనరించితిరని గోపకుమారులను ప్రశ్నించెను. అందులకు వారు తల్లీ ! యశోదా ! మీకృష్ణుడే యీయల్లరిపని నొనరించినది. కొంచెమైనను మాకు బెట్టలేదు. తానే దధినవనీతఘృతక్షీరములను గ్రోలినాడమ్మా యనికొండెములు పల్కిరి. ఇది వినియశోద కోపించి బెత్తమును ధరించి రక్తపంకజలోచనయై శ్రీకృష్ణుని దండించుటకు నుద్యుక్తురాలయ్యెను.

> పలాయమానం గోవిన్దం గృహీతుం న శశాక హ ।
> ధ్యానాసాధ్యం శివాదీనాం దురామపి యోగినామ్ ॥
> యశోదా భ్రమణం కృత్వా విశ్రాన్తా ఘర్మసంయుతా ।
> తస్థౌ కోపపరీతాత్మా శుష్కకణ్ఠోష్ఠతాలుకా ॥
> విశ్రాన్తాం మాతరం దృష్ట్వా కృపాలుః పురుషోత్తమః ।
> స తస్థౌ పురతో మాతుః సస్మితో జగదీశ్వరః ॥ 8-10

తల్లిని గాంచి గోవిందుడు పలాయనము చిత్తగించెను. ఎంత ప్రయత్నించినను యశోద బాలకృష్ణునివేగము నధిగమింపలేకపోయెను. శివాదులకు ధ్యానమునందుకూడ దర్శనమొసంగనివాడు, యోగులకునుగూడ నసాధ్యుడు నగునాపరమాత్మను యశోద యెట్లుబంధింపగలదు ! యశోద బాలకృష్ణుని వెంబడించి యలసిపోయెను. ఆమె శరీరము చెమటచే తడిసిపోయెను. ఆమెకంఠము, పెదవులు కోపముచే శుష్కములయ్యెను. తల్లి

యలసిపోయినదని గ్రహించి కృపామయుడు, పురుషోత్తముడు, జగదీశ్వరుడు నగు శ్రీకృష్ణుడు సస్మితవదనుడై తనంతటతానే యామెకు దొరకి పోయెను.

కుమారుడు చేసిన దొంగతనమునకు కోపించిన యశోద బాలకృష్ణుని వస్త్రముచే గృహప్రాంగణమందు గలయొకవృక్షమునకు బంధించి గృహకృత్యములొనరించుటకు లోనికి వెడలిపోయెను. నారదా! శ్రీకృష్ణునిదివ్యస్పర్శ లభింపగనే యావృక్షము భయంకరశబ్ద మొనరించుచు కూకటివేళ్ళతో నొరగిపోయెను. ఆవృక్షమునుండి సుందరవేషధారియు కిశోరవయస్కుడు రత్నాలంకారవిభూషితుడు నొకదివ్యపురుషుడు బయల్వెడలి పరమాత్మ కనేక వందనముల నర్పించి తన స్వధామమునకు వెడలిపోయెను. వృక్షమొనరించినభీకరశబ్దమునకు భయకంపితురాలై యశోదపరుగున నాప్రదేశమున కేతెంచి బాలగోవిందుని ఒడిలోనికి దీసికొని దుఃఖింపదొడంగెను. ఈ సంఘటనవలన నందగృహమును జేరినగోపికలు కృష్ణుని దండించినందులకు యశోద నిష్ఠూరము లాడిరి. ఈదుర్ఘటన వలన సంభవించువిఘ్ననివారణము కొఱకు నందుడు సద్బ్రాహ్మణుల రావించి యాశీర్వాదపూర్వకముగ స్వస్తి వాచనముల లొనరించెను. నందునిగృహము నందఖండహరినామ సంకీర్తన మొనరించిరి.

నారదుడు పలికెను:

దేవా! ఆసుందరవేషధారి యైనపురుషు డెవ్వడు? ఎందుల కాతడు గోకులమందు వృక్షమైనాడు? నా యీసందేహములను నివారింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

ఒకసమయమున కుబేరతనయుడైన నలకూబరుడు రంభతో నందనవనమందు విహరించుచుండెను. ఆదేసమయమున మహర్షి యగు దేవలు డాప్రదేశమున బయన మొనరించుచుండెను. మహర్షిని గాంచియు నలకూబరుడు రంభామోహముచే నంధుడై ఆయనను గౌరవింపడాయెను. నలకూబరుని యిట్టిహేయపరిస్థితిని గాంచి దేవలుడు కోపించి గోకులములో వృక్షరూపమున బడియుండు మని శపించెను. రంభను మానవకన్యవై జన్మించి జనమే

జయునకు బత్నివిక మ్మనిశపించెను. నలకూబరుడు పశ్చాత్తప్తహృదయుడై మహర్షి పాదముల నాశ్రయింపగ ముని కరుణాంతరంగుడై శ్రీకృష్ణస్పర్శవలన నీకు శాపవిమోచనము కల్గు ననియనుగ్రహించెను. రంభ జనమేజయు డొనరించు నశ్వమేధయజ్ఞమున కరుదెంచునింద్రుని స్పృశించి మరల అప్సరసయై స్వర్గము జేరగల దని మహర్షి రంభాశాపవిమోచనమును దెలిపెను.

పిమ్మట మహర్షి శాపవశమున నలకూబరుడు వృక్షమై శ్రీకృష్ణ భగవానుని స్పర్శవలన శాపవిముక్తుడై స్వధామము జేరెను. రంభ సుచంద్రునకు బుత్రికగా జన్మించి, జనమేజయునకు భార్యయై యశ్వమేధయజ్ఞప్రాంగణమున నింద్రుని స్పృశించి మరల అప్సరసయై స్వర్గమునకు వెడలిపోయెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున వృక్షార్జునభంజన మను
పదునాల్గవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

# పదునైదవ అధ్యాయము

## శ్రీ రాధాకృష్ణ వివాహ వర్ణనము

నారదా ! ఒకదినమున శ్రీకృష్ణుని వెంటనిడుకొని నందుడు బృందావనమునం దున్న భాండీరోపవనములో గోవుల గాయుటకు వెడలెను. ఆవనమున నిర్మలస్వాదుజలభరిత మైననొకసరోవరము కలదు. గోవులను జలములకువిడిచి తానును జలపాన మొనరించి నందుడు కృష్ణునియొడిలో నిడుకొని యొకచెట్టు క్రింద నాసీనుడయ్యెను. మాయాశిశువేషధారియైన శ్రీకృష్ణపరమాత్మ తన మాయతో మేఘములను సృష్టించి యాకాశము నింపివేసెను. ఉరుములతో, మెఱుపులతో ఘోరవర్షమారంభమయ్యెను. ఈయుత్పాతమును గాంచి నేనెట్లు గృహము జేరగలనా యనినందుడు చింతించుచుండెను. ఉరుములకు భీతుడై శ్రీకృష్ణు డొక సామాన్యశిశువువలె తనతండ్రి కంఠమును గౌగలించుకొని రోదింపనారంభించెను.

ఆసమయముననే రాధాదేవి రాజహంసవలె నడయాడుచు శ్రీకృష్ణుని సమ్ముఖమున కరుదెంచెను.

శరత్పార్వణచన్ద్రాభాముష్టవక్త్రా మనోహరా ।
శరన్మధ్యాహ్నపద్మానాం శోభామోచనలోచనా ॥

పరితస్తారకాపక్ష్మవిచిత్రకజ్జలోజ్జ్వలా ।
ఖగేన్ద్రచంచుచారు శ్రీశంసానాశక నాసికా ॥

తన్మధ్యస్థలశోభార్హస్థూలముక్తాఫలోజ్జ్వలా ।
కబరీవేషసంయుక్తా మాలతీమాల్యవేష్టితా ॥

గ్రీష్మమధ్యాహ్నమార్తాండ ప్రభాముష్టకుణ్డలా ।
పక్వబిమ్బఫలానాం చ శ్రీముష్టాధరయుగ్మకా ॥

ముక్తాపంక్తిప్రభావైక దన్తపంక్తిసముజ్జ్వలా ।
ఈషత్ప్రఫుల్లకున్దానాం సుప్రభానాశకస్మితా ॥

కస్తూరీబిన్దుసంయుక్త సిన్దూరబిన్దుభూషితా ।
కపాలం మల్లికాయుక్తం బిభ్రతీ శ్రీయుతం సతీ ॥

సుచారువర్తులాకార కపోలపులకాన్వితా ।
మణిరత్నేన్ద్రసారాణాం హారోరఃస్థలభూషితా ॥

సుచారుశ్రీఫలయుగకఠిన స్తనసంగతా ।
పత్రావళీ శ్రియా యుక్తా దీప్తా సద్రత్నతేజసా ॥
సుచారు వర్తులాకారముదరం సుమనోహరమ్ ।
విచిత్రత్రివళీయుక్తం నిమ్ననాభిం చ బిభ్రతీ ॥
సద్రత్నసారరచిత మేఖలాజాలభూషితా ।
కామాస్త్రసారభ్రూభఙ్గ యోగీన్ద్రచిత్తమోహినీ ॥
కఠినశ్రోణీయుగలం ధరణీధరనిన్దితమ్ ।
స్థలపద్మప్రభాముష్టచరణం దధతీ ముదా ॥
రత్నభూషణసంయుక్తం యావకద్రవసంయుతమ్ ।
మణీన్ద్రశోభాసంముష్టసాల క్తకపునర్నవమ్ ॥
సద్రత్నసారరచితక్వణన్మంజీరరంజితమ్ ।
రత్నకంకణకేయూరచారుశంఖవిభూషితా ॥
రత్నాంగులీయనికరవహ్నిశుద్ధాంశుకోమలా ।
చారుచమ్పకపుష్పాణాం ప్రభాముష్టకళేవరా ॥
సహస్రదలసంయుక్త క్రీడాకమల సముజ్జ్వలమ్ ।
శ్రీముఖశ్రీదర్శనార్థం బిభ్రతి రత్నదర్పణమ్ ॥
దృష్ట్వా తాం నిర్జనే నన్దో విస్మయం పరమం యయౌ ।
చన్ద్రకోటిప్రభాముష్టాం భాసయన్తీం దిశోదశ ॥

"ఆమెయాకృతి యత్యంతమనోహరము. ముఖసౌందర్యము శరత్కాల పూర్ణిమనాటిచంద్రునిశోభను నేత్రములు శరత్కాలమధ్యాహ్నవికసితకమల శోభను దిరస్కరించుచుండెను. రెండునయనములలో తారకలు పక్ష్మము లతోను, కాటుకతోను నలంకరింపబడి సుమనోహరముగ నుండెను. ఆమె నాసిక పక్షీంద్రుడైన గరుత్మంతుని నాసికాసౌందర్యమునుగూడ దిరస్కరించు చుండెను. ఆనాసికయొక్క మధ్యభాగమున నలంకరింపబడి యున్నముత్తెదుప్పు ముక్కెర ఉజ్జ్వలప్రభను సృష్టించుచుండెను. కేశకలాపము మాలతీమాలలచే నలంకరింపబడియుండెను. రెండుకర్ణములందు గ్రీష్మఋతుమధ్యాహ్నకాల సూర్యునికాంతిని దిరస్కరించుప్రభాయుక్తములైన కుండలములు మెఱయు చుండెను. ముత్యాలవరుసలకాంతిని దిరస్కరింపగల దంతపంక్తియామె ముఖకాంతి నుజ్జ్వలమొనరించుచుండెను. రెండుపెదవులు పండినదొండ పండ్ల శోభను దిరస్కరించుచుండెను. ఆమెచిరునవ్వులు వికసించిన కుంద

కుసుమముల సుందరప్రభను సహితము తిరస్కరించుచుండెను. శోభాశాలి యైన ఆమె ఫాలదేశముకస్తూరీబిందుయుక్త సిందూరబిందువుతో నలంకరింపబడి యుండెను. కపాలముపై మల్లికాపుష్పములను ధరించి రాధ అత్యంత సౌందర్యవతిగ గన్పడుచుండెను. సుందరము మనోహరము నగుగండ్రని కపోలములు పులకించెను. ఆమెవక్షస్థలము మణిరత్నేంద్ర సారతత్వముచే నిర్మిత దివ్యహారముచే విభూషితమైయుండెను. ఆమె యుదరముగుండ్రనిగను సుందరముగను మనోహరము గనునుండెను. ఆమెనాభిలోతైనది. కటిప్రదేశము ఉత్తమరత్నసారతత్వములచే రచితములైన మేఖలాజాలముచే విభూషితమై యుండెను. వంగిన కనుబొమలు కామదేవుని అస్త్రములవలె శోభిల్లుచు యోగీంద్రులచిత్తములనైనను మోహింపజేయు సమర్థవంతములై యుండెను. స్థలకమలముల కాంతినే దిరస్కరింపగల యామెచరణము లత్యంత సుందరములు. రత్నమయాభరణములచే విభుషితములైనయామె చరణములు పారాణితో నలంకరింపబడియుండెను. శ్రేష్ఠమణుల శోభనే తిరస్కరింపగల లాక్షారాగరంజితనఖములతో నాచరణము లపూర్వశోభతో ప్రకాశించుచుండెను. ఉత్తమరత్ననిర్మిత మంజీర కలరవములచే నాచరణము లనురంజితములగుచుండెను. ఆమె భుజములు రత్నకంకణ కేయూరశంఖాభరణములచేవిభూషితములైయుండెను. రత్నమయముద్రికలతో నామె యంగుళులు శోభిల్లుచుండెను. ఆమె యగ్నిశుద్ధదివ్యకోమలవస్త్రములను ధరించియుండెను. ఆమెశరీరకాంతి పుష్పప్రభను దిరస్కరించుచుండెను. ఆమెయొకహస్తమందు సహస్రదళయుక్త మగుసముజ్జ్వలక్రీడాకమలము శోభిల్లుచుండెను, మఱియొకహస్తమున తనశ్రీముఖశోభను దర్శించుటకు రత్నమయ దర్పణమును ధరించియుండెను. ఆనిర్జనవనమందీయఖండసౌందర్యదేవతను గాంచి నందుడాశ్చర్య చకితుడయ్యెను. కోట్లకొలది చంద్రులప్రకాశమును మించిన యాదేవియంగకాంతి దశదిశలను ఉద్భాసిత మొనరించుచుండెను."

జగజ్జనని తనయెదుట గాంచి నందుడు పులకితగాత్రుడై సాశ్రుపూర్ణలోచనుడై, ముకుళితహస్తుడై యనేకప్రణామము లర్పించుచు నామెతో నిట్లు పల్కెను. "దేవీ! గర్గమహర్షి ముఖారవిందమునుండి నీ మాహాత్మ్యమును శ్రవణ మొనరించితిని. శ్రీమహాలక్ష్మికంటె నీవు శ్రీకృష్ణున కత్యంత ప్రియురాల వని నేనెఱుంగుదును. ఈశ్యామసుందరు డగుశ్రీకృష్ణుడు

మహావిష్ణువుకంటె శ్రేష్ఠుడు నిర్గుణుడు. అచ్యుతుడు ననియు నెఱుంగుదును. ఐనను మానవు డగుటచే నేను శ్రీకృష్ణమాయా మోహితుడనై యుంటిని. కల్యాణీ! నీప్రాణేశ్వరుడైన శ్రీకృష్ణుని స్వీకరించి నీయిచ్చవచ్చినచోటికి వెడలుము నీమనోరథమును బూర్తిచేసికొనిన పిమ్మట వాయీపుత్త్రు దిరిగి నాకిమ్ము."

అనిపలికి నందుడు దుఃఖించు బాలకృష్ణుని రాధచేతికిచ్చెను. అత్యంత ప్రసన్నయై రాధ నందునితో నిట్లుపలికెను. "నందరాజా! ఈరహస్యము నెవ్వరికి చెప్పవలదు. అనేక జన్మలపుణ్యఫల స్వరూపమున నేడు నీవు నాదివ్యమంగళవిగ్రహమును దర్శింపగల్గితివి. గర్గునివలన నీ వీవిషయమును దెలిసికొంటివి. మాయవతారకారణమును నీవెఱుగుదువు. మా యీయవతారరహస్యము నెచ్చటను వెల్లడిచేయవలదు. నీవుగోకులమునకు బొమ్ము. నీ మనోభీష్టవరముల నడుగుము. దేవదుర్లభ మగునావరమును నీకిత్తును."

శ్రీరాధ పలికిన పలుకుల నాలకించి వ్రజేశ్వరు డిట్లు పలికెను-

'దేవీ! నీవు ప్రియతమునితోగూడ నీచరణములయందు భక్తినినాకు బ్రసాదింపుము. మఱియేవస్తువుపైన నాకు వాంఛలేదు. జగదంబికా! పరమేశ్వరీ! మీయిరువురి సన్నిధానమున నివసించు సౌభాగ్యమునుమాదంపతులకు దయతో నిమ్ము." నందునియీవాక్కుల నాలకించి పరమేశ్వరి యగురాధాదేవి యిట్లు పలికెను-'వ్రజేశ్వరా! నేను భవిష్యత్తులో నీకు సాటిలేని దాస్యభావము నొసంగగలను. ఇపుడు మాయందుభక్తి మీకుగలుగుగాక! మాయీరువురి చరణకములయందు మీయిరువురకహర్నిశములు భక్తియేర్పడుగాక! మీ యిరువురిప్రసన్న హృదయములలో పరమదుర్లభమగు మాస్మృతి నిరంతరము కలుగుచుండుగాక! నావరప్రభావముచే మాయ తనయావరణమును మీపైప్రసరింపచేయజాలదు. చివరకు మానవశరీరమును ద్యజించి గోలోకమునకు వెడలుదురుగాక!" ఇట్లుపలికి శ్రీకృష్ణుని రెండుబాహువులతో సానందముగ నొడిలోనికిదీసికొని తనయిష్టమునను సరించి యచటినుండి దూరముగగొని పోయెను. ఆయనను ప్రేమాతిరేకముచే వక్షస్థలమున నుంచుకొని మాటిమాటికి ఆలింగనముచేసికొనుచు ముద్దులాడసాగెను. శ్రీకృష్ణుని దివ్యస్పర్శవలన రాధ సర్వాంగములు పులకింపగ ఆమె రాసమండలమును స్మరించెను. వారియెదుట అత్యంతరమణీయమైన యొకదివ్యమంటప మావిర్భవించెను. రత్నమయమైన ఆ

మంటపమువందలకొలదిరత్నకలశములచే శోభితము, విచిత్రచిత్రచిత్రితము, మణి మాణిక్య నిర్మిత సహస్రస్తంభ సమన్వితము, చందనాగరుకస్తూరి సుగంధ ద్రవ్య సువాసనాభరితము నైయుండెను. ఆమంటప మధ్యమున మాలతీమాల లచే, పారిజాతకుసుమములచే నలంకరింపబడిన యొక దివ్య పుష్పశయ్యయుం డెను. రాధ ఆవిచిత్ర దివ్య మంటపమును దర్శించి ప్రసన్నతా పూర్వకముగ లోనికిప్రవేశించెను. ఆసమయమున రాధయొక్కయంకమునం దున్నబాల కృష్ణుడు అదృశ్యుడై నవకిశోరరూపమును దాల్చి ఆపుష్పశయ్యపై దర్శన మొసంగెను.

పురుషం కమనీయం చ కిశోరశ్యామసున్దరమ్ ॥
కోటికన్దర్పలీలాభం చన్దనేన విభూషితమ్ ।
శయానం పుష్పశయ్యాయాం సస్మితం సుమనోహరమ్ ॥
పీతవస్త్ర పరీధానం ప్రసన్నవదనేక్షణమ్ ।
మణీన్ద్రసారనిర్మాణం క్వణన్మంజీరరంజితమ్ ॥
సద్రత్నసారనిర్మాణకేయూరవలయాన్వితమ్ ।
మణీన్ద్రకుణ్డలాభ్యాం చ గణ్డస్థలవిరాజితమ్ ॥
కౌస్తుభేన మణీన్ద్రేణ వక్షఃస్థలసముజ్జ్వలమ్ ।
శరత్పార్వణచన్ద్రాస్య ప్రభాముష్టముఖోజ్జ్వలమ్ ॥
శరత్ప్రఫుల్లకమలప్రభామోచనలోచనమ్ ।
మాలతీమాల్యసంశ్లిష్టశిఖిపిచ్ఛసుశోభితమ్ ॥
త్రివక్రచూడాం విభ్రన్తం పశ్యన్తం రత్నమన్దిరమ్ ।
క్రోడం బాలకశూన్యం చ దృష్ట్వాతంనవయౌవనమ్॥49-52

ఆమంటపములో పుష్పములతో లంకరింపబడిన శయ్యపై కిశోర వయస్కుడు, కమనీయుడు, శ్యామసుందరుడు, మనోహరుడు నగుపురుషుడు రాధకు దర్శన మొసంగెను. ఆయన మందస్మిత ముఖారవిందుడు, కోట్ల కొలదికందర్పులలావణ్యలీలచే నలంకృతుడు, చందనచర్చితుడు, పీతాంబరధారి, ప్రసన్నవదనేక్షణుడు, మణీంద్రసారనిర్మిత క్వణన్మంజీరరంజితుడు, సద్రత్న సారనిర్మితకేయూర వలయాన్వితుడు, మణీంద్ర కుండలధారి, గండస్థల విరాజితుడు, కౌస్తుభమణిచే ఆయనవక్షఃస్థలము ప్రకాశించుచుండెను. ఆయన ముఖసౌందర్యము శరత్పార్వణచంద్రునిసహితము తిరస్కరించుచుండెను.

రెండునేత్రములు శరత్కాలప్రఫుల్లకమలములవలె సువిశాలములు. మాలతీ మాలలచే నలంకరింపబడినమయూరపిచ్ఛమకుటము ఆయన మస్తకముపై శోభించుచుండెను. త్రిభంగవేణిని ధరించి ఆసచ్చిదానందవిగ్రహుడు రాసమండలమును వీక్షించుచుండెను. రాధయొడిలో బాలకృష్ణు డదృశ్యుడై యెదుటనవీననీరదశ్యామలవర్ణుడు, నవయౌవనుడునగుగోలోకనాథునిరూపమున దర్శనమొసంగెను. ఆపరమమనోహరరూపమునుగాంచి రాధవిస్మితురాలయ్యెను. ఆమె ప్రేమతో, ప్రసన్నతతో తనలోచనచకోరములద్వారా శ్రీకృష్ణ ముఖచంద్రునిసుధను పాన మొనరింపదొడంగెను. ఆమెకను రెప్పలు మూతవడుటలేదు. ఆమెమనస్సున ప్రేమ, విహారలాలస జాగృతమయ్యెను. పులకితగాత్రయై, మందస్మితముఖారవిందయై ఆమె తన కీగంటిచూపులతో తన్ను సందర్శించు రాధతో శ్రీకృష్ణపరమాత్మ యిట్లు పల్కెను.

**శ్రీ కృష్ణుడు పలికెను :**

రాధా! గోలోకమందు సంఘటిల్లినసంఘటన నీస్మరణమం దున్నదా? పూర్వకాలమున గోలోకములో నేను నీ కొసంగినవరముల నీదినమున బరిపూర్ణ మొనరించెదను. సుముఖీ! రాధా! నీవు నాకు ప్రాణములకంటె నధిక ప్రియురాలవు. నీ వెట్లో నేను నట్లే, నిశ్చయముగ మనమిద్దరియందు భేదము లేదు. క్షీరములందు ధవళత్వము, అగ్నియందు దాహకశక్తి, పృధ్వియందు గంధము వ్యాప్తములైయునట్లే నేను నీయందు వ్యాపించియున్నాను. మట్టి లేనిదే కుమ్మరి కుండలను నిర్మింపలేనట్లు, సువర్ణము లేనిదే స్వర్ణకారుడు కుండలములను చేయలేనట్లు నీవు లేనిదే నేను సృష్టి యొనరింపజాలను.

సృష్టేరాధారభూతా త్వం బీజరూపోఽహమచ్యుతః ।
ఆగచ్ఛ శయనే సాధ్వీ కురువక్షః స్థలే హి మామ్ ॥
త్వం మే శోభాస్వరూపాసి దేహస్య భూషణం యథా ।
కృష్ణం వదన్తి మాం లోకా స్త్వయైవ రహితం యదా॥
శ్రీకృష్ణం చ తదా తేఽపి త్వయైవ సహితం పరమ్ ।
త్వం చ శ్రీ స్త్వం చ సమ్పత్తి స్త్వమాధారస్వరూపిణీ ॥
సర్వశక్తిస్వరూపాసి సర్వరూపోఽహమక్షరః ।
యదా తేజః స్వరూపోఽహం తేజోరూపాసి త్వం తదా ॥

న శరీరీ యదాహం చ తదా త్వమశరీరిణీ ।
సర్వబీజస్వరూపోఽహం సదా యోగేన సున్దరి ॥
త్వం చ శక్తిస్వరూపా చ సర్వస్త్రీరూపధారిణీ ।
మమాంగాంశస్వరూపా త్వం మూలప్రకృతిరీశ్వరీ ॥ 61-66

నీవు సృష్టికి నాధారభూతవు, నే నచ్యుతబీజరూపుడను. దేవీ ! ఈ శయ్యపైకి రమ్ము. సాధ్వీ ! నావక్షఃస్థలము నలంకరింపుము. భూషణములు శరీరమునకు శోభను జేకూర్చునట్లు నీవు నాకు శోభను గలుగజేయుదువు. నీవు లేనినన్ను కృష్ణు (నల్లనివా) డందురు. నీతో యున్ననన్ను శ్రీకృష్ణు (శోభాసంపన్నుడైనకృష్ణు) డనికీర్తింతురు. నీవే శ్రీవి, సంపత్తివి, సర్వాధారస్వరూపిణివి, సర్వశక్తిస్వరూపిణివి. నే నవినాశిని, సర్వరూపుడను. నేను తేజఃస్వరూపుడ నైనచో, నీవు తేజోరూపిణివి. నేను శరీరరహితుడ నైన, నీవుకూడ నశరీరిణివి కాగలవు. సుందరీ ! నేను నీసంయోగముచే నెల్లపుడు సర్వబీజస్వరూపుడ నయ్యెదను. నీవు శక్తిస్వరూపిణివి. సర్వస్త్రీరూపములను నీవే ధరించియున్నావు. నాయంగములు, అంశలుకూడ నీ స్వరూపములే. నీవే మూలప్రకృతి వగునీశ్వరివి."

వరాననా! శక్తియందు, బుద్ధియందు, జ్ఞానమందు, తదితరము లైన సర్వగుణములందు నీవు నాసమానురాలవు. మన యిర్వురియందు భేదబుద్ధి కల్గియుండు నరాధముడు సూర్యచంద్రు లున్నంతవఱకు గాలసూత్ర మను నరక మనుభవింపగలడు అట్టివాడు తనపదునాల్గుతరములవారినిగూడ నరకము నందు బడద్రోయగలడు. వారికోట్లకొలదిజన్మల సముపార్జిత మగుపుణ్యము కూడ నశింపగలదు.

రాశబ్దం కుర్వతస్త్రస్తో దదామి భక్తిముత్తమామ్ ॥
ధాశబ్దం కుర్వతః పశ్చాద్యామి శ్రవణలోభతః ।
యే సేవన్తే చ దత్త్వా మాముపచారాంశ్చ షోడశ ॥
యావజ్జీవనపర్యన్తం యా ప్రీతిర్జాయతే మమ ॥
సా ప్రీతిర్మమ జాయేతే రాధాశబ్దాత్తతోఽధికా ।
ప్రియా న మే తథా రాధే రాధా వక్తా తతోఽధికః ॥ 70-72

'రా' శబ్దము నుచ్చరించుమనుష్యులకు నేను భీతుడనై యుత్తమభక్తిని ప్రసాదింతును. 'ధా'శబ్దము నుచ్చరించినవారి వెనుక రాధాశబ్దశ్రవణలోభ

ముచే నెల్లపుడు భ్రమించెదను. జీవనపర్యంతము నాకు షోడశోపచారముల నొనరించి నన్నుసేవించువారిపై నా కెట్టిప్రేమ కల్గునో, ఆప్రేమ రాధాశబ్ద ముచ్చరించువారిపై నిశ్చయముగ కల్గును. రాధా! నీకంటె నాకు నీనామము జపించువారే యధికప్రియులు".

బ్రహ్మ, అనంతుడు, శివుడు, ధర్మము, నరనారాయణులు, కపిలమహర్షి, గణేశ్వరుడు, కార్తికేయుడు, నాకు ప్రియతములు. లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, ప్రకృతి మొదలగునీదేవాంగనలుకూడ నాకు ప్రియమైనవారే. కానిరాధా! వారైననురాధానామజపులైనభక్తులకంటె నాకధికప్రియులుకారు. నే నుదహరించినదేవతలందఱు నాకు ప్రాణసమానులే. కాని నీవు నాకు ప్రాణములకంటె నధికప్రియురాలవు. సురశ్రేష్ఠులు భిన్నభిన్నస్థానములయం దున్నారు. కాని నీవు నావక్షఃస్థలమందే విరాజిల్లుచున్నావు."

అనిపలికి శ్రీకృష్ణుడు మనోహరశయ్యపై విరాజమానుడయ్యెను. రాధ భక్తిభావముతో శిరమును వంచి తనప్రాణవల్లభునితో నిట్లుపలికెను. "ప్రభూ ! గోలోకమందు నీ విచ్చినవరములు నాకు జ్ఞప్తియందున్నవి. నీవు నన్ను సర్వరూపిణి యనికీర్తించితివి, ఆసౌభాగ్యము నాకు నీనిరంతరమైన యారాధనమువలనే సంప్రాప్తించినది. నన్ను స్మరింపని వారిని నీవు కరుణింపవు. పర్వతమును నీవు తృణ మొనరింపగలవు, తృణమును బర్వతముగ జేయగలవు. దేవా ! నీవు సమదర్శివి. యోగ్యతాయోగ్యతలయందు, సంపదలయందు విపత్తులయందుగూడ నీవు సమముగ గృపను జూపుదువు. నిన్ను దరిజేరని యొక్కొక్కక్షణము నా కొక్కొక్కయుగముతో సమానమగును. నావిరహాగ్ని నుపశమింపజేయుము." రాధమధురవచనముల నాలకించి పురుషోత్తము డిట్లు పల్కెను. "ప్రియా ! ఒక్కక్షణ మాగుము. నేను నీకు శుభమును గలుగ జేయుదును. విధాత యైనను మనసమాగమమునకు భంగముగల్గింపలేడు. నేను విధాతకే విధాతను. నేను నిర్ణయించినవిధానమును బ్రహ్మాదిదేవతలైన నధిగమింపలేరు."

ఆసమయముననే చతుర్ముఖబ్రహ్మ శ్రీహరియెదుట సాక్షాత్కరించెను. ఒకహస్తమున కమండలము, ఒకహస్తమున జపమాలను ధరించి, మిగిలినరెండు హస్తములను ముకుళించి, పులకితగాత్రుడై సాశ్రుపూర్ణలోచనుడై శ్రీకృష్ణున కనేకప్రణామము లర్పించి భక్తిభావముతో స్తుతించెను. తదనంతరము

జగత్స్రష్ట రాధను సమీపించి యామెచరణకమలములందు శిరము నుంచి సాష్టాంగదండప్రణామము లర్పించెను. కమండలమందుగల శుద్ధమందాకినీపవిత్ర జలములచే బ్రహ్మ జగజ్జనని యగురాధాదేవి పాదములను ప్రక్షాళన మొనరించి, హస్తములను ముకుళించి నతమస్తకుడై యిట్లుస్తుతించెను.

బ్రహ్మోవాచ :

హే మాత స్త్వత్పాదామ్భోజం దృష్టం కృష్ణప్రసాదతః ॥
సుదుర్లభం చ సర్వేషాం భారతే చ విశేషతః ।
షష్టివర్షసహస్రాణి తప స్తప్తం పురా మయా ॥
భాస్కరే పుష్కరే తీర్థే కృష్ణస్య పరమాత్మనః ।
ఆజగామ వరం దాతుం వరదాతా హరిః స్వయమ్ ॥

వరం వృణీష్వేత్యుక్తే చ స్వాభీష్టం చ వృతం ముదా ।
రాధికాచరణామ్భోజం సర్వేషామపి దుర్లభమ్ ॥

హే గుణాతీత మే శీఘ్రమధునైవ ప్రదర్శయ ।
మయేత్యుక్తో హరిరయమువాచ మాం తపస్వినమ్ ॥

దర్శయిష్యామి కాలే చ వత్సేదానీం క్షమేతి చ ।
న హీశ్వరాజ్ఞా విఫలా తేన దృష్టం పదామ్బుజమ్ ॥
సర్వేషాం వాంఛితం మాతర్గోలోకే భారతేఽధునా ।
సర్వా దేవ్యః ప్రకృత్యంశా జన్యాః ప్రాకృతికా ధ్రువమ్ ॥

త్వంకృష్ణాంగార్ధసమ్భూతా తుల్యాకృష్ణేనసర్వతః ।
శ్రీకృష్ణ స్త్వమయం రాధా త్వం రాధా వా హరిః స్వయమ్॥
న హి వే వేదేషు మే దృష్ట ఇతి కేన నిరూపితమ్ ।
బ్రహ్మాణ్డాద్బహిరూర్ధ్వం చ గోలోకోఽస్తి యథామ్బికే ॥
వైకుణ్ఠశ్చాప్యజన్యశ్చ త్వమజన్యా తథామ్బికే ।
యథా సమ స్తబ్రహ్మాణ్డే శ్రీకృష్ణాంశాంశజీవినః ॥

తథా శక్తిస్వరూపా త్వం తేషు సర్వేషు సంస్థితా ।
పురుషాశ్చ హరేరంశా స్త్వదంశా నిఖిలాః స్త్రియః ॥
ఆత్మనా దేహరూపా త్వమస్యాధారస్త్వమేవ హి ।
అస్యాసుప్రాణై స్త్వం మాతస్త్వత్ప్రాణై రయమీశ్వరః ॥

కిమహో నిర్మితః కేన హేతునా శిల్పకారిణా ।
నిత్యోఽయం చ యథా కృష్ణస్త్వం చ నిత్యా తథామ్బికే ॥
అస్యాంశా త్వం త్వదంశో వాప్యయం కేన నిరూపితః ।
అహం విధాతా జగతాం వేదానాం జనకః స్వయమ్ ॥
తం పఠిత్వా గురుముఖాద్భవన్త్యేవ బుధా జనాః ।
గుణానాం వా స్తవానాం తే శతాంశం వక్తుమక్షమః ॥
వేదో వా పణ్డితో వాన్యః కో వా త్వాం స్తోతుమీశ్వరః ।
స్తవానాం జనకం జ్ఞానం బుద్ధిర్జ్ఞానామ్బికా సదా ॥
త్వం బుద్ధేర్జననీ మాతః కో వా త్వాం స్తోతుమీశ్వరః ।
యద్వస్తు దృష్టం సర్వేషాం తద్వివక్తుం బుధః క్షమః ॥
యద్దృష్టా శ్రుతం వస్తు తన్నిర్వక్తుం చ కః క్షమః ।
అహం మహేశోఽనన్తశ్చ స్తోతుం త్వాం కోఽపి నక్షమః॥
సరస్వతీ చ వేదాశ్చ క్షమః కః స్తోతుమీశ్వరీ ।
యథాగమం యథోక్తం చ న మాం నిన్దితుమర్హసి ॥
ఈశ్వరాణామీశ్వరస్య యోగ్యాయోగ్యే సమా కృపా ।
జనస్య ప్రతిపాల్యస్య క్షణే దోషః క్షణే గుణః ॥
జననీ జనకో యో వా సర్వం క్షమతి స్నేహతః ।
ఇత్యుక్త్వా జగతాం ధాతా తస్థౌ చ పురతస్తయోః ॥
ప్రణమ్య చరణామ్భోజం సర్వేషాం వన్ద్యమీప్సితమ్ ।
బ్రహ్మణా చ కృతం స్తోత్రం త్రిసన్ధ్యం యః పఠేన్నరః ।
రాధామాధవయోః పాదే భక్తిదాస్యం లభేద్ధ్రువమ్ ॥
కర్మనిర్మూలనం కృత్వా మృత్యుం జిత్వా సుదుర్జయమ్ ।
విలఙ్ఘ్యసర్వలోకాంశ్చ యాతి గోలోకముత్తమమ్॥ 94-113

బ్రహ్మ పలికెను :

మాతా ! శ్రీకృష్ణునియనన్యకృపవలన నా కీదినమున నీచరణకమలక ములదివ్యదర్శనసౌభాగ్యము లభించినది. నీదివ్యచరణములు సర్వత్ర సర్వు లకు పరమదుర్లభములు. నేను పూర్వకాలమందు బుష్కరతీర్థములో ప్రచండ సూర్య తేజమున బద్మాసనాసీనుడనై శ్రీకృష్ణుని ప్రసన్నతకొఱకు అఱువదివేల సంవత్సరములు తప మాచరించితిని. నాతపమునకు సంతుష్టుడై వరదాత యగుశ్రీహరి యభీష్టవరములను బ్రసాదింప సాక్షాత్కరించి నీమనోవాంఛిత మును గోరుకొనమని యాదేశింపగ నే నిట్లు వరము కోరితిని. . "గుణాతీతా !

పరమేశ్వరా ! సర్వజీవులకు నేడననిచరణకమలములదర్శన మత్యంతదుర్లభమో, ఆరాధాదేవిదివ్యసందర్శనమును శీఘ్రముగ నాకు గల్గింపుము." అందులకు శ్రీహరి, వత్సా ! ఇది సమయము కాదు. తగినసమయ మాసన్నమైనపుడు. శ్రీరాధాదేవిచరణారవిందముల దివ్యదర్శనము నీకు గలిగించెద"ననివరము నొసంగెను. ఈశ్వరునిప్రసాదము నిష్ఫలము కాదు. అందువలననే నేడు నీచరణకమలములదర్శనము నాకు గలిగినది. నేను ధన్యుడనైతిని. మాతా ! నీదివ్యచరణములు గోలోకమందు, ఇపుడు భారతవర్షమందు సర్వజనులమనో వాంఛావిషయములై యున్నవి. సర్వదేవతాస్త్రీలు ప్రకృత్యంశసంభూతలు అందువలన వారు నిశ్చయముగ జన్యలు ప్రాకృతికలు. నీవుశ్రీకృష్ణుని యర్ధశరీరమునుండి ప్రాదుర్భవించినశక్తివి. అందువలన సర్వగుణములయందు నీవుశ్రీకృష్ణునితో సమానురాలవు. నీవుస్వయముగ శ్రీకృష్ణుడవే. ఈ శ్రీకృష్ణుడు నిశ్చయముగ రాధయే. లేదా నీవు రాధవు. ఆయన స్వయముగ శ్రీకృష్ణుడు. ఈవిషయము నెవ్వరైననిరూపించిరా ? నాకట్లు వేదములందు కనబడుటలేదు. అంబికా ! గోలోకము బ్రహ్మాండములకావల, ఊర్ధ్వ భాగముననున్నట్లు వైకుంఠముకూడకలదు. జననీ! వైకుంఠము, గోలోకము అజన్యములైనట్లు జగజ్జననివైననీవుగూడ అజన్యవే. సమస్తబ్రహ్మాండములలోని సర్వజీవధారులు శ్రీకృష్ణుని యంశాంశలైనట్లు నీవాసర్వజీవులందు శక్తిస్వరూపి ణివై విరాజిల్లుచున్నావు. సమస్తపురుషులు శ్రీకృష్ణుని అంశలు, సమస్త స్త్రీలు నీయంశసంభూతలే. పరమాత్మయైన శ్రీకృష్ణునకు నీవే దేహము, అందువలన ఆయనకు నీవే యాధారభూతము. తల్లీ ! ఆయనప్రాణములవలనే నీవు ప్రాణవతివైతివి. ఆయన నీప్రాణములవలననే ప్రాణవంతుడైనాడు. ఆహా ! ఏ శిల్పియైన ఏహేతువుచేనైన వీరిదివ్యరూపములను నిర్మించినాడా ! అట్లుకానేకాదు. అంబికా ! ఈశ్రీకృష్ణుడు నిత్యుడు నీవుకూడ నిత్యవే. నీ వీయన అంశస్వరూపిణివి లేదా ఈయన నీయంశరూపుడు యనియెవరు నిరూపించిరి ! నేను జగత్స్రష్టనైన బ్రహ్మను, వేదములను సృష్టించితిని. ఆవేదములనే యభ్యసించి దేహధారులు విద్వాంసులయ్యెదరు. వేదములుకాని వేదవిదులుకాని, విద్వాంసులుకానీ, నీగుణములలో శతాంశమైనను వర్ణించుట కసమర్థులైనచో, సామాన్యులెవ్వరు నిన్ను స్తుతింపగలరు ! సుతులకు జనకము జ్ఞానము; జ్ఞానమునకు జనని బుద్ధి; మాతా ! రాధా ! ఆబుద్ధికే జననివి

నీవైనచో, నిన్నెవరు స్తుతింపగలరు ! ప్రత్యక్షముగ దర్శించిన వస్తువును వర్ణించుటకు విద్వాంసులు సమర్థులయ్యెదరు. కాని దర్శించుటకుగాని స్తుతించుటకుగాని వీలులేనివస్తువు నెవ్వడు నిర్వచింపగలడు ? అనంతుడు, మహేశ్వరుడు నేనుఎవ్వరును నిన్ను స్తుతింపజాలము. సరస్వతి, వేదములుకూడ నిన్ను నిర్వచింపజాలరు. ఐనచో పరమేశ్వరీ ! నిన్నెవరు స్తుతింపగలరు ! ఆగమముల ననుసరించి నేను నిన్ను బహుస్వల్పముగ వర్ణించితిని, కావున అన్యధా భావింపకుము. ఈశ్వరులకున నీశ్వరుడగు పరమాత్మకు. యోగ్యుల పైన, నయోగ్యులపై సమమైన కరుణయుండును. పాలకు యోగ్యమై సంతానముయొక్క గుణదోషములు క్షణక్షణము వ్యక్తమగుచుండును, కాని తలిదండ్రులు లాబిడ్డలొనరించు సర్వదోషములను ప్రేమతో క్షమించుచుందురు.

ఇట్లనేకవిధముల రాధాదేవిని స్తుతించి బ్రహ్మ యామెచరణకమలముల కనేకప్రణామము లొనరించెను. బ్రహ్మ స్తుతించిన యీస్తోత్రమును త్రిసంధ్యల యందు పఠించుమానవుడు నిశ్చయముగ రాధామాధవుల చరణములయం దనన్యభక్తిని, దాస్యసౌభాగ్యమును బొందగలడు. ఆభక్తుడు తనకర్మమూల మును భేదించి దుర్జయ మగుమృత్యువునుగూడ జయించి సమస్తలోకములను దాటుచు నుత్తమ గోలోక ధామమును జేరుట నిశ్చయము,

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

బ్రహ్మ యొనరించినస్తుతి నాలకించి శ్రీరాధ యత్యంత ప్రసన్నురాలై యభీష్టవరములను గోరుకొనుమని విధాతతో బల్కెను. జననిమాటల నాలకించి జగత్స్రష్ట యగుబ్రహ్మ శ్రీరాధాకృష్ణుల చరణకమలములందు సుదృఢభక్తి నర్థించెను. శ్రీరాధాదేవి మంచి దని బ్రహ్మప్రార్థన నంగీకరించెను. తదనం తరము లోకనాథు డగుబ్రహ్మ రాధాదేవికి నమస్కరించెను.

> పునర్ననామ తాం భక్త్యా విధాతా జగతాం పతిః ।
> తదా బ్రహ్మ తయోర్మధ్యే ప్రజ్వాల్యచ హుతాశనమ్ ॥
> హరిం సంస్మృత్య హవనం చకార విధినా విధిః ।
> ఉత్థాయ శయనాత్కృష్ణ ఉవాస వహ్నిసన్నిధౌ ॥
> బ్రహ్మణోక్తేన విధినా చకార హవనం స్వయమ్ ।
> ప్రణమయ్య పునః కృష్ణం రాధాం తాం జనకః స్వయమ్ ॥

కౌతుకం కారయామాస సప్తధా చ ప్రదక్షిణమ్ ।
పునః ప్రదక్షిణాం రాధాం కారయిత్వా హుతాశనమ్।
ప్రణమయ్య తతః కృష్ణం వాసయామాస తం విధిః ।
తస్యా హస్తం చ శ్రీకృష్ణం గ్రాహయామాస తం విధిః ॥
వేదోక్త సప్తమన్త్రాంశ్చ పాఠయామాస మాధవమ్ ।
సంస్థాప్య రాధికాహస్తం హరేర్వక్షసి వేదవిత్ ॥
శ్రీకృష్ణహస్తం రాధాయాః పృష్ఠదేశే ప్రజాపతిః ।
స్థాపయామాస మన్త్రాంస్త్రీన్ పాఠయామాస రాధికామ్ ॥
పారిజాత ప్రసూనానాం మాలాం జానువిలమ్బితామ్ ।
శ్రీకృష్ణస్య గలే బ్రహ్మా రాధాద్వారా దదౌ ముదా ॥
ప్రణమయ్య పునః కృష్ణం రాధాం చ కమలోద్భవః ।
రాధా గలే హరిద్వారా దదౌ మాలాం మనోహరమ్ ।
పునశ్చ వాసయామాస శ్రీకృష్ణం కమలోద్భవః ॥
తద్వామపార్శ్వే రాధాం చ సస్మితాం కృష్ణచేతనమ్ ।
పుటాంజలిం కారయిత్వా మాధవం రాధికాం విధిః ॥
పాఠయామాస వేదోక్తాన్ పంచమన్త్రాంశ్చ నారద ।
ప్రణమయ్య పునః కృష్ణం సమర్ప్య రాధికాం విధిః ॥
కన్యకాం చ యథా తాతో భక్త్యా తస్థౌ హరేః పురః ।
ఏతస్మిన్నన్తరే దేవా సానన్దపులకోద్గమాః ॥
దున్దుభిం వాదయామాసుశ్చానకం మురజాదికమ్ ।
పారిజాతప్రసూనానాం పుష్పవృష్టిర్బభూవ హ ॥
జగుర్గన్ధర్వప్రవరా ననృతుశ్చాప్సరోగణాః ।
తుష్టావ శ్రీహరిం బ్రహ్మా తమువాచ హ సస్మితః ॥
యువయోశ్చరణామ్భోజే భక్తిం మే దేహి దక్షిణామ్।
బ్రహ్మణో వచనం శ్రుత్వా తమువాచ హరిః స్వయమ్ ॥
మదీయచరణామ్భోజే సుదృఢా భక్తిరస్తుతే ।
స్వస్థానం గచ్ఛ భద్రంతే భవితా నాత్ర సంశయః॥ 120-135

రాధాదేవికి ప్రణామము లర్పించి బ్రహ్మ వారిద్వరి నడుమ నగ్నిని ంచి ప్రజ్వరిల్ల జేసెను. శ్రీహరిని స్మరించుచు విధిపూర్వకముగ విధాత యందాహుతుల నిడెను. తదనంతరము శ్రీకృష్ణుడు పుష్పశయ్యను వీడి

యగ్నిసమ్ముఖమున నాసీనుడయ్యెను. బ్రహ్మ యాదేశించినట్లు ఆయన స్వయముగ నగ్నియందు హవన మొనరించెను. శ్రీరాధాకృష్ణులకు నమస్కరించి స్వయముగ బ్రహ్మ రాధకు జనకుడై వారిర్వురి వైవాహిక మంగళ కార్యమును సంపన్న మొనరించి, వారిచే నగ్నికి నేడు పర్యాయములు ప్రదక్షిణ మొనరింపజేసెను. తదనంతరము రాధచే ప్రదక్షిణ మొనరింపజేసి శ్రీకృష్ణునకు నమస్కరించి, రాధను ఆయన ప్రక్కన గూర్చుండబెట్టెను శ్రీకృష్ణునిచే రాధాదేవిపాణిని బట్టించెను. మాధవునిచే నేడు వైదికమంత్రములను పఠింపజేసెను. తదనంతరము వేదజ్ఞుడై విధాత రాధహస్తమును శ్రీహరి వక్షఃస్థలముపై నుండు నట్లొనరించి శ్రీకృష్ణుని హస్తమును రాధపృష్ఠదేశమందుంచెను. తదనంతరము రాధచే మూడు వైదిక మంత్రములను పఠింపజేసెను. బ్రహ్మ ఆజానులంబియైన పారిజాతకుసుమమాలను రాధచే శ్రీకృష్ణుని గళమున వేయించెను. అట్లే శ్రీకృష్ణునిచే పుష్పమాలను రాధ కంఠము నలంకరింపజేసెను. తదనంతరము బ్రహ్మయాజ్ఞానుసారముగ శ్రీకృష్ణుని వామభాగమున రాధ యాసీనురాలయ్యెను. పిమ్మట వారిర్వురి హస్తములను కలిపి వారిచే నైదు వైదికమంత్రములను బ్రహ్మ పఠింపజేసెను. విధాత శ్రీకృష్ణునకు నమస్కరించి తండ్రి కన్యాదాన మొనరించునట్లు రాధను భక్తితో శ్రీకృష్ణునకు సమర్పించెను.

సర్వలోక శుభంకరమగు శ్రీరాధాకృష్ణుల వివాహసందర్భమున దేవతలందఱు పులకితగాత్రులై ఆనకదుందుభులను మ్రోగించి వివాహమంటపముపై పారిజాతకుసుమములను గురిపించిరి. గంధర్వులు గానముల నొనరింపగ, గుంపులుగుంపులుగ అప్సరాంగనలు నృత్యములాడిరి. బ్రహ్మ శ్రీహరిని మనసార స్తుతించి మందస్మితముఖారవిందుడై శ్రీకృష్ణదివ్యచరణములందు సుదృఢభక్తిని దక్షిణగ నొసంగుమని పరమాత్మ నర్థించెను. పరంధాముడట్లే బ్రహ్మదేవున కనన్యభక్తినిదక్షిణగ నొసంగి స్వస్థానమునకు దిరిగి వెడలి, తాను నిర్ణయించిన కార్యములను నెవేర్చుమని యాదేశించెను.''

మునీశ్వరా! శ్రీకృష్ణుని యాదేశానుసారముగ జగద్విధాత యగు బ్రహ్మ రాధామాధవులకు బ్రణమిల్లి ప్రసన్నతాపూర్వకముగ బ్రహ్మలోకమునకు వెడలిపోయెను.

బ్రహ్మ వెడలిపోగా మందస్మితముఖారవిందయై రాధ శ్రీకృష్ణుని

క్రీగంటితో జూచి లజ్జావశమున రెండుహస్తములతో తనముఖమును గప్పివేసి కొనెను. ప్రేమవేదన ననుభవించుచున్న నామెసర్వాంగములు పులకితము లయ్యెను. శ్రీహరికి భక్తిభావముతో ప్రణమిల్లి శ్రీరాధాదేవి ఆయన శయ్యపైకి జేరెను. రాధ శ్రీకృష్ణుని లలాటమందు చందనతిలకము నిడి ఆయన వక్షఃస్థలమందు చందనాగరుకస్తూరికేసరులను సంగరాగముగ నుంచెను. తద నంతరము మధువులచే నిండియున్న మనోహరరత్నపాత్రను భక్తిపూర్వక ముగ శ్రీహరి హస్తమునం దుంచెను. శ్రీకృష్ణు డాసుధను గ్రోలెను. తద నంతరము రాధ కర్పూరాదిసుగంధసమ్మిళితమైన తాంబూలమును శ్రీకృష్ణున కొసంగెను. అట్లే శ్రీకృష్ణుడొసంగినసుధారసమును త్రాగెను, తాంబూలము నారగించెను. మాధవుడు రాధాహస్తమునందున్న దర్పణ మును లాగికొనెను, రాధ మాధవుని మురళిని లాగుకొనెను. ఇంతలో కిశోరవయస్కుడైన శ్రీకృష్ణుడు శిశువుగ మారిపోయెను. ఈ హఠాత్పరి ణామమును గాంచి రాధ చింతింపగ నశరీరవాణి ఆమెనిట్లోదార్చెను. "రాధా! నీవు శోకమును వీడి నీప్రాణవల్లభుడైన శ్రీకృష్ణుని చరణకమలములను సదా చింతింపుచుండుము. రాసమండలము నిర్మింపబడనంతవరకు నీవు ప్రతిదినము రాత్రివేళ యిచ్చటకు వచ్చెదవు. నీగృహమందు నీఛాయను వీడి స్వయముగ నీప్రదేశమున కరుదెంచి శ్రీహరితో నీమనోవాంఛిత క్రీడల నొనరింపగలవు. అందువలన విచారింపక బాలరూపధారియు, మాయాపతియు నగునీప్రాణేశ్వరుని యొడిలోనికి దీసికొని, గృహమునకు వెడలుము." ఆశరీరవాణివాక్కుల నాల కించి రాధ స్వస్థురాలై మనోవేగముతో శ్రీకృష్ణునితోసహా నందమందిరము జేరెను. బాలకృష్ణుని నందుడు తనద్వారా బృందావనమునుండి బంపినాడని యశోద కర్పించెను. తదనంతరము రాధ తన స్వగృహమునకు వెడలిపోయెను. ఇట్లు ప్రతిదినము రాత్రులందు రాధ బృందావనమునకు వెడలి పురుషోత్తముని జేరి దివ్యక్రీడ లొనరించుచుండును.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున శ్రీరాధాకృష్ణవివాహ
మను పదునైదవ అధ్యాయము
సంపూర్ణము

# పదునాలవ అధ్యాయము

## బకప్రలంబకేశి యనురాక్షసులను ఉద్ధరించుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదమునీంద్రా! ఒక సమయమున మాధవుడై శ్రీకృష్ణుడు అన్యాన్య గోపబాలకులతో హాలధరునితో గలిసి భుజించి క్రీడార్థమై శ్రీవనమున కేగెను. అచట మధుసూదను డనేకబాల్యోచితక్రీడలను నెఱపెను. క్రీడానంతరము గోపబాలకులతో గలసి మురారి గోధనమును పాలింపదొడంగెను. శ్రీవనములో స్వాదిష్టజలములను గోవులచే త్రావించి మహాబలి యగుశ్రీకృష్ణుడు మధువనమును జేరెను. ఆవనములో నొకమహాబలవంతు డగుదైత్యుడుండెను. వా డత్యంత భయంకరాకృతిగలవాడు, వానిముఖము వికరాలము, వర్ణము శ్వేతము. ఆపర్వతాకారు డగుదైత్యుడు కొంగరూపమును ధరించియుండెను. గోసముదాయముమధ్య గోపాలబాల పరివేష్టితు లైయున్న శ్రీకృష్ణబలరాముల నామహాబకుడు గాంచెను. అగస్త్యమహర్షి వాతాపిని మ్రింగివైచినట్లు ఆదైత్యుడు శ్రీకృష్ణసహితముగ గోపబాలకులనందఱను మ్రింగివైచెను. శ్రీకృష్ణుడుగూడ దైత్యునిచే మ్రింగివేయబడుట గాంచి దేవతలు భయకంపితులైరి. వారు సంత్రస్తులై హాహాకారముల నొనరించుచు అస్త్రశస్త్రములను గైకొని అసురుని దాకిరి. దధీచిమహర్షి యొక్కయెముకలచే నిర్మించబడినవజ్రాయుధమును ఇంద్రు డసురునిపై ప్రయోగించెను. కాని ఆవజ్ర ప్రహారమునకు బకాసురుడు మరణింపలేదు. కేవలము వాని యొకయాక మాత్రమే జ్వలింపబడెను. చంద్రు డసురునిపై హిమమును గురిపించెను అసురుడు చలింపలేదు. కేవలము శీతమునుమాత్రమే అనుభవించెను. సూర్యపుత్రు డైనయముడు యమదండముతో వానిని మోదెను. అయ్యస్త్ర ప్రహారముచేనసురుడుకుంఠితుడై కదలలేకపోయెను. వాయువు వాయవ్యాస్త్రమును ప్రయోగించెను. అయ్యస్త్రప్రభావముచే నసురు డాప్రదేశమును వీడి వేఱొక ప్రదేశమునకు పోయెను. వరుణుడు శిలావర్షమును గురిపించెను. ఆశిలాఘాతముచే నసురుడు పీడింపబడెను. అగ్నిదేవుడు ఆగ్నేయాస్త్రమును ప్రయోగింపగా, వానిఱెక్కలు భస్మమయ్యెను. కుభేరు డర్ధచంద్రకారాయుధముచే

వానిపాదములను ఖండించెను. ఈశానుడు శూలప్రహారముచే వానిని మూర్ఛ నొందించెను. కాని మరుక్షణమే యసురుడు తెప్పరిల్లెను. ఋషు లిదిగాంచి భయభీతులై శ్రీకృష్ణు నాశీర్వదింపదొడంగిరి. అపుడు శ్రీకృష్ణుడు బ్రహ్మ తేజముతో బ్రజ్వరిల్లెను. ఆపరమేశ్వరుడు లోపల, బయట దైత్యుని సర్వాంగములను దహింపదొడంగెను. దైత్యు డామంటలకు దాళలేక శ్రీకృష్ణసహితముగ గోపబాలకుల నందఱిని వమన మొనరించి మరణించెను.

ఇట్లు బకుని వధించి శ్రీకృష్ణుడు గోపకుమారులతో గోవులను గాయుచు నత్యంతమనోహరమగు కేలీకదంబవనమును జేరెను. కంసునిచే బంపబడిన ప్రలంబాసురు డనుమహారాక్షసుడు విశాలకాయముతో భయంకర వృషభ రూపమును ధరించి శ్రీకృష్ణు నెదిరించెను. వాడు తనరెండువాడికొమ్ములచే శ్రీహరి నిలేవనెత్తి గిరగిర త్రిప్పనారంభించెను. ఈభయంకర సంఘటనను తిలకించిన గోపకుమారులందఱు భయకంపితులై యటునిటుపారిపోదొడంగిరి. కాని బలరాముడు తన సోదరుడు సాక్షాత్పరమేశ్వరు డనిమెఱింగి పెద్దగ నవ్వుచు భయమును వీడుడని గోపకుమారుల నూరడించెను. శ్రీకృష్ణు డయ్యసురునిరెండుకొమ్ములను హస్తములతో బట్టుకొని యాకాశమందు గిరగిరద్రిప్పుచు భూమిపై గొట్టెను. భూమిని దాకగనే యాదైత్యరాజగు ప్రలంబుడు ప్రాణములను వీడెను. తదనంతరము బలరామునితో గలసి గోవులను గాయుచు భాండీరవనమును సమీపించెను. ప్రలంబాసురుడు మరణించుట గాంచి కంససఖుడైన కేశి యనుదైత్యు డశ్వరూపధారియై తనగిట్టలతో ద్రవ్వుచు శ్రీకృష్ణుని తలపై నెక్కించికొని సంతుష్టుడై ఆకసమున నూఱు యోజనములవఱకు నెగిరిపోయెను. ఆయనను ద్రిప్పి చివరకు గ్రిందపడెను. వాడు మాధవుని హస్తమును కబళింప నారంభించెను. వజ్రముకంటె కఠోరములై నపరమాత్మ యంగములస్పర్శచే దైత్యునిదంతములు పొడిపొడియయ్యెను. వాడు హరిని వీడి పృథ్విపై బడి ప్రాణములను విడచెను. ఆసమయమున గోలోకమునుండి దివ్యపార్షదులతోగూడి అత్యంతసుందరవిమాన మొకటి రక్క సలు మరణించిన ప్రదేశముజేరెను. శ్రీకృష్ణునిచే నిహతులైన బక, ప్రలంబ, కేశి, దానవులు ముప్పురు దివ్యశరీరధారులై భగవంతుని స్తుతించి శ్రీకృష్ణ పార్షద పరివేష్టిత దివ్యవిమానము నధిరోహించి గోలోకముజేరిరి. నారదా! ఆముప్పురుదానవులు పూర్వజన్మమున వైష్ణవపురుషులు. వారు కర్మవశ

మున వైష్ణవదేహమును త్యజించి దానవులైనారు. పూర్వజన్మమున గంధర్వరాజపుత్రులైన యాపరమభక్తులు దానవులై జన్మించి శ్రీకృష్ణునిచే హతులై చివర కాయనకు పార్షదులైరి.

నారదుడు పలికెను :

మహాభాగా ! దైత్యరూపులైన ఆదివ్యవైష్ణవపురుషు లెవ్వరు ? ఆ రహస్యమును నాకు దెలియజేయవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీనారాయణ ఋషి పలికెను :

వైష్ణవులదివ్యచరితమును నేను పుష్కరతీర్థమందు సూర్యగ్రహణ సమయమున పరమేశ్వరుని ముఖారవిందమునుండి శ్రవణ మొనరించితిని. పూర్వకాలమందు గంధమాధన పర్వతప్రాంతమైన గంధర్వరాజ్యమును గంధవాహుడు పరిపాలించుచుండెను. గంధవాహుడు మహాతపస్వి, శ్రీహరి సేవాతత్పరుడైన నుత్తమభక్తుడు. పూవు పుట్టగనే పరిమళించునట్లు, గంధర్వ రాజుకు గల్గిన నల్వురు కుమారులు చిన్ననాటినుండియు యఖండహరిభక్తి యందు సంలగ్నులై శ్రీకృష్ణుని చరణారవిందములనే యెల్లపుడు స్మరించు చుండిరి. ఆనల్వురు కుమారులు సాక్షాత్తుగ శంకరుని యవతారుడు, పరమ వైష్ణవుడు నగుదుర్వాసమహర్షి శిష్యులు. వారు నిత్యము కమలముల నర్పించి శ్రీహరిని యారాధించిన పిమ్మట తమతమనిత్యకర్మలందు ప్రవృత్తు అయ్యెదరు. వసుదేవ, సహోత్ర, సుదర్శన, సుపార్శ్వులను నీనల్వురు గంధర్వులుపుష్కరతీర్థమందు చిరకాలము ఘోరతపమాచరించి శ్రీకృష్ణమంత్ర సిద్ధినిబొందిరి. వారిలో నగ్రగణ్యుడైన వసుదేవుడు దుర్వాసునివలన ఆధ్యా త్మికవిద్యను గ్రహించి యోగులయం దగ్రగణ్యుడై, సన్యాసిగ సిద్ధిపొందెను. ఆమహాయోగి బ్రహ్మతేజముతో ప్రజ్వరిల్లుచు నశాశ్వతమైన గంధర్వదేహ మును త్యజించి దివ్యదేహధారియై శ్రీకృష్ణపార్షదుడయ్యెను. మిగిలిన ముప్వురు గంధర్వసోదరులు ప్రాతఃకాలమందు శ్రీహరిని యర్చించుటకై దివ్యకమలములను వెదుక నారంభించిరి. వారికి మార్గమధ్యమున నొకసరో వరమందు సువర్ణకమలములు గోచరించినవి. ఆసరోవరము జనని యగు పార్వతీదేవికి సంబంధించిన దని తెలిసికొనక శ్రీహరిపూజాతత్పరులైన యా గంధర్వులు కమలములకొఱకై సరోవరమును ప్రవేశించిరి. సరోవర రక్షకు

లైన ప్రమథులు వారిని నిర్బంధించి శివునిసమక్షమునకు దొడ్కొనిపోయిరి. ఆగంధర్వులు భక్తితో సాష్టాంగ ప్రణామము లర్పించి యనేకవిధముల స్తుతించిరి. ఈషద్ధాస్యప్రసన్నుడు భక్తానుగ్రహ కాతరుడు నగునదాశివభగవానుడు గంధర్వులనుగాంచి యిట్లుపల్కెను. "పార్వతీదేవి సరోవరమునుబ్రవేశించి కమలములను పరిగ్రహించిన మీరెవ్వరు? పార్వతికమలములనర్పించి శ్రీహరినారాధించును. నిత్యము సహస్ర లక్షమందియక్షులతో రక్షితమైన యీసరోవరము పార్వతివ్రతకమలములకొఱకై వినియోగింపబడెను. పార్వతి త్రైమాసిక వ్రతము నందునిమగ్నురాలై యున్నది. ఆమెయఖండ వ్రతమున కంతరాయము సంభవింపరాదు." శివునివచనములు నాలకించి యావైష్ణవులు దోసిలియొగ్గి భక్తినమ్రాత్మకంధరులై యిట్లుపల్కిరి.

"ప్రభూ! మేము గంధర్వ నరేశ్వరుడైన గంధవాహుని కుమారులము. మహేశ్వరా! మేము ప్రతిదినము శ్రీహరికి కమలములతో నర్చించిన పిమ్మట జలములను స్వీకరించెదము, నాథా! ఈ సరోవరము పార్వతివ్రతార్థమై రక్షింపబడుచున్నదనిమాకు తెలియదు. మేము సంగ్రహించిన యీదివ్యకమలముల నన్నింటిని మీరే స్వీకరించి వ్రతమునుసఫలమొనరింపుడు. మహాదేవా! ఈరోజున శ్రీహరికి కమలములనర్పింపని యెడల మేము జలములనైనను స్వీకరింపము. మేము నీకే యీకమలము నర్పించితిమి.

సాక్షాత్తస్మై ప్రదత్త్వా చ పద్మం పూతా వయం ప్రభో ।
ఏకం బ్రహ్మ హ్యద్వితీయం క్వదేహః క్వచరూపవాన్ ॥
భక్తానుగ్రహతో దేహో రూపభేదశ్చ మయయా ।
కిన్తు గృహాణ పద్మాని త్వమేవ మత్ప్రభుః ప్రభో ॥
యతో నో మానసమ్పూర్ణం తద్రూపం దర్శయాచ్యుత ।
ద్విభుజం కమనీయం చ కిశోరం శ్యామసున్దరమ్ ॥
వినోదమురలీహస్తం పీతామ్బరధరం పరమ్ ।
ఏకవక్త్రం ద్వినయనం చన్దనాగరుచర్చితమ్ ॥
ఈషద్ధాస్యప్రసన్నాస్యం రత్నాలంకారభూషితమ్ ।
కౌస్తుభేన మణీన్ద్రేణ వక్షఃస్థలసముజ్జ్వలమ్ ॥
మయూరపిచ్ఛ చూడం చ మాలతీమాల్యభూషితమ్ ।
పారిజాతప్రసూనానాం మాలారాజివిభూషితమ్ ॥

కోటికన్దర్పలావణ్యలీలాధామ మనోహరమ్ ।
గోపీసంఘైర్దృశ్యమానం సస్మితైర్వక్రలోచనైః ॥
నవయౌవనసమ్పన్నం రాధావక్షః స్థలస్థితమ్ ।
బ్రహ్మాదిభిః స్తూయమానం వన్ద్యధ్యేయమభీప్సితమ్ ॥
స్వాత్మారామం పూర్ణకామం భక్తానుగ్రహకాతరమ్ ।
ఇత్యుక్త్వా పురతః శమ్భోస్తస్థుర్గన్ధర్వపుఙ్గవాః ॥ 51-59

ఎవని చరణకమలములను ప్రతిదినము ధ్యానించుచు కమలముల నర్పించుచు పూజించుచున్నామో, నేడు సాక్షాత్తుగ ఆయనకే యీకమలముల నర్పించి మే మందఱము పవిత్రులమైతిమి. ప్రభూ ! బ్రహ్మ మొక్కటియే. ఆయనకు దేహ మెక్కడ ? రూప మెక్కడ! కేవలము భక్తుల ననుగ్రహించుటకే భగవంతుడు శరీరమును ధరించుచున్నాడు. ఈరూపభేదములు మాయ వలననే గోచరించును. కాని జగన్నాథు డొక్కడే. ప్రభూ ! మీరే మీకమలములను స్వీకరింపుడు. మీరే మాప్రభువులు. అచ్యుతా ! మాహృదయము లెవనిధ్యానముచే పరిపూర్ణములగునో మీ రాసచ్చిదానంద విగ్రహమునే మాకు దర్శింపజేయుడు. ద్విభుజుడు, కమనీయ కిశోర వయస్కుడు, శ్యామసుందర స్వరూపుడు, హస్తములందు వినోదసాధనమైన మురళిని ధరించియున్నవాడు, పీతాంబరధారియు, ఒకముఖముతోను రెండునేత్రములతోను విరాజిల్లువాడు, చందనాగరుచర్చితుడై యున్నవాడు, ప్రసన్నముఖారవిందముపై చిరునవ్వులప్రభ విరాజిల్లువాడు, రత్నమయములగునలంకారములచే విభూషితుడై యున్నవాడు, వక్షఃస్థలమున కౌస్తుభమణికాంతితో నత్యంతో జ్జ్వలముగ గన్పడునట్టివాడు, చూడమున మయూర పిచ్ఛములను ధరించియున్నవాడు, మాలతీమాలలతో నలంకృతుడై కోట్లకొలది కందర్పులకు మనోహరలీలాధాముడైయున్నవాడు, సమూహములు, సమూహములుగ గోపికలచే వీక్షింపబడు మందస్మిత ముఖారవిందముగలవాడు నిత్యనూతన యౌవనసంపన్నుడై రాధావక్షఃస్థలమందు విరాజమానుడై యున్నవాడు, బ్రహ్మాదిదేవతలచే స్తుతించబడువాడు, సర్వులకు వందనీయుడు, చింతనీయుడు, వాంఛనీయుడు, స్వాత్మారాముడు, పూర్ణకాముడు, భక్తానుగ్రహకాతరుడు, అనిపల్కి యాగంధర్వులు మహాదేవునియెదుట ముకుళితహస్తులై నిలువబడిరి.

శ్రీకృష్ణరూప శ్రవణాత్ పులకాఙ్కితవిగ్రహః ।
గన్ధర్వాణాం వచః శ్రుత్వా శివస్తా నిత్యువాచహ ॥
శ్రీకృష్ణరూపశ్రవణాత్ సాశ్రుపూర్ణవిలోచనః ।
మయైవ యూయం విజ్ఞాతా వైష్ణవప్రవరా మహీమ్॥
పూతాం కర్తుంచ భ్రమథ చరణామ్భోజ రేణునా ।
అహం వాఞ్ఛాం కరోమ్యేవ శ్రీకృష్ణభక్త దర్శనే ॥
సమాగమో హి సాధూనాం త్రిషు లోకేషు దుర్లభమ్ ।
పార్వత్యాశ్చ సురాణాం చ సదా యూయం మమ ప్రియాః ॥
ఆత్మనశ్చాత్మభక్తేభ్యో వైష్ణవాశ్చ ప్రియాశ్చ నః ।
కిన్తు మోఘం చ న భవేన్మయా యత్ స్వీకృతం పురా ॥
తచ్ఛ్రూయతాం మహాభాగాః పార్వతీవ్రత కర్మణి ।
సరసశ్చైవ పద్మాని యైర్హృతాని వ్రతాన్తరే ॥
తే తూర్ణమాసురీం యోనిం గమిష్యన్తి న సంశయః ।
నహి శ్రీకృష్ణభక్తానామశుభం విద్యతే క్వచిత్ ॥
సమ్ప్రాప్య మానవీం యోనిం గోలోకం యాస్యథ ధ్రువమ్ ।
యూయం శ్రీకృష్ణరూపం చ ప్రత్యక్షం ద్రష్టుముత్సుకాః ॥60-67

శ్రీకృష్ణరూపవర్ణనము నాలకించిన మహాదేవుని సర్వాంగములు పులకించినవి. ఆయన నేత్రములనుండి యానందాశ్రులు ప్రవహించెను. గంధర్వులు వల్కినపల్కుల నాలకించి పరమేశ్వరు డిట్లానతిచ్చెను. "మీరు శ్రేష్ఠవైష్ణవులనియు, మీచరణకమల ధూళితో పవిత్రమొనరించుటకే యీ భూమిపై భ్రమించుచున్నారని నేను తెలిసికొంటిని. నేను సదా శ్రీకృష్ణ భక్తుల దివ్యదర్శనమునే వాంఛింతును, ఎందువలెననగ, అనన్యభక్తుల దర్శనము త్రిలోకములలోను దుర్లభమే. మీరు నాకు పార్వతికంటెను సకలదేవతలకంటెను నధికప్రియులు. నాకు వైష్ణవజనులు నాభక్తుల కంటె అధికప్రియులు. కాని నేను పూర్వకాలము నొనరించిన ప్రతిజ్ఞ వ్యర్థము కారాదు. సరోవరమును ప్రవేశించి కమలములను హరించి పార్వతీవ్రతమునకు భంగముకల్గించు వారు అసురులై జన్మించెద రనినేను శాసించితిని. పరమ వైష్ణవులారా! శ్రీకృష్ణభక్తుల కెప్పుడును నశుభములు కలుగవు. మీరు నామమాత్రమున దానవులై జన్మించి పిమ్మట గోలోకము నకు జేరెదరు". శ్రీకృష్ణుని ప్రత్యక్షముగ దర్శింపవలెనని మీ ప్రగాఢ

మనోవాంఛ. అందువలన, కుమారులారా! భారతవర్షమున బృందావనములో నాసచ్చిదానంద విగ్రహము మీకు దర్శనము నొసంగును. మీరు శ్రీకృష్ణుని దర్శించి, ఆయనచే నిహతులై, దివ్యరూపధారులై, పరమవైష్ణవ శిఖామణులై గోలోకము జేరెదరుగాక.

ఇట్లు శాపరూపమున నాగంధర్వులకు మహేశ్వరుడు మనోవాంఛితము లగువరములను ప్రసాదించెను. తదనంతర మాగంధర్వకుమారులు దర్శింపవలెనని యభిలషించిన నీలమేఘశ్యామల సచ్చిదానందస్వరూపసందర్శనమును హరు డాగంధర్వులకు ప్రసాదించెను. కన్నులారా శ్రీకృష్ణుని దర్శించి గంధర్వులు సంతుష్టాంతరంగులై గంధర్వదేహములను త్యజించి యసురులైరి. సుహోత్రుడు బకాసురుడుగను, సుదర్శనుడు ప్రలంబుడుగను, సుపార్శ్వుడు కేశిగను జన్మించిరి. మహాదేవు డాదేశించినట్లు వారుముగ్గురు శ్రీకృష్ణుని దర్శించి పరమాత్మచే నిహతులై దానవశరీరములను వీడి దివ్యదేహధారులై గోలోకపరంధామమును జేరిరి. విప్రవరా! బక కేశి ప్రబలంబోద్ధార ప్రసంగము వాచకులకు, శ్రోతలకు నిశ్చయముగ మోక్షప్రదాయకమగును.

నారదుడు పలికెను:

మహర్షీ! జగజ్జనని యగుపార్వతి యొనరించిన వ్రతమేది? ఆవ్రతమందారాధ్య దైవమెవ్వరు? వ్రతమునందు పాలింపవలసిన నియమములెవ్వి? దేవా! వ్రతసంబంధములైన సర్వవిషయములను సవిస్తరముగ నా కుపదేశింపవలసినదిగ గోరుచున్నాను.

శ్రీనారాయణఋషి పలికెను:

నారదమునీంద్రా! ఈత్రైమాసిక మనువ్రతము సాధ్వీమణులకు సతిసౌభాగ్యప్రవర్ధకమైనది. వ్రతమున కారాధ్య దేవుడు రాధాసహితు డగు శ్రీకృష్ణుడే. ఉత్తరాయణమందు విషువయోగమున నీవ్రతమారంభమై దక్షిణాయనమువఱకు కొనసాగి సమాప్తమగును. (జ్యోతిశ్శాస్త్రానుసారముగ సూర్యుడు విషువరేఖపై నేతెంచినపుడు రేయింబవళ్ళు రెండును సరిసమానములగును. ఉత్తరాయణ పుణ్యకాలప్రారంభమందు సంభవించు యోగమునే విషువయోగమందురు.) వైశాఖమాసమందు సంక్రాంతికంటె నొకదినము

నకు ముందే వ్రతిసంయమపూర్వకముగ నుపవసించి హవిష్యమును సేవింప వలెను. వైశాఖమున సంక్రాంతినాడు స్నానమొనరించి గంగాతటముపై వ్రతిసంకల్ప మొనరింపవలెను. తదనంతరము కలశమందుగాని, మణియందు గాని, సాలగ్రామమందుగాని, జలమందుగాని, రాధాసహితు డగుశ్రీకృష్ణుని యావాహనజేసి పూజింపవలెను. మొదటపంచదేవతలను పూజించి, తదనం తరము భక్తిభావముతో రాధావల్లభుడైన శ్రీకృష్ణుని ధ్యానింపవలెను. ఆయన సామవేదోక్త ధ్యానమును వర్ణించెద నవధరింపుము.

నవీననీరదశ్యామం పీతకౌశేయవాసనమ్ ॥
శరత్పార్వణ చన్ద్రాస్యమీషద్దాస్యసమన్వితమ్ ।
శరత్ప్రపుల్ల పద్మాక్షం మంజులాంఛనరంజితమ్ ॥
మానసం గోపికానాంచ మోహయన్తం ముహుర్ముహుః ।
రాధయా దృశ్యమానంచ రాధావక్షఃస్థలస్థితమ్ ॥
బ్రహ్మానన్తే శ ధర్మాద్యైః స్తూయమానమహం భజే। 82-83

నీల నీరదశ్యాముడు, నీతాంబరధారియు, శరత్పూర్ణిమాచంద్రునివంటి ముఖముగలవాడు, మందహాసనమన్వితుడు, సుందరమైన అంజనముచే రంజితము లైన శరత్కాల వికసితపద్మములవంటి నేత్రములు గలవాడు, గోపికల మనస్సును మాటిమాటికి మోహపఱచువాడు, రాధచే జూడబడువాడు, రాధావక్షస్థల మున నివసించువాడు. బ్రహ్మానంత శివధర్మదేవతలచే స్తుతింపబడువాడు నగుశ్రీకృష్ణుని సేవింపవలెను.

ఇట్లు శ్రీకృష్ణుని ధ్యానించి వ్రతి పరమాత్మను సానందముగ నావా హన మొనరింపవలెను. పిమ్మట యజుర్వేదమాధ్యందిన శాఖయందు వర్ణింప బడిన విధమున రాధను ధ్యానించి యావాహనింపవలెను.

రాధాం రాసేశ్వరీం రమ్యాం రాసోల్లాసరసోత్సుకామ్ ॥
రాసమణ్డలమధ్యస్థాం రాసాధిష్టాతృదేవతామ్ ।
రాసేశవక్షస్థలస్థాం రసికాం రసికప్రియామ్ ॥
రసికప్రవరాం రమ్యాం రమాం చ రమణోత్సుకామ్ ।
శరచ్చాజీవరాజీనాం ప్రభామోచనలోచనామ్ ॥
వక్రభ్రూభఙ్గసంయుక్తామంజనేనైవ రంజితామ్ ।
శరత్పార్వణ చన్ద్రాస్యామీషద్దాస్యమనోహరామ్ ॥

చారుచమ్పక వర్ణాభాం చన్దనేన విభూషితామ్ ।
కస్తూరీబిన్దునా సార్ధం సిన్దూరబిన్దునా యుతామ్ ॥
చారుపత్త్రావలీయుక్తాం వహ్నిశుద్ధాంశుకోజ్జ్వలామ్ ।
సద్రత్న కుణ్డలాభ్యాం చ సుకపోలస్థలోజ్జ్వలామ్ ॥
రత్నేన్ద్రసారహారేణ వక్షఃస్థలవిరాజితామ్ ।
రత్నకఙ్కణకేయూర కిఙ్కిణీ రత్నరంజితామ్ ॥
సద్రత్నసారరచితాక్వణన్మంజీరరంజితామ్ ।
బ్రహ్మాదిభిశ్చ సేవ్యేన శ్రీకృష్ణేనైవ సేవితామ్ ॥
సర్వేశేన స్తూయమానాం సర్వబీజాం భజామ్యహమ్ ।
ఇతి ధ్యాత్వా చ కృష్ణేన సహితాంతాం చ పూజయేత్॥ 85-93

రాసేశ్వరియు, రమణీయయు, రాసోల్లాసరసము కొఱకుత్సుకత చెందునదియు, రాసమండలమధ్యమున నుండునదియు, రాసాధిష్ఠాతృదేవతయు, రాసేశ్వరుని వక్షస్థలముననుండునదియు, రసికయు, రసికప్రియయు, రసికలలో శ్రేష్ఠయు, సురమ్యరమారూపిణియు, ప్రియతమునితో రమించుట కుత్సుకత చూపునదియు, శరత్కాలప్రఫుల్లకమలశోభను దిరస్కరించు నేత్రములు గలదియు, వక్రములైన కనుబొమలు గలదియు, కాటుకచేరంజితములైననేత్రములుగలదియు, మందహాసముచే మనోహరమగు శరత్పూర్ణిమాచంద్రునివంటి ముఖమండలముగలదియు, సుందరచంపక పుష్పములవంటి అంగకాంతికలదియు, చందనచర్చితయు, కస్తూరీసిందూరబిందువులచే నలంకరింపబడినదియు, మకరికాపత్రరచనలచేగూడిన కపోలములుగలదియు, అగ్నిశుద్ధాంశుకములచే శోభిల్లునదియు, రత్నకుండలములచే శోభిల్లు గండభాగములుగలదియు, రత్నేంద్రసారహారముచే విరాజిల్లు వక్షస్థలముగలదియు, రత్ననిర్మితలైన కంకణములచేత కేయూరములచేత కింకిణులచేత విరాజిల్లునదియు, రత్నసారనిర్మితములైన ధ్వనించుచున్న నూపురములచే రంజిల్లునదియు, బ్రహ్మాదులచేత సేవింపబడు శ్రీకృష్ణునిచే సేవింపబడునదియు, సర్వేశ్వరునిచే స్తుతింపబడునదియు, సర్వబీజరూపిణియునగు శ్రీరాధాదేవిని సేవింతును. ఇట్లు ధ్యానించి శ్రీకృష్ణసహితముగ రాధాదేవిని ప్రతిదినము పూజింపవలెను.

ప్రతిదినము భక్తిభావముతో షోడశోపచారముల నర్పించుచు నూటయెనిమిది సహస్రదళ కమలములచే శ్రీరాధాకృష్ణులను పూజించి. నూటయెనిమిది పర్యాయములు అగ్నియందు దోహుతుల నిడవలెను. భక్తిసమన్వి

తుడై ప్రతి 'శ్రీకృష్ణాయ స్వాహా' యనుమంత్రము నుచ్చరించుచు యత్న
పూర్వకముగ నాహుతుల నిడవలెను. నూటయెనిమిది మామిడిపండ్లను అరటి
పండ్లను భక్తితో ఆహుతుల నిడవలెను. ప్రతిదినము నూటయెనమండుగురు
సద్భక్తులకు భక్తిపూర్వకముగ భోజన మిడవలెను. ఘృతమిశ్రిత తిలలచే
నిత్యము ప్రతి శ్రీరాధాకృష్ణార్పణముగ నూటయెనిమిది యాహుతులను అగ్ని
యందర్పించి వివిధవాయిద్యములను మ్రోగించుచు అఖండహరినామ సంకీర్తన
మొనరింపవలెను.

మూడుమాసముల పర్యంతము నియమములను బాలించుచు పైనవర్ణింప
బడినట్లు శ్రీరాధాకృష్ణులవ్రతమును సంపన్న మొనరించి పిమ్మట వ్రతి ప్రతిష్ఠ
యొనరింపవలెను. నారదా! ప్రతిష్ఠదినమున ఏవిధానముల నవలంబింప
వలెనో శ్రవణ మొనరింపుము. విప్రవరా! తొంబదివేల అక్షతకమలముల
నాహుతిగ నిడి యత్నపూర్వకముగ తొమ్మిదివేలమందిజనుల కుత్తమస్వాదిష్ఠ
భోజనమును బెట్టవలెను. తొమ్మిదివేలయేడువందల యిరువదిఫలములను,
నానావిధమనోహరద్రవ్యములను నైవేద్యముగ నర్పింపవలెను. తదనంతరము
సంస్కారయుక్తాగ్నిని ప్రజ్వరిల్లజేసి, అగ్నియందు తొంబదివేలఘృతమిశ్రిత
తిలాహుతుల నర్పింపవలెను. బ్రాహ్మణులకు భక్తిభావముతో వస్త్రములను,
ఫలములను, యజ్ఞోపవీతమును తిలలతో నొనరింపబడినలడ్లను, స్వాదిష్ఠభోజన
మును నొసంగవలెను. శీతలజలములతో నింపబడినతొంబదివేలకలశములను
కూడ దాన మొనరింపవలెను. చివరకు వేదములందు జెప్పబడినట్లు పురోహి
తులకు దక్షిణనొసంగవలెను. దేవర్షీ! త్రైమాసికవ్రతవిధాన మిట్లువేదము
లందు వర్ణింపబడెను. ఈవ్రతానుష్ఠానమువలన స్త్రీకి విశిష్టసంతానము,
నూరుజన్మములవఱకు నిశ్చయముగ నఖండపతిసౌభాగ్యము లభించును, ప్రతి
జన్మమందు ఆమెకు సత్పుత్రులే గల్గెదరు. వ్రత మొనరించినసాధ్వికి
యెప్పుడును పతిపుత్రవియోగము సంభవింపదు. భర్త సదా ఆమెయభ్యర్థనము
లను మన్నించును, సంతానము సదా ఆమె యాజ్ఞలను బాలించును. ఆసతి
శ్రీరాధాకృష్ణులభక్తితో సంపన్నురాలు కాగలదు. నారదా! త్రిలోకము
లందు సాధ్వీమణు లీపవిత్రవ్రతము నాచరించుట గాంచి పార్వతి ప్రసన్నతా
పూర్వకముగ రెండుహస్తములను ముకుళించి భక్తిభావముతో శిరము వంచి
శంకరు నిట్లర్థించెను. "జగన్నాథా! మనయిర్వురియిష్టదైవ మైనశ్రీహరి

యొక్క వ్రతములందు ఈ త్రైమాసికవ్రత మత్యంతశ్రేష్ఠము. యజ్ఞ దాన వేదాధ్యయనతీర్థసేవనపృథ్వీపరిక్రమణాదిఫలము లన్నియు శ్రీహర్యారాధనా ఫలమందు పదునారవవంతున కైనను సరిరావు. లోపల బయట ప్రతిక్షణము శ్రీహరిస్మృతికల్గియుండు జీవన్ముక్తుఁ డైనపురుషునిదర్శనముచే నిశ్చయముగ దేహధారులకు ముక్తి లభించును. అయ్యనన్యభక్తులచరణకమలములధూళి సోకినతక్షణమే పృథ్విసహితము పవిత్ర మగును. వారిసందర్శనమాత్రముననే త్రిలోకములు పునీతములు కాగలవు. బ్రహ్మవిష్ణుధర్మదేవతానంతమహేశ్వర గణేశ్వరాదులు శ్రీకృష్ణునిచరణకమలములనే సదా చింతించుచు ఆయనతో సమాన మైనతేజస్సుకలవారైరి. ఎల్లపుడు ధ్యానించువాఁడు ధ్యేయవస్తువును నిశ్చయముగ బొందగలఁడు. ఇంతేకాదు, ధ్యాత యైనపురుషుఁడు గుణతేజ బుద్ధిజ్ఞానాదులయందు తనధ్యేయవస్తువుతో సమానుఁడు కాగలఁడు. శ్రీకృష్ణ చింతనమువలన, తపోధ్యానసేవలవలన నేను మీవంటిభర్తను, పరమాత్మవంటి పుత్రుని బొందగల్గితిని. కావున దేవా! ఆదివ్యవ్రతపాలనమునకు నా కనుజ్ఞనిండు.

పార్వతియభ్యర్థన మాలకించి పరమేశ్వరు డత్యంతప్రసన్నుఁడై ఇట్ల నుగ్రహించెను.

శ్రీ మ హా దే వు డు ప లి కె ను :

ఈశ్వరీ! నీవు శ్రీమహాలక్ష్మీస్వరూపిణివి. నీ కసాధ్య మనునది జగమునందు లేదు. నీవు సర్వసమ్పత్స్వరూపిణివి, అనంతశక్తిరూపిణివి. దేవీ! నీ వేవరి ననుగ్రహించెదవో, వారు ఐశ్వర్యవంతులు కాగలరు. శుభ ప్రదా! నేను, బ్రహ్మ, విష్ణువు నీయందు భక్తియుక్తులమై నీకృపాకటాక్షము వలననే యీసంసారసృష్టిపాలనసంహార కార్యములందు సమర్థుల మైనాము. నే నైనను, హిమాలయు మైనను, కార్తికేయగణేశ్వరు లైనను, నీవు లేనిదే యసమర్థులమేయగుదుము. మేము నీవలననే శక్తివంతుల మైతిమి. పతివ్రతా! పరమేశ్వరుని యాజ్ఞానుసారముగ నీ వీపవిత్రవ్రతము నాచరింపుము సనత్కుమారుఁడే నీకు బురోహితుఁడు కాగలఁడు. సుందరీ! ఈవ్రతమునకు గావలసినకమలములను నేనే నీకు బ్రసాదించెదను. కుబేరుని ద్రవ్యకోశసంరక్షకునిగ నియమింపుము. నేను స్వయముగ దానాధ్యక్షుఁడ నయ్యెదను. లక్ష్మి

దేవి యఖండధనమును ప్రసాదింపగలదు. అగ్ని వేదములు పఠించుచు, వరుణుడు జలముల నొసంగును, యక్షులు కార్తికేయునినాయకత్వమున నీవ్రత సామగ్రిని సమకూర్చెదరు. వ్రతప్రదేశమును పరిశుద్ధ మొనరించుకార్యమును స్వయముగ వాయుదేవు డొనరింపగలడు. ఇంద్రుడు భోజనములను సిద్ధ మొనరింపగలడు. చంద్రుడు వ్రతాధిష్ఠాపకుడు కాగలడు. ప్రియా! సూర్యుడు దానముల నిర్వచన మొనరింపగలడు. అసంఖ్యాకద్విజులకు ధన కనకవస్తువాహనముల నర్పించి, సమారాధనముల నొనరించి భక్తితో నీ త్రై మాసికవ్రతమును సంపన్న మొనరింపుము.

ఇట్లు పరమేశ్వరుడు పార్వతిచే శ్రీరాధాకృష్ణ ప్రీత్యర్థమై త్రైమాసికవ్రత మొనరింపజేసెను. నారదా! ఇప్పుడట శ్రీకృష్ణబాలలీలాచరితముల వర్ణింతు దద నవధరింపుము. శ్రవణ మొనరించుభక్తులకు శ్రీకృష్ణదివ్యలీలలు అడుగడు గున నిత్యనూతనములుగ గోచరించును. దానవులను సంహరించి విజయుడై బాలకృష్ణుడు బలరామునితో గలసి గోపగోగణములతో గోకులము జేరెను. గోపబాలకులు వనమునందు సంభవించిన భయంకరసంఘటనలను నందునకు దెలియజేసిరి. విషయము తెలిసికొనిననందు డత్యంతభీతుడయ్యెను. నందు డాక్షణముననే గోకులములోని పెద్దల నందఱిని రావించి శ్రీకృష్ణునకు జరుగు చున్నరాక్షసపీడను వర్ణించి గోకులమును బరిత్యజించుటకు నిర్ణయించెను. నందుని యాజ్ఞానుసారముగ సమస్తగోకులవాసులు గోకులమును వీడి మఱి యొకసురక్షితప్రదేశము నన్వేషించుచు బయలుదేరిరి. సకలరత్నాభరణ విభూషితయై రాధాదేవి సుశీలాదిసఖులతో గలసి బృందావనమునకు బయలు దేరెను. శ్రీకృష్ణబలరామాదులు దివ్యాలంకారములతో నలంకృతులై శ్రేష్ఠరథముల నధిరోహించి గోకులప్రజలందఱు వెంటరాగా బృందావనము వైపునకు బయలుదేరిరి.

గోకులవాసు లందఱు రథములపై, నశ్వములపై, వృషభశకటములపై నధిరోహించి శ్రీకృష్ణబలరాముల నగ్రభాగమందు నిడుకొని బృందావనము జేరిరి. వారంద ఱాదినమున వృక్షములక్రింద విడిసిరి. గృహములు లేవని చింతించుగోకులవాసులను గాంచి బాలకృష్ణు డిట్లుపల్కెను. "ప్రజలారా! మీ రీదినమున ఇక్కడనే గడుపవలెను. ఈస్థానమందు దేవతలు నిర్మించిన యసంఖ్యాకగృహము లదృశ్యరూపమున గలవు. దేవతలను బ్రసన్నులుగ

నొనరింపనిదే దివ్యరత్ననిర్మితగృహసమన్విత మైనమహానగరము మనకు దృష్టిగోచరముకాదు. కావున గోపగణములారా ! మీరంద ఱీదినమున చందనాగరుసుగంధద్రవ్యములచే, ధూపదీపనైవేద్యాదులచే నీవటవృక్ష మూలమం దున్నచండిక నారాధించి యాశక్తిని బ్రసన్నురాలిగ జేయుడు."

శ్రీకృష్ణునియాదేశానుసారముగ గోకులవాసులంద ఱాదినమున చండిక నారాధించి, సకలదేవతలను బూజించి భోజనాదినిత్యకృత్యములను సంపన్న మొనరించుకొని రాత్రియందు ప్రసన్నతాపూర్వకముగ నాప్రదేశమునసే శయనించిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములో నారదనారాయణ
సంవాదమున బకప్రలంబకేశివధానంతరము
శ్రీకృష్ణబలరాములు బృందావన
మున కేగుదెంచుట యను
పదునాఱవ అధ్యాయము
సంపూర్ణము

—0—

# పదునేడవ అధ్యాయము

## బృందావన నగర నిర్మాణ వర్ణనము

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదా ! ఆరాత్రిసమయమున బృందావనములో సర్వవ్రజవాసులు సుఖపూర్వకముగ గాఢనిద్ర కధీనులైరి. నిద్రకే స్వామి యైన శ్రీకృష్ణుడు కూడ యశోదవక్షఃస్థలముపై శిరమునుంచి ప్రగాఢనిద్రవశుడయ్యెను. పూర్ణచంద్రుని వెన్నెలచే బృందావనము స్వర్గముకంటె నధికమనోహరముగ గన్పడుచుండెను. నానాసుగంధితకుసుమములను స్పృశించి మందమందముగ వీచుచున్న వాయు పావనప్రాంతమునంతటిని సువాసిత మొనరించుచుండెను. ఆప్రఫుల్ల వాతావరణమందు బృందావనాంతర్గత సర్వప్రాణులు గాఢనిద్రావశులై శయనించినవి.

రాత్రికాలమున నైదు ముహూర్తములు గడచిన పిమ్మట శిల్పాచార్యులకును నాచార్యుడగు విశ్వకర్మ యచటికి చేరెను. ఆయన దివ్యములు అమూల్యములు నగువస్త్రములతోను, మనోహరము లగురత్నమాలలతోను, అనుపమరత్ననిర్మితములైన నలంకారములతోను నలంకృతుడై యుండెను. కర్ణములయందు మకరాకారమునున్న కుండలములు మిలమిల లాడుచుండెను, ఆయన జ్ఞానమునందును, వయస్సునందును వృద్ధుడైనను, బాలునివలె దర్శనీయుడై యుండెను. అత్యంత సుందరముగను, తేజస్విగను, మన్మథునివలె కాంతిమంతముగ నుండెను.

ఆవిశ్వకర్మతోపాటు విశిష్టములైన శిల్పకళలలో నిపుణులగు మూడు కోట్లమంది శిల్పులుండిరి. వారందటి హస్తములయందును మణిరత్న హేమరత్న లోహనిర్మితాస్త్రములుకలవు. కుబేరవన కింకరులైన యక్షులు కూడ నచటికి జేరుకొనిరి వారందరు స్ఫటికమయములైన, రత్నమయములైన, యలంకారములతో విభూషితులైయుండిరి. కొందటి బాహువులు దీర్ఘముగనుండెను, కొందటి హస్తములలో పద్మరాగ మణిరాసులు, కొందటి చేతులలో ఇంద్రనీలమణిరాసులుకలవు. కొందఱు యక్షులు తమ హస్తములలో శ్యమంతకమణులను, పట్టుకొనియుండిరి, కొందఱు చంద్రకాంతమణులను మరికొందఱుసూర్యకాంతమణులను, ఇంకకొందఱుప్రభా

కరమణులను తెచ్చిరి. కొందఱు పరశుహస్తులు, కొందఱు లోహసారకరులు, కొందఱు గంధసారహస్తులు, కొందఱు మణీంద్రవాహకులు, కొందఱుచామర ధారులు, దర్పణస్వర్ణపాత్ర స్వర్ణకలశాదిధారులు నై యుండిరి.

విశ్వకర్మ అత్యంత మనోహర మగునాసామగ్రినిజూచి, చారులోచనుడగు శ్రీకృష్ణుని ధ్యానించి యచట నగరనిర్మాణ కార్యము నారంభించెను. భారత వర్షమునందు శ్రేష్ఠము సుందరము నగునానగర మైదుయోజనముల విస్తృత ముగ నుండెను. తీర్థసారభూత మగునాపుణ్యక్షేత్రము శ్రీహరి కత్యంత ప్రియమైనది. పరమనిర్వాణమును గలిగించు ఆప్రదేశమున ముముక్షువుల నివసించుచుందురు. గోలోకమునకు చేరుట కది సోపానము వంటిది. సమస్త మనోవాంఛితముల నీడేర్చునట్టిది. అచట నాల్గు నాల్గుగదులుగల నాల్గుకోట్ల భవనములు నిర్మింపబడియుండెను. వానిచే నానగరమత్యంత మనోహరముగ గన్పట్టుచుండెను. శ్రేష్ఠప్రస్తర నిర్మిత మగునావిశాల నగరము కవాట స్తంభ సోపానములతో శోభిల్లుచుండెను. చిత్రమయములైన చిత్తరువులతోను, పుష్పములతోను, కలశములతోను అచటి భవనముల శిఖర భాగములత్యంత ప్రకాశవంతముగ గన్పట్టుచుండెను. పర్వతశిలాఖండము లచే నిర్మితము లైనవేదికలు, ప్రాంగణములు ఆనగర శోభనినుమడింప జేయుచుండెను. పాషాణనిర్మిత ప్రాకారములచే నగరమంతయు చుట్టబడి యుండెను, విశ్వకర్మ విలాసముగనే సర్వనగరమును నిర్మించెను. ప్రతి గృహమందును తగువిధముగ రెండుద్వారములుండెను. హర్షోత్సాహము లచే నిండియున్న దేవశిల్పి స్ఫటికములవంటి మణులతో ఆనగరములోని భవన ములనిర్మించెను. గంధసారనిర్మిత సోపానములతోను, శంఖరచిత స్తంభముల తోను, లోహసారనిర్మిత కవాటములతోను సముజ్జ్వలములైన రజతనిర్మితకలశ ములతో, వజ్రసారనిర్మిత ప్రాకారములతోను ఆనగర మపూర్వముగ శోభిల్లు చుండెను. ఆనగరమున గోపికలకు తగుస్థానమున తగువిధముగ నివాసముల నిర్మించి విశ్వకర్మ వృషభానునకు రమణీయభవనమును నిర్మించుట కారంభిం చెను. దానికి నలువైపుల ప్రాకారములను గట్టించెను, అగడ్తలను త్రవ్వించెను. నాలుగుదిక్కులలోను నాలుగుకవాటముల నేర్పరచెను.

నాలుగు నాలుగుగదులతో గూడియున్న ఇరువది భవ్యభవనములు నిర్మింపబడెను. ఆభవనమంతయు బహుమూల్యములగు మణులతో నిర్మిత

మయ్యెను. రత్నసారరచితములు, రమ్యములు నగుతూలికలతోను, సువర్ణాకారమణినిర్మితములు, అత్యంత సుందరములు నగుసోపానములతోను, లోహసారనిర్మితకవాటములతోను, కృత్రిమములగు చిత్రములతోను ఆవృషభానుని భవనము గొప్పగ శోభిల్లుచుండెను. అచటి ప్రతిమందిరము సువర్ణకలశములచే దేదీప్యమానమైయుండెను. అయ్యాశ్రమములో మనోహరచంప వృక్షోద్యానములోపల అత్యంత మనోహర నిర్జన ప్రదేశమున పతితోపాటు కళావతి యుపభోగమునకై విశ్వకర్మకూతూహలవశుడై విశిష్టశ్రేణికి చెందిన శ్రేష్ఠమణులచే నొకయట్టాలికను నిర్మించెను; దానిలో ఇంద్రనీలమణి నిర్మితములైన తొమ్మిది సోపానములు గలవు. గంధసార నిర్మిత స్తంభములతోను కవాటములతోను, ఉన్నతము మనోహరము నగునాభవనము అన్నివైపుల విలక్షణముగ నుండెను.

నా ర దు డు ప లి కె ను :

దేవా ! మనోహరరూపముగల కళావతి యెవరు ! ఆమెయెవరిపత్ని ఆమెకొఱకేగదా దేవశిల్పి ఇంతటి ప్రయత్నముతో నింతటి గృహమును నిర్మించెను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

సుందరియగుకళావతి శ్రీమహాలక్ష్మి యంశచే నుద్భవించిన పితరుల మానసీకన్య, మఱియు వృషభాను డనువైశ్యశ్రేష్ఠుని పత్ని. శ్రీకృష్ణునకే ప్రాణాధికప్రియయైన జనని రాధ ఆమె కుమార్తెయే. రాధ శ్రీకృష్ణుని అర్ధాంశనుండె ప్రాదుర్భవించెను, అందువలన ఆమె శ్రీకృష్ణసమానురాలు. ఆమె దివ్యచరణముల రజస్పర్శచే వసుంధర సహితము పరమపవిత్రమైనది. జగమునందున్న సర్వభక్తులు శ్రీరాధాచరణారవిందములందు అవిచలమైన, అనన్యభక్తినే సదా వాంఛింతురు.

నా ర దు డు ప లి కె ను :

మునీశ్వరా! వ్రజమందు నివసించు నొకమానవుడు పితృదేవతల మానసీకన్యను బత్నిరూపముగ నెట్లు పొందగల్గెను. వ్రజవాసి యైనవృషభానుడు

పూర్వజన్మమం దెవ్వరు ? ఆయన యెవరిపుత్రుడు ? ఏయఖండతపఃప్రభావ
మున ఆద్యాప్రకృతి యగు రాధాదేవి వానికుమార్తెగా ప్రాదుర్భవించెను.

సూత మహర్షి పలికెను :

శౌనకాదిమహర్షులారా ! నారదునియాప్రశ్నల నాలకించి జ్ఞానుల
యందు శిరోమణి యైననారాయణమహర్షి ప్రసన్నతాపూర్వకముగ వృష
భాను కళావతులప్రాచీనేతిహాసమును బ్రవచింప నారంభించెను.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

నారదమునీంద్రా ! పూర్వకాలమందు పితరులమనస్సునుండి కలావతి,
రత్నమాల, మేనక యనుముగ్గురు దివ్యాంగనలు ప్రాదుర్భవించి. వీరియందు
రత్నమాల జనకుని యర్ధాంగియయ్యెను. మేనక శ్రీహార్యంశసంభూతు
డైనహిమవంతుని బతిగ వరించెను. అయోనిజయు, సతియు, సత్యపరాయ
ణయు నగుసీతయే రత్నమాలపుత్రిక, సాక్షాత్తుగ శ్రీమహాలక్ష్మి, ఆమె
శ్రీరామునియర్ధాంగి. మేనకపుత్రిక పార్వతి. ఈమె అయోనిజ. ఈమె
పూర్వజన్మమందు సతి యనునామమున బ్రసిద్ధిగాంచెను. ఆమె యఖండతప
మాచరించి సాక్షాత్తుగ శ్రీమన్నారాయణస్వరూపుడైనమహాదేవునే పతి
రూపమున బొందెను. పార్వతి శ్రీహరిసనాతనమాయాశక్తి. కళావతి
మనువంశమందు శ్రీహార్యంశచే నుద్భవించిన సుచంద్రుని బరిణయమాడెను.
కళావతీసుచంద్రులు దీర్ఘకాల మఖండసుఖముల ననుభవించిరి. సౌఖ్యముల
నెంతగ ననుభవించినను తృప్తిగల్గదనిసుచంద్రుడు గ్రహించి విరాగియై
కళావతితో వింధ్యపర్వతప్రదేశమునందుకల పులహాశ్రమ మనుపవిత్రస్థానమును
జేరి సహస్రదివ్యవర్షములు ఘోరతప మాచరించెను. అనరేశ్వరుని మనస్సు
లోని లౌకికవాంఛ లన్నియు నంతరించెను. శ్రీకృష్ణదివ్యచరణారవిందము
లనే సదా ధ్యానించుచు సుచంద్రు డాహారమును సహితము వర్జించి కృశో
డగు డయ్యెను. సుచంద్రు డాహారమును వర్జించి తప మాచరించిన
కారణమున శక్తిహీనుడై మూర్ఛిల్లెను. నిశ్చేష్టుడై పడియున్నప్రాణవల్ల
భుని గాంచి పతివ్రతయగుకళావతి విలపింపదొడంగెను. ఆసమయమున స్వయ
ముగ బ్రహ్మయే వారియెదుట సాక్షాత్కరించి కమండలజలములను బ్రోక్షించి
సుచంద్రుని చైతన్యవంతునిగ నొనర్చెను. స్మృతిని బొందిననరేశ్వరుడు

సమ్ముఖమున జగద్విధాతను దర్శించి పత్నీసహితముగ ననేకప్రణామము లర్పించి స్తుతించెను. ఆదంపతుల ప్రార్థనలకు ప్రసన్నుడైన బ్రహ్మదేవు డభీష్టవరమును గోరు మనిసుచంద్రు నాదేశింపగ నతడు నిర్వాణమోక్షమును ప్రసాదింపు డని బ్రహ్మదేవుని ప్రార్థించెను. తనభర్తకు నిర్వాణము ప్రాప్తించిన తన కేదశ సంభవించునో తెలిసికొనినకళావతి వరమును ప్రసాదించుటకు సంసిద్ధుడై యున్న బ్రహ్మతో నిట్లుపల్కెను.

కళావతి పలికెను:

కమలోద్భవా! బ్రహ్మదేవా! మీరు నాప్రాణేశ్వరునకు మాత్రమే నిర్వాణమోక్షమును ప్రసాదించిన అబల నైననాగతి యేమి! మీరే దయతో విచారింపుడు. చతురాననా! కాంతుడు లేనిదే కాంతకు నేమి శోభగలుగును.

వ్రతం ప్రతివ్రతాయాశ్చ పతిరేవ శ్రుతౌ శ్రుతమ్ ।
గురుశ్చాభీష్టదేవశ్చ తపో ధర్మమయః పతిః ॥
సర్వేషాం చ ప్రియతమో న బన్ధుః స్వామినః పరః ।
సర్వధర్మాత్పరా బ్రహ్మన్ పతిసేవా సుదుర్లభ ॥
స్వామిసేవావిహీనాయాః సర్వం తన్నిష్ఫలం భవేత్ ।
వ్రతం దానం తపః పూజా జపహోమాదికం చ యత్ ॥
స్నానం చ సర్వతీర్థేషు పృథివ్యాశ్చ ప్రదక్షిణమ్ ।
దీక్షా చ సర్వయజ్ఞేషు మహాదానాని యాని చ ॥
పఠనం సర్వదేవానాం సర్వాణి చ తపాంసి చ ।
వేదజ్ఞానం బ్రాహ్మణానాం భోజనం దేవసేవనమ్ ॥
ఏతాని స్వామిసేవాయాః కలాం నార్హన్తి షోడశీమ్ ।
స్వామిసేవావిహీనా యా వదన్తి స్వామినే కటుమ్ ॥
పతన్తి కాలసూత్రే చ యావచ్చన్ద్రదివాకరౌ । 67-72

"పతివ్రతయైననారీమణికి భర్తయే వ్రతము, పతియే గురువు, ఇష్టదైవము, తపము, ధర్మము, అని శ్రుతివచనము. వ్రతము, దానము, తపస్సు, పూజ, జపము, హోమము, సంపూర్ణతీర్థస్నానము, భూప్రదక్షిణము, సర్వయజ్ఞదీక్షలు, వేదపఠనము, అన్నదానము, దేవతారాధనము నానావిధము

లైనమహాదానములు మున్నగువాని ఫలములన్నియు, పతిసేవాఫలమందు పదు నాఱవయంశకైనను సరిరావు. భర్తను సేవింపక కఠినవచనములతో బాధించుస్త్రీలు సూర్యచంద్రులు లున్నంతవఱకు కాలసూత్ర మనునరక మను భవింపగలరు." అబల నైననేను విద్వాంసులనుండి శ్రవణ మొనరించినజ్ఞాన ముతో నుపర్యుక్తవచనములను పల్కితిని. మీరు సర్వవేదప్రకాశకులు, విద్వాంసులకు, యోగులకు, జ్ఞానులకు, గురువులకుగూడ నాచార్యులు. దేవా! మీరు సర్వజ్ఞులు నేనేమని మీకు ధర్మమును జెప్పగలదానను. నాపతి నాకు ప్రాణములకంటె నధికప్రియుడు. నాభర్తకు మోక్షము ప్రాప్తించిన నాకు రక్షకులెవ్వరు ! నాధనయౌవనముల నెవరు రక్షింపగలరు? బాలికగ నున్నపుడు స్త్రీని తండ్రి రక్షించును, పిమ్మట కన్యను తండ్రి పాత్రునకు దాన మొనరించి కృతకృత్యు డగును. అప్పటినుండి భర్తయే నారిని రక్షిం చును. ఇట్లు మూడవస్థలయందు స్త్రీకి యీముగ్గురు రక్షకు లనిజెప్పబడిరి. భర్తయాజ్ఞలను బరిపాలింపక స్వతంత్రించి స్త్రీలు తమనూఱుజన్మల సంచిత పుణ్యమును నష్టపోయెదరు. పాలు త్రావుశిశువుపై స్త్రీకి యధికప్రేమ యుండును, కాని పతివ్రత యగుస్త్రీకి నిజనాధుని పైగల ప్రేమయందు ఆపుత్రప్రేమ పదునాఱవయంశకైనను సరిరాదు,

నహి కాన్తాత్ పరో బన్ధుర్నహి కాన్తాత్ పరః ప్రియః ॥
న హి కాన్తాత్ పరో దేవో న హి కాన్తాత్ పరో గురుః ।
న హి కాన్తాత్ పరో ధర్మో న హి కాన్తాత్ పరం ధనమ్ ॥
న హి కాన్తాత్ పరాః ప్రాణా న కః కాన్తాత్ పరః ప్రియః।
నిమగ్నం కృష్ణపాదాబ్జె వైష్ణవానాం యథా మనః ॥

యథైకపుత్రే మాతుశ్చ యథా స్త్రీషు చ కామినామ్ ।
ధనేషు కృపాణానాం చ చిరకాలార్జితేషు చ ॥
యథా భయేషు భీతానాం శాస్త్రేషు విదుషాం యథా ।
స్తనాదానే శిశూనాం చ శిల్పేషు శిల్పినాం యథా ॥

యథా జారే పుంశ్చలీనాం సాధ్వీనాం చ తథా ప్రియే ।
తం వినా జీవితుం బ్రహ్మన్ క్షణమేకం న చ క్షమమ్॥88-93

"పతిని మించినబంధువుకాని, ప్రియుడుకాని, దైవముకాని, గురుడు కాని, ధర్మముకాని, ధనముకాని, ప్రాణముకాని, యేదియు లేదు. వైష్ణవుల

మనస్సు శ్రీకృష్ణునిచరణారవిందములందే నిమగ్నమైయుండునట్లు, తల్లి మనస్సు పుత్రునియందే నిమగ్నమైయుండునట్లు, కాముకునిమనస్సు స్త్రీలయందే నిమగ్నమైయుండునట్లు, కృపణునిమనస్సు తానుచిరకాలము సముపార్జించిన ధనమందే నిమగ్నమైయుండునట్లు, భీతిచెందినవారిమనస్సు భయమందు నిమగ్నమై యుండునట్లు, విద్వాంసునిమనస్సు శాస్త్రములందు నిమగ్నమైయుండునట్లు, శిశువులమనస్సు తల్లి స్తన్యపానమందు నిమగ్నమైయుండునట్లు, శిల్పులమనస్సు శిల్పములందు నిమగ్నమైయుండునట్లు, జారులమనస్సు కులటాస్త్రీలయందు నిమగ్నమైయుండునట్లు సాధ్వియగుస్త్రీమనస్సు భర్తయందే సంలగ్నమైయుండును. బ్రహ్మదేవా! భర్త లేనిదే సాధ్వియగుస్త్రీ ఒక్కక్షణమైనను జీవింపలేదు." భర్త లేనిపతివ్రతకు మరణమే జీవనము, జీవించుట మృత్యువుకంటె నధికకష్టప్రదము. బ్రహ్మదేవా! నన్ను వీడి నాభర్తకే మోక్షమును బ్రసాదించిన నేను మిమ్ములను శపింపగలను.

కళావతి పలికినవచనములను విని విధాత యాశ్చర్యచకితుడై మనము నందు భయము చెంది యమృతసమానమధురవాక్కులతో నిట్లుపల్కెను. "కుమారీ! నీవులేనిదే నీభర్తకు ముక్తిని బ్రసాదింపను. మీదంపతు లిర్వురు కొంతకాలము స్వర్గమందు భోగముల ననుభవింపుడు. తదనంతరము మీరిర్వురు భారతవర్షమం దవతరింపగలరు. ఆసమయమున సాక్షాత్తుగ రాధామాతయే మీపుత్రికగ నావిర్భవింపగలదు. తదనంతరము మీరిర్వురు జీవన్ముక్తులై రాధతో గలసి గోలోకము జేరగలరు." ఇట్లువారిని గరుణించి విధాత యంతర్హితుడయ్యెను. బ్రహ్మయొక్కయాదేశానుసారముగ నాదంపతు లిర్వురు కొంతకాలము స్వర్గమందు భోగము లనుభవించి బ్రహ్మాది దేవతలుకూడ జన్మించుట కభిలషించు పవిత్రభారతవర్షమం దవతరించిరి. సుచంద్రుడు గోకులమందు వృషభాను డనువైశ్య[శ్రేష్ఠునిరూపమున జన్మించెను. ఆయనతల్లిదండ్రులు సురభాను పద్మావతులు. వృషభానుడు సర్వజ్ఞుడు, మహాయోగి, శ్రీహరిభక్తుడు, శ్రీహర్యంశసంభూతుడు.

కళావతి యయోనిజయై పూర్వజన్మజ్ఞానముకల్గి కాన్యకుబ్జనరేశ్వరుడైన భనన్దనునకు శిశురూపమునదొరకెను. అత్యంతసుందరి యైనబాలిక యజ్ఞకుండమునుండి నరేశ్వరునకు లభించెను. భనన్దనుడు ఆకాశవాణి యాదేశానుసారముగ తేజోరాశియైన యాబాలికకు కాళావతి యనినామకరణ

మొనరించెను. అయ్యద్భుతశిశువు శరత్పూర్ణిమాచంద్రునివలె యౌవనవతియై మహర్షులమనస్సులనే మోహింపగలయత్యంతసౌందర్యవతి యయ్యెను. కార్యార్థియై కాన్యకుబ్జదేశమును ప్రవేశించినందు డత్యంతసౌందర్యవతి యైనకళావతిని దర్శించి తనబంధు వైనవృషభానునకు దగినకన్య యనినిర్ణయించుకొనెను. తదనంతరము నందుడు కాన్యకుబ్జనరేశ్వరుని గలసి వృషభానునికొఱకు గళావతి నర్థించెను. అందులకు భవన్దను డంగీకరింపగ నందుడు గర్గమహర్షిని పురోహితునిగ నొనరించి కళావతీవృషభానులవివాహము వైభవముగ జరిపించెను. అత్యంతరాగాసక్తులై యానూతనదంపతులు గోకులమందు నివసింపదొడంగిరి. వా రిర్వురు పూర్వజన్మజ్ఞానము కల్గినపరమపుణ్యాత్ములు. సుదామునిశాపము వలన శ్రీకృష్ణునియాజ్ఞచే శ్రీకృష్ణప్రాణాధిక యగురాధాదేవి యయోనిజయై వృషభానుకళావతులకు ప్రియపుత్రిక యయ్యెను. జగజ్జనని యైనరాధను దర్శించి ఆదంపతులు జీవన్ముక్తులై గోలోకపరంధామము జేరిరి. నారదా! నేను ప్రవచించిన యీయితిహాసము పాపరూపములైనయింధనములను జ్వలించుటకు ప్రజ్వలితాగ్నిశిఖవంటిది.

శ్రీకృష్ణపరమాత్మప్రసన్నతకొఱకు దేవశిల్పాచార్యు డైనవిశ్వకర్మ మహానగరనిర్మాణ మొనరించుచు బృందావనమధ్యమున నత్యంతసుందరములుమణినిర్మితములైనతొమ్మిదిమంటపములతో సమన్వితమైన, శృంగారయోగ్యమైన నానాఫలపుష్పవనభరితమైన దివ్యరాసమండలమును శ్రీకృష్ణపరమాత్మ రాసక్రీడ లొనరించుటకు నిర్మించెను.

తదనంతరము విశ్వకర్మ మధువనసమీపమున గల సరోవరపశ్చిమదిశయందు కేతకీవనమధ్యమున వటవృక్షమూలభాగమందు కేవలము రాధామాధవులదివ్యక్రీడలకొఱకు నత్యంతాద్భుత మైనయొకమహారత్నమండపమును నిర్మించెను. ఇట్లువిశ్వకర్మ తనశిష్యులసహాయముతో బాలకృష్ణున కనేకవందనముల నర్పించి స్వధామమునకు వెడలిపోయెను.

నా ర దు డు ప లి కె ను :

దేవా! భారతవర్షమం దున్నయీకాననమునకు బృందావన మనునామ మెట్లుసిద్ధించెను. బృందావననామవ్యుత్పత్తిని వర్ణింపుడు. మీరు సర్వజ్ఞులు కావున నాసందేహములను నివారింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

సూ త మ హ ర్షి ప లి కె ను :

శౌనకాదిమహర్షులారా ! నారదునిప్రశ్నల నాలకించి మందస్మిత ముఖారవిందుడై శ్రీనారాయణఋషి తనప్రవచనము నిట్లుకొనసాగింప దొడంగెను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షీ ! సత్యయుగమందు సంభవించినచరితమును వర్ణించెద నాకర్ణింపుము. సప్తద్వీపములకు సత్యధర్మతత్పరు డైనకేదారు డేకఛత్రాధిపతి. ఆయనపుత్రపౌత్రవంతుడు, ధార్మికుడు, శ్రీహరికి అనన్యభక్తుడు. నూరు యజ్ఞములను సంపన్న మొనరించిన యానరేశ్వరు డింద్రపదము నైనను గాంక్షింపలేదు. ఆయన జీవితకాలమందు సర్వకర్మలను శ్రీకృష్ణార్పణముగ నొనరించి కర్మరహితు డయ్యెను. కేదారచక్రవర్తి తనసమస్తరాజ్యమును భార్యాపుత్రుల కప్పగించి వనములకేగి ఘోరతప మాచరించి శ్రీకృష్ణునికృపకు బాత్రుడై గోలోకపరంధామము జేరెను. ఆనరేశ్వరుడు తప మొనరించిన పుణ్యప్రదేశము కేదారతీర్థ మనునామమున బ్రసిద్ధి గాంచెను.

ఆ రాజాధిరాజునకు శ్రీమహాలక్ష్మీదేవియంశచే ప్రాదుర్భవించినకన్య నామధేయమే బృంద. దూర్వాసమహర్షివలన హరిమంత్రమును గ్రహించి యోగశాస్త్రనిపుణ యైనయామె అన్యపురుషుని తనకుభర్తగ నంగీకరింపలేదు. బృంద శ్రీకృష్ణునే భర్తగ బొందవలె ననినిర్జనవనమున కేగి యఱువదివేల సంవత్సరములు శ్రీకృష్ణప్రీత్యర్థము ఘోరతప మొనరించెను. బృంద యొనరించినయారాధనకు సంతుష్టుడై శ్రీకృష్ణుడు సాక్షాత్కరించి మనోభీష్టమును గోరు మనియాదేశింపగ సాధ్వియగుబృంద నీవే నానాథుడవు గమ్మనిమనసార యర్థించెను. భక్తవత్సలు డై శ్రీకృష్ణుడు తథాస్తు యనియాసాధ్విప్రార్థనలను స్వీకరించెను. అఖండశ్రీకృష్ణారాధనమువలన బృంద గోలోకమున కేగి రాధాసమానముగ శ్రీకృష్ణప్రియ గోపిక యయ్యెను. ఆపరమభక్తురాలైన బృన్దాదేవి యేవనమందు ఘోరతప మాచరించెనో ఆవననామధేయము బృన్దావన మనబడెను.

వత్సా ! ఈకాననమనామధేయము బృన్దావన మగుటకు హేతు వైన

మఱియొకయితిహాసమును వినిపించెద నవధరింపుము. కుశధ్వజునకు ధర్మ శాస్త్రమందు మహాజ్ఞానసంపన్నలైనయిర్వురు కుమార్తెలు కల్గిరి. వారినామ ధేయములే తులసి, వేదవతి ఆయిర్వురుకాంతలు సంసారమందు విరక్తు రాండ్రయి వైరాగ్యము నాశ్రయించిరి. వారియందు వేదవతియఖండ తప మాచరించి పరమపురుషు డైనశ్రీమన్నారాయణునే హృదయేశ్వరు నిగ బొందెను. ఆసాధ్వి జనకకన్య యగుసీత యనునామమున సర్వత్ర విఖ్యాతయే. తులసికూడ శ్రీహరినే పతిరూపమున బొందుట కభిలషించెను. కాని దైవవశమున నామె శాపగ్రస్తురాలై శ్రీహర్యంశసంభూతు డైనశంఖ చూడునకు పత్నియయ్యెను. తదనంతర మామెనారాయణుని హృదయేశ్వరు నిగ బొందగల్గెను. శ్రీహరిశాపమువలన ఆదేవేశ్వరి తులసీవృక్షరూపమున భారతవర్ష మందావిర్భవించెను. తులసియొసంగినప్రతిశాపమువలన శ్రీహరి సాల గ్రామశిల యైనాడు. మునీశ్వరా ! తులసీదివ్యచరితము ప్రకృతిఖండమందు సవిస్తరముగ వర్ణించితిని. తపోధనా ! తులసి తప మొనరించినపవిత్రవనము బృన్దావన మందురు, తులసి, బృన్ద శబ్దములురెండును సమానార్థకములు. ఈపవిత్రకాననమునకు బృన్దావన మనునామము కల్గుటకు మఱియొకకారణము కలదు, వినుము. రాధాదేవిపదునాఱుదివ్యనామములందు బృన్ద యనునామ ముకూడ కలదు. బృన్దానామధారిణి యెనరాధ కీవనము రమణీయక్రీడా వనము అందువలన ఈప్రదేశములకు బృన్దావన మనునామము ప్రసిద్ధిగాంచెను. పూర్వకాలమందు స్వయముగ శ్రీకృష్ణపరమాత్మయే, శ్రీరాధాదేవిప్రీత్య ర్థము గోలోకమందు బృన్దావనమును నిర్మించెను. భూలోకమందు శ్రీరాధా దేవిక్రీడార్థము నిర్మింపబడినయీవనమున కాప్రాచీనబృన్దావననామమే ధ్రుపీ కరింపబడెను.

నా ర దు డు ప లి కె ను :

జగద్గురూ ! శ్రీరాధాదేవి పదునాఱుదివ్యనామములను వినవలె నని నామనస్సు అభిలషించుచున్నది. సామవేదమందు శ్రీరాధాసహస్రనామ ములను నేను శ్రవణ మొనరించితిని. ప్రభూ ! ఈపదునాఱునామము లాసహస్రనామములం దంతర్గతములా! లేకభిన్నములా ! దేవా ! ఈశిష్యునిపై గరుణించి యీపదునాఱు దివ్యనామములను, ఆనామములవ్యుత్పత్తులను నా కుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

## శ్రీ నారాయణ ఋషి పలికెను :

### శ్రీ రాధ షోడశ దివ్య నామ వర్ణనమ్

రాధా రాసేశ్వరీ రాసవాసినీ రసికేశ్వరీ ।
కృష్ణప్రాణాధికా కృష్ణప్రియా కృష్ణస్వరూపిణీ ॥
కృష్ణవామాఙ్గ సమ్భూతా పరమానన్దరూపిణీ ।
కృష్ణా బృన్దావనీ బృన్దా బృన్దావనవినోదినీ ॥
చన్ద్రావలీ చన్ద్రికాన్తా శరోచ్చన్ద్రప్రభాననా ।
నామాన్యేతాని సారాణి తేషామభ్యన్తరాణి చ ॥

రాధేత్యేవం చ సంసిద్ధౌ రాకారో దానవాచకః ।
స్వయం నిర్వాణదాత్రీ యా సా రాధా పరికీర్తితా ॥
రాసేశ్వరస్య పత్నీయం తేన రాసేశ్వరీ స్మృతా ।
రాసే చ వాసో యస్యాశ్చ తేన సా రాసవాసినీ ॥

సర్వాసాం రసికానాం చ దేవీనామీశ్వరీ పరా ।
ప్రవదన్తి పురా సన్తస్తేన తాం రసికేశ్వరీమ్ ॥
ప్రాణాధికా ప్రేయసీ సా కృష్ణస్య పరమాత్మనః ।
కృష్ణప్రాణాధికా సా చ కృష్ణేన పరికీర్తితా ॥

కృష్ణస్యాతిప్రియా కాన్తా కృష్ణో వాస్యాః ప్రియః సదా ।
సర్వైర్దేవగణైరుక్తా తేన కృష్ణప్రియా స్మృతా ॥
కృష్ణరూపం సన్నిధాతుం యా శక్తా చావలీలయా ।
సర్వాంశైః కృష్ణ సదృశీ తేన కృష్ణస్వరూపిణీ ॥

వామాఙ్గార్ధేన కృష్ణస్య యా సమ్భూతా పరా సతీ ।
కృష్ణవామాఙ్గ సమ్భూతా తేన కృష్ణేన కీర్తితా ॥
పరమానన్దరాశిశ్చ స్వయం మూర్తిమతీ సతీ ।
శ్రుతిభిః కీర్తితా తేన పరమానన్దరూపిణీ ॥

కృషిర్మోక్షార్థవచనో ణ ఏవోత్కృష్టవాచకః ।
ఆకారో దాతృవచనస్తేన కృష్ణా ప్రకీర్తితా ॥
అస్తి బృన్దావనం యస్యాస్తేన బృన్దావనిస్స్మృతా ।
బృన్దావనస్యాధిదేవీ తేన వాథ ప్రకీర్తితా ॥

సఙ్ఘః సఖీనాం బృన్దః స్యాదకారోఽప్యస్తివాచకః ।
సఖిబృన్దోఽస్తి యస్యాశ్చ సా బృన్దా పరికీర్తితా ॥

బృన్దావనే వినోదశ్చ సోఽస్యా హ్యస్తి చ తత్రవై ।
వేదా వదన్తి తాం తేన బృన్దావన వినోదినీమ్ ॥

నఖచన్ద్రావలీవక్త్రచన్ద్రోఽస్తి యత్ర సంతతమ్ ।
తేన చన్ద్రావలీ సా చ కృష్ణేన పరికీర్తితా ॥

కాన్తిరస్తి చన్ద్రతుల్యా సదా యస్యా దివానిశమ్ ।
మునినా కీర్తితా తేన శరచ్చన్ద్రప్రభాననా ॥

ఇదం షోడశనామోక్తమర్థవ్యాఖ్యానసంయుతమ్ ।
నారాయణేన యద్దత్తం బ్రహ్మణే నాభిపఙ్కజే ॥

బ్రహ్మణా చ పురా దత్తం ధర్మాయ జనకాయ మే ।
ధర్మేణ కృపయాదత్తం మహ్యమాదిత్యపర్వణి॥

పుష్కరే చ మహాతీర్థే పుణ్యాహే దేవసంసదీ ।
రాధాప్రభావప్రస్తావే సుప్రసన్నేన చేతసా ॥

ఇదం స్తోత్రం మహాపుణ్యం తుభ్యం దత్తం మయా మునే।
నిన్దకాయావైష్ణవాయ న దాతవ్యం మహామునే ॥

యావజ్జీవమిదం స్తోత్రం త్రిసన్ధ్యం యః పఠేన్నరః ।
రాధామాధవయోః పాదపద్మే భక్తిర్భవేదిహ ॥

అన్తే లభేత్తయోర్దాస్యం శశ్వత్సహచరో భవేత్ ।
అణిమాదికసిద్ధిం చ సంప్రాప్య నిత్యవిగ్రహమ్ ॥

వ్రతదానోపవాసైశ్చ సర్వైర్నియమపూర్వకైః ।
చతుర్ణాం చైవ వేదానాం పాఠః సర్వార్థసంయుతైః ॥
సర్వేషాం యజ్ఞతీర్థానాం కరణైర్విధిబోధితైః ।
ప్రదక్షిణేన భూమేశ్చ కృత్స్నాయా ఏవ సప్తధా ॥
శరణాగతరక్షాయామజ్ఞానాం జ్ఞానదానతః ।
దేవానాం వైష్ణవానాం చ దర్శనేనాపి యత్ ఫలమ్ ॥
తదేవ స్తోత్రపాఠస్య కలాం నార్హన్తి షోడశీమ్ ।
స్తోత్రస్యాస్య ప్రభావేణ జీవన్ముక్తో భవేన్నరః ॥ 220-246

రాధా, రాసేశ్వరి, రాసవాసినీ, రసికేశ్వరీ, కృష్ణప్రాణాధిక, కృష్ణప్రియ కృష్ణస్వరూపిణి, కృష్ణవామాంగసంభూత, పరమానందరూపిణి, కృష్ణా, బృన్దావనీ, బృన్దా, వృన్దావనవినోదిని, చంద్రావతి, చంద్రకాంత. శరచ్చన్ద్రప్రభానన, అను షోడశదివ్యనామములు శ్రీరాధా సహస్రనామాంతర్గతములే. రాధా

శబ్దమందు 'ధా' యనగ సంసిద్ధి (నిర్వాణము). 'రా' దాతృవాచకము. స్వయముగ మోక్షమును బ్రసాదించుదేవిని రాధ యనిరి. రాసేశ్వరున కీమె పత్ని. అందువలన రాధానామధేయము రాసేశ్వరి యయ్యెను. రాసేశ్వరి రాసమండలమందు నివసించుకారణమున నామెను రాసవాసిని యనికీర్తించిరి. ఆమె సమస్తరసికదేవతలకు బరమేశ్వరి. అందువలన పురాతను లైనమహాత్ము లామెను రసికేశ్వరి యనిప్రార్థించిరి. శ్రీకృష్ణున కామె ప్రాణములకంటె నధికప్రియురాలు. అందువలననే స్వయముగ శ్రీకృష్ణుడే యామెకు కృష్ణప్రాణాధిక యనినామకరణ మొనరించెను. రాధ శ్రీకృష్ణున కత్యంతప్రియురాలు, శ్రీకృష్ణుడు రాధ కత్యంతప్రియుడు, అందువలననే సమస్త దేవతలు రాధాదేవిని కృష్ణప్రియ యనిసంబోధించిరి. రాధ శ్రీకృష్ణస్వరూపమును లీలాపూర్వకముగ ధరింపగల సమరురాలు. సర్వాంశలయందు శ్రీకృష్ణసమురాలు. అందువలన నామెను కృష్ణస్వరూపిణి యనిభక్తులు కీర్తించిరి. పరమసతి యగుశ్రీరాధ శ్రీకృష్ణునివామాంగ భాగమునుండి ప్రాదుర్భవించెను. అందువలన స్వయముగ శ్రీకృష్ణుడే ఆమెను కృష్ణవామాంగసంభూత యనిసంబోధించెను. శ్రీరాధ స్వయముగ పరమానందము మూర్తీభవించినదాశి. అందువలన శ్రుతిగణము లామెను బరమానందస్వరూపిణి యనిప్రవచించెను. 'కృష్' శబ్దము మోక్షవాచకము. 'ణ' శబ్ద ముత్కృష్టబోధకము 'ఆ' కారము దాతృవాచకము. ఆమె ఉత్కృష్టమోక్షప్రదాయిని. అందువలన భక్తు లామెను కృష్ణా యనికీర్తించిరి. బృన్దావన మామెక్రీడాస్థలమే. అందువలన నామెను బృన్దావని యనిరి. బృనావనమున కామెయధిదేవత కావున ఆమెనామము బృన్దావని యయ్యెను, సఖిసముదాయమును బృన్ద మందురు. 'ఆ' కారము సత్తావాచకము. శ్రీరాధ కసంఖ్యాకసఖులు కలరు. అందువలన ఆమెనామము బృన్ద యయ్యెను. రాధాదేవికి ఎల్లపుడు బృన్దావనమందే వినోదము లభించును. అందువలన వేదము లామెను బృన్దావనవినోదిని యనిప్రశంసించినవి. ఆమె సదా చంద్రునివంటిముఖము కల్గి నఖచంద్రులపంక్తిచే యుక్తమైయుండును. ఆకారణమున నామెను శ్రీకృష్ణుడు చంద్రావలి యనిసంబోధించెను. రాధ యంగకాంతి యహర్నిశములు చంద్రునివెన్నెలవలె బ్రకాశించును. కావున శ్రీహరి హర్షోల్లాసకారణమున ఆమెను చంద్రకాంత యనిసంబోధించెను.

రాధముఖముపై యహర్నిశములు శరత్కాలచంద్రునిప్రభ వ్యాపించియుండును.
అందువలన మహర్షిమండలి యామెను శరచ్చన్ద్రప్రభానన యనికీర్తించిరి.

శ్రీమన్నారాయణుడు తననాభికమలమందు విరాజమానుడై యున్న
బ్రహ్మ కుపదేశించినషోడశనామములను వ్యాఖ్యానసహితముగ వర్ణించితిని.
బ్రహ్మ యాదివ్యనామములను నాపితృదేవు డైనధర్మదేవత కుపదేశించెను.
ధర్మదేవుడు మహాతీర్థ మైనపుష్కరక్షేత్రమందు సూర్యగ్రహణపుణ్యదినమున
దేవసభామధ్యమున నాకు కృపాపూర్వకముగ రాధాదేవిషోడశదివ్యనామము
అను వ్యాఖ్యాసహితముగ నుపదేశించెను. మునీశ్వరా! రాధాదేవిపరమ
పుణ్యమయస్తోత్రమును నేను నీకు ప్రసాదించితిని. వైష్ణవనిందకులకు, వైష్ణ
వులు కానివారికి యీదివ్యనామముల నుపదేశింపరాదు. జీవితపర్యంతము
త్రిసంధ్యలయం దీశ్రీరాధాస్తోత్రమును బఠించువానికి రాధామాధవులచరణ
కమలములందు సుదృఢభక్తి లభించును. అంత్యకాలమందు శ్రీరాధాకృష్ణుల
దాస్యభావమును అణిమాదిసిద్ధులను బొంది, దివ్యశరీరధారియై గోలోకము
చేరగలడు. నియమపూర్వకముగ నొనరింపబడినసమస్తవ్రత దానో
పవాస వేదపఠన యజ్ఞ తీర్థసేవన భూప్రదక్షిణ, శరణాగతరక్షణ, జ్ఞాన
దాన, దేవవైష్ణవదర్శనాదులవలన ప్రాప్తించుసంపూర్ణ ఫలము లన్నియు
నీస్తోత్రపఠనఫలమందు బదునాఱవకళకైనను సరిరావు. ఈస్తోత్రప్రభావము
వలన మనుష్యుడు జీవన్ముక్తుడు కాగలడు.

నా ర దు డు ప లి కె ను :

ప్రభూ! పరమదుర్లభము ఆశ్చర్యమయము నగునీదివ్యస్తోత్రము మీకృప
వలన నాకు ప్రాప్తించెను. సంసారవిజయమనుదుర్లభమగురాధాదేవికవచము
నా కుపలబ్ధమయ్యెను. సుయజ్ఞుడు స్తుతించిన రాధాదేవిస్తోత్రముకూడ
నాకు సులభమయ్యెను. శ్రీకృష్ణునివిచిత్రదివ్యలీలాప్రసంగముల నాలకించి,
మీచరణకమలముల ప్రసాదముచే నేనఖండభక్తిసంపన్నుడ నైతిని. మునీశ్వరా
బృన్దావనములో ప్రాతఃకాలమున నిద్ర మేల్కాంచిన గోకులవాసులు తమ
సమక్షమున దివ్యనగరమును దర్శించి యేమనిరి?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షీ! రాత్రియందే మహానగరనిర్మాణ మొనరించి దేవశిల్పి

చార్యుడై నవిశ్వకర్మ యంతర్హితుడయ్యెను. అరుణోదయకాలమున నిద్ర మేల్కాంచినసకలగోపగోపికలు తమయెదుట విలక్షణ మైనదివ్యనగరమును దర్శించి ఆశ్చర్యచకితులైయిదియెట్లుసంభవమనియు, పరమాశ్చర్యకరమనియు, వారిలోవారు చర్చించుకొనుచుండిరి, కాని గర్గమహర్షి వలన శ్రీకృష్ణునినిజ స్వరూపమును తెలిసికొనిన నందరాజుమాత్రము తనలో తా నిట్లుభావించెను. "ఈసమస్తచరాచరజగ మంతయు శ్రీహరిసంకల్పముచే నుత్పన్నమైనది. ఎవనిభ్రూభంగలీలామాత్రముననే బ్రహ్మనుండితృణపర్యంతముగల సర్వజగత్తు ఆవిర్భవించి మరల తిరోగమించునో ఆయన కసాధ్యమేది ? ఆహా, ఎవని రోమకూపములందు సర్వబ్రహ్మాండములు నున్నవో, ఆపరమేశ్వరుడైన శ్రీమహావిష్ణువున కసాధ్య మగుకార్య మేమియుండును. బ్రహ్మానంతశివ ధర్మాదు లెవనిచరణారవిందములదివ్యసందర్శనమును సదా అభిలషింతురో ఆమాయామానవరూపధారి యగుపరమేశ్వరున కసాధ్యమగుకార్య మేదిగలదు! ఆయన యెన్నికార్యములందైనను సమర్థుడే యగును."

శ్రీకృష్ణునియాదేశానుసారముగ గోకులవాసులంద అత్యంతసంతుష్ట హృదయాంతరంగులై యొకశుభముహూర్తమున యాదివ్యనగరమును ప్రవే శించి తమకొఱకు నిర్ణయింపబడినగృహములందు బ్రవేశించిరి. బృందావనాంత ర్గతమైనయాదివ్యనగరమందు నివసించు సకలగోకులవాసులముఖములు, నేత్ర ములునత్యంతప్రసన్నముతో వికసించినవి. శ్రీకృష్ణబలరాములు గోపశిశువులతో గూడి కౌతూహలవశమున దివ్యబాలక్రీడల నొనరించిరి. నారదా ! ఇట్లు బృందావనాంతర్గత మగుదివ్యనగరప్రసంగమును వర్ణించితిని. హరికథాశ్రవ ణము సకలపాపవినాశకము, జన్మమృత్యుజరావ్యాధిహరణము, సర్వకర్మ నిర్మూలనము, గోలోకప్రాప్తికి యేకైకసోపానము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి<br>శ్రీకృష్ణ జన్మ ఖండములో నారదనారాయణ<br>సంవాదమున బృందావననగరవర్ణన మను<br>పదునేడవ అధ్యాయము<br>సంపూర్ణము

—0—

# పదునెనిమిదవ అధ్యాయము

## విప్రపత్నులకు మోక్షప్రదానము

శౌనకమహర్షి ఉవాచ :

అహో, సూతమహర్షీ ! ఎంతటిపరమాద్భుతరహస్యములను మనోహరముగ వర్ణించినారు. శ్రీకృష్ణదివ్యచరితమును శ్రవణ మొనరించిన యనన్యసుఖములు, మోక్షము సులభములు కాగలవు.

సూతమహర్షి పలికెను :

నగరనిర్మాణోపాఖ్యానమును సానందముగ శ్రవణ మొనరించిననారదమహర్షి నారాయణఋషీంద్రుడు ప్రవచించి మనోహరమైన శ్రీకృష్ణచరితమును శ్రవణ మొనరింపవలసినదిగ ప్రార్థించెను.

నారదుడు పలికెను :

శ్రీకృష్ణదివ్యలీలాచరితముపీయూషమువంటిది. మునిసత్తమా ! జ్ఞానసింధూ ! నేను నిన్నాశ్రయించినశిష్యుడను కావున భగవంతునిదివ్యలీలలను సవిస్తరముగ వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

నారదునివచనముల నాలకించి శ్రీమన్నారాయణమహర్షి యత్యంత ప్రసన్నుడై పరమేశ్వరునిపరమాద్భుతచరితమును బ్రవచింప నారంభించెను.

శ్రీనారాయణఋషి పలికెను :

ఒకదినమున శ్రీకృష్ణుడు బలరామునితో గోపబాలకులను వెంటనిడుకొని గోపాలనార్థము యమునానదీతీరమునం దున్న మధువనమున కేగెను. గోపకుమారు లావనప్రదేశమం దనేకవిధముల చిత్రవిచిత్రముగ గ్రీడించి, డస్సి యాకలిదప్పులతో బాధపడుచుండిరి. వా రందఱు తమక్షుధాబాధనుగూర్చి శ్రీకృష్ణునకు విన్నవించిరి. శ్రీకృష్ణుడు వారితో నిట్లుపల్కెను. "గోపబాలకులారా ! ఈవనమున కనతిదూరములో నంగిరస గోత్రులైనసద్బ్రాహ్మణులు పవిత్రియజ్ఞదీక్షాపరులై నివసించుచున్నారు. వేదాంగవిదులు, వైష్ణవులు నగు నీబ్రాహ్మణోత్తములు మోక్షము నాశించి యాజ్ఞికులైరి. కాని వారియారాధ్యదైవ మైననేనే స్వయముగ మాయామానుషరూపధారినై

పృథ్విపై నవతరించితిని. మాయామోహితు లైనవారు గ్రహింపరైరి. తత్ క్షణమే మీరంద ఱాయజ్ఞవాటికాప్రదేశమున కరిగి బ్రాహ్మణులను భోజనముల నర్థింపుడు. యాజ్ఞికకార్యములందు నిమగ్నులై వారు మీకు బదులుపలుపలుకరేని, మీరు పరమసాధ్వీశిరోమణు లైనవారిస్త్రీల నాహారము నర్థింపుడు. నిశ్చయముగ వారు మీకోర్కె దీర్పగలరు.

శ్రీకృష్ణునియాదేశానుసారముగ గోపబాలకులు బ్రాహ్మణులు వసించు ప్రదేశమున కేగి ఆహారమును బ్రసాదించి, క్షుద్బాధతీర్పవలసినదిగ వారిని అర్థించిరి. కాని యేకాగ్రితతో యజ్ఞకార్యమందు సంలగ్నులైయున్న యాద్విజశ్రేష్ఠులు గోపకుమారులకు బదులుపలుకలేదు. తదనంతరము గోపకుమారు లాశ్రమములోపల వివిధవ్యంజనములతో సుమధురపదార్థములను పాక మొనరించుచున్న పతివ్రతాశిరోమణు లైనబ్రాహ్మణపత్నులను సమీపించి మాతలారా! ఆకలిగొన్నమాకు అన్నమును బెట్టి మాయాకలిబాధను నివారింపు డనిప్రార్థించిరి. మనోహరరూపధారు లైనయాగోపబాలకులు పలికినమధురవచనముల నాలకించి సాదరముగ పుత్రప్రేమతో నాసాధ్వీశిరోమణులు గోపకుమారుల నిట్లుప్రశ్నించిరి. "బాలకులారా! మీ రెవ్వరు! మీ నామధేయము లెవ్వి! ఏవరు పంపగ మీ రిటు అఱుదెంచినారు! మేము మీ కవశ్యముగ నానావ్యంజనసహితముగ మృష్టాన్నభోజనముల నొసంగెదము." బ్రాహ్మణస్త్రీలు పలికినమధురవచనముల నాలకించి గోపకుమారు లత్యంతప్రసన్నులై యిట్లు సమాధాన మొసంగిరి. "తల్లులారా! బలరామ శ్రీకృష్ణులు పంపగ మే మిటువచ్చితిమి. అనతిదూరములోనే మధువనమధ్యమున భాండీరవటచ్ఛాయలో బలరామకేశవు లాసీనులైయున్నారు. మే మందరము క్షుద్బాధాపీడితులము, కావున మీరు ఆహారముల నొసంగిన మేము వెంటనే మధువనము జేరి బలరామకృష్ణుల కర్పించి భుజింపగలము."

గోపకుమారులద్వారా బలరామశ్రీకృష్ణుల ఆగమనవార్త నాలకించిన విప్రపత్నులమనస్సు లత్యంతానందముతో వికసించినవి. వారిశరీరములు పులకించెను, నేత్రము లానందాశ్రుభరితము లయ్యెను. ఎంతకాలము నుండియో మాయామానుషరూపధారి యైనశ్రీకృష్ణునిదివ్యచరణారవిందములను దర్శింపవలె ననివిప్రపత్నుల ప్రగాఢకాంక్ష. ఆబ్రాహ్మణపత్నులు

ధన్యలు, పతివ్రతాపరాయణలు, అందువలనే వారు మాయకు వశులుగాక సచ్చిదానందవిగ్రహుడైనపరమాత్మను తెలిసికొనగల్గిరి. తత్క్షణమే వారందఱు నానావిధము లగుస్వాదిష్టభక్ష్య, చోష్య, లేహ్య పదార్థములను వెంటనిడుకొని శీఘ్రముగ గోపబాలకులతో గలసి మధువనమునకు జని శ్రీకృష్ణ బలరాములను దర్శించి ధన్యురాండ్రైరి. తారలనడుమ చంద్రునివలె బాల శ్రీకృష్ణుడు వటవృక్షచ్ఛాయలో గోపబాలకులనడుమ యాసీనుడై యుండెను.

శ్యామం కిశోరవయసా పీతకౌశేయవాససమ్ ।
సున్దరం సస్మితం శాన్తం రాధాకాన్తం మనోహరమ్ ॥
శరత్పార్వణచన్ద్రాస్యం రత్నాలఙ్కారభూషితమ్।
రత్నకుణ్డలయుగ్మాభ్యాం గణ్డస్థలవిరాజితమ్ ॥
రత్నకేయూరవలయరత్ననూపురభూషితమ్ ।
ఆజానులమ్బితాం శుభ్రాం బిభ్రతం రత్నమాలికామ్ ॥
మాలతీమాలయా కణ్ఠే వక్షఃస్థలవిరాజితమ్ ।
చన్దనాగరుకస్తూరీకుఙ్కుమార్చితవిగ్రహమ్ ॥
సునఖం సుకపోలం చ పక్వబిమ్బాధరం వరమ్ ।
పక్వదాడిమబీజాభం బిభ్రతం దన్తముత్తమమ్ ॥
శిఖిపిచ్ఛసమాయుక్తం బద్ధచూడం పరాత్పరమ్ ।
కదమ్బపుష్పయుగ్మాభ్యాం కర్ణమూలే విరాజితమ్ ॥
ధ్యానాసాధ్యం యోగినాం చ భక్తానుగ్రహకాతరమ్ ।
బ్రహ్మేశధర్మశేషేన్ద్రైః స్తూయమానం మునీశ్వరైః ॥
దృష్ట్వైవమీశ్వరం భక్త్యా ప్రణేముర్ద్విజయోషితః ।
స్వానాం జ్ఞానామరూపం చ తుష్టువుర్మధుసూదనమ్ ॥ 28-35

శ్యామలవర్ణుడు, కిశోరవయస్కుడు, పీతాంబరధారియు, సుందరుడు, మందహాసయుక్తుడు, శాంతమైనవాడు, రాధాకాంతుడు, మనోహరుడు, శరత్పూర్ణిమాచంద్రునివంటిమోముగలవాడు, రత్నాలంకారములచేభూషితుడు, రత్నకుండలములచే శోభిల్లుగండస్థలములు గలవాడు, రత్నకేయూరవలయములచేత రత్ననూపురములచేత నలంకృతుడు, జానువులవరకు వ్రేలాడు నిర్మలమైనరత్నమాలికను ధరించినవాడు, మాలతీమాలచే విరాజిల్లుకంఠము వక్షఃస్థలము కలవాడు, చందనాగరుకస్తూరీకుంకుమలచేత చర్చితమైనవిగ్రహము

గలవాడు, సుందరము లైనవనఖములు, కపోలములు, శ్రేష్ఠము పక్వమునగు బింబఫలమువంటియధరము కలవాడు, పండినదానిమ్మగింజలవలె శోభిల్లుఉత్తమము లైనదంతములుకలవాడు, శిఖిపిచ్ఛముతో గూడినవాడు, కట్టివేయుబడిన జుట్టుముడిగలవాడు, కదంబపుష్పములచే విరాజిల్లుకర్ణమూలములు గలవాడు, యోగులధ్యానమున కసాధ్యుడు, భక్తానుగ్రహకాతరుడు, బ్రహ్మ మహేశ్వరుడు ధర్మదేవతమున్నగువారిచేత, మునీశ్వరులచేత స్తుతింపబడువాడు, పరమేశ్వరుడు, తనజ్ఞానమున కనురూపమైనవాడు నగుమధుసూదనుని దర్శించి, నమస్కరించి విప్రపత్న్యు లిట్లుస్తుతించిరి.

విప్రపత్న్య ఊచుః

త్వం బ్రహ్మ పరన్ధామ నిరీహో నిరహంకృతిః ।
నిర్గుణశ్చ నిరాకారః సాకారః సగుణః స్వయమ్ ॥
సాక్షీరూపశ్చ నిర్లిప్తః పరమాత్మా నిరాకృతిః ।
ప్రకృతిః పురుషస్త్వం చ కారణం చ తయోః పరమ్॥

సృష్టిస్థిత్యన్త విషయే యే చ దేవాస్త్రయః స్మృతః ।
తే త్వదంశాః సర్వబీజా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ॥
యస్య లోమ్నాం చ వివరే చాఖిలం విశ్వమీశ్వర ।
మహావిరాట్ మహావిష్ణుస్త్వం తస్య జనకో విభో॥

తేజస్త్వం చాపి తేజస్వీ జ్ఞానం జ్ఞానీ చ తత్పరః ।
వేదేఽనిర్వచనీయస్త్వం కస్త్వాం స్తోతుమిహేశ్వరః ॥
మహదాదిసృష్టిసూత్రం పంచ తన్మాత్రమేవ చ ।
బీజం త్వం సర్వశక్తీనాం సర్వశక్తిస్వరూపకః ॥

సర్వశక్తీశ్వరః సర్వః సర్వశక్త్యాశ్రయః సదా ।
త్వమనీహః స్వయం జ్యోతిః సర్వానన్దః సనాతనః ॥
అహోఽప్యాకారహీనస్త్వం సర్వవిగ్రహవానపి ।
సర్వేన్ద్రియాణాం విషయం జానాసి నేన్ద్రియీ భవాన్ ॥

సరస్వతీ జడీభూతా యత్ స్తోత్రే యన్నిరూపణే ।
జడీభూతో మహేశశ్చ శేషో ధర్మో విధిః స్వయమ్ ॥
పార్వతీ కమలా రాధా సావిత్రీ వేదసూరపి ।
వేదశ్చ జడతాం యాతి కే వా శక్తా విపశ్చితః ॥

వయం కిం స్తవనం కుర్మః స్త్రియః ప్రాణేశ్వరేశ్వర ।
ప్రసన్నో భవ నో దేవ దీనబన్ధో కృపాం కురు ॥

ఇతి పేతుశ్చ తా విప్రపత్న్యస్తచ్చరణామ్బుజే ।
అభయం ప్రదదౌ తాభ్యః ప్రసన్నవదనేక్షణః ॥

విప్రపత్నీకృతం స్తోత్రం పూజాకాలే చ యః పఠేత్ ।
స గతిం విప్రపత్నీనాం లభతే నాత్ర సంశయః ॥ 36-48

## విప్రపత్నుల స్తోత్రము

దేవా! నీవు స్వయముగ పరబ్రహ్మవు, పరంధాముడవు, నిరీహుడవు, అహంకారరహితుడవు, నిర్గుణుడవు, నిరాకారుడవు, సగుణుడవు, సాకారుడవు. నీవే ప్రకృతివి, పురుషుడవు, ప్రకృతిపురుషుల కాదికారణుడవు. సృష్టిస్థితి సంహారకార్యములందు నియుక్తులైన బ్రహ్మవిష్ణుశివాదులుకూడ సర్వబీజమయ ములైన నీయంశలే. పరమేశ్వరా! ఎవని రోమకూపములందు సర్వవిశ్వములు నివసించుచున్నవో, ఆ మహావిరాట్టైన మహావిష్ణువునకు నీవే జనకుడవు. నీవే తేజస్సువు, తేజస్వివి, జ్ఞానము, జ్ఞానివి, వీటన్నింటికంటె నీ వతీతుడవు. వేదములే నిన్ను అనిర్వచనీయుడ వని ప్రవచించెను. అట్టి నిన్ను స్తుతించుట కెవరు సమర్థులు? సృష్టికే సూత్రములైన మహతత్త్వాది పంచభూతములు నీనుండే యావిర్భవించినవి. నీవు సర్వశక్తులకు బీజము, సర్వశక్తి స్వరూపము. నీవు సమస్తశక్తుల కీశ్వరుడవు, సర్వరూపుడవు. సర్వశక్తుల కాశ్రయుడవు, దేవా! నీవు నిరీహుడవు, స్వయంప్రకాశకుడవు, సర్వానందమయుడవు, సనాతనుడవు. ఆహా! ఆకారరహితుడవైనను నీవు సంపూర్ణాకారములతో యుక్తుడవై యున్నావు. సమస్తాకారములు నీవే. నీవు సర్వేంద్రియవిషయ జ్ఞాతుడవైనను ఇంద్రియవంతుడవు కావు. ఎవనిని స్తుతించుటలో తత్త్వనిరూపణ మొనరించుటలో సరస్వతి యైనను జడము కాగలదో, మహేశ్వరుడు, ఆదిశేషుడు, ధర్మము, స్వయముగ విధాతకూడ నసమర్థులో; పార్వతి, లక్ష్మి, రాధ, వేదజనని యగు సావిత్రి మున్నగు శక్తులుకూడ జడరూపము ధరించునో, అట్టి నిన్ను సామాన్యు లెట్లు స్తుతింపగలరు? ప్రాణేశ్వరేశ్వరా! స్త్రీలమైన మేము నిన్నేమని స్తుతింపగలము? దేవా! మాకు ప్రసన్నుడవు కమ్ము. దీనబాంధవా! మమ్ములను కరుణింపుము. ఇట్లు అనేకవిధముల స్తుతించి బ్రాహ్మణపత్నులు శ్రీకృష్ణచరణారవిందముల నాశ్రయించిరి. పరమాత్మ

ప్రసన్నుడై యాద్విజపత్నుల కభయమిచ్చెను. పూజాకాలమందు విప్రపత్నీ కృత మగునీస్తోత్రమును జపించువారికి నిశ్చయముగ ద్విజపత్నులకు లభించిన పరమగతి లభించును.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా ! సాధ్వు లైనయాబ్రాహ్మణపత్నులు తనచరణారవిందముల నాశ్రయించుట గాంచి యత్యంతప్రసన్నుడై మధుసూదను డభీష్టవరముల నర్థింపు డనివారిని యాదేశించెను. పరమాత్మానుగ్రహమునకు ద్విజపత్నులు పరమసంతుష్టాంతరంగలై వినీతభావముతో తలలు వంచి హస్తములను ముకుళించి పరమయోగుల కైననుదుర్లభము లైనవరముల నిట్లర్థించిరి: "శ్రీకృష్ణా ! మా కెట్టివరములు నభీష్టములు కావు. నీచరణారవిందములం దనన్యభక్తిని, దాస్యసౌభాగ్యములను మేము కాంక్షించువరములు. కేశవా ! సదా నిన్నే మేము దర్శించునటుల మమ్ము ననుగ్రహింపుము. నీసచ్చిదానందవిగ్రహమును దర్శించిన మేము మరల స్వగృహములకు వెడలి నశ్వరవిషయములను వీక్షింపము. మాధవా ! నీభక్తురాండ్ర మైనమాకు స్వధామమును ప్రసాదించి మ మ్మనుగ్రహింపుము."

బ్రాహ్మణపత్ను లర్థించినవరములను సానందముగ శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదించి, బాలకులతో గూడి యాసాధ్వీమణు లర్పించినవివిధస్వాదిష్టపదార్థములను తనివిదీర భుజించెను. ఆసమయమున గగనమార్గమునుండి శ్రీకృష్ణపార్షదయుక్త మైనయొకదివ్యవిమానము మధువనమున కరుదెంచి ప్రాకృతిక దేహమును త్యజించి దివ్యదేహధారిణు లైనద్విజపత్నులను తోడ్కొని శ్రీకృష్ణునియనుజ్ఞ పొంది గోలోకమునకు బయలుదేరెను. తదనంతరము శ్రీకృష్ణుడు వైష్ణవమాయద్వారా ద్విజపత్నులఛాయలను బ్రాహ్మణస్త్రీలుగ రూపొందించి వారిగృహములకు బంపెను. భార్యలకొఱకై వెదకుచున్న ద్విజులు మార్గమధ్యమున యఖండతేజసంపన్న లైనతమభార్యలను గాంచి విస్మయము నవగత మొనరించుకొని వారి నిట్లుప్రశంసించిరి.

అహోఽతిధన్యా యూయం చ దృష్టో యుష్మాభిరీశ్వరః ।
అస్మాకం జీవనం వ్యర్థం వేదపాఠోఽప్యనర్థకః ॥

వేదే పురాణే సర్వత్ర విద్వద్భిః పరికీర్తితమ్ ।
హరేర్విభూతయః సర్వాః సర్వేషాం జనకో హరిః ॥

తపో జపో వ్రతం దానం వేదాధ్యయనమర్చనమ్ ।
తీర్థస్నానమనశనం సర్వేషాం ఫలదో హరిః ॥

శ్రీకృష్ణః సేవితో యేన కిం తస్య తపసాం ఫలైః ।
ప్రాప్తః కల్పతరుర్యేన కిం తస్యాన్యేవ శాఖినా ॥

శ్రీకృష్ణో హృదయే యస్య కిం తస్య కర్మభిః కృతైః ।
కిం పీతసాగరస్యైవ పౌరుషం కూపలఙ్ఘనే ॥ 66-70

అహా ! మీరు పరమధన్యులు. ఎందువలెననగ మీరు సాక్షాత్తుగ పరమేశ్వరునే దర్శించితిరిగదా! మాజీవనము వ్యర్థము, మావేదపఠనముకూడ నిరర్థకము. వేదములందు, పురాణములందు సర్వత్ర శ్రీహరిసమస్తవిభూతులవర్ణన మొనరింపబడెను. సర్వులకు జనకుడు శ్రీహరియే. జప తప వ్రత జ్ఞాన వేదాధ్యయన పూజన తీర్థస్నానోపవాసములు మొదలగు దివ్యకర్మలకు ఫలప్రదాత శ్రీకృష్ణుడే. శ్రీకృష్ణునిసేవాసౌభాగ్యమును పొందు వారికి యీతపోదానాదికర్మఫలములవలన నేమిప్రయోజనము ? కల్పవృక్షమే లభించు వారికి సామాన్యవృక్షమువలన నేమిప్రయోజనము ? ఎవరిహృదయమందు సాక్షాత్తుగ శ్రీకృష్ణపరమాత్మయే విరాజమానుడై యుండునో, వారు యజ్ఞాదికర్మల ననుష్ఠాన మొనరింపవలసిన ఆవశ్యకత లేదు. సముద్రమునే త్రావినవారికి కేవలమొకకూపమును దాటుట పురుషార్థమెట్లు కాగలదు ?

ఇట్లు బ్రాహ్మణశ్రేష్ఠులు తమపత్నులను తోడ్కొని స్వగృహముల కరగి శ్రీకృష్ణదివ్యచరణసేవలయందు నిమగ్నులైరి. మధువనమందు క్రీడించి సనాతనపూర్ణబ్రహ్మము, శ్రీమన్నారాయణస్వరూపుడైన శ్రీకృష్ణుడు బలరామసహితముగ గోపకుమారులతోగూడి యమాయకబాలకునివలె స్వగృహము జేరెను. నారదా ! ఈయుపాఖ్యానము నాపితృదేవుడైనధర్మదేవుని ముఖారవిందమునుండి నేను శ్రవణ మొనరించి నీసమ్ముఖమున వర్ణించితిని.

నారదుడు పలికెను :

ఋషీంద్రా ! మహామునీశ్వరులకు, యోగసిద్ధులైనపురుషులకు నత్యంత

దుర్లభ మైనపరమగతి యేయఖండపుణ్యప్రభావమువలన ఆద్విజపత్నులకు సులభముగ లభించెను ? పూర్వజన్మమం దాపుణ్యవతు లెవ్వరు ? ఏదోషము వలన వా రీభూమిపై జన్మించిరి ?

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దేవర్షీ ! ఈద్విజపత్నులు పూర్వజన్మములందు పరమపతివ్రతలైన సప్తఋషుల భార్యలు. ఒకదినమున యజ్ఞకుండమందున్న అనలు డీసాధ్వీ మణులను స్పృశించెను. సప్తర్షులయందు ప్రముఖు డైనఆంగీరసమహర్షి యీదృశ్యమును గాంచి కోపించి సర్వభక్షకుడవుగమ్మనియగ్నిని, మానవయోని యందు జన్మింపు డనిఋషిపత్నులను శపించెను. ఆంగీరసునిశాపము విని ఋషిపత్నులు 'మేము పతివ్రతల మనియు, మాతప్పిదమిసుమంతయు లేదనియు, మా కభయమును ప్రసాదింపుమనియు ఆంగీరసమహర్షిని ప్రార్థించిరి. భయ భీత లైనఋషిపత్నులను గాంచి మహర్షి కరుణించి యిట్లువారి ననుగ్రహించెను. "పతివ్రతలారా ! అప్రతిహత మైననాశాపమువలన మీరు మానవయోని యందు జన్మింపకతప్పదు. అయినను నాశాపము మీకు వరప్రసాదమగును. మానవజన్మమందు మీరు పరబ్రహ్మ మైనశ్రీకృష్ణుని దర్శించి ఆయనకృపకు పాత్రులై గోలోకపరంధామము జేరగలరు."

మహర్షి శాపవశమున సప్తర్షులపత్నులు మానవకాంతలై జన్మించి, పర మాత్మను దర్శించి ఆయనకు వివిధనైవేద్యముల నర్పించి, చరితార్థులై గోలోక పరంధామము జేరిరి.

> నిన్దనీయాచ్చ సమ్పత్తి ర్విపత్తి ర్మహతో వరా ।
> అహో సద్యః సతాం కోపశ్చాపకారాయ కల్పతే ॥
>
> వినా విపత్తే ర్మహిమా కుతః కస్య భవేద్భువి ।
> భూతాః కాన్త పరిత్యాగాన్ముక్తా బ్రాహ్మణయోషితః॥125,126

నీచపురుషులనుండి లభించినసంపదకూడ నిందనీయమే; కాని మహాత్ము లైనపురుషులవలన లభించినవిపత్తులుకూడ శుభప్రదములే. అహా! సాధు పురుషులకోపము తత్కాలములోనే మహోపకారముగ మారిపోవునుగదా ! విపత్తులు సంభవింపని దే భూమిపై నెంతటివారికైనను వారిమహిమ యెట్లు బహిర్గతము కాగలదు. భర్తలు పరిత్యజించినకారణమున ఆఋషిపత్నులు

మానవాంగనలై జన్మించి శ్రీహరిని దర్శించి శాశ్వతముగ భవబంధ ముక్తులైరి.

ఆపుణ్యవతులైనద్విజపత్నులమోక్షకథ యత్యంతాద్భుతము, పరమ మనోహరము. విప్రవరా! శ్రీకృష్ణదివ్యలీలాప్రసంగములడుగడుగున నిత్యనూతనములుగ గోచరించును. భగవంతునికళ్యాణమయదివ్యకథ నెంతగ శ్రవణ మొనరించినను ఎవరైన నెట్లుతృప్తిపొందగలరు? శ్రీకృష్ణపరమాత్మ యీదివ్యలీలలన్నింటిని నేను నాపితృదేవుడైనధర్మదేవునిముఖారవిందమునుండి శ్రవణ మొనరించితిని.

నారదుడు పలికెను:

కృపానిధానా! జగద్గురూ! పూర్వకాలమందు మీరు ధర్మదేవుని ముఖారవిందమునుండి శ్రవణ మొనరించిన, కృష్ణునిదివ్యలీలల నన్నిటిని నా కుప దేశింపవలసినదిగ మిమ్ము ప్రార్థించుచున్నాను.

సూతమహర్షి పలికెను:

శౌనకాదిమహర్షులారా! దేవర్షిప్రార్థనల నాలకించి శ్రీమన్నారాయణఋషీంద్రుడు ప్రసన్నాంతరంగుడై శ్రీకృష్ణదివ్యలీలాకథాప్రవచనమును గొనసాగించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున విప్రపత్నులకు శ్రీకృష్ణుడు
మోక్షము సంగుటయను
పదునెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

# పందొమ్మిదవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు కాళియుని మర్దించుట, వ్రజవాసులను దావానలమునుండి రక్షించుట

శ్రీనారాయణ ఋషి పలికెను:

బ్రహ్మసంభవా ! ఒకదినమున బలరామసహితుడై శ్రీకృష్ణుడు గోపకుమారులతో గలసి యమునానదీతీరమునకు విహారార్థమై బయలుదేరెను. ఆసమయమున యమునానదియందు గరుత్మంతునిభయమువలన భీతుడైన కాళీయుడనునురగేశ్వరుడు పత్నీపరివారసహితముగ నివసించుచుండెను. స్వేచ్ఛామయశరీరధారి యగునందనందనుడు యమునాతటమునందుగల ఫలవనమందు మధురఫలముల నాస్వాదించుచు గోవులను పాలించుచు బాల్యక్రీడల యందు సంలగ్నుడయ్యెను.

శ్రీకృష్ణపాలితములైనగోవులు పచ్చికను భుజించుచు యమునాతీరమును జేరి కాళీయసర్ప విషమిశ్రితమైనయాయమునాజలములను త్రావి మరణించినవి. ఆవులు మందలుమందలుగ మరణించుట గాంచి భయవిహ్వలులై గోవులను రక్షించుచున్నగోపబాలకులు జరిగినదుస్సంఘటనను దైన్యముతో శ్రీకృష్ణునకు విన్నవించిరి. సర్వము తెలిసిన శ్రీకృష్ణుడు కేవలము తనసంకల్పమాత్రమున విషజలపానముచే మరణించినగోవుల నన్నింటికి పునర్జీవనమును ప్రసాదించెను. మరణించినగోవులు చైతన్యవంతములై శ్రీకృష్ణునిముఖారవిందమును దర్శింపదొడంగినవి. శ్రీకృష్ణుడు యమునాతటమందుగల ఒకకదంబవృక్షముపై నెక్కి కాళీయాదులను శిక్షించుటకు యమునానదీమధ్యమున దూకెను. మనుష్యాకృతినిధరించిన శ్రీకృష్ణుని తనయెదుట గాంచి కాళియుడత్యంతక్రోధయుక్తుడై ముకుందుని మ్రింగివైచెను. మండుచున్నలోహమునుతొందరపాటుతో మ్రింగిన మనుష్యునివలె పరమాత్మబ్రహ్మతేజమువలన కాళియునికంఠము, ఉదరము సర్వము మాడిపోసాగెను. సర్వశక్తి నశింపగ ప్రాణావశిష్టుడై కాళియుడు శ్రీకృష్ణుని మరల కక్కివైచెను. తత్క్షణమే బాలగోవిందుడు రక్తరంజితముఖయుక్తుడైన కాళియుని శిరముల నధిరోహించి నృత్యముచేయసాగెను. విశ్వంభరునిభారముచే నాక్రాంతుడై కాళియుడు రక్తము కక్కుచు మరణింపనుద్యుక్తుడయ్యెను.

కాళీయునకు సంభవించినమీాదుస్థితిని గాంచి సర్పములన్నియు భయకంపితములై పలాయనముచిత్తగించెను. తమభర్త ప్రాణములను వీడుచున్నాడని తెలిసికొని నాగపత్ను లత్యంతదుఃఖితలై శ్రీహరికి అనేకప్రణామము లర్పించుచు నిట్లుప్రార్థించిరి

సురసో వాచ

హే జగత్కాన్త కాన్తం మే దేహి మానం చ మానద ।
పతిః ప్రాణాధికః స్త్రీణాం నాస్తి బన్ధుశ్చ తత్పరః ॥

అయి సురవరనాథ ప్రాణనాథం మదీయం
నకురు వధ మనస్తప్రేమసిన్ధో ః సుబన్ధో ।
అఖిలభువనబన్ధో ః రాధికాప్రేమసిన్ధో ః
పతిమిహ కురు దానం మే విధాతుర్విధాతః ॥

త్రినయనవిధిశేషాః షణ్ముఖశ్చాస్యసఙ్ఖైః
స్తవనవిషయజాడ్యాః స్తోతుమీశా న వాణీ ।
నఖలు నిఖిలవేదాః స్తోతుమన్యేఽపి దేవాః
స్తవనవిషయశక్తాః సన్తి సన్తస్తవైవ ॥

కుమతిరహమవిజ్ఞా యోషితాం క్వాధ మా
వా క్వ భువనగతిరీశశ్చక్షుషోఽగోచరోఽపి ।
విధిహరిహరశేషైః స్తూయమానశ్చయస్త్వ
మతనుపనుజమీశం స్తోతుమిచ్ఛామి తం త్వామ్ ॥

స్తవనవిషయభీతా పార్వతీ యస్య పద్మా
శ్రుతిగణజనయిత్రీ స్తోతుమీశా న యం త్వామ్ ।
కలికలుషనిమగ్నా వేదవేదాఙ్గశాస్త్ర
శ్రవణవిషయమూఢా స్తోతుమిచ్ఛామి కిం త్వామ్ ॥

శయనోరత్నపర్యంకే రత్నభూషణభూషితః ।
రత్నభూషణభూషాఙ్గో రాధావక్షసి సంస్థితః ॥
చన్దనోక్షితసర్వాఙ్గం స్మేరాననసరోరుహః ।
ప్రోద్యత్ప్రేమరసామ్భోధౌ నిమగ్నః సతతం సుఖాత్ ॥
మల్లికామాలతీమాలాజాలైః శోభితశేఖరః ।
పారిజాతప్రసూనానాం గన్ధామోదితమానసః ॥
పుంస్కోకిలకలధ్వానైః భ్రమరధ్వనిసంయుతైః ।
కుసుమేషు వికారేణ పులకాఙ్కితవిగ్రహః ॥

ప్రియా ప్రదత్తం తామ్బూలం భుక్తవాన్ యః సదా ముదా ।
వేదా అశక్తా యం స్తోతుం జడీభూతా విచక్షణాః ॥
తమనిర్వచనీయం చ కిం స్తౌమి నాగవల్లభా ।
వన్దేఽహం త్వత్పదామ్భోజం బ్రహ్మేశశేషసేవితమ్ ॥
లక్ష్మీసరస్వతీదుర్గజాహ్నవీవేదమాతృభిః ।
సేవితం సిద్ధసఙ్ఘైశ్చ మునీన్ద్రైర్మనుభిః సదా ॥
నిష్కారణా యాఖిలకారణాయ సర్వేశ్వరాయాపి పరాత్పరాయ ।
స్వయం ప్రకాశాయ పరావరాయ పరావరాణామధిపాయతే నమః ॥
హేకృష్ణ హేకృష్ణ సురాసురేశ బ్రహ్మేశ శేషేశప్రజాపతీశ
మునీశ మన్వీశ చరాచరేశ సిద్ధీశ సిద్ధేశ గుణేశ పాహి ॥
ధర్మేశ ధర్మీశ శుభాశుభేశ వేదేశ వేదేష్వనిరూపితశ్చ ।
సర్వేశ సర్వాత్మకః సర్వబన్ధో జీవీశ జీవేశ్వర పాహి మత్ప్రభుమ్ ।
ఇత్యేవం స్తవనం కృత్వా భక్తినమ్రాత్మకన్ధరా ।
విధృత్వ చరణామ్భోజం తస్థౌ నాగేశవల్లభా ॥
నాగపత్నీకృతం స్తోత్రం త్రిసన్ధ్యం యః పఠేన్నరః ।
సర్వపాపాత్ప్రముక్తస్తు యాత్యన్తే శ్రీహరేః పదమ్ ॥
ఇహలోకే హరేర్భక్తి మన్తే దాస్యం లభేద్ధ్రువమ్ ।
లభతే పార్షదో భూత్వా సాలోక్యాదిచతుష్టయమ్ ॥ 17-34

## నాగపత్నుల స్తోత్రము

జగత్కాన్తా! మాకు మాకాంతుని ప్రసాదింపుము. ఇతరులకు మానము నిచ్చుదేవా! మాకుగూడ మానము ననుగ్రహింపుము. స్త్రీలకు బతి ప్రాణముల కంటె నధికప్రియుడు. వారికి భర్తకంటె నధికులైనబంధువులు మఱి యెవ్వరును లేరు. నాథా! అనంతప్రేమసాగరా! సురవరనాథా! సద్బాంధవా! భువనబాంధవా! శ్రీరాధాప్రేమసాగరా! మాప్రాణనాథుని వధింపకుము. నీవు విధాతకే విధాతవు, కృపతో మాకు పతిదాన మొనరింపుము. త్రినేత్రధారి యగుమహాదేవుడు బ్రహ్మ, ఆదిశేషుడు, షణ్ముఖుడు మొదలగు వీరందఱు నిన్ను స్తుతించుట కసమర్థులే. సాక్షాత్తుగ సరస్వతి కూడ నిన్ను స్తుతింపలేదు. సర్వవేదములు సకలదేవతలు, మహాత్ములుకూడ నీస్తుతివిషయమందు శక్తిహీనులే; అజ్ఞానులము, కుబుద్ధులము, స్త్రీలము,

సర్పిణులము నగుమేమెక్కడ ? సర్వభువనములకు పరమాశ్రయుడవు, అగో చరుడవు. పరమేశ్వరుడవు. బ్రహ్మవిష్ణుశేషాదులచే స్తుతింపబడుమాయామానవ వేషధారివి యగునిన్ను స్తుతించుటకు యత్నించుచున్నాము. ఎంతటియాశ్చర్య కరవిషయము ? పార్వతి, లక్ష్మి, వేదజనని యగుసావిత్రి స్తుతింపజాలని నిన్ను శాస్త్రజ్ఞానవిహీనులమైన, కలికలుషనిమగ్నుల మైనమేము స్తుతింప యత్నించుచున్నాము.

దేవా ! నీవు రత్నమయపర్యంకమందు రత్ననిర్మితము లగునాభూషణ ములచే విభూషితుడవై శయనించెదవు, రత్నాలంకారములచే నలంకృతము లైనయంగములు కలశ్రీరాధాదేవివక్షఃస్థలమందు విరాజిల్లెదవు. మందస్మిత ముఖారవిందుడవైననీసర్వాంగములు చందనచర్చితములు. నీవు సదా పొంగి పొరలుచున్న ప్రేమరసమహాసాగరమందు నిమగ్నుడవై యుందువు. నీమస్త కము మల్లికామాలతీమాలలచే సుశోభితము. నీమానసము నిరంతరము దివ్య పారిజాతపుష్పసుగంధముచే నామోదిత మైయుండును. కోకిలకలరవముల చేత, భ్రమరములమధురఝుంకారములచేత ఉద్దీప్తమై ప్రేమవలన నీసర్వాంగ ములు పులకావళులచే నలంకృతము లైయుండును. నీవు ప్రియురాలొసంగిన తాంబూలమును చర్వణ మొనరించెదవు. వేదము లెవనిని స్తుతించుట కసమర్థములో, విద్వాంసు లెవనిని స్తుతింపలేరో, అనిర్వచనీయు డైనయాపర మేశ్వరుని నాగిని నైననే నెట్లువర్ణింపగలను ? ఎవనిపాదారవిందములకు బ్రహ్మ శివశేషాదులు నమస్కరించుచుందురో, ఎవనిచరణకమలములను లక్ష్మి, సరస్వతి, గంగ, సావిత్రి, సిద్ధులు, మునీంద్రులు, మనువులు, సేవించు చుందురో నేను నీయాచరణారవిందములకు వందనముల నర్పించెదను. నీవు స్వయముగ కారణరహితుడ వైనను సర్వకారణకారణుడవు. సర్వేశ్వరుడవు, పరాత్పరుడవు, స్వయంప్రకాశుడవు, కార్యకారణస్వరూపుడవు, కార్యకారణములకే యధిపతివి. యోగేశ్వరేశ్వరా ! నీకు నమస్కారము. కృష్ణా ! సచ్చిదానందఘనా ! సురేశ్వరా ! నీవు బ్రహ్మశివాదిశేషప్రజా పతి ముని మన్వాదులకు చరాచరప్రాణులకు, అణిమాదిసిద్ధులకు, సకలగుణములకు స్వామివి. ధర్మాధర్మములకు, శుభాశుభములకు స్వామి వైనపరమేశ్వరా మాపతిని రక్షింపుము. నీవు సర్వవేదములకు స్వామి వైనను ఆవేదములు నిన్ను బాగుగ నిరూపణ మొనరించలేదు. సర్వేశ్వరా ! నీవు

సర్వస్వరూపుడవు, సకలప్రాణులకు బంధువుడవు, జీవధారులకు జీవులకు నీవే స్వామివి. నీ కసాధ్య మనునది లేదు. కృపను దేవాదిదేవా! మాభర్తను రక్షింపుము.

ఇట్లుస్తుతించి సురసతో పాటు నాగపత్నులు శ్రీకృష్ణునిచరణారవిందముల నాశ్రయించిరి. త్రికాలసంధ్యలయందు నాగపత్నులచే స్తుతింపబడిన యీస్తోత్రమును బఠించువారు సర్వపాపములనుండి విముక్తులై యంత్యకాలమందు శ్రీహరిపరంధామము జేరగలరు. వా రిహలోకమందు శ్రీహరిభక్తులై యత్యంతకాలమందు శ్రీహరిదాస్యసౌభాగ్యమును బొంది శ్రీకృష్ణపార్షదులై సాలోక్యాదిమోక్షములను సులభముగ బొందగలరు.

నా ర దు డు ప లి కె ను :

నాగపత్నులప్రార్థనల నాలకించి హర్షప్రఫుల్లనేత్రయుక్తుడైనగోవిందు డేమిపల్కెను? మహాభాగా! ఈయత్యంతాద్భుతరహస్యమును నాకు బహిర్గత మొనరింపుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

మునీశ్వరా! అనేకస్తోత్రములతో స్తుతించి వ్యాకులచిత్తలై హస్తములను ముకుళించి తనచరణకమలములనే యాశ్రయించిననాగపత్నులను వీక్షించి శ్రీకృష్ణు డిట్లుపల్కెను."

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

నాగపత్నులారా! భయమును వీడుడు. నావరప్రభావమువలన పునర్జీవితు డగుమీభర్తతో యమునను వీడి స్వస్థలమునకు బొండు. నాచరణకమలముల చిహ్నములు మీభర్తశిరముపై నంకితము లైనకారణమున కాళియునకు గరుడభయము తొలగిపోగలదు. గరుత్మంతుడు మీభర్తశిరముపై నాపదచిహ్నములను గాంచిన భక్తితో నమస్కరించి తొలగిపోవును.

భగవంతునియానతి నాలకించి నాగపత్నులందు శ్రేష్ఠురాలైనసురస తనకు సాంసారికజీవనమం దెంతమాత్రము నభిలాష లేదనియు, ఆయన దివ్య సుందర విగ్రహమును దర్శించిన పిదప ప్రాకృతికప్రపంచముతో తనకు పని లేదనియు, కేవలము తనకు ఆయన చరణారవిందములందు సుదృఢభక్తిని దాస్య

సౌభాగ్యమును ప్రసాదింపుమనియు, పరమాత్మ నర్థించెను. ఆమె గోవిందునితో తనయభీష్టమునిట్లు వెల్లడించెను:

న యాస్యామి రమణకం తత్ర నాస్తి ప్రయోజనమ్ ।
సర్వః కరోతు సంసారం కురు మాం నిజకిఙ్కరమ్ ॥
న వాంఛా మమ హే కృష్ణ సాలోక్యాది చతుష్టయే ।
త్వత్పాదాబ్జసేవాయాః కలాం నార్హతి షోడశీమ్ ॥
వినా త్వత్పాదసేవాం చ యో వాంఛతి వరాన్తరమ్ ।
భారతే దుర్లభం జన్మ లబ్ధ్వాఽసౌ వంచితఃస్వయమ్॥ 50-52

"గోవిన్దా ! నేను రమణకద్వీపమునకు బోజాలను. అక్కడ నా కేమి ప్రయోజనము ! ఈసర్వ మాత్రదేశమునకు జని సంసారము సాగింపదు, కావున నన్ను నీచరణదాసురాలిగ నొనరింపుము. శ్రీకృష్ణా ! నామనమందు సాలోక్యాదులైననాల్గుమోక్షములమీద వాంఛ లేదు. ఎందువలె ననగ ఈమోక్షాదు లన్నియు నీచరణారవిందముల సేవాఫలమందు పదునాఱవయంశ కైనను సరిరావు. పవిత్రభారతవర్షమందు దుర్లభమైనజన్మను బొంది నీచరణసేవలను దక్క అన్యవరముల నాకాంక్షించువారు నిశ్చయముగ మోస పోవుదురు.

నాగపత్నిప్రార్థనలను మన్నించి శ్రీకృష్ణపరమాత్మ యామె కభీష్టవరము లను బ్రసాదించెను. ఆక్షణమునందే శ్రీకృష్ణపార్షదులతో గగనమార్గము నుండి దివ్యవిమాన మరుదెంచి పరమాత్మయనుజ్ఞ గైకొని నాగపత్నియగు సురసను గోలోకపరంధామమునకు తోడ్కొనిపోయెను. తదనంతరము శ్రీహరి తనయాత్మమాయతో ఛాయారూపిణియైనమఱియొకసురసను సృష్టించెను. తదనంతరము శ్రీకృష్ణుడు కాళియునిశిరము పైనుండి డిగ్గి వానిమస్తకముపై కృపాపూర్వకముగ తనదక్షిణహస్తము నుంచెను. భగవంతునియనుగ్రహము కలుగగనే కాళియుడు పునర్జీవితుడై తనయెదుట సచ్చిదానందవిగ్రహమును గాంచి యనేకప్రణామము లర్పించెను. కాళియసర్పరాజును గాంచి శ్రీకృష్ణు డిట్లుకరుణించెను. "కాళియుడా ! నీవు భయమును వీడి నిర్భయుడవు కమ్ము. అభీష్టవరములను గోరుకొనుము. నే ననుగ్రహింతును. నీవు నాభక్తుడవు మదంశతో జన్మించినవాడవు. నీయభిమానమును నశింపజేయుటకే

నిన్ను శిక్షించితిని. మరల గర్వరహితుడ వైన నిన్ననుగ్రహించెదను. నీవంశమందు జన్మించిన సర్పములను సంహరించువారు మహాపాపములకు గురియై దుఃఖముల పాలు కాగలరు. కాని మీవంశజులశిరములపై నున్న మదీయ చరణాచిహ్నములను గాంచి హింసింపక భక్తితో నమస్కరించువారు సమస్త పాపములనుండి ముక్తులు కాగలరు. సర్పరాజా! గరుత్మంతునివలన భయమును వీడి నీవీక్షణమే నీనివాస మైనరమణకద్వీపము జేరుము.

నీశిరముపై నకింతము లైననాచరణచిహ్నములను దర్శించి గరుత్మంతు డైనను భక్తిభావముతో నమస్కరించి తొలగిపోగలడు. నీవంశజుల కెన్న డును గరుత్మంతునివలన భయము సంభవింపదు. సర్పరాజా! భయమును వీడి నీమనోవాంఛితముల నర్థింపుము."

శ్రీకృష్ణునియనుగ్రహాభరితము లగునభయవచనముల నాలకించి కాళి యుడు పులకితగాత్రుడై ఆనందబాష్పములు నయనములనుండి రాలుచుండగ ముకుళితహస్తుడై భక్తిభావముతో పరమాత్మ నిట్లుప్రార్థించెను.

కాళియ ఉవాచ:

వరేఽన్యస్మిన్ మమ విభో వాంఛా నాస్తి వరప్రద॥
భక్తిం స్మృతిం త్వత్పాదాబ్జే దేహి జన్మని జన్మని।
జన్మ బ్రహ్మకులే వాపి తిర్యగ్యోనిషు వా సమమ్॥
తత్ప వేత్సఫలం యత్ర స్మృతిస్త్వచ్చరణామ్బుజే।
తన్నిష్ఫలః స్వర్గవాసో నాస్తి చేత్ త్వత్పదస్మృతిః॥
త్వత్పాద ధ్యానయుక్తస్య యత్తత్ స్థానం చ తత్పరమ్।
క్షణం వా కోటికల్పం వా పురుషాయుః క్షయోఽస్తు వా॥
యది త్వత్ సేవయా యాతి సఫలో నిష్ఫలోఽథవా।
తేషాం చాయుర్వ్యయో నాస్తి యే త్వత్పాదాబ్జసేవకాః॥

న సన్తి జన్మమరణరోగశోకార్తి భీతయః।
ఇన్ద్రత్వే వామరత్వే వా బ్రహ్మత్వే చాతి దుర్లభే॥
వాంఛా నాస్త్యేవ భక్తానాం త్వత్పాదసేవనం వినా।
సుజీర్ణపటఖణ్డస్య సమం నూతనమేవ చ॥
పశ్యన్తి భక్తాః కించాన్యత్ సాలోక్యాదిచతుష్టయమ్।
సమ్ప్రాప్తస్త్వన్మనుర్బ్రహ్మన్ననన్తాద్ యావదేవ హి॥

శావత్త త్వద్భావనేనైవ త్వద్వర్ణోఽహమనుగ్రహమ్।
మాం చ భక్తమపక్వం వా విజ్ఞాయ గరుడః స్వయమ్ ॥
దేశాద్ దూరం చ న్యక్కారం చకార దృఢభక్తిమాన్।
భవతా చ దృఢాభక్తిర్దత్తా మే వరదేశ్వర ॥

న చ భక్తశ్చ భక్తోఽహం న మాం త్యక్తుం క్షమోఽధునా।
త్వత్పాదపద్మచిహ్నాక్తం దృష్ట్వా శ్రీమస్తకం మమ ॥

సదోషం గుణయుక్తం మాం సోఽధునా త్యక్తుమర్హతి।
మమారాధ్యశ్చ నాగేన్ద్రో న త్వద్వధ్యోఽహమీశ్వర॥

భయం న కేభ్యః సర్వత్ర తమనన్తం గురుం వినా।
యం దేవేన్ద్రాశ్చ దేవాశ్చ మునయో మనవో నరాః॥
స్వప్నే ధ్యానేన పశ్యన్తి చక్షుషోర్గోచరః న మే।
భక్తానురోధాత్ సాకారః కుతస్తే విగ్రహో విభో॥

సగుణస్త్వం చ సాకారో నిరాకారశ్చ నిర్గుణః।
స్వేచ్ఛామయః సర్వధామ సర్వబీజం సనాతనమ్॥
సర్వేషామీశ్వరః సాక్షీ సర్వాత్మా సర్వరూపధృక్।
బ్రహ్మేశశేషధర్మేన్ద్రా వేదవేదాఙ్గపారగాః ॥
స్తోతుం యమీశం తే జాడ్యాః సర్పస్తోష్యతి తం విభుమ్।
హేనాథ। కరుణాసిన్ధో। దీనబన్ధో। క్షమాధమమ్॥
ఖలస్వభావాదజ్ఞానాత్ కృష్ణ త్వం చర్వితో మయా।
నాస్త్రలక్ష్యో యథాకాశో న దృశ్యాన్తో న లఙ్ఘ్యకః ॥

న స్పృశ్యో హి న చావర్యస్తథా తేజస్వమేవ చ।
ఇత్యేవముక్త్వా నాగేన్ద్రః పపాత చరణామ్బుజే॥

ఓమిత్యుక్త్వా హరిస్తుష్టః సర్వం తస్మై వరం దదౌ।
నాగరాజకృతం స్తోత్రం ప్రాతరుత్థాయ యః పఠేత్॥

త్వద్వంశ్యానాం చ తస్యైవ నాగేభ్యో న భయం భవేత్
స నాగశయ్యాం కృత్వైవ స్వప్తుం శక్తః సదా భువి ॥
విషపీయూషయోర్భేదో నాస్త్యేవ తస్య భక్షణే।
నాగగ్రస్తే నాగఘాతే ప్రాణాన్తే విషభోజనాత్ ॥

స్తోత్రశ్రవణమాత్రేణ సుస్థో భవతి మానవః।
బిభర్తి యో భక్తియుక్తో నాగేభ్యోఽపి న తద్భయమ్।

భూర్జే కృత్వా స్తోత్రమిదం నాగ స్తత్ర న తిష్ఠతి॥
విషాగ్నివజ్రభీతిశ్చ న భవే త్తత్ర నిశ్చితమ్।
ఇహలోకే హరేర్భ క్తిం స్మృతిం చ సతతం లభేత్।
అన్తే చ స్వకులం పూత్వా దాస్యం చ లభతే ధ్రువమ్॥ 78-97

## కాళియ స్తోత్రము

వరదాయకా! ప్రభూ ఇతరము లైనయేవరములందును నాకు సిచ్ఛ లేదు. ప్రతిజన్మమందు నాకు నీచరణకమలములందు భక్తి యుండునట్లు నేను సదా మీపాదములనే చింతించునట్లు నాకు వరములను ప్రసాదింపుము. బ్రాహ్మణకులమందు లేదా అన్యకులములందు లేదా పశుపక్షియోనులయందు జన్మించినను అన్ని జన్మలు సమానమే. నీచరణారవిందములస్మృతి కలిగి యుండు జన్మయే సఫల మైనట్లు భావింపవలెను. నీచరణములను స్మరింపక దేవతయై దేవలోకమందు వసించినను ఆజన్మ నిష్ఫలమే. నీచరణకమల చింతనమందు తత్పరు లైనవారికి లభించినస్థానమే సర్వోన్నతము. అట్టి భక్తపురుషుని యాయుర్దాయ మొకక్షణ మైనను లేదా కోటానుకోట్లకల్పము లైనను నీయారాధనమందు గడచిపోయిన సఫలమైనట్లే, లేనిచో నాజీవనము వలన నేఫలమును కలుగదు. నీచరణారవిందములను, సేవించువానియాయుర్దాయము వ్యర్థముకాదు, నిశ్చయముగ సార్థక మగును. వానికి జననమరణ రోగశోకభయములు సంభవింపవు. సంకటములు సంభవించినను నీభక్తుడు దానిని సరకుగొనడు. భక్తులమనస్సునందు నీచరణకమలసేవావాంఛదక్క- ఇంద్రపదమందుగాని, అమరత్వమందుగాని, పరమదుర్లభ మగుబ్రహ్మపదమందు గాని వాంఛ కలుగదు. నీయనన్యభక్తులు సాలోక్యాదు లైననిర్వాణ మోక్షములను నాలుగింటిని శిథిల మైనవస్త్రమును త్యజించినట్లు త్యజింతురు. దేవా ! అనంతునిముఖారవిందమునుండి నేను నీమహామంత్రమును గ్రహించి జపించుచు నీయనుగ్రహమువలన నీవలెనే కృష్ణవర్ణుడ నైతిని. నాభక్తి పరిపక్వ మందలే కపోవుట గాంచి నీభక్తాగ్రగణ్యు డైనగరుత్మంతుడు నన్ను నాదేశమునుండి నీపాదారవిందములకడకు దరిమినాడు. దేవా ! పరమేశ్వరా! కరుణామయుడవై నీవునాకు నీయందవిచలభక్తిని ప్రసాదించితివి. గరుత్మంతుడు నీభక్తుడే, నేనుకూడ నీభక్తుడనైతిని, కావున గరుత్మంతుడు నన్ను ద్వేషింపడు. నీపవిత్రచరణారవిందముల చిహ్నములచే నలంకృత మైననామ స్తకమును

దర్శించి గరుత్మంతుడు నాయందు దోషము లున్నను నన్ను గుణవంతునిగనే భావించి కరుణించును. గరుత్మంతుడు నీపదచిహ్నములతో గూడిన నాగేంద్రములుతన కారాధ్యులని యెంచి మాకు కష్టములను గల్గింపడు. పరమేశ్వరా! నేను నీకరుణవలన గరుత్మంతునకు గూడ నవధ్యుడనైతిని. నాగురుదేవు డైన యనంతునకుదక్క నే నన్యులవలన భయ మొందను. దేవేంద్రునికైనను, దేవతలకైనను, మానవులకైనను ధ్యానమందుగూడ దర్శన మొసంగని పరమాత్మ ఈసమయమున నాకు సాక్షాత్కరించినాడు. ప్రభూ! నీవు భక్తుల కోరికలను మన్నించి మాయామానుషరూపుడవై యవతరించితివి. లేనిచో నీకీ శరీరమెట్లు సంభవింపగలదు? నీవే దివ్యగుణుడవు, దివ్యరూపుడవు, సాకారుడవు, నిర్గుణుడవు, నిరాకారుడవు. దేవా! స్వేచ్ఛామయా! సనాతనా! నీవు సర్వుల కావాసస్థానము, సర్వేశ్వరుడవు. సాక్షివి, ఆత్మవు, సర్వరూపధారివి నై యున్నావు.

బ్రహ్మ శివ శేష ధర్మేంద్రాది దేవతలు, వేదములు, వేదాంగపారంగతు లైనవిద్వాంసులుకూడ నేపరమేశ్వరుని తించుట కసమర్థులయ్యెదరో ఆసర్వవ్యాపిప్రభు వైననిన్ను ఒకసర్ప మేమని స్తుతింపగలదు? నాథా! కరుణాసింధూ! దీనబాంధవా! అధముడ నైననన్ను క్షమింపుము. శ్రీకృష్ణా! నేను ఖలస్వభావయుక్తుడనై అజ్ఞానకారణమున నిన్నే మ్రింగవలెనని ప్రయత్నించితిని. కాని నీవాకాశమువలె సర్వత్ర వ్యాపకుడవు, అక్షరుడవు అవినాశివి, అందువలన నేయస్త్రమైనను నిన్ను లక్షింపలేదు. నిన్ను తెలిసికొనుట, నిన్ను బొందుట యత్యంతదుర్లభము. నీవు స్వయంప్రకాశస్వరూపుడవు. ఎవరైనను నిన్ను స్పృశింపలేరు, నిన్నాదరింపలేరు.

ఇట్లు నాగరాజైన కాళియుడు భగవంతుని స్తుతించి జగన్నాథునిచరణారవిందముల నాశ్రయించెను. శ్రీకృష్ణుడు సంతుష్టుడై కాళియునకు సర్వాభీష్టములను బ్రసాదించెను. నాగరాజుచే జేయబడిన యీస్తోత్రమును ప్రాతఃకాలమందు బఠించువారికి వారివంశజులకు నెప్పుడును సర్పభయము సంభవింపదు. వారు నాగులనే శయ్యగ నొనరించుకొని శయనించుటకు సమర్థులుకాగలరు. వారికివిషమైనను నమృతముగ మారగలదు. సర్పముకాటు వేసినవారు, విష భోజనమును భుజించి ప్రాణావశిష్టులైయున్నవారు ఈస్తోత్రశ్రవణమాత్రముననే సంకటరహితులై స్వస్థులు కాగలరు. ఈస్తోత్రమును బత్రముపై లిఖించి భక్తిభావ

ముతో కంఠమందుగాని, దక్షిణభుజమందుగాని ధరించినవారి కెప్పుడును సర్పభయము కలుగదు. ఏగృహమందీస్తోత్రము పఠింపబడునో అచ్చోట సర్పములు నివసింపవు. నిశ్చయముగ నాగృహము విషాగ్ని వజ్రభయరహితము కాగలదు. ఈస్తోత్రపాఠకున కిహలోకమందు శ్రీహరిభక్తి, స్మృతి సులభములు కాగలవు. అత డత్యంతకాలమందు తనకులమును బవిత్ర మొనరించి నిశ్చయముగ శ్రీకృష్ణదాస్యసౌభాగ్యమును బొందగలడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదమహర్షి ! శ్రీకృష్ణపరమాత్మ నాగరాజైనకాళియున కభీష్ట వరములను బ్రసాదించి యమునానదిని వీడి జలమార్గముద్వారా పరివార సహితముగ రమణకద్వీపమునకు బొమ్మని యాతని నాదేశించెను. శ్రీహర్యాజ్ఞానుసారముగ కాళియాదిసర్పము లన్నియు నాక్షణమే రమణకద్వీపమునకు వెడలిపోయెను.

సూ త మ హ ర్షి ప లి కె ను :

శౌనకాదిమహర్షులారా ! నారాయణఋషి ప్రవచించిన శ్రీకృష్ణదివ్య లీలాప్రవచనమునాలకించి నారదు డత్యంతానందముతో సంతుష్టహృదయాంత రంగు డయ్యెను. ఆయన సర్వసందేహములను నివారింపగల శ్రీమన్నారాయణఋషి యెదుట తనమనస్సులోని సందేహము నిట్లుబహిర్గత మొనర్చెను.

నా ర దు డు ప లి కె ను :

జగద్గురూ! స్వస్థలమును వీడి నాగరాజైనకాళియుడు పత్నీపరివారసహిత ముగ యమునానది నేలప్రవేశించెను ? ఇందుగల రహస్యమును నాకు విశదీకరింపుడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

బ్రహ్మర్షి ! ఒకప్రాచీనేతిహాసమును వర్ణించెద నవధరింపుము. సూర్య గ్రహణసమయమున మలయాచలప్రాంతమున సుప్రభానదీపశ్చిమతటమందు శ్రీకృష్ణకథాప్రసంగమందు నాతండ్రి యగుధర్మదేవునిముఖారవిందమునుండి

యీయితిహాసమును నేను శ్రవణ మొనరించితిని. పులహమహర్షి సభా మధ్యమున తనసందేహమును నివారించవలసినదిగ ధర్మదేవతను ప్రశ్నించెను. అపుడు కృపానిధాను డైనధర్మదేవు డామహర్షి సభామధ్యమున ఆశ్చర్యమయ మగు సుపాఖ్యానమును బ్రవచించెను.

ఆదిశేషునియాజ్ఞానుసారముగ నాగులందఱు ప్రతిసంవత్సరము కార్తిక పూర్ణిమాదినమున గరుత్మంతుని ప్రసన్నతకై పుష్పధూపదీపనైవేద్యాదిషోడ శోపచారముల నర్పించి పూజింతురు. పూర్ణిమనా డహంకారయుక్తు డై కాళియుడు గరుడారాధన మొనరింపక పూజాసామగ్రిని తోటిసర్పములు నివా రించుచున్నను కబళింప యత్నించెను. ఆక్షణమునందే పక్షిరా జగుగరు త్మంతుడు నాగులమధ్య ప్రత్యక్షమయ్యెను. గరుడుని గాంచి సమస్తసర్ప ములు తమతమప్రాణములను రక్షించుకొనుటకు పారిపోయినవి. కాని కాళి యుడు అహంకారహితభావముతో శ్రీహరిని స్మరించి గరుత్మంతునితో యుద్ధ మారంభించెను. ఒకముహూర్తకాల మామహావీరులనడుమ ఘోరయుద్ధము సంభవించెను. వైష్ణవాగ్రగణ్యు డైనగరుత్మంతుని తేజమును నిలువరింపలేక కాళియుడు పరాజితుడై గరుత్మంతుడు ప్రవేశింపరాని యమునానదిని ప్రవే శించెను. వాని ననుసరించి సకలపరివారము యమునానదీగర్భమున నివసించిరి. సౌరభిమహర్షి శాపగ్రస్తు డైనగరుత్మంతుడు యమునానదిని ప్రవేశింపలేదు.

నారదుడు పలికెను:

గరుత్మంతునకు సౌభరిశాప మేలసంభవించెను ? పరమేశ్వరునివాహన మైనను గరుత్మంతుడు యమున నేల ప్రవేశింపలేకపోయెను ?

శ్రీనారాయణ ఋషి పలికెను:

నారదా ! ఆయమునానదీజలములందు బూర్వకాలము సౌభరిమహర్షి సహస్రదివ్యవర్షములు శ్రీకృష్ణప్రీత్యర్థమై ఘోరతప మాచరించెను. మహర్షి తప మాచరించుచున్నసమయమున గరుత్మంతుడు తనసహచరులతో జలములందు, తటముపై విహరించుచు మహర్షికి తనరెండురెక్కలను జోడించి నమస్కరించుచుండెడివాడు. ఒకదినమున గరుత్మంతుడు మహర్షియెదుట జలప్రవాహములో విశాలమీనమును గాంచి జిహ్వాచాపల్యముచే మహర్షి

యున్నాడనియు విచారింపక యామత్స్యమును తనవాడిచంచువుతో బంధించి గగనమార్గమున కెగిసెను. తనయెదుటనే జీవహింస యొనర్చుట కుద్యుక్తు డైనగరుత్మంతునిపై శ్రీకృష్ణానన్యభక్తు డైనయాసౌరభిమహర్షి క్రోధదృక్కు లను బ్రసరింపజేసెను. మహర్షిక్రోధభరితనయనములను గాంచి భయ మొదిం గరుత్మంతుడు తనచంచువున బంధించినమహామత్స్యమును విడచి వైచెను. ఆమత్స్యరాజు ప్రాణభయముతో మరల యమునానదిని బ్రవేశించి మహర్షిచరణముల శరణుజొచ్చెను. గరుత్మంతుడు తనయాహారము జలము లందు బడుటగాంచి మరల ఆమత్స్యమును వధించుటకు మహర్షిని సమీపింపగ శరణాగతవత్సలు డైనసౌరభిమహర్షి గరుత్మంతు నిట్లువారించెను.

సౌరభి పలికెను :

పక్షిరాజా! ఈక్షణమే నీ వీప్రదేశమును వీడి వెడలిపొమ్ము. ఈ పవిత్రతపఃప్రదేశమందు జీవహింస యొనరించుటకు నీ కేమియోగ్యతకలదు! భగవంతునకు వాహనముగ నుంటివని నీవు గొప్పవాడ వనిభావించుచున్నా వేమో! పరమాత్మ నీవంటి వాహనముల నెన్నింటినో సృజింపగల యఖండ శక్తిసంపన్నుడు. నేను సంకల్పమాత్రముననే నిన్ను భస్మమొనరింపగలను. నీవు భగవంతునివాహన మైన నా కేమిభయము! భగవంతునిదాసుల మైన మేము నీదాసులము కాము. పక్షిరాజా! ఈ దినము మొదలు నీవు మరల ఈ నదిని ప్రవేశించిన భస్మముకాగలవు. ఇదియే నాశాపము.

మహర్షి శాపము నాలకించి పక్షిరాజు భయకంపితుఁడై శ్రీహరిభక్తు లజేయు లనితెలిసికొని సౌరభిమహర్షికి బ్రణామము లాచరించి యాప్రదేశ మును వీడి వెడలిపోయెను. అప్పటినుండి మహర్షిశాపమువలన పక్షిరా జైన గరుత్మంతుఁడు యమునను బ్రవేశింపలేదు. అందువలననే కాళీయుడు పత్నీ పరివారసహితముగ ప్రాణరక్షణార్థమై యమునానదీగర్భమును బ్రవేశించెను.

బాలశ్రీకృష్ణుడు యమునను బ్రవేశించి యెంతసమయముగడచినను వెలుపలకు రానికారణమున సకలగోపబాలు రత్యంతదుఃఖితులై యీ సమా చారమును నందయశోదలకు విన్నవించిరి. సకలవ్రజవాసులు గోడుగోడున దుఃఖించుచు శ్రీకృష్ణునికొఱకై యమునాతటము జేరిరి. యశోదానందు లత్యంతశోకమగ్నులైరి. రాధాసహితు లగుగోపికలందఱు ప్రేమవిహ్వాలురై

మూర్ఛ నొందిరి. సర్వగోకులవాసులు శ్రీకృష్ణున కేయపాయము సంభవించి నదియో యను యత్యంతభీతులై రోదింపదొడంగిరి. దుఃఖపూరిత హృదయాంతరంగులైన గోపగోపికలకు ధైర్యము జేకూర్చుచు బలరామదేవుడు శ్రీకృష్ణ మాహాత్మ్యము నిట్లువర్ణింపదొడంగెను.

శ్రీ బల దేవ ఉ వా చ :

> గోపా గోపాలికా బాలాః సర్వే శృణు తమద్వచః ।
> హే నన్ద జ్ఞానినాం శ్రేష్ఠ గర్గవాక్యస్మృతిం కురు ॥
> జగద్బిభర్తుః శేషస్య సంహర్తుః శంకరస్య చ।
> విధాతుః సంవిధాతుశ్చ భువి కస్మాత్పరాజయః ॥
>
> పరమాణుః పరో వ్యూహః స్థూలాత్ స్థూలః పరాత్పరః।
> విద్యమానోఽప్యవిదృశ్యః సంయోగో యోగినామపి॥
>
> దిశాం నాస్తి సమాహారః స్పృశ్యో నాకాశ ఏవ చ ।
> అపి సర్వేశ్వరో బాధ్య ఇత్యూచుః శ్రుతయః స్ఫుటమ్॥
>
> నాత్మా దృశ్యో నాస్త్రిలక్ష్యో న బధ్యో న హి దృశ్యకః ।
> నాగ్నిగ్రస్తో న హింస్యశ్చాపీదమాధ్యాత్మికా విదుః॥
>
> విగ్రహోఽస్యైవ కృష్ణస్య భక్తధ్యానార్థమేవ చ।
> జ్యోతిః స్వరూపస్య విభోర్నాద్యాన్త మద్యమాత్మనః॥
>
> జలప్లుతే చ బ్రహ్మాణ్డే జలశాయీ జనార్థనః ।
> యన్నాభిపద్మజో బ్రహ్మా తస్యేశస్య హ్రదే విపత్॥
> మశకశ్చేత్ క్షమో గ్రస్తుం బ్రహ్మాణ్డమఖిలం పతిః ।
> న తథాపి తదీశం తం గ్రస్తుం సర్పః క్షమో భవేత్॥
>
> ఇత్యేవం కథితం సర్వమాధ్యాత్మిక మనుత్తమమ్।
> విగూఢం యోగినాం సారం సంశయచ్ఛేదకారణమ్॥ 151-159

గోపకుమారులారా ! గోపికలారా ! మీరందఱు నేను పల్కువాక్కులను సావధానులై యాలకింపుడు. తండ్రీ ! నందరాజా ! జ్ఞానశిరోమణి యగుగర్గమహర్షి యొనరించినయుపదేశములను జ్ఞప్తికి దెచ్చుకొనుము. జగములభారమును వహించు ఆదిశేషునకే ఆధారమైనవాడు, సంహారకారి యగు శంకరునకుగూడ సంహారకుడు, విధాతకుగూడ విధాతయు నగునాసర్వేశ్వరేశ్వరునియీభూమిపై నెవరు గెలువగలరు ? శ్రీకృష్ణు డణువుకంటె

నణువు, స్థూలముకంటె స్థూలతముడు, పరాత్పరుడు. ఆయనశక్తి సర్వత్ర సదా విద్యామాన మైయున్నను భగవంతు డెవరిదృష్టికి గోచరుడుకాడు. ఆయన యోగేశ్వరుడు. శ్రుతులందు సర్వదిశ లేకముకావనియు, ఆకాశము నెవ్వరును స్పృశింపలేరనియు, సర్వేశ్వరు నెవ్వరు బాధింపలే రనియు ప్రవచింపబడెను. సర్వులకు నాత్మ యైనశ్రీకృష్ణు డెవరిదృష్టికి గోచరుడుకాడు. ఆపరమాత్మ నస్త్రములు లక్షింపలేవు. ఆయన యవధ్యుడు. అదృశ్యుడు. అగ్నివలన జ్వలింపడు, హింసకులచే హింసింపబడడు. ఆధ్యాత్మికతత్త్వవిద్వాంసులు పరమాత్మతత్త్వము నట్లే నిర్వచన మొనరించిరి. అఖండజ్యోతిస్వరూప మైన, సర్వవ్యాపియైన పరబ్రహ్మము కేవలము తనభక్తుల ననుగ్రహించుటకే యీమాయామానుషరూపమును ధరించెను. భగవంతు డాది మధ్యాంతరహితుడు. బ్రహ్మాండ మంతయు నేకార్ణవజలములందు మగ్న మైనసమయమున శ్రీకృష్ణపరమాత్మ శ్రీమహావిష్ణువై ఆజలములందు శయనించును. ఆయననాభికమలమునుండియే బ్రహ్మ యావిర్భవించి మరల సృష్టికార్యము సంపన్న మొనరింపగలడు. ఏకార్ణవజలమందు భయముసంభవింపని యాపరమేశ్వరుని యీయమునాజలములందు కాళీయునివలన అపదకల్గు ననిభావించుట గొప్పయజ్ఞానము. తండ్రీ ! ఒకకీటకము బ్రహ్మాండమును మ్రింగివేయుట సంభవ మైనను ఆక్షుద్రసర్పము మాత్రమా శ్రీకృష్ణుని కబళింపలేదు. కావున మీరు భయమును వీడి నిశ్చింతులుకండు. సర్వసంశయములను ఖండింప గలయోగుల కైనను గూఢము పరమోత్తమమగు నాధ్యాత్మిక జ్ఞానమును మీకుపదేశించితిని.

మునీశ్వరా ! బలరామునియుపదేశములను విని నందసహితు లగుగోప గోపికలు దుఃఖమును వీడి ధైర్యము వహించిరి. కాని యశోదారాధలకు మాత్రము తృప్తి కలుగలేదు. శ్రీకృష్ణదర్శనము లభింపనంతవఱకు విరహ వ్యాకుల మైనవారిమనస్సు శాంతింపదు. ఇంతలో యమునానదీగర్భనుండి బాలకృష్ణుడు కందక సర్వాలంకృతసమన్వితుడై బయల్వెడలుట వ్రజ వాసులు గాంచి, శోకరహితులై జయజయధ్వనుల నొనరింపదొడంగిరి. రాధాయశోదలు తనివిదీర యాసచ్చిదానందస్వరూపుని చకోరములు చంద్రుని వీక్షించినట్లు దర్శింప దొడంగిరి. ఆసమయముననే హటాత్తుగ యమునానదీ తటమందుగల వనమున ఘోరదావాగ్నిజ్వాలలు బయల్వెడలెను. మహా

పర్వతశిఖరములవలె మండుచున్న యాదావాగ్నినడుమ వ్రజవాసులందఱు చిక్కువడిరి. క్షణములో నగ్ని తమ్ము భస్మ మొనరింపగల దనిగ్రహించి వారందఱు ముకుళితహస్తులై రక్షింపవలసినదిగ శ్రీకృష్ణుని భక్తిభావముతో ప్రార్థించిరి.

గో ప బా లా ఊ చుః

యథా సంరక్షితం బ్రహ్మన్ పర్వాపత్స్వేవ నః కులమ్।
తథా రక్షాం కురు పునర్దావాగ్నేర్మధుసూదన॥
త్వమిష్టదేవతాస్మాకం త్వమేవ కులదేవతా।
వహ్నిర్వా వరుణో వాపి చన్ద్రో వా సూర్య ఏవ వా॥
యమః కుబేరః పవన ఈశానాద్యాశ్చ దేవతాః।
బ్రహ్మేశశేషధర్మేన్ద్రా మునీన్ద్రా మనవః స్మృతాః॥
మానవాశ్చ తథా దైత్యా యక్షరాక్షసకిన్నరాః।
యే యే చరాచరాశ్చైవ సర్వే తవ విభూతయః॥
స్రష్టా పాతా చ సంహర్తా జగతాం చ జగత్పతే।
ఆవిర్భావ స్తిరోభావః సర్వేషాం చ తవేచ్ఛయా॥
అభయం దేహి గోవిన్ద వహ్నిసంహరణం కురు।
వయం త్వాం శరణం యామో రక్ష నః శరణాగతాన్॥
ఇత్యేవముక్త్వా తే సర్వే తస్థుర్ధ్యాత్వా పదామ్బుజమ్।
దూరీకృతశ్చ దావాగ్నిః శ్రీకృష్ణామృతదృష్టితః॥
దూరీభూతేఽత్ర దావాగ్నౌ విపత్తౌ ప్రాణసంకటే।
స్తోత్రమేతత్ పఠిత్వా చ ముచ్యతే నాత్ర సంశయ॥
శత్రుసైన్యం క్షయం యాతి సర్వత్ర విజయీ భవేత్।
ఇహలోకే హరేర్భక్తిమన్తే దాస్యం లభేత్ ధ్రువమ్॥ 173-181

"పరబ్రహ్మ! మధుసూదనా! నీవు సర్వసంకటములందు మమ్ము, మాకులమును రక్షించినవిధమున ఈసమయమునగూడ మమ్ము దావాగ్నిబారి నుండి రక్షింపుము. జగత్పతే! నీవే మాయిష్టదైవము, కులదైవము. జగములను సృష్టించి, పాలించి, సంహరించు దైవము నీవే. అగ్ని, వరుణ, చంద్ర, సూర్య, యమ, కుబేర, వాయువులు, ఈశానాదిదేవతలు, బ్రహ్మ, శివ, శేష, ధర్మేంద్రాదిదేవేశ్వరులు, మునీంద్ర, మను, మానవ, దైత్య

యక్ష, రాక్షస, కిన్నరులాదిగాగల సకలచరాచరప్రాణు నీవిభూతులే. సకలచరాచరప్రాణులయావిర్భావతిరోభావములు కేవలము నీసంకల్పమాత్రమునసే సంభవించును. గోవిందా! మా కభయమును ప్రసాదించి, ప్రళయసదృశమైనయీదావాగ్నిజ్వాలల నుపసంహరింపుము. నీచరణముల నాశ్రయించిన యీశరణాగతులను రక్షింపుము. ఇట్లు ప్రార్థించి గోకులవాసులందఱు శ్రీకృష్ణునిచరణారవిందములనే స్మరించుచు నిలువబడిరి. శ్రీకృష్ణపరమాత్మ అమృతమయమైనకృపాదృష్టిని సారింపగనే ఆదావానలమంతయు క్షణములో నంతర్ధానమయ్యెను. ఘోరవిపత్తునుండి రక్షింపబడినగోపగోపికలానందోత్సాహములతో నృత్యములజేయదొడంగిరి. శ్రీహరిస్మరణమాత్రమునసే సకలవిపత్తులు నిశ్చయముగ నశించును. ప్రాతఃకాలమం దీపుణ్యమయస్తోత్రమును బఠించువారికి అగ్నిభయమెప్పుడును సంభవింపదు. శత్రుసమూహమధ్యమున, దావాగ్నిమధ్యమున, గొప్పవిపత్తులందు, ప్రాణసంకటసమయములందు మనుష్యుడీస్తోత్రమును బఠించిన దుఃఖములనుండి విముక్తుడు కాగలడు. ఇందు సంశయమేలేదు. వానికి రణరంగమందు విజయము ప్రాప్తించును. ఆభక్తుడిహలోకమందు శ్రీహరియందు దృఢభక్తిని బొంది యత్యంతకాలమందు నిశ్చయముగదాస్యసౌభాగ్యమును బొందగలడు."

నారదమహర్షీ! సకలగోకులవాసులను దావానలమధ్యమునుండి యుద్ధరించి వారందఱిని దోడ్కొని శ్రీకృష్ణుడు స్వస్థలముజేరెను. నందుడు బాలకృష్ణునికళ్యాణార్థమై యనేకదానముల నొనరించి, మంగళాచరణములను గావించి సంతర్పణల నొనరించి, యఖండహరినామసంకీర్తనము గావించెను. శ్రీహరిదివ్యగుణనామసంకీర్తనము కలికల్మష మనుకాష్ఠములను దహించుటకు ప్రజ్వలితాగ్నివంటిది. దివ్యహరికథాశ్రవణము భవసాగరమును దరించుటకేకైకనౌకాసదృశము. దేవర్షీ! ఇట్లు గోకులవాసులందఱు శ్రీకృష్ణచరణారవిందచింతనమందు తమమనస్సునేకాగ్ర మొనరించి ఆనందపూర్వకముగ నివసింపదొడంగిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములో నారదనారాయణ
సంవాదమున కాళియదమనదావాగ్నిమోక్షణ
మను పందొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము

# ఇరువదియవ అధ్యాయము

## బ్రహ్మ గోవత్సాదులను హరించుట

శ్రీ నారాయణ ఋషి పలికెను :

బ్రహ్మకంఠోద్భవా ! నారదా ! ఒకదినమున బలరామసహితుడై మాధవుడు గృహమునందు మిష్టాన్నము లారగించి చందనాదిసుగంధద్రవ్యములచే శరీరము నలంకరించుకొని గోపబాలకులను వెంటనిడుకొని గోరక్షణార్థమై యత్యంతవిశాల మైనబృందావనమును బ్రవేశించెను. ఆవిశాలవనములో భగవంతుడు కుతూహలవశమున గోపకుమారులతో ననేకబాల్యక్రీడల నొనరింపదొడంగెను. గోవులు గోవత్ససహితముగ పచ్చిక నారగించుచు వనములో సుదూరప్రదేశమునకు వెడలిపోయినవి. అంతరిక్షమునుండి సర్వలోక విధాత యగుబ్రహ్మ శ్రీకృష్ణుని బాల్యక్రీడాదృశ్యమును గాంచెను. అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుని శిశురూపమున గాంచి భగవంతుని శక్తిని పరీక్షింప వలె ననియహంకారవశుడై బ్రహ్మదేవుడు గోగోవత్ససహితముగ సర్వగోప కుమారుల నంతర్హితులుగ నొనరించెను. బ్రహ్మయభిప్రాయమును గ్రహించి సర్వద్రష్టయు సర్వజ్ఞుడు నగుశ్రీకృష్ణుడు యోగమాయచే నాక్షణమే గోప బాలకులను గోవత్సములను సృజించెను. సాయంసమయమువఱకు గ్రీడించి పరమాత్మ గోపకుమారులతో గోవులను బాలించుచు గృహముల కేగెను. ఇట్లొక సంవత్సరము శ్రీకృష్ణలీల లవిచ్ఛిన్నముగ గొనసాగెను. ప్రతిదినము శ్రీకృష్ణుడు బలరామసహితుడై గోపకుమారులను వెంటనిడుకొని గోవులను బాలించుచు బృందావనములో యమునాతీరమున బాల్యక్రీడల నొనరించు చుండెను. తానే సృష్టికర్తనని యహంకరించినబ్రహ్మ శ్రీకృష్ణుని దివ్యలీలలను దర్శించి లజ్జతో మస్తకము వంచుకొని గర్వమంతయు నశింపగా బృందావనమునందుగల భాండీరవటవృక్షచ్ఛాయలో గోపకుమారుల నడుమ కొలువు దీరియున్న శ్రీకృష్ణపరమాత్మను దర్శించుట కరుదెంచెను.

> దదర్శ కృష్ణం తత్రైవ గోపాలగణవేష్టితమ్ ।
> యథా పార్వణచన్ద్రం చ విభాన్తం భగణైః సహ॥
> రత్నసింహాసనస్థం చ హసన్తం సస్మితం ముదా।
> పీతవస్త్రపరీధానం జ్వలన్తం బ్రహ్మతేజసా॥

రత్నకేయూరవలయ రత్నమంజీర రంజితమ్।
రత్నకుణ్డలయుగ్మాభ్యాం స్వకపోలస్థలోజ్జ్వలామ్॥
కోటికన్దర్పలావణ్యం లీలాధామ మనోహరమ్।
చన్దనాగరుకస్తూరీ కుఙ్కుమార్చితవిగ్రహమ్॥
పారిజాతప్రసూనానాం మాలాజాలైర్విభూషితమ్।
నవీననీరదశ్యామం ప్రోద్భిన్ననవయౌవనమ్॥
మాలతీమాల సంయుక్తం మయూరపిచ్ఛచూడకమ్।
స్వాఙ్గసౌన్దర్యదీప్త్యా చ కృతభూషణభూషితమ్॥
శరత్పార్వణ చన్ద్రస్య ప్రభాముష్టాస్యసున్దరమ్।
పక్వబిమ్బాధరౌష్ఠం చ ఖగేన్ద్రచంచునాసికామ్॥
శరన్మధ్యాహ్నపద్మానాం ప్రభామోచనలోచనామ్।
ముక్తాపఙ్క్తివినిన్ద్యైక దన్తపఙ్క్తి మనోహరమ్॥
కౌస్తుభేన మణీన్ద్రేణ వక్షఃస్థల సముజ్జ్వలమ్।
శాన్తం చ రాధికాకాన్తం పరిపూర్ణతమం పరమ్॥
ఏవం భూతం ప్రభుం దృష్ట్వా ప్రణనామాతి విస్మితః।
దర్శం ధర్మమీశ్వరం తం ప్రణనామ పునః పునః ॥ 8-17

నక్షత్రములతో గూడిప్రకాశించు పూర్ణిమాచంద్రునివలె గోపాలురుచే బరివేష్టితుడు, రత్నసింహాసనముపై నధిష్ఠించియున్నవాడు, మందస్మితముఖార విందుడు, పీతాంబరములను ధరించినవాడు, బ్రహ్మతేజస్సుచే బ్రకాశించు చున్నవాడు, రత్నకేయూర వలయములచేత, రత్నమంజీరములచేత, రత్నకుండ లములచేత శోభిల్లుకపోలములు గలవాడు, అసంఖ్యాలైనమన్మథులవంటి లావణ్యముగలవాడు, మనోహర మైనలీలాధామముగలవాడు, చందనాగరు కస్తూరీకుంకుమములచేత చర్చిత మైనదేహముగలవాడు, పారిజాతప్రసూన మాలలచే విభూషితుడు, నీలనీరదశ్యాముడు, ప్రస్ఫుట మైననవయౌవనము గలవాడు, మాలతీమాలలచే గూడినవాడు, మయూరపిచ్ఛము కిరీటముగ గలవాడు, తనయవయవముల సౌందర్యదీప్తిచే ఆ భూషణములకుగూడ భూషణ మైనవాడు, శరత్కాలపూర్ణిమాచంద్రునిప్రభను హరించుసుందర మైనముఖముకలవాడు. పండిన దొండపండువంటి యధరముగలవాడు, పక్షిరా జైనగరుత్మంతుని నాసికవంటి నాసికకలవాడు, శరత్కాలమధ్యాహ్న కమల

శోభను దిరస్కరించు లోచనములుకలవాడు, ముత్యాలపంక్తిని తిరస్కరించు మనోహర మైనపలువరుసగలవాడు, కౌస్తుభముచేత సముజ్జ్వల మైనవక్షఃస్థలము గలవాడు, శాంతుడు, రాధికాకాంతుడు, పరిపూర్ణతముడు, పరమేశ్వరుడు, ప్రభువు నగుశ్రీకృష్ణుని జూచి విస్మితుడై బ్రహ్మ మాటిమాటికి నమస్కరింప సాగెను.

ఆయన తనహృదయకమలమున జూచినరూపమునే బయటకూడ జూచెను. ఎదుట నున్నమూర్తియే వెనుక, రెండువైపుల దృష్టిగోచరమయ్యెను. మహాముని! అచట బృందావనములో సర్వమును శ్రీకృష్ణతుల్యముగనే చూచి జగద్గురు వగుబ్రహ్మ ఆరూపమునే ధ్యానించుచు అచటనే కూర్చుండెను గోవులు, గోవత్సములు, బాలుకు, లతలు, గుల్మములు మున్నగువానితో గూడినబృందావన మంతయు బ్రహ్మకు శ్యామసుందరునిరూపముగనే గోచరించెను. ఈపరమాశ్చర్యమును జూచి బ్రహ్మ మరల ధ్యానమగ్నుడయ్యెను. ఆయనకు త్రిలోకములుకూడ శ్రీకృష్ణమయముగనే గోచరించెను. ఆవృక్షములు, ఆపర్వతములు, ఆపృథ్వి, ఆసముద్రములు, ఆదేవతలు, ఆగంధర్వులు, ఆమునీంద్రులు, మానవులు, ఆయాత్మ, ఆజగద్బీజము, ఆస్వర్గము, ఆగోవు లేమైనవో కదా! శ్రీహరిమాయచే బ్రహ్మ సర్వమును తననేత్రములతో జూచి సర్వమును కృష్ణమయముగనే అనుభవించెను. జగదీశ్వరు డగుశ్రీకృష్ణు డెక్కడ! మాయావిభూతు లెక్కడ! సర్వమును శ్రీకృష్ణమయముగ చూచి యేమియు పలుకలేకపోయెను. "ఎట్లు స్తుతింతును! ఏమి చేయుదును!" అని తలంచుచు జగద్ధాత యగుబ్రహ్మ యచ్చటనే కూర్చుండి జపము చేయ నుద్యుక్తుడయ్యెను. ఆయన సుఖముగా యోగాసనమున గూర్చుండి రెండు చేతులను జోడించెను. ఆయన సర్వావయవములు పులకితములయ్యెను. నేత్రముల నుండి యశ్రుధారలు ప్రవహింపసాగెను. ఆయన మిగుల దీనునివలె నయ్యెను.

పిమ్మట ఆయన ఇడ, సుషుమ్న, మధ్య, పింగళ, నళినిధుర అను ఆఱు నాడులను ప్రయత్నముచే యోగద్వారమున బంధించెను. పిమ్మట మూలాధారము, స్వాధిష్ఠానము, మణిపూరము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ – అను నాఱుచక్రములను బంధించెను. తరువాత కుండలినీద్వారా ఒక్కొక్కచక్రమును లంఘించుచు క్రమముగ షట్చక్రముల భేదించి ఆయన దానిని బ్రహ్మ

రంధ్రమునకు దీసుకొని వెడలి దానిని వాయువుతో నింపెను. ప్రాణ వాయువు నచట బంధించి దానిని మరల హృదయకమలములోని మధ్య నాడితో గలిపెను. ఇట్లుచేసి ఆయన నిశ్చలుడయ్యెను. పూర్వకాలమున శ్రీహరి యుపదేశించిన పరమోత్కృష్ట మగుదశాక్షర మంత్రమును జపింప సాగెను. మహామునీ! శ్రీకృష్ణుని చరణారవిందములను ధ్యానించుచు ఒక్క ముహూర్తకాలము పిమ్మట బ్రహ్మ తనహృదయకమలమున సర్వతేజో మయు డగు నాభగవానుని స్వరూపమును దర్శించెను. ఆ తేజస్సులో మిగుల మనోహర మగురూప ముండెను. అది రెండుభుజములతోను, మురళీహస్తము తోను, పీతాంబరములతోను భూషితమైయుండెను. ఆ రూపము కర్ణమూల ములయం దుంచబడిన మకరకుండలములచే శోభిల్లు కాంతికలది. మందహాస ముచే ప్రసన్న మైనముఖముకలది. భక్తానుగ్రహకారకమైనది. బ్రహ్మదేవుడు బ్రహ్మరంధ్రములోను, హృదయకమలములోను దర్శించినరూపమే బయట గూడ గనబడెను. ఆ పరమాశ్చర్యమును జూచి ఆయన ఆ పరమేశ్వరుని స్తుతించెను. మహామునీ పూర్వకాలమం దేకార్ణవజలమున శయనించుశ్రీహరి తన కుపదేశించిన స్తోత్రముచే బ్రహ్మదేవుడు భక్తిభావముతో శిరస్సు వంచి యా పరమేశ్వరుని యథావిధిగ స్తుతించెను.

## బ్రహ్మణాకృతం శ్రీకృష్ణస్తోత్రమ్

సర్వస్వరూపం సర్వేశం సర్వకారణకారణమ్ ।
సర్వానిర్వచనీయం తం నమామి శివరూపిణమ్ ॥
నవీనజలదాకారం శ్యామసున్దరవిగ్రహమ్ ।
స్థితం జన్తుషు సర్వేషు నిర్లిప్తం సాక్షిరూపిణమ్ ॥
స్వాత్మారామం పూర్ణకామం జగద్వ్యాపి జగత్పరమ్ ।
సర్వస్వరూపం సర్వేషాం బీజరూపం సనాతనమ్ ॥
సర్వాధారం సర్వవరం సర్వశక్తిసమన్వితమ్ ।
సర్వారాధ్యం సర్వగురుం సర్వమఙ్గలకారణమ్ ॥
సర్వమన్త్రస్వరూపం చ సర్వసమ్పత్కరం వరమ్ ।
శక్తియుక్తమయుక్తం చ స్తౌమి స్వేచ్ఛామయం విభుమ్ ॥
కృపాలుం కర్ణధారం చ నమామి భక్తవత్సలమ్ ।
ఆత్మస్వరూపమేకాన్తం లిప్తం నిర్లిప్తమేవ చ ॥

సగుణం నిర్గుణం బ్రహ్మ స్తౌమి స్వేచ్ఛాస్వరూపిణమ్ ।
సర్వేన్ద్రియాధిదేవం త్వామిన్ద్రియాలయమేవ చ ॥

సర్వేన్ద్రియస్వరూపం చ విరాడ్రూపం నమామ్యహమ్ ।
వేదం చ వేదజనకం సర్వవేదాఙ్గరూపిణమ్ ॥

స్వతన్త్రమస్వతన్త్రం చ యశోదానన్దనం భజే ।
శాన్తం సర్వశరీరేషు తమదృష్టమనూహకమ్॥

ధ్యానాసాధ్యం విద్యమానం యోగీన్ద్రాణాం గురుం భజే।
రాసమణ్డలమధ్యస్థం రాసోల్లాససముత్సుకమ్ ॥

గోపీభిః సేవ్యమానం చ తం రాధేశం నమామ్యహమ్ ।
సతాం సదైవ సన్తం తమసన్తమసతామపి ॥
యోగీశం యోగసాధ్యం చ నమామి శివసేవితమ్ ।
మన్త్రబీజం మన్త్రరాజం మన్త్రదం ఫలదం ఫలమ్ ॥
మన్త్రసిద్ధిస్వరూపం తం నమామి చ పరాత్పరమ్ ।
సుఖం దుఃఖం చ సుఖదం దుఃఖదం పుణ్యమేవ చ ॥

పుణ్యప్రదం చ శుభదం శుభబీజం నమామ్యహమ్ ।
ఇత్యేవం స్తవనం కృత్వా దత్త్వా గాశ్చ సబాలకాన్ ॥

నిపత్య దణ్డవద్భూమౌ రురోద ప్రణనామ చ ।
దదర్శ చక్షురున్మీల్య విధాతా జగతాం మునే ॥

బ్రహ్మణా చ కృతం స్తోత్రం నిత్యం భక్త్యా చ యః పఠేత్।
ఇహలోకే సుఖం భుక్త్వా యాత్యన్తే శ్రీహరేః పదమ్ ॥
లభతే దాస్యమతులం స్థానమీశ్వరసంనిధౌ ।
లబ్ధ్వా చ కృష్ణసాన్నిధ్యం పార్షదప్రవరో భవేత్॥ 37-56

సర్వస్వరూపుడు, సర్వేశ్వరుడు, సర్వకారణకారణుడు, సర్వాల కనిర్వచనీయుడు, కళ్యాణస్వరూపుడు, నవీనజలదాకారుడు, శ్యామసుందరవిగ్రహుడు, సర్వజీవుల యందున్నను వానితో లిప్తుడు కానివాడు, సాక్షిస్వరూపుడు, స్వాత్మారాముడు, పూర్ణకాముడు, విశ్వవ్యాప్తుడు, జగత్పరుడు, సర్వస్వరూపుడు, సర్వబీజస్వరూపుడు, సనాతనుడు, సర్వాధారుడు, సర్వవీరుడు, సర్వశక్తి సంపన్నుడు, సర్వారాధ్యుడు, సర్వగురుడు, సర్వమంగళకారణుడు, సర్వమంత్రస్వరూపుడు, సర్వసంపత్కరుడు, శ్రేష్ఠుడు, శక్తితో సంయోగ వియోగములు కలిగినవాడు, స్వేచ్ఛామయుడు, విభుడు, శక్తీశ్వరుడు, శక్తి

బీజుడు, శక్తిరూపధరుడు, వరుడు, ఘోరసంసారసాగరములో శక్తిమయమైననౌకతో సమన్వితుడు, ఆత్మస్వరూపుడు, ఏకాంతమయుడు, లిప్తుడు, నిర్లిప్తుడు, భక్తవత్సలుడు, సగుణుడు, నిర్గుణుడు, బ్రహ్మము, స్వేచ్ఛాస్వరూపుడు, సర్వేంద్రియాధిదేవత, సర్వేంద్రియముల కావాసస్థానము, సర్వేంద్రియ స్వరూపుడు, విరాడ్రూపుడు, వేదస్వరూపుడు, వేదములకు జనకుడు, సర్వవేదాంగరూపుడు, సర్వమంత్రస్వరూపుడు, పరమేశ్వరుడు. సారములకంటె సారతరుడు, అపూర్వుడు, అనిర్వచనీయుడు, స్వతంత్రుడు, అస్వతంత్రుడు, యశోదానందనుడు, సర్వశరీరములందు శాంతరూపమున విరాజిల్లువాడు, అగోచరుడు, అతర్క్యుడు, ధ్యానాసాధ్యుడు, నిత్యము విరాజిల్లుచుండువాడు, యోగీంద్రులకు గురుడు, రాసమండల మధ్యభాగమున విరాజిల్లువాడు, రాసోల్లాస సముత్సుకుడు, గోపికలచే సేవింపబడువాడు, రాధావల్లభుడు, సాధుపురుషుల దృక్పథములో సదా సత్యముగ గోచరించువాడు, అసాధువుల కసత్యముగ గోచరించువాడు, యోగీశ్వరుడు, యోగసాధ్యుడు, శివునిచే సేవింపబడువాడు, మన్త్రబీజుడు, మంత్రరాజస్వరూపుడు, మంత్రప్రదాతయు, ఫలదాతయు, ఫలరూపుడు, మంత్రసిద్ధిస్వరూపుడు, పరాత్పరుడు, సుఖదుఃఖస్వరూపుడు, పుణ్యప్రదాయకుడు, శుభబీజస్వరూపుడు, పరమేశ్వరుడు నగు శ్రీకృష్ణునకు నమస్కరించెను.

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మను స్తుతించి బ్రహ్మ గోవులను, గోపబాలకులను మరల ఆయనకు సమర్పించి దండమువలె పృథ్విపై బడి రోదించుచు ప్రణామము లర్పించెను. మునీశ్వరా! తదనంతరము జగత్స్రష్ట కన్నులు తెఱచి శ్రీహరిని దర్శించెను. బ్రహ్మ యొనరించిన యీస్తోత్రమును ప్రతిదినము భక్తిభావముతో పఠించు దేహధారి యిహలోకములో సుఖముల ననుభవించి అంత్యకాలమున శ్రీహరి ధామమును జేరగలడు. ఆపరంధామములో వాని కనుపమ దాస్యసుఖము, పరమేశ్వర సాన్నిధ్యము ప్రాప్తించును. శ్రీకృష్ణ సాన్నిధ్యమును బొంది యాతడు పార్షదశిరోమణి కాగలడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను:

నారదా! తదనంతరము జగద్విధాత యగు బ్రహ్మ తనలోకమున కరిగెను. గోవులు గోవత్సములు గోపబాలకు లొకసంవత్సరానంతరము తమ

తమ నెలవుల కరిగిరి. కాని కృష్ణుని మాయాప్రభావముచే ఆ సంవత్సరకాలము వారికొకదినముగ గోచరించెను. గోపగోపికలుగూడ ఆ సమయమున నెట్టి యనుమానము లేకయుండిరి. (ఎందువలె ననగ మొదట మాయానిర్మిత బాలకులందు, నేడు గృహమున కరుదెంచిన బాలకులందు వా రెట్టియంతరమును కనుగొనలేకపోయిరి). యోగుల కేది నూతనము? ఏది పురాతనము? వారికి సకలవిశ్వము కృత్రిమమే. సుఖప్రదాయకము, మోక్షప్రదము, పుణ్యమయము, సర్వకాలసుఖప్రదము నగుశ్రీకృష్ణ శుభచరితము నేనిట్లు వర్ణించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున బ్రహ్మదేవు డొనరించిన
గోవత్సబాలకహరణ ప్రస్తావన మను
యిరువదియవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

## ఇరువదిఒకటవ అధ్యాయము

శ్రీకృష్ణు డింద్రయాగమును నిషేధించుట:
వ్రజవాసులపై నింద్రుడు కోపించుట;
శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని ధరించి
వ్రజవాసులను గాపాడుట.

శ్రీనారాయణ ఋషి పలికెను:

**మహాముని!** ఒకదినమున ఆనందయుతు డగునందుడు వ్రజమున నింద్ర యజ్ఞమునకు సిద్ధముచేసి నలువైపుల వార్తను బ్రకటించెను. ఈ నగరములోని గోపకులు, గోపికలు, బాలబాలికలు, బ్రాహ్మణవైశ్య శూద్రులు సర్వులు భక్తిపూర్వకముగా దధిదుగ్ధఘృత నవనీతములను, గుడము, మధువు మున్నగు

సామగ్రులను దెచ్చి యింద్రుని పూజింపవలసినదిగా నందుడు చాటింపు వేయించెను. అనంతర మాయన సంతుష్టుడై విశాలము, రమణీయము నగు ప్రదేశమున యష్టి నారోపించెను. ధ్వజమునకై స్తంభమును స్థాపించెను. ఆ యష్టికి పట్టువస్త్రమును సుందరమాలలను గూర్చెను. చందనాగురు కస్తూరీ కుంకుమద్రవముచే యష్టి నలంకరించి నందుడు స్నానము నిత్యకర్మములు నొనరించి, శుభ్రవస్త్రములను ధరించి, పాదప్రక్షాళనము జేసికొని, స్వర్ణాసనము పై గూర్చుండెను. ఆ సమయమున నానావిధము లగుపాత్రలతో బ్రాహ్మణులు, పురోహితులు, గోపగోపికలు, బాలబాలికలు అచటికి జేరికొనిరి. ఇంతలో నగరవాసులుకూడ బహువిధము లగుద్రవ్యములను గూర్చుకొని యనేకవిధము లగుకానుకలను దీసికొని పూజకై యచటకు జేరికొనిరి. తదనంతరము బ్రహ్మ తేజస్సంపన్నులు, వేదవేదాంగవిదులు, శాంతస్వభావులు నగుగర్గజైమిని కృష్ణ ద్వైపాయనాదిమునులు శిష్యపరివృతులై యచటి కేతెంచిరి. ఇంకను బ్రాహ్మణ క్షత్రియ వైశ్యశూద్రులు, వందిమాగధులు, భిక్షుకులు మున్నగువారుకూడ వచ్చిరి. గోపరా జగునందుడు వారందఱికి దగువిధముగ ప్రణామాదులచే స్వాగత సత్కారముల నొనర్చెను. పిమ్మట యష్టికి దగ్గరలోనే నిపుణు లైన వంటబ్రాహ్మణులు వంటచేయసాగిరి. రత్నదీపములయొక్క ధూపములయొక్క ప్రకాశము, సుగంధము నలువైపుల వ్యాపించెను. పుష్పమాలలచే నాప్రదేశ మంతయు నలంకృత మైయుండెను. వివిధము లగుమధురపదార్థములు, పక్వాన్నము, మధురపఫలములు, వేలకొలది కుండలతో పాలు, నేయి, పెరుగు, వెన్న మున్నగుపదార్థములు సమకూర్చబడెను. మంగళవాద్యములు మ్రోగుచుండెను. నానావిధము లగురజతస్వర్ణపాత్రలు, శ్వేతవస్త్రములు, భూషణములు, స్వర్ణపీఠములు మున్నగునవి తీసికొనిరాబడెను. ఈ వస్తువు లన్నియు లెక్కపెట్టలేనంతగ నున్నవి. అచట నృత్యగానములుగూడ సాగు చుండెను.

ఈలోపల బలశాలి యగుబలరాముడు, గోపబాలకులతో శ్రీహరి శీఘ్రముగ నచటికి వచ్చిరి. వారిని జూచి సర్వులు హర్షితులై లేచి నిలువ బడిరి. శ్రీకృష్ణుడు క్రీడాంగణమునుండి తిరిగివచ్చుచుండెను. శాంతము సుందరము నగు ఆయన విగ్రహము చాలమనోహరముగనుండెను, వినోదములకు సాధనభూతము లగుమురళి, వేణువు, శృంగము మున్నగువాద్యములధ్వనులు

ఆయన వెంట వినుపడుచుండెను. రత్నసారతత్త్వనిర్మితము లగునాభూషణముల తోను, కౌస్తుభమణితోను ఆయన విభూషితు డైయుండెను. శ్యామలము, మనోహరము నగుఆయనశరీరము అగురుచందనపంకముచే చర్చితమైయుండెను. రత్నమయదర్పణమున శరత్కాలమధ్యాహ్నవికసితకమలమువలె మనోహర మగుతనముఖము నాయన చూచుకొనుచుండెను. ఫాలదేశమున కస్తూరి బిందువులతోపాటు, పూర్ణిమాచంద్రునివలె మనోహరముగ చందనముచే దిద్దబడియుండెను. దీనిచే ఆయనలలాటము చంద్రునిచే నలంకృత మైన యాకాశమువలె శోభిల్లుచుండెను. కంఠము, వక్షఃస్థలము మాలతీమాలలచే ప్రకాశించుచు మిక్కిలినిర్మల మగుశరత్కాలసంబంధ మైనయాకాశము బక పంక్తులచే నలంకృత మైనట్లుండెను. మనోహర మగుపీతాంబరముచే ఆయన శ్యామలవిగ్రహము విద్యుత్కాంతిచే నిరంతరము ప్రకాశించుచున్న నూతనమేఘము వలె శోభిల్లుచుండెను. మస్తకముపై నొకప్రక్కకు వంగిన మయూరపిచ్ఛముకుటము కుందపుష్పమాలలచే ఆబద్ధమై నక్షత్రముల తోను ఇంద్రధనస్సుతోను శోభిల్లు నాకాశమువలె మనోహరముగనుండెను. మందహాసయుక్త మగుముఖము, రత్నమయకుండలములదీప్తిచే, సూర్యకిరణ ములచే సద్దీప్త మగుశరత్కాలవికసితకమలమువలె శోభిల్లుచుండెను. జగ దీశ్వరుడగు శ్రీకృష్ణుడు వారినడుమరత్నశింహాసనముపై నధిష్ఠించి తారామండల మధ్యమున శరత్కాలచంద్రునివలె భాసిల్లుచుండెను. ఆమహోత్సవము చూచి నీతిశాస్త్రవేత్తయగుశ్రీహరి ఆసమయమునకు దగినట్లుగా ఇతరులకు దుర్లభ మగునట్లుగా నీతివాక్యలను బలికెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

ఉత్తమవ్రతపాలకా! గోపసార్వభౌమా! మీ రేమి చేయుచున్నారు? మీయారాధ్యదైవ మెవ్వరు? ఈ యజ్ఞ మొనరించుటవలన మీ కేమిఫలము లభింపగలదు ? ఈయాగఫలమువలన నెట్టిసాధనము సులభము కాగలదు ? ఆసాధనముచే నెట్టిమనోరథము సిద్ధింపగలదు ? ఈపూజయందు విఘ్నము సంభవించిన, దేవతలు కోపించిన నేమికాగలదు? దేవతలు ప్రసన్నులైనను ఇహలోకమందు లేదా పరలోకమం దెట్టిఫలములను వారు ప్రసాదింపగలరు ?

అనన్యభక్తుడు విప్రరూపమును ధరించి శ్రీహరినైవేద్యమును స్వయ ముగ గ్రహించును. అందువలన మహాత్ములు సంతుష్టులైన సర్వదేవతలు

ప్రసన్నులు కాగలరు. అనన్యభక్తులసేవలందు నిమగ్నులగువారికి దేవతా రాధనములయావశ్యకత లేదు. భగవద్భక్తులను భూజించిన సర్వదేవతలపూజ సంపన్నముకాగలదు. దేవతలకుమాత్రమే నైవేద్యముల నర్పించి సద్భక్తులైనబ్రాహ్మణులను సత్కరింపనియెడల ఆనైవేద్యఫలము, పూజ నిష్ఫలములు కాగలవు దేవతల కర్పించునైవేద్యమును సత్పురుషుల కర్పించినచో అది నిశ్చయముగ నక్షయము కాగలదు. దేవతలు సంతుష్టులై వానికి వరములను ప్రసాదింపగలరు. కేవలము దేవతలకే నైవేద్యముల నర్పించి సద్భక్తులైన బ్రాహ్మణులకు బెట్టక స్వయముగ నారగించు, మూఢుడు దత్తాపహారియై (దానము నిడితిరిగి గ్రహించువాడై) దేవతలనైవేద్యమును భుజించినను నరక గామి కాగలడు.

శ్లో॥ దేవదత్తం న భోక్తవ్యం నైవేద్యం చ వినా హరేః।
ప్రశస్తం సర్వదేవేషు విష్ణునైవేద్యభోజనమ్॥
అన్నం విష్ఠా జలం మూత్రం యద్విష్ణోర నివేదనమ్।
సర్వేషాం చ క్రమమిదం బ్రాహ్మణానాం విశేషతః॥ 58—59

"దేవతలు ప్రసాదించినను శ్రీహరికి అర్పించనిదే నైవేద్యమును భుజింప రాదు. సర్వదేవతలయందు విష్ణువున కర్పించిన నైవేద్య మత్యంత ప్రశస్తము. భగవంతున కర్పింపనియన్నము మలమువంటిది. జలము మూత్రముతో సమానము. ఈ క్రమము సర్వులకు సమానమే, కాని బ్రాహ్మణులు మాత్రము విశేషముగ దీనిని పాటింపవలెను." కావున తండ్రీ! మీ సమస్తశక్తిని వినియోగించి భగవద్భక్తాగ్రేసరుడైనద్విజు నారాధింపుడు. ఎందువలెననగ అత డీహ లోకమందు, పరలోకమందు ఉత్తమఫలములను బ్రసాదింపగలడు. శ్రీహరిని ఆరాధించువారు శ్రీహరికి ప్రాణములకంటె నధికప్రియులు. హరిభక్తుల ప్రభావము శ్రుతులందే దుర్లభము. వారిశరీరమందే సర్వదేవతలు నివసింతురు. భక్తులచరణకమలముల ధూళిచే తత్కాలమే పృథ్వీసహితము పవిత్రము కాగలదు. వారిచరణచిహ్నాంకితము మైనప్రదేశమే తీర్థ మనబడును. వారి స్పర్శమాత్రముననే తీర్థములపాపములు సహితము నశింపగలవు. వారిని యాలింగన మొనరించినను, వారితో వార్తాలాప మొనరించినను, దర్శించినను, స్పృశించినను మనుష్యుడు సమస్తపాపములనుండి విముక్తుడు కాగలడు. సర్వ తీర్థభ్రమణస్నానములవలన నెట్టిపుణ్యము లభించునో, అట్టిపుణ్యమే హరిభక్తుని

సందర్శనమాత్రమున సులభము కాగలదు. పుణ్యసముపార్జనమునకై మనుష్యుడు సమస్తజీవుల కన్నదాన మొనరింపవలెను, కాని పరమభక్తాగ్రగణ్యుల కన్నదాన మొనరించినవానికి విశిష్టఫలము లభించును. భక్తులు సంతుష్టులైన శ్రీహరి సంతుష్టుడగును, శ్రీహరిసంతుష్టుడైన సర్వదేవతలు ప్రసన్నులు కాగలరు. వృక్షమూలమునందు జలములను పోసిన వృక్షశాఖ లన్నియు నాజలములచే పుష్టిచెందునట్లు శ్రీహరి కర్పించినదేదియైనను సర్వదేవతలకు చెందకలదు. కావున తండ్రీ! మీ రీయాగార్థమై సంపాదించిన ద్రవ్యములో సగముభాగము శ్రీగోవర్ధనదేవున కర్పింపుడు. ఆయన గోవులను వృద్ధిచేయును. అందువలన ఆయన నామధేయము గోవర్ధను డయ్యెను. తండ్రీ! ఈ భూమిపై గోవర్ధనునితో సమానుడైనపుణ్యాత్ముడు మఱియొకడులేడు. ఎందువలెననగ ఆయన నిత్యము గోవులకు పచ్చని గ్రాసమును ప్రసాదించుచుండునుగదా!

తీర్థస్నానేషు యత్పుణ్యం యత్పుణ్యం విప్రభోజనే ।
సర్వవ్రతోపవాసేషు సర్వేష్వేవ తపస్సు చ॥
యత్పుణ్యం చ మహాదానే యత్పుణ్యం హరిసేవనే ।
భువః పర్యటనే యత్తు వేదవాక్యేషు యద్భవేత్ ॥
యత్పుణ్యం సర్వయజ్ఞేషు దీక్షాయాం చ లభేన్నరః।
తత్పుణ్యం లభతే ప్రాజ్ఞో గోభ్యో దత్త్వా తృణాని చ॥ 87—89

తీర్థస్నానదానములచేత బ్రాహ్మణులకు భోజనముల నిడుటచేత సర్వవ్రతోపవాస తపో దానములవలన, శ్రీహర్యారాధనమువలన పృథ్వీప్రదక్షిణమువలన, సర్వవేదాధ్యయనమువలన, సమస్తయజ్ఞదీక్షాగ్రహణమువలన, మనుష్యుడు పొందు మహాపుణ్యమును బుద్ధిమంతుడైనమానవుడు కేవలము గోవులకు తృణములను ప్రసాదించిన సులభముగ బొందగలడు.

భుక్తవన్తీం తృణం యశ్చ గాం వారయతి కామతః ।
బ్రహ్మహత్యా భవేత్తస్య ప్రాయశ్చిత్తాద్ విశుధ్యతి॥
సర్వే దేవా గవామఙ్గే తీర్థాని తత్పదేషు చ ।
తద్గుహ్యేషు స్వయం లక్ష్మీ స్తిష్ఠత్యేవ సదా పితః ॥
గోష్పాదాక్తమృదా యో హి తిలకం కురుతే నరః।
తీర్థస్నాతో భవేత్ సద్యో జయస్తస్య పదే పదే॥
గావస్తిష్ఠన్తి యత్రైవ తత్తీర్థం పరికీర్తితమ్।
ప్రాణాం స్త్యక్త్వా నర స్తత్ర సద్యో ముక్తో భవేద్ధ్రువమ్॥

బ్రాహ్మణానాం గవామఙ్గం యో హన్తి మానవాధమః।
బ్రహ్మహత్యాసమం పాపం భవేత్ తస్య న సంశయః॥
నారాయణాంశాన్ విప్రాంశ్చ గాశ్చ యే ఘ్నన్తి మానవాః।
కాలసూత్రం చ తే యాన్తి యావచ్చన్ద్రదివాకరౌ ॥ 94-95

తృణములను భక్షించుచున్న గోవును స్వేచ్ఛాపూర్వకముగ నివారించు వారికి బ్రహ్మహత్యాపాతకము సంభవించును. అట్టివా రెన్నిప్రాయశ్చిత్తముల నొనరించినను శుద్ధులుకారు. తండ్రీ! సర్వదేవతలు గోవుల యంగములందు, సర్వతీర్థములు గోవులపాదములందు స్వయముగ లక్ష్మి గోవుల గుహ్యస్థానము లందు నివసించును. గోపదచిహ్నయుక్తమైనమట్టిని తిలకముగ ధరించువానికి తత్కాలమే తీర్థస్నానఫలము లభించి అడుగడుగున విజయముకల్గును. గోవు నివసించు ప్రదేశములనే తీర్థము లనిరి. ఆ ప్రదేశమున మరణించిన మనుష్యుడు తత్కాలమే ముక్తిపొందగలడు, ఇందు సంశయములేదు. గోవులనుగాని, సద్భక్తులైనబ్రాహ్మణులనుగాని హింసించువానికి నిస్సందేహముగ బ్రహ్మ హత్యాపాపము సంభవింపగలదు. నారాయణాంశసంభూతులైనసద్బ్రాహ్మ ణునిగాని, గోవునుగాని వధించిన మనుష్యుడు సూర్యచంద్రు లున్నంతవఱకు కాలసూత్ర మనునరక మనుభవింపగలడు.

నారదా! శ్రీకృష్ణుని బోధనాత్మకము లైనదివ్యవచనముల నాలకించి నందుడు మందస్మితముఖారవిందుడై యిట్లుపల్కెను. "కుమారా! పరంపరా గతముగ జరుగుచున్న యీ యజ్ఞము మహేంద్రుని యారాధనమైయున్నది. ఈ సత్కర్మము సువృష్టికి సాధనము. వర్షములవలన వివిధము లగుసస్యము లుత్పన్నము లగును. సస్యములే దేహధారులకు ప్రాణము. సస్యములతోనే దేహధారి జీవనము గడుపుకొనుచుండును. అందువలననే వ్రజవాసులు పూర్వ కాలమునుండి మహేంద్రునిపూజ తరతరములనుండి యొనరించుచున్నారు." నందుని వచనములను విని బలరామసహితుడగు శ్రీకృష్ణుడు బిగ్గరగ నవ్వుచు ప్రసన్నతాపూర్వకముగ తనతండ్రితో మరల యిట్లుపల్కెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

తండ్రీ! ఈ దినమున నీ ముఖారవిందమునుండి యొట్టియద్భుతవిచిత్ర విషయము వింటిని. ఇంద్రుడే వర్షించుననియొక్కడను నిరూపణ మొనరింప

బడలేదు. సూర్యునిచే జలము లుత్పన్నములగును. జలములచే సస్యములు, వృక్షములు వృద్ధిగాంచును. వానిచే యన్నఫలములు లభించును, ఆయన్న ఫలములచే దేహధారి జీవనమును నిర్వహించుకొనును. సూర్యుడు తనతీక్ష్ణ కిరణములచే ధర పైగలజలములను ఆవిరిగ మార్చి వర్షాకాలమందు మేఘ రూపమున ఆజలములనే వర్షించును. సూర్యమేఘాదు లన్నియు విధాతచేతనే సంచాలితములగును. ఈశ్వరుని యిచ్ఛవలననే జలాదు లావిర్భవింప గలవు. ఈశ్వరునిచే నిర్ణయింపబడినగమనము దెవరును విఘ్న మొనరింప లేరు. ఈశ్వరునియాజ్ఞవలననే బ్రహ్మ సర్వచరాచరజగత్తును నిర్మించెను. మొదట భోజనవ్యవస్థ జరిగినపిదపనే జీవు లుత్పన్నులు కాగలరు. స్వభావముచే కర్మ మొనరింపబడును. స్వకర్మానుసారముగ దేహధారి యైనజీవుడు సుఖ దుఃఖముల ననుభవింపగలడు.

యాతనలు, జనమరణములు, రోగశోకములు, భయము, ఉత్పత్తి, విపత్తి, విద్య, కవిత, యశము, అపయశము, పుణ్యము, స్వర్గవాసము, పాపము, నరకనివాసము, భోగము, మోక్షము, శ్రీహరిదాస్యము మొదలగునవి యన్నియు మనుష్యులకు స్వకర్మానుసారముగనే ఉపలబ్ధములు కాగలవు. ఈశ్వరుడు సర్వులకు జనకుడు. సుశీలత్వము, సత్కర్మాభ్యాసము విధాతకైనను ఫలదాయకములే. సర్వము ఈశ్వరుని సంకల్పమువలనే సంభవించును. విరాట్పురుషునినుండి ప్రకృతి, పంచతత్వములు, జగత్తులు, కూర్మము, ఆదిశేషుడు, ధరణి బ్రహ్మాదికీటకపర్యంతము గలసకలచరాచరపదార్థములు నిర్మాణములైనవి. ఆయనయాజ్ఞచే వాయువు కూర్మమును, కూర్మము ఆదిశేషుని, ఆదిశేషుడు వసుధను, వసుధ సర్వచరాచరజగత్తును ధరించును. జగత్తులకు ప్రాణస్వరూప మైనసమీరణము (గాలి) త్రిలోకములందు వీచుచుండును. సూర్యుడు ప్రకాశించును, అగ్ని జ్వలించును, మృత్యువు సంహరించును. వృక్షములు సమయానుసారముగ పుష్పించి ఫలించును, సముద్రము తనస్థానమందే యుండి యుండును. ఆ పరమేశ్వరుని మీరు భక్తిభావముతో భజింపుడు. భగవంతుని యారాధించు మిమ్ములను ఇంద్రు డేమిచేయగలడు? ఆ భగవానుని భ్రూభంగలీలామాత్రముచే ఈ దినమువఱకు నెన్ని యో బ్రహ్మాండము లుద్భవించినవి, కాలగర్భమున గలసిపోయినవి. ఎందఱో విధాత లుద్భవించి నశించినారు. ఆ పరమేశ్వరుడే మృత్యువునకు మృత్యువు, కాల

మునకే కాలము, విధాతలకే విధాత; తండ్రీ! మీరా రాసరేశ్వరేశ్వరుని శరణు బొందుడు. ఆయనయే మిమ్ము రక్షింపగలడు. అహో, బ్రహ్మకునొకదినమం దిఱువదియెనమండుగురు ఇంద్రులు నశింపగలరు. అట్టి నూటయెన మండుగురుబ్రహ్మలు ఆనిర్గుణపరమాత్మ యైనశ్రీహరియొక్క నిమేషకాలముననే నశించెదరు. అట్టిపరమాత్మ యుండగ కేవలమింద్రుని బూజించుట యత్యం తాశ్చర్యకర మైనవిషయము.

నారదా! ఇట్లు శ్రీకృష్ణుని పలుకులనువిని సభాసదులందఱు భగవంతుని యనేకవిధముల ప్రశంసించిరి. నందు డత్యంతహర్షయుక్తుడై శరీరము పులకింపగ తనకుమారుని మహాజ్ఞానమును తెలిసికొని బ్రహ్మానందభరితు డయ్యెను. తండ్రి కుమారునివలన పరాజితు డైనను ఆనందమునే యనుభ వించును. శ్రీకృష్ణునియాజ్ఞ సంగీకరించి నందుడు స్వస్తివాక్కులను బలికి క్రమముగ బ్రాహ్మణులను, మునులను వరించెను. ఆయన ఆదరముతో గోవర్ధనగిరిని, సమాగతు లగుమునీశ్వరులను, విద్వాంసు లైనబ్రాహ్మణులను, గోవులను, అగ్నిని యానందముతో బూజించెను. పూజబూర్తి యైనపిమ్మట ఆ యజ్ఞమహోత్సవమున నానావిధము లగువాద్యములు మ్రోగసాగెను. జయజయధ్వనులు, శంఖధ్వనులు, హరినామకీర్తనము జరుగసాగెను. మునివరు డగుగర్గుడు వేదములలోని స్వస్తివచనకాండను పఠించెను. వందిమాగధులలో శ్రేష్ఠుడు, కంసునకు ప్రియసచివుడు నగుడిండియనువాడు ఎదుట నిలచి యుచ్చైస్స్వరముతో మంగళాష్టకములను బఠింపసాగెను. శ్రీకృష్ణుడు గిరిరాజు కడకు వెడలి మఱియొకమూర్తిని ధరించి "నేను సాక్షాత్తుగ గోవర్ధనపర్వత మును మీరుసమర్పించిన భోజ్యవస్తువులను భుజించుచున్నాను. మీరు వరముల గోరుకొనుడ"ని పలికెను. నందుడు హరిభక్తిని, హరిదాస్యసౌభాగ్య మును, గోవర్ధనరూపధారి యైనశ్రీకృష్ణుని యర్థించి సిద్ధమనోరథు డయ్యెను. సక్రమముగ పూజ సంపన్న మైనపిమ్మట నందు డనేకధనకనకవస్తువాహనము లను దాన మొనరించి, హరినామసంకీర్తనము గావించి ఆ మహోత్సవమును సాంగోపాంగముగ సంపన్న మొనరించెను. ఈ మహోత్సవమును వీక్షించుట కరుదెంచినదేవత లందఱు తమతమ స్వధామములకు వెడలిపోయిరి.

వ్రజవాసులచే తనయజ్ఞము భంగ మైనట్లు గ్రహించి యింద్రుడు క్రోధోద్దీపితమానసుడై సకలదేవసైన్యమును వెంటనిడుకొని బృందావనముపై

నాక్రమణ మొనరించెను. ఆకాశమందు మహేంద్రునియాజ్ఞచే మేఘసమూ నిహములు దట్టముగ నావరించెను. ఈయుత్పాతమును గాంచి దేవేంద్రుడు కోపించె ననిగ్రహించి నందుడు శ్రీహరిని స్మరించి ముకుళితహస్తుడై కణ్వశాఖ యందు వర్ణింపబడిన స్తోత్రముద్వారా శచీపతిని స్తుతింపదొడంగెను.

న ం దు డు ప లి కె ను :

ఇంద్రుడు, సురపతి, శక్రుడు, అదితిజుడు, పవనాగ్రజుడు, సహస్రాక్షుడు, భగాంగుడు, కశ్యపాత్మజుడు, బిడౌజుడు, శునాశీరుడు, మరుత్వానుడు, పాక శాసనుడు, జయంతజనకుడు, శ్రీమతుడు, శచీశుడు, దైత్యసూదనుడు, వజ్రహస్తుడు, కామసఖుడు, గౌతమీవ్రతనాశనుడు, వృత్రహుడు, వాసవుడు, దధీచిదేహభిక్షుకుడు, జిష్ణువు, వామనభ్రాత, పురుహూతుడు, పురందరుడు, దివస్పతి, శతమఖుడు, సుత్రాముడు, గోత్రభిదుడు, విభుడు, లేఖర్షభుడు, బలారాతి, జంభభేది, సురాశ్రయుడు, సంక్రందనుడు, దుశ్చ్యవనుడు, తురాషాట్టు, మేఘవాహనుడు, ఆఖండలుడు, హరిహయుడు, నముచిప్రాణనాశకుడు, వృద్ధశ్రవుడు వృషుడు, దైత్యదర్పనిషూదనుడు — అనునీనలుబదియాఱు నుకౌథుమీశాఖ యందు వర్ణింపబడిన యింద్రునినామములు. ఇవి పాపనాశకములు. ప్రతి దిన మీస్తోత్రమును బఠించుమానవుని ఇంద్రుడువజ్రధారియై సర్వకష్టములనుండి రక్షించును. నారదా! ఈస్తోత్రమును బఠింపబడు వానిగృహముపై వజ్రపాతము సంభవింపదు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను:

నందుడు డింద్రుని స్తుతించుట గాంచి మధుసూదనుడైన శ్రీకృష్ణుడు క్రుద్ధుడై బ్రహ్మతేజస్సుతో బ్రకాశించుచు తండ్రితో నిట్లుపలికెను. "తండ్రీ! నీ వెంతభీరువువు, నీ వెవరిని స్తుతించుచున్నావు? నేను నీచెంత నుండగ, ఇంద్రునివలన నీ కేమిభయముగలుగును? అర్ధక్షణములోనే నేను లీలాపూర్వకముగ నింద్రునితోపాటు సర్వదేవతలను భస్మముచేయగలను. గోవులను, గోవత్సములను, సర్వవ్రజవాసులను దోడ్కొని గోవర్ధనగిరిని సమీపింపుము." కుమారునియాజ్ఞానుసారముగ నందుడు సకలవ్రజవాసులతో గోవర్ధనగిరిని చేరెను. ఆ క్షణమందు మాయామానుషవేషధారియు, సర్వేశ్వరేశ్వరుడు,

పరబ్రహ్మమైన శ్రీకృష్ణుడు తనయెడమచేతి చిటికెనవ్రేలితో నా మహాగోవర్ధన పర్వతమును ఛత్రమువలె పైకియెత్తి పట్టుకొనెను. గోవర్ధనగిరికింద సకలవ్రజవాసులు గోసమూహములతో నాశ్రయమును పొందిరి. అధికారమదాంధుడు, త్రిలోకేశ్వరుడు నగు ఇంద్రుడు గోకులముపై నఖండముగ జలమును గురిపించెను. గోవర్ధనపర్వతముపై ఉల్కలను, పిడుగులను, రాళ్ళను గురిపించెను. కాని శ్రీకృష్ణు నాశ్రయించిన వ్రజవాసు లందఱు ఏ యుపాయమును బొందక సుఖముగ నుండిరి. మునీశ్వరా! అసమర్థపురుషుని యుద్యమమునువలె నింద్రుని ప్రయత్నము లన్నియు నిష్ఫలములైనవి. ఇంద్రు డత్యంతకోపావేశముతో వజ్రాయుధము చేబూని అస్త్రశస్త్రములను ధరించిన సకల దేవతలతో వ్రజవాసులను స్వయముగ శిక్షించుట కుద్యుక్తుడయ్యెను. కోపపూరితు డైనయింద్రుని గాంచి శ్రీకృష్ణుడు మందస్మితముఖారవిందుడై యింద్రసహితముగ సకలదేవతలను జృంభణాస్త్రముచే స్తంభింపజేసెను. తత్కాలమే తంద్రావశు డైనయింద్రునకు తంద్రలో సర్వజగత్తు శ్రీకృష్ణమయముగ గోచరించెను. ద్విభుజుడు, మురళీహస్తుడు, పీతాంబరధారియు, వనమాలావిభూషితుడు, చందనచర్చితుడు నగుశ్రీకృష్ణుని ఇంద్రుడు అణువణువునందు దర్శించెను. భక్తియుతుడై యింద్రుడు పూర్వకాలమందు తనగురువు ప్రసాదించిన శ్రీకృష్ణమహామంత్రమును జపించెను. అంతర్ముఖు డైన యింద్రునకు సహస్రదళయుక్తమగుహృదయకమలమం దఖండజ్యోతిః పుంజము దర్శన మొసంగెను. ఆ దివ్యతేజోరాశిమధ్యమున సచ్చిదానందవిగ్రహుడు అత్యంతమనోహరుడు, నూతనజలధర సదృశశ్యామసుందరు డైన శ్రీకృష్ణుడు దర్శనమొసంగెను. నేత్రోన్మీలన మొనరించిన యింద్రునకు లోపల, బయట, అంతట శ్రీకృష్ణదివ్యస్వరూపమే గోచరించెను. భక్తితో తలను వంచి హస్తములను ముకుళించి పులకితగాత్రుడై, ఆనందాశ్రులోచనభరితుడై నష్టగర్వితుడై వినమ్రుడై యింద్రుడు యోగీశ్వరేశ్వరు డైనశ్రీకృష్ణు నిట్లుస్తుతింప దొడంగెను.

ఇంద్ర ఉవాచ :

అక్షరం పరమం బ్రహ్మ జ్యోతిరూపం సనాతనమ్ ।
గుణాతీతం నిరాకారం స్వేచ్ఛామయమనన్తకమ్॥

భక్తధ్యానాయ సేవాయై నానారూపధరం వరమ్।
శుక్లరక్తపీతశ్యామం యుగానుక్రమేణ (ణేన) చ॥

శుక్లతేజం స్వరూపం చ సత్యే సత్యస్వరూపిణమ్।
త్రేతాయాం కుఙ్కుమాకారం జ్వలన్తం బ్రహ్మతేజసా॥

ద్వాపరే పీతవర్ణం చ శోభితం పీతవాససా।
కృష్ణవర్ణం కలౌ కృష్ణం పరిపూర్ణతమం ప్రభుమ్॥

నవధారాధరోత్కృష్ట శ్యామసున్దరవిగ్రహమ్।
నన్దైకనన్దనం వన్దే యశోదానన్దనం ప్రభుమ్॥

గోపికాచేతనహరం రాధాప్రాణాధికం పరమ్।
వినోదమురలీశబ్దం కుర్వన్తం కౌతుకేన చ॥

రూపేణాప్రతిమేనైవ రత్నభూషణభూషితమ్।
కన్దర్పకోటిసౌన్దర్యం బిభ్రన్తం శాన్తమీశ్వరమ్॥

క్రీడన్తం రాధయా సార్థం బృన్దారణ్యే చ కుత్రచిత్।
కుత్రచిన్నిర్జనేఽరణ్యే రాధావక్షః స్థలస్థితమ్॥

జలక్రీడాం ప్రకుర్వన్తం రాధయా సహ కుత్రచిత్।
రాధికాకబరీభారం కుర్వన్తం కుత్రచిద్ వనే॥

కుత్రచిద్రాధికాపాదే దత్తవన్తమలక్తకమ్।
రాధాచర్వితతామ్బూలం గృహ్ణన్తం కుత్రచిన్ముదా॥

పశ్యన్తం కుత్రచిద్రాధాం పశ్యన్తీం వక్రచక్షుషా।
దత్తవన్తం చ రాధాయై కృత్వా మాలాం చ కుత్రచిత్॥

కుత్రచిద్రాధయా సార్థం గచ్ఛన్తం రాసమణ్డలమ్।
రాధాదత్తాం గలే మాలాం ధృతవన్తం చ కుత్రచిత్॥

సార్ధం గోపాలికాభిశ్చ విహరన్తం చ కుత్రచిత్।
రాధాం గృహీత్వా గచ్ఛన్తం విహాయ తాం చ కుత్రచిత్॥

విప్రపత్నీదత్తమన్నం భుక్తవన్తం చ కుత్రచిత్।
భుక్తవన్తం తాలఫలం బాలకైః సహ కుత్రచిత్॥

వస్త్రం గోపాలికానాం చ హరన్తం కుత్రచిన్ముదా।
గవాఙ్గణం వ్యాహరన్తం కుత్రచిద్ బాలకైః సహ॥

కాలీయమూర్ధ్నిపాదాబ్జం దత్తవన్తం చ కుత్రచిత్।
వినోదమురలీశబ్దం కుర్వన్తం కుత్రచిన్ముదా॥

గాయన్తం రమ్యసంగీతం కుత్రచిద్బాలకైః సహ।
స్తుత్వా శక్రః స్తవేన్ద్రేణ ప్రణనామ హరిం భియా॥
పురా దత్తేన గురుణా రణే వృత్రాసురేణ చ।
కృష్ణేన దత్తం కృపయా బ్రహ్మణే చ తపస్యతే॥
ఏకాదశాక్షరో మన్త్రః కవచం సర్వలక్షణమ్।
దత్తమేతత్ కుమారాయ పుష్కరే బ్రహ్మణా పురా॥
కుమారోఽఙ్గిరసే దత్తో గురవేఽఙ్గిరసా మునే।
ఇదమిన్ద్రకృతం స్తోత్రం నిత్యం భక్త్వా చ యః పఠేత్॥
ఇహప్రాప్య దృఢాం భక్తిమన్తే దాస్యం లభేత్ ధ్రువమ్।
జన్మమృత్యుజరావ్యాధిశోకేభ్యోముచ్యతే నరః।
న హి పశ్యతి స్వప్నేఽపి యమదూతం యమాలయమ్॥ **176-196**

ఇంద్రుడు పలికెను:

అక్షరుడు, పరబ్రహ్మమునైనవాడు, జ్యోతిస్వరూపుడు, సనాతనుడు, గుణాతీతుడు, నిరాకారుడు, స్వేచ్ఛామయుడు, అనంతుడు, భక్తులధ్యానముకొఱకు సేవకొఱకు నానావిధరూపములను ధరించినవాడు, యుగముల ననుసరించి తెలుపు, ఎఱుపు, పచ్చని, నల్లనిరూపములను ధరించినవాడు, కృతయుగమున శుక్లతేజస్స్వరూపమును, సత్యస్వరూపములను ధరించినవాడు, త్రేతాయుగమున బ్రహ్మతేజస్సుతో ప్రజ్వరిల్లు కుంకుమవలె నెఱ్ఱనిరూపమును ధరించినవాడు, ద్వాపరయుగమున పీతవస్త్రముచే శోభిల్లు పీతవర్ణము కలవాడు, కలియుగమున కృష్ణవర్ణుడై కృష్ణనామమును ధరించినవాడు, పరిపూర్ణతముడు, నూతనజలధరమువలె శ్యామలవర్ణముకలవాడు, సుందర మైనవిగ్రహము కలవాడు, నందనందనుడు, యశోదానందనుడు నగుగోవిందునకు నమస్కరించుచున్నాను.

గోపికలమనస్సులను హరించినవాడు, రాధకు ప్రాణములకంటె నధికమైనవాడు, వరమైనవాడు, కుతూహలముతోను వినోదముగను మురళీనాదము చేయువాడు, సాటిలేనిరూపము కలవాడు, రత్నమయము లైనభూషణములచే భూషితుడు, అసంఖ్యమన్మథులసౌందర్యమును ధరించినవాడు, శాంతస్వరూపుడు నగుఈశ్వరునకు నమస్కరించుచున్నాను. బృందావనములో నొకచోట ఏకాంతస్థలములో రాధావక్షఃస్థలమునవిరాజిల్లుచున్నవాడు, ఒకచోట రాధతో జలక్రీడలాడుచున్నవాడు, ఆ వనములో నొకచోట రాధాదేవి కేశ

కలాపమును బంధించుచున్నవాడు, ఒకచోట రాధికాదేవి చరణములయందు లత్తుకను పూయుచున్నవాడు, ఒకచోట రాధాచర్వితతాంబూలమును ఆనందముగ స్వీకరించినవాడు, ఒకచోట క్రీగన్నులతో చూచుచున్న రాధాదేవిని స్వయముగ వీక్షించుచున్నవాడు, ఒకచోట పుష్పమాలను నిర్మించి రాధకు అర్పించువాడు, ఒకచోట రాధతో రాసమండలమునకు బోవుచున్నవాడు, ఒకచోట రాధసమర్పించిన పుష్పమాలను కంఠమునందు ధరించువాడు, ఒకచోట గోపాంగనలతో విహరించువాడు, ఒకచోట రాధను వెంటతీసికొని వెడలి ఒకచోట ఆమెను కూడవీడిపోవువాడు, ఒకచోట విప్రపత్న్నులొసంగిన మిష్టాన్నములను భుజించువాడు, ఒకచోట బాలురతోగూడి తాటిపండ్లను భుజించువాడు, ఒకచోట ఆనందపూర్వకముగ గోపకిశోరికల మనస్సులను హరించువాడు, ఒకచోట గోపబాలకులతో దూరకముగ పోయిన గోసమూహములను ఎలుగెత్తి పిలచువాడు, ఒకచోట కాళీముని మస్తకముపై తనచరకమలములనుంచువాడు, ఒకచోట మోదముతో ఆనందవినోదియై మురళీగానమొనరించువాడు. ఒకచోట గోపబాలకులతో మధురగీతములను పాడువాడు నగుశ్రీకృష్ణపరమాత్మకు నేను ప్రణామము లనర్పించుచున్నాను.

ఇట్లు అనేకవిధముల స్తుతించి ఇంద్రుడు శ్రీహరిచరణారవిందములను శరణుజొచ్చెను. పూర్వకాలమందు వృత్రాసురునితో యుద మొనరించుచున్న సమయమున దేవగురు డైనబృహస్పతి విజయార్థ మిందునకీస్తోత్రము నుపదేశించెను, సర్వప్రథమున శ్రీకృష్ణపరమాత్మ తపస్వి యైనబ్రహ్మకు కృపాపూర్వకముగ నేకాదశాక్షరమంత్రమును, సర్వలక్షణ సమన్విత మైనకవచమును ఈ స్తోత్రమును ప్రసాదించెను. తదనాంతరము బ్రహ్మ పుష్కరమందు కుమారునకు. కుమారుడు, ఆంగీరసునకు, ఆంగీరసుడు బృహస్పతికి ఈస్తోత్రమునే నుపదేశించెను. ఇంద్రకృత మగునీస్తోత్రమును ప్రతిదినము భక్తిపూర్వకముగ పఠించువా రిహలోకమందు శ్రీహరిసుదృఢభక్తి పొంది యత్యంతకాలమందు నిశ్చయముగ ఆయనదాస్యసౌభాగ్యమును బొందగలరు. ఆ భక్తులు జన్మమృత్యుజరావ్యాదిశోకములనుండి విముక్తులై స్వప్నమునందుకూడ యమదూతనినుకాని, యమలోకమునుగాని దర్శింపరు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా ! ఇంద్రునిస్తోత్రము నాలకించి లక్ష్మీనివాసు డత్యంత ప్రసన్నుడై వానికి ప్రేమపూర్వకముగ నభీష్టవరములను ప్రసాదించెను. ఇంద్రుడు శ్రీకృష్ణున కనేకప్రణామము లర్పించి సకలదేవతలతోఁగూడి స్వర్గమునకు మరలిపోయెను. వ్రజవాసు లందఱు శ్రీకృష్ణుని యనుజ్ఞగైకొని నందనగరము జేరిరి. తదనంతరము పరమాత్మ గోవర్ధనపర్వతమును యథాస్థలమునం దుంచి గృహము జేరెను. సకలవ్రజవాసులు శ్రీకృష్ణుడే పరిపూర్ణుడైనపరమాత్మ యని తెలిసికొనిరి. మాయామానుష వేషధారి యైనశ్రీకృష్ణుని దర్శించిన నందుని సర్వాంగములు పులకించెను. ఆనందాశ్రుపూర్ణనయనుడై నందుడు తనకుమారుడైనకృష్ణపరమాత్మ నిట్లు స్తుతింపదొడంగెను.

## నం ద కృ త శ్రీ కృ ష్ణ స్తో త్ర ము

నం ద ఉ వా చ :

నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిన్దాయ నమో నమః ॥

నమో బ్రహ్మణ్యదేవాయ బ్రహ్మణే పరమాత్మనే ॥
అనన్తకోటిబ్రహ్మణ్డధామధామ్నే నమోఽస్తు తే ।
నమో మత్స్యాదిరూపాణాం జీవరూపాయ సాక్షిణే ।
నిర్లిప్తాయ నిర్గుణాయ నిరాకారాయ తే నమః ।
అతిసూక్ష్మస్వరూపాయ స్థూలాత్ స్థూలతమాయ చ ।
సర్వేశ్వరాయ సర్వాయ తేజోరూపాయ తే నమః ॥

అతిసూక్ష్మస్వరూపాయ ధ్యానాసాధ్యాయ యోగినామ్।
బ్రహ్మవిష్ణుమహేశానాం వన్ద్యాయ నిత్యరూపిణే॥
ధామ్నే చతుర్ణాం వర్ణానాం యుగేష్వేవ చతుర్షు చ ।
శుక్లరక్తపీతశ్యామాభిధానగుణశాలినే॥
యోగినే యోగరూపాయ గురవే యోగినామపి।
సిద్ధేశ్వరాయ సిద్ధాయ సిద్ధానాం గురవే నమః ॥
యం స్తోతుమక్షమో బ్రహ్మా విష్ణుర్యం స్తోతుమక్షమః।
యం స్తోతుమక్షమో రుద్రః శేషో యం స్తోతుమక్షమః॥

యం స్తోతుమక్షమో ధర్మో యం స్తోతుమక్షమో రవిః।
యం స్తోతుమక్షమో అమ్భోధరశ్చాపి షడాననః॥

యం స్తోతుమక్షమాః సర్వే మునయః సనకాదయః।
కపిలో న క్షమః స్తోతుం సిద్ధేన్ద్రాణాం గురోర్గురుః॥

న శక్తౌ స్తవనం కర్తుం దరనారాయణావృషీ।
అన్యే జడధియః కే వా స్తోత్రం శక్తాః పరాత్పరమ్॥

వేదా న శక్తా నో వాణీ న చ లక్ష్మీః సరస్వతీ।
నరాధా స్తవనే శక్తా కింస్తువన్తి విపశ్చితః॥

క్షమస్వ నిఖిలం బ్రహ్మన్నపరాధం క్షణే క్షణే।
రక్ష మాం కరుణాసిన్ధో దీనబన్ధో భవార్ణవే॥

పురా తీర్థే తపస్తప్త్వా పుత్రః ప్రాప్తః సనాతనః।
స్వకీయచరణామ్భోజే భక్తిం దాస్యం చ దేహి మే॥

బ్రహ్మత్వమమరత్వం వా సాలోక్యాదికమేవ వా।
త్వత్పాదామ్భోజదాస్యస్య కలాం నార్హన్తి షోడశీమ్॥

ఇన్ద్రత్వం వా సురత్వం వా సమ్ప్రాప్తిం సిద్ధిస్వర్గయోః।
రాజత్వం చిరజీవత్వం సుధియో గణయన్తి కిమ్॥

ఏతద్యత్ కథితం సర్వం బ్రహ్మత్వాదికమీశ్వరమ్।
భక్తసఙ్గక్షణార్ధస్య నోపమా తే కిమర్హతి॥

త్వద్భక్తో యస్త్వత్ సదృశః కస్త్వాం తర్కితుమీశ్వరః।
క్షణార్ధాలాపమాత్రేణ పారం కర్తుం స చేశ్వరః॥

భక్తసఙ్గాద్భవత్యేవ భక్తిం కర్తుమనేకధా।
త్వద్భక్తజలదాలాపజలసేకన వర్ధతే॥

అభక్తాలాపతాపాత్తు శుష్కతాం యాతి తత్క్షణమ్।
తద్గుణస్మృతిసేకాచ్చ వర్ధతే తత్క్షణో స్ఫుటమ్॥

త్వద్భక్త్యఙ్కురమద్భూతం స్ఫీతం మానసజం పరమ్।
న నశ్యం వర్ధనీయం చ నిత్యం నిత్యం క్షణే క్షణే॥

తతః సమ్ప్రాప్య బ్రహ్మత్వం భక్తస్య జీవనాయ చ।
దదాత్యేవ ఫలం తస్మై హరిదాస్యమనుత్తమమ్॥

సమ్ప్రాప్య దుర్లభం దాస్యం యది దాసో బభూవ హ।
సునిశ్చయేన తేనైవ జితం సర్వం భయాదికమ్॥

ఇత్యేవముక్త్వా భక్త్యాయ ననన్దస్తౌహరేః పురః ।
ప్రసన్నవదనః కృష్ణో దదౌ తస్మై తదీప్సితమ్ ॥
ఏవం నన్దకృతం స్తోత్రం నిత్యం భక్త్యా చ యః పఠేత్ ।
సుదృఢాం భక్తిమాప్నోతి సద్యో దాస్యం లభేద్ధరేః॥
తప స్తప్త్వా ద్రోణ స్తీర్థే చ ధరాయ సహ।
స్తోత్రం తస్మై పురా దత్తం బ్రహ్మణా తత్ సుదుర్లభమ్॥
హరేః షడక్షరో మన్త్రః కవచం సర్వరక్షణమ్ ।
ఇహ సౌభరిణా దత్తం తస్మై తుష్టేన పుష్కరే॥
తదేవ కవచం స్తోత్రం స చ మన్త్రః సుదుర్లభః ।
బ్రహ్మణోంఽశేన మునినా నన్దాయ చ తపస్యతే॥
మన్త్రః స్తోత్రం చ కవచమిష్టదేవో గురు స్తథా।
యా యస్య విద్యా ప్రాచీనా న తాం త్యజతి నిశ్చితమ్॥
ఇత్యేవం కథితం స్తోత్రం శ్రీకృష్ణాఖ్యాన మద్భుతమ్।
సుఖదం మోక్షదం సారం భవబన్ధవిమోచనమ్ ॥ 200-227

బ్రహ్మణహితకారి, గోబ్రాహ్మణులహితైషి, జగద్ధితకాంక్షి, సచ్చిదానందమయుడు నగుగోవిందునకు నమస్కారము

బ్రాహ్మణులకు ప్రియమొనర్చువాడవు, బ్రహ్మస్వరూపుడవు, అనంత కోటిబ్రహ్మాండములకు నిలయమైనవాడవు, మత్స్యాదిరూపములకు జీవుడవు సాక్షివి నైనవాడవు, నిర్లిప్తుడవు, నిరాకారుడవు, అతిసూక్ష్మస్వరూపుడవు. స్థూలములకంటె స్థూలతముడవు, సర్వేశ్వరుడవు, సర్వరూపుడవు, యోగుల ధ్యానమున కసాధ్యుడవు, బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులకు వంద్యుడవు, నిత్యస్వరూపుడవు, నాలుగుయుగములలో నాలుగువర్ణముల నాశ్రయించువాడవు, యుగక్రమమునుబట్టి శుక్లరక్తపీతశ్యామలము లనుగుణములచే శోభిల్లువాడవు, యోగివి, యోగరూపుడవు, యోగులకుగూడ గురువైనవాడవు, సిద్ధేశ్వరుడవు, సిద్ధుడవు, సిద్ధులకు గురువైనవాడవు అగునీకు నమస్కారము.

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, ఆదిశేషుడు, ధర్మదేవుడు, లంబోదరుడు, షడాననుడు, సనకాదిమునులు, గురువులకు గురు వగుకపిలుడు, నరనారాయణ ఋషులు, మున్నగువారికిగూడ స్తుతింపనలవికానివాడవు వగునిన్ను జడబుద్ధి యగుయేప్రాణి యైనను స్తుతింపగలదా ! వేదములు, వాక్కులు, లక్ష్మి

సరస్వతి, రాధకూడ నిన్ను స్తుతింపజాలరు, అట్టినిన్ను విద్వాంసు లగునితర పురుషు లెట్లుస్తుతింపగలరు. మహాత్మా! క్షణక్షణము అపరాధము నొన రించుచున్న నన్ను క్షమింపుము. కరుణానిధీ! దీనబాంధవా! భవసాగరమున బడియున్న నన్ను రక్షింపుము. పూర్వకాలమున తీర్థస్థలమున తపస్సుచేసి సనాతనపురుషుడ వగునిన్ను పుత్రరూపమున బొందితిని, నీచరణకమలముల యందు నాకు భక్తిని దాస్యమును నొసంగుము. బ్రహ్మత్వము అమరత్వము, సాలోక్యము మున్నగునాలుగువిధము లగుమోక్షములు నీచరణకమలదాస్య భక్తియందలి పదునారవకళకుగూడ సాటిరావు; ఇక యింద్రపదము, దేవ పదము, సిద్ధిప్రాప్తి, సర్వప్రాప్తి, రాజపదము, చిరంజీవిత్వము ననునవి విద్వాంసుల కేలెక్కలోనికి వచ్చును!

ఈశ్వరా! పైనచెప్పబడినబ్రహ్మత్వాది పదవులన్నియు నీభక్తునితోడి అర్థక్షణకాలప్రాప్తసాంగత్యమునకైనను సరిరావు. నీభక్తుడుకూడ నీసమానుడే యగును. ఇకనీమహత్వము నెవ రూహింపగలరు! నీభక్తునితో అర్ధ క్షణకాలము సంభాషించినను ఏమానవుడైన భవసాగరమును దాటగలడు. నీభక్తులసాంగత్యముచే భక్తిసంబంధించినవివిధాంకురములు అవశ్యముగ నుత్పన్నములగును. నీభక్తు లనెడిమేఘములచే నొనరింపబడిన వార్తాలాపము లనెడుజలములవర్షముచే తడుపబడి భక్త్యంకురము వృద్ధిపొందును. భగ వద్భక్తులు కానిమానవుల సంభాషణ యనుతాపముచె నయ్యంకుర మాక్షణ మందే యెండిపోవును. భక్తుల గుణములను భగవానుని గుణములను స్మరించుట యనుజలములచే తడుపబడిన పిమ్మట క్షణములో నది స్పష్టముగ వృద్ధిపొంద నారంభించును. మనసులో నుత్పన్న మైననీభక్తి యనెడు యంకురము ప్రకటమై చక్కగ వృద్ధిచెందునపుడు అది యేవిధముగను నశింపదు. దాని నెల్లప్పుడు ప్రతిక్షణము పెంపొందించుచునే యుండవలెను. పిమ్మట ఆ భక్తు నకు బ్రహ్మపదవినిచ్చినను వానిజీవనమునకై భగవానుడు వానికి తప్పక ఉత్తమ మగుదాస్య మనుఫలమును ప్రసాదించును. దుర్లభ మగుదాస్యభావ మును బొంది భగవద్దాసు డైనమానవుడు సమస్తభయములను తప్పక గెలుచును.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

ఇట్లుస్తుతించి నందుడు శ్రీకృష్ణునియెదుట భక్తిసమన్వితుడై నిలువ

బడెను. ప్రసన్నుడైనపరమాత్మ ఆయనకు మనోవాంఛితఫలములను ప్రసాదించెను. భక్తిభావముతో నీనందకృతస్తోత్రమును ప్రతిదినము పఠించువారు శ్రీహరియందు దృఢభక్తిదాస్యసౌభాగ్యములను బొందగలరు. పూర్వకాలమందు ద్రోణు డనువసువు తనభార్య యైనధరాదేవితోగూడి తీర్థస్థానమందు ఘోరతప మాచరించెను. వారితపమునకు ప్రసన్నుడై బ్రహ్మ వారికి శ్రీహరి షడక్షరమంత్రమును, సర్వరక్షణకవచమును, ఈ స్తోత్రమును ప్రసాదించెను. బ్రహ్మకు సౌరభముని పుష్కరక్షేత్రమం దీస్తోత్రకవచాదుల నుపదేశించెను. ఆకవచస్తోత్రాదులనే గర్గమహర్షి బ్రహ్మనుండి గ్రహించి నందున కొసఁగెను. పూర్వజన్మమం దీకవచస్తోత్రముల నవలంబించినమనుష్యు డెన్నిజన్మములలోనైన విని స్మృతిని గల్గియుండును. నారదమహర్షీ! ఇట్లు సుఖప్రదమైన, మోక్షప్రదమైన, సర్వసాధనసారభూతమైన, భవబంధవిమోచనమైన శ్రీకృష్ణదివ్యలీలాద్భుతాఖ్యానమును వర్ణించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున ఇంద్రయాగభంజన
నందస్తోత్రప్రస్తావన మను
ఇరువదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

# ఇరువదిరెండవ అధ్యాయము

## ధేనుకాసుర సంహారము

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదమహర్షీ! ఒకదినమున రాధికానాథుడు బలరామసహితు లగు గోపకుమారులను దోడ్కొని విహారార్థమై బాగుగ పండినతాటిపండ్లతోనిండి పూర్ణమైయున్న తాళవనమును ప్రవేశించెను. ఆవనమును ఖరస్వరూపు

దైనధేనుకు డనురాక్షసశ్రేష్ఠుడు రక్షించుచుండెను. వాడు కోటిసింహబల
సమన్వితుడు, పర్వతాకారుడు, దేవతలదర్పమునే మడియించినజట్టి. వాని
నయనములు కూపములవలె నుండును. పదునైనకోరలతో గూడియున్న వాని
నోరు సర్వతగుహవంటిది. పదిహస్తములపొడవైన వానిజిహ్వ యతిభయం
కరము. వానియట్టహాసము లత్యంతభయంకరములు, నాభి కాసారసదృశము.

పండ్లతో నిండియున్న యాతాళవనమును గాంచిన గోపకుమారుల
నోరూరెను, కాని వనరక్షకుడైనభయంకరధేనుకాసురుని గాంచి గోప
కుమారులు శ్రీకృష్ణు నిట్లు ప్రార్థించిరి.

కృష్ణా ! కరుణాసింధూ ! దీనబాంధవా ! నీవుసంపూర్ణ జగములకు
పాలకుడవు, మహాబలి యగుబలరామునిసహోదరుడవు, సమస్త బలవంతులందు
శ్రేష్ఠుడవు ప్రభూ ! అర్థక్షణకాలము మాప్రార్థనలనాలకించుము. భక్త
వత్సలా ! నీభక్తుల మైనమాకు ఆకలిగ నున్నది, మాయెదుటస్వాదిష్టము లైన
తాళఫలములు కలవు, దేవా ! వానిపై దృష్టిని సారింపుము. ఈఫలములను
త్రుంచుటకు మేముతాళవృక్షమూలములను బట్టుకొని యూపవలెననితలంచు
చున్నాము. ఆజ్ఞనిచ్చినచో మేము నిర్భయులమై వనమును ప్రవేశించెదము.
కానియీవనమందు మహాబలవంతుడు గార్దభరూపుడునైనధేనుకాసురుడు నివ
సించుచుడున్నా, వానిని దేవతలే జయింపలేకపోయిరి. వాడు మహాబల
పరాక్రమసంపన్నుడు, కంసునిసచివుడు, సమస్తప్రాణులనుహింసించువాడు, ఈ
తాళవనమునకు రక్షకుడు.

బాలకులప్రార్థనల నాలకించి శ్రీకృష్ణుడు నే నుండగ క్షుద్రదైత్యుని
వలన మీకేమిభయము ! నిర్భయులై వనమును ప్రవేశించి ఫలముల
నారగింపు డనియనుజ్ఞనొసంగెను. శ్రీకృష్ణునియాజ్ఞ లభింపగనే మహాబల
వంతులైనగోపబాలకులు నిర్భయముగ వనమున ప్రవేశించి వృక్షముల నధి
రోహించి పరిపక్వఫలములను త్రుంచి తనివిదీరయారగింప దొడంగిరి. వారు
క్రీడించుచు, గంతులు వేయుచు అట్టహాసము లొనరించుచు తాళవృక్షములను
ఊపదొడంగిరి ఈకోలాహలమును గాంచి దైత్యశిరోమణి యగు ధేనుకాసురుడు
గోపబాలకులను సంహరించుటకు బయలుదేరెను. భయంకరముగ నట్టహాసము
లొనరించుచు తమ్ముసమీపించుచున్న భయంకరదైత్యుని గాంచి గోపబాలకులు
భయభీతులై కృష్ణుని రక్షింపు మనిప్రార్థింపదొడంగిరి.

గోపబాలా ఊచుః

అస్మాన్ రక్ష సమాగచ్ఛ హే కృష్ణ కరుణానిధే।
హే సంకర్షణ నో రక్ష ప్రాణా నో యాన్తి దానవాత్॥
హే కృష్ణ హేకృష్ణ హరే మురారే గోవిన్ద దామోదర దీనబన్ధో।
గోపీశ గోపేశ భవార్ణవేఽస్మాననన్త నారాయణ రక్షరక్ష॥
భయేఽభయే వాథ శుభేఽశుభే వా సుఖేషు దుఃఖేషు దీననాథా।
త్వయా వినాన్యం శరణం భవార్ణవే న నోఽస్తి హే మాధవ రక్షరక్ష॥
జయ జయ గుణసిన్ధో కృష్ణభక్తైకబన్ధోబహుతరభయయుక్తాన్ బాలకాన్ రక్ష రక్ష
జహి దనుజకులానామీశమస్మా కమన్తం సురకులబాలదర్పం వర్ధయేమం నిహత్య॥ 21-24

"హేకరుణానిధీ! కృష్ణా! జగత్పతీ! రమ్ము, రమ్ము. సంకర్షణా! దానవునిబారినుండి మాప్రాణములను రక్షింపుము. కృష్ణా! కృష్ణా! హరే మురారీ! గోవిందా! దామోదరా! గోపేశా! గోపీశా! అనంతా, నారాయణా! రక్షింపుము, రక్షింపుము. దీననాథా! భయాభయములందు, శుభాశుభములందు, సుఖదుఃఖములందు నీవుదక్క మాకు శరణము ప్రసాదించువారు మఱియెవరును లేరు. మాధవా! భవసాగరమందు మమ్ము రక్షింపుము, రక్షింపుము. గుణసాగరా! శ్రీకృష్ణా! నీవు భక్తుల కేకైకబంధువుడవు, మే మత్యంతభయభీతులమైనాము, మమ్మురక్షింపుము, రక్షింపుము. ఈదానవేశ్వరుడు మాకు మృత్యువై మమ్ము సమీపించుచున్నాడు. వీనిని వధించి దేవతల బలదర్పములను పెంపొందింపుము". కరుణాభరితమైన గోపబాలకుల ప్రార్థనను విని భక్తవత్సలుడైనమాధవుడు బలరామసహితుడై బాలకులచెంత కరుదెంచి మందస్మితముఖారవిందుడై "భయపడవల"దని వారి కభయ మొసంగెను.

బలరామకృష్ణులను దర్శింపగనే గోపబాలకుల భయము తొలగి పోయెను. వా రత్యంతహర్షయుక్తులై నృత్యింపదొడంగిరి. భయంకరాకారుడై యరుదెంచు ధేనుకాసురుని గాంచి మందహాసముచేయుచు శ్రీకృష్ణపరమాత్మ బలరామునితో ఇట్లుపల్కెను. "సోదరా! ఈ దైత్యుడు మహాబలసంపన్నుడైనబలిచక్రవర్తికుమారుడు, వీని నామధేయము సాహసికుడు పూర్వకాల

మందు దూర్వాసమహర్షి శాపమునకు గురియై సాహసికు డీజన్మమందు గార్ధభరూపధారియై రక్కసు డైనాడు. నేను వీనిని వధించి గోపబాలకులను రక్షించెదను, గావున నీవు వీరిని తోడ్కొని దూరముగ వెడలిపొమ్ము." శ్రీకృష్ణుని యాజ్ఞానుసారముగ బలరాముడు గోపకుమారులతో గూడి దూరముగ నిలువబడెను.

మహాపరాక్రమవంతు డైనదానవేశ్వరుడు బాలకృష్ణుని జూడగానే రోషపూర్వకముగ పర్వతగుహవంటి తనవిశాలమైన నోటితో గోవిందుని మ్రింగివైచెను. ప్రజ్వలితాగ్నిశిఖవంటి శ్రీకృష్ణునియఖండబ్రహ్మతేజ మసురుని మర్మస్థానముల నన్నింటిని మాడ్చివైచెను. దానవుడు తత్క్షణమే కృష్ణుని బయటకు క్రక్కివైచెను. భగవంతుని తేజమువలన మరణాసన్ను డైన యాదైత్యుడు సచ్చిదానందవిగ్రహుని యెదుట గాంచి మోహితు డయ్యెను. శ్రీకృష్ణునిదర్శనమాత్రముననే వానికి పూర్వజన్మజ్ఞానము కల్గి తా నెవ్వరో, శ్రీకృష్ణు డెవ్వరో గ్రహించెను. అఖండతేజస్వరూపు డైనశ్రీకృష్ణుని గాంచి ఆదానవాగ్రణి యిట్లుస్తుతింపదొడంగెను.

ధే ను కా సు ర ఉ వా చ :

వామనోఽసి త్వమంశేన మత్పితుర్యజ్ఞ భిక్షుకః ।
రాజ్యహర్తా చ శ్రీహర్తా సుతలస్థలదాయక ॥
బలిభక్తివశో వీరః సర్వేశో భక్తవత్సలః ।
శీఘ్రం త్వం హింస మాం పాపం శాపాద్గార్ధభరూపిణమ్॥
మునేర్దుర్వాససః శాపాదీదృశం జన్మ కుత్సితమ్ ।
మృత్యురుక్తశ్చ మునినా త్వత్తో మమ జగత్పతే॥
షోడశారేణ చక్రేణ సుతీక్ష్ణేనాతి తేజసా।
జహి మాం జగతాం నాథ సద్భక్తిం కురు మోక్షద ॥
త్వమంశేన వరాహశ్చ సముద్ధర్తుం వసున్ధరామ్ ।
వేదానాం రక్షితా నాథ హిరణ్యాక్ష్యనిషూదనః ॥
త్వం నృసింహః స్వయం పూర్ణో హిరణ్యకశిపోర్వధే।
ప్రహ్లాదానుగ్రహార్థాయ దేవానాం రక్షణాయ చ॥
త్వం చ వేదోద్ధారకర్తా మీనాంశేన దయానిధే।
నృపపశ్చ జ్ఞానదానాయ రక్షాయై సురవిప్రయోః॥

శేషాధారశ్చ కూర్మ స్త్వమంశేన సృష్టిహేతవే।
విశ్వాధారశ్చ శేష స్త్వమంశేనాపి సహ సద్రిధృత్॥
రామో దాశరథి స్త్వం చ జానక్యుద్ధారహేతవే।
దశకన్ధరహన్తా చ సిన్ధౌ సేతువిధాయకః॥
కలయా పరశురామశ్చ జమదగ్నిసుతో మహాన్।
త్రిస్స ప్తకృత్వో భూపానాం నిహన్తా జగతీపతే॥
అంశేన జ్ఞానినాం శ్రేష్ఠౌ నరనారాయణావృషీ।
త్వం చ ధర్మసుతో భూత్వా లోకవిస్తారకారకః॥
అధునా కృష్ణరూప స్త్వం పరిపూర్ణతమః స్వయమ్।
సర్వేషామవతారాణాం జీవరూపః సనాతనః॥
యశోదా జీవనో నిత్యో నన్దైకానన్దవర్ధనః।
ప్రాణాధిదేవో గోపీనాం రాధాప్రాణాధికః ప్రియః॥
వసుదేవసుతః శాన్తో దేవకీదుఃఖభంజనః।
అయోనిసమ్భవః శ్రీమాన్ పృథివీభారహారకః॥
పూతనాయై మాతృగతిం ప్రదాతా చ కృపానిధిః।
బకకేశిప్రలమ్బానాం మమాపి మోక్షకారకః॥
స్వేచ్ఛామయ గుణాతీత భక్తానాం భయభంజన।
ప్రసీద రాధికానాథ ప్రసీద కురు మోక్షణమ్॥
హే నాథ గార్ధభియోనేః సముద్ధర భవార్ణవాత్।
మూర్ఖ స్త్వద్భ క్తపుత్రోఽహం మాముద్ధర్తుం త్వమర్హసి॥
వేదా బ్రహ్మాదయో యం చ మునీన్ద్రాశ్శ్తోతుమక్షమాః।
కిం స్తౌమి తం గుణాతీతం పురా దైత్యోఽధునా ఖరః॥
ఏవం కురు కృపాసిన్ధో యేన మే న భవేజ్జనుః।
దృష్ట్వా పాదారవిన్దం తే కః పునర్భవనం వ్రజేత్॥
బ్రహ్మస్తోతా ఖరఃస్తోతా నోపహాసితుమర్హసి।
తదీశ్వరస్య విజ్ఞస్య యోగ్యాయోగ్యే సమా కృపా॥
ఇత్యేవ ముక్త్వా దైత్యేన్ద్ర స్తస్థౌ చ పురతో హరేః।
ప్రసన్నవదనః శ్రీమానతితుష్టో బభూవ హ॥
ఇదం దైత్యకృతం స్తోత్రం నిత్యం భక్త్యా చ యః పఠేత్।
సాలోక్యసార్ష్టిసామీప్యం లీలయా లభతే హరేః॥

ఇహ లోకే హరేర్భక్తిమన్తే దాస్యం సుదుర్లభమ్।
విద్యాం శ్రియం సుకవితాం పుత్రపౌత్రాన్ యశో లభేత్॥ 37-60

## ధేనుకాసురుని స్తోత్రము

ప్రభూ! నీవు నీయంశచే వామనావతారుడవై నాతండ్రియజ్ఞశాలయందు యాచకుడవై అరుదెంచి మొదట మారాజ్యమును లక్ష్మిని హరించితివి. మరల బలిచక్రవర్తియనన్యభక్తికి వశుడవై మాకందఱకు సుతలలోకమందు స్థానమును ప్రసాదించితివి. మహావీరా! సర్వేశ్వరా! భక్తవత్సలా! నేను మహాపాపిని, శాపవశమున గార్ధభమైతిని. నీవు శీఘ్రముగ నన్ను సంహరింపుము. దుర్వాసమహర్షి శాపమువలన నాకిట్టిహీనజన్మము సంభవించెను. జగత్పతీ! నామృత్యువు నీవలననే సంభవించుననియామహర్షి వరమును ప్రసాదించెను, గావున యత్యంత తేజస్వియైన, తీక్ష్ణమైన, షోడశకోణయుక్తమైన చక్రాయుధముచే నన్ను వధించి, నా కుత్తమగతిని ప్రసాదింపుము. నీవే వసుంధర నుద్ధరించుటకు అంశతో వరాహరూపుడవై యావిర్భవించితివి. నాథా! నీవే వేదములను రక్షించుటకు హిరణ్యాక్షుని వధించితివి. పూర్ణపరమాత్మవై ననీవు హిరణ్యకశిపుని వధించుటకు స్వయముగ నృసింహరూపుడవై యవతరించి ప్రహ్లాదుని, వేదములను రక్షించితివి. దేవతలను, బ్రాహ్మణులను రక్షించుటకొఱకు, వేదముల నుద్ధరించుటకొఱకు అంశతో మత్స్యావతారమును ధరించి, దయానిధివై మనుచక్రవర్తికి యఖండజ్ఞానము నుపదేశించితివి. నీయంశచే సృష్టికొఱకు కాదిశేషున కాధారభూతుమైనమహాకూర్మరూపుడవై యవతరించితివి. సహస్రలోచనా నీవే అంశతో ఆదిశేషునిరూపమున నవతరించి, సర్వవిశ్వభారమును వహించియున్నావు. దేవా! నీవే జనకనందిని యైనసీతాదేవి నుద్ధరించుటకు, దశకంఠరుని సంహరించుటకు, దశరథనందను డైనశ్రీరాముడవై యవతరించితివి. అయ్యవతారకాలమున సముద్రముపై సేతువును బంధించి దశముఖు డైనరావణుని వధించితివి. పృథ్వీనాథా! నీకళచే నీవుజమదగ్నినందను డైనపరశురాముడవై యవతరించి ఇరువదియొక్కపర్యాయములు పృథ్విని క్షత్రియశూన్య మొనరించితివి. దేవాదిదేవా! నీవే స్వాంశచే సిద్ధులకుగురు వైనకపిలమహర్షివై యవతరించి, తల్లికి జ్ఞానమును ప్రపాదించి సాంఖ్యయోగశాస్త్రమును ప్రవచించితివి. నీవే స్వాంశచే ధర్మమునకు నరనారాయణఋషిపుంగవులరూపమున యావిర్భ

వించి లోకములందు ధర్మమును విస్తారమొనరించితివి. ఈసమయమున నీవు స్వయముగ సర్వావతారసనాతనబీజస్వరూప మైనపరిపూర్ణ పరమాత్మయగు శ్రీకృష్ణునిగ అవతరించితివి. నీవే యశోదకుజీవనము, నందునకానంద వర్ధనమునై యున్నావు. నిత్యస్వరూపుడవు, గోపికలకు ప్రాణనాథుడవు, శ్రీరాధకు ప్రాణాధికప్రియతముడవు. వసుదేవకుమారా! శాంతస్వరూపా! దేవకీ దుఃఖనివారణా! నీ వయోనిజుడవై యవతరించితివి. నీవు పృథ్వీభారమును తొలగించుటకే యవతరించినకృపానిధివి. నీవు పూతనకు మాతృసమానగతిని ప్రసాదించితివి. దేవా! బకునకు, కేశికి, ప్రలంబాసురునకు నాకు నీవే మోక్షమును ప్రసాదింపగలవు.

స్వేచ్ఛామయా! గుణాతీతా! భక్తభయభంజనా! రాధికానాథా! ప్రసన్నుడవు కమ్ము, కరుణతో న న్నుద్ధరింపుము. నాథా! నన్ను భవసాగర మునుండి ఈనీచగార్దభయోనినుండి రక్షింపుము. నేను మూర్ఖుడనైనను నీభక్తుని పుత్రుడను. కావున నన్ను శీఘ్రముగ నుద్ధరింపుము. వేదములు, బ్రహ్మాది దేవతలు, మునీంద్రులు నిన్ను స్తుతింపజాలరు. అట్టిగుణాతీతుడవు పరమేశ్వరుడవు నగునిన్ను నావంటి యధమపురుషు డెట్లుస్తుతింపగలడు? నేను మొదట దైత్యుడను, ఈ సమయమున గార్దభరూపుడనైతిని. కరుణాసాగరా! నాకు జన్మరాహిత్యమును ప్రసాదింపుము, నీ చరణారవిందములు దర్శించిన పిదప ఎవరు మరల జన్మించి యీ సంసారచక్రమందు తగుల్కొనగలరు? బ్రహ్మచే స్తుతింపబడు నిన్ను నేడొక గార్దభముస్తుతించుటకు ప్రయత్నించు చున్నది. సచ్చిదానందస్వరూపుడవుగావున నీవు యోగ్యులపై, అయోగ్యులపై సమముగ కృపను వర్షింతువుగాన నా యీ మూర్ఖత్వమును గాంచి పరిహ సింపకుము.

ఇట్లుస్తుతించి దైత్యరాజైన ధేనుకాసురుడు శ్రీహరియెదుట నతమస్త కుడై నిలువబడెను. దైత్యునిచే స్తుతింపబడిన యీస్తోత్రమును ప్రతిదినము పఠించువారు అనాయాసముగ శ్రీహరిలోకమును, సామీప్యసార్ష్ట్యాదిమోక్ష ములను పొందగలరు. వారిహలోకమందు శ్రీహరిభక్తులై, విద్యావంతులై, శ్రీమంతులై, ఉత్తమకవులై యశోవంతులై పుత్రపౌత్రవంతులై సుఖించి యంత్యకాలమున శ్రీహరిదాస్యసౌభాగ్యములను బొందగలరు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

దైత్యేశ్వరు డొనరించిన భక్తియుక్తమైనప్రార్థనలను విని ప్రసన్నుడైనశ్రీకృష్ణుడు శరణాగతు డైనభక్తు నెట్లు వధింపగల నని మనమునందు శంకించెను. అది గమనించి జన్మరాహిత్యముకోరు ధేనుకాసురుడు విరోధము వలననే హరిని సాధింపవలె ననియెంచిమరల యుద్ధమునకై సంసిద్ధుడయ్యెను. తత్క్షణమే శ్రీకృష్ణుడు ప్రజ్జ్వలితదివ్యకాంతియుక్తమైన,షోడశకోణ సుదర్శనచక్రముచే నాదైత్యుని శిరమును ఖండించివైచెను. శరీరమునుండి శిరము విడివడగా ఆ దైత్యుడు రణరంగమున బడెను. వానిమృతశరీరమునుండి వందలాదిసూర్యుల కాంతితోసమానమైన మహాతేజఃపుంజము బయల్వెడలి శ్రీకృష్ణుని చరణారవిందములందు లీనమయ్యెను. అహో! విరోధించి భగవంతునికృపకు పాత్రుడై దానవరాజు మోక్షమును బొందగల్గెను.

ఆసమయమున గగనమందు నిలువబడి శ్రీకృష్ణధేనుకాసురసంగ్రామమును దిలకించుచున్న దేవతలు అత్యంతహర్షయుక్తులై పారిజాతపుష్పములను వర్షించి, దుందుభులను, ఆనకములను ప్రమోగించిరి. అప్సరసలు నృత్యమొనరింపగ గంధర్వులు మధురగానముల నాలపించిరి. మహర్షులు దేవాదిదేవుని యనేకవిధముల స్తుతించిరి. అసురుడు మడియుట గాంచి గోపబాలకులు శ్రీకృష్ణునిసమీపమున కేతెంచి, బలరామసహితముగ ననేకవిధముల పురుషోత్తముని బ్రస్తుతించిరి. తదనంతరము వారు నిర్భయముగ వనమందు బ్రవేశించి పక్వఫలములను ద్రుంచి బలరామకృష్ణులకు కొన్ని సమర్పించి మిగిలినవాని నారగించి ప్రసన్నులై, బాల్యక్రీడ లొనరించి. బలరామకృష్ణులు సాయంసమయ మగుటగాంచి గోపబాలురతోగూడి స్వస్థలము జేరిరి.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున ధేనుకాసురవధ యను
నిరువదిరెండవ అధ్యాయము
స ం పూ ర్ణ ము.

—o—

# ఇరువదిమూడవ అధ్యాయము

## ధేనుకాసురుని పూర్వజన్మవృత్తాంతము

నారదుడు పలికెను:

దేవా! ఏపాపాచారణఫలితముగ బలినందను డైనసాహసికుడు గార్ధభయోనియందు జన్మించెను? ఏయపరాధమునకై కోపించి మహర్షి దైత్యరాజును శపించెను? నాథా! ఏయనన్యపుణ్యప్రభావమువలన ఆదానవేశ్వరుడు శ్రీకృష్ణునిచేతిలో మరణించి మోక్షము పొందగల్గెను. సకల సందేహభంజనా మహర్షీ! ఈవిషయముల నన్నింటిని విస్తారపూర్వకముగ వర్ణించి నాసందేహములను నివారింపుము.

శ్రీనారాయణఋషి పలికెను:

వత్సా, నారదా ఈప్రాచీనేతిహాసమును సవిస్తరముగ వర్ణించెద నవధరింపుము. ఈచరిత్రను నేను గంధమాదనపర్వతముపై ధర్మదేవుని ముఖారవిందమునుండి శ్రవణ మొనరించితిని. ఈవిచిత్రమనోహరవృత్తాంతము పాద్మకల్పమందు సంభవించెను. శ్రీనారాయణునిదివ్యకథతో యుక్తమైయున్న కారణమున ఈచరితము కర్ణముల కమృతప్రాయముకాగలదు. పాద్మకల్పమందీసంఘటన జరుగుసమయమున బ్రహ్మశాపగ్రస్తుడవైననీవు ఉపబర్హణుడనుగంధర్వరాజువై జన్మించితివి. ఆ జన్మలో నీ వేబదిగంధర్వకాంతలకు పతివై శృంగారక్రీడల నొనరించుచు బ్రహ్మవరమువలన నత్యంతశ్రావ్యమైన కంఠముకలవాడవై గంధర్వరాజశ్రేష్ఠుడవై విరాజిల్లితివి. పిమ్మట దాసీపుత్రుడవై జన్మించిననీవు వైష్ణవులను సేవించి వారిప్రసాదమును భుజించి మరల దేవర్షివైతివి.

ఒకదినమున బలికుమారుడైనసాహసికుడు దేవతల నోడించి గంధమాదన పర్వతప్రాంతముగుండా పయనించుచుండెను. అత డత్యంతసౌందర్యశాలి. ఆ సమయమున ఆ ప్రదేశముననే విహరించుచున్న అప్సరస యగు తిలోత్తమ రత్నవిభూషణభూషితుడైన, చందనచర్చితుడైన, పరమసుందరా

కారు డైనసాహసికుని గాంచి మోహించెను. కులటలయాచరణములు దోష పూరితములుగనే యుండును. సాహసికుడుకూడ తిలోత్తమయొక్క అనుపమ సౌందర్యమున కాకర్షితుడయ్యెను. వారిద్దరు పరస్పరరాగాసక్తులై గంధ మాధనపర్వతమందుగల రమణీయములైన ఏకాంతప్రదేశములందు యథేచ్ఛగ విహారము లొనరించిరి. దైవవశమున ఆ ప్రదేశమునందే దుర్వాసమహర్షి యోగాసనాసీనుడై శ్రీకృష్ణుని చరణారవిందముల చింతనయందు సంలగ్నుడై యుండెను. కామప్రభావమునకు వశులైనతిలోత్తమా సాహసికులు ధ్యాన మగ్నుడైనమహర్షిని గాంచక ఆయనసామీప్యముననే లజ్జావిహీనులై శృంగారక్రీడలను ప్రారంభించిరి. ఈపాపాచరణప్రభావముచే మహర్షిధ్యానము భంగముకాగా తనసమక్షమున నొనరింపబడుచున్న దుష్కృత్యమును గాంచి కోపావేశపూరితుడై దుర్వాసు డిట్లువారిని శపించెను. "గార్దభమువలె లజ్జా విహీనుడవైన దైత్యాధమా! లెమ్ము. భక్తశిరోమణి యగుబలిచక్రవర్తి కుమారుడవైననీ వేలయిట్లు పశువువలె ప్రవర్తించుచున్నావు! దేవతలు, మనుష్యులు, దైత్యులు, గంధర్వులు, రాక్షసులు మొదలగువారు శృంగార సమయములందు లజ్జ ననుభవింతురు. పశువులుదక్క అన్యజాతులు మైథున కార్యమందు లజ్జవహించి యుందురు. విశేషముగ గార్దభజాతిమాత్రము లజ్జా విహీనముగనే ప్రవర్తించును. కావున నీవు గార్దభమువై జన్మింపుము. తిలోత్తమా! కులటలు వాస్తవముగ లజ్జారహితలే, దైత్యునియెడల నీ కత్యం తాసక్తికలదు. కావున నీవు దానవస్త్రీవై జన్మింపగలవు."

మహర్షిపలుకుల నాలకించి తిలోత్తమాసాహసికు లత్యంతలజ్జాభావ ముతో క్రుంగి తత్క్షణమే లేచి నిలువబడి తా మొనరించిన నీచకృత్యమునకు పశ్చాత్తప్తహృదయులై దుర్వాసమహర్షి నిట్లుస్తుతింపదొడంగిరి.

సా హ సి కు డు ప లి కె ను :

మునీశ్వరా! నీవే బ్రహ్మవు, నారాయణుడవు, మహేశ్వరుడవు. నీవే అగ్నివి, సూర్యుడవు, జగములను సృష్టించి పాలించి సంహరించుటలో సమర్థుడవు. అజ్ఞానినై నే నొనరించినయపరాధమును క్షమింపుము. మహాత్మా! ఈశ్వరా! కృపానిధీ! కరుణతో నీమూఢుని క్షమింపుము.

అనిపలికి దైత్యరాజత్యంతదుఃఖితుడై మహర్షిచరణములపై బడి రోదింపదొడంగెను. తదనంతరము తిలోత్తమ మహర్షి ననేకవిధముల స్తుతించి ఆయనచరణముల నాశ్రయించెను. వీరిర్వురు పశ్చాత్తప్తులైనారనిగ్రహించి. దుర్వాసమహర్షి వారి నిట్లనుగ్రహించెను.

దుర్వాసమహర్షి పలికెను ;

దానవా ! నీ పుత్రమకులోద్భవుడవు, విష్ణుభక్తుడైనబలిచక్రవర్తి కుమారుడవు; వత్సా ! నీవు గార్ధభమై జన్మించినను భగవంతుని దర్శించి మోక్షమును నిశ్చయముగ బొందగలవు. సత్పురుషులు పూర్వజన్మములందొనరించినశ్రీకృష్ణారాధన మహిమమై మరల లభింపగలదు. ఆభక్తి సౌభాగ్య మెన్నటికిని నశింపదు. హరిభక్తుడవైననీవు ధేనుకాసురుడవై జన్మించి వరాహకల్పములో బృందావనముచెంత తాళవనముధ్యమున శ్రీకృష్ణుని దర్శించి సుదర్శనచక్రమునలన మరణించి గార్ధభశరీరమును త్యజించి మోక్షమును పొందగలవు. తిలోత్తమా నీవు భారతవర్షమందు బాణాసురునకు ఉషనామముతో జన్మించి శ్రీకృష్ణునిపౌత్రుడైన అనిరుద్ధునిఅలింగనప్రాప్తివలన పరిశుద్ధురాలవై మరల స్వర్గలోకము జేరగలవు. మహర్షియాదేశాను సారముగ వారిర్వురు జన్మలను ధరించి తదనంతరము శాపవిముక్తులైరి. సాహసికుడు తనపూర్వజన్మపుణ్యమువలన మోక్షగామి యయ్యెను. తిలోత్తమ మరల స్వర్గము జేరెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములో నారదనారాయణ
సంవాదమున తిలోత్తమాబలి పుత్రులను
దుర్వాసమహర్షి శపించుట యను
ఇరువదిమూడవ అధ్యాయము
సంపూర్ణము

# ఇరువదినాల్గవ అధ్యాయము

## కన్దళీ దూర్వాసుల పరిణయము

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదమహర్షీ! దుర్వాసమహర్షి శివాంశసంభూతుడు. అయ్యూర్ధ్వరేతసు డైనసర్వసంగపరిత్యాగికి గూడ స్త్రీసంయోగము సంప్రాప్తించెను. దుర్వాసమహర్షి యొక్క యీ గూఢచరితము వర్ణించెద నవధరింపుము. తిలోత్తమాసాహసికులశృంగారమును గాంచిన జితేంద్రియు డైనదుర్వాస మహర్షి మనసులో కామభావ మంకురించెను. అసత్పురుషుల సాంగత్యమువలన వారిదోషములు వీరియందు ప్రవేశింపగలవు. ఆ సమయముననే గంధమాదన ప్రాంతమునకు ఔర్వమహర్షివర్యుడు తనపుత్రికతో దుర్వాసమహర్షి కడ కరుదెంచెను. ఆ మునివర్యుడు తనకుమార్తె పరిణయ మొనరింపవలె నని దూర్వాసునికడ కేతెంచెను. పూర్వకాలమందు తపఃపరాయణు డైనబ్రహ్మ ఊరువునుండి యూర్ధ్వరేతాసుడైనయోగీంద్రు డుదయించెను. అందువలన ఆయననామధేయము ఔర్వు డయ్యెను. ఆ మహర్షి జానువునుండి యొకకన్య యుద్భవించినది, ఆమెనామధేయమే కన్దలి; ఆమె దూర్వాసుని తనభర్తగ నిర్ణయించుకొని అన్యపురుషులను బరిణయ మాడుటకు తిరస్కరించెను. కావున తనపుత్రిక మనోరథమును సఫలీకృత మొనరించుటకొరకు ఔర్వమహర్షి పుత్రికాసహితుడై దుర్వాసమహర్షి యాశ్రమమును జేరెను.

తనయెదుట సాక్షాత్కరించిన ఔర్వుని గాంచి దుర్వాసమహర్షి లేచి నిలువబడి నమస్కరించి యాహ్వానించెను. ఔర్వమహర్షి దుర్వాసుని ఆలింగనము చేసికొని తనపుత్రిక మనోరథము నిట్లుప్రస్తావించెను. "మునీశ్వరా! యౌవనవతి యైననాకుమారిత యగుకన్దలి సందేశవాహకు లొనరించిన నీ ప్రశంసల నాలకించి నిన్నే భర్తగ పొందవలె నని నిర్ణయించుకొనెను. ఈ త్రిలోకసౌందర్యవతి అయోనిజ, సకలసద్గుణసంపన్న కాని యీమెయం దొక దోషము కలదు, కలహకారిణి, క్రోధపూర్వకముగ కటువచనములను బలుక గలదు. కాని మహర్షీ! సర్వసదుణసంపన్న యైనయీకన్యను గేవల మొక దుర్గుణమువలన ద్యజించుట భావ్యము కాదు."

జౌర్వమహర్షి వాక్కు విని దుర్వాసునకు హర్షము, శోకము రెండును కల్గెను. ఆమెగుణములవలన హర్షము, దుర్గుణములవలన శోకము సంభవించెను. తనయెదుట అత్యంతరూపగుణసంపన్న యైనకన్దలిని గాంచి వ్యథితహృదయుడై దుర్వాసుడు జౌర్వమహర్షి కిట్లు ప్రత్యుత్తర మొసంగెను. నారీరూపము త్రిభువనములలోను ముక్తిమార్గనిరోధకము, తపస్సులందు వ్యవధానము, మోహమునకేకైకకారణము ఆస్త్రీ. సంసార మనెడు కారాగారమం దత్యంతభారయుక్తమైనసంకెలలవంటిది, ఆభారమును వహించుటత్యంత దుష్కరము. శంకరాదిమహాపురుషులుకూడ జ్ఞాన మనెడు ఖడ్గముచే నారి యనుసంకెలలను ఖండింపలేకపోయిరి. నారి నీడకంటె నధికముగ వెంటనంటి వచ్చునట్టిది. కర్మభోగములకంటెను, ఇంద్రియములకంటెను, విద్యాబుద్ధులకంటెను అధికముగ స్త్రీ బంధింపగలదు. ఛాయ శరీరమున్నంతవరకే వెంట నంటియుండగలదు. భోగము లనుభవింపనిదే సమాప్తములుకావు. దేహము, ఇంద్రియములు జీవితపర్యంతము వెంట నుండగలవు. విద్యాబుద్ధులననుశీలన మొనరించునంతవరకే వెంటనుండగలవు. కాని సుందరస్త్రీ జన్మజన్మములందు మనుష్యుని బంధనముల పాలుచేయగలదు. జీవుడు దేహమును ధరించియుండు నపుడు వానికి భోగములు సుఖదాయకములుగ గోచరింపగలవు. కాని మహర్షీ! అన్నింటికంటె నధికసుఖప్రదాయకము శ్రీహరిచరణారవిందములసేవయే. శ్రీకృష్ణునిధ్యానమందు నిమగ్నుడనై యున్ననాకు నాపూర్వజన్మకర్మదోషము వలన ఈ తపోవిఘ్నము సంప్రాప్తించెను. మహర్షీ! మీరు కోరినటుల ఈకన్యను నాభార్యగా స్వీకరింపగలను, గాని ఈమె గావించు దుర్భావములను నూటింటి వరకు మాత్రమే భరింపగలను. కన్దలి నన్ను అంతకంటె నధికముగ దుర్భాషలాడి నొప్పించిన నేను ఆ పాపఫలము నామెకు తత్క్షణమే ప్రసాదింపగలను. స్త్రీయొక్క పరుషవాక్కులను విని యుపేక్షించియుండుట పురుషునినిందనీయమైనవిషయము. స్త్రీచే జయింపబడినవాడు త్రిలోకములందుగల పురుషులలో నత్యంతనిందనీయుడగును. దుర్వాసమహర్షి యంగీకారము విని ఔర్వముని అత్యంతప్రసన్నుడై వేదోక్తవిధిని దుర్వాసకన్దలీవివాహము నొనరించెను. మమకారవశుడై మహర్షి కుమార్తెను వీడలేక శోకగ్రస్తుడై ఆమెతో నీతియుక్తము లైనవచనముల నిట్లుపల్కెను.

**శౌర్వ ఉవాచ :**

శృణు వత్సే ప్రవక్ష్యామి నీతిసారం సుదుర్లభమ్ ।
హితం సత్యం చ వేదోక్తం పరిణామసుఖావహమ్ ॥

స్వకాన్తశ్చ పరో ఽన్ధురిహలోకే పరత్ర చ ।
న హి కాన్తాత్ పరః ప్రేయాన్ కులస్త్రీణాం పరో గురుః॥

దేవపూజావ్రతం దానం తపశ్చానశనం జపః।
స్నానం చ సర్వతీర్థేషు దీక్షా సర్వమఖేషు చ ॥

ప్రాదక్షిణ్యం పృథివ్యాశ్చ బ్రహ్మణాతిథిసేవనమ్ ।
సర్వాణి పతిసేవాయాః కలాం నార్హన్తి షోడశీమ్॥

కిమేతైః పతిభక్తాయా అభక్తాయాశ్చ భారతే ।
యదా దుఃఖీ శుభారమ్భే సాకాంక్షః ప్రథమో భవేత్ ॥

పతిసేవా పరో ధర్మః సర్వశాస్త్రేషు పఠ్యతే।
స్వప్రజానేన సతతం కాన్తం నారాయణాధికమ్॥

దృష్ట్వా తచ్చరణామ్భోజం సేవాం నిత్యం కరిష్యతి॥
పరిహాసేన కోపేన భ్రమేణావజ్ఞయా సుతే ।
కటూక్తిం స్వామినః సాక్షాత్ పరోక్షాన్న కరిష్యతి ॥

స్త్రియో వాగ్యోనిదుష్టాయాః కామతో భారతే భువి ।
ప్రాయశ్చిత్తం శ్రుతౌ నాస్తి నరకం బ్రహ్మణః శతమ్ ॥

సర్వధర్మపరీతా యా కటూక్తిం కురుతే పతిమ్ ।
శతజన్మకృతం పుణ్యం తస్యా నశ్యతి నిశ్చితమ్॥ 33-41

కుమారీ ! నేను నీతియుక్తములు, దుర్లభసారతత్త్వములు, హితకరములు, సత్యవేదప్రతిపాదితములు, పరిణామమందు సుఖప్రదములు నగునీతివచనముల నుప దేశించెద నవధరింపుము. స్త్రీకి తనభర్త, యిహలోకమందు, పరలోకమందు నందరికంటె శ్రేష్ఠు డైనబంధు వని గ్రహింపుము. కులస్త్రీలకు భర్తకంటె నధికప్రియులు మఱియొక రుండరు, పతియే వారికి సద్గురుడు. దేవపూజలు, వ్రతములు, తపోపవాసములు, జపములు, సంపూర్ణతీర్థస్నానములు, సర్వ యజ్ఞదీక్షలు, పృథ్వీపరిక్రమణములు, బ్రాహ్మణాతిథిసేవలు అన్నియు పతిసేవల యందు పదునాఱవంయశకైనను సమానములు కావు. సర్వశాస్త్రములందు

స్త్రీలకు పతిసేవయే పరమధర్మమని ప్రవచింపబడెను. పతివ్రతకే యుపస్యా క్త పుణ్యకర్మము లొనరింపవలసిన పనిలేదు. భర్తనునారాయణునికంటే నధికునిగ నెంచి ఆయనచరణకమలములను సేవింపుము. పరిహాసవశముననగాని, క్రోధము వలనగాని, భ్రమవలనగాని, సమక్షమందుగాని, రోక్షమందుగాని, పరిహాసముగ గాని దుర్భాషలాడుకుము. భారతవర్షమందు స్వేచ్ఛానుసారముగ భర్తను దుర్భాషలాడుస్త్రీలకు దురాచారప్రవృత్తులైనస్త్రీలకు ప్రాయశ్చితమే లేదని శ్రుతివచనము కలదు. అట్టివారు నూఱుకల్పముల పర్యంతము నరక మనుభ వింపవలెను. స్త్రీ సమస్తధర్మములచే సంపన్నురాలైనను భర్తను కటువచన ములచే బాధించిన యామె నూఱుజన్మములందు సమార్జించుకొనిన పుణ్య మంతయు క్షణములో నిశ్చయముగ నశింపగలదు.

ఇట్లుపుత్రిక కనేకపతివ్రతాధర్మములను బోధించి ఔర్వమహర్షి స్వస్థల మునకు వెడలిపోయెను. కర్మవశమున జితేంద్రియుడైనదుర్వాసుడు తప మునువీడి గృహస్థధర్మమును స్వీకరించెను. కానియయ్యానందమైనను ఆయనకు పూర్ణముగ లభింపలేదు. ప్రతిదినము కన్దలి సహజస్వభావమువలన దుర్భాష లాడుచు భర్తమనము నొప్పించుచుండెను. ఆహా ! ఎన్నిసద్గుణము లున్నను ఒక్కదుర్గుణము దేహధారియొక్కసుకృతములను నాశ మొనరింపగలదుగదా ! ఎన్నియుపదేశముల నొసర్చినను దుష్టురాలైనకన్దలిమనస్సుమారదయ్యె, కటువచనముల నామె పరిత్యజింపదయ్యె. అనతికాలములోనే ఆమె నూఱు పర్యాయములకంటె నధికముగనే దుర్భాషలతో తనభర్తమనస్సు నొప్పించెను. భార్యదుష్కృత్యముల కత్యంతక్రోధావేశపూరితుడై మహర్షి భస్మము గమ్మని ఆమెను శపించెను. మహర్షిసంకల్పమాత్రముననే కన్దలి అగ్నిజ్వాలలకు బలియై భస్మరాశిగ మారిపోయెను. శరీరము గతించిన పిదప ఆత్మప్రతిబింబ రూపముగుజీవుడు గగనమందుండి దుర్వాసమహర్షితో నిట్లుపల్కెను.

జీవుడు పలికెను :

నాథా ! నీవు జ్ఞానదృష్టిచే సర్వమును దర్శింపగలవు. నీవు సర్వజ్ఞుడవు. మధురవచనములు, ఉత్తమవచనములు, దుష్టవచనములు, క్రోధసంతాపలోభ మోహకామములు, క్షుత్పిపాసలు, స్థూలత్వకృశత్వములు, నాశము, దృశ్యము,

అదృశ్యము జన్మించుట మొదలగుగుణములు శరీరధర్మములు. కానియవి జీవధర్మములుగాని ఆత్మధర్మములుగాని కావు.

సత్త్వరజస్తమోగుణములచే మానవశరీరము నిర్మింపబడెను. మానవ శరీరము లనేకవిధములు. త్రిగుణములు సమముగ గల్గియున్న శరీరము లేదు. ఒక శరీరమందు సత్త్వగుణ మధికముగనున్న మఱియొక శరీరమందురజోగుణ తమోగుణములధికముగనుండగలవు. శరీరమందు సత్త్వగుణ మధికముగనున్న జీవునకు మోక్షముపై ప్రగాఢమగు వాంఛ జాగృత మగును, రజోగుణ ప్రాధాన్యముచే మనోవాంఛితకర్మాచరణమందు వాంఛ ప్రబలముకాగలదు. తమోగుణప్రకోపమందు జీవహింస, క్రోధము, అహంకారము మున్నగు దుర్గుణ ములు ప్రాదుర్భవింపగలవు. క్రోధమువలన నిశ్చయముగ దేహధారి కటువచన ములను బలుకగలడు, ఈ దుర్భావములవలన శత్రుత్వము సంభవించును, శత్రు త్వమువలన మానవులు పరస్పరము ప్రియులు కాగలరు. లేనిచో నీభూమిపై నెవరెవరికి శత్రువులు ప్రియులు అప్రియులు మిత్రులు కాగలరు! మిత్రశత్రు భావనకు కేవలము ఇంద్రియములే బీజము. స్త్రీలకు భర్తయే ప్రాణాధిక ప్రియుడు, సత్పురుషున కర్ధాంగియే ప్రాణప్రియ. దుర్వచనముల కారణమున క్షణములోనే మనయిర్వురిమధ్య శత్రుత్వము ప్రబలినది. ప్రభూ! జరిగినదేదో జరిగినది. కృపతో మీరీ జీవు డొనరించిన యపరాధములను క్షమింపుడు. ప్రస్తుతము నాకర్తవ్యమును మీరే యాదే శింపుడు. త్రిలోకములందు మీకుదక్క నే నన్యులకు భార్యగా జన్మింపను. నాజన్మ మేప్రదేశమున సంభవించునో, కృపతో దెలుపవలసినదిగ ప్రార్థించు చున్నాను.

'కన్దలి' జీవాత్మపలకిన వాక్కుల నాలకించి దుర్వాసమహర్షి మోహ వశుడై యత్యంతదుఃఖతుడయ్యెను. ఆహా! స్త్రీవ్యామోహ మెంతబలవత్త రము, స్వాత్మారాముడు, మహాజ్ఞానియైనను దుర్వాసమహర్షి భార్యావిరహ మును భరింపలేక మూర్ఛనొందెను. మరల సచేతనుడై దుర్వాసుడు యోగాసనాసీనుడై యోగముద్వారా శరీరమును త్యజించుటకు సంసిద్ధు డయ్యెను. ఆసమయముననే దుర్వాసాశ్రమమునకు దివ్యప్రభాసమన్వితుడైన యొకబ్రాహ్మణబాలకు డరుదెంచెను. ఒకహస్తమందు దండము, మఱియొక హస్తమందు ఛత్రము, శ్రీఅంగములం దరుణవస్త్రమును ధరించియుండెను.

బ్రహ్మతేజముచే జాజ్జ్వల్యమానముగ ప్రకాశించు ఆబాలుని యంగకాంతి శ్యామలవర్ణము. అవస్థయందుపసివాడైనను ఆతడు పరమశాంతుడై చూపరులకు మహాజ్ఞానివలె వేదవేదాంగవిదునివలె గన్పడుచుండెను. అఖండతేజోసమన్వితుడైనయాదివ్యబాలకుని గాంచి దుర్వాసుడు దిగ్గునలేచి ప్రణామములర్పించి అర్ఘ్యాద్యములను సమర్పించి ఉచితాసన మొసంగెను. బ్రాహ్మణవటువు మహర్షి నాశీర్వదించి యిట్లుపలుకనారంభించెను. ఆదివ్యతేజోమయుని దర్శనమున, ఆశీర్వాదమువలన దుర్వాసునిసర్వదుఃఖములు నశించెను.

బ్రాహ్మణ బాలకుడు పలికెను :

సర్వజ్ఞా ! విప్రశ్రేష్ఠా ! గురుమంత్రప్రసాదమువలన నీకు సర్వము విదితమైనను పామరునివలె నేలదుఃఖించెదవు. బ్రాహ్మణులపరమధర్మము తపమనినీకు తెలియనిదికాదు. తపఃశక్తిచే త్రిలోకములను వశ మందుంచుకొనవచ్చును. మునీశ్వరా ! ఈసమయమున నీస్వధర్మమైనతపమును వీడి యేల పత్నీవ్యామోహమునకు బాల్పడుచున్నావు ? త్రిభువనములం దెవరెవరికి పత్ని ? ఎవ రెవరికిపతి ? శ్రీహరి మాయామోహితులై మూర్ఖజీవులవినోదము కొఱకే యీ సంబంధములను సృష్టించును. ఈకన్దలి నీకుమిథ్యాపత్ని, అందువలననే క్షణములో నిన్ను వీడెను. సత్య మెప్పుడును తిరోహితముకాదు, అది నిత్యము. మిథ్య యనగ చిరకాలముండనిది. వసుదేవకుమారియు, శ్రీకృష్ణుని సహోదరియు, పార్వతియంశచే ప్రాదుర్భవించినదియు సుశీలయుచిరంజీవియు నగు నేకానాంశ ప్రతికల్పమందు నీకు సహధర్మచారిణి కాగలదు. కావున నీ వంతవఱకు శ్రీహరితపమందు సంలగ్నుడవుకమ్ము. కన్దలి యీకల్పాంతమందే శుభప్రదమై యత్యంతసౌందర్యమై, శాంతవతియై మరల నీ యర్ధాంగియై సంతానవతి కాగలదు. ప్రస్తుతము కన్దలి ధరణీతలముపై కన్దలిజాతియై యావిర్భవింపగలదు.

అత్యుచ్ఛ్రితస్య దమనముచితం చ శ్రుతౌ శ్రుతమ్ ॥ 85

"అత్యంత ముచ్ఛృంఖలముగ ప్రవర్తించుస్త్రీని దండించుట అనుచితము గానిశ్రుతులందు ప్రవచింపబడెను" కావున కన్దలి భస్మమైనందులకు నీవుశోకింపబనిలేదు. ఇట్లు అత్యుత్తమమగు నాధ్యాత్మికజ్ఞానమును బ్రాహ్మణబాలకరూపధారి యైనజనార్దనుడు దుర్వాసునకు ప్రసాదించి యంతర్హితుడయ్యెను.

దుర్వాసమహర్షి సర్వభ్రమలను వీడి సందేహరహితుడై శ్రీహరితపమం దేకాగ్రచిత్తముతో నిమగ్ను డయ్యెను. కదలి ధరాతలముపై కదలిజాతి యైనది. మునీశ్వరా! దైత్యు డైనసాహసికుడు బృందావనసమీపమున గల తాళవనమునకు జని ధేనుకాసురుడయ్యెను. తిలోత్తమ యథాసమయమున బాణాసురునికుమార్తెగ జన్మించెను. తదనంతరము శ్రీకృష్ణచక్రముచే గార్ధభ శరీరమును త్యజించిన దైత్యరాజైన సాహసికుడు గోవిందుని చరణారవింద ములను పొందెను. ఆ సౌభాగ్యముమహర్షుల కైన నసాధ్యమే. తిలోత్తమ కూడ బాణాసురునకు ఉషానామమున జన్మించి శ్రీకృష్ణపౌత్రు డైయనిరుద్ధుని ఆలింగనమువలన సఫలమనోరథయై సమయానుసారముగ మరల స్వర్గమునకు జేరెను. నాతండ్రి ముఖారవిందమునుండి శ్రవణ మొనరించిన శ్రీకృష్ణదివ్య లీలాప్రసంగమును నీకు వివరించితిని.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములో నారదనారాయణ
సంవాదమున బలిపుత్రు డగుసాహసికుని
మోక్షణమను ఇరువదినాల్గవ అధ్యాయము
సంపూర్ణము.

—o—

# ఇరువదియైదవ అధ్యాయము

## అంబరీషోపాఖ్యానము

నారదుడు పలికెను:

శ్రీహరి మంగళచరితములు పరమాద్భుతములు. విశేషముగ మీదివ్య ముఖారవిందమునుండి శ్రవణమొనరించిన హరిలీలలు సుమనోహరములుగ నుండగలవు. పుత్రిక మరణించుట తెలిసికొనిన ఔర్వమహర్షి దుర్వాసు నేమని శపించెను?

శ్రీ నారాయణ ఋషి పలికెను:

మునీశ్వరా! సరస్వతీతటముపై తప మాచరించుచున్న ఔర్వమహర్షి ధ్యానముద్వారమున తనప్రియపుత్రిక యగుకన్దలి మరణవృత్తాంతము తెలిసికొని అత్యంతశోకహృదయుడై తక్షణమే మనోవేగమున దూర్వాసాశ్రమమును జేరెను. దుర్వాసమహర్షి మునీశ్వరుని సాదరముగ ఆహ్వానించి జరిగిన దుర్ఘటనపై తనవిచారమును వ్యక్తపఱచెను. ఔర్వమునీశ్వరుడు దుర్వాసునిపై కోపించి రక్తపంకజలోచనుడై కంపించుసర్వముతో నిట్లు శపించెను. "దుర్వాసా! అత్యంతస్వల్పాపరాధమునకు నీవు నాప్రియపుత్రికకు దుర్భర మగుశిక్షనువిధించితివి. నీ వామెను భస్మ మొనరింపక కేవలము త్యజించిన నా కీనాడు పుత్రికావియోగము సంభవించెడిది కాదు. నిగ్రహానుగ్రహసమర్థుడ వనిగర్వించునీకు నిశ్చయముగ పరాభవము సంభవింపగలదు" ఇట్లుశపించి ఔర్వమహర్షి నిజాశ్రమమునకు మరలిపోయెను.

నారదుడు పలికెను:

దేవా! దుర్వాసమహర్షి సాక్షాత్తుగ శంకరునియంశ. అట్టివాడు యే మహాతేజస్వి యైన పురుషునివలన పరాభవింపబడెను?

శ్రీ నారాయణ ఋషి పలికెను:

నారదా! సూర్యవంశమం దంబరీషు డనుప్రసిద్ధిగాంచినరాజాధిరాజు కలడు. ఆచక్రవర్తిమనస్సు శ్రీకృష్ణచరణారవిందములచింతనయందే సంలగ్నమైయుండును. రాజ్యమందుగాని, రాణులందుగాని, పుత్రపౌత్రులందుగాని, పుణ్యకర్మార్జితములైనసంపత్తులందుగాని, భోగములందుగాని ఆహరిభక్తుని మనస్సు లిప్తముకాదు. పరమధర్మాత్ముడై నయానరేశ్వరుడు అహర్నిశము ప్రసన్నతాపూర్వకముగ శ్రీహరిధ్యానమందే సంలగ్నుడై యుండును. జితేంద్రియుడు శాంతస్వరూపుడైనయంబరీషచక్రవర్తి సదా పుణ్యైకాదశీవ్రతము నియమముదప్పక అనుష్ఠానమొనరించుచు సర్వదా సర్వకర్మలను శ్రీకృష్ణార్పణముగ నొరించుచు కర్మలయందు ప్రద్దులిడుగాక జీవించెను.

కోటిసూర్యసమానతేజోభాసమైన, షోడశకోణయుక్తమైన బ్రహ్మాది దేవతలచేస్తుతింపబడు దివ్యసుదర్శనచక్రమును శ్రీహరి తనభక్తుడైనయంబ

రీషుని రక్షించుటకు నియమించెను. ఒకయేకాదశీదినమున అంబరీషుడు ఏకాదశీవ్రతానుష్ఠాన మొనరించి, ద్వాదశినాడు సమయానుసారముగ, విధి పూర్వకముగ స్నానపూజాదులను నిర్వర్తించి, బ్రాహ్మణులకు స్వాదిష్టభోజన ముల నొసంగి స్వయముగ భుజించుట కుద్యుక్తుడయ్యెను. ఆసమయ మున మహాతపస్వి యగుదుర్వాసమహర్షి క్షుధావ్యాకులుడై శిష్య సమేతముగ నంబరీషునియంతఃపురమున కేతెంచెను. మునీంద్రుని దర్శింపగనే అంబరీషుడు భక్తిసమన్వితుడై సాష్టాంగదండ ప్రణామము లర్పించి అర్ఘ్యపాద్యాద్యుపచారముల నర్పించి గౌరవించి ఆజ్ఞను సెలవిమ్మని ప్రార్థించెను. అందులకు దుర్వాసు డిట్లుపల్కెను. "నృపశ్రేష్ఠా! నే నాకలిగొనియున్నాను, కావున భోజనము నొసంగి నాయాకలి దీర్పుము. కాని నేను అఘమర్షణమంత్రము జపించి శీఘ్రముగ మరలివచ్చెదను. కావున నీ వొకక్షణము నాకై ప్రతీక్షింపుము" అనిపలికి మానివర్యుడు వెడలి పోయెను.

ఎంతకాలముగడచినను మహర్షి తిరిగిరాడాయె. అంబరీషుడు ద్వాదశి ఘడియలు పరిపూర్ణములగుచున్న వనిచింతింపదొడంగెను. తనగురుదేవుడైన వశిష్ఠమహర్షిని అంబరీషు డిట్లుప్రశ్నించెను. "గురుదేవా! దుర్వాస మహర్షి యింతవఱకు తిరిగిరాలేదు. ద్వాదశీతిథికాలము సమాప్తమగుచున్నది. ఇట్టి సంకటసమయమందు నా కర్తవ్యమును మీరే బాగుగ నాలోచించి నిర్ణయింపవలసినదిగ ప్రార్థించుచున్నాను." అంబరీషుని ప్రార్థనల నాలకించి వశిష్ఠమహర్షి యిట్లుప్రత్యుత్తర మొసంగెను. "రాజాధిరాజా! ద్వాదశితిథి సమాప్తమైనపిమ్మట త్రయోదశికాలమందు వ్రతపారాయణ మొనరించుట యత్యంతపాపము. అతిథికంటె ముందుగనే భుజించుటకూడ పాపమే. ఇట్టిదశ యందు నీవు భుజింపక కేవలము భగవంతుని చరణోదకమును స్వీకరించి వ్రత మును సంపన్న మొనరింపుము. ఇట్లొనరించిన నీవ్రతము సంపన్నముకాగలదు, ఆ సమయమందే అతిథిగౌరవముకూడ నిలువగలదు.

మహర్షీ! కులగురువైనవశిష్ఠుని యుపదేశానుసారముగ నంబరీష చక్రవర్తి శ్రీకృష్ణచరణారవిందములను దలంచి భగవంతునిచరణోదకమును ద్వాదశిఘడియలు గడవకమునుపే స్వీకరించెను. ఆ సమయముననే దుర్వాసు డరుదెంచి రా జొనరించిన యీకార్యము తన్నవమానించుటయే యనిభావించి

యత్యంతకోపావేశపూరితుడై తనజటనుబెరికి భూమిపై గొట్టి యొకమహా భీకరాకారుడైన పురుషుని సృజించి యంబరీషుని దండింపవలసినదిగ నాజ్ఞాపించెను. ఆకృత్యపురుషుడు భీకరకరవాలమును ధరించి అంబరీషుని సంహారించుట కుద్యుక్తుడయ్యెను. ఇదిగాంచి యంబరీషుని సదా రక్షించుచున్న కోటిసూర్యసమానప్రకాశమాన మైనసుదర్శనచక్రాయుధము నాక్షణమందే దుర్వాసమహర్షి ప్రేరేపితు డగుకృత్యాపురుషునిశిరమును ఖండించి దుర్వాసునే వధించుటకు సంసిద్ధమయ్యెను. మహాభయంకర మగువాసుదర్శనచక్రాయుధమును గాంచి దుర్వాసు డత్యంతభయభీతుడై ప్రాణరక్షణార్థమై పారిపోవదొడంగెను. మునివర్యుని ప్రజ్వలితాగ్నిశిఖాసదృశ మైనసుదర్శనచక్రము వెంబడించెను. జగము లన్నింట తిరుగుచు దుర్వాసుడు బ్రహ్మయే సర్వజగత్తునకు రక్షకు డనిభావించి బ్రహ్మలోకమునకు జని బ్రహ్మను శరణు వేడెను. దుర్వాసుని గాంచి బ్రహ్మ యిట్లుపల్కెను. "వత్సా ! నీ వేతపశ్శక్తి నాశ్రయించి శ్రీహరిదాసుని దండించుటకు బ్రయత్నించితివి ! భగవంతునిచే రక్షింపబడువానిని త్రిలోకములలోనివా రెవ్వరు సంహరింపలేరు. భక్తవత్సలు డైనశ్రీహరి తనభక్తులను సదా రక్షించుట కహర్నిశము సుదర్శనచక్రమును వినియోగించును. శ్రీమహావిష్ణువునకు ప్రాణాధికుడైనభక్తుని ద్వేషించు మూర్ఖుని స్వయముగ శ్రీహరియే సంహరించును. శ్రీహరి సంహారకర్తకు సంహారకర్త. అందువలన ఆయన వినియోగించిన సుదర్శన మప్రమేయము, అప్రతిహతము. నీ కీలోకమందు రక్షణ లభింపదు. కావున ఉమాపతి నాశ్రయింపుము.

బ్రహ్మదేవుని యాదేశానుసారముగ దుర్వాసమహర్షి శివలోకము బ్రవేశించి జగత్సంహారకారకు డైనమహాదేవు నాశ్రయించెను. దుర్వాసుని గాంచి శంకరు డిట్లుపల్కెను. "ద్విజశ్రేష్ఠా ! సుస్థిరుడవై నావచనముల నాలకింపుము. నీవు అత్రిమహర్షికుమారుడవు, బ్రహ్మపౌత్రుడవు. వేదవేదాంగవిదుడవు, సర్వజ్ఞుడవు, కాని నీయాకర్మ పరమమూర్ఖులొనరించు దానివలెనున్నది. వేదములందు పురాణములందు, సర్వేతిహాసములందు, సర్వశాస్త్రనిరూపణమొనరింపబడిన యాభగవంతుని నీవు మూర్ఖుడవై తెలిసికొనలేకపోయితివి. ఆయనభ్రూభంగలీలామాత్రముననే బ్రహ్మ, రుద్రాదిత్య, వసు, ధర్మేంద్రాదిసకలదేవతలు; మనువులు, ఉత్పన్నులై విలీనులయ్యెదరు. ఆ

శ్రీహరికి ప్రాణములకంటె నధికప్రియుడైన, అనన్యభక్తుని నీ వేశక్తి నాశ్ర
యించి సంహరింపదలంచితివి ! చక్రమును భక్తరక్షణార్థమై వినియో
గించినను తృప్తి చెందక స్వయముగ శ్రీహరియే భక్తులను రక్షించుటకు ఛాయ
వలె వారి ననుసరించియుండును. భక్తులముఖారవిందములనుండి తనదివ్య
నామములను స్వయముగ నాలకించుట శ్రీహరి కత్యంతప్రీతికరము. కావున
మహర్షి ! గోవిందునిచరణారవిందములను భజింపుము. శ్రీహరిస్మరణమాత్ర
ముననే సకలసంకటములు నశింపగలవు. కావున నీ వీక్షణమే వైకుంఠమునకు
జని వైకుంఠాధీశ్వరుడైన శ్రీహరి నాశ్రయింపుము. ఆ దేవేశ్వరేశ్వరుడు దయా
సాగరుడు గావున నీ కవశ్యము అభయము నీయగలడు" ఆ సమయముననే
కైలాస మంతయు ప్రచండసుదర్శనచక్రతేజముచే వ్యాప్తమయ్యెను. భయ
భీతులై కైలాసవాసు లందఱు, త్రాహి, త్రాహి యనుచు శంకరుని
ప్రార్థించిరి. చక్రమును గాంచి యుమామహేశ్వరులు దుర్వాసు నిట్లాశీర్వ
దించిరి. "పరబ్రహ్మ తేజము సత్యమైనను, చిరకాలసంచితతపము సత్యమైనను,
అపరాధ మొనరించి పశ్చాత్తాపముతో భయభీతుడైయున్న యీబ్రాహ్మణుని
సంతాపము నశించుగాక." పార్వతి స్వయముగ దుర్వాసున కిట్లురక్షణ
నొసంగెను. "ఈ బ్రాహ్మణుడు నాప్రాణేశ్వరుని యాశ్రయించెను. అందువలన
నాయాశీర్వాదమువలన వీనిభయము తొలగుగాక. అనతికాలములోనే యీ
బ్రాహ్మణుడు సంతాపములనుండి విముక్తుడగుగాక."ఆదిదంపతులు దుర్వాసుని
యాశీర్వదించుట గమనించి సుదర్శనము కైలాసమును ప్రవేశింపక గగనమందే
ఆగిపోయెను. తక్షణమే దుర్వాసమహర్షి మహేశ్వరునకు, పార్వతికి యనేక
ప్రణామము లర్పించి మనోవేగముచే వైకుంఠము చేరెను. సుదర్శనచక్రము
మరల మహర్షిని వెంబడించెను. దుర్వాసుడు వైకుంఠమును ప్రవేశించి
రత్నసింహాసనాసీనుడైయున్న శ్రీమన్నారాయణుని దర్శించెను.

చతుర్భుజధారి యైనహరి నాల్గుహస్తములందు శంకచక్రగదాపద్మ
ములను ధరించి రత్నసింహాసనముపై విరాజమానుడైయుండెను. ఆయన
శ్యామలవర్ణుడు, పీతాంబరధారి, రత్నాలంకారవిభూషితుడు, మందస్మిత
ప్రసన్నముఖారవిందుడు, రత్నఖచితమకుటధారి, అనంతకోటి సూర్యప్రకాశ
మానుడు, పార్షదులు సేవించుచుండగ చరణకమలములసేవయందు లక్ష్మి
సంలగ్నురాలైయుండగ భక్తులను రక్షించుటకు సదా కాతరుడైయున్న

శ్రీమన్నారాయణుని గాంచి దుర్వాసమహర్షి సాష్టాంగదండప్రణామము లర్పించి సామవేదస్తుతిద్వారా పరమేశ్వరుని స్తుతింపదొడంగెను.

## దుర్వాసకృత జగన్మఙ్గలస్తోత్రమ్

త్రాహి మాం కమలాకాన్త త్రాహి మాం కరుణానిధే ।
దీనబన్ధోఽతిదీనేశా కరుణాసాగర ప్రభో ॥

వేదవేదాఙ్గ సంస్రష్టుర్విధాతుశ్చ స్వయం విధే ।
మృత్యోర్మృత్యుః కాలకాల త్రాహి మాం సఙ్కటార్ణవే॥

సంహారక రు ఃసంహారః సర్వేశః సర్వకారణ ।
మహావిష్ణుతరోర్బీజ రక్ష మాం భవసాగరే ॥

శరణాగత శోకార్త భయత్రాణపరాయణ ।
భగవన్నవ మాం భీతం నారాయణ నమోస్తు తే ॥

వేదేష్వాద్యం చ యద్వస్తు వేదాః స్తోతుం న చక్షమాః।
సరస్వతీ జడీభూతో జడీభూతా కిం స్తువన్తి విపశ్చితః॥

శేషః సహస్రవక్త్రేణ యం స్తోతుం జడతాం వ్రజేత్ ।
పంచవక్త్రో జడీభూతో జడీభూతశ్చతుర్ముఖః ॥

శ్రుతయః స్మృతికర్తారో వాణీ చేత్ స్తోతుమక్షమ ।
కోఽహం విప్రశ్చ వేదజ్ఞః శిష్యః కిం స్తౌమి మానద॥

మనూనాం చ మహేన్ద్రాణామష్టావింశతిమే గతే ।
దివానిశం యస్య విధేరష్టోత్తరశతాయుషః॥

తస్యపాతో భవేద్యస్య చక్షురున్మీలనేన చ ।
తమనిర్వచనీయం చ కిం స్తౌమి పాహి మాం ప్రభో॥

ఇత్యేవం స్తవనం కృత్వా పపాత చరణామ్బుజే ।
నయనామ్బుజనీరేణ శిషే చ భయవిహ్వలః ॥

దుర్వాససా కృతం స్తోత్రం హరేశ్చ పరమాత్మనః।
పుణ్యదం సామవేదోక్తం జగన్మఙ్గలనామకమ్॥

యః పఠేత్ సఙ్కటగ్రస్తో భక్తియుక్తశ్చ సంయుతః ।
నారాయణస్త్వం కృపయా శీఘ్రమాగత్య రక్షతి ॥

రాజద్వారే శ్మశానే చ కారాగారే భయాకులే ।
శత్రుగ్రస్తే దస్యుభీతే హింస్రజన్తు సమన్వితే ॥
వేష్టితే రాజసైన్యేన మగ్నపోతే మహార్ణవే।
స్తోత్రస్మరణమాత్రేణ ముచ్యతే నాత్రసంశయః ॥ 90—103

కమలాకాన్తా! నన్ను రక్షింపుము, కరుణానిధీ! నన్ను కాపాడుము. ప్రభూ! నీవు దయాసాగరుడవు, దీనులకు బంధువుడవు, దుఃఖితులకు స్వామివి. వేద వేదాంగస్రష్ట యైనవిధాతకే విధాతవు, మృత్యువునకే మృత్యువు, కాలమునకే కాలము. సంకటసముద్రమందు బడియున్న నన్ను రక్షింపుము. నీవు సంహార కర్తకు సంహారకర్తవు, సర్వేశ్వరుడవు, సర్వకారణకారణుడవు, మహావిష్ణు స్వరూప మైనమహావృక్షమునకు బీజరూపుడవు. ప్రభూ! ఈ భవసాగరమునుండి నన్ను రక్షింపుము. శరణాగతు లైనవారిని, శోకాతురు లైనవారిభయమును దూర మొనరించి రక్షించుము. దేవా! భయభీతుడ నైన నన్ను రక్షింపుము. నారాయణా ! నీకు నమస్కారము. వేదముల యందెవను ఆది యనికీర్తింప బడెనో, వేదములుకూడ నెవనిని స్తుతింపలేవో. సరస్వతియైనను ఎవనిని స్తుతించుట కసమర్థురాలో అట్టిప్రభువును సామాన్యు లైనయితరు లెట్లు స్తుతింపగలరు ! సహస్రముఖయుక్తు డైనయాదిశేషు నెవనిని స్తుతించుటలో జడభావమును పొందునో, పంచముఖమహాదేవుడు, చతుర్ముఖబ్రహ్మకూడ నెవనిని స్తుతించుటలో అసమర్థులో, శ్రుతులు, స్మృతికారులు వాణికూడ నెవనిని స్తుతింపలేరో అట్టినిన్ను సామాన్యబ్రాహ్మణుడ నైననే నేమనిస్తుతింప గలను ! మాధవా ! నేను వేదములను పరిపూర్ణముగ నెఱిగినవాడను కాను, కేవలము వేదవేత్తలకు శిష్యుడను. నిన్ను స్తుతించుటకు నా కేమియోగ్యత కలదు ! ఇరువదియెనమండుగురు మనువులు మహేంద్రులు, పతనమైన పిమ్మట విధాతకు ఒకదినము ఒకరాత్రి కాగలదు. ఆ విధాతయట్టి నూటయెనిమిది సంవత్సరములు జీవించును. కాని యొకవిధాత నశించిన నీకు నిమేషకాలము మాత్రమే కాగలదు. అట్టి యనిర్వచనీయుడవైన పరమేశ్వరుడ వైననిన్ను నే నేమని స్తుతింపగలను ! ప్రభూ ! నన్ను రక్షింపుము.

ఇట్లుస్తుతించి దుర్వాసుడు శ్రీహరిచరణముల నాశ్రయించెను. ఆయన నయనాంబుజములు అశ్రువులతో నిండియుండగ భయవిహ్వలుడై కంపించు చుండెను. పరమాత్మ యైనహరిని గుఱించి దుర్వాసు డొనరించిన యీ

స్తోత్రము పుణ్యప్రదము, సామవేదోక్తము, జగన్మంగళకరము. సంకటములందు జిక్కిన యెవరైనను భక్తియుక్తులై యీస్తోత్రమును బఠించిన శ్రీమన్నారాయణుడే స్వయముగ నరుదెంచి కృపతో రక్షించును. రాజద్వారమందుగాని, స్మశానమందుగాని, కారాగారమందుగాని, శత్రువులమధ్యగాని, దస్యుల భయము సంప్రాప్తించిన సమయమునగాని క్రూరజంతువులు చుట్టుముట్టినపుడు గాని, రాజసైన్యమధ్యమునగాని, మహార్ణవమధ్యమునగాని కష్టముల పాలైన వా రీస్తోత్రస్మరణమాత్రముననే ఆ సంకటములనుండి నిస్సంశయముగ విముక్తులు కాగలరు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! ముని యొనరించినస్తుతి నాలకించి భక్తవత్సలుండైనవైకుంఠ నాథుడు మందస్మితముఖారవిందుడై అమృతవర్షమువంటి వాక్కుల నిట్లు పల్కెను.

శ్రీ హ రి ప లి కె ను :

మునీశ్వరా! భయమును వీడుము, నావరప్రభావమువలన నీకు శుభమగుగాక. బ్రాహ్మణా! వేదములందు, పురాణములందు, ఇతిహాసములందు గానింపబడిన వైష్ణవుల మహిమలు అందరికీ విదితములే. నేను వైష్ణవులకు ప్రాణమును, వైష్ణవులే నాప్రాణము. నాభక్తులను ద్వేషించు మూఢుడు నన్ను హింసించినటులే. పుత్రపౌత్రాదులను, రాజ్యసంపదలను, లక్ష్మిని త్యజించి సదా నాధ్యానమందే సంలగ్నులై వానికంటె నధికప్రియుడు నాకు మఱియొకడుండడు. భక్తునకంటె మించి నాప్రాణములు నాకు ప్రియములు కావు. లక్ష్మికాని, శివుడుకాని, సరస్వతికాని, బ్రహ్మకాని, వేదములుకాని, పార్వతికాని, గణేశ్వరాదులుకాని నాదృష్టియందు భక్తులకంటె నధికులుకారు, ఇది నేను పల్కిన సత్యవచనము. నాప్రాణాధికప్రియులైనభక్తులను ద్వేషించువారిని నేనే స్వయముగ దండింతును. అట్టివారు ఘోరపాతకమునకుగుఱియై చిరకాలము నరక మనుభవింపగలరు. నేనే సర్వమునకు నుత్పత్తికారణము, సర్వులకు నీశ్వరుడను, పరిపాలకుడను, సర్వవ్యాపిని, స్వతంత్రుడను, ఐనను నేను అహర్నిశములు భక్తాధీనుడనే. గోలోకమందు నేను ద్విభుజరూపమున రూపమాత్రముననే ఆయాలోకములందు నివసించెదను,

కాని నా ప్రాణములు సదా భక్తుని సామీప్యముననే యుండగలవు. భక్తుడు ప్రసాదించిన పత్రమునైనను, పుష్పమునైనను, ఫలమునైనను, తోయమునైనను సానందముగ స్వీకరింతును. కాని అభక్తుడమృతము నర్పించినను గ్రహింపను. మహర్షీ! రాజులయందు శ్రేష్ఠుడైన యంబరీషుడు నిరీహుడు, ఇచ్ఛారహితుడు అహింసావాది, సర్వప్రాణిహితకరుడు, దయాళువు. అట్టిమహాత్ముని నీవేల వధింపతలచితివి! సమస్త ప్రాణులందు దయగల్గి వర్తించు మహాపురుషులను ద్వేషించువారిని నేనే స్వయముగ వధించెదను. భక్తులను హింసించువారిని భక్తులశత్రువులను నేను రక్షింపజాలను. కావున తత్క్షణమే నీవు అంబరీషుని కడకేగి ఆయన నాశ్రయింపుము. సుదర్శనచక్రము బారినుండి త్రిలోకములందొక్క-అంబరీషుడే నిన్ను రక్షించుటకు సమర్థుడు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! శ్రీహరివచనముల నాలకించి దుర్వాసు డత్యంతభీతుడై దుఃఖించుచు వైకుంఠమందే శ్రీహరిని స్మరించుచు నిలువబడెను. ఆ సమయమున బ్రహ్మాదిసకలదేవతలు వైకుంఠమున కరుదెంచి పశ్చాత ప్తుడైన దుర్వాసుని యపరాధమును క్షమింపు డనిశ్రీమన్నారాయణుని ప్రార్థించిరి. సర్వదేవతల ప్రార్థనల నాలకించి శ్రీహరి అమృతోపమయములైన మధురాతిమధురవచనములతో దుర్వాసునికర్తవ్య మిట్లుపదేశించెను.

శ్రీ హ రి ప లి కె ను :

దేవతలారా! మీప్రార్థనలను మన్నించి యవశ్యముగ నీబ్రాహ్మణుని అంబరీషు నాశ్రయించి ఆయనప్రసన్నతకొఱకే కాదశీవ్రతపారాయణ మొనరింపవలెను. ఈదూర్వాసమహర్షి ద్వాదశీదినమున నంబరీషునిగృహమున కతిథిగ వరుదెంచి యేయపరాధమునొనరింపనినాభక్తుని శిక్షించుటకు సంసిద్ధుడయ్యెను. అదిగాంచి నాచే నియోగింపబడినసుదర్శనచక్రము అంబరీషుని రక్షించుటకు దుర్వాసుని వెంబడించెను. ప్రాణరక్షణార్థమై దుర్వాసు డాశ్రయముకొఱకు సకలలోకములు భ్రమించుచు తుదకు వైకుంఠ మేతెంచెను. ఈసమయమున భూలోకములో నొకసంవత్సరము గడచినది. దుర్వాసుడు వెడలిపోయినసమయమునుండి అత్యంతశోకగ్రస్తుడై అంబరీషుడు పత్నీ సహితముగ ఉపవాస మొనరించుచు మహర్షికొఱకై యెదురుచూచు చుండెను.

భక్తు లుపవాస మొనరించుచున్న కారణమున నేనుపవాసవ్రతము నందే యున్నాను. పాలుత్రాగు శిశువు నిరాహారుడై యున్న, కన్నతల్లి యాహారమును గ్రహింపనట్లే నేనును నా భక్తులు నిరాహారులై యున్న ఉపవసించెదను. నావరబలమువలన దుర్వాసుని మార్గమధ్యమున చక్రము హింసింపదు. కావున దుర్వాసుడు వెంటనే అంబరీషునిగృహమునకు వెడలిపోవలెను. అతిథి యైనదుర్వాసుడు భుజించిన అంబరీషుడు భుజింపగలడు, అంబరీషుడు భుజించిన నేను భుజింపగలను. భక్తులు ప్రీతిపూర్వకముగ నేవస్తువును నాకర్పించినను దానిని నేను అమృతసమానముగ నెంచి స్వీకరింతును. లక్ష్మి నా కర్పించినపదార్థములను భక్తులర్పింపనిదే నేను గ్రహింపను. దుర్వాస మహర్షి ! నీవు వెంటనే అంబరీషునికడ కేగి ఆయనవ్రతమును పూర్తి చేయుము.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను

నారదమహర్షి ! శ్రీహరిఆజ్ఞను శిరసావహించి మహర్షి మనోవేగమున అంబరీషుని గృహమునకు బయలుదేరెను. దేవతలు తమతమస్థానములకు జేరిరి. సంవత్సరకాలమునుండి యుపవాస మొనరించుచు దుర్వాసుని గాంచగనే భక్తిభావముతో నమస్కరించి అత్యంతప్రసన్న హృదయాంతరంగుడై యాహ్వానించెను. తను నిగ్రహానుగ్రహసమర్థుడ ననియహంకరించిన దుర్వాసుడు దర్పమంతయు నశింపగ తా నొనరించిన పరమవైష్ణవాపరాధమును మన్నింపు మనియంబరీషుని శరణువేడెను. తదనంతర మంబరీషనృపాలుడు మహర్షికి అభయ మొసంగి షడ్రసోపేతముగ భోజనమిడి సత్కరించి తదుపరి పత్నీసహితముగ భుజించి యేకాదశీవ్రతమును సాంగోపాంగముగ సంపన్న మొనరించెను. ఆ సమయముననే దుర్వాసుని వెంబడించియున్న సుదర్శన చక్రము శాంతించి యంతర్ధానమయ్యెను. అంబరీషచక్రవర్తి భక్తితో నొనరించినసేవల కత్యంతసంతుష్టుడై దుర్వాసమహర్షి యనేకవిధముల రాజు నాశీర్వదించి స్వస్థలమునకు బయలుదేరెను. మార్గమధ్యమున వైష్ణవుల మాహాత్మ్య మెంతయద్భుత మనిభావించుచు దుర్వాసమహర్షి పరమాశ్చర్య చకితుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములో నారదనారాయణ
సంవాదమున దుర్వాసమహర్షి మోక్షణ
మను ఇరువదియైదవ అధ్యాయము
సంపూర్ణము
* * *

# ఇరువదియాఱవ అధ్యాయము

## ఏకాదశీవ్రతవిధాన వర్ణనము

నారద మహర్షి పలికెను :

నారాయణఋషీంద్రా! అత్యంతాద్భుతమైన యేకాదశీవ్రతమహాత్మ్యతిరస్కారమువలన దుర్వాసమహర్షి యంతటివాడే పరాభవింపబడెను. దేవా! సకలశ్రుతిశ్రవణంసనీయమైన సర్వాలు నాకాంక్షించు నాపవిత్రైకాదశీవ్రతవిధానమును సవిస్తరముగ నా కుపదేశింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

మునీశ్వరా! ఈయేకాదశీవ్రతము దేవతలకైనను పరమదుర్లభము. ఈ వ్రతము శ్రీకృష్ణప్రీతిజనకము. సర్వతపములందు శ్రేష్ఠము.

దేవతలందు శ్రీకృష్ణుడు, దేవాంగనలందు ప్రకృతి, వర్ణములందు బ్రాహ్మణుడు, వైష్ణవులందు శివుడు శ్రేష్ఠులైనట్లు వ్రతములందీయేకాదశీవ్రత మత్యంతశ్రేష్ఠము. చాతుర్వర్ణ్యములవారికి సదా ఈవ్రత మనుసరణీయము. యతులు, వైష్ణవులు, బ్రాహ్మణులు ఈవ్రతము నవశ్యము పాలింపవలెను. సత్యముగ బ్రహ్మహత్యాదిఘోరపాపము లేకాదశీదినమున నన్నము నాశ్రయించి యుండగలవు. మందబుద్ధియుక్తుడైనమనుష్యుడేకాదశీదినమున సకలపాపము లాశ్రయించియున్న యన్నమును భుజించువాడిహలోకమం దత్యంతపాపాత్ముడై యంత్యకాలమందు నిశ్చయముగ నరకమును బొంద

గలదు. పూజ్యులయందు గణేశ్వరుడు, విద్వాంసులందు వాణి, శాస్త్రము లందు వేదములు, తీర్థములందు గంగ, తేజఃపదార్థములందు సువర్ణము, జీవులయందు వైష్ణవుడు, ధనములయందు విద్య, ప్రియులందు ప్రేయసి, ప్రమథగణములందు రుద్రుడు, శ్రేయోభిలాషులయందు మతి, ఇంద్రియ ములం దాత్మ, చంచలములందు మనస్సు, పూజ్యస్త్రీలయందు మాత, బంధు వర్గమందు భర్త, బలవంతులందు దైవము, కాలములందు కాలము, మిత్రు లందు సన్మిత్రుడు, శత్రువులయందు రోగములు, కీర్తివంతులయందు కీర్తి, ఖలులయందు హింసకుడు, దుష్టులయందు పుంశ్చలి, తేజస్వులయందు గ్రహేశ్వరుడు, సహిష్ణులయందు వసుంధర, భక్ష్యపదార్థములందు అమృతము, దాహకులం దనలము, ధనమును దాన మొనరించుదాతలకు సంపదవలె, సాధ్వులయందు సతి, ప్రజాపతులయందు బ్రహ్మ, సరిత్తులయందు సాగరము, శ్రుతులయందు సామవేదము, ఛందములందు గాయత్రి, వృక్షములందు అశ్వత్థ వృక్షము, పుష్పములందు తులసి, మాసములందు మార్గశీర్షము, అమృతము లందు మధువు, ఆదిత్యులందు సూర్యుడు, రుద్రులందు శంకరుడు, వసువులందు భీష్ముడు, వర్షములందు భారతవర్షము, దేవర్షులందు నీవు (నారదుడు), బ్రహ్మ ఋషులందు భృగువు, నరేశ్వరులయందు శ్రీరాముడు, సిద్ధులయందు కపిలుడు, యోగులందు, జ్ఞానులందు సనత్కుమారుడు, మత్తేభములయం దైరా వతము, శైలములందు హిమవంతుడు, మణులయందు కౌస్తుభము, నదులందు పుణ్యస్వరూపిణి యైనసరస్వతి, గంధర్వులందు చిత్రరథుడు, యక్షు లందు కుబేరుడు, రాక్షసులందు సుమాలి, స్త్రీలయందు శతరూప, మనువు లందు స్వాయంభువమనువు, సుందరీస్త్రీలయందు రంభ, మాయావులందు మాయ, శ్రేష్ఠులైనట్లు ఈపవిత్రై కాదశీవ్రతము సర్వవ్రతములందు దత్యంత శ్రేష్ఠము. దశమీలంఘనదోషములను వివరించెద నవధరింపుము. పూర్వ కాలమందు ధర్మదేవునిముఖారవిందమునుండి నే నీవిషయములను శ్రవణ మొనరించితిని, తెలిసికూడ దశమీలంఘన మొనర్చినమూఢుని లక్ష్మి శీఘ్రముగ శపించి వానిగృహము వీడి వెడలపోవును. ఏదినమున దశమి, ఏకాదశి, ద్వాదశీతిథులుమూడు కలసి సంభవించునో ఆదినమున భుజించి మరునా డుపవాసముండవలెను. ద్వాదశినాడు వ్రత మాచరించి త్రయోదశీ దినమున పారాణ మొనరింపవలెను. అట్టిదశయందు వ్రతధారులకు ద్వాదశీ

లంఘనదోషము సంభవింపదు. ఏదినమందుపగలురాత్రి ఏకాదశీతిథి యుండి మరునాడు ప్రాతఃకాలమందుగూడ మిగు లుండునో, మిగు లున్న దినముననే యుపవాసవ్రత మొనరింపవలెను. రెండుదినములం దేకాదశీతిథి సంభవించిన వ్రతమందుగలజాగరణకార్యమును మొదటిరాత్రియందే యొనరింపవలెను. మొదటిదినము వ్రత మాచరించి, రెండవదిన మేకాదశీతిథి సంపూర్ణ మైన పిదప పారాణ మొనరింపవలెను.

వైష్ణవులు, యతులు, విధవలు, భిక్షుకులు, బ్రహ్మచారులు మొదలగువారందఱు నియమము దప్పక యేకాదశీదినమం దుపవసింపవలెను. వైష్ణవేతరులైనగృహస్థులు శుక్లపక్షైకాదశీదినమం దుపవాసవ్రత మొనరింతురు నారదా! అట్టివారు కృష్ణైకాదశిని లంఘన మొనరించినను దోషములు కారని శ్రుతివచనము కలదు. "హరిశయని, హరిబోధిని" యను ఈరెండేకాదశులమధ్య కృష్ణైకాదశి సంభవించు తిథియందే గృహస్థు డైనపురుషు డుపవాసవ్రత మాచరింపవలెను. ఆతిథిదక్క అన్యకృష్ణపక్షైకాదశులందు గృహస్థు ఉపవసింపరాదు. బ్రాహ్మణోత్తమా! శ్రుతులందు ప్రసిద్ధము లైనయేకాదశీ విషయనిర్ణయములను ప్రవచించితిని. ఇపుడు వ్రతవిధాన ముపదేశించెద నవధరింపుము.

దశమినాడిదినముననే పూర్వాహ్ణమం దొకసారిమాత్రమే హావిష్యాన్నమును భుజింపవలెను. తదనంతరము జలములనైనను సేవింపరాదు. రాత్రియందు కుశాసనముపై నొంటరిగ నిద్రించి యేకాదశీదినమున బ్రాహ్మముహూర్తమందే నిద్ర మేల్కాంచి ప్రాతఃకాలకృత్యములను నెరవేర్చి తదనంతరము స్నాన మాచరింపవలెను. ఆ సమయముననే శ్రీకృష్ణప్రసన్నత కొఱకు వ్రతోపవాసముల నొనరించెద ననిసంకల్ప మొనరించి సంధ్యాతర్పణముల నొనరించి అనంతరము నిత్యపూజాదులను సంపన్న మొనరింపవలెను. వ్రతముకొఱ కావశ్యకసామగ్రులను సంగ్రహ మొనరించి షోడశోపచారద్రవ్యములను సిద్ధ మొనరించుకొనవలెను. ఆసనము, వసనము, పాద్యము, అర్ఘ్యము, పుష్పము, అనులేపనము, ధూపము, దీపము, నైవేద్యము, యజ్ఞోపవీతము, ఆభూషణము, గంధము, స్నానీయపదార్థములు, తాంబూలము, మధుపర్కము, పునరాచమనీయజలములు ఇవియే షోడశోపచారములు.

పగలు వ్రతసంబంధములైన వివిధపూజా ద్రవ్యములను నాయత్తపఱచుకొని సూర్యాస్తమయానంతరము వ్రత మాచరింపవలెను.

స్నానాదులచే బవిత్రులై పరిశుద్ధ మొనరించినవస్త్రములను ధరించి ఆసనముపై నధిష్ఠింపవలెను. తదుపరి యాచమనప్రాణాయామముల నొన రించి, శ్రీహరికి నమస్కరించి స్వస్తివచనము పలుకవలెను. తదుపరి శుభ ముహూర్తసమయమున సప్తవిధధాన్యములపై మంగళకలశమును స్థాపించి, కలశమందు ఫలశాఖాసహితములైన ఆమ్రపల్లవముల నుంచవలెను. కలశ ముపై చందనము ననులేపన మొనరించి కుంకుమముతో దానినలంకరింపవలెను. తదనంతరము వేదములందు బ్రవచింపబడినక్రమమున కలశస్థాపనాకలశపూజ నాదివిధులను ప్రసన్నతాపూర్వకముగ నొనరింపవలెను. తదుపరి విడివిడిగ నారుధాన్యపుంజములపై నాఱుగురు దేవతల నావాహన మొనరించి పంచోప చారములద్వారా పూజింపవలెను. గణేశ్వరుడు, సూర్యుడు, అగ్ని, విష్ణువు, శివుడు, పార్వతి వీరేఆర్గురు దేవతలు. గణేశ్వరుని పూజించిన సకలవిఘ్నములు నశింపగలవు, సూర్యారాధనవలన దేహధారులు పరిపూర్ణారోగ్యవంతులు కాగలరు. విష్ణుకైంకర్యమువలన జీవులు పవిత్రులై, పాపవిముక్తులై యశస్వులై, ఐశ్వర్యవంతులై యంత్యకాలమున మోక్షసామ్రాజ్యమును పొందగలరు. శంకరారాధనము భక్తితత్త్వజ్ఞానవిషయములందు పరమ సంతృప్తికిబీజము, హరియెడల నన్యభక్తిప్రదాయకము. అగ్నిదేవతాపూజ జీవునిబుద్ధిని పరిశుద్ధ మొనరింపగలదు. దుర్గాదేవ్యారాధనము హరిభక్తి ప్రదాయకము, మంగళప్రదము. వ్రతియీయాఱుగురుదేవతల నారాధింపక యేవ్రతమునుష్ఠించినను వాని పవిత్రకర్మలన్నియు నిష్ఫలములు కాగలవు.

సామవేదమందు బ్రవచింపబడినధ్యానానుసారముగ పరాత్పరుడైన శ్రీకృష్ణుని ధ్యానింపవలెను. నారదా! సకలవాంఛిత మైనయాధ్యానము నుపదేశించెద నవధరింపుము. భక్తులకు ప్రాణాధికప్రియ మైనయీధ్యాన మును అభక్తపురుషులకు జెప్పరాదు.

నవీననీరదో యద్వత్ శ్యామసున్దరవిగ్రహమ్ ।
శరత్పార్వణచన్ద్రాభావినిన్ద్యాస్యమనుత్తమమ్ ॥
శరత్సూర్యోదయాబ్జానాం ప్రభామోచనలోచనమ్ ।
స్వాఙ్గసౌన్దర్యశోభాభీ రత్నభూషణభూషితమ్ ॥

గోపీలోచనకోణైశ్చ ప్రసన్నైరతిసూచకైః ।
శశ్వన్నిరీక్ష్యమాణం తత్ప్రాణైరివ వినిర్మితమ్ ॥

రాసమణ్డలమధ్యస్థం రాసోల్లాససముత్సుకమ్ ।
రాధావక్త్రశరచ్చన్ద్రసుధాపాన చకోరకమ్ ॥

కౌస్తుభేన మణీన్ద్రేణ వక్షఃస్థల సముజ్జ్వలమ్ ।
పారిజాతప్రసూనానాం మాలాజాలైర్విరాజితమ్॥

సద్రత్నసారనిర్మాణం కిరీటోజ్జ్వలశేఖరమ్ ।
వినోదమురలీహస్తన్యస్తం పూజ్యం సురాసురైః॥

ధ్యానాసాధ్యం దురారాధ్యం బ్రహ్మాదీనాం చ వన్దితమ్ ।
కారణం కారణానాం యం తమీశ్వరమహం భజే॥ 55-61

నీలనీరదమువలె శ్యామలవర్ణశరీరము గలవాడు, శరత్పూర్ణిమా చంద్రునిశోభను దిరస్కరించుముఖము గలవాడు, సర్వశ్రేష్ఠుడు, మనోహరుడు, శరత్కాలసూర్యోదయవేళయందు వికసించుకమలప్రభను దిరస్కరించు నేత్రములు గలవాడు, విభిన్నములైనయవయవములయందు ధరించిన యాభూషణములను తనయవయవసౌందర్యశోభచే ప్రకాశింపజేయువాడు, ప్రసన్నములు అనురాగసూచకములు నగుగోపికల క్రీగంటచూపులచే నెల్లప్పుడు చూడబడువాడు, ఆ గోపికలప్రాణములచే నిర్మితమైనదియో యన్నట్లున్న శరీరముగలవాడు, రాసమండలమునం దున్నవాడు, రాసోల్లాసమునకై మిగుల యుత్సుకత జూపువాడు, రాధాదేవిముఖ మనుశరచ్చంద్రునిసుధను పానము చేయుటకు చకోరమువలె నున్నవాడు, మణిరాజమైనకౌస్తుభముయొక్క ప్రభచే బ్రకాశించువక్షస్థలము గలవాడు, పారిజాతపుష్పమాలలచే మిగుల శోభిల్లువాడు, ఉత్తమరత్నసారతత్త్వముచే నిర్మితమైనదివ్యమకుటముచే విలసిల్లు మస్తకము గలవాడు, మనోవినోదమునకు సాధనభూతమైనమురళిని హస్తమునందు ధరించినవాడు, దేవాసురులచే బూజింపబడువాడు, ధ్యానముచే వశముచేసికొనుటకు సాధ్యముకానివాడు, దురారాధ్యుడు, బ్రహ్మాదిదేవతలకు వంద్యుడు, సర్వకారణములకు గారణుడు నగు నాశ్రీకృష్ణభగవానుని నేను భజించుచున్నాను.

ఆ స న స మ ర్ప ణ ము :

ఆసనం స్వర్ణనిర్మాణం రత్నసారపరిచ్ఛదమ్ ।
నానాచిత్రవిచిత్రాఢ్యం గృహ్యతాం పరమేశ్వర॥ 63

పరమేశ్వరా! రత్నజటిత మైనయీసువర్ణ నిర్మితసింహాసనము వివిధ విచిత్రచిత్రములచే నలంకృతము. దీనిని గ్రహింపుము.

వ స్త్ర స మ ర్ప ణ ము

వహ్నిప్రక్షాలితం వస్త్రం నిర్మితం విశ్వకర్మణా।
మూల్యానిర్వచనీయం చ గృహ్యతాం రాధికా పతే॥ 64

రాధాపతీ! విశ్వకర్మచే నిర్మింపబడినయీదివ్యవస్త్రము ప్రజ్వలితాగ్ని యందు బరిశుద్ధ మొనరింపబడెను. అమూల్య మైనయీవస్త్రమును గృపతో ధరించుము.

పా ద్య స మ ర్ప ణ ము

పాదప్రక్షాలనార్హం చ సువర్ణపాత్రసంస్థితమ్।
సువాసితం శీతలం చ గృహ్యతాం కరుణానిధే॥ 65

కరుణానిధానా! చరణములను బ్రక్షాళన మొనరించుకొనుటకు సువర్ణ మయపాత్రయం దుంచబడినయీసువాసితశీతలజలములను స్వీకరింపుము.

అ ర్ఘ్య స మ ర్ప ణ ము

ఇదమర్ఘ్యం పవిత్రం చ శఙ్ఖతోయసమన్వితమ్।
పుష్పం దూర్వాచన్దనాక్తం గృహ్యతాం భక్తవత్సల॥ 66

భక్తవత్సలా! శంఖమం దుంచబడిన యీపవిత్రజలములు దూర్వా చందనయుక్తములు, ఈ ఆర్ఘ్యజలములను స్వీకరింపుము.

పు ష్ప స మ ర్ప ణ ము

సువాసితం శుక్లపుష్పం చన్దనాగరు సంయుతమ్
సద్యస్తే ప్రీతిజనకం గృహ్యతాం సర్వకారణ॥ 67

సర్వకారణా! చందనాగరులచే యుక్తము లైనయీసువాసిత శ్వేత పుష్పములు శీఘ్రముగ నీకు ప్రీతిజనకములు కాగలవు. దయతో వీనిని స్వీకరింపుము.

అ ను లే ప న స మ ర్ప ణ ము

చన్దనాగరుకస్తూరీ కుఙ్కుమోశీరముత్తమమ్।
సర్వేప్సితమిదం కృష్ణ గృహ్యతామనులేపనమ్॥ 68

శ్రీకృష్ణా ! చందనాగరుకస్తూరీకుంకుమములతో గూర్చి కావింపబడిన యీయుత్తమానులేపనము సర్వప్రియము, కృపతో స్వీకరింపుము.

ధూ ప స మ ర్ప ణ ము

రసో వృక్షవిశేషస్య నానాద్రవ్యసమన్వితః ।
సుగన్ధియుక్తః సుఖదో ధూపోఽయం ప్రతిగృహ్యతామ్॥ 69

దేవా ! నానాద్రవ్యములచే మిశ్రితమైనయీసుగంధయుక్తధూపము వృక్షసారము ఈధూపమును స్వీకరింపుము.

దీ ప స మ ర్ప ణ ము

దివానిశం సుప్రదీప్తో రత్నసారవినిర్మితః ।
పునర్ధ్వాన్తనాశబీజం దీపోఽయం ప్రతిగృహతామ్ ॥

ప్రభూ ! రత్నసారతత్త్వముచే నిర్మితమై అహర్నిశములు బాగుగ ప్రకాశించు నీదివ్యదీప మంధకారనాశనమునకు హేతువు, దయతో నీదీపమును గ్రహింపుము.

నై వే ద్య స మ ర్ప ణ ము

నానావిధాని ద్రవ్యాణి స్వాదూని సురభీణి చ ।
చోష్యాదీని పవిత్రాణి స్వాత్మారామ ప్రగృహ్యతామ్ ॥

స్వాత్మారామా ! ఈ నానాప్రకారస్వాదిష్టసుగంధితపవిత్రభక్ష్య, భోజ్య, చోష్యాదిద్రవ్యములు మీసేవయందుసమర్పితములు, కృపతో వీనిని గ్రహింపుము.

య జ్ఞో ప వీ త స మ ర్ప ణ ము

సావిత్రీగ్రన్థి సంయుక్తం స్వర్ణతన్తువినిర్మితమ్ ।
గృహ్యతాం దేవదేవేశ రచితం చారుకారుణా ॥ 72

దేవదేవేశ్వరా ! గాయత్రీమంత్రములచే నిర్మింపబడిన గ్రంధియుక్తమైన, స్వర్ణమయతంతువులతో చతురశిల్పిచే నిర్మింపబడిన ఈయజ్ఞోపవీతమును గ్రహింపుము.

భూ ష ణ స మ ర్ప ణ ము

అమూల్యరత్నరచితం సర్వావయవభూషణమ్।
త్విషా జాజ్వల్యమానం చ గృహత్యాం నన్దనన్దన ॥ 73

నందనందనా ! బహుమూల్యరత్నములచే నిర్మింపబడి దివ్యప్రభతో ప్రకాశించుసమస్తావయవములను విభూషిత మొనరింపగల యీయాభూషణములను స్వీకరింపుము.

గన్ధ సమర్పణము

ప్రధానో వర్ణనీయం చ సర్వమఙ్గలకర్మణి ।
ప్రగృహ్యతాం దీనబన్ధో గన్ధోఽయం మఙ్గలప్రదః ॥ 74

దీనబాంధవా ! సమస్తశుభకర్మలందు వర్ణనీయమైన, మంగళదాయకమైన, యీగంధము నీసేవయందు సమర్పితము, దీనిని స్వీకరింపుము.

స్నానీయ సమర్పణము :

ధాత్రీ శ్రీఫలపత్రోత్థం విష్ణుతైలం మనోహరమ్ ।
వాంఛితం సర్వలోకానాం భగవాన్ ప్రతిగృహ్యతామ్ ॥ 75

దేవా ! ధాత్రీబిల్వపత్రములచే నిర్మింపబడిన యీ మనోహర విష్ణుతైలము సమస్తలోకములందు వాంఛితము, దీనిని గ్రహింపుము.

తాంబూల సమర్పణము :

వాంఛనీయం చ సర్వేషాం కర్పూరాదిసువాశితమ్ ।
మయా నివేదితం నాథ తామ్బూలం ప్రతిగృహ్యతామ్ ॥ 76

నాథా ! కర్పూరాదులచే సువాశితమైన, సర్వవాంఛితమైన తాంబూలము నీసేవయందు సమర్పితము, కృపతో స్వీకరింపుము.

మధుపర్క సమర్పణము :

సర్వేషాం ప్రీతిజనకం సుమిష్టం మధురం మధు ।
సద్రత్నసారపాత్రస్థం గోపీకాన్త ప్రగృహ్యతామ్ ॥ 77

గోపీకాంతా ! ఉత్తమరత్నసారతత్త్వముచే నిర్మితమైనపాత్రయందుంచబడిన యీమధురమధు వత్యంత స్వాదిష్టము. ఈ మధువును సేవించిన సర్వులకు బ్రసన్నత కల్గును, కావున కృపాపూర్వకముగ నీమధుపర్కమును స్వీకరింపుము.

పునరాచమనీయజలసమర్పణము :

నిర్మలం జాహ్నవీతోయం సుపత్రం సువాసితమ్ ।
పునరాచమనీయం చ గృహ్యతాం మధుసూదన ॥ 78

మధుసూదనా ! ఈపరమపవిత్రి సూవాసితనిర్మల గంగాజలములను మరల ఆచమనార్థ మంగీకరింపుము.

ఇట్లు ప్రతి ప్రసన్నతాపూర్వకముగ షోడశోపచారముల నర్పించి నిమ్నాంకితమంత్రము నుచ్చరించుచు పుష్పమాలికలను సమర్పింపవలెను.

నానాప్రకారపుష్పైశ్చ గ్రథితం శుక్లతన్తునా ।
ప్రవరం భూషణానాం చ మాల్యం చ గృహ్యతామ్ ॥ 79

ప్రభూ ! శ్వేతతంతువుచే నానావిధపుష్పములను గ్రుచ్చియున్న యీపుష్పహారములు సర్వాభూషణములందు శ్రేష్ఠములు, వీనిని స్వీకరింపుము.

ఇట్లు పుష్పమాలికల నర్పించి, పుష్పాంజలులచే పూజించి భక్తిభావముతో రెండుహస్తములను ముకుళించి భగవంతు నిట్లుస్తుతింపవలెను.

హే కృష్ణ రాధికానాథ కరుణాసాగర ప్రభో ।
సంసారసాగరే ఘోరే మాముద్ధర భయానకే ॥

శతజన్మకృతాయాసాదుద్విగ్నస్య మమ ప్రభో ।
స్వకర్మపాశనిగడైర్బద్ధస్య మోక్షణం కురు ॥

ప్రణతం పాదపద్మే తే పశ్య మాం శరణాగతమ్ ।
భవపాశభయాద్భీతం పాహి త్వం శరణాగతమ్ ॥

భక్తిహీనం క్రియాహీనం విధిహీనం చ వేదతః ।
వస్తుమన్త్రవిహీనం యత్తత్ సమ్పూర్ణం కురు ప్రభో ॥

వేదోక్తవిహితాజ్ఞానాత్ స్వాఙ్గహీనే చ కర్మణి ।
త్వన్నామోచ్చారణేనైవ సర్వం పూర్ణం భవేద్ధరే ॥ 82–86

శ్రీకృష్ణా ! రాధాకాంతా! కరుణాసాగరా! ప్రభూ! భయంకర సంసారసాగరమునుండి న న్నుద్ధరింపుము. ప్రభూ! ఎన్నియో జన్మలనుండి సాంసారిక క్లేశముల ననుభవించియున్న కారణమున నే నుద్విగ్నుడనై కర్మపాశముల బంధింపబడియున్నాను. దేవా ! నాయీకర్మబంధములను ఛేదింపుము. నాథా ! నీచరణములందు బడి ని న్నాశ్రయించిన నన్ను కృపాపూర్వకముగ

వీక్షింపుము. భవపాశభయముచే విహ్వలుడనైన శరణాగతుడనైన నన్ను రక్షింపుము. ప్రభూ! ఏవస్తువైనను నేను భక్తిహీనముగ, క్రియాహీనముగ, విధిహీనముగ, వేదమంత్రరహితముగ నీకు సమర్పించిన ఆలోపములను నీవే కృపతో పూర్తిచేసి స్వీకరింపుము. శ్రీహరీ! వేదోక్తవిధి తెలియనికారణమున అంగహీనములైనకర్మలు నీపవిత్రనామసంకీర్తనముచే పరిపూర్ణములు కాగలవు.

ఇట్లుస్తుతించి భగవాన్ శ్రీకృష్ణునకు సాష్టాంగదండప్రణామము లర్పించి, పురోహితునకు దక్షిణ నొసంగి, మహోత్సవముగ వ్రతి హరినామ సంకీర్తన మొనరించుచు రాత్రికాలమందు జాగరణము చేయవలెను. వ్రతోపవాసము లొనరించుసమయమందు నిద్రించిన వారికి, జలములను స్వీకరించిన వారికి అర్ధ ఫలమే లభించును. కావున విప్రరా! వ్రతజాగరణానంతర మొక పర్యాయమే హావిష్యాన్నమును భుజింపవలెను. ఆ సమయమందు శ్రీకృష్ణుని చరణార విందములను స్మరించుచు క్రింది మంత్రమును బఠింపవలెను.

> అన్నం హి ప్రాణినాం ప్రాణా బ్రహ్మణా నిర్మితం పురా ।
> దేహి మే విష్ణురూప త్వం వ్రతోపవాసయోః ఫలమ్ ॥ 90

విష్ణుస్వరూపా, అన్నమా! ప్రాణులకు ప్రాణరూపమున బ్రహ్మద్వార మున నీవు నిర్మింపబడితివి! కావున నీవు నాకు వ్రతోపవాసఫలములను ప్రసాదింపుము.

ఇట్లేకాదశీతిథినా డుపవాసజాగరణముల నొనరించి శ్రీకృష్ణుని యారాధించి ద్వాదశీదినమున భుజించి పవిత్రైకాదశీవ్రత మాచరించువారు తాము తరించుటయేగాక, తమ యేడుతరములవారినిగూడ నుద్ధరింపగలరు. వ్రతి నిశ్చయముగ తనతలిదండ్రులను, సోదరులను, సోదరీమణులను, అత్తమామలను, పుత్రపౌత్రులను, పుత్రికలను, జామాతలను, భృత్యవర్గమునుగూడ నుద్ధరింప గలడు. నారదా! ఈ యేకాదశీపవిత్రవ్రతము సుఖమునకు, మోక్షమునకు నేకైకసాధనము. ఇట్లు శ్రీకృష్ణదివ్యచరితమును, వ్రతమును వర్ణించితిని. మరల పరమాత్మయొక్క యితరాద్భుతలీలలను వర్ణించెద నవధరింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున ఏకాదశీవ్రతనిరూపణ మను
ఇరువదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

# ఇరువదియేడవ అధ్యాయము

## గోపికావస్త్రాపహరణము :

శ్రీనారాయణ ఋషి పలికెను :

నారదా! ఇపుడు నేను శ్రీకృష్ణపరమాత్మయొక్క అద్భుతదివ్యలీలా వర్ణన మొనరించెద నవధరింపుము. గోపికావస్త్రాపహరణ మను నీదివ్యలీల యందు పరమాత్మ తనయనన్యమధురభక్తిసమన్వితలైనగోపికాకన్యకల అహంకార మనువస్త్రముల నపహరించి వారికి మనోవాంఛితవరములను ప్రసాదించెను. పరబ్రహ్మమునే ప్రాణవల్లభునిగ బడయవలె నని యాగోపికాకన్యల యేకైకమనోవాంఛ. హేమంతఋతువు ప్రథమమాస మైనమార్గశీర్ష మందు గోపాంగనలు పరమాత్మయొక్క అనన్యప్రేమకు వశీభూతులై ప్రతిదినము కేవల మొకపర్యాయము హవిష్యాన్నమును భుజించుచు సంయమశీలలై యొక మాసపర్యంతము భక్తిభావముతో జయదుర్గావ్రత మాచరించుచుండిరి. వారందఱు స్నాన మాచరించి పరిశుద్ధలై తీరముపై ఇసుకతో పార్వతీదేవి మూర్తి నొనరించి, ఆమూర్తియందు దేవిని యావాహనచేసి మంత్రోచ్చారణపూర్వకముగ ప్రతినిత్యము పూజ లొనరింపదొడంగిరి. మునీశ్వరా! గోపికలు చందనాగరుకస్తూరీకుంకుమలతో, నానాప్రకారము లగుమనోహర పుష్పములతో, పుష్పహారములతో, ధూపదీపనైవేద్యవస్త్రాదులతో, మణిముక్తాప్రవాలములతో బూజించుచు ననేకఫలముల నర్పించుచు, వివిధవాద్యములను ప్రయోగించుచు పూజ సంపన్న మొనరించి వారందఱు తమ మనోభీష్టముల నిట్లర్థించిరి.

హే దేవీ జగతాం మాతః సృష్టిస్థిత్యన్తకారిణి ।
నన్దగోపసుతం కాన్తమస్మభ్యం దేహి సువ్రతే ॥ 6

దేవీ! జగదంబా! నీవే జగములను సృష్టించి, పాలించి, సంహరించుదానవు. జననీ మాకు నందనందనుడైన శ్యామసుందరునే ప్రాణవల్లభుని రూపమున బ్రసాదింపుము.

మహర్షి! మహామంత్రముచే దుర్గాదేవిమూర్తిని నిర్మించి సంకల్పమొనరించి సామవేదోక్తమూలమంత్రము ద్వారమున ఆమెను బూజింపవలెను. ఆ బీజమంత్రము నుపదేశించుచున్నాను. సావధానచిత్తుడవై గ్రహింపుము.

"ఓం శ్రీదుర్గాయై సర్వవిఘ్నవినాశిన్యై నమః"

ఈ మహామంత్రమునే గోపకుమారికలు భక్తిభావముతో జపించుచు దేవీప్రసన్నతకొఱకు పుష్పములను, పుష్పమాలికలను, ధూపదీపనైవేద్యములను, దివ్యవస్త్రములను సర్పించిరి. ప్రతిదినము ప్రవాళమాలతో (పగడముల మాలతో) ననన్యభక్తిసమన్వితలై యీబీజమంత్రమును వేయిపర్యాయములు జపించి, స్తుతించి, సాష్టాంగదండప్రణామము లర్పించి, జయదుర్గావ్రతమును సంపన్న మొనరించుచుండిరి. వారు తమమనోవాంఛితమును ప్రసాదింపుమని యిట్లు ప్రార్థించిరి.

సర్వమఙ్గలమాఙ్గల్యే సర్వకామప్రదే శివే ।
దేహి మే వాంఛితం దేవి నమస్తే శఙ్కరప్రియే ॥ 11

"సమస్తమంగళములకే మంగళ మొనరించు దేవీ! సర్వమనోభీష్టములను ప్రసాదించుశంకరప్రియా! శివా! నీకు మా నమస్కారములు. జననీ! మాకు మామనోవాంఛితవరమును బ్రసాదింపుము."

ఇట్లు దేవిని యర్థించి పూజ యొనరించి, దక్షిణను, నైవేద్యములను పురోహితుల కర్పించి తదనంతరమే ప్రతిదినము గృహములకు వెడలుచుండిరి.

మునీశ్వరా! ఏ స్తవరాజముచే గోపికాకిశోరికలు భక్తిపూర్వకముగ పార్వతీదేవిని స్తుతించిరో సంపూర్ణ అభీష్టఫలదాయని యైనయా దేవీ స్తవము నుపదేశించెదను. ఏకార్ణవమందు మునిగియుండగ, సూర్యచంద్రులశక్తి యంతరింపగా అంజనాకారముగ నఖండజలరాశి సర్వచరాచరవిశ్వము నావరించి యుండగ, ఆ సమయమున నేకార్ణవజలశాయి యైనశ్రీహరి యా

నారాయణార్ధాఙ్గభూతా తేన తుల్యా చ తేజసా ।
తదా తస్య శరీరస్థా తేన నారాయణీ స్మృతా ॥

నిర్గుణస్య చ నిత్యస్య వాచకశ్చ సనాతనః ।
సదా నిత్యా నిర్గుణా యా కీర్తితా సా సనాతనీ ॥

జయః కళ్యాణవచనో యకారో దాతృవాచకః ।
జయం దదాతి యా నిత్యం సా జయా పరికీర్తితా ॥

సర్వమఙ్గలశబ్దశ్చ సమ్పూర్ణైశ్వర్యవాచకః ।
ఆకారో దాతృవచనస్తద్ధాత్రీ సర్వమఙ్గలా ॥

నామాష్టకమిదం సారం నామార్థసహ సంయుతమ్ ।
నారాయణేన యద్దత్తం బ్రహ్మణే నాభిపఙ్కజే ॥

తస్మై దత్త్వా నిద్రితశ్చ బభూవ జగతాం పతిః ।
మధుకైటభౌ దుర్దాన్తౌ బ్రహ్మాణం హన్తుముద్యతౌ ॥

స్తోత్రేణానేన స బ్రహ్మా స్తుతిం నత్వా చకార హ ।
సాక్షాత్ స్తుతా తదా దుర్గా బ్రహ్మణే కవచం దదౌ ॥

శ్రీకృష్ణకవచం దివ్యం సర్వరక్షణనామకమ్ ।
దత్త్వా తస్మై మహామాయా సాన్తర్ధానం చకార హ ॥

స్తోత్రం కుర్వన్తి నిద్రాశ్చ సంరక్ష్య కవచేన వై ।
నిద్రానుగ్రహతః సద్యః స్తోత్రస్యైవ ప్రభావతః ॥

తత్రాఽఽజగామ భగవాన్ వృషరూపే జనార్దనః ।
శక్త్యా చ దుర్గయా సార్థం శఙ్కరస్య జయాయ చ ॥

సరథం శఙ్కరం మూర్ధ్ని కృత్వా చ నిర్భయం దదౌ ।
అత్యూర్ధ్వం ప్రాపయామాస జయా తస్మై జయం దదౌ ॥

స్తోత్రస్యైవ ప్రభావేణ సంప్రాప్య కవచం విధిః ।
వరం చ కవచం ప్రాప్య నిర్భయం ప్రాప నిశ్చితమ్ ॥

బ్రహ్మా దదౌ మహేశాయ స్తోత్రం చ కవచం వరమ్ ।
త్రిపురస్య చ సంగ్రామే సరథే పతితే హరౌ ॥

బ్రహ్మాస్త్రం చ గృహీత్వా స సవిద్రం శ్రీహరిం స్మరన్ ।
స్తోత్రం చ కవచం ప్రాప్య జఘాన త్రిపురం హరః ॥

స్తోత్రేణానేన తాం దుర్గాం కృత్వా గోపాలికాః స్తుతిమ్।
లేభిరే శ్రీహరిం కాన్తం స్తోత్రస్యాస్య ప్రభావతః ॥

గోపకన్యాకృతం స్తోత్రం సర్వమఙ్గలనామకమ్ ।
వాంఛితార్థప్రదం సద్యః సర్వవిఘ్నవినాశనమ్॥

త్రిసన్ధ్యం యః పఠేన్నిత్యం భక్తియుక్తశ్చ మానవః ।
శైవో వా వైష్ణవో వాపి శాక్తో దుర్గాత్ ప్రముచ్యతే ॥

రాజద్వారే శ్మశానే చ దావాగ్నౌ ప్రాణసఙ్కటే ।
హింస్రజన్తుభయగ్రస్తో మగ్నః పోతే మహార్ణవే ॥

శత్రుగ్రస్తే చ సంగ్రామే కారాగారే విపద్గతే ।
గురుశాపే బ్రహ్మశాపే బన్ధుభేదే చ దుస్తరే ॥

స్థానభ్రష్టే ధనభ్రష్టే జాతిభ్రష్టే శుచాన్వితే ।
పతిభేదే పుత్రభేదే ఖలసర్పవిషాన్వితే ॥

స్తోత్రస్మరణమాత్రేణ సద్యో ముచ్యేత నిర్భయః ।
వాంఛితం లభతే సద్యః సర్వైశ్వర్యమనుత్తమమ్॥

ఇహలోకే హరేర్భక్తిం దృఢాం చ సతతం స్మృతిమ్।
అన్తే దాస్యం చ లభతే పార్వత్యాశ్చ ప్రసాదతః ॥ 17—50

**బ్రహ్మదేవుడు స్తుతించిన స్తోత్రము :**

దుర్గా! శివా! అభయా! మాయా! నారాయణీ! సనాతనీ! జయా! సర్వమఙ్గళా! నాకు మంగళములను ప్రసాదింపుము, నీకు నా నమస్కారము. దుర్గా శబ్దమందలి 'ద' కారము దైత్యనాశరూపార్థమునకు వాచకము. 'ఉ' కారము విఘ్ననాశరూపార్థమునకు బోధకము. ఈశబ్దార్థములు వేద సమ్మతములు. 'రేఫ' రోగవినాశమునకర్థము. 'గ' కారము పాపనాశకము, 'ఆ' కారము భయ, శత్రునాశక ప్రతిపాదక మనబడెను. ఏదేవిచింతన స్మరణకీర్తనమాత్రము ననే దైత్యాదులు నిశ్చయముగ నశించెదరో, ఆ దుర్గాదేవి శ్రీహరిశక్తి యన బడెను. ఈవచనమును సాక్షాత్తుగా శ్రీహరియే ప్రవచించెను. 'దుర్గ' శబ్దము విపత్తి వాచకము, 'ఆ' కారము నాశమునకర్థము. విపత్తులను నాశమొనరింప గలయాదేవియే దుర్గ యనికీర్తింపబడెను. 'దుర్గ' శబ్దము దైత్యరాజైనదుర్గా సురునకు వాచకము, 'ఆ' కారము నాశార్థబోధకము. పూర్వకాలమందు దేవి యాదుర్గాసురుని వధించెను, అందువలనే విద్వాంసు లామెను 'దుర్గ' యని స్తుతించిరి.

'శివా' శబ్దమందు 'శ' కారము కళ్యాణార్థకము, 'ఇ' కార ముత్కృష్ట సమూహబోధకము, 'వా' కారము దాతృవాచకము. ఆదేవి కళ్యాసమూహము లను మఱియు ఉత్కృష్ట వస్తువులను సాధింపగలదు, అందువలననే ఆమెను భక్తులు 'శివా' యని కీర్తించిరి. 'శివ' యనగ మూర్తీభవించిన కల్యాణరాశి, అందువలన గూడ ఆమెను 'శివా' యనిరి. శివశబ్దము మోక్షమునకర్థము 'ఆ' కారము దాతృవాచకము. ఆదేవి స్వయముగ మోక్షమును ప్రసాదింపగలదు. అందువలననే ఆమెను 'శివా' యనిరి.

అభయ మనగ భయనాశనము, 'ఆ' కారమునకు దాత యని యర్థము ఆమె తత్కాలమే యభయమును ప్రసాదించును! అందువలననే దేవి అభయ యనబడెను.

'మా' అనగా రాజ్యలక్ష్మి, 'యా' అనగా ప్రాప్తింపజేయుననియర్థము శీఘ్రముగ రాజ్యలక్ష్మి గలిగింప జేయునామెను మాయ యనిరి. మా అనగా మోక్షము, 'య' యనగా ప్రాప్తియని యర్థము. మోక్షమును గలుగజేయు దేవిని 'మాయ' యనిరి.

ఆదేవి నారాయణుని యర్ధాంగము, ఆయనతో సమాన మైన తేజస్విని, ఆమెనివాసమాయునయందే కావున ఆమెను నారాయణి యని భక్తులు కీర్తించిరి.

సనాతన శబ్దము నిత్యమునకు, నిర్గుణమునకు వాచకము. ప్రాకృతిక నిర్గుణయు నిత్యయునగునామెనే సనాతని యని కీర్తించిరి.

జయశబ్దము కళ్యాణవాచకము; 'ఆ' కారము దాతృవాచకము, సదా ఆశ్రితులకు జయమును బ్రసాదించు నాదేవినామధేయము 'జయ' యయ్యెను.

సర్వమంగళశబ్దము సంపూర్ణైశ్వర్యబోధకము, 'ఆ' కారము దాతృ వాచకము. ఆదేవి సంపూర్ణైశ్వర్యములను ప్రసాదించును గావున ఆమెను భక్తులు సర్వమంగళ యనికీర్తించిరి. దుర్గాదేవి యీ యష్టనామములు దివ్యములు, ఈస్తోత్ర మాదివ్యనామవ్యుత్పత్త్యర్థములచేయుక్తము.

నారాయణుడు తన నాభికమలమున విరాజమానుడై యున్న బ్రహ్మకీస్తోత్రము నుపదేశించి యోగనిద్రను ఆశ్రయించెను. మధుకైటభు లను

రాక్షసులు బ్రహ్మను సంహరించుట కుద్యుక్తులుకాగా, బ్రహ్మ యీస్తోత్రముచే దుర్గను స్తుతించెను. దుర్గ బ్రహ్మకు సాక్షాత్కరించి సర్వరక్షణ మను శ్రీకృష్ణదివ్యకవచము నుపదేశించి యంతర్ధానమయ్యెను. ఈస్తోత్రప్రభావము వలననే విధాతకు దివ్యకవచము ప్రాప్తించెను. శ్రీకృష్ణుని శ్రేష్ఠకవచమును బొంది బ్రహ్మ నిర్భయుడయ్యెను. తదనంతరము బ్రహ్మ త్రిపురాసురసంగ్రామమందు రథసహితముగ నాకాశమునుండి పతితు డైనశంకరున కీస్తోత్రమును నుపదేశించెను. శివుడు శ్రీకృష్ణకవచద్వారమున ఆత్మరక్షణ మొనరించుకొని యోగనిద్రను స్తుతించెను. ఈ కవచస్తోత్ర ప్రభావమువలన జనార్దనుడే వృషభ రూపధారియై త్రిపురాసుర సంగ్రామ మధ్యమున నావిర్భవించి రథసహితముగ మాహేశ్వరుని యుద్ధరించి యభయమును బ్రసాదించి మరల ఆకాశమునకు దీసికొని వెళ్ళెను. దుర్గ సాక్షాత్కరించి హరునకు విజయమును బ్రసాదించెను. ఆసమయమున శంకరుడు బ్రహ్మాస్త్రమును సంధించి యోగనిద్రా సహితముగ శ్రీహరిని స్మరించుచు ఈ స్తోత్రకవచ ప్రభావమువలన అజేయులైన త్రిపురాసులను వధింపగల్గెను.

ఈ స్తోత్రముచే దుర్గను స్తుతించి గోపకుమారికలు శ్రీహరినే ప్రాణవల్లభుని రూపమున పొందగల్గిరి. ఈ స్తోత్రప్రభావమే యట్టిదని గ్రహింపుము. గోప కన్యలద్వారమున స్తుతింపబడిన యీసర్వమంగళ మనుస్తోత్రము సమస్త విఘ్నవినాశకము, మఱియు మనోవాంఛితఫల ప్రదాయకము. శైవులైనను, వైష్ణవులైనను, శాక్తేయులైనను, మఱియెవరైనను యీస్తోత్రమును బ్రతిదినము భక్తిభావముతో పఠించిన సంకటము లన్నియు నశింపగలవు. స్తోత్ర స్మరణ మాత్రమునవే మనుష్యుడు సంకటముక్తుడై నిర్భయుడు కాగలడు. రాజద్వారమందుగాని, శ్మశానమందుగాని, దావాగ్ని మధ్యమునగాని, ప్రాణసంకటమందుగాని,క్రూరజంతుభయముగాని సంభవించినపుడు, మహార్ణవజలములందు చిక్కినపుడు, శత్రుగ్రస్తులైనపుడు, సంగ్రామమధ్యమున, కారాగారమందు, విపత్తులందు, గురుశాపము, బ్రహ్మశాపము సంభవించినపుడు, బంధువియోగమందు, స్థానభ్రష్టమందు, ధనజాతిభ్రష్టములందు, పతిపుత్రభేదములందు ఖలసర్పవిషభయము సంభవించినపుడు, ఈస్తోత్రమును స్మరించినమాత్రమున మానవుడీసంకటములన్నింటినుండి విముక్తుడుకాగలడు. వానికి సమస్తైశ్వ

శ్వర్యములు, మనోవాంఛితములు శీఘ్రముగ ప్రాప్తింపగలవు. పార్వతీదేవి కృపచే నాతఁ డిహలోకమందు శ్రీహరి భక్తి స్మృతిసమన్వితుఁడై, అంత్యకాలమందు భగవంతుని దాస్యసౌభాగ్యమును బొందగలడు.

ఈస్తవరాజమును స్తుతించుచు గోపకన్యకలొక మాసముపర్యంతము ప్రతిదిన మత్యంతభక్తితో నీశ్వరిని యారాధించిరి. వ్రతసమాప్తిదినమున గోపకన్యకలు కౌతూహలవశమున తమవస్త్రములను నదీతటముపై వ్రతసామగ్రిచెంత విడి వివస్త్రలై జలక్రీడ లొనరించుటకు యమునానదిలో ప్రవేశించిరి. నారదా! నానావిధరత్నములతో, ముత్యములతో నలంకరింపబడిన వివిధవర్ణమనోహర వస్త్రములు యమునా నదీతటమంతట వ్యాపించినవి. చందనాగరుకస్తూరీ సుగంధద్రవ్యములసువాసనలచే భరితమైనశీతలవాయువు తటప్రాంత మంతయు వ్యాపించి సువాశిత మొనరించెను. అనేకరకముల నైవేద్యములచే, దేశకాలానుసారముగలభించుఫలములచే,ధూపదీపసిందూరకుంకుమలచే సమన్వితమైయమునా తీరము శోభిల్లెను. తమమనస్సులను బూర్తిగ శ్రీకృష్ణునకు సమర్పించిన యాగోపికలు వ్రతసమయమందు నగ్నముగస్నాన మాడరాదను స్మృతివచనమును మరచి వస్త్రహీనలై యమునానదిలో జలక్రీడలందాసక్తలైరి. గోపికలకు దివ్యజ్ఞానమునుగలిగింపవలె నని శ్రీకృష్ణపరమాత్మ సంకల్పించి గోపబాల సమన్వితుఁడై యమునాతటమున కరుదెంచి వస్త్రములచే, పూజాద్రవ్యములచే, వివిధనైవేద్యములచే నిండియున్నయాప్రదేశమును గాంచెను. ఆలీలామానుష విగ్రహుఁడు సకలనైవేద్యములను,గోపబాలసహితముగ తానే యారగించి తద నంతరము గోపబాలికల వస్త్రములను సంగ్రహించి యమునానదీతటమునపై నున్నకదంబవృక్షముపై వస్త్రసహితముగ నాసీనుఁడయ్యెను. వస్త్రములను గానక ఆశ్చర్యచకిత లైన గోపికలను గాంచి పరమాత్మ యిట్లు పల్కెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

గోపబాలికలారా మీ రందఱు వ్రతకర్మమందు సఫలలైరి. మొదట నేను ప్రవచించు విధివిధానమును బాలించి జలక్రీడలనొనరింపుడు. వ్రతకాలమందు వివస్త్రలై జలములందు స్నానమాడిన వ్రతఫలము సంపూర్ణముగ నశింపగలదు. వ్రతసమయమందు వివస్త్రయై స్నానమాచరించునా స్త్రీపై వరుణుడాగ్రహించును. వరుణునియనుచరులే మీవస్త్రములను సంగ్రహించి యుందురు.

ఇప్పుడుమీరు వివస్త్రలై గృహముల కెట్లుచేరగలరు ? మీ వ్రత మేమి కాగలదు! మీరు వ్రతద్రవ్యములను రక్షింపక జలక్రీడ కేల యొనరించుచున్నారు!

శ్రీకృష్ణుని వచనముల నాలకించి గోపబాలికలు తమ వస్త్రములు, పూజాద్రవ్యములు నేమైనవో యనిచింతించుచు రెండుహస్తములను ముకుళించి భక్తిభావముతో శ్యామసుందరు నిట్లుప్రార్థించిరి. గోవిందా ! నీవీదాసికి శ్రేష్ఠమివి గావున మావస్త్రములను నీవ స్తువులుగానే భావించి గ్రహింపుము. వానిని సంగ్రహించుటకు స్పృశించుటకు నీకు సర్వాధికారము కలదు. కాని వ్రతోపయోగము లైనయన్యవస్తువు లారాధ్యదేవి స్వాంతములు, ఆమె కర్పింపక యా వస్తువులను గ్రహించుట నీ కుచితముకాదు. భక్తిజ్ఞానములను ప్రసాదించుటకే మావస్త్రములను పూజాద్రవ్యములను సంగ్రహించితి వని గ్రహించితిమి. దేవా ! మా వస్త్రములను మా కిమ్ము, వస్త్రములను ధరించి వ్రతసమాప్త మొనరించి మనోవాంఛితవరమును బొందెదము". గోపికలప్రార్థనల నాలకించి మందస్మితముఖారవిందుడై ఆ సచ్చిదానందవిగ్రహుడు మీరే స్వయముగ జలములను వీడి యరుదెంచి వస్త్రములను గ్రహింపు డనిపల్కెను.

శ్రీకృష్ణునియాదేశము నాలకించినరాధాసహితులగు సర్వగోపకన్యల యవయవము లన్నియు భక్తిభావతరంగిణులచే పులకించినవి. వారు జలములను వీడి బయల్వెడలక జలమధ్యముననే నిలువబడిరి. బ్రహ్మశివానంతధర్మాదులకు గూడ వందనీయములు మనోవాంఛితఫలప్రదాయకములు నగు నాచరణారవిందములను గోపికాసహితయై రాధ చింతింపదొడంగెను. మాధుర్యభక్తిభావముచే పులకితయై యానందబాష్పపూర్ణ నేత్రములతో హస్తములను ముకుళించి, గుణాతీతు డైనపరమేశ్వరుని యామె యిట్లుస్తుతింపదొడంగెను.

## రాధాకృత శ్రీకృష్ణ స్తోత్రము :

గోలోకనాథ గోపీశ మదీశ ప్రాణవల్లభ ।
హే దీనబన్ధో దీనేశ సర్వేశ్వర నమోఽస్తు తే ॥
గోపేశ గోసమూహేశ యశోదానన్దవర్ధన ।
నన్దాత్మజ సదానన్ద నిత్యానన్ద నమోఽస్తుతే ॥
శతమన్యోర్మన్యుమగ్న బ్రహ్మదర్పవినాశక ।
కాలీయదమన ప్రాణనాథ కృష్ణ నమోఽస్తుతే ॥

శివానన్తేశ బ్రహ్మేశ బ్రాహ్మణేశ పరాత్పర ।
బ్రహ్మస్వరూప బ్రహ్మజ్ఞ బ్రహ్మబీజ నమోఽస్తు తే ॥
చరాచరతరోర్బీజ గుణాతీత గుణాత్మక ।
గుణబీజ గుణాధార గుణేశ్వర నమోఽస్తు తే॥
అణిమాదికసిద్ధీశ సిద్ధేః సిద్ధిస్వరూపక ।
తపస్తపస్వి స్తపసాం బీజరూప నమోఽస్తు తే॥
యదనిర్వచనీయం చ వస్తు నిర్వచనీయకమ్ ।
తత్స్వరూప తయోర్బీజ సర్వబీజ నమోఽస్తు తే ॥
అహం సరస్వతీ లక్ష్మీర్దుర్గా గఙ్గా శ్రుతిప్రసూః ।
యస్య పాదార్చనాన్నిత్యం పూజ్యా తస్మై నమో నమః॥
స్పర్శనే యస్య భృత్యానాం ధ్యానేన చ దివానిశమ్।
పవిత్రాణి చ తీర్థాని తస్మై భగవతే నమః ॥
ఇత్యేవముక్త్వా సా దేవీ జలే సంన్యస్య విగ్రహమ్।
మనః ప్రాణాంశ్చ శ్రీకృష్ణే తస్థౌ స్థాణుసమా సతీ ॥
రాధాకృతం హరేః స్తోత్రం త్రిసన్ధ్యం యః పఠేన్నరః।
హరిభక్తిం చ దాస్యం చ లభేద్రాధాగతిం ధ్రువమ్ ॥
విపత్తౌ యః పఠేద్భక్త్యా సద్యః సమ్పత్తిమాప్నుయాత్ ।
చిరకాలగతం ద్రవ్యం హృతం నష్టం చ లభ్యతే॥
బన్ధువృద్ధిర్భవేత్తస్య ప్రసన్నం మానసం పరమ్।
చిన్తాగ్రస్తః పఠేద్భక్త్యా పరాం నిర్వృతిమాప్నుయాత్ ॥
పతిభేదే పుత్రభేదే మిత్రభేదే చ సఙ్కటే ।
మాసం భక్త్యా యది పఠేత్సద్యః స దర్శనం లభేత్॥
భక్త్యా కుమారీ స్తోత్రం చ శృణుయాద్వత్సరం యది ।
శ్రీకృష్ణసదృశం కాన్తం గుణవన్తం లభేద్ధ్రువమ్॥

గోలోకనాథా! గోపీశ్వరా! స్వామి! ప్రాణవల్లభా! దీనబాంధవా! దీనేశ్వరా! సర్వేశ్వరా! నీకునమస్కారము. గోపేశ్వరా! గోసముదాయములకీశ్వరా! యశోదానందవర్ధనా! నందనందనా! సదానందా! నిత్యానందా! నీకు నమస్కారము. ఇంద్రక్రోధభంగకారీ! గోవిందా! బ్రహ్మదర్పహారీ! కాలీయదమనా! ప్రాణనాథా! శ్రీకృష్ణా! నీకు నమస్కారము. శివానంతాదులకు గూడ నీశ్వరా! బ్రహ్మకు, బ్రాహ్మణులకు నీశ్వరా! బ్రహ్మస్వరూపా! బ్రహ్మజ్ఞా! బ్రహ్మబీజా!

నీకు నమస్కారము. చరాచార జగద్రూప మైనవృక్షమునకు బీజాస్వరూపా! గుణాధారా! గుణాతీతా! గుణస్వరూపా! గుణబీజా! గుణాధారా! గుణేశ్వరా! నీకు నమస్కారము. ప్రభూ! నీవు అణిమాదిసకలసిద్ధులకు స్వామివి. నీవు సిద్ధులకు సిద్ధిస్వరూపుడవు. తపస్విన్! నీవే తపము, నీవే తపోబీజము, నీకు నమస్కారము. అనిర్వచనీయములైన, నిర్వచనీయములైన, సకలవస్తువులు నీస్వరూపములే. నీవే సకలపదార్థములకు ఆదిబీజము, సర్వబీజరూపా! ప్రభూ నీకు నావందనములు.

నేను (రాధ), సరస్వతి, లక్ష్మి, దుర్గ, గంగ, వేదమాత యగుసావిత్రి మొదలగువారము నీచరణారవిందముల నర్చించి నిత్యపూజనీయులమైతిమి. అట్టి పరమేశ్వరుడవై ననీకు మరలమరల నమస్కారములు. నీసేవకులను స్పృశించిన మాత్రముననే,ధ్యానించిన మాత్రముననే సకలతీర్థములు పవిత్రములు కాగలవు. భగవంతుడ వయిన నీకు నానమస్కారములు.

ఇట్లుస్తుతించి రాధిక తనశరీరమును జలమందు, మనస్సును శ్రీకృష్ణునందు నిలిపి అవిచలభావమునందెను. రాధాదేవిచే స్తుతింపబడిన యీస్తోత్రమును బ్రతిదినము త్రిసంధ్యలయందు బఠించువారికి శ్రీహరిభక్తి, దాస్యసౌభాగ్యము శ్రీరాధకు లంభించినయుత్తమగతి సులభములు కాగలవు. విపత్తులందు భక్తిభావముతో నీస్తోత్రమును బఠించువారికి శీఘ్రముగ సంపదకల్గును. చిరకాలముక్రింద నష్టబోయినధనము మరల ఉపలబ్ధమగును. వారికి బంధువులు వృద్ధిచెందగలరు, మనస్సుప్రసన్నమగును. పతిభేదమందు, పుత్రభేదమందు, సంకటములందు ఒకమాసపర్యంతము భక్తితో పఠించినవారు సంకటవిముక్తులు కాగలరు. కన్యలు భక్తిభావముతో నొకసంవత్సరపర్యంతమీస్తోత్రమును శ్రవణ మొనరించిన వారికి నిశ్చయముగ శ్రీకృష్ణసముడైన, మనోహరుడైన, గుణవంతుడైన భర్త లభింపగలడు.

జలమందుండి గోపకన్యాసహితముగ రాధ శ్రీకృష్ణునిచరణారవిందములను ధ్యానించి, స్తుతించెను. తదనంతరము వారందఱు కన్నులతెరువగ సకలచరాచరజగమంతయు శ్రీకృష్ణమయముగ గోచరించెను. మాయామానుష వేషధారి యైనబాలశ్రీకృష్ణుడు సామాన్యుడు కాడని సకలచరాచరజగము లందంతట, లోపల, బయట వ్యాపించియున్నపరమాత్మ యని, అఖండపరబ్రహ్మ

జ్యోతియని, ఆ జ్యోతికేమూలకారణు డైనసచ్చిదానందవిగ్రహు డని గ్రహించి, రెండుహస్తములనెత్తి యనన్యమాధుర్యభక్తిభావముతో ననేక ప్రణామము లర్పించిరి. వారియజ్ఞానాంధకార మంతయు శ్రీకృష్ణునియనన్య కృపాస్వరూప మైనయనంతకోటిసూర్యప్రకాశమువలన పటాపంచలయ్యెను. వారు భక్తివైరాగ్యములందు, మహాయోగులకంటె అగ్రగణ్యులైరి. శ్రీకృష్ణుని యనన్యకృపాకటాక్షములను బొందిన యాగోపికల జన్మమే ధన్యము. నారదా! తదనంతరము ఆ గోపికలు యమునాతటముపై యథాస్థానము న నమవస్త్రములను, పూజాద్రవ్యములను గాంచిరి. వారు నిర్భయులై జలము లను వీడి తటమున కరుదెంచి వస్త్రములను ధరించి తమవ్రతమును సంపూర్ణ మొనరించిరి. దుర్గాదేవివ్రతప్రభావమువలన వారు తమమనోవాంఛిత వరము లనుబొంది స్వగృహములకు వెడలిపోయిరి.

నా ర దు డు ప లి కె ను :

దేవా! ఆదివ్యవ్రతనామధేయ మేమి? ఆ వ్రతవిధానము నా కుపదే శించి ఫలమును వర్ణింపుము. ఈ వ్రతమున కేయేవస్తువులను సేకరింపవలెనో, దక్షిణ యెట్లొసంగవలెనో మొదలగు విషయములను వివరింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

వత్సా! ఈవ్రతవిధానము నుపదేశించెదను, సావధానుడవై యవధ రింపుము. గౌరీవ్రత మనునీవ్రతమును ప్రప్రథమున మార్గశీర్షమాసమందు స్త్రీ లొనరించిరి. ఈవ్రతాచరణము పురుషులకు ధర్మార్థకామమోక్షములను శ్రీకృష్ణభక్తిని నొసంగగలదు. సకలదేశములం దీకామితార్థఫలప్రదాయక వ్రతము ప్రసిద్ధిగాంచెను. సర్వోత్కృష్టు డైనపతిని వాంఛించుస్త్రీ లీవ్రత మాచరించిన నిశ్చయముగ వారిమనోభీష్టము సిద్ధింపగలదు. కుమారి యైనకన్య వ్రతమున కొకదినము ముందుగనే యుపవాస మాచరించి పరిశుద్ధ మొనరించిన వస్త్రములను ధరించి సంయమపూర్వకముగ నుండవలెను. మార్గశీర్షమాస సంక్రాంతిదినమున ప్రాతఃకాలమందే నిద్ర మేల్కాంచి నిత్యకృత్యములను పూర్తిచేసికొని శ్రద్ధాపూర్వకముగ పవిత్రనదియందు స్నాన మాచరించి పరిశుద్ధవస్త్రములను ధరింపవలెను.

తదనంతరము కలశమందు గణేశ్వరుని, సూర్యుని, అగ్నిని, విష్ణువును శివుని, దుర్గను, ఆవాహన మొనరించి ఆయా ర్గుఱు దేవతలను పంచోపచారములచే పూజింపవలెను. కలశమున కెదుట విస్తృతమైన చతురస్రాకార వేదికను నిర్మింపవలెను. చందనాగరుకస్తూరీకుంకుమలచే నావేదికను సంస్కరించి, ఆ వేదికపై దశభుజయగు దుర్గాదేవివాలుకామయమూర్తిని నిర్మింపవలెను. దేవిలలాటమందు సిందూరబిందువు నలంకరించి సర్వాంగములందు చందన కర్పూరముల నలంకరింపవలెను. దేవిని యావాహన మొనరించి నిమ్నలిఖిత మంత్రమును బఠించుచు పూజ నారంభింపవలెను.

హే గౌరీ శఙ్కరార్ధాఙ్గీ యథా త్వం శఙ్కరప్రియా ।
తథా మాం కురు కల్యాణి కాన్తకాన్తాం సుదుర్లభామ్ ॥ 130

శంకరునియర్ధాంగీ! కళ్యాణమయీ, గౌరీదేవీ! నీవు శంకరున కత్యంత ప్రియవైనట్లే నన్నుగూడ నాప్రియతము డగుభర్తకును పరమదుర్లభ యగు ప్రాణవల్లభగ నొనరింపుము.

ఈ మంత్రమును బఠించి జగదంబను ధ్యానింపవలెను. అత్యంతగూఢమైన, సర్వాభీష్టప్రదాయని యైన యీధ్యానము సామవేదమందు వర్ణితము. నారదా! దేవతలకు మునీంద్రులకైనను పరమదుర్లభమైన యాధ్యానము నుపదేశించెదను శ్రవణ మొనరింపుము. ఈ దివ్యధ్యానముచే సిద్ధపురుషులు దుర్గతినాశిని యనుదుర్గను ధ్యానింతురు.

దుర్గాధ్యానమ్ :

శివాం శివప్రియాం శైవాం శివవక్షఃస్థలస్థితామ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం సుప్రతిష్ఠాం సులోచనామ్॥
నవయౌవనసమ్పన్నాం రత్నాభరణభూషితామ్ ।
రత్నకఙ్కణకేయూర రత్ననూపుర భూషితామ్ ॥
రత్నకుణ్డలయుగ్మేన గణ్డస్థలవిరాజితామ్।
మాలతీమాల్య సంసక్తకబరీం భ్రమరాన్వితమ్ ॥
సిన్దూరతిలకం చారు కస్తూరిబిన్దునా సహ ।
వహ్నిశుదాంశుకాం రత్నకిరీటాం సుమనోహరామ్ ॥

మణీన్ద్రసారసంసక్తరత్నమాల సముజ్జ్వలామ్ ।
పారిజాతప్రసూనానాం మాలాజాలానులమ్బితామ్॥

సుపీనకఠినశ్రోణీం బిభ్రతీం చ స్తనానతామ్ ।
నవయౌవన భారౌఘాదీషన్నమ్రాం మనోహరామ్॥

బ్రహ్మాదిభిస్స్తూయమానాం సూర్యకోటిసమప్రభామ్॥
పక్వబిమ్బాధరోష్ఠీం చ చారుచమ్పకసన్నిభామ్॥

ముక్తాపఙ్క్తివినిన్ద్యైక దన్తరాజివిరాజితామ్ ।
ముక్తికామప్రదాం దేవీం శరచ్చన్ద్రముఖీం భజే॥ 133-140

శివయు (కల్యాణస్వరూపిణియు), శివప్రియయు, శివునితో బ్రగాఢ సంబంధము కలదియు, శివునివక్షస్థలమున విరాజిల్లుచుండునదియు, మందహాసముచే ప్రసన్నమైన ముఖముగలదియు, సువ్రతిష్ఠయు, సులోచనయు, నవయౌవనసంపన్నయు, రత్నాభరణభూషితయు, రత్నకంకణకేయూరములచేత రత్ననూపురములచేత భూషితయు, రత్నకుండలములచేత విరాజిల్లుగండస్థలములుగలదియు, మాలతీమాలలతో సంసక్తమైన జుట్టుముడిగలదియు, కస్తూరీబిందువులతోగూడిన సుందరమైన సిందూరతిలకముగలదియు, వహ్నిశుద్ధాంశుకయు, కిరీటయు, మనోహారియు, మణీంద్రసారసంసక్తమైన రత్నమాలచే సముజ్జ్వలమైనదియు, పారిజాతప్రసూనమాలలు జానువులవఱకు వ్రేలాడుచున్నదియు, పీనములును కఠినములును నగు పిఱుదులుకలదియు, స్తనభారముచే వంగినదియు, నవయౌవనభారముచే గొలదిగ వంగినదియు, బ్రహ్మాదులచే స్తుతింపబడునదియు, సూర్యకోటిసమప్రభయు, పక్వబింబాధరోష్ఠియు, చారుచంపకసన్నిభయు, ముక్తాపంక్తిని తిరస్కరించు దంతపంక్తిచే విరాజిల్లుచున్నదియు, పరోక్షమున మనోభీష్టములను ప్రసాదించునదియు, శరచ్చంద్రముఖియు నగు పార్వతీదేవిని సేవించుచున్నాను.

ఇట్లు ధ్యానమొనరించి మస్తకముపై పుష్పముల నుంచుకొని ప్రతి ప్రసన్నతాపూర్వకముగ పుష్పములతో బూజించుచు భక్తిభావముతో పూజ నారంభింపవలెను. పూర్వోక్తమంత్రమును బఠించుచు ప్రతిదినము హర్ష పూర్వకముగ దేవికి షోడశోపచారముల నర్పింపవలెను. తదనంతరము ప్రీతి భక్తితోను, ప్రసన్నతతోను సమన్వితుడై పూర్వకథితస్తోత్రముచే దేవిని

స్తుతించి ప్రణామము లర్పించి భక్తిభావముతో వ్రతకథను నేకాగ్రచిత్తుడై యాలకింపవలెను.

నారదుడు పలికెను :

దేవా! నీవు వ్రతవిధానమును, ఫలములను, అద్భుతమగు గౌరీస్తోత్ర ధ్యానములను వర్ణించి నన్ను ధన్యునిగ నొనరించితివి. దేవా! ఈ వ్రతకథను నాకు సవిస్తరముగ నుపదేశింపుము. మొదట యీ వ్రతమును నెవరు నిర్వర్తించిరి? తదనంతర మెవరు భూమిపై నీవ్రతమును ప్రకాశిత మొనరించిరి? సకలసందేహనివారణా! ఈ విషయముల నన్నింటిని విస్తారపూర్వకముగ వర్ణింపుము.

శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! కుశధ్వజుని పుత్రికయగు వేదవతి పుష్కరతీర్థమందు ప్రథమమున నీదివ్యవ్రతము ననుష్ఠించెను. వ్రతసమాప్తిదినమున కోటిసూర్యసమాన ప్రకాశ మైనజగదంబ లక్షలకొలదిగ యోగినులతో పరివేష్టితయై దివ్యరథారూఢయై, ప్రసన్నముఖారవిందముతో దర్శన మొసంగెను. సంయమశీలవతియై వ్రత మాచరించు వేదవతిని గాంచి యిట్లుపల్కెను.

పార్వతీదేవి పలికెను :

వేదవతీ! నీకుశుభమగుగాక. నీ వొనరించినయీపవిత్రవ్రతమువలన నే నత్యంతసంతుష్టనైతిని, నీమనోవాంఛితవరముకోర్కుము, నేనవశ్యముగ ప్రసాదించెదను.

శ్రీనారాయణఋషి పలికెను :

నారదా! పార్వతియనుగ్రహవచనముల నాలకించి వేదవతి ప్రసన్నహృదయాంతరంగయై తనివిదీర దేవిని దర్శించి ముకుళితహస్తయై యనేకప్రణామములర్పించి యిట్లుపల్కెను, "దేవీ! నేను శ్రీమన్నారాయణుని మనోవాక్కాయకర్మలచే ప్రేమించుచున్నాను. కావున యాసర్వేశ్వరుడే నాప్రాణవల్లభు డగునటుగ వరమును ప్రసాదింపుము. నీచరణకమలములందు నాకు సుదృఢభక్తిని ప్రసాదింపుము. ఈవరములుదక్క ఇతరవరములను వేనినిగూడ కాంక్షింపను.

వేదవతి యర్థించినవరములను విని జగదంబ యగుపార్వతి మందస్మిత ముఖారవిందయై రథమును డిగ్గి యామారివల్లభతో నిట్లుపల్కెను. "జగదంబా! నీమాహాత్మ్యము నాకు సర్వము విదితమే. నీవు సాక్షాత్తు శ్రీమహాలక్ష్మివి నీపవిత్రపాదధూళితో భారతవర్షమును పునీత మొనరించుటకే వసుంధరపై నవతరించితివి. తపస్వినీ! కేవలము నీ వీవ్రతమును లోకశిక్షణకొఱకై యొన రించితివి. నీవు సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుని ప్రియురాలవు. ప్రతిజన్మ ములోను దప్పక ఆయన కర్ధాంగివి కాగలవు. భవిష్యత్తులో దస్యులను. రాక్షసులను సంహరించి భూభారమును హరించుటకు పరిపూర్ణ పరమాత్మ యగుశ్రీ మహావిష్ణువు దశరథనందనుడైన శ్రీరాముని రూపమున వసుధపై నవతరించును. ఆయన యనన్యభక్తులైన జయ విజయులు సనకసనందనాదుల శాపవశమున రక్కసులై యవనిపై జన్మించిరి. వారిని యుద్ధరించుటకే త్రేతాయుగమందు అయోధ్యాపురిలో శ్రీహరి శ్రీరా ముడై యావిర్భవించును, నీవు త్రుడు శిశురూపమును ధరించి త్రేతాయుగమున మిథిలకు దయచేయుము. జనకు డయోనిజయైనకన్యరూపమున నిన్ను యజ్ఞభూమినుండి పుత్రికగబొంది పెంచును. జనకకుమారి వైనసీనామ ధేయము సీత యని ప్రసిద్ధిగాంచును. శ్రీరాముడే స్వయముగ మిథిలా నగరమున కరుదెంచి నీపాణిగ్రహణ మొనరింపగలడు. దేవీ నీవు ప్రత్యేక కల్ప మునందు శ్రీమన్నారాయణుని ప్రాణవల్లభవు కాగలవు."

ఇట్లు వేదవతికి పార్వతీదేవి మనోవాంఛితవరములను ప్రసాదించి యంతర్ధాన మయ్యెను. వేదవతి ఘోరతప మాచరించి త్రేతాయుగమందు మిథిలకు జని బాలికారూపమున ధరణిలో దాగెను. సంతానప్రాప్తికొఱకు యజ్ఞ మొనరింప సంకల్పించి జనకుడు యజ్ఞవాటికను నాగేటితో దున్నుచుండగ ఆయనకు భూమిలో మందసాంతర్గతయై యాదివ్య శిశువు లభించెను. ఆదివ్యబాలిక యంగకాంతి ప్రతప్తసువర్ణ మువలెప్రకాశ మానము. బాలికను గాంచగనే జనకుడు అత్యంత ప్రేమతో సంకమున జేర్చు కొనెను. ఆసమయమున నశరీరవాణి జనకు నిట్లుసంబోధించెను. "రాజా! అయోనిజ యైనయాకన్య! శ్రీమహాలక్ష్మి. ఈమెను పుత్రికగగ్రహింపుము. స్వయముగ శ్రీమన్నారాయణుడే నీజామత కాగలడు". అశరీరవాణి నాలకించి జనకచక్రవర్తి సీత నల్లారుముద్దుగ బెంచి పెద్దచేసెను. సమయమాసన్న మైనంతన పూర్వకాలమందు వేదవతి యొనరించినదుర్గావ్రత ప్రభా

వమువలన శ్రీమన్నారాయణుడే శ్రీరాముడై మిథిలకు అరుదెంచి ధనుర్భంగ మొనరించి జానకిని బరిణయమాడెను.

నారదా! ప్రప్రథమమున వశిష్ఠమహర్షి యీదివ్యవ్రతమును పృథ్వీతలముపై ప్రకాశితమొనరించెను. శ్రీరాధాదేవి యీవ్రతమునను ష్ఠించి శ్రీకృష్ణుని ప్రాణవల్లభునిరూపమున పొందగల్గెను. భారతవర్షమందీపవిత్రవ్రత మాచరించు కన్యకలకు నిశ్చయముగ శ్రీకృష్ణతుల్యుడైన భర్త లభింపగలడు, ఇందే మాత్రము సంశయములేదు.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

యమునానదీతీరమునపై రాధాసహితగోపకన్యలు సాంగోపాంగముగ నిజయదుర్గావ్రతమునొకమాసమువఱ కనుష్ఠాన మొనరించిరి. సమాప్తిదినమున వారు వ్రతమును పరిపూర్ణ మొనరించి కాణ్వశాఖయందువర్ణించిన స్తోత్రము ద్వారా పార్వతీదేవిని స్తుతించిరి. పూర్వకాలమందు సత్యపరాయణయగు సీతాదేవి యీస్తోత్రముచే దుర్గను ప్రసన్నురాలిగ నొనరించికొని కమలనయనుడైన శ్రీరామునే ప్రియపతిగ బొందగల్గెను. అదివ్యస్తోత్రము నుపదేశించెద నవధరింపుము.

జా న క్యు వా చ

శక్తిస్వరూపే సర్వేషాం సర్వాధారే గుణాశ్రయే ।
సదా శఙ్కరయుక్తే చ పతిం దేహి నమోఽస్తు తే ॥

సృష్టిస్థిత్యన్తరూపేణ సృష్టిస్థిత్యన్తరూపిణి ।
సృష్టిస్థిత్యన్తబీజానాం బీజరూపే నమోఽస్తు తే॥
హే గౌరి పతిమర్మజ్ఞే పతివ్రతపరాయణే ।
పతివ్రతే పతిరతే పతిం దేహి నమోఽస్తు తే ॥

సర్వమఙ్గలమాఙ్గల్యే సర్వమఙ్గలసంయుతే ।
సర్వమఙ్గలబీజే చ నమస్తే సర్వమఙ్గలే ॥
సర్వప్రియే సర్వబీజే సర్వాశుభవినాశని ।
సర్వేశే సర్వజనకే నమస్తే శఙ్కరప్రియే॥

పరమాత్మస్వరూపే చ నిత్యరూపే సనాతని ।
సాకారే చ నిరాకారే సర్వరూపే నమోఽస్తు తే ॥

క్షుత్తృష్ణేచ్ఛా దయా శ్రద్ధా నిద్రా తన్ద్రా స్మృతిః క్షమా ।
ఏతాస్తవ కలాః సర్వా నారాయణి నమోఽస్తు తే ॥

లజ్జా మేధా తుష్టిపుష్టిశాన్తిసమ్పత్తి వృద్ధయః ।
ఏతాస్తవ కలాః సర్వాః సర్వరూపే నమోఽస్తు తే ॥

దృష్టాదృష్టస్వరూపే చ తయోర్బీజఫలప్రదే ।
సర్వానిర్వచనీయే చ మహామాయే నమోఽస్తుతే ॥

శివే శఙ్కరసౌభాగ్యయుక్తే సౌభాగ్యదాయిని ।
హరిం కాన్తం చ సౌభాగ్యం దేహి దేవి నమోఽస్తుతే ॥

స్తోత్రేణానేన యాః స్తుత్వా సమాప్తిదివసే శివామ్।
నమన్తి పరయా భక్త్యా తా లభన్తి హరిం పతిమ్॥

ఇహ కాన్తసుఖం భుక్త్వా పతిం ప్రాప్య పరాత్పరమ్।
దివ్యం స్యన్దనమారుహ్య యాత్యన్తే కృష్ణసంనిధిమ్॥ 173-184

సర్వశక్తిస్వరూపా! శివా! నీవు సర్వజగత్తులకు నాధారభూతవు. నీవు సమస్తసద్గుణములకు నిధివి, శంకరుని సంయోగసుఖము ననుభవించుదాన వైన నీకు నమస్కారము. సృష్టిస్థితిసంహారరూపిణీ! సృష్టిస్థితిసంహారములు నీస్వరూపములే. సృష్టిస్థితిసంహారములకు బీజములకుగూడ బీజరూపిణి వైననీకు నమస్కారము. పతిమర్మము నవగత మొనరించుకొన్న పతివ్రతపరాయణా, గౌరీ! పతివ్రతా! పత్యనురాగిణీ! నాకు భర్తను బ్రసాదింపుము. దేవీ నీకు నమస్కారము. నీవు సమస్తమంగళములకే మంగళరూపిణివి, సర్వమంగళములకు బీజస్వరూపిణివి, సర్వమంగళా! నీకు నమస్కారము. సర్వప్రియా! సర్వబీజస్వరూపిణీ! సర్వవిధములగు! నశుభములను వినాశన మొనరింపగల దేవీ! సర్వేశ్వరీ! సర్వజననీ! శంకరప్రియా! నీకు నమస్కారము. పరమాత్మస్వరూపిణీ! నిత్యరూపిణీ! సనాతనీ నీవు సాకారవు నిరాకారవు, సర్వరూపిణీ! నీకు నమస్కారము. క్షుధా, తృష్ణా, ఇచ్ఛా, దయా, శ్రద్ధా, నిద్రా, తంద్రా, స్మృతి, క్షమా, మొదలగున వన్నియు నీకళలే, నారాయణీ! నీకు నమస్కారము. దృష్టాదృష్టములు రెండు నీస్వరూపములే, నీవు వానికి బీజము ఫలము రెండింటిని బ్రసాదింపగలవు. ఎవ్వరైనను నీనిర్వచన మొనరింపలేరు. మహామాయా! నీకు నమస్కారము. శివా! నీవు శంకరసౌభాగ్యయుక్తవు, సర్వులకు సౌభాగ్యప్రదాయినివి. దేవీ! శ్రీహరియే నాప్రాణవల్లభుడు,

నా సౌభాగ్యము. ఆయననే నాకు గాంతునిగ బ్రసాదింపుము. దేవీ నీకు నమస్కారము. వ్రతసమాప్తిదినమున ఈస్తోత్రముచే ననన్యభక్తితో శిరములను వంచి శివాదేవిని స్తుతించువారికి సాక్షాత్తుగ శ్రీహరితుల్యుడు పతిరూపమున లభింపగలడు. వారిహలోకమందు బరాత్పరు డైనపరమేశ్వరునే ప్రాణనాథునిగ బొంది, కాంతాసుఖమును ఉపభోగించి యంత్యకాలమందు దివ్యవిమానారూఢలై శ్రీకృష్ణసన్నిధిని చేరగలరు.

వ్రతసమాప్తిదినమున గోపికాసహితయై శ్రీరాధ దుర్గాదేవి కనేక వందనముల నర్పించి, స్తుతించి జయగౌరీవ్రతమును సంపూర్ణ మొనరించెను. పురోహితునకు ప్రసన్నతాపూర్వకముగ సహస్రగోవులను, నూరుస్వర్ణముద్రలను దక్షిణగ నొసంగెను. వేయిబ్రాహ్మణులకు సంతర్పణ మొనరించి పేదలకు ధనకనకవస్తువాహనములను దాన మొనరించి, వివిధవాద్యములను ప్రయోగించుచు అఖండహరినామసంకీర్తనము గావించెను. ఆ సమయముననే దుర్గతినాశని యగుదుర్గ ఆకాశమధ్యమున రాధాది గోపికలకు సాక్షాత్కరించెను. యఖండబ్రహ్మతేజఃప్రకాశసంపన్నయు, ప్రసన్నమందస్మితముఖారవిందయునై దుర్గ నూర్గురుయోగినులచే బరివేష్టితురాలై సింహములను పూంచినరథముపై రత్నమయాలంకారములచే ఆభూషితయై యుండెను. దశభుజములు గల్గిన దుర్గాదేవిరథమును డిగ్గి రాధవద్ద కరుదెంచి ఆమెను హృదయాలింగన మొనరించెను. సర్వగోపికలు శివను గాంచి భక్తితో బ్రణామము లర్పించిరి. దుర్గ వారందఱిని యాశీర్వదించి మీమనోరథ మవశ్యముగ సిద్ధించుగాక యనువరమును బ్రసాదించెను. తదనంతరము పార్వతి మందస్మితముఖారవిందయై రాధను సంబోధించి యిట్లుపల్కెను.

పార్వతి పలికెను :

రాధా! నీవు సర్వేశ్వరు డైనశ్రీకృష్ణునకు ప్రాణాధికప్రియవు. జగదంబికా! మాయామానవరూపమున బ్రాదుర్భవించిన నీవు కేవలము లోకశిక్షణార్థమే యీవ్రత మొనరించితివి.

శ్రీకృష్ణార్ధాఙ్గసమ్భూతా కృష్ణతుల్యా చ తేజసా ।
తవాంశకలయా దేవ్యః కథం త్వం మానుషే సతీ ॥

భవతీ చ హరేః ప్రాణా భవత్యాశ్చ హరిః స్వయమ్ ।
వేదేనాస్తి ద్వయోర్భేదః కథం త్వం మానుషీ సతీ ॥
షష్టివర్షసహస్రాణి బ్రహ్మా తప్త్వా తపః పురా ।
న తే దదర్శ పాదాబ్జం కథం త్వం మానుషీ సతీ॥
కృష్ణాజ్ఞయా చ త్వం దేవీ గోపీరూపం విధాయ చ ।
ఆగతాసి మహీం శాన్తే కథం త్వం మానుషీ సతీ ॥
సుయజ్ఞో హి నృపశ్రేష్ఠో మనువంశసముద్భవః ।
త్వత్తో జగామ గోలోకం కథం త్వం మానుషీ సతీ॥
త్రిఃసప్తకృత్వో నిర్భూపాం చకార పృథివీం భృగుః ।
తవ మన్త్రేణ కవచాత్కథం త్వం మానుషీ సతీ॥
శఙ్కరాత్ప్రాప్య త్వన్మన్త్రం సిద్ధం కృత్వా చ పుష్కరే॥
జఘాన కార్తవీర్యం చ కథం త్వం మానుషీ సతీ ॥
బభంజ దర్పాద్దన్తం చ గణేశస్య మహాత్మనః ।
త్వత్తో నామ భయం చక్రే కథం త్వం మానుషీ సతీ ॥
షయ్యుద్ధతాయాం కోపేన భస్మసాత్కర్తు మీశ్వరః।
రరక్షాగత్యమత్రిత్వా కథం త్వం మానుషీ సతీ ॥
కల్పే కల్పే తవ పతిః కృష్ణో జన్మని జన్మని ।
వ్రతం లోకహితార్థాయ జగన్మాతస్త్వయా కృతమ్॥
అహో శ్రీదామశాపేన భారావతరణేన చ ।
భూమౌ తవాధిష్ఠానం చ కథం త్వం మానుషీ స ॥
అయోనిసమ్భవా త్వం చ జన్మమృత్యుజరాపహా ।
కలావతీసుతా పుణ్యా కథం త్వం మానుషీ సతీ ॥ 196—207

దేవీ! నీవు శ్రీకృష్ణుని యర్ధాంగ సంభూతవు, కావున ఆయన సమాన తేజోరూపిణివి. సమస్త దేవాంగనలు నీకళాంశలచే పాదుర్భవించిరి. అయినచో నీవు మానవకాంత వెట్లుకాగలవు?

నీవు శ్రీహరికి ప్రాణస్వరూపిణివి, స్వయముగ శ్రీహరియే నీప్రాణము. మీయిరువురియందు భేదము లేదని వేదములు ఘోషించుచున్నవి. కావున నీవు మానవస్త్రీ వెట్లుకాగలవు? పూర్వకాలమందు బ్రహ్మ యఱువదివేల సంవత్సరములు తప మొనరించినను నీచరణారవిందములను దర్శించలేకపోయెను, కావున నీవు మానవకాంత వెట్లుకాగలవు? నీవు సాక్షాత్తుగ వరాదేవివి, కేవలము శ్రీకృష్ణునియాజ్ఞను బరిపాలించుటకు గోపికారూపమును ధరించి పృథ్విపై యవతరించితివి. శాంతా! సతీ! నీవు మానవ కాంత వెట్లుకాగలవు?

మనువంశములోద్భవుడైన సుయజ్ఞుడు నీయనన్య కృపాకటాక్షమువలనే గోలోకము చేరెను, అయినచో నీవు మానవకాంత వెట్లుకాగలవు! నీమంత్రి కవచముల ప్రభావమువలనే భృగువంశములోద్భవుడైన పరశురాముడు పృథ్విని యిరువదియొక్క పర్యాయములు క్షత్రియశూన్య మొనరింపగల్గెను. అట్టిదశ యందు నీవు మానవకాంత వెట్లుకాగలవు! పరశురాముడు శంకరుని ముఖార విందమునుండి నీదివ్యమంత్రమును శ్రవణ మొనరించి, పుష్కరతీర్థమందు మంత్రసిద్ధి పొంది, ఆ మంత్రప్రభావమువలనే కార్తవీర్యార్జునుని సంహరింప గల్గెను. అయినచో నీవు మానవకాంత వెట్లుకాగలవు! పరశురాముడభిమాన పూర్వకముగ గణేశ్వరుని యొకదంతమును ఖండించెను. పరశురాముడు కేవలము నిన్ను గాంచిన భయ మొందెను. అయినచో నీవు మానవకాంత వెట్లుకాగలవు! నేను క్రోధసంపన్నయై పరశురాముని భస్మ మొనరించుట కుద్యుక్తురాలను కాగా, నాప్రసన్నతకొఱకు నీవే న్యాయముగ నడుదెంచి భృగురాముని రక్షించితివి. అయినచో నీవు మానవస్త్రీ వెట్లుకాగలవు! శ్రీకృష్ణుడు ప్రత్యేకకల్పములందు, జన్మజన్మలందు నీప్రాణేశ్వరుడే. జగ న్మాతా! నీవు కేవలము లోకములకు హితమును సమకూర్చుటకే ఈవ్రతమును నిర్వర్తించితివి. అహా! శ్రీదాముని శాపమువలన భూభారమును నశింప జేయుటకొఱకే పృథ్విపై నీ నవతరించితివి. అయినచో నీవు మానవకాంత వెట్లుకాగలవు! జన్మమృత్యుజరావ్యాధులను నాశ మొనరించుదేవీ! నీవు కళావతి కయోనిజపుత్రికవు అఖండపుణ్యమయివైతివి. అయినచో నీవు సాధారణమనుష్యస్త్రీ వనియెట్లువిశ్వసింపగలను!

మూడుమాసములు గడచినపిదప మనోహరమగుమధు (చైత్ర) మాస మాసన్నమగును, అపుడు రాత్రిసమయమున నిర్జనసుందరబృందావనమందు రాసమండలములో శ్రీహరితో నీకు సమస్తగోపికలకు దివ్యరాసక్రీడ సానంద ముగ సంపన్నముకాగలదు. రాధా! ప్రత్యేకకల్పమం దవనిపై శ్రీహరితో రసమయముగ నీదివ్యలీలలు సకళ్ళవింపగలవు, ఇది విధివిధానము, ఈవిధానము నెవ్వ రాపగలరు! సుందరీ! శ్రీహరిప్రియా! నే నెట్లుమహాదేవునకు సౌభాగ్యవతియగుపత్నినో, అట్లే నీవును శ్రీకృష్ణునకు సౌభాగ్యశాలినీ యగు ప్రాణవల్లభవు కాగలవు. క్షీరములందు ధావళ్యము. అగ్నియందు దాహికా శక్తి, భూమియందు గంధము, జలములందు శైత్యమున్నట్లే శ్రీకృష్ణునియందు

నీ వుండగలవు. దేవాంగనలయందు, మానవకన్యలందు గంధర్వ స్త్రీలందు, రాక్షసస్త్రీలు మొదలగువా రందఱియందు నిన్ను మించిన సౌభాగ్యవతులు లేరు, ఉండరు, ఉండబోరు. నావరప్రభావమువలన బ్రహ్మాది దేవతావందితుడైన, గుణాతీతుడైన, పరాత్పరపరబ్రహ్మమునగుశ్రీకృష్ణ దేవ్యాయముగ నీయధీనమువం దుండగలదు. పతివ్రతా! బ్రహ్మశేషశివధర్మాదు లచే ఆరాధింపబడువాడు ధ్యానాసాధ్యుడు, ఆరాధనద్వారమున పరమయోగుల కైనను దుర్లభుడునగు నాభగవంతుడు నీయధీనుడై యుండగలడు. రాధా ! సమస్తస్త్రీలందు నిన్ను మించినసౌభాగ్యవతి వేరొకరు లేరు. దేవీ ! నీవు మనోవాంఛితకాలమువఱకు బృందావనమందు శ్రీకృష్ణునితో క్రీడించి, తద నంతర మాయనతో గలసి గోలోకము జేరగలవు.

మునీశ్వరా ! ఇట్లామోఘము లైనదివ్యవరములను పార్వతీదేవి రాధా సహితలగుగోపికలకు బ్రసాదించి, అంతర్ధానమయ్యెను. తదనంతరము రాధ గోపికలతో గలసి గృహములకు వెడలుట కుద్యుక్తురాలు కాగా, శ్రీకృష్ణుడు రాధయెదుట సాక్షాత్కరించెను. అత్యంతకిశోరవయస్కుడు శ్యామ సుందరుడు నగుశ్రీకృష్ణుని రాధాసహిత లగుగోపికలు తమసమక్షమున దర్శించి యత్యంతానందహృదయాంతరంగలైరి.

> పీతవస్త్రపరీధానం నానాలఙ్కారభూషితమ్।
> ఆజానుమాలతీమాలావనమాలావిభూషితమ్॥
>
> ఈషద్ధాస్యప్రసన్నాస్యం భక్తానుగ్రహకాతరమ్।
> చన్దనోక్షితసర్వాఙ్గం శరత్పఙ్కజలోచనమ్॥
>
> శరత్పార్వణచన్ద్రాస్యం సద్రత్నమకుటోజ్జ్వలమ్।
> పక్వదాడిమబీజాభదశనం సుమనోహరమ్॥
> వినోదమురలీహస్తన్యస్తలీలాసరోరుహమ్।
> కోటికన్దర్పలావణ్యలీలాధామ మనోహరమ్॥
>
> గుణాతీతం స్తూయమానం బ్రహ్మానన్తశివాదిభిః।
> బ్రహ్మస్వరూపం బ్రాహ్మణ్యం శ్రుతిభిశ్చనిరూపితమ్॥
>
> అవ్యక్తమక్షరం వ్యక్తం జ్యోతిరూపం సనాతనమ్।
> మఙ్గల్యం మఙ్గలాధారం మఙ్గలం మఙ్గలప్రదమ్॥ 219—224

పీతవస్త్రములను ధరించినవాడును, నానావిధాలంకారములచే భూషితు డును, జానువులవఱకు వ్రేలాడుమాలతీమాలలచేత వనమాలలచేత విభూషి

తుడును, మందహాసముచే ప్రసన్న మైనమోముగలవాడును, భక్తానుగ్రహ కాతరుడును, చందనచర్చితము లైనఅవయవములుగలవాడును, శరత్కాలము నందలి పంకజములవంటి విశాలము లైనలోచనములు గలవాడును, శరత్కాల పూర్ణిమనాటిచంద్రునివంటి మోముకలవాడును, సద్రత్నమకుటముచే నుజ్జ్వల మైనవాడును, పండినదానిమ్మగింజలవంటి పలువరుసగలవాడును, మనో హరుడును, వినోదార్థమై యొకహస్తమందు మురళిని వేఱొకహస్తమందు లీలాకమలమును ధరించినవాడును, కోటికందర్పలావణ్యలీలాధాముడును, గుణా తీతుడును, బ్రహ్మేశానంతశివాదులచే స్తుతింపబడువాడును, బ్రహ్మస్వరూపుడును, బ్రహ్మణ్యుడును, శ్రుతులచే నిరూపితుడును, అవ్యక్తుడు, అక్షరుడు, వ్యక్తుడు, జ్యోతిరూపుడు, సనాతనుడు, మాంగల్యుడు, మంగళాధారుడు, మంగళుడు, మంగళప్రదుడు నగుశ్యామసుందరుని దివ్యసుందరరూపమునుగాంచి రాధ వేగ ముగ సమీపమునకు వెడలి ఆయున కనేకప్రణామము లర్పించెను. శ్రీరాధను గాంచిన శ్యామసుందరుని ముఖారవిందము, నేత్రములు పరిపూర్ణప్రసన్నతతో వికసించినవి. సర్వగోపికలయెదుట నిలువబడి భగవాన్ శ్రీకృష్ణుడు రాధతో డిట్లుపల్కెను. "ప్రాణాధికప్రియా, రాధికా! నీవు నీమనోవాంఛితవరమును గోరుకొనుము. గోపికలారా! మీరుకూడ మీమనోభీష్టములను నిస్సంకోచముగ నర్థింపుడు.

శ్రీకృష్ణునియుపారానుగ్రహము నాలకించి రాధాసహితగోపిక లత్యంత హర్షపూర్ణహృదయాంతరంగలై భక్తవాంఛాకల్పతరు డైనయాప్రభువు నిట్లు వరముల నర్థించిరి.

**రాధికాదేవి పలికెను :**

త్వత్పదాబ్జే మన్మనోఽలిః సతతం భ్రమతు ప్రభో।
పాతు భక్తిరసం పద్మే మధుపశ్చ యథా మధు ॥

మదీయప్రాణనాథస్త్వం భవ జన్మని జన్మని ।
త్వదీయచరణామ్భోజే దేహి భక్తిం సుదుర్లభమ్॥

తవ స్మృతౌ గుణే చిత్తం స్వప్నే జ్ఞానే దివానిశమ్॥
భవేన్నిమగ్నం సతతమేతన్మమ మనీషితమ్ ॥ 230-232

ప్రభూ ! నాచిత్తరూప మైనచంచరీకము నీచరణకమలములందే భ్రమించుగాక. మధుపము (భ్రమరము) కమలముపై నుండి మకరందపాన మొనరించునట్లునామన స్సనెడుభ్రమరముకూడ చరణారవిందములందే యుండి నిరంతరము భక్తిరసాస్వాదన మొనరించునట్లు నన్ననుగ్రహింపుము. దేవా ! జన్మజన్మములయందు నీవే నాప్రాణనాథుడవై నీచరణకమలములందు పరమ దుర్లభభక్తిని నాకు ప్రసాదింపుము. నామనము జాగ్రదావస్థయందు, నిద్రా వస్థయందు, అహర్నిశములు నీస్వరూపగుణచింతనమందే సతతము నిమగ్నమై యుండు నట్లనుగ్రహింపుము. ఇవియే నామనోవాంఛితవరములు, కృపతో ప్రసాదింపుము.

తదనంతరము సర్వగోపికలు శ్రీకృష్ణు నిట్లర్థించిరి. "ప్రాణబన్ధూ ! నీవు జన్మజన్మములందు మాప్రాణనాథుడవై మ మ్మనుగ్రహింపుము. శ్రీరాధ వలెనే మాకుకూడ నీసామీప్యసేవాసౌభాగ్యమును ప్రసాదింపుము.

శ్రీరాధాసహిత లగుగోపికలు త మ్మర్థించినవరములను శ్రీకృష్ణపర మాత్మ తథాస్తనిపల్కి వారి ననుగ్రహించెను. తదుపరి ప్రసన్నముఖార విందు డైనయశోదానందనుడు శ్రీరాధకు ప్రేమపూర్వకముగ సహస్రదళ యుక్త మైనక్రీడాకమలమును, వనమాలను, అన్యగోపికలకు పుష్పములను, హారములను బహూకరించెను. తదనంతర మాయన మందస్మితముఖార విందుడై యాగోపికలతో నిట్లుపల్కెను. అనన్యభక్తశిరోమణులారా ! గోపాంగనలారా ! మూడుమాసములు గడచినపిదప బృందావనాంతర్గత మగు సురమ్యరాసమండలములో మీరందఱు నాతో దివ్యరాసక్రీడల నొనరింప గలరు. నే నెట్లోమీరును నట్లే, మనయం దెట్టిభేదము లేదు. నేనే మీ ప్రాణము. మీరందఱు నాప్రాణస్వరూపిణులు. ప్రియగోపికలారా ! మీ రీదివ్యగౌరీవ్రతమును స్వార్థసిద్ధికొఱకుగాక, లోకశిక్షార్థమే యొనరించిరి. ఎందువలెననగ, మీరు గోలోకపరంధామమునుండి నాతో నవనిపై యవత రించిరి, మరల మీరందఱు నాతో గోలోకమును జేరగలరు. నేను జన్మ జన్మములందు మీవాడనే, మీరందఱు నాకు నాప్రాణములకంటె నధికప్రియ మైనవారు, ఇందు లేశమైనను సంశయము లేదు."

శ్రీకృష్ణుని గోపికలందఱు నిరీక్షించుచు యమునాతీరముచెంతనే బహు కాలము నిలువబడిరి. వారు ప్రేమపూర్వకముగ పరమాత్మసుందరముఖార

విందమును దర్శించి తమనేత్రచకోరములచే శ్రీహరిముఖచంద్రునిసుధను పాన మొనరించిరి. ఆహా, ఆగోపబాలికల యఖండసౌభాగ్యము సర్వజగత్తులం దెంతటివారికైనను దుర్లభమే. ఆజగజ్జనులు భ్రమించినపవిత్రబృందావన మందొక రేణువై వారిపాదములను స్పృశించినను జీవుడు జన్మమృత్యుజరా చక్రమునుండి విముక్తుడై నిశ్చయముగ గోలోకవరంధామము జేరగలడు. రాధాసహితగోపకుమారిక లందఱు శ్రీకృష్ణుని యనేకవిధముల స్తుతించి మరలి పోలేకపోలేక పరమాత్మయాజ్ఞ గైకొని గృహములకు వెడలిపోయిరి. శ్రీకృష్ణుడు గోపబాలాసహితుడై నందపురము జేరెను. నారదా! గోపికా వస్త్రాపహరణ మనుశ్రీహరి యొనరించినయీదివ్యలీలాచరిత మత్యంత మంగళము, అనంతసుఖప్రదాయకము,

ఇది మదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున గోపికావస్త్రాపహరణప్రస్తావన
మను ఇరువదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

# ఇరువదియెనిమిదవ అధ్యాయము

## శ్రీకృష్ణదివ్యరాసవిలాసవర్ణనము

నారదుడు పలికెను :

దేవా! మూడుమాసములు గడచిన పిమ్మట ఆగోపాంగనలు శ్రీహరి నెట్లుగలసికొనిరి. బృందావన మెట్లుండును? రాసమండలస్వరూప మేమి? శ్రీకృష్ణు డొక్కడేకదా! గోపిక లెందఱో గలరు. అట్టిదశలో నాక్రీడ లెట్లు సంభవమయ్యెను? నామనస్సు భగవంతుని క్రొంగ్రొత్తదివ్యలీలాచరితములను శ్రవణ మొనరించుట, కీర్తించుట యత్యంతపవిత్రకార్యము. దేవా! కృపతో నీ వారాసక్రీడావర్ణన మొనరింపుము.

సూతుడు పలికెను :

శౌనకాదిమహర్షులారా! నారదుడు ప్రశ్నించిన విషయముల నాలకించి శ్రీమన్నారాయణఋషీంద్రు డత్యంతప్రసన్నహృదయాంతరంగుడై మందహాస మొనరించుచు శ్రీకృష్ణదివ్యలీలాప్రవచనము నిట్లుకొనసాగించెను.

శ్రీనారాయణఋషి పలికెను :

మునీశ్వరా! చైత్రమాసశుక్లపక్షత్రయోదశీదినమున చంద్రోదయమైన పిమ్మట శ్రీకృష్ణుడు బృందావనమును ప్రవేశించెను. యూథికామాలతీకుంద మాధవి మొదలగుపుష్పములను స్పృశించి మందమందముగ వీచుశీతల సుగంధితపవనము లాబృందావనప్రాంతము నంతటిని సువాసిత మొనరించెను. మధుపములు మధువును గ్రోలుటకు భ్రమించుచు చేయుమధురధ్వనిచే నాప్రదేశమనోహరత్వము వృద్ధిగాంచెను. క్రొంగ్రొత్త పల్లవములచే బరిపూర్ణము లైయున్నఫలభరితవృక్షములపై వ్రాలి 'కుహూ, కుహూ' అని మధురముగ గాన మొనరించు కోయిలల కలరవములతో బృందావనప్రాంతము ప్రతిధ్వనించెను. చందనాగరుకస్తూరీకుంకుమ సుగంధము వనమం దంతట వ్యాపించి యుండెను. రత్నమయప్రదీపప్రకాశములచే ఆవన మంతయు బ్రకాశించెను. సుగంధధూపదీపములచే నాప్రాంతమంతయు సువాసితమయ్యెను. బృందావనమధ్యమున శ్రీకృష్ణపరమాత్మ సంకల్పమాత్రముననే గోళాకారమైనదివ్యరాసమండల మావిర్భవించెను. చందనాగరుకస్తూరీకేసరములచే ఆరాసమండలభూమి సంస్కరింపబడెను. రాసమండలము నలుదెసల పుష్పభరితోద్యానములు, క్రీడాసరోవరములు కలవు. ఆ విశాలసరోవరములందు హంసలు, కారండవములు, జలకుక్కుటములు మొదలగుపక్షులు విహరించుచు కలరవము లొనరించుచుండెను. ఆ సరోవరములు జలక్రీడాయోగ్యములు సురతశ్రమనివారకములు, శుద్ధస్ఫటికమణిసదృశ స్వచ్ఛనిర్మలజలభరితములు. రాసమండలమంతయు అరటిస్తంభములచే నలంకరింపబడి శోభిల్లెను. ఆ ప్రదేశము ఆమ్రపల్లవతోరణములచే నలంకరింపబడి సిందూరచందనభరితము లైన మంగళకలశములచే శోభిల్లెను. అఖండశోభాసంపన్న దివ్యరాసమండల మధ్యమున మందస్మితముఖారవిందుడై శ్రీకృష్ణపరమాత్మ యత్యంత మధురాతి మధురగ మురళిపై బ్రహ్మగాంధర్వగీత మాలపింపనారంభించెను. ఆ మధుర

మురళీరవము శ్రీకృష్ణప్రేయసు లైనగోపాంగనలమాధుర్యప్రేమను వృద్ధి చేయగలదు.

శ్రీరాధ పరమాత్మ యొనరించినమధురమురళీధ్వనిని ఆలకింపగనే ప్రేమాకులయై తనచేతనత్వమును గోల్పోయెను. ఆమెచిత్తము శ్రీకృష్ణ దివ్యపాదారవిందధ్యానమందు సంలగ్నమయ్యెను. క్షణముతరువాత మరల చేతనత్వమును పొంది ఆవశ్యకకార్యముల నన్నింటిని బరిత్యజించి పరబ్రహ్మ మును జేరుటకు జీవుడు పరితపించి సర్వకర్మలనిర్మూలన మొనరించి బయలుదేరి నట్లు రాధ గృహమును వీడి నిశ్శంకయై రాసమండలమునకు బయలుదేరెను. నాల్గువైపుల ప్రతిధ్వనించు భగవంతుని మధురమురళిగానము నాలకించి రాధా సహితగోపికలు ఆగానము ననుసరించి బయలుదేరిరి. వారిమనస్సు లన్నియు శ్రీకృష్ణపరమాత్మచరణారవిందములందే సంలగ్నములైయున్నవి. వారు వివిధరత్నమయాభూషణవిభూషితులై తమసహజతేజస్సులచే దేదీప్యమానముగ బ్రకాశించుచు బృందావనప్రాంతమునంతమునంతటిని ఆనిశీథసమయమున జాజ్జ్వల్యమాన మొనరించిరి.

సుశీలాదు లైనముప్పదిముగ్గురు రాధకత్యంతప్రాణసఖులు. వీరు గోపికలలో నత్యంతశ్రేష్ఠులు. వీరందఱు శ్రీకృష్ణప్రసాదితదివ్యపరప్రభా వములవలన పరమాత్మయం దాకృష్టచిత్తలై ఆనిశీథసమయమున నిఃశ్శంకలై సర్వధర్మములను బరిత్యజించి మాధుర్యప్రేమకు వశీభూతలై గృహములను వీడి బృందావనమునకు బయలుదేరిరి. వీరి ననుసరించి లక్షలాది గోపికలు బయలుదేరి బృందావనప్రాంతమున నేకత్రితలైరి. వారు కుసుమ మాలికలను, చందనాదిసుగంధద్రవ్యములను, వింజామరలను ధరించి పర మాత్మను సేవించుటకు బృందావనము జేరిరి. వారినడుమ రాధ హర్షసమన్విత హృదయాంతరంగయై నిలువబడెను. రాధాసహితగోపిక లందఱు శ్రీహరి దివ్యనామసంకీర్తన మొనరించుచు శీఘ్రగమనముచే రాసమండలము జేరిరి. పరబ్రహ్మమును జేరవలె ననియాగోపిక లొకక్షణమైనను విలంబన మొనరింపక సాంసారికసుఖము లన్నియు నశ్వరము లనిగ్రహించి రాసమండలము జేరిరి.

రాధాసహితగోపికలు బృందావనము జేరి జగదేకశ్యామసుందరాకారు డైన, మహర్షులమనస్సులనే మోహింపచేయుసచ్చిదానందవిగ్రహుడైన శ్రీకృ ష్ణుని దర్శించి మాధుర్యప్రేమభక్తిసమన్వితలై, పులకితగాత్రులై, ఆనందాశ్రు

భరితలోచనులై అఖండదివ్యానంద మనుభవించిరి. మునీశ్వరా ! ఆసమయ మున తొమ్మిదిలక్షలమందిగోపాంగనలు రాసమండలమధ్యమున నేకత్రితలై సచ్చిదానందస్వరూపు డైనశ్యామసుందరశ్రీకృష్ణదివ్యవిగ్రహమును కన్నుల కవు తీర గాంచిరి. ఆహా ! పరమాత్మమాధుర్యభక్తిని పొందగల్గిన ఆగోప భామినుల జన్మయే జన్మ, నిశ్చయముగ అన్యులజన్మములన్నియు వ్యర్థమే యనిగ్రహింపుము. బ్రహ్మశివాదిసకలదేవతలు మధురమురళిస్వరము నాల కించి ప్రేమమాధుర్యభక్తికి బరవశులై దివ్యరథముల నధిరోహించి, పులకిత గాత్రులై సాశ్రుపూర్ణలోచనలై శ్రీకృష్ణు డొనరించుదివ్యరాసలీల సందర్శించుటకు గగనమం దేకత్రితులైరి.

నారదమునీంద్రా ! తనమాధుర్యభక్తి నాకాంక్షించి సమక్షముననున్న తొమ్మిదిలక్షలమందిగోపికాకాంతలను గాంచి యత్యంతప్రసన్నుడై శ్రీకృష్ణుడు తొమ్మిదిలక్షలమందికృష్ణులుగ నావిర్భవించెను. ఆపందొమ్మిదిలక్షలమంది గోపికాకృష్ణులు దివ్యరాసమండలమధ్యమున పరమాద్భుతదివ్యరాసక్రీడల నొనరించిరి. తదనంతరము పరమాత్మబ్రహ్మస్వరూపు డైనశ్రీకృష్ణుడు రాధతో గలసి యమునాజలములందు ప్రవేశించి తొమ్మిదిలక్షలరూపముల ధరించి, తొమ్మిదిలక్షలగోపికలతో జలక్రీడ లొనరించెను. తదనంతరము రాసమండలమధ్యమున గోపికలందఱు శ్రీకృష్ణపరమాత్మ కనేకకుసుమమాలిక లను, చందనమును, తాంబూలములను ప్రేమతో నర్పించి, వివిధవాద్యము లను ప్రయోగించుచు నఖండహరినామసంకీర్తన మొనరించిరి. తదనంతరము రాధ శ్రీకృష్ణపరమాత్మతో గలసి ముప్పదిమూడు పుష్పోద్యానములందు విహరించెను. రమణీయశ్రీవనము, కదంబవనము, తులసీవనము, కుంద వనము, నితంబవనము, మధువనము, జంబీరవనము, నారికేళవనము, పున్నాగ వనము, కదళీవనము, బదరీవనము, బిల్వవనము, నారంగవనము, అశ్వత్థవనము వంశవనము, దాడిమవనము, మందారవనము, తాలవనము, చూతవనము, కేతకీ వనము, అశోకవనము, ఖర్జూరవనము, ఆమ్రకవనము, జంబూవనము, శాల వనము, కేతకీవనము, పద్మవనము, జాతివనము, న్యగ్రోధవనము, శ్రీఖండ వనము కేసరవనముమున్నగువనములందు రాధ కౌతూహలవశమున పర మాత్మతో రాసక్రీడల నొనరించినను ఆమెమనస్సు తృప్తిపొందలేదు. పర మాత్మమాధుర్యక్రీడ నెంతగనాస్వాదించినను గోపికలకు మాధుర్యప్రేమ అంత

కంతకు వృద్ధిచెందదొడగెను. ఈదివ్యరాసలీలను గగనమునుండి దర్శించిన దేవాంగనలు శ్రీహరిప్రేమలాలసులై భారతవర్షమున క్షేమనరేశ్వరుల గృహములందు జన్మించిరి. తదితరసకలదేవతలు శ్రీకృష్ణునిదివ్యరాసలీలా వినోదములను భూరిగ ప్రశంసించుచు హరినామసంకీర్తన మొనరించుచు తమ తమధామముల కేగిరి.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమందలి శ్రీకృష్ణ దివ్యరాసవిలాసవర్ణన
ప్రస్తావమను ఇరువదియెనిమిదవ
అధ్యాయము
సంపూర్ణము.

---

## ఇరువది తొమ్మిదవ అధ్యాయము

### అష్టావక్రమహర్షి రాధాకృష్ణుల సముఖమున శరీరముసుద్యజించి భగవంతునియందు లీనమగుట

శ్రీనారాయణఋషి పలికెను:

నారదా! తదనంతరము ప్రేమవిహ్వలలైనగోపికలతో శ్రీకృష్ణుడు వివిధరాసక్రీడల నొనరించెను. గోపికలందఱ అఖండప్రేమసాగరములో నిమగ్నలై యుండగా శ్రీకృష్ణుడు రాధతో గలసి యాప్రదేశమున అంతర్ధానమై సురమ్యవనములందు, పర్వతములపైన, సరోవరములందు, నదీతటము లందు విహరించుచు రాధ కఖండపరమానందమును ప్రసాదించెను. అఖిల జగములకు దలిదండ్రులైనశ్రీరాధాకృష్ణులు బహుకాలము వనవిహారముల నొనరించి కేతకీవనసమీపమున గలయొకవిశాలవటవృక్షచ్ఛాయలో నాసీను లైరి. శీతలమందసుగంధవాయువు లాప్రదేశమును సువాసిత మొనరించు

చుండెను. హర్షవ్యాకులహృదయాంతరంగుడై శ్రీకృష్ణపరమాత్మ రాధకు పురాతనము లైన విచిత్రరహస్యయుక్తములైన యనేకకేళివిలాసములను వర్ణించెను. ఆసమయమందు ప్రసన్నముఖనేత్రసమన్వితుడై నయొకమహర్షి శ్రీరాధాకృష్ణులసమ్ముఖమున కరుదెంచెను. ఆయనశరీరము నల్లగను, సర్వావయవములు వంకరటింకరలుగనునుండెను. ఆయన దిగంబరుడు. శరీరమందష్టవంకరలు కల్గినయామహర్షి నామధేయ మష్టావక్రుడు, మహర్షి ప్రచండబ్రహ్మతేజఃప్రకాశమానుడు, జటాధారి. స్వయముగ బ్రహ్మతేజమే యీరూపమున సాక్షాత్కరించినదా యనిచూపరులకు మహర్షిని దర్శించిన భ్రమకల్గును. అష్టావక్రునిరోమములు, నఖములు సుదీర్ఘములు. అట్టివికృతాకారుడైనమహర్షిని గాంచి రాధ పరిహసింపగ మాధవు డామెను వారించి, అష్టావక్రుని మహాత్మ్యమును వర్ణించెను.

అష్టావక్రమహర్షి భక్తిభావముతో తలను వంచి ప్రణామము లర్పించుచు గోవిందుని సమీపించి పూర్వకాలమందు దనకు శంకరుడు ప్రసాదించిన స్తోత్రముచే శ్రీకృష్ణపరమాత్మను స్తుతింప దొడంగెను.

### అష్టావక్రకృత శ్రీకృష్ణస్తోత్రమ్

గుణాతీత గుణాధార గుణబీజ గుణాత్మక ।
గుణీశ గుణినాం బీజ గుణాయన నమోఽస్తు తే ॥

సిద్ధిస్వరూప సిద్ధ్యంశ సిద్ధిబీజ పరాత్పర ।
సిద్ధిసిద్ధగుణాధీశ సిద్ధానాం గురవే నమః ॥

హే వేదబీజ వేదజ్ఞ వేదిన్ వేదవిదాం వర ।
వేదజ్ఞాతోఽసి రూపేశ వేదజ్ఞేశ నమోఽస్తు తే॥

బ్రహ్మానన్తేశ శేషేన్ద్ర ధర్మాదీనామధీశ్వర ।
సర్వసర్వేశ సర్వేశ బీజరూప నమోఽస్తు తే ॥

ప్రకృతేప్రాకృతప్రాజ్ఞ ప్రకృతీశ పరాత్పర ।
సంసారవృక్ష తద్బీజ ఫలరూప నమోఽస్తు తే ॥

సృష్టిస్థిత్యన్తబీజేశ సృష్టిస్థిత్యన్తకారణ ।
మహావిరాట్ తరోర్బీజ రాధికేశ నమోఽస్తు తే॥

అహో యస్య త్రయః స్కన్ధా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః।
శాఖా ప్రశాఖా వేదాద్యాస్తపాంసి కుసుమాని చ ॥
సంసారవిఫలా ఏవ ప్రకృత్యంకురమేవ చ ।

తదాధార నిరాధార సర్వాధార నమోఽస్తు తే ॥
తేజోరూప నిరాకార ప్రత్యక్షానూహమేవ చ।
సర్వాకారాతి ప్రత్యక్ష శ్వేచ్ఛామయ నమోఽస్తుతే ॥
ఇత్యుక్త్వా స మునిశ్రేష్ఠో నిపత్య చరణామ్బుజే।
ప్రాణాం స్త్యాజ యోగేన తయోః ప్రత్యక్ష ఏవ చ॥
పపాత తత్ర తద్దేహః పాదపద్మసమీపతః ।
తత్తేజశ్చ సముత్తస్థౌ జ్వలదగ్నిశిఖోపమమ్ ॥
సప్తతాలప్రమాణస్తు చోత్థాయ చ పపాత హ ।
భ్రామం భ్రామం చ పరితో లీనం కృత్వా పదామ్బుజే॥
అష్టావక్రకృతం స్తోత్రం ప్రాతరుత్థాయ యః పఠేత్।
పరం నిర్వాణమోక్షం చ సమాప్నోతి న సంశయః॥
ప్రాణాధికో ముముక్షూణాం స్తోత్రరాజశ్చ నారద।
హరిణాఽహో పురా దత్తో వైకుణ్ఠే శఙ్కరాయ చ॥ 40-53

త్రిగుణాతీతుడవు, సర్వగుణాధారుడవు, గుణములకు కారణమైనవాడవు, గుణస్వరూపుడవు, గుణములకీశ్వరుడవు, ఆగుణములకే బీజమైనవాడవు, గుణములకు నిలయమైన వాడవు నగు నీకు నమస్కారము.

సిద్ధిస్వరూపుడవు, సమస్తసిద్ధులు అంశములుగ కలవాడవు, సర్వసిద్ధులకు బీజమైనవాడవు, పరాత్పరుడవు, సిద్ధులకు, సిద్ధగణముల కధీశ్వరుడవు, సర్వసిద్ధులకు గురుడవునగు నీకు నమస్కారము.

వేదబీజా! వేదజ్ఞా! వేదవేత్తలలో శ్రేష్ఠుడవైనవాడా! వేదములకు గూడ అగోచరమైనవాడా! రూపేశ్వరా! వేదజ్ఞులకీశ్వరుడవైనవాడా! నీకు నమస్కారము.

బ్రహ్మ, అనంతుడు, ఈశుడు, ఆదిశేషుడు, ఇంద్రుడు, ధర్మదేవత మున్నగు దేవతల కధిపతి వైనవాడా! సర్వస్వరూపా! సర్వేశా! మహాదేవునకు గూడ ప్రభు వైనవాడా! సమస్తమునకు బీజరూపమైనవాడా! నీకు నమస్కారము.

ప్రకృతిరూపుడవు, ప్రాకృతుడవు, ప్రాజ్ఞుడవు, ప్రకృతీశ్వరుడవు, పరాత్పరుడవు, సంసారవృక్షరూపుడవు, దానికి కారణమైనవాడవు, ఫలరూపుడవగు నీకు నమస్కారము.

సృష్టిస్థితి సంహారములకు బీజస్వరూపు లైన బ్రహ్మముఖ్యులగు వారికిగూడ యీశ్వరు డైనవాడా! సృష్టిస్థితి సంహారములకు కారణమైనవాడా! మహా విరాడ్రూప వృక్షమునకు బీజమైనవాడా! రాధావల్లభా! నీకు నమస్కారము.

నీవు బీజమైన ఆమహావిరాడ్రూప వృక్షమునకు బ్రహ్మవిష్ణుశివాత్మకము లను మూడుస్కంధములు గలవు. వేదాదిశాస్త్రములు దానిశాఖోపశాఖలు, తపస్సు పుష్పములు, సంసారము ఫలము, ఆవృక్షముప్రకృతియొక్క కార్యము. దానికాధారమైనవాడవు నీవే, కాని నీవు ఆధారరహితుడవు, సర్వమున కాధారుడవు, అట్టి నీకు నమస్కారము.

తేజఃస్వరూపా! నిరాకారా! ప్రత్యక్షప్రమాణముల కగోచరమైన వాడా! సర్వరూపా! ప్రత్యక్షకవిషయమైనవాడా! స్వేచ్ఛామయుడైనవాడా! పరమేశ్వరా! నీకు నమస్కారము.

ఇట్లు స్తుతించి మునిశ్రేష్ఠుడగు నాయష్టావక్రుడు శ్రీకృష్ణుని చరణార విందములపై బడెను. శ్రీరాధాకృష్ణుల సమక్షమునందే యామహామునీషి యశాశ్వతమైన పాంచభౌతిక దేహమును త్యజింపగా, ప్రజ్వలితాగ్నిశిఖాసమాన మగు నామహర్షి యఖండతేజ మేడుతాళ్ళప్రమాణమున ప్రజ్వలించుచు శరీరమును వీడి బయల్వెడలి భగవంతునకనేకప్రదక్షిణము లొనరించి ఆయన చరణకమలములందు లీనమయ్యెను. ప్రాతఃకాలమే నిద్ర మేల్కాంచి యష్టావక్రమహర్షిచే స్తుతింపబడిన యీస్తోత్రమును పఠించువారు పరమ నిర్వాణరూపమోక్షమును బొందగలరు, ఇందు లేశమాత్ర మైనను సంశయము లేదు. నారదా! ప్రప్రథమమున వైకుంఠధామమందు శ్రీహరి శంకరున కుపదే శించిన యీస్తోత్రరాజము ముముక్షువులకు ప్రాణాధికప్రియము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమందలి అష్టావక్రమునిమోక్షణ
ప్రస్తావమను ఇరువదితొమ్మిదవ
అ ధ్యా య ము
సంపూర్ణము.

# ముప్పదియవ అధ్యాయము

## అష్టావక్రి చరితము :

**నారదుడు పలికెను :**

మహాత్మా! ఆయష్టావక్రమహర్షిని గురించి యే యే యద్భుతరహస్యములను శ్రీకృష్ణపరమాత్మ రాధకు వివరించెను? మహర్షి దేహమును త్యాగ మొనరించినపిమ్మట భక్తవత్సలుడైనశ్రీకృష్ణు డేమిచేసెను?

**శ్రీ నారాయణ ఋషి పలికెను :**

దేవర్షీ! అఱువదివేల సంవత్సరములు నిరాహారుడై ఘోరతపమాచరించిన కారణమున, యష్టావక్రమహర్షి జఠరాగ్ని ఆయన రక్తమాంసములను హరించివైచెను. శ్రీకృష్ణచరణారవిందచింతనమందే సంలగ్నుడై యుండు నామహర్షికి బాహ్యజ్ఞాన మిసుమంతయైనను లేదు. శ్రీకృష్ణపరమాత్మ చందనకాష్ఠములతో జితిని పేర్చి అగ్నిసంస్కారములను నిర్వర్తించి స్వయముగ శోకలీల నొనరించుచు అశ్రుపూర్ణ నేత్రయుక్తుడై మునీశ్వరుని శవమును స్వయముగ జితిపై నుంచెను. భగవంతుడే అమ్మహాత్ముని శరీరమున కగ్నిని ప్రసాదించి దహనకార్యమును సంపన్న మొనరించెను. గగనమందు సకలదేవతలేకత్రితులై యీదివ్యలీలాదృశ్యమును గాంచి భక్తవత్సలుని గరుణ ననేకవిధముల బొగడుచు ఆనకమందుభులను మోగించి కుసుమవృష్టి గావించిరి.

ఆ సమయమున పరమాత్మపాదముల నాశ్రయించిన యష్టావక్రమహర్షి తేజస్సు శ్రీకృష్ణపార్షదరూపము దాల్చెను. గగనమార్గమునుండి యఖండ తేజోయుక్తమైనదివ్యవిమానము పార్షదసహితముగ నఱుదెంచి మహర్షిని తోడ్కొని గోలోకపరంధామమునకు వెడలిపోయెను. మునీంద్రుని గోలోక గమనమును స్వయముగ దర్శించిన బృందావనవినోదిని యగుశ్రీరాధ పరమాశ్చర్యచకితయై జగదీశ్వరుడైనశ్రీకృష్ణు నిట్లు ప్రశ్నించెను. "నాథా! శరీర మంతయు నష్టవంకరలు తిరిగియున్న యీమునిశ్రేష్ఠు డెవ్వరు? ఆయన తేజస్సు నీ చరణారవిందముల నాశ్రయించి దివ్యరూపధారియై గోలోకమునకు వెడలెను. ఆ మహాత్మునికొఱకు మీరే స్వయముగ శోకలీల నొనరించుచు అశ్రుపూర్ణ

నేత్రములతో విలపించిరి. అట్టిమహాత్ముని దివ్యచరితమును బరిపూర్ణముగ వర్ణింపవలసినదిగ మిమ్ము బ్రార్థించుచున్నాను."

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

సమస్తపాపములను నశింపజేయగల యీమహర్షి ప్రాచీనేతిహాసమును వర్ణించెద నవధరింపుము. ప్రియా! మహాప్రళయకాలమందు లోకము లన్నియు నేకార్ణవజలమగ్నము లైయుండగ మదంశసంభూతుడైన మహావిష్ణువు నాభికమలమునుండి నాకళతో జగద్విధాత యగుబ్రహ్మ ప్రాదుర్భవించెను. బ్రహ్మదేవునిహృదయమునుండి సనకసనందన, సనాతన, సనత్కుమారు లనునల్వురు పుత్రు లుదయించిరి. వారు పంచవర్షవయస్కులై యజ్ఞానులవలె నగ్నముగ చరింతురు. వారు ప్రాకృతికజ్ఞానరహితులై నాధ్యానమందు సంలగ్నులైయుండు మహాభక్తులు. ఒకదినమున ఆమానసపుత్రులను బ్రహ్మ జగత్తులను సృష్టింపవలసినదిగ నాదేశించెను. పరమభక్తులైనవారు సాంసారికకార్యము లందు విరక్తులై స్రష్టయాజ్ఞను సరకుగొనక నాప్రపన్నతకొఱ కఖండతపమందు సంలగ్నులైరి. పుత్రులు తనను వీడి వెడలిపోగా విధాత యుదాసీనుడయ్యెను.

పితుర్దుఃఖాయ ప్రభవేత్ పుత్రశ్చేదవచస్కరః ॥ 31

పుత్రులు తనయాజ్ఞను పాలింపనియెడల తండ్రికి యత్యంతదుఃఖము సంభవించును.

తదనంతరము బ్రహ్మ జ్ఞానముచే తనవివిధాంగములనుండి తపోధనులైన వేదవేదాంగవిదులైన, బ్రహ్మతేజఃప్రకాశమానులైన యనేకపుత్రులను సృష్టించెను. ఆబ్రహ్మపుత్రులనామధేయములు అత్రి, పులస్త్యుడు, పులహుడు, మరీచి, భృగువు, అఙ్గిరసుడు, క్రతువు, వశిష్ఠుడు, ఓఢుడు, కపిలుడు. (ఈకపిలుడు కర్దమనందనుడైనకపిలమహర్షి కాడు), ఆసురి, కవి, శఙ్కుడు, శఙ్ఖుడు, పంచశిఖుడు ప్రచేతసుడు. ఈమహాత్ము లందఱు బ్రహ్మదేవునియాజ్ఞను శిరసావహించి సాధ్వీమణులను వివాహమాడి చిరకాలము తప మాచరించి సృష్టికార్యమును సంపన్న మొనరించిరి. ఆతపోధనులకు ఎందఱో పుత్రులు, పౌత్రులు కల్గిరి. రాధా! ప్రచేతసమహర్షికుమారుడే మునివర్యుడైన యశితుడు. అశితమహర్షి సత్పుత్రుని కాంక్షించి దీర్ఘకాలము పత్నీసహితముగ తప మాచ

రించినను సంతానము కలుగకపోగా ఆయన విషాదగ్రస్తుడయ్యెను. మహర్షిని యూరడించుచు నశరీరవాణి యిట్లుపల్కెను. "మునీశ్వరా! చింతింపకుము, నీవు తక్షణమే శంకరునికడ కేగి ఆయనవలన మంత్రోపదేశముపొంది మంత్ర సిద్ధినిబొందుము. ఆమంత్రాధిష్ఠాత్రిదేవి స్వయముగ నీయెదుట సాక్షాత్క రించి నీమనోవాంఛితమైన సత్పుత్రుని ప్రసాదింపగలదు." అశరీరవాణి నాల కించి అశితమహర్షి యత్యంతసంతుష్టహృదయాంతరంగుడై యోగశక్తిచే పత్నీసహితముగ నిరామయమైనశివలోకపరంధామము జేరెను. శివలోక మం దఖండపరబ్రహ్మతేజఃప్రకాశభాసమానుడు, జగదీశ్వరుడు నగుమహాదేవుని దర్శించి అశితమహర్షి పత్నీసహితముగ శిరమును వంచి, పులకితదేహుడై హస్తములను ముకుళించి యోగేశ్వరుడు దైనయాశంకరు నిట్లుస్తుతించెను.

## అశితకృతం శివస్తోత్రమ్

జగద్గురో నమస్తుభ్యం శివాయ శివదాయ చ ।
యోగీన్ద్రాణాం యోగీన్ద్ర గురుణాం గురవే నమః ॥

మృత్యోర్మృత్యుస్వరూపేణ మృత్యుసంసారఖణ్డన ।
మృత్యోరీశ మృత్యుబీజ మృత్యుంజయ నమోఽస్తు తే ॥

కాలరూపం కలయతాం కాలకాల కాలకాలేశకారణ ।
కాలాదతీతకాలస్య కాలకాలనమోస్తు తే ॥

గుణాతీత గుణాధార గుణబీజ గుణాత్మక ।
గుణీశ గుణినాం బీజ గుణినాం గురవే నమః ॥

బ్రహ్మస్వరూప బ్రహ్మజ్ఞ బ్రహ్మభావనతత్పర ।
బ్రహ్మబీజస్వరూపేణ బ్రహబీజ నమోస్తు తే ॥

ఇతి శ్రుత్వా శివం నత్వా పురస్తస్థౌ మునీశ్వరః ।
దీనవత్సాశ్రునేత్రశ్చ పులకాఙ్కితవిగ్రహః ॥

అశితేన కృతం స్తోత్రం భక్తియుక్తశ్చ యః పఠేత్ ।
వర్షమేకం హవిష్యాశీ శఙ్కరస్య మహాత్మనః ॥

న లభేద్వైష్ణవం పుత్రం జ్ఞానినం చిరజీవినమ్ ।
భవేద్ధనాఢ్యో దుఃఖీచ మూకో భవతి పణ్డితః ॥

అభార్యో లభతే భార్యాం సుశీలాం చ పతివ్రతామ్ ।
ఇహలోకే సుఖం భుక్త్వా యాత్యన్తే శివసన్నిధిమ్ ॥

ఇదం స్తోత్రం పురా దత్తం బ్రహ్మణా చ ప్రచేతసే।
ప్రచేతస స్వపుత్రాయా శితాయ దత్తముత్తమమ్॥ 43—52

అశినుడొనరించిన శివస్తోత్రము

జగద్గురూ! నీకు నమస్కారము. శివుడవు, శివ (కళ్యాణ) ప్రదాతవు, యోగీంద్రులకు యోగీంద్రుడవు,గురువులకు గురుడవు నగునీకు బ్రణామములు. మృత్యువునకు మృత్యురూపమైన, జననమరణసంసారఖండన మొనరించుదైవమా! నీకు నమస్కారము. మృత్యువునకు నీశ్వరా! మృత్యుబీజా! మృత్యుంజయా! నీకు నాప్రణామములు. కాలములను గణన మొనరించువారికే లక్ష్యభూతుడవైనవాడా! కాలరూపా, పరమేశ్వరా! నీవు కాలమునకే కాలమైనవాడవు. ఈశ్వరా! నీవు సర్వకారణుడవు, కాలమునకుగూడ కాలాతీతుడవైనకాలకాలా! నీకు నమస్కారము. గుణాతీతా! గుణాధారా! గుణబీజా! గుణాత్మకా! గుణేశ్వరా! సమస్తగుణములకాదికారణా! గుణవంతులకు గురుడవైననీకు నమస్కారము. బ్రహ్మస్వరూపా! బ్రహ్మజ్ఞా! పరబ్రహ్మచింతనపరాయణా! నీకు నమస్కారము. నీవు వేదములకు బీజరూపుడవు. అందువలననే భక్తులు నిన్ను బ్రహ్మబీజ మని కీర్తింతురు. దేవా! నీకు నాప్రణామములు.

ఇట్లు స్తుతించి శివున కనేకప్రణామము లర్పించి యశితమహర్షి పులకాంకితదేహుడై, మహాదేవునిసమక్షమున దీనునివలె నిలువబడెను. అశితమహర్షిచే స్తుతింపబడిన యీశంకరస్తోత్రమును ప్రతిదినము భక్తిభావముతో నొకసంవత్సరము హవిష్యాన్నమును భుజించుచు పఠించువారికి జ్ఞాని, చిరంజీవి పరమవైష్ణవుడు నగుపుత్రుడు కల్గును. ధనాభావమువలన దుఃఖతులైనవారు ధనాఢ్యులు కాగలరు, మూర్ఖులు పండితులు కాగలరు. ఈస్తోత్రప్రభావమున పత్నీహీనునకు సుశీల యైనపత్ని లభింపగలదు. వారిహలోకమందు సుఖముల ననుభవించి, అంత్యకాలమున శివసన్నిధానము జేరగలరు, పూర్వకాలమందు బ్రహ్మ యీ యుత్తమస్తోత్రమును ప్రచేతసునకు బోధించెను. ప్రచేతసు డీస్తోత్రమునే తనకుమారుడైనయశితున కుపదేశించెను.

రాధా! ముని యొనరించిన యీస్తోత్రము నాలకించి ప్రసన్నుడు భక్తవత్సలుడు నగుశంకరుడు తనభక్తుల నుద్దేశించి యిట్లుపల్కెను. "మునిశ్రేష్ఠా! ధైర్యమును ధరింపుము. నేను నీమనోవాంఛితమును గ్రహించితిని. మహర్షీ!

నీకు నాయంశచే నాసమానుఁ డైనయుత్తమపుత్రుఁ డుదయింపఁగలఁడు. సర్వలోకములందు పరమదుర్లభ మైనయొకమహామంత్రమును నీ కార్యసిద్ధికొఱకై యుపదేశించెద, శ్రవణ మొనరింపుము."

అనిపలికి శంకరుఁ డశితమునివర్యునకు షోడశాక్షరమంత్రమును, స్తోత్రమును, పూజావిధిని, సంసారవిజయ మనుకవచమును పురశ్చరణపూర్వకముగ నుపదేశించెను. శంకరునియనుగ్రహమునకు పాత్రుఁడై యశితమహర్షి నిర్జనప్రదేశమున నూఱు సంవత్సరములు మహాదేవు డుపదేశించినదివ్యమంత్రస్తోత్రకవచములచే నిన్నే (శ్రీరాధ) యారాధించెను. రాధికా! నీ వామహర్షి యెదుట సాక్షాత్కరించి మహాజ్ఞాని యైనశ్రేష్ఠపుత్రు డుదయింపఁగల డనియును గ్రహించి యంతర్హితవైతివి.

తదనంతర మశితమహర్షిదంపతులకు శివాంశచే మన్మథసమానసుందరాకారుఁ డైనదేవలుఁ డనుపుత్రుఁ డుదయించెను. దేవలుఁడు బ్రహ్మనిష్ఠయందు సంలగ్నుఁ డైన మహాత్ముఁడు. నవయౌవనసంపన్నుఁడై దేవలుఁడు జగదేకసుందరియు సుయజ్ఞసపుత్రికయు నగురత్నమాలను వివాహమాడి చిరకాలము సాంసారికసుఖములను యథేచ్ఛగా ననుభవించెను. సాంసారికసుఖములందు లేశమాత్ర మైనను నిత్యసుఖము లే దని దేవలుఁడు గ్రహించి విరాగియై యర్ధరాత్రమున తనయర్ధాంగి నిద్రామగ్న యైయుండఁగ గృహమును వీడి ఘోరతప మాచరించుటకు గందమాదనపర్వతమున కేగెను. నిద్రమేల్కాంచిన రత్నమాల తనప్రాణేశ్వరుని ప్రాంగణమందుఁగానక విరహాగ్నిచే దగ్ధయై రోదించుచు నాహారపానీయాదులను త్యజించి ప్రాణపరిత్యాగ మొనరించెను. రాధాదేవీ! దేవల రత్నమాలలకు గల్గినకుమారుఁడు తల్లిదహనకార్యములను సంపన్న మొనరించెను. భక్తుఁడు జితేంద్రియుఁడు నగుదేవలుఁ డేకసహస్రదివ్యవర్షముల కాలమువఱకు గంధమాదనపర్వతగుహయందు నాప్రసన్నతకొఱకు ఘోరతప మాచరించెను.

భూలోకవిహారార్థమై యరుదెంచిన త్రైలోక్యచిత్తమోహిని యగు రంభ యత్యంతసుందరుఁడు, శాంతస్వభావయుక్తుఁడు మన్మథసమానుఁడు నగు దేవలుని యేకాంతప్రదేశమున గాంచి మోహితయయ్యెను. అప్సరస యగు రంభ కందర్పసమానుఁడు నవయౌవనుఁడు నగునాసుందరాకారుని గాంచి యిట్లుపలికెను. "మహాత్మా! మనోహరము లైననావాక్యముల నవధరింపుము.

ఈ కఠోరతపమును వీడి సుఖప్రదాయిని యైనన న్ననుభవింపుము. అప్సరసల కైనను సాంగత్యము నభిలషించియే స్వర్గమునుగోరి నరేశ్వరులు భూమిపై యజ్ఞముల నాచరింతురు. స్త్రీసుఖమును మహర్షులు కూడ వాంఛింతురు, కావున మన్మథాకారా! ఈ నిర్జనప్రదేశమున రతిసుఖమును నాకు ప్రసాదింపుము.'' దేవలమహర్షి రంభకోరికను మన్నింపక యామెకిట్లు వేదసమ్మతమైన విషయముల నుపదేశించెను. "రంభా! వేదసారము లైనసత్యవచనములను పలుకుచున్నాను, సావధానముగ నవధరింపుము. బ్రాహ్మణులైనను, క్షత్రియులైనను, వైశ్యులైనను పరస్త్రీయందు దాసక్తులగు వారపూజ్యులయ్యెదరు. ఇహమందు నింద్యులై సర్వకర్మలందు, స్వకర్మలయందు దనధికారులు కాగలరు. కోపించి శ్రీమహాలక్ష్మి వారిగృహములను వీడి వెడలిపోగలదు. అట్టివారు పరలోకమందుగూడ నూఱుసంవత్సరముల పర్యంత మంధకూపముల కష్టముల ననుభవింపగలరు. కామముతో దరిజేరినస్త్రీని గృహస్థువు స్వీకరింపవచ్చును. కాని తాపసుల కది నిషిద్ధము. కామాసక్త యైనస్త్రీని త్యాగ మొనరించిన గృహస్థుమాత్రమే వారిశాపములకు, పాపములకు గురికాగలడు. కళత్రవంతు డైయున్నబ్రహ్మ యైనను కామముతో సమీపించినస్త్రీని బరిత్యజింపరాదు. స్వయముగ భార్యను బరిత్యజించి తాపసులమైనమేము అట్టి స్త్రీని బరిత్యజించినను దోషులము కాజాలము.

స్వభార్యం చ పరిత్యజ్య యో గృహ్ణాతి పరస్త్రియమ్ ।
యశోధనాయుషాంహానిర్భవేజ్జీవన్మృతస్య చ ॥ 80

తనభార్యను బరిత్యజించి పరస్త్రీతో సంబంధమును స్థాపించుకొనువాడు జీవించినను మరణించినట్లే. వానియశము, ధనము, ఆయుర్దాయము హరింపగలవు.

భువి నాస్తి యశో యస్య జీవనం తస్య నిష్ఫలమ్ । 81

భూమిపై యశములేని వానిజన్మము నిష్ఫల మైనట్లే.

ఒకతపస్వికి సంపదలతో, రాజ్యముతో, సాంసారికసుఖములతో నేమి ప్రయోజనము? దేవీ! నేను నిష్కాముడను, వృద్ధుడను. నావంటివాని వలన నీ కేప్రయోజనము సిద్ధింపగలదు? తల్లీ! నీ వత్యంతసౌందర్యవతివి, కావున యత్యంతసుందరు డైనమఱియొకపురుషుని వరింపుము.'' దేవలుని యుపదేశముల నాలకించినరంభకు తృప్తి గలుగదయ్యె. ఆమె మరల తన

కోర్కెను దీర్పుమని, లేనిచో శపించెద నని దేవలుని బెదిరించెను. ఆమె యనుచితవచనములను సరకుగొనక మహర్షి నాధ్యానమందు సంలగ్నుడయ్యెను. దేవలుడు తనప్రార్థనను దిరస్కరించుట గాంచి రంభ కోపించి యిట్లుశపించెను: "కుటిలహృదయా! బ్రాహ్మణా! నన్ను తృణీకరించిన నీసుందరదేహ మంతయు నల్లగ మారి యష్టవంకరలు నొందుగాక. నీవు రూపయౌవన శూన్యుడవు, వృద్ధుడవు నయ్యెదవుగాక." ఇట్లుశపించి రంభ స్వలోకమునకు వెడలిపోయెను. దేవలుడు కన్నులు దెఱచి తాను వికృతాకారుడైనట్లు గ్రహించి శరీరముపై విరక్తి జనియింప అగ్నిని ప్రజ్వలింపజేసి మరణించుట కుద్యుక్తుడయ్యెను. నాభక్తుని కాపాడుటకు నేనే స్వయముగ సాక్షాత్కరించి దేవలునకు భక్తిజ్ఞానములను బ్రసాదింపగా ఆయన శాంతించెను. దేవలుని శరీర మెనిమిదివంకరలుగ నుండుట గాంచి ఆయనకష్టావక్రు డనినేనే నామ కరణ మొనరించితిని. (మహాభారతమందు వర్ణింపబడినయష్టావక్రుడు ఈయన భిన్నులు) నాయాజ్ఞానుసారముగ నష్టావక్రుడు మలయాచలకంద రములం దఱువదివేలసంవత్సరములు నిరాహారుడై నన్నుగూర్చి యఖండతప మాచరించెను. ప్రియా! పరిపూర్ణముగ నిరాహారుడై దీర్ఘకాలము తప మాచరించిన కారణమున నామహర్షి యంతర్గతమైనజఠరాగ్ని ఆయన రక్త మాంసములను దగ్ధ మొనరించెను. తనతపస్సు ముగియగనే నాయాజ్ఞాను సారముగ మద్భక్తు డగునష్టావక్రుడు నన్ను జేరి గోలోకమును బొందెను. ఈయష్టావక్రమహర్షివంటి యనన్యభక్తుడు మఱియొకడు లేడు, ఉండడు, ఉండబోడు. పూర్వకాలమందు బ్రహ్మదేవుడు మోహినిశాపమువలన అపూజ నీయుడైనట్లే బ్రహ్మప్రపౌత్రుడైనమహర్షి రంభశాపమువలన నష్టావక్రుడై, హీనదశనొందినాడు. సుఖప్రదమైన, పుణ్యప్రదమైన, అత్యంతనిగూఢమైన, అష్టావక్ర (దేవల) చరితమును బ్రవచించితిని.

ఇది మదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున అష్టావక్రుని రంభశపించుట
యను ముప్పదియవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

# ముప్పది యొకటవ అధ్యాయము

## మోహినీస్త్రీవర్ణనము

శ్రీ రాధాదేవి పలికెను:

శ్యామసుందరా! బ్రహ్మదేవున కెట్లు శాపము సంభవించెను? ఆ మహాత్ముని యెవరు శపించిరి!

శ్రీకృష్ణుడు పలికెను:

మత్ప్రాణాధికప్రియా! రాధా! రైవతమన్వంతరమందు సుచంద్రుడను పరమధార్మికనృపాలుడు కలడు. ఆతడు మహాతపస్వి, వైష్ణవశ్రేష్ఠుడు, అఖండ జ్ఞానసంపన్నుడు, ఆనరేశ్వరుడు బహుకాలము రాజ్యభోగముల ననుభవించి, తుదకు సంసార మంతయు నశ్వర మనిగ్రహించి రాజ్యాదులను పుత్రుల కప్పగించి గోలోకగమనార్థియై తపముచేయ మలయాచల పర్వతప్రాంతమునకు జనెను. ఆప్రదేశమున సుచంద్రు డాహారమును సహితము స్వీకరింపక యొక సహస్రసంవత్సరములకాలము ఘోరతప మాచరించెను. కఠోరతపమువలన ఆయనశరీరమంతయు జీర్ణముకాగా దానిపై పిపీలకలు వల్మీకమును నిర్మించినవి. ఈజగత్తునకు స్రష్టయైనబ్రహ్మ నరేశ్వరునియకుంఠితతపశ్చర్యను గాంచి యత్యంతసంతుష్టుడై వరములను ప్రసాదించుటకు స్వయముగ బ్రహ్మలోకము నుండి భువికి యరుదెంచెను. వల్మీకగతుడైనసుచంద్రునిపై దనకమండలములోని దివ్యజలములను విధాతసంప్రోక్షింపగ సుచంద్రుడు దివ్యదేహసంపన్నుడై కన్నులు దెరచి యెదుట సాక్షాత్కరించిన సృష్టికర్తను గాంచి సాష్టాంగ దండప్రణామము లర్పించి, స్తుతించెను. రాజా! నీమనోవాంఛితము నర్థింపు మని కమలోద్భవు డాదేశింపగ నానరేశ్వరుడు నా (శ్రీకృష్ణుడు) చరణారవిందములం దనన్యభక్తిని, దాస్యసౌభాగ్యములను నర్థించెను. సుచంద్రుని మనోవాంఛితముల నాతనికి బ్రహ్మదేవుడు ప్రసాదింపగ గగనమార్గమునుండి శ్రీకృష్ణపార్షదులు శతసూర్యసమప్రభాప్రకాశమానమైన దివ్యరథముపై నధిరోహించి యాప్రదేశమున కరుదెంచి దివ్యశరీరధారి యైనసుచంద్రుని తోడ్కొని గోలోకమునకు వెడలిపోయిరి.

సుచంద్రుని యనుగ్రహించి, బ్రహ్మ సత్యలోకమునకు మరలిపోవు చుండగ నొకపుష్పోద్యానమధ్యమున అప్సరస యైనమోహిని విధాతను గాంచి మదనజ్వర సమన్వితయయ్యెను. ఆ యుద్యానవనము పుష్పచందనవాయువులచే సువాసిత మగుచుండెను. మోహిని చారుచంపకవర్ణయుక్త, స్థిరయౌవన, శరత్పూర్ణిమాచంద్రునివంటి శుభప్రభాముఖముకలది. రత్నాలంకారములచే నలంకృత. సూక్ష్మవస్త్రములను ధరించి ముల్లోకములను మోహింపగల శక్తిసమన్వితయైన, అత్యంతకమనీయురాలైన మోహిని తనమదనతాపమును తీర్పుమని బ్రహ్మ నర్థించెను. ఆ జగదేకసుందరి యగుమోహినిని వీక్షించినబ్రహ్మ క్షణ మైనను వికారమునకు లోబడక శ్రీహరిని స్మరించి, స్వాత్మారాముడు జితేంద్రియుడునై బ్రహ్మలోకమునకు వెడలిపోయెను. బ్రహ్మను గాంచి కామబాణనిశరములకు గురియైనమోహిని మదనతాపమంతో తపించుచు కామలోకమునకు జని బ్రహ్మ పొందు ఎట్లుసంభవింపగలదనిచింతించు చుండెను. కామజ్వరముచే బీడింపబడి కంఠము, ఓష్ఠములు, తాలువులు శుష్కించి యున్నతనసహచరి యగుమోహినిని గాంచి సర్వము గ్రహించినదియై రంభ మన్మథుని ఆరాధించినచో నీమనోరథము నెరవేరగలగల దనిమోహినికి కర్తవ్యము నుపదేశించెను.

రంభయొక్కయుపదేశానుసారముగ మోహిని పుష్కరతీర్థమున కేగి తనమనోవాంఛితసాఫల్యార్థము కామదేవు నారాధించెను. ఆమె యొనరించిన తపమునకు పంచబాణుడు సంతుష్టుడై ఆమెయెదుట సాక్షాత్కరించెను. మోహిని మనోవాంఛితమును నెరవేర్చుటకు స్వయముగ కామదేవు డామెతో బ్రహ్మలోకమునకు బయలుదేరెను. కామదేవుని యనుగ్రహమువలన నిరుపమానసౌందర్యవతియై నాట్యశాస్త్రమందు, సంగీతమందు అగ్రగణ్యురాలై మోహిని నిస్సంకోచముగ బ్రహ్మసభాభవనమును ప్రవేశించి వివిధ రీతుల నర్తించుచు మధురగానములచే జగత్పతినే మోహితునిగ నొనరించెను. పంచశరునిప్రభావమువలన క్షణకాలము మోహినిని గాంచి రాగాసక్తుడైన బ్రహ్మ యామెమనోగతభావమును గ్రహించి శిరములను వంచుకొని శ్రీహరినే స్మరింపదొడంగెను. తన ప్రయత్న మంతయు విఫలము కాగా మోహిని యత్యంతదుఃఖితయై కామదేవు నిట్లుస్తుతించెను.

## మోహిన్యువాచ

సర్వేన్ద్రియాణాం ప్రవరం విష్ణోరంశ చ మానసమ్ ।
తదేవ కర్మణాం బీజం తదుద్భవ నమోఽస్తు తే ॥

స్వయమాత్మా హి భగవాన్ జ్ఞానరూపో మహేశ్వరః ।
నమో బ్రహ్మన్ జగత్స్రష్టస్తదుద్భవ నమోఽస్తు తే ॥

సృష్టిః సర్వశరీరేషు దృష్టిశ్చ యోగినామపి ।
జగత్సాధ్య దురారాధ్య దుర్నివార నమోఽస్తు తే ॥

సర్వాజిత జగజ్జేతా జీవజీవ మనోహర ।
రతిబీజ రతిస్వామిన్ రతిప్రియ నమోఽస్తు తే ॥

శశ్వద్యోషిదధిష్ఠానయోషిత్ప్రాణాధిక ప్రియః ।
యోషిద్వాహన యోషాస్త్ర యోషిద్బన్ధో నమోఽస్తు తే ॥

పతిసాధ్యకరాశేషరూపాధార గుణాశ్రయ ।
సుగన్ధివాతసచివ మధుమిత్ర నమోఽస్తు తే ॥

శశ్వద్యోనికృతాధార స్త్రీసన్దర్శనవర్ధన ।
విదగ్ధానాం విరహిణాం ప్రాణాన్తక నమోఽస్తు తే ॥

అకృపా యేషు తే నార్థం తేషాం జ్ఞానవినాశనమ్ ।
అనూహరూపభక్తౌఘ కృపాసిన్ధో నమోఽస్తు తే ॥

తపస్వినాం చ తపసాం విఘ్నబీజావలీలయా ।
మనః సకామం ముక్తానాం కర్తుం శక్త నమోఽస్తు తే ॥

తపః సాధ్యశ్చ ర్యాధాశ్చ సదైవం పాంచభౌతికాః ।
పంచేన్ద్రియకృతాధార పంచబాణ నమోఽస్తు తే ॥

మోహినీత్యేవముక్త్వా తు మనసా సా విధేః పురః ।
విరరామ నమ్రవక్త్రా బభూవ ధ్యానతత్పరా ॥

ముక్తం మాధ్యన్దినే కాన్తే స్తోత్రమేతన్మనోహరమ్ ।
పురా దుర్వాససా దత్తం మోహిన్యై గన్ధమాదనే ॥

స్తోత్రమేతన్మహాపుణ్యం కామీ భక్త్యా యదా పఠేత్ ।
అభీష్టం లభతే నూనం నిష్కలఙ్కో భవేద్ ధ్రువమ్ ॥

చేష్టాం న కురుతే కామః కదాచిదపి తం ప్రియమ్ ।
భవేదరోగీ శ్రీయుక్తః కామదేవ సమప్రభః ।
వనితాం లభతే సాధ్వీం పత్నీం త్రైలోక్యమోహినీమ్ ॥ 65-78

సర్వేంద్రియములందు శ్రేష్ఠుడవైనవాడా! విష్ణువునకు మనోమయాంశరూపా! మనస్సే కర్మల కన్నింటికి బీజము, అట్టిమనస్సునుండే ప్రాదుర్భవించిన మన్మథా! నీకునమస్కారము. నీవు జ్ఞానస్వరూపుడవు, మహేశ్వరుడవు, స్వయముగ నాత్మవైనభగవంతుడవు. జగత్తును సృష్టించునో మహాత్మా! ఆ జగములందు ప్రాదుర్భవించు మన్మథా! నీకు నమస్కారము. సర్వశరీరులందు సృష్టిరూపుడవు, యోగులకు దృష్టిస్వరూపుడవు, జగత్తుచే సాధింపదగినవాడా! ఆరాధించుటకు సాధ్యముకానివాడా! దుర్నివారస్వరూపా! నీకు నమస్కారము. ఎవరిచేతను జయింపబడనివాడా! జగత్తును జయించునట్టివాడా! జీవజీవమనోహరా! రతియే బీజముగ కలవాడా! రతిస్వామీ! రతిప్రియా! నీకు నమస్కారము. మాటిమాటికీ స్త్రీలను అధిష్ఠానముగ జేసికొని యుండువాడా! స్త్రీలకు ప్రాణాధికప్రియా! స్త్రీలే వాహనముగ కలవాడా! స్త్రీలకు బంధుస్వరూపా! నీకు నమస్కారము. పతిచే సాధింపదగిన నానారూపములకు ఆధారస్వరూపుడా! గుణాశ్రయా! సుగంధితవాయువే స్నేహితునిగ కలవాడా! మధుమాసమిత్రా! నీకు నమస్కారము. మాటిమాటికి స్త్రీలయోనులందు నివసించువాడా! స్త్రీసందర్శనమాత్రముననే వృద్ధినొందువాడా! చాతుర్యము గల్గినవిరహజనులకు ప్రాణాంతకా! నీకు నమస్కారము. అనూహరూపభక్తులందు నీ కేమాత్రము కృపలేదు, వారివలన నీ కేవిధమైనప్రయోజనము లేదు. అట్టివారిజ్ఞానమును నాశము చేయువాడా! కృపాసింధూ! నీకు నమస్కారము. తపస్సు నొనరించుతాపసుల తపముల కవలీలగ విఘ్నబీజమును ప్రసాదించువాడా, తాపసులైనను. ముక్తులైనను వారిమనస్సులను సకామముగ నొనరింపగల శక్తివంతుడా! నీకు నమస్కారము. పాంచభౌతికములైనసర్వపదార్థములు తపముచే సాధింపదగినవి, ఆరాధింపదగినవి. పాంచభౌతికములైనపంచేంద్రియములనే ఆధారముగ కల్గినవాడా! పంచబాణా! నీకు నమస్కారములు. బ్రహ్మసన్నిధిలో మన్మథు నిట్లుస్తుతించి మోహిని నమ్రతతో తలను వంచుకొని మౌనము వహించి ధ్యానతత్పరయయ్యెను. పూర్వము గంధమాధనపర్వతముపై దుర్వాసమహర్షి యీస్తోత్రమును మోహినికి ప్రసాదించెను. ఈ మనోహరమైనస్తోత్రమును కామాసక్తులైనభక్తులు మాధ్యందినకాలమందు భక్తితో పఠించిన వారిమనోభీష్టములన్నియుదీరి వారు నిశ్చయముగ నిష్కళంకులు కాగలరు. ఈస్తోత్రపాఠకుడైనభక్తుని మన్మథుడు విరుద్ధములైన

చేష్టలతో లొంగదీయుడు, ఎప్పుడును వానికి ప్రియ మొనగూర్పగలడు. అత డరోగియు, శ్రీయుక్తుడైన కామదేవసమప్రభుడు కాగలడు. వానికై త్రైలోక్యమోహిని యైనవనిత పత్నిగ లభింపగలదు.

ఇది మదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున మోహినీస్తోత్రవర్ణన మను
ముప్పదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

# ముప్పదిరెండవ అధ్యాయము

## బ్రహ్మమోహినీసంవాదము

శ్రీకృష్ణుడు పలికెను :

రాధా! మోహిని యొనరించినస్తోత్రమునకు కామదేవుడు సంతుష్టుడై శరమును సంధించి మంత్రపూత మైనమహాస్త్రమును బ్రహ్మదేవునిపై ప్రయోగించెను. ఆకామాస్త్రఘాతమువలన బ్రహ్మ చంచలమనస్కుడై యొక్కక్షణ కాలము మోహినిని కామదృక్కులతో వీక్షించి తనకాముకత్వమునకు లజ్జ చెందినవాడై దివ్యజ్ఞానమును మరల పొంది శ్రీహరిని స్మరించెను. తన చంచలత్వమునకు మన్మథుడు కారణ మని తెలిసికొని విధాత క్రోధవిహ్వలుడై యాతని నిట్లు శపించెను. "కామదేవా! యావ్వనోన్మత్తా! మూఢైశ్వర్య సంపన్నుడ వనిగర్వించెదవా? గురుడ నైననన్నే అవహేళన మొనరించిన నీకు నిశ్చయముగ గర్వభంగము కాగలదు." తనప్రయత్నము లన్నియు విఫలములు కాగా మోహిని యత్యంతభయకంపిత రాలయ్యెను. మదనాతురయై వక్రచక్షువులతో తననే వీక్షించుచున్న యప్సరాంగన మోహినిని గాంచి బ్రహ్మ యిట్లుపల్కెను. "మాతా! మోహినీ! నీస్వస్థలమునకు వెడలిపొమ్ము.

నీ ప్రయత్నము లన్నియు నాయెడల ఫలింపవు. ఎందువలననగా వేదజుగుప్సితము లైనయీనీచకర్మలను వేదకర్త నైననే నొనరింపజాలను. పరస్త్రీగమనము నింద్యమని, అకీర్తికరమని వేదవచనము. ధనప్రాణయశములను నశింపజేయగలదానా! దుఃఖదాయినీ! స్వకార్యతత్పరా! శాశ్వతముగ పరకార్యములను వినాశముచేయుదానా! సర్వాపదబీజస్వరూపిణీ! నీవు రూపవతివి, కామవాసన వలన వంచితురాలవు. కాముకులకు సంపత్స్వరూపిణివి, తపస్వులకు విషతుల్యవు. అప్సరసలయందు శ్రేష్ఠురాలా! సుస్థిరయౌవ్వనా! నీకామకర్మలను నిర్వర్తించుటకు యువకు లైనవారి నాశ్రయింపుము. నేను తపస్విని, వైష్ణవుడను, వృద్ధుడను, అస్వతంత్రుడను, పరాధీనుడను, కావున కుమారీ! పితృసముడ నైన నన్ను విడుము. నీకామేచ్ఛను దీర్చుటకు మన్మథుడు, చంద్రుడు, జయంతుడు, నలకూబరుడు, చంద్రతనయుడు, దితిపుత్రుడు మొదలగు సౌందర్యవంతులు, కామశాస్త్రనిష్ణాతులు, రతికర్మవిశారదులు ననేకులుకలరు, వారి నాశ్రయింపుము. స్త్రీయే స్వయముగ పురుషునికామమును నర్థించుట యాశ్చర్యకరమైన విషయము. సర్వరత్నములందు స్త్రీరత్న మత్యంత దుర్లభము. స్వయముగ స్వామియర్థింపనిదే స్త్రీప్రసన్నురాలు కాదు. మోహినీ! స్త్రీజాతి స్వయముగ ప్రకృత్యంశ, పరమపవిత్రము, అట్టిస్త్రీజాతికి కళంకము నాపాదించకుము. దేవీ! వేదనిషిద్ధమైన యీనీచకార్యమును వేదనిర్మాత నైననే నొనరింపరాదు. వేదోక్తకర్మల ననుసరించువారిపై నే శ్రీహరి ప్రసన్నుడు కాగలడు.

హరౌ తుష్టే జగత్తుష్టం తస్మిన్ రుష్టే భవోరిపుః ।

భగవంతుడు ప్రసన్నుడైన సర్వసంసారము ప్రసన్నము కాగలదు. ఆయన కోపించిన యీభవ మంతయు శత్రువు కాగలదు.

కావున మోహినీ! నీయీనీచప్రయత్నమును విరమించి స్వధామమునకు వెడలిపొమ్ము.

బ్రహ్మ యుపదేశించిన నీతివాక్యములను నాలకించి మోహిని కామవాసనను విడలేక బ్రహ్మతో నిట్లుపల్కెను. "దేవా! నీ నీతియుక్తవచనములు నాచంచలచిత్తమును స్థిరమొనరింపలేకపోయినవి. నీవు నన్ను త్యజించిన నాసర్వశరీరము జడము కాగలదు. నాహృదయాంతరంగమున ప్రజ్వలించి కామాగ్ని నాసర్వాంగములను దహింపజేయగలదు. కృపాసింధూ! నన్ను నిరాశ చేయకుము. నీయాలింగనమాత్రముననే నా కామజ్వరము నశింపగలదు." ఇట్లుపల్కి మోహిని

బ్రహ్మను కామధృక్కులతో వీక్షించుచు ఆయనవస్త్రమును బట్టిలాగెను. ఆసమయమునందే మన్మథుడు బ్రహ్మపై తనపంచబాణములను బ్రయోగించెను. కామాస్త్రపీడితుడైన బ్రహ్మతనమనస్సును నిగ్రహించుకొనలేక తనహృదయమందు శాంతుడు, ద్విభుజుడు, మురళీగానవినోదియు, రత్నాలంకారవిభూషితుడు సుస్థిరయౌవనుడు, శ్యామసుందరుడు నగుశ్రీకృష్ణుని దర్శించి యిట్లుప్రార్థింపదొడంగెను.

## బ్రహ్మోవాచ

రక్ష రక్ష హరే మాం చ నిమగ్నం కామసాగరే।
దుష్కీర్తిజలపూర్ణే చ దుష్పారే బహుసఙ్కటే॥
భక్తివిస్మృతిబీజే చ విపత్సోపానదుస్తరే।
అతీవనిర్మలజ్ఞానచక్షుః ప్రచ్ఛన్నకారణే॥
జన్మోర్మిసఙ్గసహితే యోషిన్నక్రౌఘసఙ్కులే।
రతిస్రోతః సమాయుక్తే గమ్భీరే ఘోర ఏవ చ॥
ప్రథమామృతరూపే చ పరిణామవిషాలయే।
యమాలయప్రవేశాయ ముక్తిద్వారాతివిస్మృతే॥
బుద్ధ్యా తరణ్యా విజ్ఞానై రుద్ధరాస్మానతః స్వయమ్।
స్వయం చ త్వం కర్ణధారః ప్రసీద మధుసూదన॥
మద్విధాః కతిచిన్నాథ నియోజ్యా భవకర్మణి।
సన్తి విశ్వేశ విధయో హే విశ్వేశ్వర మాధవ॥
న కర్మక్షేత్రమేవేదం బ్రహ్మలోకోఽయమీప్సితః।
తథాపి నః స్పృహా కామే తద్భక్తివ్యవధాయకే॥
హే నాథ కరుణాసిన్ధో దీనబన్ధో కృపాం కురు।
త్వం మహేశ మహాజ్ఞాతా దుఃస్వప్నం మాం న దర్శయ॥
ఇత్యుక్త్వా జగతాం ధాతా విరరామ సనాతనః।
ధ్యాయం ధ్యాయం మత్పదాబ్జం శశ్వత్సస్మార మామితి॥
బ్రహ్మణా చ కృతం స్తోత్రం భక్తియుక్తశ్చ యః పఠేత్।
స చైవాఽఽకర్ణవిషయే న నిమగ్నో భవేద్ ధ్రువమ్॥
మమ మాయాం వినిర్జిత్య స జ్ఞానం లభేత్ ధ్రువమ్।
ఇహలోకే భక్తియుక్తో మద్భక్తప్రవరో భవేత్॥ 73—82

హరే! కామసాగరమందు నిమగ్నుడ నైన నన్ను రక్షింపుము, రక్షింపుము. ఈ కామసాగరము దుష్పూర్తి జలభరితము, తరింపలేనిది, అనేకసంకట సమన్వితము. దేవా! ఈ కామము భక్తివిస్మృతిబీజము, విపత్తులకే సోపానము అత్యంత సుందరము, అత్యంత నిర్మలజ్ఞానచక్షువుల నంధకారబంధురము చేయగలది. ఈ కామసాగరము జన్మలనెడితరంగసహితము, స్త్రీలనెడి మొసళ్ళచే గూడుకొనియున్నది. గంభీరమైనది, ఘోరమైనది. అంతులేనిది. ప్రథమమున నమృతముగ గోచరించినను పరిణామమున విషాలయము. ఈ కామసాగరము యమాలయప్రదేశము, ముక్తిద్వారాతివిస్మృతము. ఈ మహాసాగరమందు నిమగ్నుడ నైన నన్ను బుద్ధిజ్ఞానస్వరూప మైననౌకద్వారమున నవ్యయముగ నీవే నావికుడవై, తరింపజేయుము. ఈ భవసాగరమందు నిమగ్నులైననాబోంటివా రెందఱో కలరు. విశ్వేశ్వరా, మాధవా! ఘోరసంసారసాగరనిమగ్నులను రక్షింపగలవాడవు నీవే. ఈ బ్రహ్మలోకము కేవలము కర్మక్షేత్రమే కాదు, నాకత్యంత మిష్టతరమైనది. నీభక్తియందు వ్యవధాన మొనరింపగల కామమందాసక్తి కొంతగల్గియున్నాను నాథా! కరుణాసింధూ! దీనబాంధవా! నన్ను గరుణింపుము. నీవు మహేశ్వరుడవు, సర్వజ్ఞాతవు నా కిట్టిదుఃస్వప్నము లను దర్శింపజేయకుము. సనాతనుడైన జగద్విధాత నన్ను స్తుతించి మౌనము వహించి నాపదాబ్జములధ్యానమందే నిమగ్నుడయ్యెను. ఈ బ్రహ్మకృతస్తోత్రమును భక్తిపూర్వకముగ పఠించువారు కర్మలందు విషయములందు నిశ్చయముగ నిమగ్నులుకారు. నామాయ వారిని విడచివేయును, వారికి నిశ్చయముగ జ్ఞానము లభించును. వారిలోకమందు భక్తియుక్తులై నాభక్తులందు శ్రేష్ఠులై విరాజిల్లగలరు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములోని నారదనారాయణ సంవాదములో
బ్రహ్మ మోహినీసంవాదమున శ్రీకృష్ణస్తోత్ర మను
ముప్పదిరెండవ అధ్యాయము
సంపూర్ణము.

# ముప్పదిమూడవ అధ్యాయము

## బ్రహ్మగర్వభంగము:

శ్రీకృష్ణుడు పలికెను:

మోహినియొక్క మోహజాలము జిక్కువడక విధాత నన్ను స్తుతించి నాచే ప్రదత్త మైనదివ్యజ్ఞానమనెడు అంకుశముచే మనస్సనెడుమత్తగజమును నిలువరించెను. జితేంద్రియుడైనవిధాతను గాంచి మోహిని ఆయనవస్త్రములను మాటిమాటికిలాగుచు తనకోర్కెను దీర్పవలసినదిగ బాధింప దొడంగెను. కామపీడిత మైనమోహినిని గాంచి బ్రహ్మ యిట్లుపల్కెను. "మోహినీ! ఈనీచకార్యాచరణముచే సంసారమందు గలస్త్రీజాతిని సిగ్గు పఱచకుము. నీవు వెంటనే యీప్రయత్నమును వీడి నీకామేచ్ఛను దీర్చికొనుట కన్యయువకుల నాశ్రయింపుము. పూర్వజన్మవలననే పత్ని, గురువు, భర్త, శుభాశుభములు జీవులకు లభించును. దైవనిందిత మైనయీనీచకార్యమును నీవు తక్షణమే విరమింపుము." ఇట్లుపల్కి జగత్స్రష్ట నాధ్యానమునందు సంలగ్నుడయ్యెను. ఆ సమయముననే బ్రహ్మలోకమునకు బ్రహ్మతేజస్సుతో బ్రజ్వలించుమహర్షు లరుదెంచిరి. వారినామధేయములు అత్రి, పులస్త్యుడు, పులహుడు, వశిష్ఠుడు, క్రతువు, అంగిరసుడు, భృగువు, మరీచి, కపిలుడు, ఓఢుడు, పంచశిఖుడు, రుచి, ఆసురి, ప్రచేతసుడు, శుక్రుడు, బృహస్పతి, ఉతథ్యుడు, కరకుడు, కణ్వుడు, కశ్యపుడు, గౌతముడు, సనకసనందనులు, కర్దముడు, సనాతనుడు, యోగులకుపరమగురువైన సనత్కుమారుడు, శాతాతపుడు, పిప్పలుడు, శంఖుడు, పరాశరుడు, మార్కండేయుడు, లోమశుడు, మృకండుడు, చ్యవనుడు, దుర్వాసుడు, జరత్కారుడు, ఆస్తీకుడు, విభాండకుడు, ఋష్యశృంగుడు, భరద్వాజుడు, వామదేవుడు, కౌశికుడు. ఈ మహర్షులందఱు బ్రహ్మను గాంచి నమస్కరించి భక్తిభావముతో నిలువబడిరి. ఆ ద్విజోత్తములను గాంచగనే మోహిని తనప్రయత్నమును విరమించి దూరముగ నుండెను. బ్రహ్మ మహర్షుల నాహ్వానించి యుచితాసనము లొసంగగ, వారు బ్రహ్మలోకమునం దప్సరస మైనమోహినిని వీక్షించి యీమె బ్రహ్మ

లోకమున కెట్లు వెడలిన దని విధాతను ప్రశ్నించిరి. వారి ప్రశ్న నాల
కించి పుత్రిక తండ్రి చెంతనుండుననట్లే యియ్యప్సరసాంగన నృత్యగీతము
లొనరించి తన చెంత సేదదీరుచున్న దని ప్రత్యుత్తర మొసంగెను. బ్రహ్మ
పల్కిన వచనముల నాలకించి మోహిని రక్తపంకజలోచనయై బ్రహ్మ నిట్లు శపిం
చెను. "బ్రహ్మదేవా! నేను మీదాసిని. పరమేశ్వరుడు నన్ను వేశ్యగ సృష్టిం
చెను, కావున నేను సర్వగామిని యైనను దోషము లేదు. నేను వినీతనై నీ శర
ణము నాశ్రయించితిని. అయినను నీవు నన్ను తిరస్కరించితివి. దీర్ఘకాలము
వఱకు నీవు జగములం దపూజ్యుడవయ్యెదవుగాక. నీ గర్వము స్వయముగ
శ్రీహరియే హరించుగాక. అన్యదేవతలకు ప్రత్యేకముగ నుండు వార్షిక పూజలు
జరుగగలవు. కాని నీవపూజ్యుడవు కాగలవు" ఇట్లు శపించి మోహిని కామలోక
మునకు వెడలిపోయెను. మోహిని శాపము నాలకించి బ్రహ్మ చింతింపగ మహర్షులు
వైకుంఠనాథుని యాశ్రయింపుమని బ్రహ్మను గోరిరి. మహర్షుల యాదేశానుసార
ముగ కమలోద్భవుడు శీఘ్రగామియై వైకుంఠమును జేరి శాంతుని, కమలా
కాంతుని మత్స్యరూపుడైన శ్రీమన్నారాయణుని శరణుజొచ్చెను. తనకు సంభ
వించిన విపత్తునుండి రక్షింపవలసినదిగ దయాసింధువైన దీనబాంధవుని ప్రార్థిం
చెను. అంతయు తెలిసికొనిన శ్రీహరి మందహాసములను చిందించుచు
బ్రహ్మతో నిట్లు పల్కెను.

లోకనాథా! క్షణ మాగుము నీ విపత్తులు తొలగు నుపాయ ముపదేశిం
చెద," ఆసమయమున శ్రీహరి ద్వారపాలకుడు సభను ప్రవేశించి ప్రణామము
లర్పించి దశముఖుడైన బ్రహ్మ మీదర్శనము కొఱకై వేచియున్నాడని విన్న
వించెను. సాదరముగ దశముఖుని దోడ్కొని రావలసినదిగ శ్రీహరి ద్వారపాలకు
నాదేశించెను. తదనంతరము దశముఖుడైన బ్రహ్మ సభను ప్రవేశించి అనేక
చిత్రవిచిత్రస్తోత్రములచే శ్రీహరిని స్తుతించి ఆయన యనుజ్ఞను పొంది యుచితా
సనము నలంకరించెను. తదుపరి శతముఖ బ్రహ్మ యరుదెంచి భగవంని స్తుతిం
చెను. ఆస్తోత్రములను ఎప్పుడు వినియుండ నందువలన బ్రహ్మ ఆశ్చర్యచకితు
డయ్యెను. తానే జగత్తులకు స్రష్ట ననిగర్వించు బ్రహ్మ యియ్యన్య బ్రహ్మలను
గాంచి పరమాశ్చర్యచకితుడయ్యెను. తదనంతరము సహస్రముఖ బ్రహ్మ
మొదలగు ననేక దివ్యతేజస్సంపన్నులైన యన్యాన్య బ్రహ్మాండములను బరిపా
లించు విధాత లరుదెంచి శ్రీహరికి బ్రణామము లర్పించి సభయం దాసీనులైరి.
తనను తాను శ్రీహరితుల్యునిగ భావించి దర్పము వహించు బ్రహ్మ తాను
కేవలము పరమాత్మ యొక్క యసంఖ్యాకములైన జగత్తులం దొక స్వల్పప్రపంచ

మునకు మాత్రమే యధిపతి నని తెలిసికొని సిగ్గుతో తలలు వంచుకొనెను. దర్పభంగ మైనబ్రహ్మను గాంచి శ్రీమన్నారాయణుడు , నా శరీరరోమ కూపములం దసంఖ్యాకబ్రహ్మాండములు కలవని యొక్కొక్క బ్రహ్మాండమున కొక్కొక్క విధాతను బరిపాలకునిగ నియమించితి ననపల్కెను. బ్రహ్మగర్వ మంతయు నశించగా శ్రీహరిచరణముల పైబడి దేవా! భూతభవిష్యద్వర్త మానములైన సర్వజగత్తులు నీమాయవలన ఉద్భవించినవని, సత్యమును తెలిసి కొంటి నని ప్రార్థించెను. బ్రహ్మ యొనరించిన ప్రార్థనలకు సంతుష్టుడై సర్వాంతర్యామి యైన శ్రీహరి విధాతకు శాపనివారణోపాయము నుపదేశించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములోని నారదనారాయణ సంవాదమున
మోహినీశాపబ్రహ్మ దర్పభంగ మను
ముప్పదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.

---

# ముప్పదినాల్గవ అధ్యాయము

## జాహ్నవీ జన్మ వృత్తాంతము

శ్రీకృష్ణుడు పలికెను :

ప్రియా, రాధికే! ఆ సమయమున వృషభవాహనారూఢుడై మందస్మిత ముఖారవిందుడు శరీరమందంతట విభూతినలంకరించుకొని సర్పమయ యజ్ఞోపవీతమును ధరించి వ్యాఘ్రచర్మాంబరధారియై, ప్రతప్తసువర్ణకాంతి సదృశ జటలతో ప్రకాశించుచు లలాటమందు అర్ధచంద్రుని అలంకరించుకొని, హస్తములందు త్రిశూలపట్టిసఖట్వాంగములను ధరించి శివుడు శ్రీహరి సభకు అరుదెంచెను. తదుపరి ఇంద్రాది సకలదేవతలు, మహర్షులు, ఆదిత్యులు, వసువులు,

రుద్రులు, సిద్ధులు, చారణులు మొదలగువారందఱు వైకుంఠమున కేతెంచి భక్తిభావముతో శ్రీహరిని స్తుతించి సభాసీనులైరి.

సదాశివుడు నందివాహనమును దిగ్గి భక్తిభావముతో కమలాకాంతున కనేకప్రణామము లర్పించి శ్రీహరివామపార్శ్వమున రత్నమయసింహాసన మలంకరించెను. శంకరుడు మణిమయ మైనస్వరయంత్రమును హస్తములతో మీటుచు సుమధురతాలస్వరముచే శ్రీహరిదివ్యగుణములను గీర్తింపదొడంగెను. పులకాంకితశరీరుడై సాశ్రుపూర్ణలోచనుడై బ్రహ్మ గాంధర్వగీతమాలాపించు శివుని సుమధురవాణీప్రభావమువలన సకలదేవతలు సభాస్థితులైన శ్రీహర్యాది కరగి ద్రవరూపులైరి. ప్రాణేశ్వరీ ! ఆసమయమున వైకుంఠ పరంధామ మంతయు జలమయమయ్యెను. నేను స్వయముగ వైకుంఠమున కరుదెంచి మరల వారందఱకు స్వస్వరూపముల ననుగ్రహించితిని. వైకుంఠ మునకు నాల్గువైపుల ఆజలరాశికి నివాసస్థానములను నేర్పఱచితిని. తదుపరి యాజలాధిష్ఠాత్రీదేవి తనయావాసస్థానములందు నివసింపదొడంగెను.

సమస్తదేవతల శరీరమునుండి యుత్పన్న మైనయాదివ్యజలరాశియే దేవనది యగుగంగనామమున ప్రఖ్యాతి గాంచెను. ఆదివ్యజలములు ముముక్షువులకు మోక్షమును, భక్తుల కనన్యహరిభక్తిని బ్రసాదింపగలవు. ఆజలములను స్పృశించి ప్రవహించు వాయువుయొక్క స్పర్శమాత్రముననే పాపులు తామొనర్చినపాపపుంజములనుండి విముక్తులు కాగలరు. గంగ మహిమలను వర్ణించుట, నిరూపించుట యసంభవము. పృథ్విపైగల పుష్కరక్షేత్రము సర్వతీర్థము లందు దత్యుత్తమ మని శ్రుతివచనముకలదు. కాని యాక్షేత్రముసహిత మీపవిత్ర గంగయొక్క పదునాఱవకళకైనను సరిరాదు. ప్రప్రథమున భగీరథుడు డీదేవ నదిని భూతలముపైకి దీసికొనివచ్చెను, కావున గంగ భాగీరథి యయ్యెను. సురధుని తనయంశచే బృథ్విపై సాక్షాత్కరించెను, అందువలన "గాం గతా" అనువ్యుత్పత్త్యనుసారముగ నీమె "గంగ" యనునామమున బ్రసిద్ధి గాంచెను. కోపించినకారణమున జహ్ను వీనదిని తనజానువులచే పరిపూర్ణముగ గ్రహించి వైచెను. మరల ఆయనపుత్రికారూపమున నీమె ప్రాదుర్భవింపగా గంగ జాహ్నవి యయ్యెను. వసువుఅవతార మైనభీష్ము డీమెనుండియే యుద్భవించెను, ఆకారణమువలన గంగ భీష్మసూ(భీష్మజనని) యనునామమున బ్రసిద్ధిగాంచెను. గంగ నాయాజ్ఞవలన మూడుధారలుగ విభక్తమై స్వర్గమర్త్య

పాతాళములందు ప్రవహింప దొడంగెను. కావున ఆమె త్రిపథగామిని యయ్యెను. గంగధార యొకసహస్రయోజనములవెడల్పున, పదివేలయోజనముల పొడవున స్వర్గమునందు ప్రవహించును. స్వర్గమం దీమెనామధేయము మందాకిని. ఈమెస్వచ్ఛజలములు క్షీరములవలె నత్యంతస్వాదిష్టములు. ఉత్తుంగతరంగములచే నీపవిత్రగంగానది వైకుంఠమునుండి బ్రహ్మలోకమునకు, బ్రహ్మలోకమునుండి స్వర్గమున కరుదెంచెను. స్వర్గమునుండి బయలుదేరి పృథ్విపై హిమాలయప్రాంతమున నవతరించిన యామెను అలకనంద యని భక్తులు కీర్తింతురు. పవిత్రభారతవర్షమును పునీత మొనరించుచు గంగాభవాని శుద్ధస్ఫటికసమానస్వచ్ఛజలములతో వేగవతియై ప్రవహించును. శ్రీహరియంశజు డైనసాగరుని జేరును. పాపుల పాపము లనెడుఇంధనములను దగ్ధము చేయునట్టిగంగ యగ్నిస్వరూపిణి. ఈమెయే సగరచక్రవర్తికుమారులకు మోక్షమును బ్రసాదించెను. రాధా! గంగ వైకుంఠధామమును జేరుటకు శ్రేష్ఠమైన సోపాన మనిగ్రహింపుము.

మరణకాలమందు మహాత్ము లైనసత్పురుషుల చరణోదకమును మనుష్యునినోటియందు బోసినయతడు గంగాజలమును స్వీకరించినపుణ్యమును బొందగలడు. అట్టిసత్పురుషులే గంగారాధన మనుశ్రేష్ఠవిమానము పై నారూఢు లై నిరామయ మగువైకుంఠధామమును జేరెదరు. దైవవశమున పూర్వకర్మప్రభావమువలన పాపి యైనదేహధారి గంగయందు స్నాన మొనరించిన, ఆతనిశరీరమం దెన్నిరోమములు కలవో అన్నిదివ్యవర్షములపర్యంతము భగవద్ధామమందు సానందముగ నివసింపగలడు. తదనంతర మతడు భారతవర్షములో పుణ్యాత్మునిగృహమున జన్మించి పరమభక్తుడై భగవద్ధామమును శాశ్వతముగ బొందగలడు. పరిశుద్ధులగుటకు సంకల్పించి దేవేశ్వరి యగుగంగయందు స్నానమాడుటకు ప్రయాణ మొనరించు వా రెన్నియడుగులు నడచి గంగను జేరెదరో అన్నిదివ్యవర్షములు వైకుంఠమందు సుఖింపగలరు. ఎవ రైనను అనుషంగికముగనైనను గంగను బొంది స్నాన మాచరించినవారు పాపవిముక్తులు కాగలరు. కలియుగమం దైదువేలసంవత్సరములు మాత్రమే భారతవర్షమందు గంగ నివసింపగలదు. ఆమె భూమిపై నుండగ కలిప్రభావము నిస్తేజమగును. కలియుగమందు పదివేలసంవత్సరములవఱకే సాయర్చవిగ్రహములు, పురాణములు కలిప్రభావమును నిరోధింపగలవు.

పాతాళమునకు బయన మొనరించుగంగధారనే భోగవతి యందురు. భోగవతి పాలనురుగువలె స్వచ్ఛజలములతో వేగవతియై ప్రవహించును. ఆమె రత్నములకు, శ్రేష్ఠమణులకు గని సుస్థిరయౌవనులైన నాగకన్యకలు భోగవతీనదీతటములపై క్రీడ లొనరింతురు. స్వయముగ గంగాదేవి వైకుంఠమును నాల్గువైపుల యాక్రమించి ప్రవహించును. నా యీ కుమార్తె ప్రళయకాలమందుగూడ నశింపదు, రాధా! ఇదియే పుణ్యప్రదమైనగంగయొక్క జన్మప్రసంగము. ఇపుడు బ్రహ్మకుమోహినీశాపమునుండి యెట్లువిముక్తి లభించెనో వర్ణించెద నవధరింపుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున జాహ్నవీజన్మప్రస్తావన
మను ముప్పదినాల్గవ అధ్యాయము
సంపూర్ణము

—**—

# ముప్పదియైదవ అధ్యాయము

## బ్రహ్మ గోలోకమునకు వెడలుట.

శ్రీకృష్ణుడు పలికెను :

ప్రియా, చారుశీలా! తదనంతరము సకలదేవతలు గంగను దర్శించి యామె నామాయయే యని గ్రహించిరి. ఆ సమయమున శ్రీమన్నారాయణుడు కృపాపూర్వకముగ బ్రహ్మతో నిట్లుపల్కెను. "చతుర్ముఖా! లెమ్ము, నీకు కళ్యాణ మగుగాక. శాపగ్రస్తుడవైననీవు అపవిత్రగంగాజలములందు స్నాన మాచరించి పునీతుడవు కమ్ము. నీవు స్వయముగ బరమపవిత్రుడవు, సకలతీర్థములు వైష్ణవాగ్రేసరుడవైననిన్ను స్పృశింపవలె నని యభిలషించును. కాని ప్రకృతిని యవహేళన మొనరించి శాపగ్రస్తుడవైతివి.

అహఙ్కారశ్చ సర్వేషాం పాపబీజ మఙ్గలమ్ ॥ 4

అహంకారము సర్వులకు నసంఖ్యాకపాపములకు బీజము, అమంగళములకు హేతువు.

నీవు శీఘ్రమే నాపరాత్పరపరంధామ మైనగోలోకమునకు బ్రస్థాన మొనరించి గోలోకమందు విరాజిల్లు ప్రకృత్యంశస్వరూపిణి యైనభారతిని యర్ధాంగిగ బొందుము. కళ్యాణసృష్టికి బీజస్వరూపిణి యైనప్రకృతిని భజింపుము. నీవొకకల్పపర్యంతము ఘోరతప మాచరించితివి. అయిన నీసమయమం దప్సరాంగన శాపవశమున యపూజ్యుడవైతివి. అన్యదేవతలపూజలందే నీపూజ సంపన్నముకాగలదు. ఎందువలె ననగ నీవు స్వాత్మారాముడవు, సర్వరూపివి, సమస్తదేహములందు పూజాస్వరూపుడవు, జగములను ధారణ మొనరించి పోషించు విధాతవు.”

జగద్గురు వగుబ్రహ్మ శ్రీమన్నారాయణునియాజ్ఞానుసారముగ బవిత్రగంగాజలములందు స్నానమొనరించి పునీతుడై శ్రీహరికి యనేకప్రణామము లర్పించి గోలోకధామమునకు బయనించెను. సమస్తదేవతలు, మహర్షులు, ప్రసన్నులై నాపరమనిర్మలయశోగానము లొనరించుచు తమతమస్థలములకు వెడలిపోయిరి. బ్రహ్మ గోలోకముజేరి ఆద్యాప్రకృతి యగునీశ్వరిని యారాధించి యామెకరుణాకటాక్షములవలన నాముఖారవిందమునుండి ప్రాదుర్భవించిన సర్వవిద్యాధిదేవి యగుభారతిని యర్ధాంగిగా బడసి చరితార్థుడయ్యెను. వాగాధిష్టాత్రీదేవి యైనభారతిని సహధర్మచారిణిగ బొంది బ్రహ్మ యత్యంత ప్రసన్నుడై నా కనేకప్రణామము లర్పించి తనలోకమునకు దిరిగి జేరెను. బ్రహ్మలోకనివాసులు త్రిభువనమోహిని యైనభారతిని గాంచి యత్యంతాశ్చర్యచకితులైరి. ఆమె యతీతసుందరి, రమ్య, శ్వేతవర్ణ, సస్మితముఖారవింద శరచ్ఛీతాంశువదన, శరత్పంకజలోచన, పక్వబింబఫలసదృశాధరోష్టవదన, ముక్తాపంక్తులనే తిరస్కరింపగలదంతపంక్తి కల్గిన మనోహర రూపిణి. ఆమె నేత్రములు శరదృతువునందు ప్రఫుల్లకమలమువలె విశాలములు. రత్ననిర్మితకేయూరకంకణములుహస్తములందు,సద్రత్ననిర్మితనూపురము లామె చరణములందు శోభించుచున్నవి. కర్ణములం దలంకరింపబడినరత్నకుండలముల కాంతిచే నామెకపోలము లుద్దీప్తమగుచున్నవి. రత్నేంద్రసారనిర్మితహారముచే నామెవక్షఃస్థలము ప్రకాశమానమయ్యెను. అగ్నిశుద్ధసూక్ష్మవస్త్రములను ధరించి నవయౌవనసంపన్నయై విరాజిల్లు భారతి చూపరుల కత్యంత కమనీయ

ముగ గోచరమగుచుండెను. ఆమె రెండుహస్తములందు వీణను ధరించి, ఒక హస్తమందు పుస్తకమును ధరించి, నాల్గవహస్తమును వ్యాఖ్యాముద్రగ నుంచెను. బ్రహ్మలోకనివాసు లందఱు అఖండహరినామసంకీర్తన మొనరించి భారతీబ్రహ్మలపరిణయమహోత్సవములను జరుపుకొనిరి.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! తనప్రాణేశ్వరు డైనశ్రీకృష్ణు డొనరించిన యాఖ్యానమును విని మందస్మితముఖారవిందయై పరమేశ్వరి యగురాధ కౌతూహలభరితమానసముతో శ్రీకృష్ణపరమాత్మ నిట్లుప్రశ్నించెను.

రా ధా దే వి ప లి కె ను :

ప్రాణేశ్వరా! స్వయముగ తనంతటతానే కామార్థియై సమీపించిన మోహినిని బ్రహ్మ ఏల తిరస్కరించెను! తనంతటతానే వలచి వచ్చినస్త్రీని పరిత్యజించుట మహాదోష మనితెలిసికూడ బ్రహ్మమోహిని నేల త్యణీకరించెను! ఈ రహస్యమును వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

రాధప్రశ్నించినవిషయములను విని శ్రీకృష్ణపరమాత్మ మందహాసము నొనరించెను. మధుసూదనుడు పద్మకల్పమందు ఘటిల్లిన నిగూఢాఖ్యానము నిట్లుప్రవచింప నారంభించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

అత్యంతప్రాచీనకాలమందు సంభవించినరహస్యమయసంఘటనను వర్ణించెద నవధరింపుము. నేను విధాతను సృష్టిచేయవలసినదిగ నాజ్ఞాపించితిని. నాయాజ్ఞను శిరసావహించి బ్రహ్మ సనకసనందనసనాతనసనత్కుమారులను, ఓఢు, కపి, పంచశిఖ, విభులను అసిత కపిల సిద్ధులను మానసపుత్రులుగ సృజించి సృష్టికార్యమును సంపన్న మొనరింపు డనియాజ్ఞాపించెను. నాదివ్యనామస్మరణమందే సంలగ్నులైనబ్రహ్మమానసపుత్రులు పితృదేవునియాజ్ఞను పరిపాలింపక వీతరాగులై నాయారాధనయందు బరిపూర్ణముగ తమజన్మల నర్పించిరి. మానసోద్భవులైనతనశ్రేష్ఠపుత్రులు తనయాజ్ఞను తిరస్కరించుట గాంచి బ్రహ్మ కోపింపగా ఆయనలలాటమునుండి యేకాదశమహారుద్రు లుద్భ

వించి సృష్టిసంహారకర్తలుగ నియుక్తులైరి. తదనంతరము బ్రహ్మ తనవివిధాంగ ములనుండి వశిష్ఠుని, పులహుని, క్రతువును, అంగీరసుని, భృగువును, అత్రిని, పులస్త్యుని, దక్షుని, కర్దముని, మరీచిని నిర్మించి, తనపుత్రుల కత్యంతసౌందర్య వతులైనభార్యలను బ్రసాదించి సృష్టికార్య మప్పగించెను. తదనంతరము శ్రీకృష్ణునియంశస్వరూపమున బ్రహ్మదేవునకు కామదేవు డుద్భవించెను. తదుపరి విధాత షోడశవర్షయుక్తయైన రత్నభూషణభూషితయైన త్రిజగ న్మోహన సౌందర్యవతి యైనకన్యను సృష్టించెను. ఇట్లుసృష్టికార్యమును ప్రథమ మున సంపన్న మొనరించి జగత్స్రష్ట స్త్రీపురుషులందు కామేచ్ఛను జనింపజేసి సృష్టిని విస్తృత మొనరించుటకు మన్మథుని నియమించెను. విధాత మన్మథున కైదుదివ్యాస్త్రములను నిర్విఘ్నముగ తనకర్తవ్యపాలన మొనరించుటకు బ్రసా దించెను. కామదేవుడు బ్రహ్మ యొసంగినపంచబాణములను పరీక్షింపదలచి బ్రహ్మమీదనే ప్రయోగించెను, అసమ్మోహనములైనదివ్యాస్త్రములప్రభావము వలన చంచలమనస్కుడై తాను నిర్మించినకన్యనే వరించి బ్రహ్మ ఆమెను వెంబడించెను. ఆ త్రిలోకసౌందర్యవతి తనతండ్రికి గల్గినచిత్తచాంచల్యమును గాంచి భయభీతయై వశిష్ఠాదిసోదరుల నాశ్రయించెను. కామముచే కన్నుగానక ప్రవర్తించుబ్రహ్మను గాంచి యత్యంతరోషయుక్తులై బ్రహ్మకుమారులైన ఋషు లిట్లుపల్కిరి. జగజ్జనకా! ఏల యీనీచకర్మ మొనరించి నీపవిత్ర చరిత్రను కలుషిత మొనరించుకొనెదవు. జగద్విధాతా! సతతము మహాత్ములు పరస్త్రీని తమపుత్రికవలె దర్శింతురు. అట్టివారే సర్వత్ర పూజింపబడి జితేంద్రియు లనికీర్తించబడెదరు. నీవు స్వయముగ సకలధర్మసమన్వితవేద కర్తవై యుండి పుత్రికనుగోరెదవా! పుత్రిక మాతృసమానురా లనిశ్రుతులు ప్రవచించినవిగదా.

గురోః పత్నీ రాజపత్నీ విప్రపత్నీ చ యా సతీ ।
పత్నీ చ భ్రాతుసుతయోర్మిత్రపత్నీ చ తత్ప్రసూః॥

ప్రసూః పిత్రోస్తథా భ్రాతుః పత్నీ శ్వశ్రూః స్వకన్యకాః।
జననీ తత్సపత్నీ చ భగినీ సురభీ తథా ॥

స్వాభీష్టసురపత్నీ చ ధాత్రికాన్నప్రదాయికా ।
గర్భధాత్రీ స్వనామ్నా చ భయాత్రాతుశ్చ కామినీ ॥

ఏతా వేదప్రణీతాశ్చ సర్వేషాం మాతరః స్మృతాః।
ఏతాస్వపి చ సర్వాసు న్యూనతా నాస్తి కాసు చ ॥

కన్యదాతాన్నదాతా చ జ్ఞానదాతా భయప్రదః।
జన్మదో మన్త్రిదో జ్యేష్ఠభ్రాతా చ పితరః స్మృతాః॥

ఏతావహన్తి యే మూఢా య ఏతాన్ జనకానపి।
వచ్యన్తే నరకే తే చ యావద్వై బ్రహ్మణో వయః 53–58

గురుపత్ని, రాజపత్ని, బ్రాహ్మణపత్ని, సాధ్వీస్త్రీ, సోదరునిపత్ని, కుమారునిపత్ని, మిత్రునిభార్య, మిత్రునిభార్యను గన్నతల్లి, తలిదండ్రులను, గన్నస్త్రీలు, తమ్మునిభార్య, కుమారునిభార్య, స్వకన్యక, జనని, జననిసపత్నీ, (సవతితల్లి) తల్లియొక్క సోదరి, సురభి (గోవు) ఇష్టదేవునిపత్ని, పాలిచ్చి పెంచినస్త్రీ, అన్నముపెట్టినస్త్రీ, గర్భమును ధరించినస్త్రీ, తననామముతో భయమునుండి రక్షించినవానిస్త్రీ, వీరందఱు వేదప్రణీత లైనమాతృదేవత లనిస్మృతివచనము. వీరియెడల నపరాధ మొనరింపరాదు. కన్యాదాత, అన్న దాత, జ్ఞానదాత, అభయప్రదాత, జన్మదాత, మంత్రప్రదాత, జ్యేష్ఠభ్రాత మొదలగువారు పితృసమాను లనిస్మృతివచనము. ఇట్టివారి కపరాధ మొనరించిన వారు బ్రహ్మాయుఃపర్యంతము నరక మనుభవింపగలరు.

తనకుమారు లొనరించిననీతిబోధనవలన చంచలమనస్కు డైనబ్రహ్మ యొక్క కామవికారము తొలగిపోగా తా నొనరింపబోవ దుష్కార్యమునకు అత్యంతపశ్చాత్తప్తహృదయుడై యోగధారణచే షట్చక్రములను ఛేదించి శరీరమును త్యజించి పరబ్రహ్మమందు విలీనుఁడయ్యెను. తండ్రి మరణించుట గాంచి బ్రహ్మకుమార్తె, కుమారులు విలపించుచు శ్రీహరిని యనేకవిధముల ప్రాణదానమును ప్రసాదింపవలసినదిగ బ్రార్థించిరి. వారిప్రార్థనలకు సంతుష్టుడై శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించి బ్రహ్మను పునర్జీవితునిగ నొనరించెను. పునర్జీవితు డైనబ్రహ్మ పరమాత్మ ననేకవిధముల స్తుతించి అనన్యభక్తిని, దాస్యసౌభాగ్యమును బ్రసాదింపు మనిశ్రీహరిని ప్రార్థింపగ ఆయన కరుణాంత రంగుడై విధాత మనోవాంఛితములను బ్రసాదించి, సత్కర్మల నుపదేశించి యిట్లుపలెకెను. "బ్రహ్మదేవా! స్వకర్మలవలన లభించు సత్కీర్తి, అపకీర్తి, ప్రతిష్ఠ, ఉపద్రవములు మొదలగునవియన్నియు తుచ్ఛమము లనిభావింపుము. సత్యులకు స్వకర్మ మహాబలవత్తరము. కావున మహాత్ములు నిత్యము సత్-

ర్మలనే నిష్కాములై యాచరింతురు. వారు సర్వకర్మలను నా కర్పణ మొన రించి మనస్సునందు నాచరణారవిందములనే భక్తితో భజించుచు కర్మ నిర్మూలన మొనరించుకొందురు, కుకర్మలవలన అపకీర్తి నిశ్చయముగ కలుగును; సుకర్మలవలన దేహధారులు సుప్రతిష్ఠులై సర్వత్రా నిర్మలయశమును బొందగలరు. విధాతా! అపకీర్తి పరస్త్రీలయందు, పరవస్తువులయందు, నివసించును. ఎవరైనను వానిని గ్రహించిన ఆదుష్కార్మాచరణము స్వక్లేశ కారణము కాగలదు. కావున బ్రహ్మదేవా! హృదయమందు నన్నే స్మరించుచు సర్వకర్మలను నాకర్పించి నాసేవయనెడు కర్మలను నిర్వర్తింపుము. పరస్త్రీని, పరవస్తువులను కాంక్షింపకుము. స్త్రీస్వరూపము నామాయ, సర్వులయందు మోహకారిణి. లీలగా స్వాత్మారాముల నైనను ఆమె మోహింపజేయగలదు. ఆమెయొక్క నానాముద్రలను ఆశ్రయించి కామరాగిణులు నివసింతురు. యావనవతు లైనస్త్రీల స్తనములు, అధరములు, కపోలములు, వక్త్రము, శ్రోణిప్రదేశము, జఘనములు, మొదలగునవి కామదేవుని నివాసములు. కావున ధర్మభీరువు లైనమహాత్ములు అయ్యంగములను దర్శింపరు.

> కో ధర్మః కిం యశస్తేషాం కా ప్రతిష్ఠా చ కిం తపః ।
> కిం బుద్ధిర్విద్యా దానం చ పరస్త్రీషు చ యన్మనః ॥ 88

పరస్త్రీయందు లగ్నమగు మనస్సుకలవారికి వారిమనస్సు ధర్మాచరణములు, యశము, ప్రతిష్ఠ, తపము, బుద్ధి, విద్యదానము ననువానివలన నేమిప్రయోజనము, అట్టివా రిహలోకమం దపయశమును బొంది దుఃఖితులై పరలోకమందు నరకమును బొందగలరు. పరస్త్రీసేవనము ప్రియముగ సతతము నిర్వర్తించువారు అనంతదుఃఖముల ననుభవించి దైవదోషులు కాగలరు. నావదాంభోజములను స్మరించుట అత్యంతోత్తమము, మధ్యమము సత్కార్మాచరణము, అన్నింటి కంటె అధమాధమము పరస్త్రీగమనము. పరస్త్రీనిగాని, పరవస్తువులనుగాని, పరులసువర్ణములనుగాని, పరులభూమినిగాని వాంఛించువారికి సర్వదా విపత్తులు సంభవించును. దైవవశమున పరస్త్రీని దర్శించి కామమునకు లోనైన హరిస్మరణ మొనరించి పాపవిముక్తులు కావచ్చును. పరులసంపదలనుగాని, సువర్ణములనుగాని వీక్షించి మాత్సర్యమోహములకు గురియైనవా స్తములను, పాదములను ప్రక్షాళన మొనరించుకొని పాపవిముక్తులు కావచ్చును.

సర్వే నిత్యం ప్రశంసన్తి శాశ్వత్సన్మార్గగామినమ్ ।
హాలికా అపి నిన్దన్తి కువర్త్మగామినం విధే ॥ 98

విధాతా! సర్వులు నిత్యము సన్మార్గగాములను ప్రశంసింతురు. దుష్కర్మాచరణ మొనరించువారిని హాలికులుకూడ నిస్సంకోచముగ నిందింతురు; కావున నావరప్రభావమువలన నీమనస్సెన్నడును పరస్త్రీనిగాని, పరవస్తువునుగాని వాంఛింపదు. నీమనస్సు నాధ్యానమందే సంలగ్నమైయుండగలదు. నీవు నిర్మించిన త్రిలోకసౌందర్యవతి యైనయీకన్య రతి యనునామధేయమును ధరించి మన్మథుని కర్ధాంగి కాగలదు." ఇట్లు బ్రహ్మకు సదుపదేశ మొనరించి శ్రీమన్నారాయణు డంతర్హితుడయ్యెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములోని నారదనారాయణ సంవాదమున
బ్రహ్మ బ్రహ్మప్రసంగవర్ణన మను
ముప్పదిమొదవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

## ముప్పదియారవ అధ్యాయము

### హరదర్పభంగవర్ణనము

శ్రీకృష్ణుడు పలికెను :

ప్రియా! రాధికా! బ్రహ్మాండమునందేయేలోకములందెవరెవరు తమ శక్తిపై గర్వింతురో, వారియభిమానమును నేను గ్రహించి వారిగర్వమునుభంగ మొనరింతును. ఎందువలెననగ నేను సర్వాత్మను, పరాత్పరుడను, పరమేశ్వరుడను; మొదట బ్రహ్మ గర్వభంగప్రసంగము వర్ణింపగా నీవు అవధరించితివి. ఇపుడు శంకరుడు, పార్వతి, ఇంద్రుడు, సూర్యుడు, అగ్ని, దుర్వాసుడు, ధన్వంతరి యనువారిగర్వభంగములను క్రమముగ వర్ణించెదను, శ్రవణ మొన

రింపుము. ప్రియా! గొప్పవారైనను, అల్పులైనను వారివారి యభిమాన ములను జగన్నాథుడనైననేను భంగ మొనరించెదను.

స్వయముగ శివుడు నా యంశ, సకలజగత్సంహారకారకుడు, నాసమానుడు, తేజోజ్ఞానగుణపరిపూర్ణుడు. మహాయోగులైనను ఆహరుని ధ్యానింతురు. శంకరుడు పరమయోగులకుగూడ గురుడు, జ్ఞానానందస్వరూపుడు, ఆయన చరితమును వర్ణించెద నవధరింపుము. అఱువదివేలదివ్యయుగముల పర్యంతము అహర్నిశములు నన్నే యారాధించి శంకరుడు కళలయందు, తేజస్సునందు నాసమానుడయ్యెను. ఆయననుండి కోట్లకొలదిసూర్యులప్రకాశముతో సమమైన తేజస్సు ప్రాదుర్భవించెను. భక్తులమనోవాంఛితములను పరిపూర్ణ మొనరించుటకు హరుడు కల్పవృతుసమశక్తిశాలియైనాడు. పరమయోగులు దీర్ఘకాల మాయన ప్రచండతేజమును ధ్యానించి, ఆ తేజస్సునను శంకరుని పరమసుందరస్వరూపమును దర్శించిరి. ఆయనయంగకాంతి శుద్ధస్ఫటికసమానోజ్జ్వలము. ఆయన పంచముఖములతో శోభించుచు ప్రతిముఖమందు త్రినేత్రములు కల్గిప్రకాశించెను. కటిప్రదేశమున వ్యాఘ్రచర్మాంబరధారియై హస్తములందు త్రిశూలపట్టిశములను ధరించి శ్వేతకమలబీజమాలను త్రిప్పుచు హరుడు సదా తనమంత్రములనే జపించుచుండును. ఆయన ప్రసన్నముఖారవిందములపై మందహాసములు చిందులాడును. ఆయనశిరమందు తపించిన సువర్ణసమానజటలుకల్గి అర్ధచంద్రమకుటమును ధరించి శోభించును. ఆయన స్వరూప మత్యంతశాంతము. శంకరుడు త్రిలోకములకుస్వామి, భక్తాను గ్రహకాతరుడు, హరుడు తనకు దానే పరమేశ్వరు డనిభావించి సమస్తసంపదలకు దాతయై కల్పవృక్షమువలె నర్వులకు సకలమనోవాంఛితములను ప్రసాదింప దొడంగెను. ఎవ రేవరమును నర్థించినను శంకరుడు నిస్సంకోచముగ నావరములను బ్రసాదించి, వరములకు స్వామి యనబడెను. ఇట్లు స్వాత్మారాముడయిన శివుడు తనలీలచే నభిమానము చెంది గర్వితుడయ్యెను.

ఒకసమయమున వృకుడను దైత్యేశ్వరుడు శివునిగూర్చి కేదారతీర్థమందు ఘోరతప మాచరించెను. స్వయముగ పరమేశ్వరుడు సాక్షాత్కరించి మనోవాంఛితములను గోరుకొను మనియాదేశించినను ఆ దైత్యుడు తపమును విరమింపలేదు. భక్తునియనుగ్రహించుటకు భవు డాదైత్యేశ్వరుని సమ్ముఖమునసే చిరకాలము నిరీక్షించుచుండెను. సర్వైశ్వర్యములను, సమస్తసిద్ధులను,

భోగములను, మోక్షములను, శ్రీహరిపదమును, శూలపాణి ఆదైత్యేంద్రునకు బ్రసాదించుటకు సిద్ధమైనను ఆత డేవరమును నర్థింపక కేవలము శివచరణకమలధ్యానమందే సంలగ్నుడై యుండెను. ఆదైత్యుడు కన్నుల దెఱచి తనయెదుట సాక్షాత్కరించిన సకలసంపత్ప్రదాత యగుశివుని గాంచి స్తుతించెను. నామాయచేప్రేరితు డయినవృకుడు తన హస్తము నెవరిశిరముపై నుంచినను వారు భస్మమగునట్లు వరము నర్థించెను. పరమేశ్వరుడు 'తథాస్తు' అని యాదానవుని ననుగ్రహింపగా, శివప్రదత్తమైన యమోఘవరప్రభావసమన్వితుడై మదోన్మత్తుడై వృకాసురుడు శివుడు ప్రసాదించినవరప్రభావమును శివునిపై బరీక్షించుట కుద్యుక్తు డయ్యెను. అది గ్రహించి మృత్యుంజయు డైనశంకరుడు మృత్యుభయమువలన పారిపోవుచుండగ దైత్యు డాయనను వెంబడించెను. పరమేశ్వరుడు సంకల్పించిన యాదైత్యాధముని సంహరింపగలడు, కాని భక్తవత్సలు డైనసదాశివున కది యసాధ్యము. హరు డాశ్రితు లైనభక్తులపై గరుణించునేగాని సంహరింపడు. తానే సకలసంహారకర్త ననియహంకరించినశివుని గర్వమంతయు నశింపగ రక్షింపు మనినన్ను ప్రార్థించెను. హరుని ప్రార్థనలకు సంతుష్టుడనై నేను విశ్వసమ్మోహన త్రిభువనమోహినీరూపమును ధరించి వృకాసురునియెదుట సాక్షాత్కరించి వానిని మోహింపజేసితిని. మాయోపాయముచే వానిహస్తమునే వానిశిరము నందుంచుకొనునట్లొనరింపగా నాదైత్యుడు భస్మమయ్యెను. ఆసమయమున సిద్ధులు, సురేంద్రులు, మునులు, మహర్షులు అత్యంతప్రసన్నులై భక్తిభావముతో నన్ను స్తుతించిరి.

తదనంతరము మరల గర్వభరితుడై రుద్రుడు త్రిపురాసురులను వధించుటకు బయలుదేరెను. నేను సకలసంహారకర్తనని, ఈకీటకసము లైన దైత్యులు నన్నేమిచేయగల రనిహరుడు భావించి నేను ప్రసాదించిన త్రిశూలమును, కవచమును ధరింపక రణరంగమును బ్రవేశించెను. ఇరువర్గములనడుమ నొకదివ్యవర్ష కాలము ఘోరసంగ్రామము జరిగెను. కాని జయ మెవరిని వరింపలేదు. సమరభూమిమధ్యమున యాదైత్యులు మాయాబలముచే నేబది కోట్లయోజనములు గగనమున కెగిరిరి. శివుడుకూడ తనదివ్యరథముతో గూడ నిరాధార మైనగగనమును బ్రవేశించి యొకమాసము యుద్ధ మొనరించెను. ఆభయంకరసంగ్రామములో నత్యంతబలసంపన్ను డైనదైత్యేంద్రుడు శివుని

రథమును, అస్త్రములను విఫల మొనరించి హరుని భూమిపై విసరివేసెను. ఈప్పరిణామమును గాంచి సర్వ దేవతలు, మహర్షులు భయభీతులై శ్రీకృష్ణా! రక్షింపుము, రక్షింపు మనినన్ను ప్రార్థించిరి. రణరంగమందు పతన మైనను శంకరుడు నిర్భయుడై నన్నే స్మరించి నేను ప్రసాదించినస్తోత్రమును బఠించెను. ఆ సమయమున నేను నాకళతో వృషభరూపమును ధరించి రణరంగమధ్య మున సాక్షాత్కరించి నాకొమ్ములతో శివుని పై కెత్తి నాపృష్ఠభాగ మందిడు కొని ఆయనకు దివ్యకవచమును, త్రిశూలమును ప్రసాదించితిని. నాకృపవలన నశేయుడై హరుడు మత్ప్రసాదితత్రిశూలమును ప్రయోగించి క్షణకాలములో త్రిపురాసురులను సంహరించెను.

పిమ్మట శంకరునిదర్ప మంతయు నశింపగా శివుడు నన్నే నేకవిధముల స్తుతించి, సర్వవిఘ్నస్వరూప మైనతనదర్పమును శాశ్వతముగ పరిత్యజించెను. ఆయన తన యఖండజ్ఞానానందస్వరూపమందుండి సర్వకర్మలందు నిర్లిప్త భావముతో నివసింపదొడంగెను.

> తతోఽహం వృషరూపేణ వహామి తేన తం ప్రియమ్ ।
> మమ ప్రియతమో నాస్తి త్రైలోక్యేషు శివాత్పరః ॥
> మనఃస్వరూపో బ్రహ్మా మే జ్ఞానరూపో మహేశ్వరః ।
> బుద్ధిర్భగవతీ దుర్గా మూలప్రకృతిరీశ్వరీ ॥ 57-58

ఆ సమయమునుండి నేను నాప్రియభక్తుడై నశంకరుని వృషభరూప ముతో మోయుచున్నాను. ఎందువలెననగ త్రిలోకములందు శివునికంటే మించినప్రియతముడు మఱియొకడు నాకు లేడు. బ్రహ్మనామనస్వరూపుడు, మహేశ్వరుడు నాజ్ఞానరూపము, మూలప్రకృతి యగునీశ్వరిదుర్గ నాబుద్ధి రూపము.

నిద్రాదిసకలశక్తులు ప్రకృతికళలు, సాక్షాత్తుగా సరస్వతి నావాణికి అధిష్ఠాత్రీదేవి. కళ్యాణముల కధిదేవత యైనగణేశ్వరుడు నాహర్షరూపము, స్వయముగ ధర్మము నాపరమార్థము, అగ్ని దేవుడు నాభక్తుడు, గోలోకమం దున్నవారందఱునాసమస్తైశ్వర్యములకు నధిదేవతలు, రాధా! నీవు నాప్రాణాధిష్ఠాత్రి దేవతవు. నాకు నాప్రాణములకంటె నధికప్రియురాలవు.

గోపాఙ్గనా_స్తవ కలా అతఏవ మమ ప్రియాః ।
మల్లోమకూపజా గోపాః సర్వే గోలోకవాసినః ॥ 62

గోపాంగనలందఱు నీకళోద్భవలు కావున నా కత్యంతప్రియులు. గోలోక వాసు లైనసమస్తగోపకుమారులు నాగోమకూపములనుండే యుద్భవించిరి, కావున వారు ప్రేమపాత్రులే.

తేజఃస్వరూపః సూర్యశ్చ ప్రాణా మే వాయవః స్మృతాః।
జలాధిదేవో వరుణః పృధివీ మే కమలోద్భవా ॥

మమ శూన్యో మహాకాశో మదనో మానసోద్భవః ।
ఇన్ద్రాదయః సురాః సర్వే మత్కలాంశాంశసమ్భవాః॥

ఏతాని సృష్టిబీజాని మహదాదీని చైవ హి।
సర్వేషాం బీజరూపోఽహం స్వయమాత్మా నిరాశ్రయః ॥

జీవో మే ప్రతిబిమ్బశ్చ కర్మభోగాధికారకః।
అహంసాక్షీ విరీహశ్చ న భోగీ సర్వకర్మసు ॥

భక్తధ్యానార్థదేహోఽయం మమ స్వేచ్ఛామయస్య చ।
ప్రకృతిః పురుషోఽహం చ ఏక ఏవ పరాత్పరః ॥ 63–67

సూర్యుడే నా తేజస్సు, వాయువే నాప్రాణము, వరుణుడే జలముల కధిదేవత, పృథ్వినామలమునుండి యుద్భవించెను. నాశరీరమందుగల సూన్య భాగమే మహాకాశ మనబడెను. కామదేవుడు నామననుండియె సంభవించెను. ఇంద్రాదిసకలదేవతలు నాకళాకళాంశలనుండి జన్మించిరి. సృష్టికి బీజరూపము లైనమహత్తత్త్వములకు బీజస్వరూపమైన ఆశ్రయరహిత మైనయాత్మను స్వయముగ నేనే. కర్మభోగమున కధికారి యైనజీవుడు నాప్రతిబింబమే యని గ్రహింపుము. నేను సర్వదేహధారులయందు సాక్షినై, నిర్లిప్తుడనై, వ్యాపించియున్నను, ఏకర్మభోగములు నన్నంటజాలవు. భక్తులు ధ్యానించుట కొఱకే స్వేచ్ఛామయపరమేశ్వరుడ నైననే నీసచ్చిదానందవిగ్రహరూపమును ధరించితిని. పరాత్పరపరమేశ్వరుడ నైననేనే ప్రకృతిని పురుషుడను.

శ్రీ రా ధా దే వి ప లి కె ను :

దేవా ! నీవు సర్వతత్వజ్ఞుడవు, సర్వబీజుడవు, సనాతనపురుషుడవు. నమస్తసందేహనివారణా! ప్రభూ! నామనోవాంచితప్రశ్నలకు సమాధానమును

బ్రవచింపుము. దేవా! శంకరుడు సమస్తజ్ఞానమున కధిదైవము, జ్ఞాత, మృత్యుంజయుడు, కాలమునకే కాలుడు, సనాతనమూను డైనమహాత్ముడు, అట్టి మహాదేవుడు సర్వాంగములందు విభూతి నేలయలంకరించుకొనును? ఎందుల కాయన పంచముఖుడని, త్రిలోచను డనికీర్తింపబడెను? జటలను ధరించి సర్ప సముదాయముల నాభూషణములుగ ధరించి దిగంబరుడై యేలచరించును? ఆ దేవతాశ్రేష్ఠుడు శ్రేష్ఠవాహనములను బరిత్యజించి వృషభవాహను డెట్లయ్యెను? శివుడు రత్ననిర్మితాభూషణముల నేలధరింపడు? ఆయన యగ్నిశుద్ధము లగుదివ్యవస్త్రములను త్యజించి వ్యాఘ్రచర్మము నేలధరించెను? దివ్యలోకములను వీడి శ్మశానములందు నివసించుట యెందుల కభిలషించును? చందనాగరుకస్తూరీసుగంధాద్యనులేపనము లుండగ హరుడు బిల్వకాష్ఠాను లేపనము నెందులకు వాంఛించును? అనేకదివ్యపుష్పము లున్నను శివుడు బిల్వదళపూజల నేలస్వీకరించును? నాథా! నా యీసందేహముల నన్నింటిని నివారింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :-

రాధయొక్క యీప్రశ్న లన్నింటిని యాలకించి శ్రీకృష్ణపరమాత్మ మందస్మితముఖారవిందుడై సకలసందేహభంజన మైనతనప్రసంగము నిట్లు కొనసాగించెను.

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

ప్రాణేశ్వరీ! పరిపూర్ణతము డైనమహేశ్వరుడు మనస్సును నాయందే లగ్న మొనరించి యిరువదివేలయుగములు తప మొనరించి నన్ను ధ్యానించెను. మహాదేవుని యఖండారాధన కత్యంతప్రసన్నుడనై సచ్చిదానందవిగ్రహుడ నైననేను హరునిసమక్షమున సాక్షాత్కరించితిని. అత్యంతకమనీయము, శ్యామసుందరము, అనిర్వచనీయము నగునాకైశోరస్వరూపము నెంతవీక్షించినను శంకరునినేత్రములు తృప్తినొందలేదు. కన్నుల వారక భక్త్యుద్రేకముచే ప్రేమవిహ్వలుడై యామహాభక్తుడు సాశ్రుపూర్ణలోచనములతో నన్నే దర్శించెను. అనేకశిరస్సులతో, నేత్రములతో భగవంతుని మనోహరరూపమును దర్శింపగల సహస్రముఖుడు, చతుర్ముఖుడు ధన్యు లనిశివుడు భావించెను అట్టిజగన్నాథుని ఎంతగ దర్శించినను నారెండునేత్రము లెట్లుతృప్తినొంద.

గలవు! నాముఖమొక్కటియే యెట్లుస్తుతింపగల దనిశంకరుడు నాల్గుపర్యాయములు పల్కెను. మహాతపస్వియైనశంకరు డిట్లుబహుముఖములు, నేత్రములు కలుగవలె ననిసంకల్పింపగనే ఆయనకు మఱినాల్గుముఖములు ప్రకటితములైనవి. ఒక్కొక్కముఖమందు త్రినేత్రములు ప్రకటితములైనవి. కావుననే శివుడు పంచముఖుడని, త్రినేత్రు డనిప్రసిద్ధిగాంచెను. నన్ను స్తుతించుటకంటె హరుడు నాదివ్యసుందరరూపమును దర్శించుటయందే అధిక మగునభిలాషను గల్గియుండును. కావుననే ఆయనకు ముఖములకంటె నేత్రము లధికములు. మాహేశ్వరుడైన బ్రహ్మస్వరూపుడైనశివుని త్రినేత్రములు సత్త్వరజస్తమోగుణరూపములు. అందులకు గారణములను వచించెద నవధరింపుము.

శంకరుడు సాత్వికాంశదృష్టిచే సాత్త్వికులను, రాజసదృష్టిచే రాజసికులను, తామసదృష్టిచే తమోగుణులను రక్షించును. సంహారకర్తలలాటమందుగల తామసనేత్రమునుండి ప్రళయకాలమందు క్రోధపూర్వకసంవర్తకాగ్ని యావిర్భవింపగలదు. సంహారకాలమందు శివునిలలాటనేత్రమునుండి బయల్వెడలు ప్రచండాగ్ని కోట్లకొలది తాటిచెట్లవలెనున్నతమై కోట్లకొలది సూర్యులతో సమానముగ ప్రకాశమానమై విశాలజిహ్వయుక్తమై ప్రజ్వరిల్లుచు త్రిలోకములను దగ్ధమొనరించు సామర్థ్యము కల్గియుండును. తన యర్థాంగి యైనయయ్యాద్యాప్రకృతి యగుసతిపై ప్రగాఢానురాగయుక్తుడైనహరుడు ఆమెదహనసంస్కారజనితభస్మమును శరీరమం దంతట యలంకరించుకొనెను. కావుననే యాభక్తవత్సలునిదివ్యనామము విభూతిధారి యయ్యెను. సతీదేవియెడల తనకు గలయవ్యాజానురాగప్రభావ కారణమున శివుడు యామెయస్థిమాలను, భస్మమును సదా ధరించును. శంకరుడు స్వాత్మారాము డైనను దేహధారులకు భార్యాభర్తల యన్యోన్యప్రేమ నుపదేశించుటకే యొకసంవత్సరపర్యంతము సతీదేవిదివ్యశరీరమును ఆమె మరణానంతరము భుజమున ధరించి దుఃఖించుచు సర్వత్ర చరించెను. సతీదేవి దివ్యాంగములు పతన మైనస్థలము లన్నియు మంత్రసిద్ధిని ప్రసాదింపగల సిద్ధపీఠము లైనవి. రాధా! అర్థాంగిని తనప్రాణములకంటె మిన్నగ ప్రేమించు శివుడు అవశిష్ట మైనయామె శవమును హృదయమునకు హత్తుకొని పయనించుచు దుఃఖాతిరేకమున సిద్ధక్షేత్రమందు మూర్ఛిల్లెను. ఆసమయమున నేనే స్వయముగ హరునియెదుట సాక్షాత్కరించిఆయనను సచేతనునిగ జేసి శోకహర

మైనపరమోత్తమదివ్యతత్త్వము నుపదేశించితిని శివుడు సంతుష్టుడై స్వధామమునకు వెడలి సతీదేవినే పార్వతిరూపమున మరల పొంది సుఖించెను. సర్వదా యోగస్థుడై యుండుకారణమున శంకరుడు దిగంబరుడయ్యెను. నిత్యుడైన పరమేశ్వరుడు ఇచ్ఛారహితుడు; వర్తమానమందుగూడ శిరముపై ధరించు జటలు ఆయనయఖండతపస్సునకు ప్రమాణములు. యోగీశ్వరుడైనశంకరుడు శిరోజసంస్కారమందుగాని, శరీరాలంకారమందుగాని యిష్టమును జూపడు. చందనమునైనను, పంకమునైనను (బురద), మట్టినైనను, శ్రేష్ఠమణిరత్న సువర్ణములనైనను ఆ మహాయోగి సమముగనే వీక్షించును. గరుడునివలన భీతులై నాగులు శంకరుని శరణువేడిరి. ఆ శరణాగతులను కృపాపూర్వకముగ తనశరీరమందే యాభూషణములుగ ధరించి రక్షించెను.

వాహనం వృషరూపోఽహమన్యస్తం వోఢుమక్షమః ।
త్రిపురస్య వధే పూర్ణం మత్కలాంశసముద్భవః ॥ 101

పరమభక్తశిఖామణి యైనశంకరుని స్వయముగ నేనే వృషభరూపమున వాహనమై సేవింతును. మరియెవ్వరైనను ఆయనభారమును వహించుట కసమర్థులే. పూర్వకాలమందు త్రిపురాసురసంహారసమయమున నాకళాంశ ద్వారమున శివవాహన మైనవృషభము ప్రాదుర్భవించెను.

పారిజాతాదిపుష్పములను, చందనాదిసుగంధితపదార్థములను శివుడు నా కర్పించెను; కావున ఆయన వాటియందు ప్రీతివహింపడు. తుమ్మిపూవులను, బిల్వపత్రములను, బిల్వకాష్ఠానులేపనమును, గంధహీనపుష్పములను, వ్యాఘ్రచర్మమును సదా మహాయోగు లభిలషించెదరు. కావున వాటియందు వారున కత్యంత ప్రీతి కలదు. దివ్యలోకములందుగాని, దివ్యశయ్యలయందుకాని జనసముదాయములందుకాని శంకరుని మనస్సు లగ్నము కాదు; కావున ఆయన యేకాంతప్రదేశ మైనశ్మశానమందు నివసించుచు యహర్నిశములు మదీయధ్యానమందే సంలగ్నుడై యుండును.

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం సమం చ మన్యతే శివః ।
మమానిర్వచనీయేఽత్ర రూపే తన్మగ్నమానసమ్ ॥
బ్రహ్మణః పతనే నాపి శూలపాణేః క్షయో భవేత్ ।
తస్యాయుషః ప్రమాణం చ నాహం జానామి కా శ్రుతిః॥

జ్ఞానం మృత్యుంజయః శూలం ధత్తే మత్తేజసా సమమ్।
వినా మయా న కశ్చిత్తం శఙ్కరం జేతుమీశ్వరః ॥

శఙ్కరః పరమాత్మా మే ప్రాణేభ్యోఽపి పరఃశివః।
త్రయమ్బకే మన్మనం శశ్వన్నప్రియో మే భవాత్పరః ॥

బ్రహ్మాణ్డనికరం ఛన్నం మయా మన్మాయయా సదా।
స కమ్పతి హరం శశ్వన్న చ తం మోహితుం క్షమః ॥

న సంవాసామి గోలోకే వైకుణ్ఠే తవ వక్షసి।
సదా శివస్య హృదయే నిబద్ధః ప్రేమపాశతః ॥

స్వరసిద్ధం సుతానేన పంచవక్త్రేణ శఙ్కరః।
శశ్వద్గాయతి మద్గాథా తేనాహం తత్సమీపతః ॥
స్రష్టుం శక్తో హి నష్టుం చ భ్రూభఙ్గలీలయాపి యః।
బ్రహ్మాణ్డనికరం యోగాన్నయోగీ శఙ్కరాత్పరః ॥
దివ్యజ్ఞానేన యః స్రష్టుం నష్టుం భ్రూభఙ్గలీలయా।
మృత్యుం కాలాదికం శక్తో న జ్ఞానీ శఙ్కరాత్పరః।
మమ భక్తిం చ దాస్యం చ ముక్తిం చ సర్వసమ్పదః ॥
సర్వసిద్ధిం దాతుమీశో న దాతా శఙ్కరాత్పరః ॥
పంచవక్త్రేణ మన్నామ యశో గాయత్యహర్నిశమ్।
మద్రూపం ధ్యాయతే శశ్వన్న భక్తః శఙ్కరాత్పరః॥
అహం సుదర్శనం శమ్భుస్తేజసా చ వయం సమాః।
బ్రహ్మా స్రష్టా చ యోగేన నాస్మాభిస్తేజసానమః ॥105-116

బ్రహ్మ మొదలు కీటకపర్యంతముగల ప్రతిజీవుని శివుడు సమముగ భావించును. కేవలము నాయనిర్వచనీయరూపమందే ఆయన మనస్సు నిరంతరము సంలగ్నమైయుండును. బ్రహ్మ పతనమైనను శూలపాణి యగు శంకరుడు లయ మొందడు. ఆయనయాయుఃప్రమాణము నాకే యగోచరమైన శ్రుతుల కెట్లు తెలియును! మృత్యుంజయుడైన శివుడు అఖండజ్ఞానస్వరూపుడు ఆయన నా తేజస్సమానమైన త్రిశూలమును సదా ధరించును, నేనుదక్క అన్యు లెవ్వరైనను హరుని ధరింపలేరు. శంకరుడే నాపరమాత్మ, శివుడే నాకు ప్రాణముల కంటె నధికప్రియుడు. ఆత్రిలోచనునియందే నా మనస్సుసంలగ్నమైయుండును. భవుని మించిన ప్రియపాత్రులు నాకు మఱియొకరు లేరు. రాధా! నేను

గోలోకమందుగాని, వైకుంఠమందుగాని, నీవతుః స్థలమందుగాని నివసింపను, నేను సదాశివుని ప్రేమపాశముఃకు బద్ధుడనై నిరంతర మాయనహృదయమందే నివసింతును.

శంకరుడు తనపంచముఖములతో సురమ్యరాగముచే సదా నాదివ్య గాథలను స్వరసిద్ధముగ గానమొనరించును, కావున సదా నే నాయన నవిాప మందే నివసించెదను. యోగయోగేశ్వరు డైనహరుడు తనభ్రూభంగలీలా మాత్రముననే బ్రహ్మాండసముదాయములను సృష్టించి సంహరించుటలో సమర్థుడు. శంకరునిమించిన మహాయోగి మఱియొకరు లేరు. తనదివ్యజ్ఞానముచే భ్రూభంగలీలాద్వారమున నశించిన మృత్యుకాలాదులను మరల సృష్టింపగల సమర్థు డైనశంకరునిమించిన మహాజ్ఞానిమఱియొకరు లేరు. ఆయన నాభక్తిని, దాస్యభావమును, ముక్తిని, సమస్తసంపదలను, సర్వసిద్ధులను ప్రసాదించుటలో సమర్థుడు, అందువలన శంకరునిమించిన దాత మఱియొకరు లేరు. ఆయన పంచముఖములతో నహర్నిశములు నాదివ్యనామయశములను గాన మొనరించుచు నిరంతరము నాస్వరూపమునే ధ్యానించును, కావున శంకరుని మించిన యనన్యభక్తుడు నాకు మఱియొకరులేరు. నేను, సుదర్శనచక్రము, శివుడు మేము ముగ్గురము సమానతేజస్వులము. సృష్టికర్త యగుబ్రహ్మయైనను యోగతేజస్సునయందు మాతోసమానుడు కానేరడు. ప్రియా! ఇట్లు నేను శంకరునినిర్మలయశమును పరిపూర్ణముగ వర్ణించితిని. అట్టిభక్తాగ్రేసరుడే అహంకరించినను నేను తక్షణమే దర్పభంగ మొనరించి, దివ్యజ్ఞానమును ప్రసాదించితిని. హృదయేశ్వరీ! ఇపుడు నీ వేమిశ్రవణ మొనరింపవలె నని యభిలషించెదవో నాకు తెల్పుము.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున ఈశ్వరగర్వభంగ మను
ముప్పదియాఱవ అధ్యాయము
సంపూర్ణము.

# ముప్పదియేడవ అధ్యాయము

## హారనిర్మాల్యశాపప్రసంగవర్ణనము

శ్రీరాధాదేవి పలికెను:

సర్వభూతవిభూ, సర్వేశ్వరా, మహాత్మా! నాకు హారనిర్మాల్యశాప ప్రసంగమును వివరింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీకృష్ణుడు పలికెను:

దేవీ! పాపమనెడుఇంధనములను దహించుటకు అగ్నిశిఖోపమైన ఇతిహాసమును ప్రవచించెద నవధరింపుము. పరమవైష్ణవుడైనసనత్కుమారుడు వైకుంఠపరంధామమున కేగి భక్తవత్సలుడైన శ్రీమన్నారాయణుని దర్శించి అనేకస్తోత్రములచే స్తుతించి ప్రణామము లర్పించెను. సనత్కుమారుని భక్తి ప్రవత్తులకు సంతుష్టుడై శ్రీహరి తనప్రసాదమును ఆద్విజోత్తమున కొసంగి యిట్లుపల్కెను. "భక్తాగ్రేసరా! నాయీదివ్యప్రసాదమును కేవలము నీవే భుజింపక నీప్రేమపాత్రులైనవారికికూడ నర్పింపుము". భక్తవత్సలుని యనుజ్ఞపొంది సనత్కుమారుడు సిద్ధక్షేత్రమున కరుదెంచి ఆమహాప్రసాదమును తాను కొంత భుజించి మిగిలినదానిని పరమగురుడైన శూలపాణి కర్పించెను. భక్త్యుద్రేకసమన్వితుడై శంకరుడు ఆశ్రీహరిప్రసాదమును తనయర్థాంగి యైన పార్వతికి అర్పించుట మరచి కొంత తానే భుజించి భక్తిభావతరంగ సమన్వితుడై, ప్రేమవిహ్వలుడై సర్వాంగములు పులకింపగ సాశ్రుపూర్ణలోచనుడై సుమధురకంఠముచే నాదివ్యగుణనామసంకీర్తన మొనరించుచు నృత్యముచేయదొడంగెను. త్రిశూలడమరుకములను వ్యాఘ్రచర్మాంబరములను పరిత్యజించి హరుడు ప్రేమాతిశయముచే రోదించుచు తన సహస్రదళహృదయకమలమధ్యమున అతీవకమనీయమైననారూపమునే ధ్యానింపదొడంగెను.

ఆ సమయముననే దుర్గతినాశని యగుదుర్గ శివసనత్కుమారు లున్న ప్రదేశమున కరుదెంచి హరుని మాధుర్యభక్తిభావమును దర్శించి అత్యంత

ప్రసన్నమై మహాదేవుని యీస్థితికి గారణ మేమని సనత్కుమారుని ప్రశ్నింపగ ఆ ద్విజోత్తముడు జరిగినదంతయు జననికి విన్నవించెను. తనకు శ్రీహరి ప్రసాదము నర్పింపక శంకరుడే స్వయముగ భుజించె నని తెలిసికొని పార్వతి యత్యంతకుపితయై రక్తపంకజలోచనయయ్యెను. ఆమె కోపాగ్నికి పరమేశ్వరుడే కంపింపదొడంగెను. జగజ్జనని యగుదుర్గ తనప్రాణేశ్వరుని గాంచి యిట్లు పల్కెను. "నాథా! నీవే సర్వజగములను పోషించి పాలించువాడవని, జనకుడవని, విభుడవని నాల్గువేదములు ఘోషించును, ముక్తిప్రదాతవు సర్వసంపదలను భక్తులకు ప్రసాదింపగలనీవు హరిప్రసాదముచే నన్నేల వంచించితివి. నేను సదా నీచే పరిపాల్యను, పోష్యను, భర్తురాలను, నీకింకరిని, నన్నేలహరినిర్మాల్యభక్షణసౌభాగ్యమునుండి వంచితురాలిగ నొనరించితివి? నాథా! హరికి నివేదించినప్రసాదమునే సదా భక్షించుదేహధారి దివ్యపార్షదుడు కాగలడు. అమృతము, సుదుర్లభమైన సర్వమధురవస్తువులు, విష్ణుప్రసాదమాధుర్యమందు పదునారవయంశకైనను సరిరావు. అంత్యకాలమందు హరిప్రసాదమును భుజించినజీవుడు నిశ్చయముగ పరంధామము జేరగలడు. అట్టి దివ్యహరిప్రసాదమును నాకు బ్రసాదింపక మీరే భుజించితిరి. కావున మీనిర్మాల్యమును స్వీకరించినవారు సారమేయజన్మమును పొందగలరు. కాని శ్రీహరినిర్మాల్యములతో కలపి స్వీకరించిన దరింపగలరు."

ఇట్లు మహేశ్వరుని శపించి దుర్గ దుఃఖించుచు ఆయన కంఠప్రదేశమును కోపముతో వీక్షింపగా హరునికంఠము నీలవర్ణమయ్యెను. అత్యంతోగ్రరూపమును దాల్చియున్న జగజ్జననిని శాంతింపజేయుటకొఱకు శంకరుడే స్వయముగ ననేకవిధముల స్తుతించెను.

శంకర ఉవాచ :

స్థిరాభవ మహాదేవీ చణ్డికే జగదమ్బికే ।
మమాపరాధమఖిలం క్షన్తుమర్హసి సున్దరి ॥
మాం భృత్యం తపసా క్రీతం కృపాం కురు మమోపరి ।
బ్రహ్మవిష్ణుమహేశానాం బీజభూతే సనాతని ॥
అహో గోలోకనాథస్య గుణాతీతస్య నిర్గుణే ।
సర్వశక్తిస్వరూపే చ సదైవ సహచారిణి ॥

సాకారే చ నిరాకారే నిత్యే స్వేచ్ఛామయే ప్రియే ।
కృపయా తద్విభోరేవ మమ వక్షసి సాంప్రతమ్ ॥

సర్వబీజస్వరూపే చ మహామాయే మనోహరే ।
సర్వసిద్ధిప్రదే దేవీ ముక్తిదే కృష్ణభక్తిదే ॥
ఇచ్ఛైవం శ్రీహరేః సాక్షాన్నాహం దాతుమపి క్షమః ।
తదా దేహం పరిత్యజ్య నిర్గుణం వ్రజ నిర్గుణే ॥
ఇత్యేవముక్త్వా పురతస్తస్థౌ చ చన్ద్రశేఖరః ।
బభూవ సుప్రసన్నా సా ప్రణనామ హరం పరమ్ ॥
ఇత్యేవం పార్వతీస్తోత్రం శఙ్కరేణ కృతం పురా ।
యః పఠేద్విపదా గ్రస్తః స భయాదేవ ముచ్యతే ॥
మిత్రభేదో భవేద్దూరం తత్సంప్రీతిర్భవేత్ పురా ।
పార్వతీ పరితుష్టా చ న త్యజేత్తస్య మన్దిరమ్ ॥ 41-49

మహాదేవీ! చండికా! జగదంబికా! శాంతింపుము. స్థిరమైనదానవు కమ్ము. సుందరీ! నాయపరాధముల నన్నింటిని క్షమింపుము. బ్రహ్మవిష్ణు మహేశ్వరాదులకు బీజస్వరూపిణివైనదానా! సనాతనీ! నీభృత్యుడను తపో క్లిష్టుడను నగు నాపై గరుణింపుము. అహో, గుణాతీతుడైన నిర్గుణుడైన గోలోకనాథునకే నీవు సర్వశక్తిస్వరూపిణివి, సహచారిణివి. ప్రియా! నీవు సాకారవు, నిరాకారవు, స్వేచ్ఛామయవు, నిత్యవు. కృపతో నాకువరములను అనుగ్రహింపుము. సర్వబీజస్వరూపిణీ! మహామాయా! మనోహారిణీ! సర్వసిద్ధి ప్రదా! దేవీ! నాకు ముక్తిని, శ్రీకృష్ణభక్తిని బ్రసాదింపుము. నిర్గుణా! శ్రీహరియొక్క ఇచ్ఛను నేనుసాక్షాత్తుగ దీర్పజాలను. నిర్గుణ మగు దేహమును విడచి వెడలుము.

ఇట్లుపలికి చంద్రశేఖరుడు ఆమెయెదుట నిలువబడెను. ఆమె ప్రసన్నురాలై హరునకు నమస్కరించెను. శంకరు డొనరించిన యీపార్వతీస్తోత్రమును పఠించువారు సర్వవిపత్తులనుండి విముక్తులు కాగలరు. వారు మిత్రభేదమునుండి, భవసాగరమునుండి యుద్ధరింపబడెదరు. ఈస్తోత్రమువలన పార్వతి సంతుష్టురాలై భక్తుని గృహమును వీడదు.

ప్రాణేశ్వరుడొనరించినస్తోత్రమునకు ప్రసన్నురాలై పార్వతి పరమేశ్వరునితో గలసి దివ్యజలములందు స్నానమాచరించి, మృష్టాన్నములను, వ్యంజనములను నిర్మించి నాకు (కృష్ణునకు) నివేదన మొనరించి, భుజించి, సుఖించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములోని నారదనారాయణ సంవాదమున
హరనిర్మాల్య శాపప్రసంగ మను
ముప్పదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

## ముప్పదియెనిమిదవ అధ్యాయము

### దుర్గాదర్పభంగము

శ్రీకృష్ణుడు పలికెను :

దేవీ! జగద్గురు డైనశంకరునిదర్పభంగవృత్తాంతమును శ్రవణమొనరించితివి, ఇపుడు దుర్గాదర్పవిమోచనచరితమును వర్ణించెద నవధరింపుము. సర్వదేవతలతేజమును గ్రహించి ఆద్యాప్రకృతి యగునీశ్వరి దివ్యసుందర రూపమును ధరించి దానవేంద్రులను వధించి దేవతల నందఱిని రక్షించెను. తదనంతరము ఆప్రకృతిమాత ప్రజాపతి యగుదక్షుని గృహమున ప్రాదుర్భవించెను. దక్షకన్య యగుసతీదేవి పినాకపాణి యగుశివుని ప్రాణేశ్వరునిగ పొంది అత్యంతభక్తిసమన్వితయై నిత్యము స్వామిసేవలయందు సంలగ్నయయ్యెను. దైవవశమున దేవసభామధ్యమున దక్షశంకరులమధ్య అకారణ వైరము సంభవించెను. దక్షుడు కేవలము హరుని అవమానించుటకే ఒకమహాయజ్ఞమును ప్రారంభించెను. సర్వదేవతలను ఆహ్వానించి క్రోధవశమున తన జామాత యైనభవుని ఆహ్వానింపక అవమానపరచెను. తండ్రియజ్ఞమును

దర్శింపవలె ననుప్రగాఢవాంఛాసమన్వితయై అనుజ్ఞయొసంగవలసినదిగ సతి ప్రాణేశ్వరుని ప్రార్థించెను. అవమానించినవారు తలిదండ్రులైనను వారి గృహమునకు వెడలరాదనిశివుడు వారించినను చంచలమనస్కురాలై సతి భర్తయాజ్ఞ లేకున్నను అహంకారవశయై తండ్రియజ్ఞమును దర్శించుటకు వెడలిపోయెను. యజ్ఞవాటికను ప్రవేశించిన కొమరితను దక్షుడు ఆదరింపకపోగా ములుకులవంటి పలుకులచే పుత్రికయొక్క మనస్సును నొప్పించి జగదీశ్వరుడైనశివుని నిందించెను. తండ్రియే తనప్రాణనాథుని నిందించుట సహింపలేని పరమసాధ్వి యగుసతి తనభర్త అజ్ఞను తిరస్కరించినందులకు అనేకవిధముల పశ్చాత్తాప్తయై తనశరీరమును త్యజించెను.

ప్రియా! తదనంతరము జన్మాంతరమందు సతీదేవి హిమవంతుని గృహమున ప్రాదుర్భవించెను. ప్రేమవశమున శంకరుడు సతీదేవిచితాభస్మమును, అస్తికలను శరీరమందు ధరించి తనయర్థాంగినే ధ్యానించుచు అవధూతవలె తిరుగసాగెను. పార్వతీదేవియొక్క ఆకృతి జగన్మోహనకరము, సృష్టియందు ఆమెతో సమానమైన సౌందర్యవతి మఱియొకతె లేదు. దివ్యగుణజనని యైన ఆదేవి సర్వగుణసంపన్నురాలు. సర్వదేవపత్నులు ఈమె పదసేవకళ్కైనను సరిరారు. పార్వతి శుక్లపక్షచంద్రునివలె హిమవంతునిగృహమందు దినదిన ప్రవర్థమానయై నవయౌవనసంపన్నయయ్యెను. ఆ సమయమున నీవు ఘోరతప మొనరించినగాని హరుడు పతిగలభింప డనియశరీరవాణి పార్వతిని ఆదేశించెను. నవయౌవనసౌందర్యాతిశయముచే గర్వించుపార్వతి అశరీరవాణి యాదేశమును పాలింపక నాపూర్వజన్మకుసంబంధించిన భస్మాస్థికలను ధరించి సంచరించు శంకరుడు ఈజన్మమందు సౌందర్యసంపన్నయైన నన్నేల వరింపడని, చతురుడైనను నాశోకవశమున బ్రహ్మాండములందు భ్రమించు నాస్వామి పరమ సౌందర్యవతి నైన నన్నుగాంచి యేలవరింపడని, దక్షయజ్ఞమునే విధ్వంస మొన రించిన, ఆయన ఈ జన్మమందు తనభార్యనైన నన్నేలగ్రహింప డనిగిరిరాజ కన్య భావించెను.

అత్యంతాభిమానకారణమున తనకుదాను సౌందర్యవతినని, సద్గుణ రాశినని, శివుడు నిశ్చయముగ తన్నే వరించునని భావించిపార్వతి తప మొనరింప లేదు. సుందరీమణులందు తానే సౌందర్యవతి నని భ్రమించి శివునితత్త్వమును గ్రహింపలేక గర్వసమన్వితయై పార్వతి తప మాచరించుట కుద్యుక్తురాలు

కాలేదు. నానామమును శ్రవణ మొనరించినంతనే భవుడు నన్ను వరించు నని పార్వతి భావించి సఖులతో ఆటపాటలందు కాలమును వ్యర్థ మొనరించెను; ఆ సమయమున హిమవంతునిదూత నగరమావల అక్షయవటవృక్షచ్ఛాయలో ప్రమథగణపరివేష్టితుడై శివుడు కొలువుదీరియున్నా డనివిన్నవించి యిట్లు పలికెను, "గిరిరాజా! లెమ్ము. పరమేశ్వరుని భక్తిభావముతో పురమున కాహ్వానింపుము, జగన్నాథునకు షోడశోపచారము లర్పించి అనేకవిధముల పూజించి అంతఃపురమున కాహ్వానింపుము. పర్వతేశ్వరా! మహాదేవుడు సిద్ధి స్వరూపుడు, సకలసిద్ధులకు స్వామి, యోగీంద్రుల గురువులకే గురుడు, మృత్యుంజయుడు, కాలమునకే కాలుడు, సనాతనుడు, బ్రహ్మజ్యోతి స్వరూపుడు, సగుణనిర్గుణరూపుడు, కేవలము భక్తులను అనుగ్రహించుటకే ఆయన సచ్చిదానందమాహేశ్వరరూపమును ధరించియున్నాడు. రాజా! సత్వరమే సపరివారముగ భక్తిభావసమన్వితుడవై భవుని అంతఃపురమున కాహ్వానించి సత్కరించి చరితార్థుడవుకమ్ము".

దూతపల్కినవాక్కుల నాలకించిన పార్వతీదేవి ముఖారవిందము, నేత్రములు అత్యంతప్రసన్నతచే ప్రఫుల్లితములైనవి. తనకొఱకే మహాదేవుడరుదెంచె నని యామె భావించి అనేకరత్నాభరణములచే అలంకృతమై తన ప్రాణేశ్వరునికొఱకు నిరీక్షింపదొడంగెను. ఆసమయమున నామె శివునిదక్క అన్యులైన తలిదండ్రులనుగాని, బాంధవులనుగాని, సహోదరీసహోదరులనుగాని తనమనమునందు స్మరింపలేదు. ఆమెమనము శివధ్యానమందే సంలగ్నమయ్యెను. వార్తావహుడు నివేదించిన శివాగమనమును ఆలకించి గిరిరాజు అత్యంతప్రసన్నుడై గంగానదీరమణీయతటమున వటవృక్షచ్ఛాయలో గణసహితముగ కొలువుదీరియున్న పరమేశ్వరుని దర్శించెను. శివునిముఖారవిందముపై మందహాసములు చిందులాడుచున్నవి. ఆయన హస్తములందు జపమాలను ధరించి నానామము (శ్రీకృష్ణనామము)నే ధ్యానించుచుండెను. హరుడు శిరముపై సువర్ణకాంతియుక్తమగు జటాజూటము విరాజిల్లగ వృషభవాహనారూఢుడై హస్తమందు త్రిశూలమునుధరించి సర్వాభరణభూషితుడై, సర్పయజ్ఞోపవీతధారియై, శుద్ధస్ఫటికసమానో ఉజ్జ్వలకాంతితో ప్రకాశించుచు, వ్యాఘ్రచర్మాంబరములను, అస్థిమాలికలను, విభూతిని ధరించి దిగంబరుడై, పంచవక్త్రుడై, త్రినేత్రుడై, అనంతసూర్యకోటిప్రకాశమానుడై దర్శన

మొసంగెను. హిమవంతుడు శివుని పరివేష్టించి బ్రహ్మతేజముతో ప్రకాశించు నేకాదశరుద్రులను దర్శించెను. శివునివామభాగమందు మహాకాలుడు, దక్షిణ భాగమందు నందికేశ్వరుడు విరాజిల్లుచుండిరి. భూతప్రేతపిశాచకూష్మాండ బ్రహ్మరాక్షసబేతాళక్షేత్రపాలభైరవాది ప్రమథగణములు, సనకసనందన సనత్కుమారసనాతన జైగీషవ్య కాత్యాయన దూర్వాసాష్టావక్రాది మహర్షులు పరమేశ్వరుని సమ్ముఖమున నిలువబడి అనేకవిధముల ఆయనను స్తుతించు చుండిరి. హిమవంతుడు భక్తిభావముతో సభాసదులందరకు నమస్కరించి శివునిచరణకమలములపై వ్రాలి అనేకదండప్రణామము లర్పించి నిలువబడి పులకితగాత్రుడై, సాశ్రుపూర్ణలోచనుడై తనకు ధర్మదేవు డుపదేశించిన స్తోత్రముద్వారా పరమేశ్వరు నిట్లుస్తుతింపనారంభించెను.

హిమాలయ ఉవాచ :

త్వం బ్రహ్మ సృష్టికర్తా చ త్వం విష్ణుః పరిపాలకః ।
త్వం శివః శివదోఽనన్తః సర్వసంహారకారకః ॥

త్వమీశ్వరో గుణాతీతో జ్యోతిరూపః సనాతనః ।
ప్రకృతిః ప్రకృతీశశ్చ ప్రాకృతః ప్రకృతేః పరః ॥

నానారూపవిధాతా త్వం భక్తానాం ధ్యానహేతవే ।
యేషు రూపేషు యత్ప్రీతి స్తత్తద్రూపం బిభర్షి చ ॥

సూర్య స్త్వం సృష్టిజనక ఆధారః సర్వతేజసామ్ ।
సోమ స్త్వంశస్య పాతా చ సతతం శీతరశ్మినా ॥

వాయు స్త్వం వరుణ స్త్వం చ త్వమగ్నిః సర్వదాహకః ।
ఇన్ద్ర స్త్వం దేవరాజశ్చ కాలో మృత్యుర్యమ స్తథా ॥

మృత్యుంజయో మృత్యుమృత్యుః కాలకాలో యమాన్తకః ।
వేద స్త్వం వేదకర్తా చ వేదవేదాఙ్గపారగః ॥

విదుషాం జనక స్త్వం చ విద్వాంశ్చ విదుషాం గురుః ।
మన్త్ర స్త్వం హి జప స్త్వం హి తప స్త్వం తత్ఫలప్రదః ॥

వాక్ త్వం వాగధిదేవీ త్వం తత్కర్తా జగద్గురుః స్వయమ్ ।
అహో సరస్వతీబీజం కస్త్వాం స్తోతుమహేశ్వరః ॥

ఇత్యేవముక్త్వా శైలేన్ద్రస్తస్థౌ ధృత్వా పదామ్బుజమ్ ।
తతోఽవాస తమాబోధ్య చావరుహ్య వృషాచ్ఛివః ॥

స్తోత్రమేతన్మహాపుణ్యం త్రిసన్ధ్యం యః పఠేన్నరః ।
ముచ్యతే సర్వపాపేభ్యో భయేభ్యశ్చ భవార్ణవే ॥
అపుత్రో లభతే పుత్రం మాసమేకం పఠేద్యది ।
భార్యాహీనో లభేద్ భార్యా సుశీలాం సుమనోహరామ్॥
చిరకాలగతం వస్తు లభతే సహసా ధ్రువమ్ ।
రాజ్యభ్రష్టో లభేద్ రాజ్యం శఙ్కరస్య ప్రసాదతః ॥
కారాగారే శ్మశానే చ శత్రుగ్రస్తేఽతిసఙ్కటే ।
గభీరేఽతిజలాకీర్ణే భగ్నపోతే విషాదనే॥
రణమధ్యే మహాభీతే హింస్రజన్తుసమన్వితే ।
సర్వతో ముచ్యతే స్తుత్వా శఙ్కరస్య ప్రసాదతః ॥ 65-78

## హిమవంతుడొనరించిన శివస్తోత్రము

దేవా! నీవే సృష్టికర్త వగుబ్రహ్మవు, జగత్పాలకుడైన విష్ణుడవు, సకలసంహారకారకుడవైన అనంతుడవు, అఖిలకళ్యాణప్రదాత వైనశివుడవు, సనాతనా! జ్యోతిస్స్వరూపా! నీవే గుణాతీతుడ వైనయీశ్వరుడవు. ప్రకృతివి, ఆ ప్రకృతికి ఈశ్వరుడవు. ప్రాకృతపదార్థస్వరూపమును ధరించినను నీవు ప్రకృతికి అతీతుడవు. నీభక్తులు ధ్యానించుటకొఱకే నీవు అనేకరూపములను ధరించితివి. ఏరూపమం దేభక్తునకు ప్రీతికలదో వానికొఱకు నీవు ఆరూపమునే ధరింతువు. నీవే సృష్టికి జన్మదాతవైనసూర్యుడవు, సమస్తతేజస్సును ధరించు వాడవు. నీవే శీతలకిరణములచే సస్యములను పాలించు సోముడ (చంద్రుడ) వు, నీవే వాయువు, వరుణుడవు, సర్వదాహకహుతాశనుడవు (అగ్ని), దేవరాజైన ఇంద్రుడవు, కాలము, యముడవు, వేదములు, వేదకర్త, వేదవేదాంగపారం గతుడవైన విద్వాంసుడవు, విద్వాంసులకే గురుడవు; నీవే మంత్రము, జపము, తపము, వానియన్నిటికీ ఫలప్రదాతవు, వాక్శక్తివి, వాణికిఅధిష్ఠాత్రీదేవివి, స్రష్టవు, గురుడవునైయున్నావు. అహా! సరస్వతీబీజము పరమాద్భుతము, ఎవరు నిన్ను స్తుతింపగలరు!

ఇట్లుశివుని స్తుతించి హిమాలయము మహేశ్వరుని చరణకమలములకు నమస్కరించి నిలువబడెను. శివుడు వృషభారూఢుడై శైలరాజేంద్రునకు ప్రబోధామృతము నొసంగెను. త్రిసంధ్యలయందు ఈపరమపుణ్యమయస్తోత్ర

మును పఠించుచున్నప్పుడు భవసాగరమందు నివసించియున్నను సమస్త పాపముల నుండి, భయములనుండి విముక్తుడు కాగలడు. పుత్రహీనుడైన మనుష్యుడొక మాసపర్యంత మీదివ్యస్తోత్రమును పఠించిన పుత్రవంతుడు కాగలడు. భార్యాహీనునకు సుశీల పరమమనోహారిణియైన భార్య లభించును. స్తోత్రమహాత్మ్యము వలన మనుష్యుడు తాను గతకాలములో పోగొట్టుకొన్న వస్తువులను అవశ్యము శీఘ్రముగ మరల పొందగలడు. రాజ్యభ్రష్టునకు శంకరుని ప్రసాదమువలన మరల రాజ్యము లభించును. కారాగారమందు, శ్మశానమందున్నను శత్రుసమూహములమధ్య, అత్యంతగంభీరజలాశయములమధ్య, నౌకాభంగమైన, విషమును ఆస్వాదించిన, జంతువులచే బాధింపబడిన, మహాభయంకరసంగ్రామ మధ్యమున చిక్కబడినమనుష్యుడీదివ్యస్తోత్రమును పఠించిన శంకరునికృపకు పాత్రుడై సమస్తభయములనుండి విముక్తుడుకాగలడు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి శ్రీకృష్ణ
జన్మఖండములోని నారదనారాయణ సంవాదమున పార్వతీదర్ప
భంగ ప్రసంగమున హిమవత్కృత శివస్తోత్రమను
ముప్పదియెనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

— o —

## ముప్పదితొమ్మిదవ అధ్యాయము

### కామదహనము

శ్రీకృష్ణుడు పలికెను:

ప్రియా! ఇట్లు గిరిరాజైనహిమవంతుడు పరమేశ్వరుని స్తుతించి భక్తి పూర్వకముగ భగవంతునకు మధుపర్కాదిషోడశోపచారముల నర్పించి తదనంతరము మహర్షులను, శివపార్షదులను పూజించెను. ఆ సమయమున హిమవంతుని అర్ధాంగియగు మేనక అంతఃపురస్త్రీలతో జగదీశ్వరుని దర్శిం

చుటకు వటవృక్షప్రదేశమున కరుదెంచెను. వటమూలప్రదేశమందు విరాజిల్లు చున్న శంకరుని సర్వస్త్రీసహితముగ మేనాదేవి దర్శించెను.

ఈషద్ధాస్యప్రసన్నాస్యం వసన్తం వ్యాఘ్రచర్మణి ।
మధ్యే మునిగణానాం చ జ్వలన్తం బ్రహ్మతేజసా ॥
యథాకాశే తారకాణాం ద్విజరాజం విరాజితమ్ ।
పరమాహ్లాదకం రూపం కన్దర్పకోటిసన్నిభమ్ ॥
విహాయ వార్ధకావస్థాం దధతం నవయౌవనమ్ ।
అతీవ సున్దరం రమ్యం చిత్తచౌరం చ యోషితామ్ ॥
కామం కామాతురాణాం చ సతీనాం చ సుతు యథా ।
వైష్ణవానాం మహావిష్ణుం శైవానాం చ సదాశివమ్ ॥
శక్తిస్వరూపం శాక్తానాం సౌరాణాం సూర్యరూపిణమ్ ।
కాలస్వరూపం దుష్టానాం శిష్టానాం పరిపాలకమ్॥
కాలకాలసమం మృత్యోర్మృత్యుం మృత్యుం భయానకమ్।
వ్యాఘ్రచర్మ చారువస్త్రం బభూవ భస్మచన్దనమ్ ॥
సర్పాః సున్దరమాల్యాని కస్తూరీ యా విషప్రభా ।
జటా సులలితా చూడా చన్ద్రమేలకచన్దనమ్ ॥
సుచార్వీ మాలతీమాలా గఙ్గాధరా మనోహరా ।
అస్థిమాలా రత్నమాలా ధత్తూరం చారు చమ్పకమ్ ॥
ఏకీభూతం పంచవక్త్రం నేత్రత్రయగ్మాబ్జశోభితమ్ ।
శరత్పార్వణచన్ద్రాభం ప్రచ్ఛాద్య దీప్తముత్తమమ్ ॥
బన్ధుజీవ వినిన్ద్యైకమోష్ఠాధర మనోహరమ్ ।
శ్వేతశ్చన్ద్రో వృషేన్ద్రశ్చ భూతాద్యా నర్తకా ఇవ॥ 4—13

ఆయన ప్రసన్నముఖారవిందముపై మందహాసములు ప్రకాశించుచున్నవి. శివుడు వ్యాఘ్రచర్మధారియై ఆకాశమందుగల తారకలమధ్యలో చంద్రుడు ప్రకాశించునట్లు మహర్షిగణములమధ్య అఖండబ్రహ్మతేజముచే ప్రకాశించు చుండెను. కోటానుకోట్లమన్మథులతో సమానమైన ఆయనమనోహరరూపము చూపరులకు అత్యంతఆహ్లాదమును ప్రసాదించును. హరుడు వృద్ధావస్థను వీడి నూతనయౌవనసంపన్నుడై అత్యంతసుందరరమణీయరూపధారియై రమణుల చిత్తములను హరించెను. కామాతురలైనకామినులకు ఆయన కామదేవునివలె

కన్పడెను. వైష్ణవులకు మహావిష్ణువువలె, శైవులకు సదాశివునివలె, శాక్తే
యులకు శక్తిస్వరూపమువలె, సూర్యభక్తులకు సూర్యునివలె, దుష్టులకు
కాలమువలె, శిష్టులకు పరిపాలకునివలె దర్శనమొసంగెను. కాలమునకే
కాలముగ, మృత్యువునకే మృత్యువుగ, అత్యంతభయంకరుడుగ పాపులు
మాహేశ్వరుని దర్శింతురు. స్త్రీలకు ఆయనధరించినవ్యాఘ్రచర్మము సుమనో
హరవస్త్రమువలె గోచరించెను, భస్మము చందనమయ్యెను. సర్పములు
సుందరమాలికలవలె మారిపోయెను. శివునికంఠమందు గలకాలకూటప్రభ
ఆస్త్రీలకు కస్తూరివలె గోచరించెను. బాగుగ నిర్మింపబడినచూడవలెజడలు
మారిపోయెను. ఫాలదేశమందు ప్రకాశించుచంద్రుడు చందనమయ్యెను.
మస్తకమునుండి ప్రవహించు మనోహారిణి యగుగంగధార పరమసుందరమాలతీ
మాలరూపమున బరిణామమొందెను. అస్థిమాల రత్నమాలకాగా, తుమ్మి
పూలు మనోహరచంపకపుష్పములైనవి. పంచముఖుడు ఏకముఖుడై,
త్రినయనుడు కమలసదృశద్వినయనుడై ఆకాంతలకు దర్శనమొసంగెను. శివుని
ముఖము శరత్పూర్ణిమాచంద్రునిప్రభనే మించి దేదీప్యమానముగ ప్రకా
శించెను.ఆయనఓష్ఠములు బంధుజీవుడగు మధ్యాహ్నసూర్యుని అరుణవర్ణమునే
తిరస్కరించినవి. శ్వేతచంద్రుడే వృషభరాజరూపమున అరుదెంచెనా
యన్నట్లు నందికేశ్వరుడు ప్రకాశించెను. సకలభూతాదిప్రమథగణములు
వర్తకులైరి.

మహేశ్వరునిస్వరూపము తత్కాలముననే మారిపోయి అత్యంత
సౌందర్యప్రభలతో విరాజిల్లగ, ఆయనను దర్శించిన మేనక అత్యంతసంతుష్టు
రాలయ్యెను. కాంతలు శంకరుని రూపసౌందర్యమును గాంచి ముగ్ధలై
మనమునందు నానావిధములుగ అభిలషించిరి. వారందరూ పార్వతి పుణ్యాత్మ
రాలు. భారతవర్షమం దీమెజన్మ ధన్యమయ్యెను, ఎందువలెననగ ఈనవ
మన్మథాకారుడైనశివుడే ఆమెకుపతికానున్నాడనుచు కీర్తించిరి.

అంతఃపురస్త్రీసహితముగ శైలేంద్రుడు భగవంతుని యనేకవిధముల
సేవించి యనుజ్ఞగొని స్వగృహమునకు వెడలి మేనకతో నేకాంతమున సంప్ర
దించి పార్వతిని శివునియారాధించుటకు బంపెను. తనహృదయము శంకరు
నందే అనురక్తముకాగా పార్వతి మనోహరముగ నలంకరించుకొని యిష్ట

సఖులతో గూడి శివుని సమీపించెను. ప్రసన్నముఖనేత్రసమన్వితుడు, పరమశాంతస్వరూపుడైన శివుని దర్శించి పార్వతి యత్యంతభక్తిభావముతో నమస్కరించి మందహాసములు చిందించుచు నేడుపర్యాయములు ప్రదక్షిణ మొనరించి యెదుట నిలువబడెను.

జగన్మోహనసౌందర్యరాశి యైనపార్వతిని తనసమక్షమున గాంచి మహాదేవుడు ఆశీర్వాదపూర్వకముగ నిట్లుపల్కెను. "సుందరీ! నీకు గుణవంతుడైన, అమరుడైన, జ్ఞానశిరోమణియైన, అనన్యప్రేమపాత్రుడైన, సుందరుడైన భర్త లభింపగలడు. నీవుఅఖండసౌభాగ్యవతి వయ్యెదవుగాక. సాధ్వీ! నీకుమారుడు శ్రీమన్నారాయణసముడై మహాగుణవంతుడై విరాజిల్లుగాక. నీవు సర్వబ్రహ్మాండములందు అందరికంటె నత్యంతశ్రేష్ఠురాల వయ్యెదవుగాక. సుందరీ! నీవు భక్తిభావముతో నాకు నేడుపర్యాయములు ప్రదక్షిణ మొనరించితివిగావున నీయేడుజన్మలవఱకు నేను అత్యంతసంతుష్టుడ నై యుండెదను. నీవు నిశ్చయముగ అఖండఫలమును పొందగలవు. తీర్థములందు కాంతులందు, అభీష్టదైవమందు గురువునందు, మంత్రమందు, ఔషధమందు దేహధారునకు ఎట్టిభావనకల్గునో, వానికి అట్టిఫలమే ప్రాప్తించును."

ఇట్లాశీర్వదించి యోగీశ్వరుడైనశంకరుడు వ్యాఘ్రచర్మముపై నాసీనుడై, యోగాసన మొనరించి పరబ్రహ్మస్వరూపజ్యోతిర్మయుడ నైన (శ్రీకృష్ణ) నాధ్యానమందు సంలగ్నుడయ్యెను. ఆసమయమున పార్వతి హరుని చరణకమలములను ప్రక్షాళన మొనరించి చరణామృతమును సేవించి, అగ్నిశుద్ధవస్త్రముచే మహాదేవుని చరణములను మార్జన మొనరించెను. విశ్వకర్మద్వారా నిర్మింపబడిన రమణీయరత్నసింహాసనమును మాహేశ్వరునకు సమర్పించెను. తదనంతరము కాంస్యపాత్రములందుంచబడిన అపూర్వపదార్థముల నర్పించెను. ఇట్లు పార్వతి శంకరునకు క్రమముగ షోడశోపచారములొనరించుచు అనేకప్రణామము లాచరించుచు సేవించెను. ఇట్లు ప్రతిదినము ఆశైలరాజకుమారి శివుని యారాధించి సూర్యాస్తమయసమయమున గృహముును జేరుచుండెను.

శంకరుడు పార్వతీదేవియం దనురక్తుడైనా డనిభావించి కుమారసంభవముకొఱ కెదురుజూచు మహేంద్రుడు శివపార్వతుల సంగమము నఖిల

పించి యాకార్యమును నిర్వర్తించుటకు రతీదేవిసహితముగ మన్మథుని వినియోగించెను. పంచబాణుడు పంచబాణములను ధరించి పరివారసహితముగ శివుడు విరాజిల్లుప్రదేశమును జేరి శక్తిసహితపరమేశ్వరుని దర్శించి యత్యంత ప్రసన్నుడయ్యెను. త్రిభువనకాంతుడుపరమశాంతుడైన మహాదేవుని దర్శించి జగన్మాత యగుపార్వతి చెంతనే యున్న దనిగ్రహించి మన్మథు డమోఘము లైన, అనివార్యములైన పంచాస్త్రములను ధనువునందు సంధించి శంకరునిపై బ్రయోగించెను. ఆకాశము వలెనిర్లిప్తుడైనహరుని దాకిఅయ్యస్త్రములు విఫలములు కాగా కందర్పు డత్యంతభీతుడై గడగడవణక దొడంగెను. కామదేవుని రక్షించుటకు సకలదేవత లరుదెంచి పరమేశ్వరుని గాంచి స్తుతించుచు భయవిహ్వలులై వణకదొడంగిరి. కామబాణముచే ధ్యానము భంగముకాగా లోచనములను తెఱచినవాడై త్రిలోచనుడు సర్వమును గ్రహించి ఉగ్రుడై ప్రళయకాలసదృశ మైనతనమూడవనేత్రమును తెరచెను. ఆనేత్రోత్పన్న మైనప్రజ్వలితప్రచండాగ్నిజ్వాలలు తత్క్షణము నందే కామదేవుని భస్మీపటలమొనరించెను. ఈ భయంకరదృశ్యమును గాంచి సకలదేవతలు విషాదమగ్నులైరి. తనసౌందర్యాతిశయముచే హరుని పొందగల ననుదర్పమున మెలగినపార్వతి శిరము లజ్జతో నతమయ్యెను. శివునిసమక్షమున హృదయవిదారకముగ ప్రాణేశ్వరునికొఱకై విలపించురతిని గాంచి శివాను గ్రహము పొందలేని యాదేవత లిట్లుపల్కిరి. "మాతా! రతీదేవీ! నీభర్త భస్మమును సేకరించి నిర్భయురాలవుకమ్ము. నీవు నిశ్చయముగ శివానుగ్రహము వలన మరల ప్రియతముని సజీవునిగ పొందగలవు."

రతివిలాపమును జూచి యత్యంతదుఃఖితయై పార్వతికూడ రక్షింపు మని మహేశ్వరుని స్తుతించెను. యోగయోగీశ్వరు డైనయాచంద్రశేఖరుడు విలపించు పార్వతిని, రతినివీడి స్వస్థానమునకు వెడలిపోయెను. తదనంతరము ఆక్షణమందే పార్వతి యభిమానమంతయు నశింపగ ఆమె తనరూపయౌవన గర్వమును త్యజించి తండ్రిగృహమునకు మరలిపోక శివానుగ్రహముకొఱకు ఘోరతప మాచరించుటకు వనములను బ్రవేశించెను. స్వజను లెంతగ వారించినను సరకుగొనక పార్వతి ఘోరతప మాచరించి తుదకు త్రిలోచనుని పతిరూపమున బొంది సుఖించెను. అట్లే రతీదేవికూడ శంకరునివరప్రభావము వలన యథాసమయమున కామదేవుని మరల పొందగల్గెను. రాధా! ఇట్లు

పార్వతీదేవిదర్పమోచనచరితమును ప్రవచించితిని. పార్వతీదేవియొక్క యీపవిత్రచరిత మత్యంతనిగూఢమైనది.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున పార్వతీగర్వభంగ మను
ముప్పదితొమ్మిదవ అధ్యాయము
సంపూర్ణము.

---

# నలుబదియవ అధ్యాయము

## పార్వతీదేవి తపస్సు

శ్రీ రాధాదేవి పలికెను:

దేవా! కర్ణముల కమృతసమానమైన, మధురమైన, సుందరమైన, గూఢమైన, అత్యంతజ్ఞానప్రదమైన యీయపూర్వచరితమును మీకృపవలన శ్రవణ మొనరింపగల్గితిని దేవా! పార్వతీదేవి తపఃప్రసంగమును విస్తారముగ వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను. పార్వతి యేయేఘోరతపముల నొనరించినది, ఏయేవరములను పొంది ఎట్లుమహాదేవుని బొందగలిగినది? రతీదేవి మరల తనప్రాణేశ్వరు నెట్లుపొందగల్గినది? ప్రాణప్రియా, కృష్ణా! శివపార్వతుల వివాహమహోత్సవమునుకూడ వర్ణించి నన్ను ధన్యురాలిగ నొనరింపుము.

శ్రీ కృష్ణుడు పలికెను:

ప్రాణాధికప్రియా, రాధికా! ప్రాణేశ్వరీ! నీవు నాప్రాణముల కధిష్ఠాత్రీదేవివి. ప్రాణాధారా! మనోహారీ, శివపార్వతులచరితమును వర్ణించెద సావధానచిత్తవై సవధరింపుము. రుద్రదేవుడు వటవృక్షప్రాంతమును వీడి వెడలిపోయిన తరువాత తనతలిదండ్రులు వారించుచున్నను వినక పార్వతి

ఘోరతప మాచరించుటకు వనములకేగి గంగానదీతటముపై త్రికాలమందు స్నానమాచరించుచు నాచే ప్రదత్తమైనమంత్రమును ప్రసన్నతాపూర్వకముగ జపించుచు తపమారంభించెను. ఒకసంవత్సరమువఱకాజగదంబ నిరాహారియై భక్తిభావముతో ఘోరతపముచేయసాగెను. గ్రీష్మఋతువందు పంచాగ్ని మధ్యమున ఆసీనురాలై యహర్నిశములు తపమాచరించెను. వర్షఋతువందు శ్మశానభూమిలో వర్షజలములందు తడయుచు పార్వతీదేవి తపమాచరించెను. శీతాకాలమందు జలములలో, శరత్కాలమందు హిమపర్వతమధ్యమున నిరాహారయై యామె భక్తిపూర్వకముగ తపమాచరించెను. ఎంతకాలము కఠోరతప మాచరించినను ఫలితము శూన్యము కాగా పార్వతి నిరాశయై అగ్నికుండమును నిర్మించి అగ్నిప్రవేశముగుట కుద్యుక్తురాలయ్యెను. ఇది చూచి కృపాసిన్ధువైన శివుడు దివ్యబ్రాహ్మణబాలకరూపమున నామె యెదుట సాక్షాత్కరించెను. యఖండతేజసంపన్నుడైన బ్రాహ్మణవటువును గాంచిన పార్వతి హృదయమందు ప్రేమ పెల్లువలై ప్రవహింపగా ఆమె యగ్నిప్రవేశకార్యము నాపి ఆసుందరబాలకుని వీక్షించుచు నీవెవర వని ప్రశ్నించెను. శైలరాజకుమారి ప్రశ్న నాలకించి బ్రాహ్మణవటురూపధారియైన, పరమేశ్వరుడైన శివుడు మందహాసము లొనరించుచు మధురాతిమధురవచనములతో నిట్లుపల్కెను. "దేవీ! నేను ఇచ్ఛానుసారముగ పరిభ్రమించు బ్రహ్మచారినైన బ్రాహ్మణ బాలకుడను. కానీ సుందరీ! అఖండతేజముతో ప్రజ్వరిల్లుచు ఈనిర్జనవన ప్రాంతమున ఘోరతప మాచరించు నీవెవ్వరు? నీ వెవ్వరికుమార్తెవు? నీనామ ధేయమేమి? తపములకే ఫలప్రదాయని వైననీవు తప మేలయాచరించు చుంటివి? కమలలోచనీ! నీవు మూర్తిభవించిన తపోరాశివి. ఈతపము కేవలము నీవులోకశిక్షణార్థమే యొనరించుచున్నా వనిభావించెదను. దేవీ! నీవు మూలప్రకృతివగునీశ్వరివా, లక్ష్మివా, సావిత్రివా, లేక సరస్వతివా? కళ్యాణీ! నీవెవ్వరైనను నాకు ప్రసన్నురాలవుకమ్ము. ఎందువలననగ నీ ప్రసన్నతవలన స్వయముగ పరమేశ్వరుడే ప్రసన్నుడు కాగలడు.

> సతి త్వయి ప్రసన్నాయాం ప్రసన్నః పరమేశ్వరః ।
> పతివ్రతాయాం తుష్టాయాం తుష్టో నారాయణః స్వయమ్ ॥
>
> తుష్టే నారాయణే దేవే శశ్వత్తుష్టం జగత్త్రయమ్ ।
> తరుమూలేషు సిక్తేషు శాఖాః సిక్తా యథా ప్రియే ॥ 33-34

నీవు ప్రసన్నురాలవైన పరమేశ్వరుడు ప్రసన్నుడు కాగలడు. పతివ్రతయగు స్త్రీసంతుష్టురాలైన స్వయముగ శ్రీమన్నారాయణుడే సంతుష్టుడగును. వృక్షమూలమును జలములను బోసి పోషించిన ఆవృక్షశాఖలన్నీ పోషింపబడు నట్లు కేవలము శ్రీమన్నారాయణుడు సంతుష్టుడైన త్రిలోకములు సంతుష్టములు కాగలవు."

బాలకుడు బల్కినమధురవచనముల నాలకించి పార్వతి మందస్మితముఖారవిందయై కర్ణములకు అమృతములై సోకు మధురవచనములతో నిట్లు పల్కెను. "బ్రాహ్మణబాలకా! నీవు భావించినటుల నేను సావిత్రినిగాని, లక్ష్మినిగాని, వాణినిగానికాను. నేను గిరిరాజైనహిమవంతుని కుమార్తెను. ప్రప్రథమమున నేను దక్షప్రజాపతిగృహమున సతినై అవతరించి శంకరుని పరిణయమాడి త్రిలోకవందితురాలనైతిని. నాతండ్రియైనదక్షప్రజాపతి నాప్రాణేశ్వరుని నిందింపగ భరింపలేక దేహత్యాగ మొనరించి ఈజన్మయందు పార్వతినై పవిత్రభారతవర్షమున ఆవిర్భవించి నాసౌభాగ్యవశమున మరల పరమేశ్వరుని దర్శింపగల్గితిని. కాని పరమేశ్వరుడు నన్ను కరుణింపక నాకు సహాయమొనరించుట కేతెంచినమన్మథుని భస్మ మొనరించి నన్ను వీడి వెడలిపోయెను. మరల శివునే ప్రాణేశ్వరునిగ పొందవలె నని నేను కృతనిశ్చయురాలనై ఘోరతప మాచరించితిని. అయినను నాప్రాణవల్లభుని యనుగ్రహమును బొందలేక నిరాశనై అగ్నిప్రవేశ మొనరించుట కుద్యుక్తురాలనైతిని. కాని నిన్ను గాంచి ఆగిపోయితిని. బ్రాహ్మణదేవా! నీవు తక్షణమే ఈ ప్రదేశమును వీడి వెడలిపొమ్ము. నీప్రళయాగ్నిశిఖాసదృశమైన అగ్నిలో ప్రవేశించి శరీరత్యాగ మొనరించి జన్మజన్మలలోను శివునే పతిగ పొందెదను. సర్వస్త్రీలు ప్రియతము డైనపతినిబొందుటకొఱకే జన్మను గ్రహింతురు, ఇది శ్రుతివచనము నేను ఈజన్మమందు ఘోరతపమాచరించినను నాభర్తను పొందలేకపోయితిని. ఈ కోర్కెతోనే అగ్నికుండమందు శరీరమును త్యజించి నిశ్చయముగ పరలోకమందు పరమేశ్వరుని పొందెదను."

ఇట్లు బ్రాహ్మణబాలకునకు ప్రత్యుత్తర మొసంగి ఆతడెంతగ నివారించినను ఆగక దృఢనిశ్చయురాలై పార్వతి ప్రజ్వలితాగ్నిగుండమున ప్రవేశ మొనరించెను. పరమేశ్వరీ! రాధా! పార్వతి అగ్నిప్రవేశమొనరింపగనే ఆమె యఖండతపఃప్రభావమున హుతాశనుడు చందనమువలె శీతలుడయ్యెను.

బృందావనవినోదినీ! ఒకక్షణకాలము అగ్నికుండమందే యుండి ఫలితముగానక పార్వతి బయటకువచ్చెను. ఆమె నుద్దేశించి బ్రాహ్మణబాలకరూపధారి యైన శివు డిట్లుపల్కెను. "కళ్యాణీ! నీయఖండతపము సఫలమా? లేక అసఫలమా? నేను తెలిసికొనలేకున్నాను. ఏఅఖండతపఃప్రభావమున అగ్నియే నీశరీరమును దహింపలేదో, ఆతపఃప్రభావమున నీమనోవాంఛితము పరిపూర్ణము కాలేదనిన ఎంతఆశ్చర్యకరవిషయము. దేవీ! నీవు కళ్యాణస్వరూపు డైనశివుని పతిరూపమున పొందవలె ననియభిలషించుచున్నావు. కానీ ఆయన నిరాకారుడే! నిరాకారుని భర్తగా పొందిన నీమనోరథము లెట్లుసిద్ధింపగలవు? శుచిస్మితా! సంహారకర్తనే భర్తగ పొందవలెనని ఆకాంక్షించుట సరికాదు; ఎందువలె ననగ ఏస్త్రీయైనను సర్వసంహారకారుని కాంతునిగ వరించునా? దేవీ! శివుని భర్తగపొంది మోక్షము పొందవలె ననినీవు భావించినయెడల నీతపమంతయు వ్యర్థమై నట్లే; ఎందువలెననగ నివే సర్వులకు ముక్తిప్రదాయనివి. "శివ" మనగ అర్థము మంగళము (కళ్యాణము) మోక్షము,సంహారము. ఈఅర్థముగాక మఱియొక అర్థముశ్రుతులందు శివనామమునకు ప్రవచింపబడలేదు. సుందరీ! నీవు సంహారకర్తయైన శివునే అభిలషించిన సర్వలోకభయంకరు డైనరుద్రుడు మాత్రమే నీయందు అనురక్తుడుకాగలడు. నీకు మోక్షముకలుగదు సరిగదా అభీష్టదైవోపలబ్ధికూడ సంభవింపదు. సంపూర్ణమంగళప్రదాత యైనశ్రీహరి స్మరణము అమోఘము, కావున శ్రీహరిని స్మరించుచు నీవుగృహమునకు మఱలిపొమ్ము. నాయాశీర్వాదప్రభావమువలన, నీ వొనరించిన తపఃఫల స్వరూపమున నీవు నిశ్చయముగ పరమదుర్లభుడైనహరుని హృదయేశ్వరునిగ పొందగలవు".

ఇట్లు పార్వతి నాశీర్వదించి ఆబ్రాహ్మణరూపధారి యైనశంకరు డంతర్ధానమయ్యెను. మహాదేవ, మహాదేవ యనిదివ్యనామముల నుచ్చరించుచు పార్వతి తనతపమును విరమించి స్వగృహమునకు వెడలిపోయెను. చిరకాలము ఘోరతప మాచరించి స్వగృహమునకు మఱలివచ్చిన తమపుత్రికకు మేనకా హిమవంతు లత్యంతప్రేమతో అఖండస్వాగతము పలికిరి. పార్వతి యరుదెంచి నందువలన మేనకాహిమవంతు లత్యంతహర్ష హృదయాంతరంగులైరి. ఒక దినమున హిమవంతుడు తప మొనరించుటకు గృహమును వీడి గంగాతటమునకు వెడలిపోయెను. ఆసమయముననే ఒకవిచిత్రభిక్షుకుడు హిమవంతుని అంతఃపురప్రాంగణమున ప్రవేశించెను. ఆతడు ఎడమహస్తమందు శృంగవాద్య

మును ధరించి దక్షిణహస్తమందు డమరుకమును ధరించి వృద్ధుడైయుండెను. శరీరమందు విభూతిని యలంకరించుకొన్న ఆ భిక్షుకుడు సుమధురకంఠధ్వనితో నా(శ్రీకృష్ణ)యశోగుణములను గానమొనరించుచు, అనేకభంగిమల నృత్యము చేయుచు, శృంగవాద్యమును, డమరుకమును ప్రయోగింపదొడంగెను. ఆ మధుర సంగీతప్రవంతిలో నోలలాడుటకు సకలపురవాసులు ఆబాలస్త్రీవృద్ధులు మేనక యంతఃపురమున జేరిరి. సర్వజను లాతడొనరించు మధురసంగీతమునకు ముగ్ధులై మూర్ఛనొందిరి. భిక్షుకుని దర్శించి యతడు గానమొనరించుసంగీత మాలకించిన దుర్గకూడ మూర్ఛకువశమయ్యెను. నిద్రామగ్నయైయున్నయామె తన హృదయ కమలమందు శంకరుని దర్శించెను. త్రిభువనమోహనాకారుడై సదాశివుడు మనోవాంఛితము కోరుకొను మనియాదేశింపగ, ఆమె మనసునందే భవునకనేక ప్రణామములు లర్పించి, నీవే నాప్రాణనాథుడవుగ నుండునట్లు వరము నర్థించెను. 'ఏవమస్తు' అనిహరుడు పార్వతి ననుగ్రహించి అంతర్హితుడయ్యెను. హృదయాంతరంగమున శివు డంతర్ధానముకాగా పార్వతి నిద్రావస్థనువీడి కన్నులను దెరచి యెదుట నృత్యగానము లొనరించుచున్న భిక్షుకుని గాంచెను.

భిక్షుకు డొనరించిననృత్యగానముల కత్యంతసంతుష్టురాలై మేనక అనేక రత్నములను ప్రసాదింపబోగా వానిని స్వీకరింపక ఆదిభిక్షువు దుర్గనే ప్రతి ఫలముగ నర్థించెను. భిక్షుకు డర్థించిన యీవిపరీతమైనకోర్కె నాలకించిన మేనక ఆశ్చర్యచకితురాలై అత్యంతకోపమును వహించి భిక్షుకుని ధూర్తత్వము ననేకవిధముల నిందించెను. ఆ సమయముననే తపమున కేగినహిమవంతుడు రాజధానికి మరలివచ్చి జరిగినదంతయు గ్రహించి, కోపించినవాడై ఆభిక్షుకుని రాజ్యమునుండి బహిష్కరింపవలసినదిగా తనసేవకుల నాజ్ఞాపించెను. కాని యతడు సాధారణభిక్షుకుడు కాడు. ఆకాశము నెవ్వరు స్పృశింపలేనట్లే ఆభిక్షుని స్పృశించుట అసంభవము. బ్రహ్మతేజముతో ప్రజ్వరిల్లుచున్న వానిని యెవరును బంధింపలేకపోయిరి. ఆశ్చర్యచకితులై హిమవంతుడు ఆ భిక్షుకుని యత్యంతశ్రద్ధతో వీక్షించెను. ఆభిక్షుకునకు నాల్గుభుజములు కలవు, శిరముపై రత్నమయకిరీటము, కర్ణములందు మకరకుండలములు, శరీరముపై పీతాంబర పరిధానము శోభనుచేకూర్చుచున్నవి. మందస్మితముఖారవిందుడైన ఆయన సర్వాంగములు చందనచర్చితములు. ఆశ్రీహరి (రూపధారియైన శివుడు) భక్తానుగ్రహకాతరుడు.

హిమవంతుడు శ్రీహర్యుపాసకుడు, తనపూజాకాలమందు గంగాధరున కేయేపుష్పముల నర్పించెనో ఆ పుష్పముల నన్నింటిని ఆభిక్షుకుని అంగములపై మస్తకముపై దర్శించెను. తా నర్పించిన ధూపదీపనైవేద్యములనన్నింటిని హిమవంతుడు భిక్షుకునియెదుట ప్రస్తుతములై యుండుట గాంచి అచ్చెరు వందెను. ఆక్షణమునందే ఆవిచిత్రభిక్షుకుడు ద్విభుజధారివలె హిమవంతునకు దర్శనమొసంగెను. అతనిహస్తములందు వినోదసాధన మైనవేణువుకలదు. గోపవేషధారియై, కిశోరవయస్కుడై శ్యామసుందరవర్ణుడై మందహాసములు ముఖముపై చిందులాడగ, నెమలిపిచ్ఛమకుటమును ధరించి శ్రీఅంగములందు వివిధరత్నమయాభూషణములను ధరించి, చందనచర్చితుడై, వనమాలాధారియై ఆభిక్షుకుడు హిమవంతునకు శ్రీకృష్ణరూపమున దర్శన మొసంగెను. మరుక్షణ మందే ఆత డుజ్జ్వలకాంతియుక్తుడైన, చంద్రశేఖరుడైన శివునిరూపమున దర్శనమొసంగెను. హస్తములందు త్రిశూలపట్టిశములు శోభింపగ, వస్త్రములకు బదులు వ్యాఘ్రచర్మము నలంకరించుకొని, సర్వాంగములందు విభూతిని ధరించి, ధవళవర్ణుడై గళమునందు అస్థిమాలను ధరించి భుజస్కంధములపై నాగయజ్ఞోపవీతమును ధరించి, శిరముపై సువర్ణకాంతిసదృశజటలు, మఱిరెండుహస్తములందు శృంగడమరుకములు శోభింపగ మనోహరరూపమున సదాశివుడై హిమవంతునకు దర్శనమొసంగెను. శివుడు శ్వేతబీజమాలచే హరినామమును జపించుచు, ప్రసన్నముఖారవిందముపై మందహాసములు చిందులాడగ భక్తానుగ్రహకాతరుడు, అఖండతేజసంపన్నుడు, పంచముఖుడునై ప్రత్యేకముఖమునందు మూడు, మూడు నేత్రములను ధరించి హరుడు భాసించెను, జగన్నాథునితత్త్వ మెఱుంగక అచ్చెరువందు ఆశైలరాజునకు ఆక్షణమునందే యాదిభిక్షువు జగత్స్రష్టబ్రహ్మరూపమున దర్శనమొసంగెను.

మఱల సూర్యునివలె, తదుపరి అగ్నివలె, తదనంతరము చంద్రునివలె నానారూపములుగ భిక్షుకుడు హిమవంతునకు దృష్టిగోచరుడయ్యెను. ఇట్లు స్వేచ్ఛామయుడైన నానారూపధారి యగుపరమేశ్వరుని భిక్షుకరూపమున దర్శించిన శైలరాజేంద్రునినేత్రములు ఆనందాశ్రుభరితములు కాగా ఆయన దేహమంతయు పులకించెను, హిమవంతుడు అనన్యభక్తిసమన్వితుడై అనుగ్రహించుటకు దర్శన మొసంగినయాదిభిక్షువునకు అనేకసాష్టాంగదండప్రణామము లర్పించి ప్రదక్షిణ మొనరించెను, ఆక్షణమునందే అమాయామానుషవేషధారి

యంతర్హితుడు కాగా ఆహా! విశ్వనాథుడు దినమందు స్వప్నమువలె దర్శన
మొసంగి మమ్ములను మాయజేసి అంతర్హితుడయ్యెనుకదా, యనిహిమవంతుడు
చింతించెను.

ఆదినమునుండి మేనకాహిమవంతులకు శివునియందు భక్తి దృఢ
మయ్యెను. వీరిభక్తిభావమును గాంచిన దేవతలు ఇట్లుతలపోయదొడంగిరి.
"హిమవంతుడే తనయునన్యభక్తిచే భారతవర్షమందు శివునకు కన్యాదానము
చేసిన నిశ్చయముగ మోక్షము నొందగలడు. అనంతరత్నముల కాధారమైన
హిమాలయము శివునియనుగ్రహమువలన పృథ్వినివీడి వెడలిన పృథ్వికిగల రత్న
గర్భయనునామ మవశ్యముగ మిథ్యకాగలదు. శూలపాణికి కన్యాదానముచేసి
నిశ్చయముగ హిమవంతుడు స్థావరత్వమును బరిత్యజించి దివ్యరూపధారియై
విష్ణులోకమునకు వెడలగలడు. ఇట్లాలోచించి దేవతలందఱు తమలోతాము
సంప్రదించుకొని దేవగురుడైన బృహస్పతిని హిమవంతునికడకు పంపవలెనని
నిర్ణయించుకొని గురుదేవునిసమీపించి, ప్రణమిల్లి యిట్లునివేదించిరి.
"గురుదేవా! మీరు హిమవంతునిసభ కేగి ఆయన సమక్షమున శివనింద
యొనరింపుడు. మీవలన శివనిందనాలకించి మోహావశుడై హిమవంతుడు
అనిచ్ఛతో తనకుమార్తెను శివునకొసంగగలడు. అట్లు కన్యాదానమొన
రించిన కన్యాదాతకు ఫలము సిద్ధింపదు. కాలాంతమందు గిరిరాజు ముక్త
డైనను ఈనమయమున స్థావరరూపమున పృథ్విపై నివసింపవలెను. గురుదేవా!
అనంతరత్నముల కాధారభూతుడైనహిమవంతుని పృథ్వియందే యుంచుటకు
గట్టిగ ప్రయత్నమొనరింపుడు".

దేవతలం పల్కినయిట్టిస్వార్థవచనముల నాలకింపలేక నారాయణ,
నారాయణ యనుచు కర్ణములను మూసికొని బృహస్పతి వారికోర్కెను
తిరస్కరించెను. వేదవేదాంగవిదుడైనబృహస్పతి హరిహరులకు అనన్య
భక్తుడు. అతడు దేవతల నుద్దేశించి శ్రుతివిహితములైనవాక్యములతో నిట్లు
పల్కెను. "స్వార్థసాధన తత్పరులారా! దేవతలారా! వేద ప్రతిపాదితమైన
నీతియుక్తమైన నాసత్యవాక్కుల నాలకింపుడు.

హరకేశవయోర్భక్తం యే చ నిన్దతి పాపినః ।
భూదేవాన్ బ్రాహ్మణాంశ్చైవ స్వగురుం చ పతివ్రతా ॥

పతి భిక్షుబ్రహ్మచారీ సృష్టిబీజాన్ సురాం స్తథా।
పచ్యతే కాలసూత్రే తే యావచ్చన్ద్రదివాకరౌ ॥ 133–134

శివకేశవులభక్తులను, భూమిపై దైవస్వరూపులైన సద్బ్రాహ్మణులను, గురువును, పతివ్రతను, పతిని, భిక్షుకుని, బ్రహ్మచారిని, సృష్టికిబీజభూతులైన దేవతలను నిందించువారు సూర్యచంద్రు లున్నంతవఱకు కాలసూత్ర మను నరక మనుభవింపగలరు.

యే నిన్దన్తి చ బ్రహ్మాణం స్రష్టారం జగతాం గురుమ్।
శివం సారాణాం ప్రవరం దుర్గాం లక్ష్మీం సరస్వతీమ్ ॥
గీతాం చ తులసీం గఙ్గాం వేదాంశ్చ వేదమాతరమ్।
వ్రతం తపస్యాం పూజాం చ మన్త్రం మన్త్రప్రదం గురుమ్ ॥
తే పచ్యన్తేఽన్ధకూపే వై చాయుషోఽర్ధం విధిరహో,
భక్షితాః సర్పసంఘైశ్చ శబ్దం కుర్వన్తి సన్తతమ్॥ 136–138

సృష్టికర్తయు, జగద్గురువు నగుబ్రహ్మను నిందించువారు సురశ్రేష్ఠుడైన శివుని, దుర్గను, లక్ష్మిని, సరస్వతిని, భగవద్గీతను, తులసిని, గంగను, వేదములను, వేదజననియగుసావిత్రిని, వ్రతములను, తపములను, పూజలను, మంత్రములను, మంత్రదాత యైనగురుదేవుని దూషించువారు బ్రహ్మయొక్క ఆయుర్దాయములో సగముకాలము అంధకూప మనుభయంకరనరకమునబడి సర్పములచే బక్షింపబడుచు, ఆర్తనాదము లొనరించుచు దుస్సహనరకయాతనము ననుభవింతురు.

యే నిన్దన్తి హృషీకేశం దేవసామ్యం విధాయ చ।
విష్ణుభక్తిప్రదంచైవ పురాణం చ శ్రుతేః పరమ్ ॥
రాధాతదఙ్గజాం గోపీర్బ్రాహ్మణాంశ్చ సదార్చితాన్।
తేపచ్యన్తే వహే దేవా విధాతురాయుషా సమమ్ ॥
అధోముఖా ఊర్ధ్వజంఘాః సర్పసఙ్ఘైశ్చ వేష్టితాః।
భక్షితా వికృతాకారైః కీటైః సర్పసమాకృతైః ॥
అతీవకాతరభీతాః శబ్దం కుర్వన్తి సన్తతమ్।
శ్లేష్మమూత్రపురీషాణి ధ్రువం భక్షన్తి క్షోభితాః ॥
ఉల్కాం దదతి రుష్టాశ్చ సమ్ముఖే యమకిఙ్కరాః।
త్రిసన్ధ్యతర్జనం కృత్వా కుర్వన్తి దణ్డతాడనమ్ ॥

కుర్వన్తి మూత్రపానం చ ప్రహారైస్తృషితాన్ భియా।
తదా కల్పాన్తరే స్రష్టుం సృష్టిం చ ప్రథమేపునః॥ 139—144

ఇతర దేవతలతో పోల్చి హృషీకేశుని నిందించువారు, శ్రుతులకంటె శ్రేష్ఠములైన విష్ణుభక్తి ప్రదాయకములైన పురాణములలో దోషములను వెదకువారు, రాధను, ఆమెకాయవ్యూహరూపులైన గోపికలను, పూజింపదగు సద్బ్రాహ్మణభక్తులను నిందించువారు, దేవతలైనను బ్రహ్మాయుఃపర్యంతము నరకకూపమందు యమయాతనల ననుభవింతురు. యమలోకములో వారు అధోముఖులై వ్రేలాడుచు వికృతాకారసర్పసమూహములచే సర్పమువంటి ఆకృతిగలకీటకములచేత పరివేష్టితులై వానిచే భక్షితులగుదురు. ఆబాధకు తాళలేక పాపులు భీతులై ఆర్తనాదము లొనరించెదరు. నిశ్చయముగ పాపులు క్షోభనొందుచు కఫమును, మలమూత్రములను భుజింపవలసివచ్చును. రోషయుక్తులైన యమకింకరులు పాపులముఖమందు జ్వలించుచున్న ఉల్కల నుంచెదరు. త్రిసంధ్యలయందు వారు దూషించుచు పాపులను దండములతో తాడింపగలరు. దండప్రహారములవలన దప్పికగొన్న పాపులు యమదూతల భయమువలన మూత్రపాన మొనరింతురు. మరల రెండవకల్పారంభమునగాని ఆపాపులపాపములు నివారణములు కాగల వని బ్రహ్మకథనము. నిశ్చయముగ శివనింద యొనరించిన దేవతలైనను నరకమును పొందగలరు.

వత్సలారా! బ్రహ్మాజ్ఞానుసారముగ దక్షప్రజాపతి శూలపాణియగు శంకరునకు తనకన్య నర్పించును. ఆ యమోఘపుణ్యమువలన శివనింద యొనరించినను దక్షునకు పాపము సంభవింపదు, పరమైశ్వర్యములు లభించును. అతడనిచ్ఛతో బ్రహ్మాజ్ఞవలన శంకరునకు కన్యాదానము చేయును కావున దక్షునకు కన్యాదానఫలమందు నాల్గవభాగమే ప్రాప్తించును. దక్షుడు సారూప్యమోక్షప్రాప్తిచే వంచితుడై ఈ తుచ్ఛసృష్టికి అధిపతిమాత్రమే కాగలడు. ఈదైవనిందచేయుట నాకు అసంభవము, కావున మీరే హిమవంతుని గృహమున కేగి వానికి దుర్బోధయొనరించి శివవిముఖునిగ జేయుడు. అనిచ్ఛచే కన్యాదాన మొనరించిన మీరు భావించినట్లు నిశ్చయముగ హిమవంతుడు స్థావరరూపమున భూమిపైనే యుండగలడు. మీదుర్బోధలవలన శివవిముఖుడైనహిమవంతుని అరుంధతీ సప్తఋషులు సమాధానపరచి శివునకు కన్యాదాన మొనరించుటకు ఒప్పింపగలరు. దుర్గ శివునిదక్క అన్యుల నెవ్వరిని

వరింపడు, కావున హిమవంతుడు నిశ్చయముగ అనిచ్ఛాపూర్వకముగ శివునకు కన్యాదాన మొనరింపగలడు."

ఇట్లుపల్కి బృహస్పతి తప మాచరించుటకు ఆకాశగంగాతటమునకు ప్రస్థాన మొనరించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున పార్వతీదేవీతపస్సను
నలుబదియవ అధ్యాయము
సంపూర్ణము.

— o —

# నలుబది యొకటవ అధ్యాయము

## దేవబ్రహ్మసంవాదము

శ్రీకృష్ణుడు పలికెను :

దేవతలకాచార్యు డగుబృహస్పతి తపమునకు వెడలిపోయినపిమ్మట దేవతలు తమలో దాముసంప్రదించుకొని, లోకనాథు డగునబ్రహ్మవద్దకు జని తమ యభిప్రాయముల నిట్లు నివేదించిరి. "జగమును సృష్టియొనరించు పితామహా! నీసృష్టియందున్న హిమాలయము సమస్తరత్నములకు ఆధారము. ఆహిమాలయము మోక్షమునుపొందినచో పృథ్వీ రత్నగర్భ యనియెట్లు కీర్తింప బడగలదు! శూలపాణి యగుశంకరునకు భక్తిపూర్వకముగ తనపుత్రికను సమర్పించిన శైలరాజేంద్రుడు నిశ్చయముగ నారాయణసారూప్యము పొందగలడు. కావున మీరే స్వయముగ హిమవంతునియెదుట శివనింద యొనరించి ఆశైల రాజుమనమున పరమేశ్వరునిపట్ల అశ్రద్ధ నుత్పన్నముచేయుడు. దేవా! నీవు దక్క అన్యు లెవ్వరు ఈకార్య మొనరింపలేరు".

దేవతల ప్రార్థనల నాలకించి స్వయముగ బ్రహ్మ కర్ణముల కమృతోపమయములైన, మధురములైన, నీతిసారభూతములైన వచనముల నిట్లు పల్కెను. "వత్సలారా! నేను శివనింద చేయజాలను. ఆకార్యము అత్యంత దుష్కరము. శివనింద సకలసంపద్వినాశకము విపత్తులకు బీజము. కావున మీరు భూతనాధుడైన శివునే ప్రార్థించి శివనిందాకార్యమునకాయననే వినియోగింపుడు. శంకరుడే తన్నుతాను నిందించుకొనగలడు.

పరనిన్దా వినాశాయ స్వనిన్దా యశసే పరమ్ ॥ 7

"పరులను నిందించుట వినాశమునకు, తన్నుతాను నిందించుకొనుట యశమునకు కారణములు కాగలవు".

ప్రియా! బ్రహ్మోపదేశానుసారముగ దేవతలు శీఘ్రముగ కైలాసము జేరి శివుని స్తుతించి, ఆ భక్తవత్సలునకు తమ యభిప్రాయములను నివేదించిరి.

వారి ప్రార్థనల నాలకించి స్వనిందకు అంగీకరించిన శంకరుడు హిమవంతుని కడకేగెను. దేవతలు తమతమ ధామముల కరిగి ఆనంద మనుభవింప దొడంగిరి.

ఇష్టసిద్ధిర్ముదే శశ్వదసిద్ధిర్దుఃఖ వర్ధినీ ॥ 10

ఇష్టసిద్ధి ఆనందమును కలిగించును. అభీష్టవస్తువుయొక్క అసిద్ధి దుఃఖమును వృద్ధి చేయును.

భూలోకమున శైలరాజేంద్రుడు బంధువర్గసహితముగ సభదీర్చెను. ఆయనతోపాటు గిరిజకూడ ఆసీనురాలై యుండెను. ఆసమయమున శంకరుడు బ్రాహ్మణరూపధారియై సభను ప్రవేశించెను. ఆయనముఖము, నేత్రములు ప్రసన్నములై యున్నవి. ఆ బ్రాహ్మణుడు హస్తములందు దండమును, ఛత్రమును ధరించియుండెను. ఒకహస్తమున స్ఫటికమణిమాలను ధరించి గళమునందు సాలగ్రామశిలను ధరించియున్నాడు. బ్రహ్మతేజస్సుతో ప్రకాశించు ఆ బ్రాహ్మణదేవతను దర్శించి హిమవంతుడు బంధుసేవకసహితముగ లేచి నిలుచుండి ప్రణామము లర్పించి, స్వాగతము పల్కెను. పార్వతీదేవికూడ ఆవిప్రరూపధారియైనతన ప్రాణేశ్వరునకు భక్తిభావముతో శిరమును వంచి నమస్కరించెను. ఆ బ్రాహ్మణుడు ప్రసన్నుడై సర్వుల నాశీర్వదించి గిరిరాజ

అర్పించినరత్నసింహాసనము నలంకరించి మధుపర్కాదులను స్వీకరించి సుఖాసీనుడై యుండగ తమపరిచయసౌభాగ్యమును బ్రసాదింపు డనిహిమవంతు డాద్విజోత్తముని ప్రార్థింపగ బ్రాహ్మణరూపధారి యైనహరు డిట్లుపల్కెను. "గిరిరాజా! నేను ఘటకవృత్తి (వివాహసంబంధములను కూర్చువృత్తి) నాశ్రయించి మనోవేగముతో భూమండలమంతయు భ్రమింతును. గురుదేవుని వరప్రభావముచేత నేను సర్వత్రా చరింపగలసమర్థుడను, సర్వజ్ఞుడను. లక్ష్మీసమానురాలైనపుత్రికను నిరాశ్రయుడు, కులహీనుడు నగుశంకరునకు ఇవ్వంబోవుచున్నావని తెలిసికొని ఇటువచ్చితిని. శంకరుడసంగుడు, ఏకాంతవాసి, ఆయనకు రూపములేదు, గుణములు లేవు, శ్మశానమందు తిరుగుచుండును, సర్వభూతముల కధిపతి, యోగి. దిగంబరుడు, సర్పాభరణభూషణుడు, విభూతిధారి. ఆయన సర్పములను గ్రహించువాడు. ఆయన కాలమును కూడ నాశ మొనరించువాడు. అజ్ఞాతమృత్యువు (నిందాపక్షమున అజ్ఞాతమృత్యువనగ జాతకాదులు లేనందువలన ఆయనఆయుర్దాయము తెలిసికొనుట అసంభవము, దీర్ఘాయువుగలవానికే కన్యాదాత కన్యనొసంగును. స్తుతిపక్షమందదర్థ మేమనగ మృత్యువునే అనుభవింపనివాడు అనగా అమరుడు, మృత్యుంజయుడు.) జ్ఞాని లేడా అజ్ఞుడు, అనాథుడు (నిందాపక్షమందు అనాథుడనగ అసహాయుడని అర్థము, స్తుతిపక్షమందు నాథరహితుడనగ సర్వులకు నాథుడని అర్థము). అబంధుడు (అద్వితీయుడు) ఆయన నీకెట్లుజామాత కాగలడు. హిమరాజా! శంకరుడు భవుడు (సంసారోత్పత్తికి కారణము) అభవుడు (జన్మరహితుడు) స్వర్ణకాంతియుక్తజటాధారి, విరక్తుడు, నిర్ధనుడు, అత్యంతవృద్ధుడు, వికారశూన్యుడు, సర్వులకు ఆశ్రయుడు లేదా సర్వులు ఆయనకాశ్రయులు, వ్యర్థముగ తిరుగువాడు, సర్పములనే హారములుగ ధరించును. భిక్షాటన మొనరించును. నారాయణుడు జ్ఞానులందు శ్రేష్ఠుడు, కులీనుడు, కావున నీవు కన్యాదాన మొనరించుటకు ఆయనయే యోగ్యుడు. రాజా! నీవు లక్షలాదిపర్వతములకు రాజాధిరాజువు బంధువులే లేనివాడు శివుడు. కావున నీవు నీధర్మపత్నితో, తదితరబంధువులతో సంప్రదించిన అనంతరమే వరనిర్ణయ మొనరింపుము. ఈ విషయములో పార్వతినిమాత్రము సంప్రదింపకుము. ఎందువలననగ ఆమె శంకరునియెడల అనురాగమును వ్యాధికల్గియున్నది.

రోగిణే నౌషథం శశ్వత్కుపథ్యం రోచతే సదా ॥ 27

రోగికి ఔషధము రుచింపదు. అతనికిసర్వదా అపథ్యమే రుచికరముగ నుండును.

బృందావనవినోదినీ! రాధా! ఇట్లుస్వనింద యొనరించి ఆ బ్రాహ్మణ రూపధారి యైనశివుడు సభామధ్యమున మిన్నకుండెను, హిమవంతునిద్వారా అనేకసత్కారములం బొంది ఆ బ్రాహ్మణోత్తముడు తిరిగి వెడలిపోయెను. బ్రాహ్మణుడుపల్కినశివనిందను విని దుఃఖితయై పట్టమహిషి మేనక హిమవంతునితో "శైలరాజా! మీరు వరనిర్ణయమందు అన్యశైలరాజులతో సంప్రదింపుడు. గృహమే లేనియాశివునకు నాకన్య నొసంగలేను." అనిపల్కి పార్వతిని తోడ్కొని యంతఃపురమునకు వెడలిపోయెను ఆ సమయమునకే వశిష్ఠాదిసప్తఋషులు లరుంధతితోగూడి హిమవంతుని సభను బ్రవేశించిరి. హిమవంతు డొసంగిన సత్కారములను గ్రహించి మహర్షులు ప్రసన్నులై సుఖాసీనులుకాగా అరుంధతి యంతఃపురమున కేగి దుఃఖింపవల దనిమేనా దేవిని వారించెను. తనసముఖమున లక్ష్మీసమానరూపిణి యైనయరుంధతిని గాంచి ఆమె చరణకమలముల కనేక ప్రణామము లర్పించి ఆమె కాతిథ్య మొసంగెను. అరుంధతి శివమహాత్మ్యము నుపదేశించి యామెను సమాధాన పరచెను. సభామధ్యమున సప్తఋషులు హిమవంతునుద్దేశించి యిట్లుపల్కిరి. "శైలరాజా! మావచనముల నాలకింపుము, ఈయుపదేశములు నీకత్యంత శుభకరములు పార్వతిని శివునకర్పించి లోకసంహారకుడైన యామహాదేవునకు శ్వశురుడవు కమ్ము. రాజా! దేవదేవేశ్వరుడైనశివుడు నిన్ను కన్య నర్థింపడు. నీవే ఆయునను బ్రార్థించి వివాహమున కొప్పింపుము. వివాహమందే విరక్తి నొందినవాడు కేవలము బ్రహ్మప్రార్థనలవలననే నీపుత్రికను పాణిగ్రహణ మొనరింపగలడు." నీపుత్రిక యొక్కతపస్సు పూర్తియైనపిమ్మట శంకరుడు ఆమెను పరిణయమాడగలనని ప్రతిజ్ఞయొనరించెను. ఈరెండుకారణముల వలననే యోగిరాజైనశివుడు నీకన్యను వివాహమాడగలడు".

మహర్షులు పల్కినయావచనములను విని హిమవంతు డిట్లుప్రత్యుత్తర మొసంగెను. "మహర్షులారా! శివునకు రాజోచితసామగ్రియైనను లేదు. ఐశ్వర్యాదులు లేవుసరిగదా బంధువులైనను లేరు. అత్యంతనిర్లిప్తుడైన యోగికి కన్యాదానముచేయుట ఉచితముకాదు.

నానురూపాయ పాత్రాయ పితా కన్యాం దదాతి చేత్।
కామాల్లోభాద్భయాన్మోహాచ్ఛతాబ్దినరకం వ్రజేత్ ॥ 60

తండ్రి కోరికలకు, లోభమునకు, భయమునకు, మోహమునకు వశుడై పాత్రుడైనవానికి కన్యాదాన మొనరింపనియెడల అతడు నూరుసంవత్సరముల కాలము నరక మనుభవింపగలడు".

కావున నామనఃపూర్వకముగ నేను శూలపాణికి నాకన్య నొసంగలేను. బ్రహ్మపుత్రులైన మీరు సర్వజ్ఞులు ఈవిషయమునం దేదియుచితమో మీరే నిర్ణయింపుడు."

హిమవంతుని శివతిరస్కారవచనముల నాలకించి వేదవేదాంగ విద్వాంసుడు, బ్రహ్మపుత్రుడైన వశిష్ఠుడు వేదోక్తమతమును బ్రకటించుట కుద్యుక్తుడై హిమవంతునితో నిట్లుపల్కెను.

వశిష్ఠమహర్షి పలికెను:

శైలేంద్రా! లోకమందు వేదములందు మూడువిధము లైనవచనములు ప్రవచింపబడినవి. శాస్త్రజ్ఞుడైనపురుషుడే తననిర్మలజ్ఞానదృష్టిచే ఆ వచనములను తెలిసికొనగలడు. మొదటిదేమనగా వర్తమానకాలమున కర్ణములకు మధురముగ గోచరించినను అర్థమైనట్లున్నను తదనంతరము అసత్యములు అహితకరములు కాగలవు. అట్టివచనములను కేవలము శత్రువులు పల్కెదరు. శత్రువులైనవారు పల్కెడియట్టిముఖప్రీతివచనములు హితకరములు కావు. వినుటకు మొదట దుఃఖజనకములుగ నుండినను పరిణామమునందు సుఖమును గలిగింపగల వచనములను దయాళురైన, ధర్మశీలురైన పురుషులు మాత్రమే తమబంధువులను సమాధానపరచుటకు పల్కెదరు. వినగనే అమృతమధురముగ ప్రతీతములగునట్టివి, పరిణామమునం దఖండసుఖమును ప్రసాదించునవి, సర్వహితకరములైనవి, సత్యములైనట్టివి యగునుపదేశామృతములు సర్వశ్రేష్ఠములు. గిరిరాజా! ఈ త్రివిధములైనవచనములందు నీవు ఏవచనములను వినుటకు అభిలషించెదవు? దేవేశ్వరుడైనశంకరుడు వాస్తవమునందు బాహ్యసంపద లేనివాడు. ఎందువలెననగా ఆయనమనస్సు తత్త్వజ్ఞానసముద్రమందే సదా నిమగ్నమైయుండును. బాహ్యసంపదలు చూచుటకు రమణీయముగ కన్పడగలవు. కాని అవియన్నియు మెరపువలె నశాశ్వతములు. నిత్యా

నందస్వరూపుడు. స్వాత్మారాముడైనపరమేశ్వరు డిట్టిప్రాకృతికసంపదలందు ఆసక్తిగలిగియుండడు. శంకరుడు నిర్ధనుడని యెవ్వరనగలరు! సకలధనములకు ధనాధ్యక్షుడైనకుబేరుడే ఆయనకు కింకరు డనిభావింపుము.

తన భ్రూభంగలీలామాత్రముననే సృష్టినిర్మాణమొనరించి పాలించి సంహరించుటలో సమర్థుడు, ప్రకృతి కతీతుడు, నిర్గుణుడు, పరమాత్మ, సర్వేశ్వరుడు, సమస్తజంతువులందు (దేహధారులందు) నిర్లిప్తుడు, లిప్తుడు, స్వయముగ సృష్టిపాలనసంహారకార్యములందు సమర్థుడు, సర్వరూపుడు, నిరాకారుడు, సాకారుడు, సర్వవ్యాపి. స్వేచ్ఛామయుడు, సృష్టికార్యములను నిర్వహించుటకు మూడురూపములను ధరించి సృష్టికర్తయైనబ్రహ్మయని, పాలకకర్తయైన విష్ణువని, సంహారకర్తయైనశివు డనికీర్తింపబడువాడు, బ్రహ్మరూపముతో బ్రహ్మలోకములోను, విష్ణురూపముతో క్షీరసాగరమందు శివరూపముతో కైలాసమందు నివసించువాడు నగుఆపరబ్రహ్మపరమేశ్వరుడే శ్రీకృష్ణు డనబడెను. బ్రహ్మాదిసర్వరూపములు ఆయనవిభూతులే. శ్రీకృష్ణునకు రెండు రూపములు కలవు, ఒకటి ద్విభుజరూపము, రెండవది చతుర్భుజరూపము. చతుర్భుజరూపముతో వైకుంఠమందు విరాజిల్లును, ద్విభుజరూపమున గోలోకధామమందు విరాజమానుడై యుండును. బ్రహ్మవిష్ణుమహేశ్వరులుకూడ ఆ శ్రీకృష్ణునియంశలే. కొందరుదేవతలు ఆయనకళలు, మఱికొందరు ఆయన కళాంశలు. శ్రీకృష్ణుడు సృష్టియొనరించుటకు సంకల్పించి స్వయముగ తన ప్రకృతిని (శక్తిస్వరూపిణి శ్రీరాధను) ప్రకటితమొనరించెను. ఆమెయందు తన పరబ్రహ్మతేజమును ప్రవేశమొనరింపజేసెను. ఆమూలప్రకృతినుండి ఒకమహా డింభము ప్రాదుర్భవింపగ దానినుండి మహావిరాట్పురుషుడు (శ్రీమన్నారాయణుడు) ఆవిర్భవించెను. ఆయనయే శ్రీకృష్ణుని పదునాఱవయంశయైన శ్రీమహావిష్ణు వని తెలిసికొనుము. శ్రీమహావిష్ణువు ఏకార్ణవజలములందు శయనించి యుండగ ఆయన నాభికమలమునుండి బ్రహ్మ ప్రాదుర్భవించెను. సృష్టికర్తయైనబ్రహ్మలలాటమునుండి కాలాగ్నాదిరుద్ర లుద్భవించిరి. శ్రీకృష్ణుని వామపార్శ్వమునుండి చంద్రశేఖరుడైనశివు డావిర్భవించెను. శ్రీమహావిష్ణువు వామపార్శ్వమునుండి విష్ణువు ప్రాదుర్భవించెను, శైలరాజా! ఇట్లుప్రకృతివలన ఉత్పన్నులైన కారణమున బ్రహ్మవిష్ణుశివాదులు ప్రాకృతికులనబడిరి.

శ్రీకృష్ణునినుండి ప్రాదుర్భవించిన మూలప్రకృతి నాల్గువిధములైన మూర్తులను ధరించెను. తదనంతర మామె సమస్తసృష్టిని సంచాలన మొనరించుటకు లీలాపూర్వకముగ తనఅంశలద్వారా, కళలద్వారా అనేకరూపములను ధరించెను, శ్రీకృష్ణుని వామాంగమునుండి ప్రాదుర్భవించినప్రకృతి రాసేశ్వరి యగురాధరూపమున ప్రతిష్ఠితయయ్యెను. ఆమెయే స్వయముగ శ్రీకృష్ణునిముఖమునుండి ప్రాదుర్భవించి వాణి, సరస్వతి యనునామముల కీర్తింపబడి రాగాఅధిష్ఠాత్రియయ్యెను. శ్రీకృష్ణునివక్షఃస్థలమునుండి ప్రాదుర్భవించిన ప్రకృతి సర్వసంపత్స్వరూపిణీ యగులక్ష్మియను నామమున ప్రసిద్ధికెక్కెను. మూలప్రకృతియే సర్వదేవతల తేజములందు తనంతటతానే శివారూపమున అభివ్యక్తమై సర్వదానవులను వధించి దేవతలకు రాజ్యలక్ష్మిని ప్రసాదించెను. తదుపరి కల్పాంతరమందు ఆప్రకృతియే దక్షకుమారియై ఆవిర్భవించి సతి యనునామమున ప్రసిద్ధికెక్కి పరమశివునకు అర్ధాంగియయ్యెను. దక్షయజ్ఞమందు శివనిందను వినలేక సతి దేహమును త్యజించి పితరులమానసీకన్యయైన నీభార్యమేనకకు, నీకు పుత్రికగ నవతరించెను. శైలరాజా! ఈమె ప్రతిజన్మమందు ప్రతికల్పములందు శివపత్నియే. ఈ పరాశక్తి జ్ఞానులకు బుద్ధిస్వరూపిణి, పూర్వజ్ఞానసంపన్నురాలు. ఈమె సర్వజ్ఞ, సకలసిద్ధిప్రదాయిని, సిద్ధిస్వరూపిణి, ఈమె అస్థికలను చితాభస్మమును శివుడు స్వయముగ భక్తితో ధరించెను. కళ్యాణస్వరూపా! గిరిరాజా! నీపుత్రికను మనఃపూర్వకముగ శివున కర్పించి ధన్యుడవు కమ్ము. లేనియెడల పార్వతి నీవు వీక్షించుచుండగనే తనప్రాణవల్లభుని జేరగలదు. పూర్వజన్మమందు ఏస్త్రీ యెవనికి పత్నియో, మరుజన్మమందామె ఆయనకే పత్ని కాగలదు. ప్రజాపతి నిర్మించిన నియమమును ఎవ్వరైనను ఖండింపలేరు. శివుడు స్వాత్మారాముడు, తత్త్వజ్ఞుడు; వివాహమందాయునకు ఇచ్ఛలేదు. తారకాసురునివలన పీడితులైనసమస్తదేవతలు బ్రహ్మ నాశ్రయించిరి. దేవతలదుఃఖములను తెలిసికొనినబ్రహ్మ రాక్షససంహార మొనరించుటకు సత్పుత్రునిగనుటకు వివాహమాడు మనిశంకరుని ప్రార్థింపగ ఆభక్తవత్సలుండు బ్రహ్మప్రార్థనల నంగీకరించెను. నీకుమార్తె కొఱకు ఘోరతపమాచరించుసమయమున శివుడే బ్రాహ్మణరూపధారియై అరుదెంచి నీకుమార్తెకు అభయ మొసంగెను.

శైలరాజేంద్రా! సకలదేవతలు శివకళ్యాణార్థము మమ్ములను నీకడకు పంపిరి. నీవు మనఃపూర్వకముగ పార్వతీశివులవివాహ మొనరింపకపోయినను ఆ యాదిదంపతుల కళ్యాణమనివార్యమగును. ఎందువలెననగ భవితవ్య మత్యంతప్రబల మనిగ్రహింపుము. ఆమహాదేవుడు రత్నసారనిర్మితరథముపై యోగీంద్రులలో శ్రేష్ఠుడైనవాడు, జ్ఞానులగురువులకే గురువైనవాడు, ఆది మధ్యాంతరహితుడు, నిర్వికారుడు, అజన్ముడు, పరబ్రహ్మము నగుశ్రీకృష్ణుని తోడ్కొని వివాహమునకు అరుదెంచగలడు. నారాయణునే సాక్షిగ నొన రించుకొని శివుడు పార్వతికి వరమొసంగెను. ఈశ్వరు డొనరించిన దుర్లభ ప్రతిజ్ఞ విఫలము కాజాలదు.

బ్రహ్మాది స్తమ్బపర్యన్తం సర్వం నశ్వరమస్థిరమ్ ।
అహో ప్రతిజ్ఞా దుర్లఙ్ఘ్యా సాధునామవినాశినీ ॥ ౧౩

బ్రహ్మమొదలు కీటకపర్యంతమున్న సర్వజగములు, నశ్వరములు, అస్థి రములు; కాని సాధుపురుషు లొనరించినప్రతిజ్ఞ దుర్లఙ్ఘ్యము నాశరహితము.

హిమాలయా! పూర్వకాలమం దింద్రుడు వజ్రాయుధముచే పర్వత ముల రెక్కలను ఖండించుట నీవెఱుగుదువు. పవనుడు తనశక్తిచే మేరుపర్వత శిఖరమును భంగ మొనరించెను. స్థావరరూపులైనమీరు దేవతల నెదుర్కొన లేరు. నీవు పార్వతీశివులకళ్యాణమునకు అంగీకరింపనియెడల దేవతలే నీకు శత్రువులు కాగలరు. శైలేంద్రా! ఒకనికై సకలసంపదలు వినాశమగుచుండగా వానిని పరిత్యజించి మిగిలినవారిని రక్షింపవలెను. కాని యీనియమము శరణా గతులయెడల వర్తింపదు. శరణాగతులను రక్షించుటకు తమప్రాణములైనను పరిత్యజించుట ఉచితమైనచో స్త్రీపుత్రధనాదివస్తువులవిలువ ఏపాటిది అనినీతి వేత్తలనుచున్నారు. మహారాజైన అనరణ్యుడు బ్రాహ్మణునకు తనపుత్రిక నర్పించి ద్విజశాపమునకు గురిగాక తనసమస్తసంపదలను రక్షించుకొనెను. అనరణ్యుడు బ్రాహ్మణభక్తుడు, అయినను ఆతడు బ్రాహ్మణశాపమునకు గురియగుసమయ మున నీతిశాస్త్రపారంగతులు వానికి కర్తవ్యబోధయొనరింపగా ఆనరేశ్వరుడు వారాదేశించినట్లు నిర్వర్తించి సమస్తసంకటములనుండి ముక్తుడయ్యెను. శైలేంద్రా! నీవుకూడ శివునకు నీపుత్రిక నర్పించి నీతోపాటు సర్వబంధువులను రక్షించుకొనుము.

శ్రీ కృష్ణుడు పలికెను :

రాధా! వశిష్ఠుడొనరించిననీతిబోధ నాలకించి హిమవంతు డిట్లు మహర్షిని ప్రశ్నించెను. "బ్రాహ్మణోత్తమా! రాజాధిరాజైన అనరణ్యుడు ఏకులోద్భవుడు! ఆయన యెట్లుతనకుమార్తె నర్పించి తనసమస్తసంపదలను రక్షించుకొనెను! ఈ ప్రాచీనేతిహాసమును వర్ణింపవలసినదిగ కోరుచున్నాను.

వశిష్ఠుడు పలికెను :

శైలరాజా! నృపేశ్వరుడైనయనరణ్యుడు మనువంశమం దుద్భవించిన వాడు చిరంజీవి, ధర్మాత్ముడు, వైష్ణవుడు, జితేంద్రియుడు. మొదటిమనువు స్వాయంభువమనువు, ఆయన బ్రహ్మకుమారుడు, ధర్మాత్ముడు. ఆ మను శ్రేష్ఠుడు డెబ్బదియొక్కచతుర్యుగముల కాలము ధర్మపూర్వకముగ రాజ్యము పాలించెను. అంత్యకాలమందు స్వాయంభువమనువు తనయర్ధాంగి యైన శతరూపతోగూడి వైకుంఠమునకు వెడలి శ్రీహరిదాస్యసౌభాగ్యమును పొంద గల్గెను. స్వాయంభువుని తరువాత స్వారోచిషమనువు చక్రవర్తియై రాజ్యము పాలించెను. ఆయన తదనంతరము ఉత్తము డనుమనువు రాజ్యమును పాలించెను, ఉత్తముడు గతించినపిమ్మట ధర్మాత్ముడగు తామసుడు మను వయ్యెను. ఆయనతరువాత జ్ఞానశిరోమణి యైనరైవతుడు మనువయ్యెను. తదనంతరము ఆఱవమనువు శ్రాద్ధదేవు డైనాడు, సూర్యునిజ్యేష్ఠకుమారు డైనసావర్ణి ఎనిమిదవమనువు. ఆసావర్ణియే పూర్వజన్మమందు చైత్రవంశ పరేశ్వరుడైన సురథుడు. తొమ్మిదవమనువు దక్షసావర్ణి, పదియవమనువు బ్రహ్మ సావర్ణి, పదునొకండవమనువు ధర్మసావర్ణి, తదనంతరము రుద్రసావర్ణిమన్వం తరమాసన్నమయ్యెను. రుద్రసావర్ణి శివునకుపరమభక్తుడు, జితేంద్రియుడు ఆయన అనంతరము క్రమముగ దేవసావర్ణి, ఇంద్రసావర్ణి, పదమూడవ, పదు నాల్గవ మన్వంతరములకు అధిపతులైనారు. ఈ పదునల్వురిమనువులఆయువు పరిసమాప్తమైన బ్రహ్మలోకపగలు పూర్తికాగలదు. మరల పదునల్వురు మనువులకాలము బ్రహ్మకురాత్రికాగలదు. శైలరాజా! నేను నీకు ఇంద్రసావర్ణి వృత్తాంతమును వర్ణించెద నవధరింపుము.

ఇంద్రసావర్ణి మనువులందు శ్రేష్ఠుడు. అత్యంతధర్మాత్ముడు, గదాధారియైనవిష్ణుమూర్తి కనన్యభక్తుడు. ఆమనుశ్రేష్ఠుడు డెబ్బదిఒక్కచాతుర్యుగముల కాలము ధర్మపూర్వకముగ రాజ్యమును పరిపాలించెను. ఆయనకుమారుడే సురేంద్రుడు, సురేంద్రునికుమారుడు శ్రీనికేతుడు, శ్రీనికేతునికుమారుడే మహాయోగియైనపురీమతరుడు, పురీమతరుని సంతానమే గోకాముఖుడు. గోకాముఖునకు వృద్ధశ్రవసు డనుకుమారుడు కల్గెను. ఆయనకు భాను డను పుత్రు డుదయింపగ, భానునకు పుండరీకుడు కల్గెను. పుండరీకునకు జిహ్వాలుడు, జిహ్వాలునకు శృంగి, శృంగికి భీము డనుపుత్రుడు కల్గెను. తనయశశ్చంద్రికలచే చంద్రునే జయించిన యశశ్చంద్రుడు ఆభీమునికుమారుడే. యశశ్చంద్రుని కుమారుడు వరేణ్యుడు, వరేణ్యుని కుమారుడు పురారణ్యుడు, పురారణ్యుని కుమారుడు ధరారణ్యుడు, ధరారణ్యునిపుత్రుడు మంగళారణ్యుడు.

మంగళారణ్యుడు జ్ఞానులందు శ్రేష్ఠుడు, మహాతపస్వి. పుత్రసంతానము లేనికారణమున ఆయన పుష్కరతీర్థమందు దీర్ఘకాలము తప మొనరించి మహేశ్వరునివరమువలన అనరణ్యుని కుమారునిగ బడసెను. అనరణ్యుడు విష్ణుభక్తుడు, జితేంద్రియుడు. తండ్రితరువాత అనరణ్యుడే సప్తద్వీపములకు అధిపతియై భృగుమహర్షిని పురోహితునిగ నొనరించుకొని నూఱుయజ్ఞముల నొనరించెను. కాని ఇంద్రపదమును సహితము కాంక్షింపలేదు. సర్వేశ్వరా! ఆమహారాజునకు నూర్గురుపుత్రులు, లక్ష్మీసమానలావణ్యవతియైనపుత్రిక కల్గిరి. తండ్రికృపామున దినదినప్రవర్ధమానయై నవయౌవనవతియైన ఆకన్య నామధేయము పద్మ. తనపుత్రిక వివాహముకొఱకై అనరేశ్వరుడు వరులను వెదుకనారంభించెను. ఆసమయముననే పిప్పలాదు డనుమహర్షి ఏకాంతమున శృంగారకీడ లొనరించుచు గంధర్వదంపతులను గాంచి వివాహమాడవలె నని నిర్ణయించుకొనెను. ఆ మహర్షిచిత్తము తపమునుండి విచలితమై పత్నిని పొందుటకు యోచింపదొడంగెను. ఆమహర్షి యొకదినమున పుష్పభద్రానది యందు స్నానమొనరించుటకు అనరణ్యునిరాజ్యమును ప్రవేశించి రాజపుత్రిక యగుపద్మను మార్గమధ్యమున వీక్షించెను. అత్యంతసౌందర్యవతియైనపద్మ తనకు యోగ్యురాలైనయర్ధాంగి యనిభావించి పిప్పలాదమహర్షి ఆకన్య యొక్కపూర్వాపరములను తెలిసికొని అనరణ్యునిసభను ప్రవేశించెను.

మహర్షిని గాంచి అనరణ్యుడు భక్తిపూర్వకముగ అనేకప్రణామములు లర్పించి ఆతిథ్య మొసంగి పూజించెను.

ఆమహర్షి విస్సంకోచముగ నీపుత్రికను నాకర్ధాంగిగ చేయుమని అనరణ్యుని యాచించెను. మహర్షి యొక్క విపరీతమైనకోర్కెను విని ఆనరేశ్వరుడు ఆశ్చర్యచకితుడై యీజటాధారికి నాపుత్రిక నెట్లుధారపోయుగల నని చింతింపదొడంగెను. రాజు మనోభావములను గ్రహించిన పిప్పలాదమహర్షి కన్యను దానముచేయుమియెడల శపింతు ననిపలికెను. వృద్ధుడైన జరాజీర్ణుడైన యామునివర్యున కెట్లునవయౌవనసంపన్నమైనపుత్రికను ధారపోయుగల నని బంధుసహితముగ అనరణ్యుడు విలపించుట గాంచి ఆసభయందు దాసీనులై యున్న నీతిశాస్త్రకోవిదులైన పండితులిట్లుపల్కిరి. "నరేశ్వరా! ఈనాడుగాని, మరియొకనాడుగాని నీకుపుత్రికను ఎవనికోయొకనికి అప్పగించవలసినదే, ఈ బ్రాహ్మణునికన్న అన్యులకు కన్యను దాన మొనరించుట శ్రేష్ఠ మనిభావించుచున్నావుకాబోలు. ఈ బ్రాహ్మణుడు త్రిలోకములందు నీకుమార్తెకు తగిన వరుడు. కావున నీవు నిస్సంకోచముగ నీమెను ఈమహర్షికి అర్పించి సమస్త రాజ్యమును, సకలసంపదలను రక్షించుకొనుము, లేనిచో నీవు బంధుసహితముగ నామహర్షి యాగ్రహమునకు గురికాగలవు. శరణాగతునికన్న అన్యులనెవ్వారినైనను త్యజించి సర్వస్వమును రక్షించుకొనవచ్చును."

ఆస్థానపండితుల యుపదేశ మాలకించి అనరణ్యుడు దుఃఖమును త్యజించి సకలవస్త్రాలంకారములచే తనకుమార్తె నలంకరించి ప్రసన్నతాపూర్వకముగ పిప్పలాదునకు కన్యాదాన మొనరించి తనసర్వస్వమును రక్షించుకొనగల్గెను. పద్మను అర్ధాంగిగా బొంది అత్యంతసంతుష్టుడై ఆమహర్షి రాజునాశీర్వదించి పత్నీసహితముగ నిజాశ్రమమునకు వెడలిపోయెను. తదనంతరము అనరణ్యచక్రవర్తి సకలరాజ్యమును త్యజించి గోలోకనాథుడైన రాధావల్లభుని చింతించుచు, సేవించుచుఘోరతప మాచరించి గోలోకపరంధామము జేరెను. అనరణ్యుని జ్యేష్ఠకుమారుడైనకీర్తిమంతుడు చక్రవర్తియై భూమియందుగల సమస్తప్రజలను కన్నబిడ్డలవలె పాలించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున దేవబ్రహ్మసంవాద మను
నలుబదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

---

# నలుబదిరెండవ అధ్యాయము

## అనరణ్యుని కన్యయగు పద్మ ధర్మదేవతను శపించుట.

వశిష్ఠ మహార్షి పలికెను:

శైలరాజేంద్రా! శ్రీమహాలక్ష్మి శ్రీమన్నారాయణుని సేవించునట్లు అనరణ్యునికుమార్తె యగుపద్మ తనమనోవాక్కాయకర్మలచే భక్తిభావ సమన్వితయై ప్రాణేశ్వరుడైనపిప్పలాదమహర్షిని సేవించుచుండెను. ఒకదిన మున పద్మ స్నానమాచరించుటకు పవిత్రగంగాతటమునకు బయలుదేరెను. ఈమెపాతివ్రత్యమును పరీక్షింపవలె ననిసంకల్పించి స్వయముగ ధర్మదేవతయే రాకుమారుని వేషమును ధరించి కాముకునివలె పద్మమార్గము నడ్డగించెను. ఆ రాజకుమారుని కోరికగ్రహించినదై పద్మ యిట్లుశపించెను. "పాపాత్మా! నృపాధమా! నామార్గమునుండి తొలగిపొమ్ము. నన్ను కామదృష్టితో వీక్షించినక్షణమందే నీవు భస్మముకాగలవు అఖండతపముచేపరమపవిత్రుడైన మునిశ్రేష్ఠుడైన, నాప్రాణేశ్వరుడైన పిప్పలాదమహర్షినిదక్క అన్యులసేవలను స్వీకరింపను. నీవంటి స్త్రీలంపటులను వీక్షింపను. నేను నీకు తల్లితోసమాను రాలను. అయినను నీవు నన్నొకభోగస్త్రీగా భావించి కామివై పిలిచు చున్నావు. నీదీదుష్కృత్యమువలన క్రమముగ కాలానుగుణముగ క్షయ మొందెదవుగాక, ఇదియే నాశాపము."

ఇట్లని ధర్మదేవత కంపించుచు రాజరూపమును వీడి స్వస్వరూపమున సాక్షాత్కరించి పద్మాదేవి నుద్దేశించి యిట్లుపల్కెను. "మాతా! నేను కాముకునికాను. ధర్మజ్ఞులకు గురుడనైన ధర్మదేవతను. పతివ్రతా! నేను పరస్త్రీలను మాతృదేవతలవలె భావించుధర్మమును, నీపాతివ్రత్యమును పరీక్షించుటకే యిట్లువర్తించితిని. స్వయముగ నాకు సతీమహాత్మ్యము అవగతమైయున్నను, దైవవశమున నీవంటిపతివ్రతలను పరీక్షించుటకు ప్రయత్నించితిని. సాధ్వీ! నీవు నన్ను శపించుట నీకు విరుద్ధముకాదు, ఉచితమైనదే. నాకు ధర్మమునకే అధిదేవతనని అహంకరించి పతివ్రతనే పరీక్షించుట నాకు యుక్తమైనదికాదు. నాకు గర్వభంగము కావలసినదే. ఎందువలననగ నుమార్గగాములను శిక్షించుటకు దండనీతివిధానమును పరమేశ్వరుడైన శ్రీకృష్ణ పరమాత్మయే స్వయముగ అవలంభించెను.

ధర్మం స్వధర్మం విజ్ఞాతుం కాలం కలయితుం క్షమః ।
విధాతారం సంవిధాతుం తస్మై కృష్ణాయ తే నమః ॥

సంహర్తుం యః క్షమః కాలే సంహర్తారం భవం విభుః ।
స్రష్టారం లీలయా స్రష్టుం తస్మై కృష్ణాయ తే నమః॥

శత్రుం విధాతుం మిత్రం చ సుప్రీతిం కలహం క్షమః ।
స్రష్టుం నష్టుం తదేవం చ తస్మై కృష్ణాయ తే నమః ॥

శాపం ప్రదాతుం సర్వాంశ్చ సుఖదుఃఖవరాన్ క్షమః ।
సమ్పదం విపదం యో హి తస్మై కృష్ణాయ తే నమః ॥

ప్రకృతిర్నిర్మితా యేన మహావిష్ణుశ్చ నిర్మితః ।
బ్రహ్మవిష్ణుమహేశాద్యాస్తస్మై కృష్ణాయ తే నమః ॥

యేన శుక్లీకృతం క్షీరం జలం శీతం కృతం పురా ।
దాహీకృతో హుతాశశ్చ తస్మై కృష్ణాయ తే నమః ॥

అతితేజః సముత్థాయ తేజోరూపాయ మూర్తయే ।
గుణశ్రేష్ఠనిర్గుణాయ తస్మై కృష్ణాయ తే నమః ॥

సర్వస్మై సర్వబీజాయ సర్వేషామన్తరాత్మనే ।
సర్వబన్ధుస్వరూపాయ తస్మై కృష్ణాయ తే నమః ॥ 22—28

ధర్మదేవతకే స్వధర్మజ్ఞానమును కల్గించువాడు, కాలమునకే కాలమును నిర్ణయించువాడు, సృష్టికే సృష్టి యొనరించుటలో సమర్థుడైనవాడును నగు

శ్రీకృష్ణునకు నమస్కారము. సమయ మాసన్నమైనపుడు సంహారకర్తనే సంహరించుటకు సమర్థుడు, అనాయాసముగ సృష్టినే సృష్టియొనరింపగల్గినవాడు, నగు శ్రీకృష్ణునకు నమస్కారము. శత్రువును సహితము మిత్రునిగ నొనర్పగలవాడు, కలహమునైనను ఉత్తమప్రేమరూపమున పరిణతమొనరింపగలవాడు, సృష్టిసంహారములను నిర్వర్తింపగలసమర్థుడు, నగుశ్రీకృష్ణునకు నమస్కారము. సర్వులకు జ్ఞానములు, సుఖములు, దుఃఖములు, వరములు, సంపదలు, విపత్తులు ప్రసాదించుటకు సమర్థుడు, నగుశ్రీకృష్ణునకు నమస్కారము. ప్రకృతిని ప్రకటిత మొనర్చినవాడు, మహావిష్ణువును, బ్రహ్మవిష్ణుమహేశ్వరాదులను ఉత్పన్న మొనరించినవాడు నగు శ్రీకృష్ణునకు నమస్కారము. క్షీరములకు ధవళత్వము, జలములకు శీతలత్వము, అగ్నికి దాహకత్వములు ప్రసాదించినవాడు నగు శ్రీకృష్ణునకు నమస్కారము. అత్యంత తేజఃపుంజమునకు కారణమైనవాడు, అఖండ తేజోమయమూర్తియు, సర్వదివ్యగుణములందు శ్రేష్ఠుడు, నిర్గుణుడు నగుశ్రీకృష్ణునకు నమస్కారము. సర్వరూపుడు, సర్వబీజస్వరూపుడు, సర్వాంతరాత్మ, సమస్తజీవబంధువు నగుశ్రీకృష్ణునకు నమస్కారము.

ఇట్లుతనకు గర్వభంగము సంభవింపగ ఇదియంతయు శ్రీకృష్ణునిలీలయే యనిగ్రహించి సర్వజ్ఞుడైనధర్మదేవత భగవంతుని అనేకవిధముల ప్రార్థించి ఆమెయెదుట నిలువబడెను. శైలరాజా! తనయెదుటనున్నది సాక్షాత్తుగ ధర్మదేవత యనిగ్రహించినపద్మ అత్యంతాశ్చర్యచకితురాలై తాను శపించినందులకు పశ్చాత్తాప మొందుచు నిట్లుపల్కెను. "దేవా! నీవు సమస్తకర్మలకు సాక్షివి, సర్వజీవులఅంతరంగములందు నివసించువాడవు, సర్వాత్మవు, సర్వజ్ఞుడవు, సర్వతత్త్వవేత్తవైనధర్మదేవతవు. నీవు నామనమును తెలిసికొనుటకు ఈవాసి నేలపరీక్షించితివి? ధర్మదేవా! అజ్ఞానవశురాలనై నేను నీయెడల నొనరించిన అపరాధమును క్షమింపుము. ప్రభూ! నేను స్త్రీస్వభావవశమున నిన్ను తెలిసికొనలేక క్రోధపూర్వకముగ శపించితిని. నాశాపము అనివార్యము, కావున నేను చింతించుచుంటిని.

ఆకాశోఽసౌ దిశః సర్వా యది నశ్యన్తి వాయవః ।
తథాపి సాధ్వీశాపాస్తు న నశ్యతి కదాచన ॥ 34

"ఆకాశము, సర్వదిశలు, వాయువ్యాదులు నశించినను పతివ్రతశాపము అనుభవింపనిదే నశింపదు." నాశాపమువలన మీరు నాశమొందిన సంపూర్ణ

సృష్టినశింపగలదు. దేవేశ్వరా! పూర్ణిమాదినమున చంద్రుడు పరిపూర్ణుడై ప్రకాశించునట్లే మీరు సత్యయుగమందు నాల్గుపాదములతో పరిపూర్ణులై చరించెదరు. ఆయుగమందు మీరు సర్వదానర్వత్రా, అహర్నిశములు విరాజమానులై యుండగలరు; కాని దేవా! త్రేతాయుగ మాసన్నమైనపిమ్మట ధర్మమునొకపాదము నశింపగలదు. దేవా! ద్వాపరయుగమందు రెండుపాదములు నశించును, కలియుగమందు మూడవపాదముకూడ నశింపగలదు. కలియుగాంతమందు నాల్గుపాదములు లుప్తములు కాగలవు. తదనంతరము సత్యయుగ మాసన్నమైన మీరు నాల్గుపాదములచే పరిపూర్ణులై విరాజిల్లగలరు. సత్యయుగమందు మీరు సర్వవ్యాపిమై చరింపగలరు. కాని అన్యయుగములందు కొన్నికొన్ని పవిత్రస్థానములందే మీరు పరిపూర్ణరూపమున నివసింపగలరు. దేవా! అన్యయుగములందు ఏయేస్థానములు మీకు నివాసయోగ్యములో వివరించుచున్నాను కరుణతో శ్రవణ మొనరింపుడు.

సంపూర్ణవైష్ణవులు, యతులు, బ్రహ్మచారులు, పతివ్రతాస్త్రీలు, జ్ఞానులైనపురుషులు, వానప్రస్థులు, గృహస్థులు, సన్యాసులు,

> నృపేషు ధర్మశీలేషు సత్సు సద్వైశ్యజాతిషు ।
> ద్విజసేవిషు శూద్రేషు సత్సంసర్గస్థితేషు చ ॥
> యేషుత్వం సతతం పూర్ణా ధర్మరాజ విరాజసే ।
> యుగే యుగే తవాధారా యత్ర పుణ్యతమా జనాః ॥ 41-42

ధర్మశీలురైన రాజులు, సాధుమహాత్ములు శ్రేష్ఠవైశ్యజాతి, సత్పురుషులసంసర్గమందు నివసించుద్విజులు, సేవకులు, శూద్రులు, వీరందరియందు సదా మీరు పూర్ణరూపమున విరాజమానులై యుండగలరు. యుగయుగమునందు పవిత్రవిల్లుపుణ్యాత్ములైనపురుషులే మీకు ఆధారులై యుండగలరు.

అశ్వత్థ, వట, బిల్వ, తులసీ, చందన, వృక్షములపై, దీక్షా, పరీక్షా, శపథ, గోశాల, గోపదభూములందు, వివాహములందు, పుష్పములందు, దేవవృక్షములందు, దేవాలయములందు, పవిత్రతీర్థములందు, సాధుపురుషుల గృహములందు సదా నీవు నివశింపగలరు. వేదవేదాంగశ్రవణకాలమందు, పవిత్రజలములందు, సత్సభలయందు, శ్రీకృష్ణదివ్యనామగుణకీర్తనశ్రవణదాన మొనరింపబడుస్థానములందు, వ్రతములందు, పూజలందు, తపములందు,

న్యాయమందు, యజ్ఞములందు, ధర్మసాక్షిస్థానములందు, గోశాలలందు, గోవులందు, యుండి నీవు పరిపూర్ణరూపమున గోచరింపగలవు. ధర్మదేవా ! నీవాస్థానములందు క్షయము మొందవు. భిన్నస్థానములందు నీవు అవశ్యముగ కృశింపగలవు. ఏస్థానములు నీకు నివాసయోగ్యములుకావో, అగమ్యములో వివరించెద నవధరింపుము. సంపూర్ణవ్యభిచారిణులందు, నరఘాతకులైన మనుష్యులగృహములందు నరహత్యయొనరించు నీచపురుషులందు, మూర్ఖులందు, దుష్టులందు, దైవగురుబ్రాహ్మణఇష్టదేవ పాలనీయమనుష్యుల ధనమపహరించువారియందు, ధూర్తులందు, దొంగలందు, రతిస్థానమందు, జూదము, మదిరాపానము, కలహములొనరించు స్థలములందు, సాలగ్రామసాధుతీర్థపురాణరహిత స్థలములందు, దస్యులందు, వాదవివాదములందు, తాటివృక్షఛాయయందు, గర్వించుమనుష్యులందు, హింసనాధారము చేసికొని నివసించువారియందు. రచనలద్వారా జీవితనిర్వాహణమొనరించు వారియందు, దేవాలయములందు పూజనువృత్తిగ జీవించువారియందు, గ్రామయాజులందు, వృషభములను హింసించువారియందు, స్వర్ణకారులందు, జీవహింసచే జీవిత నిర్వాహణ మొనరించు వారియందు, భర్తను నిందించుస్త్రీలయందు, నారివశులై చరించుపురుషులందు, దీక్షాసంధ్యావిష్ణుభక్తిహీనులైనద్విజులందు, పత్నిని, కుమార్తెను విక్రయించువారియందు, సాలగ్రామమును దేవమూర్తులను విక్రయించు వారియందు, మిత్రద్రోహులందు, కృతఘ్నులందు, సత్యనాశకులందు, విశ్వాసఘాతకులందు, శరణాగతుని రక్షింపనివారియందు, ఆశ్రయించిన వారిని నాశన మొనరించు వారియందు, అనృతము పల్కువారియందు, పుణ్యకర్మహీనులందు, పుణ్యకర్మవిరోధులందు, నీవు నివసింపవు. ప్రభూ! పైనుదహరింపబడిన నిందనీయస్థానములందు నివసించుటకు నీకు అధికారముండబోదు. దేవా! నాపతిసేవకు విలంబనమగుచున్నది, నే నికపోయివత్తును, నీవుకూడ స్వధామమునకు వెడలిపొమ్ము".

ఇట్లాదేశించిన పద్మవచనముల నాలకించినబ్రహ్మపుత్రుడైనధర్మదేవునిముఖారవిందము అత్యంతప్రసన్నత్వముతో వికసించెను. ఆయన వినయముతో ఆసాధ్వితోనిట్లుపల్కెను. "నన్ను రక్షించునోదేవీ! నీవు ధన్యవు సాధ్వీ! నీపతిపరాయణత్వము అఖండమగుగాక! నీకు సదా కళ్యాణము కల్గు

గాక. నీకు దివ్యవరములను ప్రసాదించుచున్నాను, గ్రహింపుము. కుమారీ! వృద్ధుడైన నీప్రాణవల్లభుడు నవయౌవనసంపన్నుడు, రూపవంతుడు, గుణవంతుడు కాగలడు. ఆయనయౌవనము సదా స్థిరమైయుండగలదు. నీభర్త మార్కండేయుని తరువాత అంతటిచిరంజీవుడు కాగలడు. కుబేరునివలె విష్ణుభక్తుడై, కపిలమహర్షి తరువాత ఆయనవలె సిద్ధుడై విరాజిల్లగలడు. దేవీ! నీవుకూడ స్థిరయౌవనసంపన్నవై ఉత్తమైశ్వర్యయుక్తవు కాగలవు, నీకు జీవితపర్యంతము పతిసౌభాగ్యము అఖండముగనుండుగాక. సాధ్వీ! నీకు నీభర్తకంటె అధికగుణవంతులైన, చిరంజీవులైనపుత్రులు కల్గెదరు, ఇందు సంశయము లేదు".

శైలేంద్రా! ఇట్లాసాధ్వి నాశీర్వదించి ధర్మదేవత విసీతభావముతో నిలువబడెను. పద్మ ధర్మదేవతకు ప్రదక్షిణము లొనరించి ప్రణామము లర్పించి తనభర్త సేవాకార్యములను నిర్వర్తించుటకు వెడలిపోయెను. ధర్మదేవత పతివ్రత నాశీర్వదించి తనధామమునకు వెడలిపోయెను. పద్మ తరుణవయస్కుడైనతనభర్తతో చిరకాలము అఖండసుఖముల ననుభవించెను. తదనంతర మామెకు తనభర్తకంటె అధికగుణసంపన్నులైన నైదురుగుపుత్రులుకల్గిరి. ఆ పతివ్రతామహాత్మ్యమును సర్వజనులు వేనోళ్ళ సభలందు పొగిడిరి. హిమరాజా! ఇట్లు నే నీపురాతనేతిహాసమును వర్ణించితిని. అనరణ్యుడు తన కుమార్తెను పిప్పలాదమహర్షి కర్పించి తన్ను, తనబంధువులను, తనసంపదలను, రక్షించుకొనగల్గెను. కావున నీవుకూడ సర్వేశ్వరుడైనశంకరునకు నీకుమార్తె నర్పించి నిన్ను, నీబంధువులను, నీసర్వసంపదలను రక్షించుకొనుము.

శైలరాజా! ఒకసప్తాహానంతరము అత్యంతదుర్లభ శుభక్షణమందు చంద్రుడు లగ్నేశ్వరుడై తనకుమారుడైనబుధునితో విరాజిల్లగలడు, రోహిణీ సంయోగము పొంది ప్రసన్నుడైయుండగలడు. ఆలగ్నమందు చంద్రునకు తారలు శుద్ధములై యుండును, ఆదినమున మార్గశీర్ష మాసమందు సోమవారము కాగలదు. ఆలగ్నము సమస్తదోషరహితము, సమస్తశుభగ్రహదృష్టిలక్షితము, అసద్గ్రహశూన్యము, ఉత్తమసంతానప్రదము, పతిసౌభాగ్యదాయకము, వైధవ్యనివారకము, జన్మజన్మములందు సుఖప్రదాయకము, అత్యంత శ్రేష్ఠము. ఎప్పుడును ప్రేమవిచ్ఛేదము సంభవింపని ఆశుభలగ్నమందు నీవు

నీకుమార్తె యైనజగదంబను, జగత్పితయగుమహాదేవున కర్పించిస్త్రీ కృతకృత్యు డవు కమ్ము.

గిరిరాజా! కల్పాంతరమందు సంభవించిన ఇతిహాసమును వర్ణించెదను శ్రవణ మొనరింపుము. ఆమూలప్రకృతి యగునీశ్వరి శ్రీకృష్ణునిఆజ్ఞవలన దక్ష కన్యకగ ఆవిర్భవించెను. దక్షుడు స్వయముగ ఆదేవిని అత్యంతభక్తిభావ ముతో శూలపాణి యగుశివునకు అర్ధాంగిగ నర్పించెను. తదనంతరము దైవ వశమున నాజనకు డైనబ్రహ్మ యొనరించు యజ్ఞసభామధ్యమున, సకలదేవతా సమక్షములో దక్షునకు, శంకరునకు అకారణకలహము సంభవించెను. అకారణ ద్వేషము వహించినదక్షుడు శివుని అవమానించుటకు యజ్ఞమును సంకల్పించి శివుని ఆహ్వానింపలేదు. ఈవిషయము తెలిసికొని సతి కుపితయై తనతండ్రిని అనేకవిధముల దూషించి యజ్ఞశాలనుండి నిష్క్రమించి తనతల్లిని జేరి ఆమె సమక్షమున భవిష్యత్కాలమందు సంభవించుసంఘటనలను వర్ణించెను. దక్ష యజ్ఞవిధ్వంసము, దక్షపరాభవము, యజ్ఞస్థానమునుండి దేవతలు, మహర్షులు, ఋత్విజులు, పలాయనము చిత్తగించుట, శంకరసైనికులవిజయము, తన మరణము పత్నీవిరహముచే ఆతురచిత్తుడై మోహవశమున శంకరుడు పర్య టించుట, శంకరునినయనములనుండి ప్రవహించిన పత్నీవియోగ దుఃఖాశ్రు వులచే సరోవరనిర్మాణము, జనార్ధనుడు శివుని ఓదార్చుట, మరల తను మరు జన్మములో శివునిపొందుట మొదలగు భవిష్యద్విషయములను సతి పల్కి ఆ సభామధ్యమున అత్యంతదుఃఖితురాలై యోగాగ్నిలో అంతర్ధానమయ్యెను. ఆమె సిద్ధయోగిని, కావున ఆమె అంతర్ధానమై గంగాతటమునకు జని శంకరుని చరణారవిందములనే ధ్యానించుచు శరీరమును త్యజించి, పూర్వకాలమందు దైత్యకులమును సంహరించిన గంధమాధనపర్వతగుహయందు విరాజిల్లుచున్న తనవిగ్రహమందు ప్రవేశించెను. ఈవిచిత్రసంఘటనముగాంచి సమస్తదేవతలు అత్యంతవిస్మితులై హాహాకారము లొనరించిరి; శివసైనికులు దక్షయజ్ఞవినాశ మొనరించి ఆయజ్ఞములం దున్నసర్వులను పరాభవించి, శోకముచే వ్యాకులురై శివుని జేరి జరిగినదంతయు విన్నవించిరి. విషయమును తెలిసికొని సమస్తరుద్ర గణములతో సంహారకర్త యగుమహేశ్వరుడు తనయర్ధాంగి యగుసతిశరీరము పడియున్న గంగాతటము జేరెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున సతీదేవి దేహత్యాగ మను
నలుబదిరెండవ అధ్యాయము
సంపూర్ణము.

---

# నలుబదిమూడవ అధ్యాయము

## శ్రీహరిహరుని శోకమును నివారించుట.

శ్రీ నారాయణ ఋషి పలికెను :-

నారదా! తదనంతరము మహాదేవుడు పవిత్రగంగానదీతటముపై నిద్రామగ్నమైయున్నటుల గోచరించు దుర్గాస్వరూపిణి యగుసతీదేవి మనోహరమూర్తిని దర్శించెను. జీవరహితమైనను ఆమెముఖారవిందకాంతి కొంచెమైనను మలినము కాలేదు. శ్వేతవస్త్రమును ధరించి హస్తమందు అక్షమాలతో దివ్యతేజముతో ప్రకాశించు ఆసతీదేవి శ్రీయంగములనుండి కమనీయకాంతి బయల్వెడలి సర్వత్రా వ్యాపింపదొడంగెను. సతీదేవియొక్క ప్రాణహీనశరీరమును గాంచి శివుడు విరహాగ్నిలో జ్వాలింపదొడంగెను. మూర్తీభవించిన తత్త్వరాశియైనను శంకరుడు సతీవియోగజనితదుఃఖముచే ఆక్రాంతుడై మూర్ఛనొందుచు, మరల చైతన్యముపొంది అనేకవిధముల విలపింపదొడంగెను. విలపించి, విలపించిహరుడు స్వర్ణప్రతిమాసదృశమైన యాసతీదేవి దేహమును భుజస్కంధములపై నిడుకొనిదుఃఖించుచు సప్తద్వీపములందు, లోకాలోకములందు, సప్తసింధువులందు తిరిగి తుదకు భారతవర్షమం దున్న శతశృంగ గిరిప్రదేశమునకు జేరెను. పరమేశ్వరుడు విరహావశమున భ్రమించుచున్నసమయమున సతీదేవి మృతశరీరావయవములు కొన్నిప్రదేశములందు పడెను. ఆప్రదేశము లన్నియూ పునీతములై, సిద్ధక్షేత్రములైనవి. సతీదేవి

అపక్షిప్తశరీరమునకు మహాదేవుడు అగ్నిసంస్కార మొనరించి ఆభస్మమును తన శరీరమంతటను అలంకరించుకొని ఆ మెడయస్థికలను మాలగ నొనరించి గళమున ధరించి అర్ధాంగియెడల తనకుగల అనన్యప్రేమభావమును లోకశిక్షార్థమై బహిర్గత మొనర్చెను. శివుడు నదీతటమునందుగల వటవృక్షమూలమున ఆసీనుడై సతీవియోగదుఃఖమును భరింపలేక విలపించుచుండగ, హరిని ఓదార్చుటకు లక్ష్మీపూజితుడైన శ్రీమన్నారాయణుడు సకలదేవతలతో, ఋషిమునీంద్రులతో, పార్షదులతో ఆప్రదేశమున కరుదెంచి శంకరుని ప్రేమతో తనఒడిలోనికి జేర్చుకొని ఇట్లు జ్ఞానబోధ చేయదొడంగెను:

శ్రీ మ న్నా రా య ణు డు ప లి కె ను :

స్వాత్మారామా, శివా! అత్యంతహితకరములైన, ఆధ్యాత్మిక జ్ఞానసారమైన, దుఃఖశోకనాశమైన, జ్ఞానబీజమైన నాయుపదేశామృతమును గ్రోలి నిరూపమును గ్రహింపుము. భవా! నీవు స్వయముగ అఖండజ్ఞాననిధివి, విధివి, సర్వజ్ఞుడవు, స్రష్టలకే స్రష్టవు, అయినను నేను నీకు జ్ఞానోపదేశ మొనరించెదను. ఎందువలననగ ప్రాణసంకటసమయములందు విద్వాంసుడైనపురుషుడు, విద్వాంసుడైన వానినికూడ ఓదార్పగలడు. ఒకరినొకరు సంకటసమయములందు ఓదార్చుకొనుట లోకవ్యవహారము. మహేశ్వరా! దుర్దినములందే దుఃఖము, శోకము, భయముకలుగగలవు దుర్దినములు గడచినపిమ్మట నిశ్చయముగ సుదినములు రాగలవు, కావున దుర్దినములు శాశ్వతములు కావు. సుదినములందు హర్షము, ఐశ్వర్యదర్పములు నిరంతరము వృద్ధికాగలవు; కాని విద్వాంసుడైనపురుషుడు సుఖదుఃఖముల నన్నింటినీ స్వప్నములని, మిథ్యలని గ్రహించి వర్తింపగలడు. మహాదేవా! నీవు మహాజ్ఞానివి, ఉత్పత్తికి కారణుడవు, సనాతనుడవు, దివ్యజ్ఞానమును పొందుము. నీస్వరూపమును స్మరించుము. నీకు కళ్యాణమగుగాక, నిశ్చయముగ నీకు సతీదేవి మరల లభించుగాక. శీతలత్వము జలములను, దాహికాశక్తి అగ్నిని, తేజము సూర్యుని, గంధము పృథ్విని వీడలేనట్లు సతీదేవి నిన్ను వీడి మనలేదు.

సనాతనజ్ఞానానందస్వరూపా, జ్ఞాననిధీ, శంకరా! నీవు పరాత్పరుడవైనపరమేశ్వరుడవు, కాని శోకవశమున నీస్వరూపమును మరచితివి. ప్రత్యేక జగత్తులోను ప్రతిజన్మమందు సుదిన, దుర్దినచక్రము నిరంతరము భ్రమించు

చుండును. ఆసుదిన,దుర్దినములే సమస్తప్రాకృతప్రాణుల సుఖదుఃఖప్రాప్తికి ముఖ్యకారణములు. సుఖమువలన హర్షము, దర్పము, శౌర్యము, ప్రమాదము, రాగము, ఐశ్వర్యాభిరామ విద్వేషాదులు నిరంతరము ప్రాదుర్భవింపగలవు. దుఃఖమువలన శోకము, ఉద్వేగము, భయాదులు ప్రాప్తించగలవు. మహేశ్వరా! ఈసుఖదుఃఖముల బీజములు నశించినంతనే అవి నశింపగలవు. చంచల మనస్సే పుణ్యపాపములకు బీజము. శంభో! సర్వేంద్రియసహితమగు మనస్సు నాయంశ. సర్వప్రాకృతికకారణములకు జనకమైనఅహంకారమునకు అధిష్టానమైన చేతనత్వము నీవే. బ్రహ్మబుద్ధికి అధిష్టాతనైయున్నాడు.

పరబ్రహ్మపరమాత్మ ఒక్కడే. గుణభేదములవలన ఆయన భిన్నభిన్న రూపములను ధరించును. ఆ పరబ్రహ్మతత్వము ఒక్కటైనను అనేకము లని గ్రహింపుము. శివా! పరబ్రహ్మము సగుణము నిర్గుణముకూడనై యున్నది. మాయారూపఉపాధి నాశ్రయించిన పరబ్రహ్మము సగుణము. మాయాతీతమైన, ప్రకృతిరహితమైనపరబ్రహ్మము నిర్గుణమనబడెను. స్వేచ్ఛామయుడైనభగవంతుడు తనయిచ్ఛచేత వివిధరూపముల దర్శన మొసంగును. పరమాత్మ, పరబ్రహ్మముయొక్క ఆసంకల్పశక్తియే ప్రకృతి యనిగ్రహింపుము. ఆద్యాప్రకృతి నిత్యస్వరూపిణి, సర్వజనని. కొందఱుమహాత్ములు జ్యోతిస్వరూపమైనసనాతనబ్రహ్మ మొక్కటియే పరబ్రహ్మ మనివచింతురు. కొందఱు విద్వాంసులు ఆ పరబ్రహ్మము సదా ప్రకృతియుక్తమైయున్న కారణమున ద్వివిధ మనికీర్తింతురు. పరబ్రహ్మమొక్కటే యనివాదించువారి మతమును వినుము. పరబ్రహ్మము, మాయకు, జీవునకు అతీతము, ఆపరబ్రహ్మమునుండే ఆ రెండుప్రకటితములగును; కావున ఆపరబ్రహ్మము సర్వకారణము. అదియొక్కటియైనను స్వేచ్ఛగ రెండుకాగలదు. ఆయన యిచ్ఛాశక్తియే సర్వశక్తులకు జనని యైనప్రకృతి. ఆప్రకృతిచే సంయుక్తుడైనకారణమున పరమాత్మ సగుణు డనబడెను. ఆ సచ్చిదానందవిగ్రహుడే సర్వాధారుడు సనాతనుడు, సర్వేశ్వరుడు, సర్వసాక్షి సర్వత్ర సకలఫలప్రదాత. జీవులు ధరించుశరీరములుకూడ రెండుప్రకారములుగ కలవు, ఒకటి నిత్యశరీరము; రెండవది ప్రాకృతశరీరము, నిత్యశరీరము అక్షరము, వినాశరహితము, కాని ప్రాకృతశరీరము సదా నశ్వరము. మనయిర్వురిశరీరములు నిత్యములు, శాశ్వతములు, అక్షరములు, మనయంశభూతములైనయన్యజీవులశరీరములు త్రిగుణా

త్మక మైనప్రకృతిచే నుత్పన్న మైనకారణమున ప్రాకృతము లనబడినవి. ప్రాకృతశరీరములు సదా నశింపగలవు. రుద్రాదులు నీయంశసంభూతులు, విష్ణ్వాదులు నాయంశోద్భవులు. నాకుకూడ రెండురూపములు కలవు. ఒకటి ద్విభుజరూపము, రెండవది చతుర్భుజరూపము. చతుర్భుజుడనై నేను వైకుంఠ పరంధామమున శ్రీమహాలక్ష్మితో వైష్ణవపార్షదులతో విరాజిల్లెదను. ద్విభుజ రూపమున నేను శ్రీకృష్ణుడనై గోలోకపరంధామమున రాధతో, గోప గోపికలతో ప్రకాశింతును.

పరబ్రహ్మము ద్వివిధ మనివచించువారిమతమందు రెండుప్రధాన తత్త్వములు కలవు. నిత్యపురుషుడు, రెండవది నిత్యప్రకృతియగునీశ్వరి. శివా! వా రిర్వురు సదా పరస్పరసంయుక్తులై యుందురు. వారే సకలమునకు జననీ జనకులు. ఆప్రకృతిపురుషులు తమయిచ్ఛానుసారముగ నొకప్పుడు సాకారులు కాగలరు, మఱియొకప్పుడు నిరాకారులుకాగలరు. వారిర్వురు సర్వస్వరూపులే. పురుషునకు నిత్యప్రధానత యున్నట్లే ప్రకృతికిగూడ ప్రధానతకలదు. దేవా! నీవు సతిని మరలపొందవలెనన్న అయ్యాద్యాప్రకృతియగు నీశ్వరిని స్తుతింపుము. నీవే పూర్వకాలమందు దుర్వాసునకు ప్రసన్నతాపూర్వకముగ నీస్తోత్రము నుపదేశించితివి, ఆ స్తోత్రమే కణ్వశాఖయందు వర్ణింపబడెను. ఆ ప్రకృతి స్తోత్రముద్వారా జగదంబను ఆరాధింపుము. శివా! నా యాశీర్వాదమువలన నీశోకము నశించుగాక, నీకు శుభము కల్గుగాక, నీకు పత్నీవియోగదుఃఖము నశించుగాక.

నారదా! ఇట్లు రమాపతి యగుశ్రీమన్నారాయణుడు మహేశ్వరునకు తత్త్వబోధయొనరించి కర్తవ్యము నుపదేశించెను. ఆ క్షణమునందే శంకరుడు పవిత్రగంగాజలములందు స్నానమాచరించి శ్రీకృష్ణునకు అనేక ప్రణామము లర్పించి, శరీరము పులకింపగ ప్రకృతిని స్తుతింప నారంభించెను.

మహేశ్వర ఉవాచ :

ఓం నమః ప్రకృత్యై

బ్రాహ్మి బ్రహ్మస్వరూపే త్వం మాం ప్రసీద సనాతని ।
పరమాత్మస్వరూపే చ పరమానన్దరూపిణి ॥

భద్రే భద్రప్రదే దుర్గే దుర్గఘ్నే దుర్గనాశిని ।
పోతస్వరూపేఽజీర్ణే త్వం మాం ప్రసీద భవార్ణవే ॥

సర్వస్వరూపే సర్వేశి సర్వబీజస్వరూపిణి ।
సర్వాధారే సర్వవిద్యే మాం ప్రసీద జయప్రదే ॥
సర్వమఙ్గలరూపే చ సర్వమఙ్గలదాయినీ ।
సమస్తమఙ్గలాధారే ప్రసీద సర్వమఙ్గలే ॥
నిద్రే తన్ద్రి క్షమే శ్రద్ధే తుష్టిపుష్టిస్వరూపిణీ ।
లజ్జే మేధే బుద్ధిరూపే ప్రసీద భక్తవత్సలే ॥
వేదస్వరూపే వేదానాం కారణే వేదదాయినీ ।
దయే జయే మహామాయే ప్రసీద జగదమ్బికే ।
క్షాన్తే శాన్తే చ సర్వాన్తే క్షుత్పిపాసాస్వరూపిణి ॥
లక్ష్మీర్నారాయణక్రోడే స్రష్టుర్వక్షసి భారతి ।
మమ క్రోడే మహామాయే విష్ణుమాయే ప్రసీద మే ॥
కలాకాష్ఠస్వరూపే చ దివారాత్రిస్వరూపిణీ ।
పరిణామప్రదే దేవీ ప్రసీద దీనవత్సలే ॥
కారణే సర్వశక్తీనాం కృష్ణస్యోరసి రాధికే ।
కృష్ణప్రాణాధికే భద్రే ప్రసీద కృష్ణపూజితే ॥
యశఃస్వరూపే యశసాం కారణే చ యశఃప్రదే ।
సర్వదేవీస్వరూపే చ నారీరూపవిధాయిని ॥
సమస్తకామినీరూపే కలాంశేన ప్రసీద మే ।
సర్వసమ్పత్స్వరూపే చ సర్వసమ్పత్ప్రదే శుభే ॥
ప్రసీద పరమానన్దే కారణే సర్వసమ్పదామ్ ।
యశస్వినాం పూజితే చ ప్రసీద యశసాం నిధే ॥
ఆధారే సర్వజగతాం రత్నాధారే వసున్ధరే ।
చరాచరస్వరూపేచ ప్రసీద మమ మా చిరమ్॥
యోగస్వరూపే యోగీశే యోగదే యోగకారణే ।
యోగాధిష్ఠాత్రి దేవీశే ప్రసీద సిద్ధయోగిని ॥
సర్వసిద్ధిస్వరూపే చ సర్వసిద్ధిప్రదాయిని ।
కారణే సర్వసిద్ధీనాం సిద్ధేశ్వరి ప్రసీద మే ॥
వ్యాఖ్యానం సర్వశాస్త్రాణాం మతభేదే మహేశ్వరీ ।
జ్ఞానే యదుక్తం తత్సర్వం క్షమస్వ పరమేశ్వరీ ॥
కేచిద్వదన్తి ప్రకృతేః ప్రాధాన్యం పురుషస్య చ ।
కేచిత్తత్ర మతద్వైధే వ్యాఖ్యాభేదం విదుర్బుధాః ॥

మహావిష్ణోర్నాభిదేశే స్థితం తం కమలోద్భవమ్ ।
మధుకైటభౌ మహాదైత్యౌ లీలయా హన్తుముద్యతౌ ॥

దృష్ట్వా స్తుతిం ప్రకుర్వన్తం బ్రహ్మాణం రక్షితుం పురా ।
బోధయామాస గోవిన్దం వినాశహేతవే తయోః ॥

నారాయణస్త్వయా శక్త్యా జఘాన తౌ మహాసురౌ ।
సర్వేశ్వరస్త్వయా సార్ధమనీశోఽయం త్వయా వినా ॥
పురా త్రిపురసంగ్రామే గగనాత్ పతితే మయి ।
త్వయా చ విష్ణునా సార్ధం రక్షితోఽహం సురేశ్వరీ ॥
అధునా రక్ష మామీశే ప్రదగ్ధం విరహాగ్నినా ।
స్వాత్మదర్శనపుణ్యేన క్రీణీహి పరమేశ్వరీ ॥

ఇదం శివకృతం స్తోత్రం ప్రకృత్యా యః పఠేన్నరః ।
న భవేత్కామినీభేదస్తస్య జన్మని జన్మని ॥

ఇహలోకే సుఖం భుక్త్వా స యాతి శివమన్దిరమ్ ।
ధర్మార్థకామమోక్షాంశ్చ లభతే నాత్ర సంశయః ॥ 74—108

బ్రాహ్మీ! నీవు బ్రహ్మస్వరూపిణివి. సనాతనీ! పరమాత్మ స్వరూపిణీ! పరమానందరూపిణీ! నీవు నాకు ప్రసన్నురాలవుగమ్ము. భద్రా! నీవు భద్రవు. అనగా కళ్యాణములను ప్రసాదించుదానవు. దుర్గా! నీవు దుర్గమములైన సంకటములనైనను నివారణమొనరింపగలవు, దుర్గతిని నశింపజేయగలదానవు. భవసాగరమును దరించుటకు నీవు నూతనము సుదృఢమునగు నౌకాస్వరూపిణివి. దేవీ! నాపై కృపను బ్రసరింపజేయుము. సర్వస్వరూపిణీ! సర్వేశ్వరీ! సర్వబీజ స్వరూపిణీ! సర్వాధారా! సర్వవిద్యా! విజయప్రదా! నాపై ప్రసన్నురాలవు గమ్ము. సర్వమంగళా! నీవు సర్వమంగళస్వరూపిణివి. సర్వమంగళప్రదాయినివి, సర్వమంగళములకు ఆధారభూతవు నాపై కరుణింపుము. భక్తవత్సలా! నీవే నిద్రవు. తంద్రవు, క్షమవు, శ్రద్ధవు, తుష్టివి, పుష్టివి, లజ్జవు, మేధవు, బుద్ధి రూపిణివి. దేవీ! నాకు ప్రసన్నురాలవుకమ్ము. వేదమాతా! నీవు వేద స్వరూపిణివి, వేదములకు గారణము, వేదజ్ఞానప్రదాయినివి, వేదవేదాంగ స్వరూపిణివి, నాపై నీకృపావృష్టిని గురిపింపుము. జగదంబికా! నీవు దయవు, జయవు, మహామాయవు, క్షమాశీలవు, శాంతివి, సర్వాంతకివి, భ్రాంతినాశా స్వరూపిణివి; నాపై ప్రసన్నురాలవుకమ్ము. విష్ణుమాయా! నీవు నారాయణుని అంకమందు శ్రీమహాలక్ష్మివి, బ్రహ్మవక్షఃస్థలమందు సరస్వతివి, నా(శివుని)

అంశమందు మహామాయవు; దేవీ! నన్ను గరుణింపుము. దీనవత్సలా! నీవు కళవు, దిశాస్వరూపిణివి, దినరూపిణివి, రాత్రిస్వరూపిణివి, కర్మఫలప్రదాయినివి; దేవీ! నాపై ప్రసన్నురాలవుగమ్ము. రాధికా! నీవు సకలశక్తులకు గారణము, శ్రీకృష్ణహృదయమందిర నివాసినివి, శ్రీకృష్ణప్రాణాధికప్రియవు, శ్రీకృష్ణునిచే బూజింపబడుదానవు; నాపై గృపను జూపుము. దేవీ! నీవు యశఃస్వరూపిణివి, సర్వయశస్సులకు కారణభూతవు, యశఃప్రదాయినివి, సర్వదేవీస్వరూపిణివి, అఖిలనారీస్వరూపములను సృష్టియొనరించుదానవు. నీవు నీకలాంశమాత్రముననే సర్వస్త్రీరూపములను ధరించినదానవు, సర్వసంపత్స్వరూపిణివి, సకలసంపత్ప్రదాయినివి; దేవీ! నాకు బ్రసన్నురాలవుకమ్ము. దేవీ! నీవు పరమానందస్వరూపిణివి, సర్వసంపదలకు గారణస్వరూపిణివి యశస్వులచే పూజింపబడునీవు యశములకు నిధివి, నాపై గరుణింపుము. దేవీ! నీవు సమస్త జగములకు, రత్నములకు ఆధారస్వరూపిణి యైనవసుంధరవు, చరాచర స్వరూపిణివి, నాకు శీఘ్రముగ ప్రసన్నురాలవుకమ్ము. సిద్ధయోగినీ! నీవు యోగస్వరూపిణివి, యోగులకే స్వామినివి, యోగప్రదాయినివి, యోగములకే కారణభూతవు, యోగములకు అధిష్ఠాత్రీదేవివి, సకలశక్తులకు ఈశ్వరివి; నన్ను గృపతో బాలింపుము. సిద్ధేశ్వరీ! నీవు సిద్ధిస్వరూపిణివి, సమస్తసిద్ధిప్రదాయినివి, సకలసిద్ధికారణస్వరూపిణివి, నాకుప్రసన్నురాలవుగమ్ము. మాహేశ్వరీ! విభిన్నమతానుసారముగ సమస్తశక్తులకు గలవ్యాఖ్యానమునకు తాత్పర్యము నీవే. జ్ఞానస్వరూపిణీ! పరమేశ్వరీ! నే నేమైన అనుచితములను బలికిన వాని నన్నింటిని క్షమింపుము.

కొందఱు విద్వాంసులు ప్రకృతినే ప్రధానమని వచింతురు, మఱి కొందఱు పురుషుడే ప్రధమని దలివక్కాణింతురు. మహాత్ములు ఈరెండు రకములమతములు సత్యము లనివచింతురు. పూర్వము ప్రళయకాలమందేకార్ణవజలములపై శయనించినమహావిష్ణువునాభికమలమునుండి ప్రాదుర్భవించినబ్రహ్మను మధుకైటభు లనుమహాదైత్యులు సంహరించుట కుద్యుక్తులు కాగా, బ్రహ్మ తన్నుతాను రక్షించుకొనుటకు నిన్ను స్తుతించెను. బ్రహ్మ స్తుతిచేయుట గాంచి నీవు దైత్యులను సంహరించుటకు జలములపై యోగనిద్రామగ్నుడై శయనించి యున్నమహావిష్ణువును మేల్కొల్పితివి. ఆ సమయమున నారాయణుడు నీశక్తిసహాయముతో నాదైత్యులను వధించెను. భగ

వంతుడు నీసహాకారమువలననే సర్వకార్యములందు సమర్థుడైనాడు. సురేశ్వరీ! పూర్వకాలమందు త్రిపురాసురులతో సంగ్రామ మొనరించునేను వ్యోమ పథమునుండి పతితుడను కాగా ఆ సమయమున నీవే విష్ణువుతో గూడ సాక్షా త్కరించి నన్ను రక్షించితివి. ఈశ్వరీ! ఈ సమయమందు నేను విరహాగ్నితో జ్వలించుచున్నాను; నీవు తక్షణమే నన్ను రక్షింపుము. పరమేశ్వరీ! నీదర్శన పుణ్యముతో క్రీతుడ నైన నన్ను నీదాసునిగ గ్రహింపుము.

శివునిచే స్తుతింపబడిన యీప్రకృతిస్తోత్రమును పఠించువానికి జన్మ జన్మములందును పత్నీవియోగము సంభవింపదు, అతడు ఇహలోకమందు సుఖముల ననుభవించి ధర్మార్థ కామమోక్షము లనుచతుర్విధపురుషార్థములను బొంది అంత్యకాలమున శివలోకము జేరగలడు; ఇం దెట్టి సంశయములేదు.

ఇట్లు స్తుతించి మౌనమువహించిన శంభునకు గగనతలమందు రత్న నిర్మితరథారూఢయై ప్రకృతిదేవి ప్రసన్నత్వముతో దర్శన మొసంగెను. ఆమెకు నూఱు భుజములు కలవు. ఆ దేవేశ్వరి అంగకాంతి తప్తసువర్ణ సదృశము. ఆమె రత్నమయాభూషణవిభూషిత. దేవిప్రసన్నముఖారవిందముపై చిరునవ్వులు చిందులాడుచున్నవి. జగన్మాతయు, ఆద్యాప్రకృతియు, ఈశ్వరియు నగుసతిని దర్శించి విరహాసక్తుడైనయీశ్వరుడు మరల అనేకవిధముల నామెను స్తుతించి దుఃఖించుచు తనవిరహాజనితక్లేశముల నామెకు నివేదించెను. తదనంతర మాయన తాను సతీదేవియస్థిమాలను, ధరించుకొనినసతీదేవిభస్మ మును బ్రకృతికి జూపి తనప్రేమను నిరూపణ మొనరించెను. తదనంతరము అనేకప్రకారముల పరిహారము లొనరించి శంకరుడు ప్రకృతిదేవిని బ్రసన్నురాలిగ జేసికొనెను. ఆసమయమందు నారాయణుడు, బ్రహ్మ, ధర్మదేవత, అనంతాది సకలదేవతలు, మహర్షులు, ప్రకృతి ననేకవిధముల స్తుతించి "ఈశ్వరీ! శివుని రక్షింపు"మని ప్రార్థించిరి. వీరందఱియభ్యర్థనములను, స్తోత్రములను ఆలకించి యీశ్వరియత్యంతప్రసన్నురాలై తనప్రాణవల్లభు డైనశివుని సంబోధించి కృపతో "మహాదేవా! నీవు ధైర్యమును బూనుము. నీవు నాకు ప్రాణముల కంటె నధికప్రియమైనవాడవు. యోగీశ్వరా! నీవే నాయాత్మవు. జన్మజన్మము లందు నాస్వామివి. మహేశ్వరా! నేను మరల పర్వతరాజదంపతు లైనమేనా హిమవంతులకు పుత్రికనై యవతరించి నీయర్ధాంగిని కాగలను; కావున నీవు విరహవేదనమును బరిత్యజింపు మనిపలికి శివునియోదార్చి అంతర్హితయయ్యెను.

మహేశ్వరుడు హర్షోల్లసిత హృదయాంతరంగుడై స్వగణసహితముగ కైలాస మునకు వెడలిపోయెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున హరశోకాపనోదన మను
నలుబదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.

— ० —

## నలుబదినాలుగవ అధ్యాయము

### పార్వతీపరిణయవర్ణనము

శ్రీకృష్ణభగవానుడు పలికెను:

రాధికా! వశిష్ఠమహర్షి ప్రవచించినపూర్వోక్తేతిహాసముల నాలకించి సర్వసేవకపత్నీసహితముగ హిమవంతుడు ఆశ్చర్యచకితుడయ్యెను. కాని పార్వతి మాత్రము లోలోపలే నవ్వుకొనుచుండెను. అరుంధతీదేవి మేనాదేవికిగూడ శివునిమాహాత్మ్యమును అనేకవిధముల వర్ణించి యామెను బ్రసన్నురాలిగ నొనరించెను. అపుడు హిమాలయాదులు ప్రసన్నచిత్తులై మంగళకార్య సంపాదన మొనరింపదొడంగిరి. ప్రియా! తదనంతరము వశిష్ఠునియాజ్ఞాను సారముగ హిమవంతు డసంఖ్యాకమైవాహికసామగ్రిని ప్రోవుచేసి సర్వులకు కళ్యాణనిమంత్రణపత్రములను పంపెను. ఆగిరిరాజు వినమ్రుడై శివునిసమ్ముఖ మునకు కళ్యాణపత్రికను బంపి వివాహార్థము మిష్టాన్నములను, దివ్యవస్త్రా దులను, స్వర్ణరత్నాదులను అపారముగ బంపెను. మేనాదులు పార్వతికి మంగళస్నాన మొనరించి ఆమెను దివ్యవస్త్రాభూషణములచే యనేకవిధముల నలంకరించిరి. పార్వతి నేత్రములందు కాటుకను, పాదములందు పారాణిని అలంకరించుకొని త్రిభువనసుందరివలె శోభిల్లెను.

కైలాసమందు సర్వదేవతలు వివిధవాహనములపై, రత్నమయరథ

ములపై నారూఢులై పెండ్లికుమారుడైన శంకరుని దోడ్కొని విజయానంద కోలాహలములతో బయనించుచు హిమవంతుని గృహమును జేరిరి. వారందరికి స్వయముగ శైలేంద్రుడు స్వాగతము పల్కి చిత్రవిచిత్రసువర్ణరత్ననిర్మిత వసతిగృహములను వారికి విడిదిగృహములుగ వినియోగించి వారిసేవలకు అసంఖ్యాకభృత్యులను నియమించెను. తదనంతరము వినతానందనుడైన గరుత్మంతునిపై నధిరోహించి శ్రీమన్నారాయణుడు తనపార్షదసహితముగ నరుదెంచి రత్నసింహాసన మలంకరించెను. హరిపార్షదులు వింజామరలను వీయుచుండగ మహర్షులు, దేవతలు అనేకవిధముల స్తుతులొనర్పగ శ్రీహరి మందస్మితముఖారవిందుడై భక్తానుగ్రహకాతరుడై విరాజిల్లెను. శ్రీహరి చెంతనే సర్వదేవతాసహితుడై జగత్పతి యగుబ్రహ్మ ఆసీనుడైనాడు. ఆసమయమున హిమవంతాదులు, సకలదేవతలు స్వాగతములు పలుకుచుండగ శంకరుడు దివ్యరథమును డిగ్గి హిమవంతునిగృహమందు రత్నసింహాసన మలంకరించెను.

తరువాత శివుని దర్శించుటకు వస్త్రాభరణవిభూషితలై శైలేంద్రనగర స్త్రీలు పెండ్లిగృహమును ప్రవేశించిరి. వారియందు బాలికలు, యువతులు వృద్ధస్త్రీలుకూడ కలరు. ఋషికన్యలు, దేవకన్యలు, నాగకన్యలు, గంధర్వ కన్యలు పర్వతరాజకన్యకలు హరునిదర్శించుట కరుదెంచిరి. మేనయానన్యకలతో గలసి పెండ్లికుమారుడైనశివుని దర్శించెను.

చారుచమ్పకవర్ణాభమేకవక్త్రం త్రిలోచనమ్ ।
ఈషద్ధాస్యప్రసన్నాస్యం రత్నాభరణభూషితమ్ ॥

చన్దనాగరుకస్తూరీ చారుకుఙ్కుమభూషితమ్ ।
మాలతీమాల్యసంయుక్తం సద్రత్నముకుటోజ్జ్వలమ్ ॥

వహ్నిశౌచేనాతులేన చాతిసూక్ష్మేణ చారుణా ।
అమూల్యవస్త్రయుగ్మేన విచిత్రేణాతిభూషితమ్ ॥

రత్నదర్పణహస్తం చ కజ్జలోజ్జ్వలలోచనమ్ ।
సర్వయా ప్రభయాచ్ఛన్నమతీవ సుమనోహరమ్ ॥

అతీవతరుణం రమ్యైర్భూషితాఙ్గైశ్చ భూషితమ్ ।
బిభ్రన్తం రూపమతులం పరం నారాయణాజ్ఞయా ॥

యోగస్వరూపం యోగేశం యోగీన్ద్రాణాం గురోర్గురుమ్।
స్వేచ్ఛామయం గుణాతీతం బ్రహ్మజ్యోతిః సనాతనమ్ ॥

గుణభేదాద్రూపభేదం ధత్తేఽనన్తమరూపకమ్ ।
కారణం తం భవస్థానాం సృష్టిస్థిత్యన్తకారణమ్॥

సర్వాధారం సర్వబీజం సర్వేశం సర్వజీవనమ్ ।
సాక్షిరూపం నిరీహం చ పరమానన్దమక్షరమ్ ॥

ఆద్యన్తమధ్యరహితం సర్వాద్యం సర్వరూపకమ్ ।
దృష్ట్వా జామాతరం మేనా జహౌ శోకం ముదాన్వితా॥ 31-39

మనోహరమైన చంపకపుష్పములవలె గౌరవర్ణము కలవాడు, ఒక ముఖము మూడు నేత్రములు గలవాడు, చిరునవ్వుచే ప్రసన్నమైన ముఖముగలవాడు, రత్నాభరణభూషితుడు, చందనాగరుకస్తూరీకుంకుమములచే భూషితుడైనవాడు, మాలతీమాలలతో గూడియున్నవాడు, శ్రేష్ఠరత్నములతో గూర్చబడిన కిరీటమును ధరించినవాడు, అగ్నిశుద్ధములు అనుపమములు అతిసూక్ష్మములు సుందరములు అమూల్యములు నగువస్త్రములనుధరించినవాడు, రత్నదర్పణమును హస్తమున ధరించినవాడు, కాటుకచే నుజ్జ్వలములైన లోచనములుగలవాడు, సమస్తమైన కాంతిచే భిన్నమైనవాడు, అతిమనోహరమైనవాడు, అత్యంతరమణవయస్కుడు, రమ్యములైన భూషణభూషితములైన అంగములుగలవాడు, నారాయణాజ్ఞచే సాటిలేని యుత్కృష్టమైన రూపమును ధరించినవాడు, యోగస్వరూపుడు, యోగేశుడు, యోగీంద్రులగురువులకు గూడ గురువైనవాడు, స్వేచ్ఛామయుడు, గుణాతీతుడు, బ్రహ్మజ్యోతియు, సనాతనుడు, గుణభేదముచే ననేకరూపముల ధరించినవాడు, అనంతుడు, అరూపకుడు, భవస్థానులకు గారణమైనవాడు, సృష్టిస్థితిలయములకు గారణమైనవాడు, సర్వాధారుడు, సర్వబీజుడు, నిరీహుడు, పరమానందుడు, అక్షరుడు, ఆదిమధ్యాంతరహితుడు, సర్వాద్యుడు, సర్వరూపుడు, తనకు జామాతయగు పరమేశ్వరుని జూచి మేన శోకమును విడచి పరమానందభరితయయ్యెను.

పతి ధన్యురాలు, పార్వతి చరితార్థురాలు అనియనేకవిధముల ఆనవాగత యువతులందఱు హిమరాజకన్యకయొక్క సౌభాగ్యమును వేనోళ్ళ ప్రశంసించిరి. కొందఱు "అహా" దుర్గ యెంతభాగ్యశాలిని యనిఆశ్చర్యమువొందిరి.

స్త్రీలందఱు తమజీవితములో శంకరునివంటి వరుని గాంచలేదనియు గుసగుసలాడిరి.

హిమవంతునిగృహమందు వాద్యగాండ్రు భిన్నభిన్నరాగములతో వివిధవాద్యములను ప్రయోగించుచు మధురసంగీతమును వినిపించుచుండగా గానము నొనరించిరి. అపుడు హిమవంతుని అంతఃపురపరిచారికలు శంకరుని తోడ్కొని గజగమనముతో వివాహమంటపమును ప్రవేశించి యామెను రత్నసింహాసనముపై గూర్చుండబెట్టిరి. శివపార్వతులయెదుట రత్నమయమగు కళ్యాణవేదిక శోభిల్లుచుండెను.

> కస్తూరీబిన్దుభిః సార్ధ్రసిన్దూర బిన్దుభూషితామ్ ।
> చారుచన్దనచన్ద్రాభాం నమ్రభాలస్థలోజ్జ్వలామ్ ।
> రత్నేన్ద్రసారహారేణ వక్షఃస్థలవిభూషితామ్ ॥
>
> త్రినేత్రద త్తనేత్రా న్తామన్యవారిత లోచనామ్ ।
> అతీషద్ధాస్యయు క్తాస్యాం సకటాక్షం మనోహరామ్ ॥
>
> రత్నకేయూరవలయరత్నకఙ్కణమణ్డితామ్ ।
> రత్నపాశకసంస క్తాం క్వణన్మంజీరరంజితామ్ ॥
>
> అమూల్యాతుల్యచిత్రాఢ్య వస్త్రయుగ్మసుశోభితామ్ ।
> సద్రత్నకుణ్డలాభ్యాం చ చారుగణ్డస్థలోజ్జ్వలామ్ ॥
>
> మణిసారప్రభాముష్టద న్తరాజివిరాజితామ్ ।
> రత్నదర్పణహ స్తాం చ క్రీడాపద్మం విభూర్ణతీమ్ ॥
>
> చన్దనాగరుకస్తూరీ కుఙ్కుమేనాఙ్గచర్చితామ్ ।
> ముదితా ద దృశుః సర్వే జగదాద్యాం జగత్ప్రసూమ్॥ 47—52

కస్తూరీబిందువులచేత స్నిగ్ధసిందూరబిందువులచేత అలంకరింపబడినదియు, సుందరమైన చందనమువంటి చంద్రునివంటి కాంతికలదియు, నమ్రమైనఫాలప్రదేశముచే ఉజ్జ్వలమైనదియు, రత్నేంద్రసారహారములచే విభూషితమైనవక్షస్థలముకలదియు, పరమేశ్వరునిపై నుంచబడినక్రిగంటిచూపులుగలదియు, అన్యవారితలోచనములుగలదియు, చిరునవ్వుచే గూడినముఖముగలదియు, మనోహరములైనకటాక్షములు గలదియు, రత్నకేయూరవలయములచేత రత్నకంకణములచేత అలంకృతయు, రత్ననిర్మితమైనవడ్డాణముచే శోభిల్లుకటి

ప్రదేశముగలదియు, ధ్వనించుమంజీరములచే శోభిల్లుపాదములుగలదియు, అమూల్యములు అతుల్యములు విచిత్రములు నగువస్త్రములచే శోభితయు, స్వరత్నకుండలములచే మెఱయు కపోలములు గలదియు, మణిసారప్రభను హరించు దంతపంక్తిచే విరాజిల్లుచున్నదియు. రత్నదర్పణము చేతియందు గలదియు, క్రీడాకమలములను త్రిప్పుచున్నదియు, చందనాగరుకస్తూరీకుంకుమములచేత చర్చితములైనఅవయవములుగలదియు, జగత్తున కాదికారణమైనదియు, జగదంబయు నగుపార్వతిని జూచియందఱు మిగుల ప్రసన్నులైరి.

హర్షయుక్తుడైనత్రిలోచనుడుకూడ తనకీగంటిచూపులతో జగన్మాతయైనపార్వతిని దర్శించి అత్యంతానందభరితుడయ్యెను. పార్వతి సంపూర్ణాకృతి సతీదేవితో సమముగ నుండుట దర్శించి శంకరుడు తనవిరహతాపము నాక్షణముండే పరిత్యజించెను. హరుడు తనమనస్సును పూర్తిగ దుర్గ కర్పించి బాహ్యజ్ఞానమును మఱచినవాడై, పులకితగాత్రుడై ఆనందాశ్రుపూరితనయనుడయ్యెను. ఆ సమయముననే అత్యంతసంతుష్టాంతరంగుడై హిమవంతుడు పురోహితులు వెంటరాగా వస్త్రచందన దివ్యరత్నాభూషణముల నర్పించి యీశ్వరుని పార్వతికి వరునిరూపమున వరించెను. హిమవంతుడు జామాతకు పాద్యాద్యుపచారముల నర్పించి దివ్యసుగంధితకుసుమమాలికలచే నలంకరించి వేదమంత్రోచ్చారణపూర్వకముగ తనపుత్రికయైనపార్వతిని శివున కర్పించి కృతార్థుడయ్యెను. రాధా! త్రిలోకనాథుడైనజగదీశ్వరునే జామాతగ బడసిన మేనాహిమవంతులు అత్యంతధన్యులు. దేవీ! తదనంతరము అత్యంతప్రసన్నుడై హిమవంతుడు ఆదరపూర్వకముగ జామాతయైనశివున కనేకవిధ రత్నములను, సుందరరత్నజటితమనోహరపాత్రములను, లక్షకామధేనువులను రత్నజటితమైనయూయలను, అంకుశయుక్తసహస్రగజరాజులను, అలంకరింపబడిన మూడులక్షల అశ్వములను, శ్రేష్ఠరత్నాభూషణములచే నలంకృతలైన అసంఖ్యదాసీజనములను, పార్వతికంటె చిన్నవయస్కులైన సోదరసమానులైన నూర్గురుబ్రాహ్మణవటువులను, శ్రేష్ఠరత్నములచే నిర్మితములైన శతరమణీయరథముల నుపహారములుగ నర్పించెను. ఇట్లనేకము లగుకానుకలను త్రిభువనసుందరియైన తనపుత్రికను హిమవంతుడు పరమేశ్వరునకు దానమొనరించి పరిహార మనుస్తుతిచే శంకరుని స్తుతించెను. హిమవంతుడు తన రెండుహస్తములను ముకుళించి పులకితగాత్రుడై, భక్తిభావసమన్వితుడై,

ఆనందాశ్రుపూర్ణలోచనుడై మాధ్యందినశాఖయందు వర్ణింపబడిన స్తోత్రముచే వారు నిట్లుస్తుతించెను.

హిమాలయ ఉవాచ :

ప్రసీద దక్షయజ్ఞఘ్న నరకార్ణవతారక ।
సర్వాత్మరూప సర్వేశ పరమానన్దవిగ్రహ ॥
గుణార్ణవ గుణాతీత గుణయుక్త గుణేశ్వర ।
గుణబీజ మహాభాగ ప్రసీద గుణినాం వర ॥
యోగాధార యోగరూప యోగజ్ఞ యోగకారణ ।
యోగీశ యోగినాం బీజ ప్రసీద యోగినాం గురో ॥
ప్రళయప్రళయాద్యైక భవ ప్రళయకారణ ।
ప్రళయాన్తే సృష్టిబీజ ప్రసీద పరిపాలక ॥
సంహారకాలే ఘోరే చ సృష్టిసంహారకారణ ॥
దుర్నివార్య దురారాధ్య చాశుతోష ప్రసీద మే ॥
కాలస్వరూప కాలేశ కాలే చ ఫలదాయక ।
కాలబీజైక కాలఘ్న ప్రసీద కాలపాలక ॥
శివస్వరూప శివద శివబీజ శివాశ్రియ ।
శివభూత శివప్రాణ ప్రసీద పరమాశ్రియ ॥
ఇత్యేవం స్తవనం కృత్వా విరరామ హిమాలయః ।
ప్రశశంసుః సురాః సర్వే మునయశ్చ గిరీశ్వరమ్ ॥
హిమాలయకృతం స్తోత్రం సంయతో యః పఠేన్నరః ।
ప్రదదాతి శివస్తస్మై వాంఛితం రాధికే ధ్రువమ్ ॥

సర్వేశ్వరా, శివా! నీవు దక్షయజ్ఞమును విధ్వంసమొనరించినవాడవు, శరణాగతులను నరక మనెడుసముద్రమునుండి రక్షించువాడవు, సర్వులకు ఆత్మస్వరూపుడవు, పరమానందవిగ్రహుడవు, దేవా! నాపై ప్రసన్నుడవుగమ్ము, గుణవంతులందు శ్రేష్ఠుడవు; గుణసాగరుడవు, గుణాతీతుడవు, గుణయుక్తుడవు, గుణములకే స్వామివి. సకలగుణములకు ఆదికారణుడవు; ప్రభూ! నాపై ప్రసన్నుడవుగమ్ము. దేవా! నీవు యోగములకే శాశ్రయుడవు, యోగస్వరూపుడవు, యోగజ్ఞాతవు, యోగకారణుడవు, యోగీశ్వరుడవు, యోగులకే ఆదికారణుడవు, గురుడవు, నన్ను కరుణింపుము. భవా!

నీయందే సర్వప్రాణులు లయించును, కావున నీవే ప్రళయము, నీవే ప్రళయమునకు ఆదివి, కారణమునై యున్నావు. మరల ప్రళయాంతమందు నీవే సృష్టిబీజరూపుడవు. ఆసృష్టిని పరిపూర్ణముగ పరిపాలించువాడవు నీవే; దేవా! నాపై ప్రసన్నుడవుకమ్ము. భయంకరసంహారకాలమందు సృష్టిలయకారుడవు నీవే. నీవేగమును నిరోధించుట యెంతటివారికైనను అత్యంత కఠినమే. ఆరాధించినను నిన్ను బొందుట అసంభవము, కాని నీవు భక్తజన సులభుడవు; దేవా! నాపై ప్రసన్నుడవుకమ్ము. నీవు కాలస్వరూపుడవు, కాలమునకు స్వామివి, కాలానుసారముగ ఫలప్రదాతవు, కాలమునకే ఆది కారణము, నీవే కాలనాశకుడవు, పోషకుడవు, నాకు ప్రసన్నుడవుగమ్ము. నీవు కళ్యాణప్రదాతవు, కళ్యాణబీజము, కళ్యాణములకే ఆశ్రయము, దేవా! నీవే కళ్యాణమయుడవు, కళ్యాణమునకే ప్రాణము, సర్వాశ్రయా, శివా! నాపై ప్రసన్నుడవుగమ్ము.

ఇట్లుస్తుతించి హిమవంతుడు శివునియెదుట భక్తిభావముతో నిలువబడగ సమస్తదేవతలు, మహర్షులు గిరిరాజుయొక్క సౌభాగ్యమును వేనోళ్ళ పొగడిరి. నారదా! సావధానచిత్తుడై హిమవంతుడొనరించిన యీస్తోత్రమును పఠించువానికి శివుడు నిశ్చయముగ సకలవాంఛితములను ప్రసాదింపగలడు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున పార్వతీసంప్రదాన మను
నలుబదినాలుగవ అధ్యాయము
సంపూర్ణము.

# నలుబదియైదవ అధ్యాయము

## పార్వతీపరమేశ్వరుల కైలాసగమనము

శ్రీకృష్ణుడు పలికెను :

ప్రియా! తదనంతరము మహాదేవుడు వైదికవిధిచే నగ్నిని ప్రజ్వరిల్లజేసి పార్వతిని తనవామపార్శ్వమందు కూర్చుండబెట్టుకొని వైవాహికహోమము నొనరించెను. బృందావనవినోదినీ! ఆ యజ్ఞమును విధిపూర్వకముగ నెరవేర్చి శివుడు బ్రాహ్మణులకు నూఱుసువర్ణముద్రలను దక్షిణగనొసంగెను. ఆ సమయమునసే శైలేంద్రనగరస్త్రీలు ప్రదీపములను హస్తములందు ధరించి శివపార్వతులకు మంగళకార్యసంపాదన మొనరించి, ఆ నవదంపతులను అంతఃపురములోనికి తోడ్కొనివెడలిరి. ఆ స్త్రీరత్నము లందఱు ప్రేమపూర్వకముగ జయధ్వనుల నొనరించుచు శుభనిర్మంఛనాదికార్యములను సంపన్న మొనరించి మందస్మితముఖారవిందలై కటాక్షపూర్వకముగ శివునియలౌకికసౌందర్యమును వీక్షింపదొడంగిరి. ఆ సమయమందు వారిసర్వాంగములు పులకించినవి. శంకరుడత్యంతసుందరరూపముతోను వేషభూషణములతోను శోభితుడై యుండెను. ఆయన యంగము లన్నియు రత్ననిర్మితాభూషణములచే విభూషితములై యున్నవి. హరుడు చందనాగరుకస్తూరీకుంకుమాను లేపనములచే నలంకరించుకొనియుండెను. ఆయనప్రసన్నముఖారవిందముపై చిరునవ్వులు చిందులాడుచుండగ వీక్షించుచు సర్వులమనస్సులను మోహింపజేయుచుండెను. ఆయన యలంకారములు అపూర్వములు, సూక్ష్మములు హరునిశరీరకాంతి మనోహరచంపాకుసుమప్రభనే తిరస్కరించెను. ఆ సర్వాంగసుందరుడు నూతన యౌవనసంపన్నుడు, మహర్షుల చిత్తములనే మోహింపజేయుగలవాడు. ఆ ప్రదేశమున సరస్వతి, లక్ష్మి, సావిత్రి, గంగ, రతి, అదితి, శచి, లోపాముద్ర, అరుంధతి, అహల్య, తులసి, స్వాహా, రోహిణి, వసుధ, శతరూప, సంజ్ఞ– అనుపదునాఱుగురు దేవాంగనలు శివుని బరివేష్టించియుండిరి. వారేకాక ఎందఱో మనోహరరూపలావణ్యవతులైన దేవకన్యలు, నాగకన్యలు, మునికన్యలుకూడ ఆ ప్రదేశమున కఱుదెంచిరి. ఆ సమయమందు వధూవరుల వీక్షిం

చుటకు గిరిరాజుగృహమందు గూడినస్త్రీలసంఖ్య గణించుట కెంతటివారికైనను అసంభవమే యగును.

దివ్యాంగన లొసంగినరత్నసింహాసనముపై పెండ్లికొమరుడైనశివుడు ప్రసన్నతాపూర్వకముగ ఆసీనుడయ్యెను. ఆ సమయమందు షోడశదివ్యదేవాంగనలు సుధామధురవాణితో శంకరుని యనేకవిధముల అభినందించిరి. పార్వతీదేవిని యత్యంతానురాగముతో జూడవలసినదిగా వారు మరల సర్థించిరి. తదనంతర మాదేవాంగనలు వరునితో పరిహాసము లాడుచుండగ యోగులకు పరమగురువైన, నిర్వికారుడైన శంకరుడు ఆ పరిహాసపరాయణులైన దేవాంగనలతో "మీరందఱు పరమసాధ్వులు, జగన్మాతలు, మీరు మీపుత్రుడనైన నాతో నేలపరిహాసములాడెద"రనిపల్కెను. శివునివాక్కులను విని యాదేవాంగనలు చిత్రరుపులవలె స్తంభించి, ఆశ్చర్యచకితులై మహాదేవుని మనోనిగ్రహమును వేనోళ్ల పొగడిరి. ఆ దినమున శంకరుడు హిమవంతుని రాజప్రాసాదమందే విశ్రమించెను. ప్రాతఃకాలమున శ్రీమన్నారాయణుని యాజ్ఞానువర్తియై ధర్మదేవత శివునివిడిదిగృహమున బ్రవేశించి "ప్రమథేశ్వరా! నీకు కళ్యాణ మగుగాక. లెమ్ము, శ్రీహరిని స్మరించుచు మహేంద్రయోగమందు పార్వతీసహితుడవై స్వస్థలమునకు బయలుదేరుమనిపల్కెను. బృందావన వినోదినీ! ధర్మదేవత పలుకుల నాలకించి శంకరుడు పార్వతితో మహేంద్రయోగమందు స్వస్థలమునకు బయలుదేరెను. సర్వదేవతలు వేగముగ నలంకరించుకొని తమతమవాహనములపై నధిరోహించి శివపార్వతులతో కైలాసమునకు బయలుదేరిరి. చిన్ననాటినుండి యత్యంతప్రేమతో బార్వతిని పెంచిన మేన తనకుమార్తెను శంకరునకు అప్పగించుసమయమున అత్యంతదుఃఖితయై ఆయన నిట్లుప్రార్థించెను. "కృపానిధీ! నాపుత్రికను బ్రేమతో పాలింపుము. ఆమె వేలకొలది దోషములనైనను కరుణతో క్షమింపుము. నీవు ఆశుతోషుడవు (శీఘ్రము ప్రసన్నుడగువాడవు) నాకొమరిత జన్మజన్మములనుండి నీచరణారవిందములందే యనన్యభక్తికలిగియున్నది. నిద్రించుచున్నను, మేల్కాంచియున్నను ప్రతిసమయమందు నీమె నిన్నుదక్క అన్యుల నెవ్వరినైన స్మరింపదు. ఎవరైనను నన్నుగూర్చి భక్తిభావముతో పల్కిన ఆ ప్రసంగమును వినిన వెంటనే మాపార్వతి అంగాంగములు పులకించును, ఆనందాశ్రువులు ప్రవ

హించును. మృత్యుంజయా! నీనిందల నాలకించిన పార్వతి మరణించినదానివలె మౌనమువహించును.

ఆ సమయమునందే తండ్రి యైనహిమవంతుడు తనకొమారితను మహాదేవున కర్పించుచు పితృప్రేమను వీడలేక నుచ్చైస్స్వరముతో విలపింపదొడంగెను. ఆ గిరిరాజదంపతులను కృపానిధానుడైన నారాయణుడే ఆధ్యాత్మికజ్ఞానప్రబోధచే నూరడించెను. మహామాయాస్వరూపిణి యైన పార్వతికూడ భక్తిభావముతో తనతలిదండ్రులకు, గురువులకు ప్రణమిల్లి మాతనే ఆశ్రయముగ గైకొని రోదింపదొడంగెను. ఈ హృదయవిదారక పార్వతీదేవి అప్పగింతల దృశ్యమును గాంచి పత్నీసేవకగణసహితముగ సర్వదేవతలు, ఋషులుకూడ దుఃఖింపదొడంగిరి. తదనంతరము వారందఱు త్రుటికాలములోనే కైలాసమును జేరిరి. నవాగతదంపతులను గాంచి వారికి స్వాగతము పల్కుటకు మంగళకృత్యములను సంపాదన మొనరించుటకు దేవమానిపత్నులందఱు హారతులను హస్తములం దిడుకొని దంపతులకు నెదురేగిరి. వారియందు వాయుకుబేరశుక్రపత్నులు, బృహస్పతిపత్నితార, దూర్వాసపత్ని, అత్రిభార్య అనసూయ, చంద్రునిభార్యలు, దేవకన్యలు, నాగకన్యలు, మునికన్యలుకూడ కలరు. వారిని లెక్కించుట కెంతటివారికైనను అసాధ్యమే. వారందఱు కలసి సకలమంగళకార్యములను సంపన్న మొనరించి స్వాగతము పల్కుచు శివపార్వతులను గృహప్రవేశము గావించి రత్నసింహాసనములపై ఆసీనులుగ నొనరించిరి. భగవంతు డైనశివు డత్యంతప్రసన్నుడై పార్వతికి గృహమును చూపించుచు నిట్లుపల్కెను. "ప్రియా! నీకు నీగృహము జ్ఞప్తియందున్నదా! ఈ ప్రదేశమునుండే నీవు నీతండ్రి యైనదక్షుని నివాసమునకు వెడలితివి. అంతరమేమనగ ఈ సమయమందు నీవు గిరిరాజకుమారివి, ఆసమయమందు నీవు దక్షకన్యవు. దేవీ! నీకు పూర్వజన్మలవిషయము లన్నియు సదా స్మరణమునందుండగలవు, గావున వానిని నీకు జ్ఞాపకము జేయుచున్నాను. నీకు జ్ఞాపకమున్న విషయములను నాతో బల్కుము."

శంకరునివచనముల నాలకించి పార్వతి 'నాథా! నాకు సర్వము విదితమే. అందరిసమక్షమున వెనుకటివిషయములను చర్చింపకు' డనిప్రత్యుత్తర మొసంగెను. తదుపరి శివుడు శ్రీమన్నారాయణాది సకలదేవతలకు, మహర్షు

# నలుబదియాఱవ అధ్యాయము

## శ్రీ రాధికాకృష్ణ సంవాదవర్ణనము

రాధిక పలికెను :

శంకరుని కోపాగ్నికి బలియైన మన్మథుని మఱల రతి యెట్లు పొందగల్గెను? ప్రియుని సజీవునిగ బొంది, రతీదేవి యేమిచేసెను? స్త్రీలకు స్వస్వామి వియోగము మరణముకంటె నత్యంతదుఃఖదాయకము, దుష్కరము. భర్త తిరిగి లభించుట వారికి పరమదుర్లభసుఖము. ఎంతకాలమునుండియో సతీ వియోగజ్వాలలచే వ్యాకులుడైన శంకరుడు పార్వతిని మఱల పొంది యేమి చేసెను!

> కళత్ర విరహః పుంసాం సర్వశోకాత్ సుదుష్కరః ।
> పునః సమ్మిలనం తస్యాః ప్రాణదానాధికం సుఖమ్ ॥ 4

స్త్రీవిరహము పురుషుల కత్యంతదుష్కరము. మఱల సమాగమము ప్రాణదానముకంటె అధికసుఖకరము.

శ్రీ కృష్ణుడు పలికెను :

శ్వశురునిగృహమందు పత్నీసహితముగ కొలువున్న ఆశుతోషుడైన శంకరుని మన్మథుని యర్ధాంగి యగురతీదేవి తనకు పతిభిక్ష నొసంగవలసినదిగ ననేకవిధముల ప్రార్థించెను. తనచేలాంచలమందు భద్రపఱచియుంచిన మన్మథుని భస్మమును రతి పరమేశ్వరుని సమ్ముఖమున నుంచి యనేకవిధముల ప్రార్థించెను. భక్తానుగ్రహకారకుడైనచంద్రశేఖరుడు రతీదేవి ప్రార్థనలకు ప్రసన్నుడై మన్మథుని భస్మమును వీక్షింపగా ఆభస్మరాశినుండి మఱల కామదేవుడు ప్రాదుర్భవించెను. ఈమాహాత్మ్యరిణామమును గాంచి రతీసహితముగ పార్వత్యాదు లందఱు అత్యంతసంతుష్టాంతరంగులైరి. రతీమన్మథు లాదిదంపతుల కనేకప్రణామము లర్పించి, యనేకవిధముల స్తుతించి, చిరకాల మనుభవించిన విరహజ్వాల లుపశమించుటకు స్వేచ్ఛావిహారమునకై బయలుదేరిరి. మృతుడైనకామదేవుని మఱల శివానుగ్రహమువలన బొంది కామార్తయైనరతీదేవి భర్తతోగూడి స్వస్థలమునకు జేరెను. వారిద్దఱు

ములను నలంకరించుకొని రత్ననిర్మితరథము నధిరోహించి రతిక్రీడార్థమై శైలములందు, నదనదీతటములందు, సురమ్యద్వీపములందు, సింధుతటములందు మనోహరపుష్పోద్యానములందు భ్రమరధ్వనిసంయుక్తమై కోకిలల మధుర గానములచే ప్రతిధ్వనించు ననేకపుష్పోద్యానములందు ఏకాంతప్రదేశములందు అహర్నిశములు రతిక్రీడలు సల్పి పెక్కుకాలము సుఖముల ననుభవించిరి.

రాధికా! ఇపుడు శివశక్తుల దివ్యశృంగారవృత్తాంతమును వర్ణించెద నవధరింపుము ఈప్రసంగము వీనులకు సుధవంటిది. ఇదిపరమాశ్చర్యకరము, సర్వసంతాపహరము, సుఖప్రదము, పుణ్యప్రదము, శుభప్రదము. దేవీ! మామగారిగృహమున పత్నీసహితముగ శంకరుడు కొంతకాలము నివసించి తదనంతరము ప్రణయక్రీడార్థము అత్తమామల యనుజ్ఞ గైకొని పార్వతితో రత్నస్యందన మధిరోహించి బయలుదేరెను బహురత్నసారఖచితమైన ఆదివ్య రథము విశ్వకర్మచే నిర్మింపబడెను దివ్యరథారూఢులై ఉమాశంకరులు శత శృంగమందు. మలయాచలమందు, గంధమాదన పర్వతప్రాంతమందు, నందన వనమందు, పుష్పభద్రవనమందు, వారిభద్రవనమందు. భద్రవనమందు, అనేక సురమ్యములైన యేకాంతప్రదేశములందు, సాగరతటములందు యథేచ్ఛగ విహరించిరి. జగజ్జననితో జగత్పితి సహస్రాబ్దపర్యంతము మహాశృంగారమారం భించెను. వారిభారముచే పృథ్వి ఆక్రాంతముకాగా ఆవసుంధరాభారముచే ఆదిశేషుడు, ఆదిశేషునిభారముచే ఆదికూర్మము, ఆదికూర్మభారముచే సమస్త వాయుమండలము, వాయుమండలభారముచే ఆశ్రితులైన దేవతలు బ్రహ్మ సహితులై తమ్ము రక్షింపవలసినదిగ శ్రీమన్నారాయణుని ప్రార్థించిరి. శ్రీమన్నా రాయణుడు కమలోద్భవుని యుద్దేశించి యిట్లుపల్కెను. "విధాతా! ఆది దంపతుల దివ్యశృంగారక్రీడలను ఎవ్వరును నివారింపలేరు. సహస్రవర్షముల పిమ్మట స్వయముగ పరమేశ్వరుడే యాదివ్యక్రీడలను విరమింపగలడు.

స్త్రీపుంసో రతివిచ్ఛేదముపాయేన కరోతి యః ।
తస్య స్త్రీపుంసయోర్భేదో భవేజ్జన్మని జన్మని ॥
యాత్యన్తే కాలసూత్రే చ వర్షలక్షం స పాతకీ ।
భ్రష్టజ్ఞానో నష్టకీర్తిరలక్ష్మీకో భవేదిహ ॥ 43–44

స్త్రీపురుషుల రతికార్యమును విచ్ఛేదమొనరించినవారు జన్మజన్మాంత ములవరకు వియోగమనుభవింపగలరు, వారిహలోకమందు భ్రష్టజ్ఞానులైన

నష్టకీర్తులై, దరిద్రులై దుఃఖముల ననుభవించి అంత్యకాలమున కాలసూత్ర మను నరకమును లక్షవర్షములకాల మనుభవింపగలరు.

రంభతో నింద్రుడు కూడియుండగ దుర్వాసమహర్షి వారిని విచ్ఛేద మొనరించెను, కావుననే దూర్వాసమహర్షి కూడ బహుకాలము స్త్రీవిరహ మనుభవింపవలసివచ్చెను. ఒకదివ్యసహస్రవర్షములపిమ్మట శంకరుని కృప వలన నామునివర్యునకు ఏ.అల రెండవపత్ని లభించెను. రోహిణితో చంద్రుడు కూడియుండగ వారికి రతివిచ్ఛేద మొనరించుటచే గౌతమునకు స్త్రీవియోగము సంభవించెను. సహస్రదివ్యవర్షములు విరహజ్వర మనుభవించినపిమ్మట ఆమునివర్యుడు శివుని యారాధించి అహల్యను భార్యగ పొందగల్గెను, ఇట్లనేకోదాహరణములు కలవు. అజామిళు డను ద్విజశ్రేష్ఠుడు వృషలి యను స్త్రీతో గలిసియుండగ ఏదేవతలును వారికివిచ్ఛేద మొనరింపలేదు. కావున ఆద్విజు డత్యంతకాలమందు నాదివ్యనామ ముచ్చరించి ముక్తిపొందెను. సర్వము నిషేకసాధ్యము, విధాతా! నిషేకము అత్యంతబలవత్తరము, నిషేక ఫలప్రదాతను నేనే. నిషేకమును ఎవ్వరును నివారింపలేరు. సహస్రవర్ష దివ్య క్రీడానంతరము పరమేశ్వరునినుండి ప్రళయాగ్ని సదృశమైనదివ్యవీర్య మావిర్భవించి భూపతనముకాగలదు. ఆమహావీర్యమునుండియే తారకాసురుని వధించుటకు స్కందు డుద్భవింపగలడు. భద్రస్వరూపుడ నైననే నుండగ మీకేల భయము". ఇట్లు దేవతలను సమాధానపఱచి శ్రీమన్నారాయణుడు అంతఃపురమును ప్రవేశించెను. దేవత లందఱు స్వస్థచిత్తులై తమతమ గృహములకు వెడలిపోయిరి.

### శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! ఇట్లురాధతో సంభాషించి కటాక్షయుక్తుడై సస్మితముఖారవిందుడై ఆమెతో నిర్జనప్రదేశములందు, చందనవనమందు, సుగంధవాయువులు ప్రవహించు రమ్యనిర్జనప్రదేశములందు, పుష్పోద్యానములందు అనేకదివ్య క్రీడల నొనరించెను. నారదా! భగవంతుని యీదివ్యమంగళకర్మలను ఒకమాస పర్యంతము ఆలకించినవారికి ఎప్పుడును బంధువిచ్ఛేదము, పుత్రవిచ్ఛేదము, భృత్యవిచ్ఛేదము సంభవింపదు.

సూతమహర్షి పలికెను :

ఇట్లుధర్మపుత్రుడైన శ్రీనారాయణఋషీంద్రుడు భగవంతుని దివ్యలీలలను వర్ణింపగ తనివిదీరక దేవర్షి మరల శ్రీహరిలీలలను వర్ణింపవలసినదిగ ప్రార్థించెను. నారాయణఋషీంద్రుడు తనప్రవచనము నిట్లుకొనసాగించెను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున ఉమాశంకరవిలాస మను
నలుబదియారవ అధ్యాయము
సంపూర్ణము.

—: ౦ :—

# నలుబదియేడవ అధ్యాయము

## ఇంద్రదర్పభంగ వర్ణనము

నారదుడు పలికెను :

దేవా! క్రీడానంతరము రాధ శ్రీహరిని యేయే విషయములనుగూర్చి ప్రశ్నించెను? ఆ విభుడు జగన్మాతకు జెప్పిన దివ్యప్రసంగములను వర్ణింపవలసినదిగ నిన్ను ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను :

దివ్యక్రీడానంతరము రాధామాధవులు మలయాచలప్రాంతమున నొక విశాలవటవృక్షమూలమున సమాసీనులుకాగా, రాధ యత్యంతరహస్యమైన యింద్రదర్పభంగవిషయమును వివరింపవలసినదిగ భగవంతు నిట్లుప్రశ్నించెను.

శ్రీ రాధిక పలికెను :

జగద్గురూ! నేను నీనుండి శూలపాణియైనశివునియశమును దైవవశమున ఆయనకు సంభవించిన దర్పభంగవృత్తాంతమును శ్రవణ మొనరించితిని. పార్వతి

గర్వభంజనమును శివపార్వతుల కళ్యాణచరితములనుగూడ అవధరించితిని. ఇపుడు ఇంద్రాదులదర్పభంగ ప్రసంగములను క్రమముగ కృపతో వర్ణింప వలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ కృష్ణుడు పలికెను :

సుందరీ! ఇంద్రదర్పభంగప్రసంగము త్రిలోకములందు ప్రసిద్ధము, అనపమేయము. వీనుల కమృతసమానమధురము. ప్రాచీనకాలమందు ఘటిల్లిన ఘటనను వర్ణించెద నవధరింపుము. నూఱుమహాయజ్ఞములననుష్ఠించి ఇంద్రుడు సమస్త దేవతలకు స్వామియై మహదైశ్వర్యసంపన్నుడయ్యెను. అఖండతపః ప్రభావమున ఆ వజ్రపాణి యైశ్వర్యము దినదినాభివృద్ధిగాంచదొడంగెను. దేవగురువైన బృహస్పతి ప్రసాదించిన దివ్యమంత్రదీక్షను గైకొని పుష్కర తీర్థమందు నూఱుసంవత్సరములపర్యంత మాసిద్ధమంత్రమును జపించి యింద్రుడు మంత్రసిద్ధిపొంది పరిపూర్ణమనోరథు డయ్యెను.

బ్రహ్మస్వరూపాం ప్రకృతిం సమ్పన్మాథో న మన్యసే । 10

సంపదచే మోహితుడైన మూఢమనుష్యుడు బ్రహ్మస్వరూపిణి యైన ప్రకృతిని ఆదరింపడు.

కావున ధనమదాంధకారి యైన యింద్రుని ప్రకృతి శపించెను. తదనంతరము ఇంద్రునకు గురుశాపముకూడ సంభవించెను. ప్రకృతిశాపమువలన నత్యంతాహంకారపూరితుడై యింద్రుడు సభను ప్రవేశించు నాచార్యుని గాంచియు నమ్రభావముతో లేచి నిలువబడలేదు. ప్రణామమైనను చేయలేదు. ఇంద్రుని యిట్టియహంకారపూరితమైనయాచరణమునకు కోపించి బృహస్పతి "సకలసంపదలు నశించుగాక" యని శపించి సభయందు నిలువక తపమాచరించుటకు వెడలిపోయెను. పిమ్మట యింద్రుడు తా నొనరించినతప్పిదమును గ్రహించినవాడై అత్యంతదుఃఖితుడై బృహస్పతిగృహమునకు జని తారతో జరిగినదంతయు విన్నవించి రోదింపనారంభించెను. పుత్రసమానుడైన యింద్రుని దుఃఖమును గాంచి తారకూడ అత్యంతదుఃఖితయై "కుమారా! ఈ సమయమున నీకు గురుదర్శనము లభింపదు. నీదుర్దినములు అంతమైన పిమ్మటనే నీకు మఱల గురుదర్శనము లభింపగలదు. ఆయన కృపవలన లక్ష్మి లభించును. కావున నీవు స్వగృహమునకు వెడలిపొమ్ము. మూఢుడా! నీ

యంతఃకరణము దూషితమైనది. కావున నీవు స్వకర్మఫల మనుభవింపక తప్పదు. దుర్దినములందు గురువుపై దోషారోపణ మొనరించువాడు సుదినములందు సంతుష్టుడైయుండియు గురువునైనను గౌరవింపడు. ఇంద్రా! సుదినములు దుర్దినములు సుఖదుఃఖములకు కారణ" మనిపల్కి పతివ్రత యగుతారాదేవి మౌనమువహించెను. తదనంతరము ఇంద్రుడు చేయునదిలేక స్వగృహమునకు మఱలివచ్చెను. ఒకదినమున నింద్రుడు మందాకినీతటముపై విహరించుచుండగ ఆమందాకినీజలములందు స్నానమాచరించుచున్న గౌతమపత్ని యగు నహల్యను వీక్షించెను. త్రిలోకసౌందర్యవతి యైన యామెసౌందర్యమునకు ముగ్ధుడై యింద్రుడు బుద్ధినశింపగ గౌతమరూపమును ధరించి వంచనచే నాపతివ్రతను సమీపించెను. ఆ సమయమున నేతెంచిన గౌతమమహర్షిని గాంచి భయకంపితుడై యింద్రుడు ఆ మునివర్యునిచరణములపై బడెను. ఇంద్రునిపాపాచరణమునకు కోపించి గౌతము డిట్లుశపించెను. "ఇంద్రా! నీకు ధిక్కారము. నీవు కర్దమప్రజాపతి పుత్రుడవు, జ్ఞానియైన జగత్స్రష్ట యగుబ్రహ్మ పౌత్రుడవు. దేవతలందు శ్రేష్ఠుడ వైననీబుద్ధి యేలయిట్లువక్రించినది? నీమాతామహుడు దక్షుడు. జనని పతివ్రతయగునదితి. నీవంటివాడు ఇంత పతితు డగుట పరమాశ్చర్యకరవిషయము. నీవు వేదజ్ఞానసంపన్నుడవై జ్ఞాని యనికీర్తింపబడుచున్నావు, కాని నీకర్మ లన్నియు యోనిలంపటములు; కావున నీశరీరమందు సహస్రయోను లుద్భవించుగాక. ఒకవర్ష పర్యంతము నీవు యోనిదుర్గంధ మనుభవించి, తదనంతరము, సూర్యునియారాధనచే నీశరీరమం దున్న యోను లన్నియు నేత్రములుగ మారగలవు. నాశాపమువలన, గురుక్రోధమువలన తత్క్షణమే నీవు రాజ్యలక్ష్మీభ్రష్టుడ వయ్యెదవుగాక. మూఢా! నీ యాచార్యుడు మహాతేజస్వి, నా కత్యంతప్రేమపాత్రుడైనబంధువు కావున నిన్ను సంహరింపక కేవలము శపించితిని." పిమ్మట తనపాదముల పైబడి దుఃఖించుచున్న యహల్యను గాంచి గౌతమమహర్షి యిట్లుపల్కెను. "ప్రియా! నీవు ఈ క్షణమందే నీశరీరమును పాషాణ మొనర్చుకొని చిరకాలము వనమందు బడియుందుము. నీమనమం దెట్టిదురుద్దేశములే దనినాకు నిశ్చయముగ నవగతమే. ఇంద్రుడే స్వయముగ కామాసక్తుడై నిన్ను మోసగించెను. తన హృదయేశ్వరుడు పలికినపలుకుల నాలకించి యహల్య దుఃఖించుచు వనమునకు జని యఱువదివేలసంవత్సరములు పాషాణమై తనకర్మఫలము నామూలాగ్ర

మూగ వనుభవించి పిమ్మట శ్రీరామచంద్రునిపవిత్రదివ్యచరణస్పర్శచే పునీతురాలై స్వస్వరూపమును బొంది గౌతముని జేరి సుఖించెను.

సుందరీ, రాధికా! గురుకోపము వలన గతిమై పరిత్యతిశాపమువలన నిందుడు వివేకశూన్యుడై రాజ్యభ్రష్టుడయ్యెను. దైత్యులు దేవరాజ్యమాక్రమించగా నిందుడు వారివలన పీడితుడై భయభీతుడై జగద్గురువైన బ్రహ్మను శరణుజొచ్చెను. (బ్రహ్మయాజ్ఞానుసారముగ శక్రుడు (ఇందుడు) విశ్వరూపుని తనపురోహితునిగ నొనర్చుకొనెను. దైవవశమున దేవపతియొక్క బుద్ధి నశింపగ అతడు విశ్వరూపునిపై పరిపూర్ణవిశ్వాసముంచెను. విశ్వరూపుని జనని దైత్యవంశకన్య. కావున నతడు మనమందు దైత్యపక్షపాతముతో వర్తింపదొడంగెను. విశ్వరూపుని యంతరంగమును తెలిసికొనిన యింద్రుడు కుపితుడై దివ్యబాణప్రయోగముచే బ్రాహ్మణునిశిరమును ఖండించెను. విశ్వరూపుని తండ్రియైనత్వష్ట తన కుమారుని మరణవార్త నాలించి ఆ క్షణమందే రోషమునకు వశీభూతుడై "ఇన్ద్రశత్రో వివర్ధస్వ" (ఇందుని శత్రువులు వృద్ధిజెందెదరు గాక). అనిపల్కుచు నొకమహాయజ్ఞము నొనర్చెను. ఆ యజ్ఞకుండమునుండి వృత్రుడనుమహాసురుడుద్భవించి అనాయాసముగనే సమస్తదేవతలను రణరంగమందు ఘోరపరాభవము నొనరించెను.

అపుడు దైత్యమర్దనుడైనయిందుడు దధీచిమహర్షిని అస్థికల నర్థించి వానితో వజ్రాయుధ మొనరించి దేవకంటకుడైనవృత్రాసురుని వధించెను. అయినను యిందుని బ్రహ్మహత్యాపాతకము అత్యంతభయంకరియైనవృద్ధస్త్రీరూపమును ధరించి వానిని వెంబడించెను. ఆ ఘోరబ్రహ్మహత్యను గాంచి దేవపతి యత్యంతభయభీతుడై గురుదేవునిచరణములను స్మరించుచు సూక్ష్మరూపధారియై కమలనాళముద్వారా మానససరోవరమును ప్రవేశించెను. బ్రహ్మహత్యాపాతకము బ్రహ్మదేవునిశాపకారణమున మానససరోవరమున బ్రవేశింపజాలకు. కావున ఆమె సరోవరతటమందే యొకవటవృక్షశాఖ నాశ్రయించి యిందునకై ఎదురుజూచుచుండెను. ఆ సమయమున నహుషచక్రవర్తి త్రిభువనములకు స్వామియై యిందపదము నధిష్ఠించెను. యిందపదము నధిష్ఠించిన నహుషుడు ఇంద్రాణియైనశచీదేవిని తనసేవలందు వినియోగింపు డనిదేవతల నాజ్ఞాపించగ ఆ విషయము నాలకించిన శచీదేవి

గురుదేవుని యర్ధాంగి యైనతార నాశ్రయించెను శచీదేవిని యోదార్చి ఆచార్యుడైన బృహస్పతి యింద్రుని రక్షించుటకు స్వయముగ మానస సరోవరమునకు జని కమలనాళమందు బ్రహ్మహత్యాపాతకమునకు భీతుడై యున్నయింద్రుని సంబోధించి యిట్లుపల్కెను. "కుమారా! లెమ్ము. నేనుండగ నీ కేలభయము? నేను నీయాచార్యుడను నాస్వరమును గుర్తించి నిర్భయుడవుకమ్ము." బృహస్పతి స్వరమును గుర్తించి సర్వసిద్ధులకు స్వామియైనయింద్రుడు తనసూక్ష్మరూపమును వీడి స్వస్వరూపధారియై, సూర్యతుల్య తేజస్వి యైనగురువునకు ప్రసన్నతాపూర్వకముగ ప్రణామముల నర్పించెను. బృహస్పతి యింద్రునిపై గలక్రోధమును బరిత్యజించి ప్రసన్నుడయ్యెను. తన చరణములపై బడి రోదించుచున్న యింద్రుని బృహస్పతి లేవనెత్తి యత్యంత ప్రేమానురాగములతో నాలింగన మొనరించెను. బృహస్పతి సంతుష్టుడగుట గాంచియింద్రునిశరీరము పులకింపగ నతడు భక్తిభావముతో తలవంచి, హస్తములను ముకుళించి యానందాశ్రుపూరితనయనుడై ఆచార్యు నిట్లుస్తుతింప నొడంగెను. దేవా! నాయపరాధములను క్షమింపుము. కృపానిధీ! నాపై గరుణింపుము.

(పుత్ర) భృత్యాపరాధం (చ) న గృహ్ణాతి సదీశ్వరః । ६५

"సహృదయుడైనస్వామి తనసేవకు లొనరించిన (పుత్రసమానులొనరించిన) యపరాధములను గ్రహింపడు". తనభార్య, శిష్యుడు, భృత్యుడు, పుత్రులు, దుర్బలులైనను సబలులైనను వారినేమనుష్యుడు దండింపగలడు! మూడుకోట్లదేవతలందు నేనే దేవాధముడనైనమూర్ఖుడను, సురశ్రేష్ఠా! నీకృపాకటాక్షములవలననే నత్యంతోన్నతమైనయింద్రపదవియందు ప్రతిష్ఠితుడనైతిని. దేవా! నీవు సర్వజగములను సంహారమొనరింపగలశక్తిశాలివి, నీ సమక్షమున నే నెంతటివాడను! నీవు సాక్షాత్తుగా విధాతకు పౌత్రుడవైన కారణమున స్వయముగ ప్రతిసృష్టిచేయగల సమర్థుడవు. ఇంద్రుడొనరించిన యీ స్తవము నాలకించి బృహస్పతి యత్యంతసంతుష్టుడై ప్రేమపూర్వకముగ నిట్లుపల్కెను. "మహాభాగా! ధైర్యమును వహింపుము. నాకృపవలన నీకు మొదటికంటె నాల్గురెట్లు అధికముగ నైశ్వర్యము, సుస్థిరలక్ష్మి లభింపగలవు. వత్సా! పురంధరా! నాప్రసాదమువలన నీశత్రువు పతనమైనాడు, కావున నీవు నిశ్చింతుడవై యమరావతిని ప్రవేశించి పతివ్రత యగుశచీదేవిసహితముగ

రాజ్యమును పాలింపుము" అనిపలికి శిష్యసహితముగ బృహస్పతి యమరావతికి బయలుదేరగా వారినిమహాభయంకరమగుబ్రహ్మహత్యాపాతకముఅడ్డగించెను. బ్రహ్మహత్యాపాతకమును గాంచి బృహస్పతి యత్యంతభీతుడై మధుసూదనుని స్మరింపగ అశరీరవాణి యిట్లు పలికెను. "బృహస్పతీ! సంసారవిజయమను శ్రీరాధాకవచము కలదు. ఆ కవచము సమస్తవిధములగు అశుభములను నాశమొనరింపగలశక్తిగలది. నీ వీసమయమున నాకవచము నింద్రున కుపదేశించి యాతనిని రక్షింపుము." అశరీరవాణి నాలకించి శిష్యవత్సలుడైన బృహస్పతి యింద్రున కయ్యద్భుతకవచము నుపదేశింపగ నాకవచప్రభావము వలన బ్రహ్మహత్య తొలగిపోయెను. తదనంతరము బృహస్పతి యింద్ర సహితముగ నమరావతిని జేరి ఆ పురదుర్దశను గాంచెను. శత్రువు లానగరమును ఛిన్నభిన్న మొనరించిరి.

భర్తృగమనమునుగూర్చివిని శచీదేవి అత్యంతహర్షమనస్కయై యింద్రబృహస్పతులకు స్వాగతము పలికి వారిచరణకమలములకు బ్రణమిల్లెను. ఇంద్రుని పునరాగమనమును విని సకలదేవతలు, మహర్షులు, మునివర్యులు హర్షగద్గదమనస్సులతో నమరావతి జేరిరి. అమరావతిని పునర్నిర్మాణ మొనరించుట కింద్రు డనేకదేవశిల్పులను నియమించెను. ఆ దేవశిల్పులు నూఱుసంవత్సరములు పరిశ్రమించి మఱల అత్యంతసుందరముగ నమరావతిని నిర్మించిరి. నగరనిర్మాణముచేసినను ఇంద్రుడు విశ్వకర్మకుస్వధామగమనమునకు అనుజ్ఞ నొసంగలేదు. ఆచార్యుని యనుగ్రహమువలన మఱల త్రిలోకాధిపత్యము వహించిన యింద్రు డత్యంతదర్పయుక్తుడయ్యె ననిగ్రహించి విశ్వకర్మ బ్రహ్మ నాశ్రయించెను. బ్రహ్మ వైకుంఠమునకు జని తనతండ్రియైనశ్రీహరికి ప్రణామము లర్పించి యింద్రుని దర్పవృత్తాంతమును నివేదించెను. శ్రీహరి బ్రహ్మకు నచ్చచెప్పి స్వయముగ ద్విజరూపధారియై అమరావతీపురిని బ్రవేశించెను.

ఆ బ్రాహ్మణుడు పిన్నవయస్కుడు. హస్తములందు దండఛత్రములను, శరీరముపై శ్వేతవస్త్రములను ధరించె. లలాటమందు ఉజ్జ్వలతిలకమును ధరించి మనోహరముగ దేవతలకు దర్శనమొసంగెను. ముఖ్యముకంటె ప్రకాశవంత మైనదంతపంక్తితో ఆయన ప్రకాశింపదొడంగెను. ఆ ద్విజుడు చిన్నవాడైనను, బుద్ధియం దఖండుడు. అతడు విద్వాంసుడు, స్వయముగ

విధాతకు విధాత. సర్వసంపత్ప్రదాత. ఆ బాలకుఁడింద్ర సభాద్వారమును ప్రవేశించి ద్వారరక్షకునిచే తన శుభాగమనమును నింద్రునకు విన్నవించెను. ద్వారపాలకుని సూచన పొంది యింద్రుడే స్వయముగ ద్వారము కడ కేతెంచి యత్యంత తేజస్వియైన యాద్విజబాలకునకు స్వాగత మొసంగి, భక్తిభావముతో ప్రణమిల్లి లోనికి యాహ్వానించి, మధుపర్కాద్యుపచారములను సమర్పించి తా మెందులకు విచ్చేసిరని, తా మెవ్వరని ప్రశ్నించెను. ఇంద్రునివచనముల నాలకించి ఆ ద్విజబాలకుడు మేఘసమానగంభీరవాణితో నిట్లుపల్కెను. "దేవేంద్రా! నీ వొకవిచిత్రాద్భుతనగరమును నిర్మాణ మొనరించినా వని తెలిసికొని ఆ దివ్యనగరావలోకమునకు నే నేతెంచితిని. ఎన్ని సంవత్సరముల పర్యంతము నీ నగరనిర్మాణ మొనరించుటకు సంకల్పించితివి? విశ్వకర్మ యెన్నివర్షములలో నీనగరమును పూర్తిచేయగలడు! ఇట్టియద్భుతనగరమును మును పేయింద్రుడును నిర్మించియుండలేదు" బ్రాహ్మణబాలకునిపలుకుల నాలకించి దేవపతియగునింద్రుడు బిగ్గరగనవ్వుచు యైశ్వర్యమదాంధతచే నున్మత్తుడై తానే శాశ్వతుడ ననిభావించి ఆ ద్విజకుమారునితో నిట్లుపలికెను. "బ్రాహ్మణోత్తమా! నీ వెంతమంది యింద్రులను విశ్వకర్మలను గాంచితివో నాకు వివరింపుము". ఇంద్రుని పలుకుల నాలకించి యాదివ్యబ్రాహ్మణకుమారుడు మందస్మితముఖారవిందుడై మధురాతిమధురములైన, శ్రవణసుఖదములైన వచనముల నిట్లుపల్కెను. "తండ్రీ! నేను నీపితృదేవుడైన కశ్యపప్రజాపతిని యెఱుగుదును. ఆయనకు తండ్రియు, తపోనిధియునగు మరీచిమహర్షితో నాకు పరిచయముకలదు. మరీచితండ్రియైన విష్ణువుయొక్క నాభికమలమునుండి జన్మించిన బ్రహ్మనుగూడ నే నెఱుగుదును. బ్రహ్మకు తతుడు, సత్వగుణశాలియునగు శ్రీమహావిష్ణువుతో నాకు పరిచయముకలదు, సర్వప్రాణిశూన్యమై అత్యంతభయానకమై గోచరించు నేకార్ణవ ప్రళయము గూడ నాకు జ్ఞప్తియందుకలదు. ఇంద్రా! నిశ్చయముగ సృష్టి యనేకప్రకారముల కలుగును. కల్పములు, బ్రహ్మాండములు అనేకములు కలవు. ఆ యసంఖ్యాకబ్రహ్మాండములం దనేకులైన బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, నీవంటి యింద్రులును కలరు. వారిసంఖ్యను గుణించుట యెవరితరము! సురేశ్వరా! భూమియం దున్నధూళికణములను లెక్కింపవచ్చును. కాని యనేకబ్రహ్మాండములం దున్నయింద్రులసంఖ్యను గణించుట యసంభవ మనివిద్వాంసుల

మతము. ఒకయింద్రునియాయుర్దాయము, అధికారము కేవలము డెబ్బది యొక్క చతుర్యుగముల పర్యంతమే యనిగ్రహింపుము. ఇరువదియెనమండుగురు ఇంద్రులు నశించిన విధాతకొకపగలు, ఒకరాత్రి పూర్తికాగలవు. ఈ ప్రకారముగ నూటయెనిమిదిసంవత్సరము లొకబ్రహ్మ ఆయుర్దాయముగ నిర్ణయింపబడెను. అట్టివిధాతలసంఖ్యనే లెక్కించుట యసంభవమైనచో, దేవేంద్రుల నెవరు లెక్కింపగలరు? బ్రహ్మాండములసంఖ్యయే అనంతమైనచో, బ్రహ్మవిష్ణుమహేశ్వరులసంఖ్య నెవరు నిర్ణయింపగలరు ? శ్రీమహావిష్ణువు రోమకూపమందుగల నిర్మలజలములం దసంఖ్యాకబ్రహ్మాండములు సాగరమందు నౌకలవలె తేలియాడుచున్నవి. ఇట్లు శ్రీమహావిష్ణువుయొక్క విరాడ్దేహమం దెన్నిరోమకూపము లుకలవో, ఈసృష్టియం దన్నిబ్రహ్మాండములు కలవు. కావుననే బ్రహ్మాండము లసంఖ్యాకము లనివిద్వాంసులు ప్రవచింతురు. ఒక్కొక్కబ్రహ్మాండమందు నీవంటియసంఖ్యాకులైన దేవతలు నివసించుచుందురు

ఆసమయమందే పురుషోత్తముడైన, బ్రహ్మణబాలకరూపధారియైన శ్రీహరి యాసభాభవనమందు నూరుధనుస్సులదూరమువరకు వ్యాపించియున్న పిపీలకాసమూహమును గాంచి బిగ్గరగ నవ్వ మారంభించెను. బ్రాహ్మణ వటువు ప్రవచించిన విచిత్రాతివిచిత్రవిషయములను విని యింద్రు డత్యంతాశ్చర్యచకితుడై ఏ వేళపిపీలకలను గాంచి పరిహసించితి వనిప్రశ్నించెను. ఇంద్రుడు వినయపూర్వకముగ ప్రశ్నించినపిమ్మట బ్రాహ్మణరూపధారి యైన జనార్దనుడు తనప్రవచనము నిట్లుకొనసాగించెను. "ఇంద్రా ! నేనే క్రమముగ నీపిపీలకములనుసృష్టించితిని. ఇవి యన్నియు తమసత్కర్మలవలన పూర్వమింద్రపదము నధిష్ఠించినవే, కాని యీసమయమున నవి తమదుష్కర్మానుసారముగ క్రమముగ పతనమగుచు భిన్నభిన్నజీవయోనులందు జన్మించి తుదకు మరల యీపిపీలకజన్మము లెత్తినవి.

కర్మణా జీవినో యాన్తి వైకుణ్ఠం చ నిరామయమ్ ।
కర్మణా బ్రహ్మలోకం చ శివలోకం చ కర్మణా ॥
స్వర్గం స్వర్గసమాస్థానం పాతాలం చ స్వకర్మణా ।
కర్మణా నరకం ఘోరం స్వాత్మదుఃఖైకకారణమ్ ॥
కర్మణా సూకరీగర్భం కర్మణా క్షుద్రజీవనమ్ ।
కర్మణా పశుపత్నీనాం కర్మణా పక్షియోషితామ్ ॥

కర్మణా కీటయోనిం చ వృక్షత్వం చ స్వకర్మణా ।
స్వకర్మణా సుఖీ దుఃఖీ సేవ్యః సేవక ఏవ చ ॥
కర్మణా బ్రాహ్మణత్వం చ దైవం చాపి స్వకర్మణా ।
స్వకర్మణా చ ప్రేతత్వం బ్రహ్మత్వం చ స్వకర్మణా ॥
స్వర్మణ్యా వ్యాధియుక్తం చ కర్మణైవాతిసున్దరః।
కర్మణా స్వాఙ్గహీనశ్చ స్వాఙ్గవృద్ధశ్చ కర్మణా ॥
విధాతా కర్మసూత్రేణ ఫలదాతా చ జీవినామ్ ।
కర్మస్వభావసాధ్యం చ స్వభావోఽభ్యాసజీవకః ॥ 122–128

"కర్మవలననే జీవుడు సరామయముగునై కుంఠపరంధామమును జేరగలడు, కర్మవలనే బ్రహ్మలోకమును, శివలోకమును పొందగలడు. కర్మవలనే జీవుడు స్వర్గతుల్యస్థానములను బొందగలడు, కర్మవలనే తనదుఃఖమున కేకమాత్ర కారణమైననరకమును పొందగలడు. కర్మవలననే జీవునకు సూకరయోని క్షుద్ర జీవనము, కీటకయోని, వృక్షజన్మ, సుఖదుఃఖములు, సేవ్యసేవకత్వములు లభింపగలవు. కర్మవలననే బ్రాహ్మణత్వము, దైవత్వము లభింపగలవు. స్వకర్మవలననే జీవునకు ప్రేతత్వము, బ్రహ్మత్వము లభింపగలవు. కర్మవలననే సకలవ్యాధులు, సుఖసంతోషములు, అంగహీనత్వము, కార్పణ్యము, వార్ధక్యములభింపగలవు. కర్మసూత్రమువలననే విధాత జీవధారులకుఫలము లను ప్రసాదించును. కర్మస్వభావము సాధ్యము, ఆస్వభావ మభ్యాసజన్యము", దేవేంద్రా! చరాచరప్రాణులతో నిండియున్న యీసమస్త సంసారములు స్వప్నమువలె మిథ్యలు. ఈజగములందు కాలానుసారముగ జీవులశిరముపై మృత్యువు అధిష్ఠించియుండును జీవధారుల శుభాశుభములు సర్వములు నీటియందలి బుద్బుదములవలె నశ్వరములగును.

శక్ర శశ్వద్ భ్రమత్యేవ నావిష్టస్తత్రపణ్డితః ॥ 131

ఇంద్రా! విద్వాంసులైనపురుషులు ఈజగములందు నివసించినను ఎన్నడు నీనశ్వరసృష్టిపై నాసక్తులుకారు."

ఇట్లుపల్కియాద్విజోత్తముడు మందస్మితముఖారవిందుడై మౌనము వహించెను. బ్రాహ్మణబాలకుడు బల్కినవిచిత్రదివ్యవాక్కుల నాలకించిన యింద్రుడ డయ్యఖండజగములందు తనయుస్థిత్వ మెంతస్వల్పమో తెలిసికొని తనదర్పమును వీడెను. ఆసమయముననే రోమశమహర్షి శీఘ్రముగ సభా

భవనమును ప్రవేశించెను. ఆమహానివర్యుడు సకలదేవతలకంటె వయస్సు లోను, జ్ఞానమునందు, నధికుడు. అత్యంతవృద్ధుడైనఆయన మహాయోగి. ఆమహర్షి కృష్ణమృగచర్మమును ధరించి మస్తకమందు సువర్ణసదృశజటలు ప్రకాశింపగ, లలాటమందుజ్జ్వలతిలకమును ధరించి, వక్షఃస్థలమందు రోమ చక్రమును, శిరముపై ఛత్రిమును, ధరించి యుండెను. అతనివక్షఃస్థలముపై గలరోమచక్రమందు రోమము లనేకములుకలవు, కాని యారోమచక్రమందు గొన్నిరోమములు పెరికివేయబడినవి తనయెదుట నిలచినయామహర్షి సత్తముని గాంచి యింద్రు డత్యంతవినీతభావుడై నమస్కరించి మధుపర్కాదు లను సమర్పించి భక్తిభావముతో పూజించెను. ఇంద్రు డొసంగినరత్న సింహాసనముపై నాసీనుడైనయామహర్షిని యుద్దేశించి బ్రాహ్మణరూపధారి యైన శ్రీహరి యిట్లుపల్కెను. "విప్రవరా ! నీవేప్రదేశమునుండి యిచటి కరుదెంచితివి ? నీనామధేయమేమి ? ఇంద్రసభను ప్రవేశించుటలో నీయుద్దేశ మేమి ? నీనివాసస్థాన మెక్కడ ? నీవుశిరముపై నేల ఛత్రమును ధరించి యున్నావు ? మునీశ్వరా ! బాగుగ వృద్ధిగాంచినయీరోమచక్రము నీవక్షః స్థలమం దేలయుద్భవించెను ? కానియారోమచక్రము మధ్య కొన్నిరోమము లేలపెరికివేయబడినవి ? దేవా నీవునాపై కరుణించి మాకు నీపరిచయ సౌభాగ్యమును కల్గింపుడు." బ్రాహ్మణబాలకుని వచనములను విని ఆమహర్షి యిట్లుతనవృత్తాంతమును వర్ణింపనారంభించెను. "బ్రాహ్మ ణోత్తమా ! నాయాయుర్దాయమత్యంతస్వల్పము కావున నే నెక్కడ నివసించుటకు గృహనిర్మాణ మొనరింపలేదు, వివాహ మాడలేదు, నా జీవన మంతయు పరమార్థసాధనయందే వినియోగించితిని. భిక్షుకవృత్తిచే నాజీవన మును నిర్వహణ మొనరించుకొనుచున్నాను. నానామధేయము లోమశుడు. మీవంటి బ్రాహ్మణోత్తములదర్శనమే నాయాగమనప్రయోజనము. నాశిర మందు ధరించినఛత్రము వర్షాతాపములను నివారించును. సాంసారికజీవులకు భయమును కల్గించు నుత్తమవివేకము నుత్పన్న మొనరింపగల నావక్షఃస్థల రోమచక్రవృత్తాంతమును వచించెద నవధరింపుడు. బ్రాహ్మణోత్తమా ! నావక్షఃస్థలమందు గలయీరోమసముదాయము నాయాయుర్దాయసంఖ్యకు ప్రమాణము. ఒకయింద్రుడు మరణించిన నే నారోమచక్రమునుండి యొక రోమమును పెకలించెదను. ఆకారణమువలననే యీరోమచక్రమధ్యమున

కొన్ని రోమములు మాత్రమే పెకలింపబడినను, మరెన్ని యో రోమసముదాయము లున్నవి. బ్రహ్మదేవుని రెండవ పరార్థము పూర్ణమైనపిమ్మట నాకు మృత్యువు సంభవింపగలదు విప్రవరా అట్టియసంఖ్యాకవిధాత లింతవఱ కెందరో మరణించిరి. భవిష్యత్కాలమం దెందఱో మరణింపగలరు. కావున నాయాయుర్దాయ మెంతస్వల్పమో గ్రహించితిరిగదా. ఇట్టిస్వల్పాయుస్సుగల వాడనైననాకు స్త్రీపుత్రగృహములయావశ్యకత యెందులకు? శ్రీహరినిమేష (కనురెప్పపాటు) కాలముననే బ్రహ్మ నశింపగలడు, కావున నేను నాస్వల్పా యుర్దాయమును వృథాచేయక సదా శ్రీహరిచరణారవిందములనే సేవించుచు స్మరించెదను. శ్రీహరిదాస్యసౌభాగ్యమత్యంతదుర్లభము, భక్తిగౌరవము ముక్తి కంటెనత్యున్నతము, సమస్తైశ్వర్యములు స్వప్నతుల్యములు. భగవంతునిభక్తి యందు వ్యవసాయము కల్పింపగలవు. ఈదివ్యజ్ఞానమును నాకు నాగురుదేవు డైనశంకరుడు ప్రసాదించెను. కావున నేను అనన్యభక్తినిదక్క సాలోక్యాది మోక్షములనుగూడ కాంక్షింపను."

ఇట్లుపల్కి యామహర్షి శంకరుని దర్శించుచుటకు వెడలిపోయెను. తద నంతరము బ్రాహ్మణబాలకరూపధారియైనశ్రీహరియాసమయముననే అంతర్హితు డయ్యెను. స్వప్నసదృశమైనయీవృత్తాంత మంతటిని దర్శించి యింద్రుడు అత్యంతాశ్చర్యచకితుడై తనయైశ్వర్యదర్పమంతయు నశింపగ సంపదయందు తృష్ణవిడనాడెను. తదనంతరము ఇంద్రుడు విశ్వకర్మను రావించి యనేక విధముల సత్కరించి స్వధామగమనమునకు అనుజ్ఞ నొసంగెను. ఇంద్రుడు విరాగియై తప మొనరించుట కుద్యుక్తుడుకాగా ఆచార్యుడైనబృహస్పతి యింద్రు నకు నీతిసారతత్త్వము నుపదేశమొనరించి దాంపత్యప్రేమశాస్త్రమును బోధిం చెను. పిమ్మట యింద్రు డెప్పటివలె రాజ్యపాలన మొనరించుచు విషయ ములం దాసక్తుడుకాక గర్వమును త్యజించి బహుకాలము సుఖించెను. బృందావనవినోదినీ! ఇట్లునేను పూర్వకాలమందు సంభవించినయింద్రదర్ప భంగమనునాఖ్యానమును వర్ణించితిని. నాపితృదేవుడైననందుని యజ్ఞ మందు ఇంద్రునకు సంభవించిన గర్వభంగమును నీవు స్వయముగ వీక్షించితివి గదా!

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున ఇంద్రగర్వభంజన మను
నలుబదియేడవ అధ్యాయము
సంపూర్ణము.

—: ౦ :—

# నలుబదియెనిమిదవ అధ్యాయము

## సూర్యదర్పభంగ వర్ణనము

శ్రీ రాధిక పలికెను :

దేవా ! మీకృపవలన నింద్రదర్పభంగప్రసంగమును శ్రవణమొనరింప గల్గితిని. ప్రాణవల్లభా ! సూర్యదేవునిగర్వభంగవిషయమును యథాతథముగ బ్రవచింపవలసినదిగ బ్రార్థించుచున్నాను.

శ్రీ కృష్ణుడు పలికెను :

సుందరీ ! సూర్యుడు దివమున కొక్కపర్యాయమే యుదయించి పృథ్విని తనప్రభలచే బ్రకాశితమొనర్చి సాయంసంధ్యానంతర మంతర్హితుడగును. పూర్వకాలమున శంకరునియమోఘవరప్రభావమువలన మహాశక్తిసంపన్నులైనమాలిసుమాలి యనునిర్వురుదైత్యులు మదోన్మత్తులై సూర్యసమానముగ బ్రకాశించుచు రాత్రిసమయమునగూడ పగటివలెబ్రకాశింప తొడంగిరి. ప్రకృతినియమములనే యుల్లఘించిన యాదైత్యులు శంకరునిశరణాగతు లని తెలిసినను గర్వయుక్తుడైనసూర్యదేవుడు త్రిశూలప్రయోగముచే వారిని మూర్ఛిల్లజేసెను. భక్తులకు విపత్తు సంభవించుట గాంచి స్వయముగ భక్తవత్సలుడైనశివుడే యటుదెంచి ఆయిర్వురు దైత్యులకు చైతన్యమును ప్రసాదించెను. తనభక్తుల కపకార మొనర్చినాడనిసూర్యునిపై నలిగి శంకరుడు సూర్యుని సంహరించుట కుద్యుక్తుడయ్యెను. తన్ను సంహా

రించుటకు స్వయముగ సంహారకర్తయే బయలుదేరినాడనిగ్రహించి యాదిత్యుడు భీతుడై బ్రహ్మలోకమునకు జని బ్రహ్మను శరణు వేడెను. పరమేశ్వరుడు త్రిశూలపాణియై బ్రహ్మలోకమును బ్రవేశింపగ బ్రహ్మ శంకరునకు స్వాగతమొసంగి సూర్యుని రక్షింపవలసినదిగ నిట్లు ప్రార్థించెను.

ప్రసీద దక్షయజ్ఞఘ్న సూర్యం మచ్ఛరణాగతమ్ ।
త్వయైవ స్రష్టః సృష్టేశ్చ సమారమ్భే జగద్గురో ॥
ఆశుతోష మహాభాగ ప్రసీద భక్తవత్సల ।
కృపయా చ కృపాసిన్ధో రక్ష రక్ష దివానిశమ్ ॥
బ్రహ్మస్వరూప భగవాన్ సృష్టిస్థిత్యన్తకారణ ।
స్వయం రవిం చ నిర్మాయ స్వయం సంహర్తు మిచ్ఛసి ॥
స్వయం బ్రహ్మ స్వయం శేషో ధర్మః సూర్యో హుతాశనః ।
చన్ద్రఇన్ద్రాదయో దేవాస్త్వత్తో భీతాః పరాత్పరః ॥
ఋషయో మునయశ్చైవ త్వాం నిషేవ్య తపోధనాః ।
తపసాం ఫలదాతా త్వం తపస్త్వం తపసాం ఫలమ్ ॥
ఇత్యేవముక్త్వా బ్రహ్మా తం సూర్యమానీయ భక్తితః ।
ప్రీత్యా సమర్పయామాస శఙ్కరే దీనవత్సలే ॥
శమ్భుస్తమాశిషం కృత్వా విధిం నత్వా జగద్విధిః ।
ప్రసన్నవదనః శ్రీమానాలయం ప్రయయౌ ముదా ॥
ఇతి ధాతృకృతం స్తోత్రం సఙ్కటే యః పఠేన్నరః ।
భయాత్ ప్రముచ్యతే భీతో బద్ధో ముచ్యతే బన్ధనాత్ ॥
రాజద్వారే శ్మశానే చ మగ్నపోతే మహార్ణవే ।
స్తోత్రస్మరణ మాత్రేణ ముచ్యతే నాత్రసంశయః ॥ 10-18

దక్షయజ్ఞవినాశకా ! శివా ! సూర్యుడు నన్నాశ్రయించినాడు, కావున నీవు వీనిపై గరుణింపుము. జగద్గురూ ! సృష్ట్యారంభమందు నీవే యాసూర్యుని సృష్టించితివి. మహాభాగా! ఆశుతోషా! భక్తవత్సలా! ప్రసన్నుడవుకమ్ము. కృపాసింధూ! కృపతో దినమును, రాత్రిని (సూర్యుని) రక్షింపుము. బ్రహ్మస్వరూపా! నీవే జగత్సృష్టిపాలనసంహారములకు కారణుడవు. సూర్యునిసృష్టించి మరల అతనినేసంహరింపవలెనని యేల యుద్యుక్తుడవైతివి! నీవే స్వయముగ

బ్రహ్మవు, ఆదిశేషుడవు, ధర్మదేవతవు, సూర్యుడవు, అగ్నివి పరాత్పరా! పరమేశ్వరా! చంద్రేంద్రాది దేవతలు నీవన్న భీతులై వర్తింతురు. ఋషులు, మునివర్యులు నిన్నారాధించియే తపోధనులైరి. దేవా! నీవే తపము, నీవే తపఃఫలము, నీవే అఖిలతపఃఫలప్రదాతవు

ఇట్లు స్తుతించి బ్రహ్మ భక్తితో దీనవత్సలుడైన శంకరునకు సూర్యుని సమర్పించెను శివుడు డత్యంతప్రసన్నుడై బ్రహ్మను యాశీర్వదించి స్వధామమునకు వెడలిపోయెను. సంకటకాలమందు బ్రహ్మచే స్తుతింపబడిన యీ స్తోత్రమును పఠించుచున్నవాడు భయమునుండి ముక్తిపొందగలడు. రాజద్వారమందుగాని, శ్మశానమందుగాని, మహాసాగరమధ్యమునన నౌకాభంగమైనపుడుగాని ఈస్తోత్రమును స్మరించినంతనే ఆతడు నిస్సంశయముగ సంకటవిముక్తుడు కాగలడు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున సూర్యగర్వభంగవర్ణనమను
నలుబదియొనిమిదవ అధ్యాయము
సంపూర్ణము.

—: o :—

## నలుబదితొమ్మిదవ అధ్యాయము

### మహేంద్రదర్పభంగవర్ణనము

శ్రీకృష్ణుడు పలికెను :

తదనంతరము సూర్యుడు తనదర్పమును వీడి వినీతభావముతో బ్రహ్మకు ప్రణమిల్లి భగవద్భక్తులయెడల వినయపూర్వకముగ వర్తించుచు నిత్యవిధిప్రవృత్తుడయ్యెను. బృందావనవినోదినీ! ఇపు డగ్నిదర్పభంగోపాఖ్యానమును ప్రవచించెదను శ్రవణమొనరింపుము. ఈ యుత్తమప్రసంగము

పురాణములందు గోపనీయము, కర్ణముల కమృతోపమానమధురము, ఒకసమయమున భృగుమహర్షి శాపమునకు గురియై యత్యంతక్రోధయుక్తుడై అగ్నిదేవుడు శతతాళవృక్షసమున్నతము లైనభయంకరజ్వాలలచే ప్రజ్జ్వరిల్లుచు త్రిలోకములను భస్మమొనరించుట కుద్యుక్తుడయ్యెను. అగ్ని తన్నుతాను తేజస్వియని యితరులెఱుంగవలెనని భావించి త్రిలోకములనే భస్మమొనరించుటకు సంకల్పించెను. వహ్నిమనోభావమును గ్రహించిన మాయామానుష వేషధారి యగుజనార్దనుడు శిశురూపధారియై అగ్నికి సాక్షాత్కరించి మూలతోకముని దాహకశక్తిని చూపులతోడనే హరించెను. పిమ్మట మందస్మితవదనారవిందుడై అగ్ని నుద్దేశించి వినయముతో నిట్లుపల్కెను, దేవా! నీవేల జగములపై నాగ్రహించితివి! నీకోపకారణమును నాకు దెలుపవలసినదిగ ప్రార్థించుచున్నాను, నీవు నిర్హేతుకముగ నేల త్రిలోకములను భస్మమొనరించుట కుద్యుక్తుడవైతివి! భృగుమహర్షి నిన్ను శపించెను కావున నీవు వానిని దహింపుము. ఒకవ్యక్తి యపరాధ మొనరించినకారణమున నీవు త్రిలోకములను దహించుట న్యాయముకాదు. దేవా! బ్రహ్మ యీసృష్టిని జేసెను, శ్రీహరి పాలకుడు, రుద్రుడు సంహారకర్త, ఇదియే సృష్టిక్రమము. జగదీశ్వరు డైనశంకరు డుండగ నీ వేలయీజగములను భస్మమొనరించుట కుద్యుక్తుడవైతివి! మొదట జగత్పాలకు డైనవిష్ణువును జయింపుము. తదనంతరము నీవు సృష్టిని సంహారమొనర్చుము" ఇట్లుపల్కి యాబ్రాహ్మణశిశువు తనయెదుట నున్నయొకశుష్కపత్రమును అగ్నియెదుట నుంచి దానిని దహింపవలసినదిగ కోరెను. శుష్కతృణమును గాంచగనే అగ్ని గగనస్పర్శజిహ్వలను ప్రజ్జ్వరిల్లజేయుచు ఆమంటలచే నచ్యుతశిశువు నావహించెను. కాని యగ్ని యెంతగ ప్రయత్నించినను యాశుష్కపత్రము జ్వలింపలేదుసరికదా, శిశువు శిరోజమైనను వాడలేదు. ఈవిచిత్రసంఘటనను గాంచి జగన్నాథునియెదుట తనశక్తి యేపాటిదో గ్రహించి అగ్ని తలను వంచి నిలువబడెను. అగ్నిదర్పమును భంగమొనర్చి అచ్యుతశిశువు అంతర్హితుడు కాగా అగ్ని తనవిరాట్స్వరూపమును త్యజించి శాంతించెను.

శ్రీరాధికపలికెను:

పీయూషధారలవంటి యీకథాప్రసంగముల నెంతగనాకర్ణించినను

తృప్తి నొందలేకున్నాను, ప్రభూ! శేషించినవారిదర్పభంగములనుగూడ క్రమముగ ప్రవచింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

రాధవచనములను విని సస్మితముఖారవిందుడై ప్రభువు రమ్యమైన యితిహాసముల నిట్లు ప్రవచింపనారంభించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములోని నారదనారాయణ
సంవాదమున వహ్నిగర్వభంగవర్ణన మను
నలుబదితొమ్మిదవ అధ్యాయము
సం పూ ర్ణ ము

....0....

## ఏ బ ది య వ అ ధ్యా య ము

### దు ర్వా స ద ర్ప భం గ వ ర్ణ న ము

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

మహామునిశ్రేష్ఠుడైన, యోగీంద్రుడైన, రుద్రాంశసంజాతుడైన దుర్వాసునకు దర్పమెట్లు భంగమయ్యెనో వర్ణించెద నవధరింపుము.

పవిత్ర భారతవర్షమును పాలించుచున్న అంబరీష చక్రవర్తి ఏకాదశీదినమున శ్రీవిష్ణుప్రీత్యర్థ ముపవసించి ద్వాదశీదినమున పారణ మొనరించుటకు అనేక ద్విజులతో కూడియుండగ ఆసమయమున క్షుధార్తుడు, తృషార్తుడు, విష్ణువ్రతపరాయణుడు నగు దుర్వాసుడు వచ్చెను. మహర్షి "రాజా! నేను ఆకలిగొనియున్నాను, నా కాహారమును ప్రసాదింపు" మని కోరెను. మహర్షి ననేకవిధములు సత్కరించి యంబరీషుడు మృష్టాన్నములను, సుధాసమానమైనపరమాన్నమును, ఆజ్యధారను సమర్పించెను. కేయూర,

పారణసమయమును గాంచి దుర్వాసుడు కోపించి తన జటను భూమిపై గొట్టి దాని నుండి సప్తతాళప్రమాణయుక్తుడైన కృత్యాపురుషుని నిర్మించి రాజును శిక్షింపుమని యాజ్ఞాపించెను. ఆ భయంకరాకారుడంబరీషుని సంహరించుట కుద్యుక్తుడు కాగా ఆయన శ్రీహరిని స్మరించెను. స్మరించగనే భక్తుని రక్షణార్థమై వినియోగింపబడిన సుదర్శనచక్రము కృత్యాపురుషుని సంహరించి దుర్వాసుని వెంటాడెను. సుదర్శనచక్రమును గాంచి భీతుడై యమ్మహర్షి బ్రహ్మలోకము, శివలోకము మొదలగు లోకము లన్నియు రక్షణకొఱకు తిరిగెను. త్రిలోకములందెవ్వరు శ్రీహరి ప్రయోగించిన దివ్యచక్రాయుధమును నివారింపలే రని తెలిసికొని దుర్వాసుడు తుదకు వైకుంఠమునకు జని శ్రీహరినే శరణు వేడెను. భక్తవత్సలుడైన శ్రీమన్నారాయణుడు మహర్షికి అభయ మొసంగి ఆ సుదర్శనచక్రాయుధము నొక్క యంబరీషుడే యుపసంహరింపగలడు కావున నా మహాభక్తునే శరణు వేడు మని యాదేశించెను. భగవంతుని యాజ్ఞానుసారముగ దుర్వాసమహర్షి యాక్షణముందే అంబరీషునిగృహము జేరి ప్రసన్నచిత్తుడై ఆయన సమర్పించినమృష్టాన్నమును భుజించి యాశీర్వదించెను. పిమ్మట అంబరీషుడు ద్వాదశీపారణ మొనరించి ధన్యుడయ్యెను.

> నశ్యన్తి సర్వే ప్రలయే న మే భక్తః ప్రణశ్యతి ।
> సర్వే దేవా మమ ప్రాణా భక్తాః ప్రాణాధికా మమ ॥
>
> త్వం చ లక్ష్మీ మహామాయా సావిత్రీ వా సరస్వతీ ।
> బ్రహ్మ శమ్భురనన్తశ్చ ధర్మశ్చ బ్రాహ్మణస్తథా ॥
> గోపాఙ్గనాశ్చ గోపాశ్చ సర్వే ప్రియతమా మమ ।
> తేభ్యః ప్రియాః పరా భక్తాః ప్రియో భక్తాన్న కశ్చన ॥
> దత్త్వా సుదర్శనం చక్రం భక్తానాం రక్షణాయ చ ।
> తథాపి న ప్రతీతిర్మే స్వయం ద్రష్టుం ప్రయామి తాన్ ॥18-21

రాధా ! ప్రళయకాలమందు సర్వులు నశింతురు, కాని నా భక్తులు నశింప రనిగ్రహింపుము. సర్వదేవతలు నా ప్రాణసములు, కాని నాయనన్యభక్తులు నాకు ప్రాణాధికప్రియులు! నీవు, లక్ష్మి, మహామాయ, సావిత్రి, సరస్వతి, బ్రహ్మ, శంభువు, అనంతుడు, ధర్మము, బ్రాహ్మణులు, గోపాంగనలు, గోపకుమారులు మొదలగు వీరందఱు నాకు ప్రియతములు. నాప్రియతములకంటె నా భక్తులు నా కత్యంతప్రియులు. నాభక్తుని మించినప్రేమపాత్రుడు

నాకు మఱియొకడు లేడు. భక్తులరక్షణార్థమై సుదర్శనచక్రమును వినియోగించినను నేను తృప్తినొందక స్వయముగ రక్షణభారము వహించుటకు వారి సమీపముననే సదా వర్తింతును. రాధికా! దుర్వాసగర్వభంగప్రసంగము శ్రవణ మొనరించితివి ఇకయేమి యువధరింపగోరుచున్నావో, అడుగుము.

రా ధి క ప లి కె ను :

పురాణములందు గోపనీయమైనధన్వంతరిదర్పభంగచరితమును శ్రవణ మొనరింపవలె ననికుతూహలపడుచున్నాను, కావున జగద్గురూ! ఆచరిత మును వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! జగజ్జనని యగురాధయొక్క అభ్యర్థనానుసారముగ మధు సూదను డాదివ్యచరితమును శ్రుతిమధురముగ ప్రవచింప నారంభించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములోని నారదనారాయణ
సంవాదమున దుర్వాసగర్వభంగ మను
యేబదియవ అధ్యాయము
సం పూ ర్ణ ము

....0....

# ఏ బ ది యొ క ట వ అ ధ్యా య ము

## ధ న్వం త రి ద ర్ప భం గ వ ర్ణ న ము

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

బృందావనవినోదినీ! శ్రీమన్నారాయణాంశస్వరూపుడైనధన్వంతరి పూర్వకాలమందు దేవదానవులు సముద్రమును మధించినసమయమున మహా

సాగరమునుండి ప్రాదుర్భవించెను. ఆయన వేదవేదాంగవిదుడు, మంత్రతంత్ర విశారదుడు, విషశాస్త్రవిదుడు, గరుత్మంతుని శిష్యుడు, శంకరునకుపశిష్యుడు.

ఒకసమయమున సహస్రశిష్యసమన్వితుడై ధన్వంతరి కైలాసమునకు పయనమొనరించుచుండగ మార్గమధ్యమున భయంకరరూపుడైన తక్షకుడనేకసర్పపరివేష్టితుడై యెదురువచ్చెను. అతడు క్రోధముతో ధన్వంతరినే కాటువేయుట కుద్యుక్తుడు కాగా గర్వయుక్తులై ధన్వంతరి శిష్యులనేకవిధముల పరిహసించి మంత్రముచే ఆభయంకరసర్పమును విషహీనమొనరించి వాని శిరముపై గలబహుమూల్యమణిని హరించిరి. అంతటితో వారు తృప్తినొందక ఆమహాసర్పమును గిరగిరత్రిప్పి భూమిపై బడవేసిరి. తక్షకుడామార్గమున మృతునివలె నిశ్చేష్టుడై పడియుండెను. ఈసంఘటనను గాంచి నాగులు నాగేశ్వరుడైనవాసుకివద్దకు జని జరిగినదంతయు విన్నవించిరి. వాసుకి అత్యంతక్రోధయుక్తుడై యనేకభయంకరములైనవిషసర్పములను ధన్వంతర్యాదులను శిక్షింపవలసినదిగ బంపెను. ఆవిషసర్పములకు ముఖ్యసేనాధిపతులైదుగురు. వారు ద్రోణకాళీయకర్కోటకపుండరీకధనంజయనామధేయులు. ఆమహాసైన్యము క్షణకాలములోనే శిష్యసమేతుడై యున్నధన్వంతరికడకు చేరెను. ఈమహాసేనావాహినిని గాంచి ధన్వంతరిశిష్యులు భయకంపితులైరి. విషసర్పవినిర్గతవిషవాయువులవలన నిశ్చేష్టులై, జ్ఞానశూన్యులై పృథ్విపై బడిపోయిరి. ధన్వంతరి యాక్షణమునందే గురుచరణములకు బ్రణమిల్లి మహామంత్రమును జపింపగ నమృతము వర్షించెను. అచేతనులైనశిష్యులందఱు పునర్జీవితులైరి. తదనంతరము జగద్గురువైనధన్వంతరి తనమంత్రశక్తిచే సకలసర్పసమూహములను త్రుటిలో రూపుమాపెను. సర్వజ్ఞుడైననాగరాజు సర్పములకు సంభవించినదుర్గతిని దెలిసికొని జ్ఞానరూపిణియు తనసహోదరియు జగద్గౌరియు నగుమనసాదేవి (జరత్కారు) కడకు వెడలి ఇట్లుప్రార్థించెను. "మనసా! ఈసంకటసమయమందు నాగజాతిని నీవే రక్షింపగలవు. సోదరీ! నీవు మమ్ము రక్షించిన త్రిలోకపూజితురాలవు కాగలవు. జ్ఞాన దేవీ! క్షణమందే జని మృతప్రాయులై బడియున్న నీసోదరులను రక్షింపుము." వాసుకి పల్కులనాలకించి ఆనాగదేవి చిరునవ్వుతో, మధురవచనములతో, వినీతభావముతో నిట్లుపల్కెను. "నాగరాజా! నీయాజ్ఞానుసారముగ నేను రణరంగమునకు వెళ్ళగలను."

భద్రాభద్రం దైవసాధ్యం కరిష్యామి యథోచితమ్ ॥ 18

శుభాశుభములు (జయాపజయములు) దైవసాధ్యములు, అయినను నేను యథోచితముగ నాకర్తవ్యపాలన మొనరింపగలను.

సమరాంగణమందు లీలాపూర్వకముగ నేను శత్రుసంహారమొనర్పగలను. నే నెవ్వరిని సంహరించుట కుద్యుక్తురాలనయ్యెదనో వారి నెవ్వరు రక్షింపగలరు? నా యగ్రజుడైన ఆదిశేషుడు నాకు పరమాద్భుతమైన జగదీశ్వరనారాయణ దివ్యమంత్రమును ప్రసాదించెను. నేను నాకంఠమందు త్రైలోక్యమంగళ మహాకవచమును ధరింతును, కావున నే నీ జగత్తులను భస్మమొనరించి, మరల సృష్టించుటలో సమర్థురాలను. మంత్రశాస్త్రమందు నేను శంకరుని శిష్యురాలను. పూర్వకాలమున శివుడు నాకు దయతో మహాజ్ఞానము ప్రసాదించినాడు.

ఇట్లుపలికి మనసాదేవి శ్రీహరికి, శివునకు, ఆదిశేషునకు ప్రణమిల్లి హర్షోత్సాహభరితయై యొంటరిగ నత్యంతరోషయుక్తయై రణరంగమునకు జనెను. మనసాదేవియొక్క దృష్టిప్రసరింపగనే విగతజీవులైన సర్పములు తిరిగి జీవించినవి, ధన్వంతరిశిష్యులందరు ఆమె మంత్రశక్తిద్వారా చేష్టాశూన్యులైరి ధన్వంతరి వారిని రక్షింపవలెనని యెంతగ ప్రయత్నించినను సఫలీకృతుడు కాలేదు. అపుడు మనసాదేవి ధన్వంతరినిగాంచి మందహాసముచేయుచు నిట్లు పలికెను. "సిద్ధపురుషా! నీకు మంత్రార్థములు, మంత్రశిల్పము, మంత్రభేదము, ఔషధజ్ఞానము తెలియునా! నీవు గరుత్మంతుని శిష్యుడవు గానా? నేను గరుత్మంతుడు శంకరుని ముఖ్యశిష్యులము. మే మిరువురము సహాధ్యాయులమై చిరకాలము శంకరుని సేవించి విద్యనొందితిమి." ఇట్లుపలికి జగదంబ యగు మనసాదేవి సరోవరకమలమును గ్రహించి యభిమంత్రించి ధన్వంతరిపై క్రోధముతో ప్రయోగించెను. ప్రజ్వలితాగ్నిశిఖవలె జ్వలించుచు తన్ను సమీపించచున్న ఆదివ్యాస్త్రమును గాంచి మార్గమధ్యముననే ధన్వంతరి తననిశ్వాసముచే దానిని ఉపశమింపజేసెను. తదనంతర మాయన మందస్మితముఖారవిందుడై మనసాదేవిచే మరల ప్రయోగింపబడిన గీష్మకాలసూర్యసమాన ప్రకాశితశక్తిని తనకు విష్ణువు ప్రసాదించినత్రిశూలముచే ఖండించెను. తనశక్తులు వ్యర్థమగుట గాంచి మనసాదేవి యత్యంతరోషయుక్తయై అప్రతి

హాత్మమైన, లక్షమహాసర్పసమన్వితమైన నాగపాశమును సిద్ధమంత్రముచే నభి మంత్రించి ధన్వంతరిపై ప్రయోగించెను. ఆమహాస్త్రము అనంతసమాన తేజోరాశి. నాగపాశమును గాంచి ధన్వంతరి మందహాసము చేయుచు గరుత్మంతుని స్మరించెను. గరుడసాక్షాత్కారముచే నాగపాశ మాత్రణ మందే నిష్ప్రయోజనమయ్యెను. నాగాస్త్రము విఫల మగుటగాంచి మనసాదేవి రక్తపంకజలోచనయై మున్ను తనకు శివుడు ప్రసాదించినభస్మమును ధన్వంతరిపై ప్రయోగించెను. అపుడు గరుత్మంతుడు తనవిశాలములగు రెక్కలచే మహావాయువును సృష్టించి ఆభస్మరాశిని దూర మొనరించెను. ఇట్లు అస్త్రములు విఫలమగుటగాంచి మనసాదేవి తుదకు శివప్రదత్తమైనత్రిశూలమును ధరించెను. అసంఖ్యసూర్యసమాన తేజస్వియైనయాశూలము ప్రళయాగ్నివలె జ్వలింపదొడంగెను. ప్రళయమే సంభవింపగల దనిగ్రహించి బ్రహ్మ మహేశ్వరులు ధన్వంతరిని రక్షించుట కాసమరాంగణమందు సాక్షాత్కరించిరి. శంకరుని, జగదీశ్వరుడైనబ్రహ్మను దర్శించి మనసాదేవి, ధన్వంతరి, గరుత్మంతుడు భక్తిభావముతో తలలు వంచి స్తుతించిరి. తదనంతరము జగత్ హితార్థము మనసాదేవి యొక్క పూజను ప్రచారము చేయదలచి బ్రహ్మ ధన్వంతరితో నిట్లు పల్కెను, "సర్వశాస్త్రవిశారదా! మహాభాగా, ధన్వంతరీ! మనసాదేవితో నీవు ఇట్లుసంగ్రామ మొనరించుట యుచితము కాదు. నీ వాదివ్యశక్తితో పోరునల్పలేవు. ఈదేవేశ్వరియగుమనసాదేవిధరించియున్న త్రిశూలము త్రుటిలో త్రిలోకములను భస్మ మొనరింపగలదు, కావున కౌథుమశాఖయందు వర్ణింపబడిన ధ్యానానుసారముగ నీవు మనసాదేవిని ధ్యానించి భక్తిభావముతో షోడశోపచారముల నర్పించి ఆమెను ప్రసన్నురాలిగ నొనర్పుము, పిమ్మట ఆస్తీకమహర్షి ద్వారా స్తుతింపబడినస్తోత్రముతో నాదేవిని స్తుతింపుము. మనసాదేవి నీపై ప్రసన్నురాలై నిన్ననుగ్రహించుటయే కాక యనేకవరములను ప్రసాదింపగలదు".

బ్రహ్మకథనమును మహాదేవుడు సమర్థించెను, గరుత్మంతుడు అంగీకరించెను. వా రుపదేశించినహితవచనములను శిరసావహించి ధన్వంతరి స్నానమాచరించి పరిశుద్ధుడై అగ్నిశుద్ధవస్త్రాభూషణములను ధరించి బ్రహ్మనే పురోహితునిగ నియమించుకొని మనసాదేవి పూజ నారంభించెను.

ధ న్వ ం త రి రు వా చ

ఇహాగచ్ఛ జగద్గౌరీ గృహాణ మమ పూజనమ్ ।
పూజ్యా త్వం త్రిషు లోకేషు పురా కశ్యపకన్యకే ॥
త్వయా జితం జగత్ సర్వం దేవీ విష్ణుస్వరూపయా ।
తేన తేఽస్త్రప్రయోగశ్చ న కృతో రణభూమిషు ॥
ఇత్యుక్త్వా సంయతా భూత్వా భక్తినమ్రాత్మకన్ధరః ।
గృహీత్వా శుక్లకుసుమం ధ్యానం కర్తుం సముద్యతః ॥
చారుచమ్పకవర్ణాభాం సర్వాఙ్గసుమనోహరామ్ ।
ఈషద్ధాస్య ప్రసన్నాస్యాం శోభితాం సూక్ష్మవాససా ॥
సుచారుకబరీశోభాం రత్నాభరణభూషితామ్ ।
సర్వాభయప్రదాం దేవీం భక్తానుగ్రహకాతరామ్ ॥
సర్వవిద్యాప్రదాం శాన్తాం సర్వవిద్యావిశారదామ్ ।
నాగేన్ద్రవాహినీం దేవీం భజే నాగేశ్వరీం పరామ్ ॥ 56—60

జగద్గౌరీ ! మనసా దేవీ ! ఈప్రదేశమునకు దయచేయుము. నే సర్పించుపూజను గ్రహింపుము. కాశ్యపనందినీ ! ప్రథమమునుండి త్రిలోకము లందు నీపూజ లొనరింపబడుచున్నవి. దేవీ ! నీవు విష్ణుస్వరూపిణివి, సర్వ జగత్తులను జయించినదానవు, కావున నే రణరంగమందు మహాస్త్రమును ప్రయోగింపలేదు.

ఇట్లుపల్కి సంయమశీలుడై భక్తిభావముతో తలను వంచి హస్త మందు శ్వేతపుష్పములను ధరించి ధన్వంతరి ధ్యానించుట కుద్యుక్తుడయ్యెను.

ధ్యా న ము

సుందరములైనచంపకపుష్పములవలె గౌరవర్ణముగలదియు, సర్వాంగ ములచేత మనోహరమైనదియు, చిరునవ్వుచే ప్రసన్నమైనముఖముగలదియు, సూక్ష్మములైనవస్త్రములచే శోభిల్లునదియు, సుందరమైనకేశపాశముచే ప్రకాశించునదియు, రత్నాభరణములచే భూషితయు, సర్వాభయముల నిచ్చు నదియు, భక్తానుగ్రహకాతరయు, సర్వవిద్యలనొసంగునదియు, శాంతమైనదియు సర్వవిద్యావిశారదయు, నాగేంద్రవాహినియు, నాగస్వామినియు నగుమనసా దేవిని సేవింతును.

ప్రియా! ఇట్లుధ్యాన మొనరించి పుష్పములను, నానాద్రవ్యములచే షోడశోపచారముల నర్పించి ధన్వంతరి మనసాదేవి ఆరాధన సంపన్న మొనరించెను. పిమ్మట ధన్వంతరి పులకితశరీరుడై భక్తిభావముతో తలను వంచి హస్తములను ముకుళించి మనసాదేవి నిట్లుస్తుతింపదొడంగెను.

ధన్వంతరిరువాచ

నమః సిద్ధిస్వరూపాయై సిద్ధిదాయై నమో నమః ।
నమః కశ్యపకన్యాయై వరదాయై నమో నమః ॥

నమః శఙ్కరకన్యాయై శఙ్కరాయై నమో నమః ।
నమస్తే నాగవాహిన్యై నాగేశ్వర్యై నమో నమః ॥

నమః ఆస్తీకజననీ జనన్యై జగతాం మమ ।
నమో జగత్కారణాయై జరత్కారుప్రియై నమః ॥

నమో నాగభగిన్యై చ యోగిన్యై చ నమో నమః ।
నమశ్చిరం తపస్విన్యై సుఖదాయై నమో నమః॥

నమస్తపస్స్వరూపాయై ఫలదాయై నమో నమః ।
సుశీలాయై చ సాధ్వ్యై చ శాన్తాయై చ నమో నమః ॥

ఇత్యేవముక్త్వా భక్త్యా చ ప్రణనామ ప్రయత్నతః ।
తుష్టా దేవీ వరం దత్త్వా సత్వరం సాలయం యయౌ॥63-68

సిద్ధస్వరూపిణీ, మనసాదేవీ! నీకు నమస్కారము. సిద్ధిప్రదాయినీ, దేవీ! నీకనేకానేకనమస్కారములు. వరదాయనీ, కశ్యపకన్యకా! నమస్కారము, నమస్కారము నమస్కారము, కళ్యాణకారిణీ, శంకరకన్యా నీకు మాటిమాటికి నమస్కారము. నీవు నాగవాహినివి, నాగేశ్వరివి, నీకు నమస్కారము, నమస్కారము, నీవు ఆస్తీకమహర్షి జననివి జగజ్జననివి, మాతా నీకు నానమస్కారము. జగత్కారణభూతా, జరత్కారూ! నీకునమస్కారము. జరత్కారుమహర్షి పత్నీ! నీకు నమస్కారము. నాగభగినీ! నీకు నమస్కారము. యోగినీ! నీకు అనేకానేకనమస్కారములు. చిరకాలతపమొనరించుదేవీ! సుఖప్రదాయినీ! మనసాదేవీ! నీకు మాటిమాటికి నమస్కారము. తపస్స్వరూపిణికి నమస్కారము. ఫలప్రదాయినియగు మనసాదేవికి నమస్కారము. సాధ్వీ! సుశీలా! శాంతస్వరూపా! దేవీ! నీకు నమస్కారము.

ఇట్లు స్తుతించి ధన్వంతరి భక్తిభావముచే ప్రయత్నపూర్వకముగ ప్రణా

మము లర్పించెను. ఈస్తుతిచే సంతుష్టురాలై మనసాదేవి ధన్వంతరికి వరముల నొసంగి స్వధామమునకు వెడలిపోయెను. బ్రహ్మ, శివుడు, గరుత్మంతుడు తమ తమధామముల కరిగిరి. ధన్వంతరి శిష్యసమేతుడై కైలాసము జేరెను. ఫణము లచే శోభిల్లుసర్పము లన్నియు ప్రసన్నములై పాతాళము జేరినవి ప్రియా! ఇట్లు ఈమనసాదేవి స్తవరాజమును నీ కుపదేశించితిని ఆస్తీకమహర్షి విధి పూర్వకముగ మాతృదేవతయొకల భక్తియొనరించెను. అందుల కామె తన పుత్రునిపై అత్యంతసంతుష్టురాలై అనుగ్రహించెను. భక్తిపూర్వకముగ వరమ పుణ్యమయ స్తోత్రమును పఠించువానికేగాక వానివంశజులకు గూడ సర్పభయము సంభవింపదు. ఇందు సంశయ మెంతమాత్రము లేదు.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున ధన్వంతరి గర్వభంగ మను
ఏబదియొకటవ అధ్యాయము
సంపూర్ణము.

—:o:—

# ఏ బ ది రెం డ వ అ ధ్యా య ము

## రా ధా వం చ న ము

శ్రీ కృ ష్ణు డు ప లి కె ను :

ప్రాణాధికప్రియా! నేను పెద్దలయొక్క, చిన్నలయొక్క దర్పభంగప్రసంగములను వర్ణింపగ నీవు అవధరించితివి. వీరందఱియభిమానమంతయు నావలననే తొలగెనను విషయములో సందేహము లేదు. దేవీ! లెమ్ము. బృందావనమునకు బయలు దేరుము. సుందరీ! ఇపుడు నేను విరహముచే పీడింపబడునీసఖులైన గోపికలను దర్శింపవలె ననియాకాంక్షించుచున్నాను.

శ్రీ నా రా య ణ ఋ షి ప లి కె ను :

నారదా! శ్యామసుందరునియనుజ్ఞ విని మానసీయారాలు, రసికేశ్వరి యగురాధ మధుసూదనునితో నిట్లు పల్కెను. "ప్రాణేశ్వరా! నేనిక నడువలేను కావున నీవే నన్ను దీసికొని పొమ్ము". రాధ వచనములను విని మధుసూదనుడు నవ్వి 'దేవీ! నీవు నాపై నధిష్ఠింపు' మనపల్కి పరమాత్మ యాక్షణమందే యదృశ్యుడయ్యెను. రాధ మనోగమన మొనరింపశక్తురాలైనను భగవంతుని ననుసరింపలేక ఆయనవిరహముచే బీడితయై దుఃఖించుచు నన్నిప్రదేశములందు శ్యామసుందరుని వెదుకదొడంగెను. వనములందు నందనందనుని వెదకుచు వెదకుచు తుదకు రోదించుచు రాధ చందనవనమును ప్రవేశించి యావనమందు విరహభయవిహ్వలులై దుఃఖించు గోపికలను గాంచెను. ప్రియునికొఱకై దీర్ఘకాలము పరితపించిన యాగోపికల ముఖములు అరుణవర్ణములైనవి. వారనేకప్రదేశములందు శ్రీకృష్ణుని 'నాథా', 'నాథా' అని సంబోధించుచు వెదకి, వెదకి వేసారి ఆహారపానీయములను పరిత్యజించిరి. ప్రియుని విరహముచే పీడింపబడురాధ గోపికలనుగలిసికొని, తనప్రాణేశ్వరునితో మలయవనమందు తిరుగుట, వివిధోపాఖ్యానముల నాలకించుట మొదలగువానిని విస్తరముగ వర్ణించెను. శ్రీకృష్ణుడు వంచించినాడని భావించి అత్యంతరోషయుక్తలై రాధాసహిత గోపికలందఱు ప్రాయోపవేశముచే శరీరములను త్యజించుట కుద్యుక్తలైరి. తన యనన్యభక్తులను సదా రక్షించుభక్తవత్సలుడైన శ్రీకృష్ణుడు తన భక్తురాండ్రకు సాక్షాత్కరించి వారి ప్రాయోపవేశప్రయత్నమును భంగ మొనరించెను.

ఎదుట ప్రాణేశ్వరుని గాంచగనే గోపాంగనాసహితముగ రాధ యత్యంతానందముతో నవ్వుచు, పులకితశరీరయై శ్రీకృష్ణునిచేరుటకు పరుగులెత్తెను. శ్రీకృష్ణుని సమీపించి యాగోపాంగన లందఱు ప్రేమవిహ్వలలై రోదింపదొడంగిరి. పిమ్మట వారందఱు శ్రీకృష్ణునకు విరహజనితతాపముచే తమకు గలిగిన దుఃఖమును విన్నవించుకొనిరి. అహర్నిశములు స్నానాన్నపానములను వీడి వనవనములందు వెదకుచు అనేకకష్టము లనుభవించినవిధమును శ్రీకృష్ణునితో జెప్పి గోపికలందఱు కృష్ణుని యనేకవిధముల నిష్ఠూరములాడిరి. తదనంతరము వారు మరల ప్రసన్నలై శ్రీకృష్ణునిగుణములను గాన మొనర్చిరి. కొందఱు గోపికలు వివిధాభూషణములచే భగవంతుని యలంకరింపగ, మరి

కొందఱు చందనానులేపన మొనరించిరి. కొందఱు సఖీ! ఈశ్యామసుందరుడు మన ప్రాణచోరుడు, కావున జాగరూకగ ఈయనను కనిపెట్టియుండు డనివలుక దొడంగిరి. వీరిమాటలను విని మఱికొందఱు లేదుసఖీ మఱల మన ప్రాణనాథు డట్టియపరాధ మొనరింప డనియోదార్పదొడంగిరి. మఱియొకసఖితనసఖులతో సఖులారా శ్రీకృష్ణుని నాల్గువైపులనుండి పరివేష్టించి బంధింపు డనిపల్కెను. రెండవసఖి ఆమెయాదేశమును విని లేదు సఖి ఈజగన్నాథుడు ఏబంధముల చేతను బంధింపబడడు. కాని యీ పరమాత్మను, పరబ్రహ్మమును, సచ్చిదానందవిగ్రహుని అనాయాసముగ ప్రేమపాశముచే బంధించి హృదయమందిర మందు ఖైదుచేయుడ మనిప్రత్యుత్తర మొసంగెను. వీరి సంభాషణల నాలకించు మఱియొకగోపిక సఖులారా ఈనల్లనినాని నెప్పుడును విశ్వసింపకూడు శ్రీకృష్ణుడైనను పురుషుడేకదా అనిపల్కెను. మఱియొకగోపిక ఈచిత్తచోరుని యత్నపూర్వకముగ బంధింపనియెడల మఱల మనల వంచింపగల డని వాక్రుచ్చెను. మఱికొందఱుగోపికలు కోపించి ఈయన నిష్ఠురుడవుగ్న, నిర్దయుడవుగ్న. కావున ఆయనతో మాటలాడకు డనినిష్ఠురము లాడిరి.

తదనంతర మనేకరమణీయ వనములందు గోపికలందఱు శ్రీకృష్ణునితో కుతూహలముగ విహారములు సల్పిరి. ఆగోపికాబృందము పరమేశ్వరుని మధ్య నిడుకొని తుదకు సురమ్యరాసమణ్డలమును జేరిరి. రసికేశ్వరు డైనశ్రీకృష్ణుడు తారకలతో శోభించుచంద్రునివలె గోపికలమధ్య శోభించుచు రత్నసింహాసన మలంకరించెను. నారదా! మఱల ఆజగన్నాథుడు అసంఖ్యాకరూపములతో నావిర్భూతుడై సకలగోపికలతో దివ్యమహా రాసక్రీడ యొనరించెను.

నారదుడు పలికెను:

భక్తజనప్రియా! నారాయణా విద్వాంసులైనపురుషులు ప్రథమమున రాధాశబ్ద ముచ్చరించినపిమ్మట నే కృష్ణశబ్దము పల్కెదరు, ఇందులకు కారణ మేమి? ఆకారణముల నన్నిటిని వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీనారాయణఋషి పలికెను:

నిమిత్తమస్య త్రివిధం కథయామి నిశా మమ ।
జగన్మాతా చ ప్రకృతిః పురుషశ్చ జగత్పితా ।
గరీయసి త్రిజగతాం మాతా శతగుణైః పితుః ॥ 34

నారదా! ఇందులకు మూడు కారణములు కలవు, వానిని వర్ణించెదను శ్రవణమొనరింపుము. ప్రకృతి జగత్తులకు మాత, పురుషుడు పిత, త్రిభువనజనని యైనప్రకృతి పితృస్వరూపుడైనపురుషునికంటే నూరురెట్లు అధికము.

శ్రుతులందు 'రాధాకృష్ణ', 'గౌరీశంకర' మొదలగు శబ్దములను బహుళముగ కనుగొనగలము. కాని 'కృష్ణరాధ' 'శంకరగౌరి' ఇత్యాదిప్రయోగము లెప్పుడు నెవ్వరు లోకములందు వినియుండలేదు. "రోహిణీచంద్రా! ప్రసన్నుడవుకమ్ము, ఈయర్ఘ్యమును గ్రహింపుము". "సంధ్యాసహితసూర్యదేవా! నేను సమర్పించిన యీయర్ఘ్యమును స్వీకరింపుము". "కమలాకాంతా ప్రసన్నుడవై నాపూజలను గ్రహింపుము". ఇత్యాది మంత్రములను సామవేదమందుగల కౌథుమీశాఖయందు చూడవచ్చును.

రాశబ్దోచ్చారణాదేవ స్ఫీతో భవతి మాధవః ।
ధాశబ్దోచ్చారణాత్ పశ్చాద్ధావత్యేవ ససమ్భ్రమః ॥

ఆదౌ పురుషముచ్చార్య పశ్చాత్ప్రకృతి ముచ్చరేత్ ।
స భవేన్మాతృఘాతీ చ వేదాతిక్రమణే మునే ॥

త్రైలోక్యే భారతం ధన్యం కర్మ క్షేత్రం చ పుణ్యదమ్ ।
తతో బృన్దావనం పుణ్యం రాధాపాదాబ్జరేణునా ।

షష్టివర్షసహస్రాణి తపస్తప్తం చ వేధసా ।
రాధికాచరణామ్భోజ పాదరేణూపలబ్ధయే ॥ 38—41

మునిశ్రేష్ఠా, నారదా, 'రా' శబ్దోచ్చారణ మొనరించిన మాధవుడత్యంతానందభరితుడు కాగలడు. 'ధా' శబ్ద ముచ్చరించిన ఆయన యవశ్యముగ భక్తుని వెనుక వేగముగ పరువెత్తగలడు మొదట పురుషవాచక శబ్దమునుచ్చరించి, పిమ్మట ప్రకృతిశబ్దమును పలుకువారు వేదమర్యాద నుల్లంఘించినవారైనకారణమున మాతృహత్యాపాతకమునకు గురికాగలరు. త్రిలోకములందు పుణ్యదాయకము, కర్మక్షేత్రమగుటచే భారతవర్ష మత్యంతధన్యము. భారతవర్షమందు శ్రీరాధాచరణారవిందముల రేణువులచే పునీతమైనబృందావన మత్యంతధన్యాతిధన్యము. దేవర్షీ! శ్రీరాధాచరణారవిందముల పవిత్రధూళిని పొందుటకొఱకు బ్రహ్మదేవుడఱువదివేలవర్షములు ఏకాగ్రతప మొనరించెను.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములోని నారదనారాయణ
సంవాదమున రాధాదేవివంచన మను
యేబదిరెండవ అధ్యాయము
సంపూర్ణము

....0....

# ఏబదిమూడవ అధ్యాయము

## శ్రీకృష్ణ రాసక్రీడా వర్ణనము

నారదుడు పలికెను :

పౌర్ణమాసిదినముగడచిన పిమ్మట జగదీశ్వరుడైన శ్రీకృష్ణు డేమిచేసెను! ఆసమయమందాయన యేయే రహస్యలీలల నొనరించెనో కృపతో వర్ణింపవల సినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీనారాయణ ఋషి పలికెను :

రాసమండలమందు రాసలీలను సంపన్న మొనరించి రాసేశ్వరు డైన శ్యామసుందరుడు రాసేశ్వరి యైనరాధతో యమునాతటమునకు జని స్నాన మాచరించి, పిమ్మట నిర్మలకాళిందీసలిలములందు గోపాంగనలతో జలక్రీడలు గావించెను. అనంతరము శ్రీకృష్ణు డొంటరిగ రాధతో భాండీరవనమును ప్రవేశింపగ ప్రేమవిహ్వాలలైనగోపికలు తమతమగృహములకు వెడలిపోయిరి. ఆసమయమున శ్యామసుందరుడు శ్రీరాధతో మాలతీ, వాసంతీ, చందన, చంపకాది మనోహర వనములందు విహరించుచు అనేకప్రణయక్రీడల నొనరించెను. పిమ్మట వారిద్వరు పద్మవనమందు రాత్రి శయనించిరి. ప్రాతఃకాలమున పుష్పశయ్యపై శయనించి యున్న రాధను శ్రీకృష్ణుడు ప్రేమతో దర్శించెను. శరత్కాలచంద్రునిశోభనే తిరస్కృత మొనరింపగల యామె సుందరముఖముపై శ్రమజలబిందువులు మెరయుచుండెను. సిందూరతిలకము పమసిపోగా, కన్నుల

కాటుక మాయమైనది, అధరముల యరుణత్వముకూడ లుప్తమయ్యెను, కపోలములపై గలమకరికాపత్రరచనకూడ చెరగిపోయినది. రాధవేణి వీడి కేశములు బహిర్గతములైనవి; నేత్రకమలములు ముద్రితములై యుండగ, రత్ననిర్మితకుండలములశోభచే నామె కపోలములు ప్రకాశింపదొడంగెను. దంతపంక్తిచే సుశోభిత మగునామెముఖము గజముక్తాహారములచే నలంకృతమైనట్లు ఉద్దీప్తమగుచుండెను. ప్రియురాలియొక్క యీయవస్థను గాంచి భక్తవత్సలుడైన మాధవుడు అగ్నిశుద్ధ సూక్ష్మవస్త్రముచే ఆమెమోమును ప్రేమతో, భక్తితో మార్జన మొనరించెను. కేశములను దువ్వి, సుందరవేణిని నిర్మించెను. ఆవేణియందు మాధవీమాలతీపుష్పములకాలంకారము లొనరింపగ ఆవేణిశోభ అత్యంతమధికమయ్యెను. ఆవేణిచివర రత్నయుక్తమగుపట్టుదారముచే మాధవుడు ముడివేసెను. ఆవేణియత్యంతసుందరము, వక్రము, మనోహరము, వర్తులాకారము. వేణిని శ్రీహరి కుందపుష్పములచే నలంకరించెను. అనంతరము శ్యామసుందరుడు ప్రేయసిలలాటమున సిందూరతిలకము నిడి, తిలకముక్రింద ఉజ్జ్వలచందనబిందువుల చిత్రించి శృంగార మొనరించెను. చందనబిందువుల నడుమ అత్యంతరమణీయముగ కస్తూరీబిందువులను చిత్రించెను. పిమ్మట కపోలములపై చిత్రవిచిత్రపత్రరచన మొనరించెను. నేత్రకమలములందు భక్తిభావముతో మాధవుడు కాటుకను దిద్దగ రాధయొక్క నేత్రసౌందర్య మినుమడించెను. శ్రీకృష్ణుడు రాధయొక్క యధరములపై నరుణరాగమును పట్టించి కర్ణములను నిర్మలాభూషణములచే నలంకరించెను. వక్షఃస్థలమును ఉద్భాసిత మొనర్పగలబహుమూల్యరత్నహారమును గళమం దలంకరించెను. పిమ్మట రత్నజటితకస్తూరీకుంకుమాభిషిక్తవస్త్రముల నలంకరించెను. రెండు చరణములందు రత్ననిర్మితమంజీరముల నలంకరించి, పాదములందు, నఖముల పైన భక్తిభావముతో పారాణిదిద్దెను. త్రిలోకములందు సత్పురుషు లొనరించు సేవలన్నిటితో శ్యామసుందరుడు తనకు సేవ్యయైనప్రాణవల్లభను సేవించెను. తదనంతరము చామరములను వీచుచు జగన్నాథుడు శ్రీరాధయొక్క స్వేదను దీర్చెను. ఎంతయద్భుతవిషయము! అనంతరము సర్వభావనిపుణుడు, శ్రేష్ఠుడు, కామశాస్త్రవిశారదుడైన శ్రీహరి తనప్రాణవల్లభను నిద్ర మేల్కొల్పి ఆమెకు తనహృదయపీఠముపై స్థాన మొసంగెను.

ఇట్లు రాధను మేల్కొల్పి శ్రీకృష్ణు డామెకు వివిధరకముల పుష్ప

మాలికలచే, ఆభూషణములచే, కౌస్తుభమణిచే నలంకరించెను. రత్నపాత్ర యందు భోజనము నిడి తన ప్రేయసి కర్పించెను. ప్రాతఃకాలమున నే రాధాకృష్ణులపదచిహ్నములను గుర్తించుచు రాధాసఖులైన సుశీలాదిగోపికలు ఆ ప్రదేశమును జేరిరి. కొందఱుగోపికలహస్తములందు చందనము, మఱికొందఱి హస్తములందు కస్తూరికలను. మఱికొందఱు వింజామరలతో, కొందఱు పుష్పమాలికలతో నలుదెంచిరి, కొందఱు సిందూరములను, వస్త్రములను కొందఱు దర్పణములను, మఱికొందఱు పుష్పపాత్రలను, కొందఱు క్రీడాకమలములను, కొందఱు మధుపాత్రలను, కొందఱు ఆభూషణములను, కొందఱు కరతాళములను, కొందఱు మృదంగములను, మఱికొందఱు స్వరయంత్రములను, కొందఱు వీణలను తోడ్కొనివచ్చిరి. రాగరాగిణులందఱు రాధతో గోపికలై భారతవర్షమం దావిర్భవించిరి. సకలగోపికలు రాధాకృష్ణులను జేరి యాత్యంతానందోత్సాహభరితులై వివిధరీతుల నాట్యమొనరించి, కనుల నందముగ గానముల నాలాపించిరి, కొందఱు వింజామరలువీయుచు రాధను సేవించిరి, మఱికొందఱు ప్రసన్నతాపూర్వకముగ రాధాచరణములను సేవించిరి. ఒకగోపిక రాధాకృష్ణులకు చందనతాంబూలము లొసంగినది. నారదా! నీప్రకారముగ పవిత్రబృందావనమందు శ్రీరాధావక్షఃస్థలమందు విరాజమానుడైయుండు శ్యామసుందరుడు గోపికలతో నొనరించినదివ్యరాసక్రీడను వర్ణించితిని. భగవంతుడైన శ్రీకృష్ణుడు స్వేచ్ఛామయరూపధారి. పరిపూర్ణతము డైనపరమాత్మ, ప్రాకృతికగుణరహితుడు, దివ్యగుణసంపన్నుడు, స్వతంత్రుడు, ప్రకృతి కతీతుడు, సర్వసమర్థుడు, బ్రహ్మవిష్ణుశివాదులకును బరమేశ్వరుడు. వత్సా! ఇట్లు నేను శ్రీకృష్ణజన్మరహస్యమును, మనస్సునకు ప్రియమును గల్గించు ఆయనబాలలీలలను రాసక్రీడాదులనుగూడ వర్ణించితిని. ఇపుడు నీ వేమిశ్రవణ మొనరింపగోరుచున్నావో యడిగిన ఆపవిత్రచరితమును విపులముగ వర్ణింపగలను.

ఇది శ్రీమదాంధ్రబ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణజన్మఖండములోని నారదనారాయణ
సంవాదమున శ్రీకృష్ణరాసక్రీడావర్ణనమను
ఏబదిమూడవ అధ్యాయము
సంపూర్ణము.

# ఏబదినాల్గవ అధ్యాయము

## శ్రీకృష్ణుడు మధురకు జనుట

నారదుడు పలికెను:

మునిశ్రేష్ఠా! తదనంతరము పరమాత్మ యేయే లీలల నొనరించెను? భగవంతుడైన శ్రీకృష్ణు డెందులకు నందభవనమును వీడి మధురానగరికి జనెను? శ్రీహరివియోగపీడితుడైన నందుడు శ్రీకృష్ణమధురాగమనంతర మెట్లుజీవింపగల్గెను? శ్రీకృష్ణునిసంస్మరణయందే సంలగ్నములై యుండు చిత్తములుగల గోపాంగనలు, గోపకుమారులు, యశోద శ్రీకృష్ణగమనానంతర మెట్లుజీవింపగల్గిరి? ఒకక్షణమమాత్రకాలమైనను వియోగము సంభవించిన జీవింపలేని రాధ ప్రాణేశ్వరుడు లేనిదే యెట్లు జీవింపగల్గెను? శయనకాలమందు, భోజనకాలమందు, అన్యాన్యక్రీడాకాలములందు సదా శ్రీకృష్ణునితోనే కలసియుండు, గోపకుమారు లందఱు తమప్రియబంధువు మధురకు జనిన పిమ్మట ఆయన నెట్లుమరువగల్గిరి? శ్రీకృష్ణపరమాత్మ మధురానగరిలో నేయే యద్భుతలీలలొనరించెను? పరంధామమునకు జనుపర్యంతము శ్రీకృష్ణు డొనరించిన దివ్యలీలనన్నింటిని కృపతో వర్ణింపవలసినదిగ ప్రార్థించుచున్నాను.

శ్రీ నారాయణ ఋషి పలికెను:

మునీశ్వరా! పరమాత్మయీయవనిపై నొనరించిన దివ్యాద్భుతలీలలను సంక్షేపముగ వివరించెద నవధరింపుము. కంసనృపాలుడు ధనుర్యజ్ఞమును ఏర్పాటుచేసెను. ఆయజ్ఞమునకు ఆహ్వానమునొంది శ్రీకృష్ణు డరుదెంచెను. కంసుడు శ్రీకృష్ణుని ఆహ్వానించుటకు భగవద్భక్తుడైన యక్రూరుని గోకులమునకు బంపెను. అక్రూరుడు రాజాజ్ఞచే నందభవనమునకు జని శ్రీకృష్ణుని ఆయనచెలికాండ్రను వెంటనిడుకొని మధురకు మఱలివచ్చెను. నారదా! మధురలో శ్రీకృష్ణపరమాత్మ యొకరజకుని, కువలయాపీడమనుగజరాజమును, చాణురముష్టికులనుమల్లయోధులను, తుదకు కంసుని సంహరించెను. కంసవధానంతరము భక్తజనబాంధవుడైన శ్రీకృష్ణుడు తల్లిదండ్రులను బంధమునుండి విడిపించెను. శ్రీహరి కృపాపూర్వకముగ మాలినికుబ్జనుద్ధరించెను. పిమ్మట తనవిరహమునకు విలపించుగోపికలపై దయకలిగి వారిని సమాధానపరప వలసినదిగ నుద్ధవుని వ్రజమునకు పంపెను. బాల్యక్రీడానంతరము భగవంతు డుపనయనసంస్కార మొనరించుకొని, విద్యార్థియై అవంతీనగరమునకు జని సాందీపమహర్షి వద్ద విద్యాబుద్ధులను గ్రహించెను. జరాసంధుని జయించి

యవనరాజును వధించి, పరంపరాప్రాప్తరాజ్యమునకు తనమాతామహుడైన ఉగ్రసేనుని చక్రవర్తిగ నభిషేకించెను. సముద్రతీరమునకు జని సముద్రమధ్యమున ద్వారకాపుర నిర్మాణ మొనరించి రాజులను నిర్జించి రుక్మిణీదేవిని హరించి కళ్యాణమాడెను. పిమ్మట కాళిందిని, లక్ష్మణను, శైబ్యను, సత్యను, జాంబవతిని, మిత్రవిందను, నాగ్నజితిని వివాహమాడెను. అనంతరము భయంకరసంగ్రామమధ్యమున ప్రాగ్జ్యోతిషపురనరేశ్వరుడైన నరకాసురుని వధించి వానిచెరలో నున్న పదునారువేలరాచకన్యకల నుద్ధరించి, వారి నందరిని పత్నులుగ స్వీకరించెను. తనపట్టమహిషులతో నితరభార్యలతో పరమాత్మ వివిధక్రీడ లొనరించెను. ఇంద్రుని లీలాపూర్వకముగ నోడించి పారిజాతాపహరణ మొనరించెను. శంకరుని జయించి బాణాసురుని హస్తములను ఖండించెను. బాణాసురుని చెరనుండి అనిరుద్ధుని విడిపించి ఉషాపరిణయము గావించెను. వసుదేవునియజ్ఞమునందు తీర్థయాత్రకై యరుదెంచిన తనప్రాణాధిష్ఠాత్రీదేవి యైనశ్రీరాధకు పునర్దర్శన మొసంగెను. తదనంతర మామెతో కలసి బృందావనమునకు జని యాప్రదేశమున జగదీశ్వరుడు శ్రీరాధతో మరల పదునాల్గుసంవత్సరములపర్యంతము మహారాస మొనరించెను. శ్రీకృష్ణుడు కేవలము పదునొకండుసంవత్సరములవయస్సువఱకే నందభవనమునందు నివసించెను. అనంతరము మథురలో, ద్వారకలో శ్రీకృష్ణుడు నూఱుసంవత్సరములు లీలలొనరించెను. ఆదిసములలో మహాపరాక్రమశాలి యైన శ్రీహరి భూభారము తొలగించెను. మునీశ్వరా! ఇట్లు పరమాత్మ నూటయిఱువదియైదుసంవత్సరములపర్యంతము వసుంధరపై వివిధదివ్యానుభూతిలీలల నొనరించి భక్తులను రక్షించి, దుష్టులను శిక్షించి గోలోకపరంధామమునకు వెడలిపోయెను. గోలోకములో శ్రీకృష్ణుడు తనతలిదండ్రులైన దేవకీవసుదేవులకు, పెంచినయశోదానందులకు, వృషభానునకు, రాధామాత యగు కళావతికి, తదితరగోపగోపికలకు సామీప్యముక్తిని ప్రసాదించెను. శ్రీకృష్ణునితో, గోపికలతో శ్రీరాధ ప్రతియుగమందు అవనిపై నవతరించి వేదవర్ణిత ధర్మసేతువును నిర్మించెను. మహామునీశ్వరా! ఇట్లు నేను ధర్మార్థకామమోక్షప్రదాయకమైన శ్రీకృష్ణదివ్యచరితమును సంక్షేపముగ వర్ణించితిని.

బ్రహ్మాది స్తమ్బపర్యన్తం సర్వం నశ్వరమేవ చ ।
భజ తం పరమానన్దం సానన్దం నన్దనన్దనమ్ ॥
స్వేచ్ఛామయం పరం బ్రహ్మ పరమాత్మానమీశ్వరమ్ ।

పరమవ్యయమవ్యక్తం భక్తానుగ్రహవిగ్రహమ్ ॥
సత్యం నిత్యం స్వతన్త్రం చ సర్వేశం ప్రకృతేః పరమ్ ।
నిర్గుణం చ నిరీహం చ నిరాకారం నిరంజనమ్ ॥

బ్రహ్మమొదలు కీటకపర్యంతము గలసర్వము నశ్వరమే; కావున నీవు పరమానందమయుడు, స్వేచ్ఛామయుడు, పరబ్రహ్మ, పరమాత్మ, పరమేశ్వరుడు, అవినాశి, అవ్యక్తుడు, భక్తానుగ్రహవిగ్రహుడు, సత్యుడు, నిత్యుడు, స్వతంత్రుడు, సర్వేశ్వరుడు, ప్రకృతికంటె నతీతుడు, నిర్గుణుడు నిరీహుడు, నిరాకారుడు, నిరంజనుడు నగునందనందనుని సేవింపుము.

ఇది శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమందలి
శ్రీకృష్ణ జన్మ ఖండములోని నారదనారాయణ
సంవాదమున శ్రీకృష్ణుడు మధురకు జనుట
యనునేబదినాల్గవ అధ్యాయము
సంపూర్ణము

నమోఽస్తు బ్రాహ్మణేభ్యశ్చ కృష్ణాయ పరమాత్మనే ।
శివాయ బ్రహ్మణే నిత్యం గణేశాయ నమో నమః ॥
కాయేన మనసా వాచా పరం భక్త్యా దివానిశమ్ ।
భజ సత్యం పరం బ్రహ్మ రాధేశం త్రిగుణాత్పరమ్ ॥
నమో దేవ్యై సరస్వత్యై పురాణగురవే నమః ।
సర్వవిఘ్నవినాశిన్యై దుర్గాదేవ్యైనమో నమః ॥

ఇది శ్రీకృష్ణపరమాత్మచరణారవిందమిళిందాయమానమానసత్వ మహావైభవ
సంపన్నులైన శ్రీమట్టుపల్లి వేంకటమహాలక్ష్మీ జగన్నాథులతనూ
భవుడు భక్తజనదాసానుదాసుడు, సుజనవిధేయుడునగు, శివ
సుబ్బరాయగుప్తచే ప్రణీతంబైన శ్రీమదాంధ్ర
బ్రహ్మవైవర్తమహాపురాణ మనువచనగ్రంథ
మందు శ్రీకృష్ణజన్మఖండాత్మక మైన
పూర్వభాగము సమాప్తము.
శ్రీహరిః ఓం తత్సత్

—: o :—

SREE MADANDHRA BRAHMAVYVARTHA MAHAPURANAMU-
SREE KRISHHA JANMAKHANDAMU 1st Part

# శ్రీమదాంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణము
## శ్రీకృష్ణ జన్మఖండము 1వ భాగము

### ఈ సంపుటమును గురించి

1. శ్రీమద్బ్రహ్మవైవర్త మహాపురాణము అష్టాదశ పురాణములలో పదియవది. దానిలోని ప్రధానభాగములను ఖండములందురు. అవి నాలుగు 1. బ్రహ్మఖండము 2. ప్రకృతిఖండము 3. గణపతిఖండము 4. శ్రీ[illegible]జన్మఖండము. ( 2. భా )
2. మూలగ్రంథకర్తయైన శ్రీకృష్ణ ద్వైపాయన [illegible] మహర్షి ద్వాపరాంతమున ఈ మహాపురాణమును లోకోపకారార్థమై రచించెను.
3. బ్రహ్మణో....వివర్తః(పరిణామః)బ్రహ్మవైవర్తః' కాన పరబ్రహ్మము పరిణామము చెంది తననుండి యఖిల జగములను సృజించెను.

   వివృతం బ్రహ్మకార్త్స్న్యం చ కృష్ణేన యత్ర శౌనక ।
   బ్రహ్మవైవర్తకం తేన ప్రవదంతి పురావిదః ॥

   తా॥ ఓ శౌనక మహర్షీ ! ఈ పురాణమునందు శ్రీకృష్ణ భగవానుడు తన పూర్ణబ్రహ్మస్వరూపమును వివృత (ప్రకటిత) మొనరించెను. అందువలననే పురాణవేత్తలీపవిత్రసంహితను శ్రీ బ్రహ్మవైవర్తమని కీర్తించిరి. "బ్రహ్మము" అన సకలసృష్టిబీజస్వరూపుడైనభగవానుడు ( GOD ) "వైవర్తము" అన సకల జగన్నిర్మాణశీలయైన ప్రకృతి (Nature). ప్రకృతి భగవంతుల దివ్యచరితవిశద వర్ణనమే యీ బ్రహ్మవైవర్త మహాపురాణము ( This Scripture is the elcborate history of GOD and NATURE ).
4. బ్రహ్మవైవర్తమహాపురాణములో నాలుగు ఖండములు, రెండువందల దెబ్బదినాలుగు అధ్యాయములు, 18 వేల శ్లోకములు గలవు. ఈ సంపుటము నాల్గవదియైన శ్రీకృష్ణ జన్మఖండములోని పూర్వభాగము. దీనిలోని 54 అధ్యాయములను ముఖ్యములైన మూలశ్లోకములను ఉదహరించుచు అనువదించుట జరిగినది.
5. "వాసుదేవస్సర్వమితి"యనియు, సృష్టికి కర్త, భర్త, సంహర్త శ్రీకృష్ణభగవానుడేయనియు, మనోవాక్కాయ కర్మములచే, ప్రతిఫలాపేక్షలేని భక్తితో అహర్నిశములు ఆరాధేశుని భజించుట జీవులపరమకర్తవ్యమనియు ఈ మహాపురాణముపదేశించుచున్నది. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతులకు శిరోధార్యమిది.
6. ఈ శ్రీకృష్ణ జన్మఖండ పూర్వార్ధభాగములో శ్రీకృష్ణావతార రహస్యము, లీలారహస్యము, అపూర్వమైన శ్రీరాధాకృష్ణ కళ్యాణము, అనేక దేవతల దర్పభంగ ప్రసంగములు, శ్రీరాధాకృష్ణుల నామవ్యుత్పత్తి, అనేక స్తోత్రములు, సూక్తులు మొదలగు అపూర్వ విషయములను యథాతథముగ మీముందుంచుట జరిగినది.
7. ముఖ్యములైన మూల శ్లోకములను ఉదహరించుచు సరళగ్రాంథిక వచనములోనికి తొలిసారిగా సమగ్రంగా వచ్చిన ఆంధ్ర బ్రహ్మవైవర్త మహాపురాణమిదే!
8. ఇందులో సందర్భానుసారముగా ఆకర్షణీయములైన 10 వర్ణచిత్రములు కూర్చబడినవి.

శ్రీమదాంధ్ర

# బ్రహ్మవైవర్త

## మహాపురాణము

### శ్రీకృష్ణజన్మఖండము

పూర్వార్థము





రచయిత:

శ్రీ వట్టుపల్లి శివసుబ్బరాయ గుప్త